రూ. 40

# ప్రస్థానం

సాహిత్య ప్రత్యేక సంచిక




ప్రజాశక్తి బుక్‌హౌస్

# ప్రాంతీయ క్షామ నివారణ పథకము (డి.పి.ఎ.పి.)

## చిత్తూరు జిల్లా









## ప్రకృతిలో నీరు జీవనానికి, సృష్టికి ఆధారము

**శాశ్వత కరువు నివారణ పథకము క్రింద నీటి పరివాహక ప్రాంత పథకముగా ఈ క్రింది పథకములు జిల్లాలో అమలు చేయడం జరుగుచున్నది.**

| [illegible] | [illegible] |
|---|---|
| క్షామ పీడిత నివారణ పథకము | 320 |
| ఉపాధి హామీ పథకము | 110 |
| సమగ్ర బంజరు భూముల అభివృద్ధి | 80 |
| సైక్లోన్ - రీహాబిటేషన్ ప్రాజెక్టు | 20 |
| వి.ఎస్.ఎస్. | 144 |
| డి.పి.ఎ.పి. | 74 |
| | 748 |

పై పథకముల అమలు ద్వారా భూసార సంరక్షణ పనులు, చిన్ననీటి వనరుల ద్వారా భూగర్భ జలాలను పొందుట, అటవీ సంపదను మరియు పండ్ల తోటలను అభివృద్ధి చేయుట వంటి పనులు 1995-96వ సంవత్సరం నుండి అమలు జరుగుచున్నవి. పై కార్యక్రమాలన్నియు ప్రజల భాగస్వామ్యముతో అమలగుచున్నవి. సహజ వనరుల పరిరక్షణ కోసం ఒకరు గొప్ప ఒకరు తక్కువ అన్న తేడా లేకుండా ఈ పథకము అమలులో అందరం సమానంగా కృషి చేయాలి. ఈ పథకము ద్వారా ఈ తరానికే గాక, భావితరాల మనుగడకు కూడా పాటుపడుదాం.

ప్రాజెక్ట్ డైరెక్టర్,
డి.పి.ఎ.పి., చిత్తూరు

జిల్లా కలెక్టర్ / ఛైర్మన్,
డి.పి.ఎ.పి., చిత్తూరు

ప్రచురణ నెం. : 610

ప్రచురణ కాలం : 2002, మే

సంపాదకుడు : తెలకపల్లి రవి

సహకారం : హరి పురుషోత్తమరావు
కె. లక్ష్మయ్య (ప్రొడక్షన్)
ఎస్. శ్రీనివాస్ (అడ్వర్‌టయిజింగ్)

ముఖ చిత్రం : అక్షరాలన్నీ అస్త్రాలే 'గ్లోబలి' పై సంధించిన శస్త్రాలే

టైటిల్ : అక్బర్

లోపలి చిత్రాలు : చంద్ర, అక్బర్, లక్ష్మణ్ ఏలే, శేఖర్, ఫ్లక్స్, వెంకటేష్

ముద్రణ : ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, హైదరాబాద్

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, చిక్కడపల్లి, హైదరాబాద్
మరియు బ్రాంచీలు : విజయవాడ, తిరుపతి, విశాఖపట్నం,
నల్గొండ, ఖమ్మం, హన్మకొండ,

## ఇం
## దు
## లో...

## కవితలు



## ఇంకా



## కావ్యం నుండి



బుక్ బిట్స్, లిట్ కోట్స్ వగైరా.....

## సంపాదకీయం

తెలకపల్లి రవి

# మూడో అడుగు....

దర్పణం, గమనం, ఇప్పుడు ప్రస్థానం...

తెలుగు సాహిత్యంలో ఆరోగ్యకరమైన అభ్యుదయ శీలమైన చైతన్యవంతమైన ధోరణులను ప్రోత్సహించడానికి విస్తృత చర్చకు వేదిక కల్పించడానికి జరుగుతున్న కృషిలో మైలురాళ్లు. ఈ మూడో సంచిక నిజానికి మా మూడో అడుగు.

గత రెండు సంచికల నాటికన్నా ఈనాటి వాతావరణం ఇలాటి ప్రయత్నాల ప్రచురణల అవసరాన్ని మరింతగా ముందుకు తెచ్చింది. సెప్టెంబర్ 11 ఘటనలు,వాటిని సాకుగా చూపిన సామ్రాజ్యవాదం సృష్టించిన అంతర్జాతీయ కల్లోలాలు, దేశీయంగా సంఘపరివార్ దురంతాలు వాటి పరాకాష్టగా గుజరాత్ మారణహోమం ప్రపంచాన్నే కలత పరచేవిగా వున్నాయి. కొన్ని శతాబ్దాలలో నాగరికత, ప్రజాస్వామ్యం సృష్టించుకున్న సువ్యవస్థిత విలువలు ప్రశ్నించబడటమే కాదు, ప్రమాదకర సవాలునెదుర్కొంటున్నాయి. ఏకపక్షంగా దూసుకుపోతున్న ప్రపంచీకరణ మామూలు మనుషుల మనుగడను, మానవీయ విలువలను విలుప్తం చేస్తుండగా దానికి అన్ని విధాల అంటకాగే అభివృద్ధి నిరోధక కూటమి అమానుష రాజకీయాలు అన్ని తరగతుల ప్రజల అస్తిత్వాన్నే అల్లకల్లోలం చేస్తున్నాయి. మానవాళి వేదనలను, ఘర్షణలను ప్రతిధ్వనించే సాహిత్య రంగం ఈ పరిణామాల పట్ల నిర్లిప్తంగా వుండజాలదు. ఉండటం లేదు కూడా. చైతన్య వంతమైన ప్రతిస్పందనకు మారుపేరైన తెలుగు సాహిత్య కారులు సహజంగానే ఇందుకు వ్యతిరేకంగా కలాలు గళాలు సంధించారు. ముంచుకొస్తున్న ప్రపంచీకరణ ప్రగతినిరోధకత్వాల ప్రమాదం పట్ల అప్రమత్తతకు తావులేదని గుర్తించారు. అందుకే ఇటీవలి కాలంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సంకలనాలు సంపుటాలు అనేకం వెలువడ్డాయి. ఫిబ్రవరి 24న జరిగిన జనకవనం అలాటి చెప్పుకోదగిన ప్రయత్నాలలో ఒకటి. మేము గత సంచిక సంపాదకీయంలోనే గుర్తించినట్లుగా సాహితీ లోకంలో వచ్చిన ఈ కదలిక రచనలలోనూ ఆచరణలోనూ కూడా భావి గతికి సరైన బాటవేసింది. స్తబ్దత పటాపంచలై సమరశీలతకు బాసటగా నిలిచే సజీవ సృజనకు భూమిక ఏర్పడింది. అన్నిటికన్నా ఆహ్వానించదగిన విషయం అదే.

**2**

దర్పణం, గమనం అనుభవాలు ఈ సంచికను తీర్చిదిద్దడంలో బాగా ఉపయోగపడ్డాయి. ఈ ఏడాది మరికొన్ని ఇతర సంచికలు కూడా వెలువడ్డాయి. పత్రికల సాహిత్య శీర్షికలలోనూ సాహిత్య పత్రికలలోనూ కూడా అనేక అభిప్రాయాలు వ్యాఖ్యానాలు వెలువడుతున్నాయి. ఇందులో ఆహ్వానించదగినవి, అభ్యంతరకరమైనవీ కూడా వున్నాయి. సృజనాత్మకమైన సాహిత్య రంగంలో భిన్నాభిప్రాయాలను గౌరవిస్తూనే సమిష్టి ప్రయోజనానికి హాని కలిగించే అంశాలను ఖచ్చితంగా ఎత్తి చూపవలసి వుంటుంది.

గతంలోనూ ఇప్పుడూ కూడా మా సంచికలలో సంచలన శీలతకు, వ్యక్తిగత పటాటోపాలకు వ్యర్థవివాదాలకు చోటు కల్పించలేదు. అభిమానదురభిమానాలు, దురభిప్రాయాలు కొలబద్దలు కావడాన్ని ఏ మాత్రం అనుమతించలేదు. అమెరికా ఆధిపత్యం, అభివృద్ధి నిరోధకత్వం, అరాచకత్వం, అనైక్యత పెంచే ధోరణులు తప్ప మిగిలిన వాటన్నిటికీ ఆహ్వానం పలికి ఆరోగ్యకరమైన చర్చ సాగడానికి మా వంతు పాత్ర నిర్వహించాము. ఈ సారి సంచికలో సాహిత్య విమర్శ తీరుతెన్నులు

ప్రధాన ఇతివృత్తంగానూ పత్రికలు- సాహిత్యం అనుబంధ ఇతివృత్తంగానూ ఎంచుకున్నాము. ఇవి రెండూ కాక కొన్ని ఇతర అంశాలు కూడా లేకపోలేదు. విశ్లేషణలు,ఇంటర్వ్యూలతో పాటు పలువురు ప్రముఖుల కథలు, కవితలు కూడా వున్నాయి.

అప్సర్ ప్రారంభ వ్యాసం సాహిత్య విమర్శలో రావలసిన సమగ్రతను గుర్తు చేస్తుంది. ఆధునికానంతరవాదం, వినిర్మాణవాదం, అస్తిత్వ రాజకీయాలు వీటికి పరిపూర్ణత చేకూరే మార్గం ఏమిటో తెలియజేస్తుంది. రాచపాళెం వ్యాసం కథా ప్రక్రియ దానిపై విమర్శ పరిణామ క్రమాన్ని విశదపరుస్తుంది. అంత కాల పరిధి తీసుకోకపోయినా గుడిపాటి, నాళేశ్వరం శంకరం వ్యాసాలు కూడా మన రచనల తీరుతెన్నులను సోదాహరణంగా, సోపత్తికంగా విశ్లేషిస్తాయి. ఒక విధంగా ఈ వ్యాసాలన్నిటా చాలా డేటా కూడా లభిస్తుంది. సాహిత్యాధ్యయనంలో ఓ పాయగా సాగుతున్న అకడమిక్ పరిశోధనా ప్రవంతిని కుసుమకుమారి వివరిస్తారు. ఇటీవల కాలంలో అంతగా జరగని ప్రక్రియా చర్చను రామ్మోహన్‌రాయ్ చేశారు. అతి కీలకమైన ఆర్థిక దృష్టిని గురించి వేణుగోపాల్ పరామర్శిస్తే కనిపించని మనోసీమల దర్శనాన్ని నవీన్ చేశారు. ఈ ముందుమాటలో అన్ని వ్యాసాలనూ ప్రస్తావించడం సాధ్యం కాకపోయినా అన్నీ వైవిధ్య భరితంగా విషయసంపన్నంగా రాయడం జరిగిందని మాత్రం భరోసాగా చెప్పొచ్చు. మేము ఆశించిన వాగ్దానం పొందిన మరికొన్ని వ్యాసాలు కూడా వచ్చివుంటే మరింత పరిపూర్ణత లభించేది. ఆ కొరత వున్నా వారి వారి ఇబ్బందుల రీత్యా ఆ రచయితలనూ తప్పుపట్టడంలేదు.మరో సందర్భంలో వారి సేవలను ఉపయోగించుకోగలమని ఆశిస్తున్నాం.

ఇంటర్వ్యూల విషయానికొస్తే ఆయా రంగాలలలో సీనియర్లు, ప్రతిభావంతులు , ప్రస్తుత , పూర్వ సంపాదకులు వంటి వారి భావాలు పాఠకులు నేరుగా తెలుసుకోవడానికి అవెంతగానో దోహదపడగలవనే విశ్వసిస్తున్నాం.

గత రెండు సంచికల కన్నా ఈ సారి కథా రచయితల స్పందన మరింత ప్రోత్సాహ కరంగావుంది. సంఖ్యలోనూ నాణ్యతలోనూ ఆ విషయం మీరు గమనించగలుగుతారు. కథలు ప్రస్తుతం బాగా వస్తున్నాయనే సాధారణ అభిప్రాయాన్ని ఈ అనుభవం ధృవపరుస్తోంది.అయితే కథ గొప్పదా కవిత గొప్పదా అనే వివాదానికి మేము దిగదలుచుకోలేదు. కవిత్వానికి పాటకు మధ్య పోటీ పెట్టే వారిని గురించి గద్దర్ ఇంటర్వ్యూలో చెప్పిన అంశాలే దీనికీ వర్తిస్తాయి. దేని ప్రయోజనం దానిది. దేని ప్రత్యేకత దానిది. ఈ పరమసత్యం గుర్తించకుండా వాదోపవాదాలలో కూరుకుపోవడం అర్థరహితం. అలాగే అకారణంగా కమ్యూనిస్టులపైన సాహిత్యోద్యమాలపైన విరుచుకుపడే పెద్దలు కూడా వాస్తవిక దృష్టి ప్రదర్శించడం శ్రేయస్కరం. ఇటీవల వెలువడిన ఒక సాహిత్య సంచికలో వేల్చేరు నారాయణరావు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఇలాటి పాక్షికత్వాన్నే ప్రతిబింబించాయి. ఈ సంచిక ఇంటర్వ్యూలో వేగుంట మోహనప్రసాద్ వెలిబుచ్చిన కొన్ని భావాలతోనూ మేము ఏకీభవించలేము. ఏ పేరుతో వున్నా వ్యక్తివాదం అంతిమంగా సమిష్టిని చూడలేని భరించలేని విపరీతస్థితికి చేరడం అనివార్యమని ఇవన్నీ మరోసారి నిరూపిస్తున్నాయి. విశాల సాహితీ దృష్టి ప్రదర్శిస్తున్న కమ్యూనిస్టులకు రిజిడిటీ అపాదిస్తున్న పెద్దలే వారి పట్ల తమ పూర్వ నిర్ధారిత భావనలను వదులుకోలేక పోతున్నారని, ప్రపంచీకృత వాస్తవాన్ని గుర్తించలేకపోతున్నారని దీన్ని బట్టి విదితం.

3

అదృష్టవశాత్తూ ఇలాటి ధోరణులు నేటి ప్రధాన లక్షణంగా లేవు. సాహితీ సృజన ,యోచన, యోజన , వివేచన నూతన స్ఫూర్తి సంతరించుకుంటున్నాయి. సమకాలీన ప్రపంచం, జీవితం, సమాజం ఆ అనివార్య పరిస్థితిని సృష్టిస్తున్నాయి. జనకవనంలో దాదాపు 150 మంది కవులు గళం విప్పారంటేనూ రాష్ట్రంలోని అనేక పట్టణాలలలో సాహితీసమ్మేళనాలు జరుగుతున్నాయంటేనూ పోరాటాలకు సంఘీభావం ప్రకటించడానికి రచయితలు ముందుకొస్తున్నారంటేనూ అర్థమయ్యే వాస్తవం అదే. ఈ కాలంలో

ప్రయోజనాత్మక ప్రచురణలు కూడా పెరిగాయి. వందల సంఖ్యలో కవితా సంపుటాలు, కథా సంకలనాలు వెలువడ్డాయి.నవలలు మాత్రం ఆ స్థాయిలో ఇంకా రాని మాట నిజమే. ప్రపంచీకరణను కవులు రచయితలు శక్తివంతంగా ఎండగడుతున్న మాటా నిజమే. అదే సమయంలో దాని వ్యక్తీకరణలను ఆక్షేపిస్తూనే ఆరాధించే వైపరీత్యం కూడా కొందరిలో లేకపోలేదు. అలాగే ప్రపంచీకరణలోని అమానవీయతకు గాయపడి ఓ విధమైన నోస్టాలజియాకు గురికావడమూ కనిపిస్తుంటుంది.ప్రపంచీకరణకు సంబంధించిన అన్ని పార్శ్వాలనూ అధ్యయనం చేసి ఇంకా కన్విన్సింగ్‌గా రచనలు తీర్చిదిద్దవలసిన అవసరముంది.సమాజ జీవితంలోకి చొచ్చుకొస్తున్న మితవాద మతవాద ధోరణులను అక్షరీకరించడంలో అధ్యయనం, నైపుణ్యం ఇంకా పెరగవలసిన అవసరమూ వుంది. మరీ ముఖ్యంగా కొత్తగా కలం పట్టినవారు రచనా శిల్పంపై కేంద్రీకరణ పెంచవలసిన అవసరముంది. మీడియా ప్రభావం విస్తరించిపఠనాన్ని దెబ్బతీస్తున్న నేటి కాలంలో అభివ్యక్తి శక్తివంతంగా విభిన్నంగా లేకపోతే పాఠకులు చప్పరించే అవకాశాలూ గతం కంటే చాలా అధికం. పోరాడే శక్తులతో మమేకత లేకుండా సజీవ సాహిత్యం సృష్టించబడటం సాధ్యమయ్యేపనికాదు. నాటి వీర తెలంగాణా నుంచి నిన్నటి విద్యుదుద్యమం వరకు చెబుతున్న సత్యం అదే. అయితే సాహిత్యం సామాజిక మార్పుకు దోహదం చేయవలసిన ఉత్ప్రేరకం; ఉత్తేజప్రదాయిని. సమాజం నుంచి పుట్టి సమాజాన్ని ప్రతిబింబించి సమాజాన్ని మార్చడానికి సహాయపడటంలోనే దానికి సార్థకత. సాహిత్యోద్యమాల వల్ల చాలా మేలు జరగడంతో పాటు సాహిత్యరంగం పరిధి, పరమార్థం పట్ల స్పష్టత లోపించడం గతంలో చాలా నష్టమూ కలిగించింది. ఆ అనుభవాలన్ని భవిష్యత్ ప్రస్థానానికి మార్గదర్శకం కావాలి. నిర్దిష్టతల లక్ష్యం, నిబద్ధత పరిధి విశాలం కావాలి. వ్యక్తుల కన్నా అభిప్రాయాలకూ వేదికల కన్నా ఆచరణకు, సంచలనాల కన్నా సంయమనానికి, ప్రచారం కన్నా ప్రయోజనానికి, శ్రుతి మించిన తర్కాల కన్నా సృజనశీలతకూ ప్రాధాన్యత దక్కాలి. ముంచుకొస్తున్న ముప్పును చూడగలిగితే ముందెవరుంటారనే దానికన్నా వెనక్కు నెట్టాల్సిన శక్తులేవనే విషయంపై ఎక్కువ చైతన్యం చూపుతాము.

**4**

గమనం తర్వాత ఏడాదికి ప్రస్థానం వెలువడుతున్నది. ఈ సంచికకు రచనలు కోరినప్పుడు అందరూ ఆనందంగా అంగీకరించి ఆత్మీయంగా సహకరించారు. ఇంటర్వ్యూలు ఇచ్చారు. కథలు, కవితలు పంపారు. మేము భవిష్యత్తు సంచికల కోసం దృష్టిలో పెట్టుకుని ఇప్పుడు అప్రోచ్ కాని వారిలో కొందరు ఇచ్చికంగా సహకారం అందించడానికి సిద్ధమయ్యారు. సంకుచితపు భేషజాలెరుగని ఈ సాహితీ స్ఫూర్తి మరోసారి మాకు ఉత్సాహం కలిగించింది.

5

మూడేళ్లలో వెలువడిన మూడు సాహిత్య ప్రత్యేక సంచికలకు స్వాగతం పలికిన సాహిత్య ప్రియులు ఇది రెగ్యులర్ సంచికగా రావాలనే ఆకాంక్షను పదేపదే వెలిబుచ్చుతున్నారు. ఆ సంకల్పాన్నే మేమూ ప్రకటించాము.ఆ అవసరమూ కనిపిస్తోంది.

అందుకే త్వరలో సాహిత్య సంచికను రెగ్యులరైజ్ చేస్తామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. ఇందుకు సంబంధించిన వివరాలు మీ అందరి అభిప్రాయాలు తెలుసుకున్న తర్వాత ప్రకటించగలం. ఎప్పటిలాగే మీ సహాయసహకారాలతో సాహితీ ప్రస్థానం కొనసాగించగలమని ఆశిస్తున్నాం.

# ఈ సంచిక గురించి...

ఈ సంచిక కోసం మేము కోరిన వెంటనే రచయితలు కవులు,పాత్రికేయులు,చిత్రకారులు, కార్టూనిస్టులు సహృదయంతో స్పందించారు. వారి తోడ్పాటు వల్లనే ప్రస్థానం మీ ముందుకు రాగలిగింది.

వారందరికి కృతజ్ఞతలు తెల్పడం మా ధర్మం. కేవలం విద్యుక్త ధర్మమే కాదు- అత్యంత సంతోషభరితమైన విషయం. కొందరిని ఎంతో ఒత్తిడి పెట్టాము. అనుకున్న ప్రకారం రాయలేకపోయిన వారు ఎంతో బాధ పడ్డారు. వారైనా విలువైన తమ రచనలు రాబోయే సంచికలలో తప్ప క అందించుతారు . ఐచ్ఛికంగా రచనలు పంపిన వారు, మా సహాయం కావాలా అని సహృదయంతో అడిగిన వారూ వున్నారు. అక్షర ప్రస్థానంలో వారందరి సేవలు మరింతగా ఉపయోగించుకోవలసి వుంది. కనుక వారికీ కృతజ్ఞతలు.

తమ ప్రకటనలిచ్చి తోడ్పడిన శ్రేయోభిలాషులకు ధన్యవాదాలు.

ఇకపోతే సంచిక రూపురేఖల గురించి. .....

కథలు, ఇంటర్వ్యూలు, కవితలు ఇలా దేనికది ఇవ్వాలనే సాధారణ భావన వున్నా మిశ్రమంగా ఇవ్వడమే ఆసక్తిదాయకమనిపించింది. దాదాపు ఇందులో వున్న వారంతా సుపరిచితులు కనక పెద్ద పరిచయాలు అవసరంలేదనిపించింది. ప్రముఖ వంటి విశేషణాల అవసరమూ కనిపించలేదు. సాహితీ మిత్రులు ఆయా వ్యక్తులను, విషయాలను బేరీజు వేసుకోగలరు గనక పెద్ద ఉపోద్ఘాతాలు దట్టించలేదు. భాషా బేషజాలకు పోలేదు. సాధ్యమైనంత సరళంగా వుండటానికి ప్రయత్నించాము. ఫోటోల కోసం వీలైనంతవరకు ప్రయత్నించినా కొన్ని ఇవ్వలేకపోయాము. కథకులు కవులు రచనల ద్వారా కనిపించాలి కనక వారి ఫోటోలు లేవు. తప్పులు తగ్గించడానికి యధాశక్తి ప్రయత్నించాము. అయినా మిగిలిన వాటికి మన్నించమని కోరుతున్నాం.

గతంలో వలె ఇంటర్వ్యూలు చేసిన వారి పేర్లు ఇవ్వవలసిన అవసరం కలగలేదు. దాదాపు అందరినీ సంపాదకుడే కలవడం, ఇద్దరు ముగ్గురు లిఖితంగా ఇవ్వడం ఇందుకు కారణం.

గతంలో లిట్‌బిట్స్ ఇస్తే ఈ సారి లిట్‌కోట్స్ వున్నాయి. హాస్యం అప్పుడూ ఇప్పుడూ వుంది. నిజానికి ఇలాటివి ఇంకా చాలా చెయ్యాలనుకున్నా సహజంగా వచ్చే సమస్యల వల్ల పూర్తిగాచేయలేకపోయాము. ప్రయోగాత్మకంగా ప్రవేశ పెట్టిన మరికొన్ని అంశాలు పాఠకులు గుర్తించగలరు.

ఈ సంచిక ముగింపునకు రానున్న దశలో కైఫీ అజ్మీ కన్నుమూశారు. ఆయనకు నివాళి.

చాలా మంది సాహితీ మిత్రులు ఈ సంచికను తమదిగా భావించి ఎప్పటికప్పుడు చక్కటి సూచనలు చేస్తూ వచ్చారు. అంతకు మించి అనేక ఆకాంక్షలు వెల్లడించారు. వాటన్నిటినీ రాబోయే రోజులలో మరింత వివరంగా చర్చించడానికి ఆచరణలో పెట్టడానికి కృషి చేయగలమని విశ్వసిస్తున్నాం. ఈ సంచిక వెలువడటానికి ఎంత గానో కృషి చేసిన ప్రతి ఒక్కరికి మరోసారి ధన్యవాదాలు తెల్పుకుంటున్నాం.

**- ఎడిటర్**

విశ్లేషణ

డా. అఫ్సర్



# పరావర్తనం - పునర్నిర్మాణం

(సాహిత్యంలో నిర్దిష్టతా పోరాటాలు)

⟡

తెలుగు సాహిత్యం ఇప్పుడు ప్రధానంగా గతంలోనూ, వర్తమానంలోనూ వదిలేసిన 'ఖాళీ'లను పూర్తి చేసే లక్ష్యంలో నిమగ్నమై ఉంది. ఆధునికత ప్రవేశించిన తర్వాత వివిధ రూపాల ఘర్షణలోనూ, ఏకత్వంలోనూ అక్కడక్కడా మిగిలిపోయిన ఖాళీలను, ఉద్దేశపూర్వకంగానో, నిర్లక్ష్యంగానో వదిలేసిన సామాజికాంశాలను, నిష్ప్రయోజన మనుకుని వదిలేసిన మూలాలను సాహిత్యం శోధిస్తోంది.

⟡

అఫ్సర్
• ప్రముఖ కవి, పాత్రికేయుడు

Ideology is not a set of doctrines or a coherent system of beliefs. Ideology is not an optional extra, deliberately adopted by self-conscious individuals, but the very condition of our experience of the world, unconscious precisely in that it is unquestioned, taken for granted. Ideology is inscribed in discourse, in the sense that it is literally written or spoken in it, it is not a seperate element which exists independently in some free floating realm of ideas and is subsequently embodied in words, but a way of thinking, speaking, experiencing

-LOUIS ALTHUSSER

ఆధునికత మనకు అందించిన ప్రధానమైన ప్రమాణం - శాస్త్రీయత. ఆచరణలో శాస్త్రగతమైన అంశాలకూ, సాంస్కృతికమైన అంశాలకూ మౌలికంగానే నిర్మాణ వైరుధ్యం వుంటుందన్న వాస్తవాన్ని కూడా శాస్త్రీయత అంగీకరిస్తుంది. తెలుగునాట అలాంటి శాస్త్రీయతని సామాజిక సాంస్కృతిక రంగాల్లోకి తీసుకు వచ్చిన మార్క్సిజానికి కనీసం అరవయ్యేళ్ల చరిత్ర వుంది. ఇంకా ముందుకు వెళ్తే 1920ల కాలంలోనే మన సమాజంలోకి మార్క్సిస్టు భావజాలం ప్రాథమిక రూపంగా ప్రవేశించిన దాఖలాలు కనిపిస్తాయి. అంటే చరిత్రాత్మకమైన 1917 అక్టోబరు విప్లవం వచ్చిన తర్వాత నాలుగేళ్ళకే మనం ఆ భావజాలానికి సంబంధించిన అంశాలను చర్చలోకి తీసుకు రాగలిగాం. విముక్తి పోరాటాల్లో నిమగ్నమైన జాతికి అదొక ఆశాసంకేతంగా కనిపించింది. భోగరాజు పట్టాభి సీతారామయ్య లాంటి కాంగ్రెస్ జాతీయవాదులు సోవియట్ వ్యవస్థకి సంబంధించిన మౌలికమైన అంశాలను చర్చించారు. అంతేకాదు, జాతిపిత గాంధీ మహాత్ముడికీ, విప్లవనేత లెనిన్‌కీ మధ్య సారూప్యాలను అన్వేషించే ప్రయత్నమూ ఆ కాలంలోనే జరిగింది.

అయితే, తెలుగు సామాజిక వాతావరణంలో తిరుగుబాటుతత్వం కొత్తదేమీ కాదు. సంస్కరణోద్యమాలు మన ఆలోచనాసరళిలో తీసుకు వచ్చిన మార్పులు వాస్తవంగా

విప్లవాత్మకమైనవే. సమాజంలోని అనేక అశాస్త్రీయమైన అంశాల్నీ, మూఢాచారాల్నీ ప్రశ్నించే తత్వం సంస్కరణోద్యమాల వల్లనే మనకు కలిగింది. సాహిత్యపరంగా ఈ మార్పుని చెప్పడానికి కన్యాశుల్కం నుంచి మాలపల్లి దాకా అనేక ఉదాహరణలు కనిపిస్తాయి. దాదాపు మొదటితరం ఆధునిక రచయితలంతా ఇప్పుడు 'ఆధునికత' అనే మౌలికభావన నిర్వచన పరిధిలోకి వస్తారు. సంప్రదాయిక రచయితలు కూడా ఏదో వొక రూపంలో సమకాలీన సంస్కరణకు స్పందించడమూ, తమ కాల్పనిక సాహిత్యంలో పాత్రలలోనో, సంభాషణల్లోనో, సన్నివేశాల్లోనో వాటి ఆసుపాసులు చూపించడం చాలాకాలం పాటు వొక ఆనవాయితీగా సాగింది. ఈ విధంగా తెలుగువారి మనఃప్రపంచాన్ని వెలిగించిన దివ్వెల్ని చాలా స్పష్టంగా గుర్తించవచ్చు. 1930 వరకూ మానసిక వాతావరణానికే పరిమితమైన ఈ భావసంచలనాలు ఆ తర్వాత ఆర్థికమాంద్యం కారణంగా భౌతికజీవితాన్ని కూడా బాగా ప్రభావితం చేశాయి. 30-40 ల మధ్య కాలంలో 'తెలుగువాళ్ళ సంస్కార జీవితం'లో నూతన సృష్టి సాధ్యపడింది. అచ్చుయంత్రం లేదా లిఖిత సంస్కృతికి సంబంధించి ఈ కాలాన్ని ఒక మూలమలుపుగా చెప్పుకోవచ్చు.

'తెలుగువాళ్ల సంస్కార జీవితంలో కలిగిన నూతన సృష్టిలో చెప్పుకోదగినవి పత్రికలూ, టాకీలు. ఒక పరిషత్తు తోడ్పాటు లేకుండా, ఒక ఉద్యమం నడపకుండా, దేశమంతటా రకరకాల పత్రికలు పుట్టి సాహిత్యాన్ని ప్రజల దగ్గిరకు తెచ్చాయి. ఈ పత్రికలు ఉత్తమ సాహిత్యం కోసం ఆందోళన చెయ్యలేదు. చేతికందిన కథలూ, వ్యాసాలూ ప్రచురించి, జనసామాన్యంలో పఠితల్ని వేలసంఖ్యలో పెంచాయి. సాహిత్య పిపాసా, సాహిత్యాభిలాషా కొత్తదారి తొక్కాయి. ఒకప్పుడు తమకు సాహిత్య రచన గానీ, పఠనగానీ చేసే అర్హత లేదనుకున్న తరగతుల నుంచి రచయితలూ, పఠితలూ బయలు దేరారు' -(కొడవగంటి కుటుంబరావు)

**తెలుగు సమాజంపై మార్క్సిజం ప్రభావాన్ని సరిగ్గా అంచనా వేయడానికి 1930 నుంచి 43 వరకూ ఒక దశగానూ, 1944 నుంచి 51 వరకూ మరో దశగానూ పరిశీలించాలి. ఆర్థిక పీడన గురించి రచయితలు కొంత స్పష్టాస్పష్టంగా తమ రచనల్లో వ్యక్తం చేసిన ప్రాథమిక దశ 1934 వరకూ కనిపిస్తుంది.**

ఇందులోని చివర పంక్తి నిర్దిష్టంగా సాహిత్య స్వభావంలో, ప్రయోజనంలో వచ్చిన గుణాత్మకమైన మార్పుని చెబుతుంది. అలాగే, 'ఆకులందున అణగిమణగి కవిత కోయిల పలకవలెనన్న' ధోరణి నుంచి 'ఏ ప్రచారమూ చెయ్యలేకపోతే కవిత్వమే కాదన్న' అభిప్రాయం బలపడిన దశకం ఇది. కమ్యూనిస్టు పార్టీ ఏర్పాటుతో ఆ అభిప్రాయం వొక దృక్పధంగా మారింది. అంతేకాదు, అప్పటివరకూ వచ్చిన సాహిత్యాన్ని పునర్మూల్యాంకనం చేసుకునే ధోరణీ ఏర్పడింది. అది సాహిత్యానికే పరిమితం కాలేదు, ఇతర సామాజికరంగాలకూ విస్తరించింది. ఈ దశలో సృజనాత్మక రచనలూ, వాటికి 'అభ్యాసం'గా వుపయోగ పడిన అనువాద రచనలన్నీ తెలుగువారి సాంస్కృతిక సామాజికతలో వచ్చిన మార్పుకు సంకేతాలు. మార్క్సిస్టు దృక్పథం నుంచి 'శాస్త్రీయత' నిర్వచన పరిధి కూడా విస్తరించింది. వర్గ దృక్పథం నుంచి చూస్తే తప్ప శాస్త్రీయత సరైన ప్రధాన దశలో నిలవలేదన్న భావనా కలిగింది. తెలుగు సమాజంపై మార్క్సిజం ప్రభావాన్ని సరిగ్గా అంచనా వేయడానికి 1930 నుంచి 43 వరకూ ఒక దశగానూ, 1944 నుంచి 51 వరకూ మరో దశగానూ పరిశీలించాలి. ఆర్థిక పీడన గురించి రచయితలు కొంత స్పష్టాస్పష్టంగా తమ రచనల్లో వ్యక్తం చేసిన ప్రాథమిక దశ 1934 వరకూ కనిపిస్తుంది. తుమ్మల సీతారామమూర్తి, విద్వాన్ విశ్వం లాంటి కవులు రైతుల దైన్యాన్ని కవిత్వంలోకి తీసుకు వచ్చారు. ఆశ్చర్యం ఏమిటంటే కమ్యూనిస్టు పార్టీ ఇంకా ఒక నిర్మాణంగా రూపుదాల్చకముందే 'ఎర్రజెండా' పాటలు వెలువడ్డాయి. అంటే, సమస్యని ఇంకా నిర్దిష్ట రూపంలో చూడాలన్న తపన అప్పటి సంస్కారజీవుల్లో వుందన్నమాట. పెట్టుబడిదారీ కార్మికవర్గాలు బలపడేంత స్పష్టంగా వర్గవిభజన సమాజంలో లేకపోయినా, కార్మిక కర్షక పక్షపాతం ఒక ప్రధాన లక్షణంగా సాహిత్యంలో వుబికి వచ్చింది. అయితే ఇప్పటివరకూ అభ్యుదయ రచయితలు కానీ, మార్క్సిస్టు వాదులు కానీ కేవలం 'ఉపరితల' రంగాలకే పరిమితమయ్యారు; వాళ్లు సాహిత్యంలో కానీ, సైద్ధాంతిక చర్చల్లో కానీ సాధారణీకరించబడిన అంశాల వరకే వుండిపోయారు.

దానికి భిన్నంగా మార్క్సిస్టు పరిభాషలో చెప్పాలంటే ఆ దృక్పధానికి కావలసిన 'నిర్దిష్టమైన' పునాదిని ఏర్పరిచిన సందర్భం తెలంగాణా రైతాంగపోరాటం. 1946 నుంచి ఈ ఉద్యమం ప్రారంభమైన క్రమం అంతా తెలుగుదేశంలో వామపక్ష భావజాలం నిర్మాణ చరిత్రే! మార్క్సిస్టు ప్రభావంలో ఇది రెండో దశ.

'1940కి ముందు భారతదేశంలో మరే ప్రాంతంలో కూడా ఇంత చైతన్యపూరితమైన ప్రజాపోరాటం జరగలేదు. అందువల్ల ఏ భారతీయ భాషల్లోనూ కనిపించని రాజకీయ ఆర్థికచైతన్యం ఇక్కడి సాహిత్యంలో ప్రతిఫలించింది. తెలంగాణా పోరాటం మీద వచ్చినంత సాహిత్యం బహుశా భారతదేశంలో ఏ ప్రజాపోరాటం గురించి కూడా వచ్చి వుండదు' (చేకూరి రామారావు)

అంతర్జాతీయత చుట్టూ పరిభ్రమించే స్థితి నుంచి మన 'స్థానికత' చుట్టూ అంతర్జాతీయత పరిభ్రమించ్చే స్థితిలోకి ప్రవేశించడానికి తెలంగాణా పోరాటం వీలు కల్పించింది. ఈ పోరాటం పైన జాతీయ అంతర్జాతీయ స్థాయిలో వెలువడిన సృజనాత్మక ప్రతిస్పందనలూ, కావ్యాలూ ఒక

ముఖ్యమైన మలుపు. అయితే, అప్పటివరకూ లిఖిత సంస్కృతి ప్రభావంలో మాత్రమే వున్న కమ్యూనిస్టులు సృజనాత్మకత మౌఖికత వైపు తప్పనిసరిగా ప్రయాణించాల్సిన అవసరాన్ని ఈ పోరాటం కల్పించింది. ఈ ప్రయాణం తెలుగు సాహిత్య సామాజిక చరిత్రలో ముఖ్య పరిణామం. అన్నిటికంటే ముఖ్యంగా మార్క్సిస్టు కళాసిద్ధాంతానికి ఈ పరిణామం గట్టి పునాది. ఆ సిద్ధాంతం లక్ష్యబద్ధం చేసిన సాహిత్య స్వభావ, ప్రయోజనాలకు లక్షణంగా నిలిచే సాహిత్య అంశాలు ఈ సందర్భంలో వచ్చి చేరాయి. ప్రధానంగా వస్తు-రూపచర్చకి అవసరమైన మౌలికమైన భావనలు ఇక్కడే రూపుదిద్దుకున్నాయి. అన్నింటికీ మించి మార్క్సిస్టుల చరిత్రా, ఆధునిక సాహిత్య చరిత్రా రెండూ ఒకే నిర్మాణ ప్రాతిపదికన ఏర్పర్చుకోవడం ముఖ్యమైన అంశంగా చెప్పుకోవాలి. కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో కనిపించే ఎగుడు దిగుళ్లే సాహిత్య చరిత్రలోనూ కనిపిస్తాయి. అంటే ఆ భావజాలం సమకాలీన సాహిత్యతత్వానికి ఎంత గట్టి పునాది వేసిందో అర్థమవుతుంది. అందుకే, ప్రధానంగా మార్క్సిస్టు భావన పరిణామ పర్యవసానాల్నీ, వికాసాన్నీ చెప్పుకోడానికి మనకు సాహిత్యంలో బలమైన ఆధారాలు దొరుకుతాయి. అపార్థలగ ఆస్కారం కొడవగంటి కుటుంబరావు నవల 'చదువు' ఈ క్రమంలోనే ఒక తరం ఆత్మకథాత్మక చరిత్రగా కూడా కనిపిస్తుంది. కవిత్వంలో ఆవేశరూపంలో బలహీనంగా కనిపించే ఈ చారిత్రకాంశాలు వచనంలో చాలా బలంగా, ఆలోచనాత్మకంగా తెలుగు బుద్ధి జీవుల సంస్కార జీవితాన్ని యథాతథంగా ప్రతిబింబించాయి. అయితే, సామాజిక సాహిత్య అంశాల సారూప్యాల్నీ, వైరూప్యస్థితుల్నీ సునిశితంగా చూడగలిగిన విమర్శసాధనం మాత్రం మనకు బలహీనంగానే వుండిపోయింది. మార్క్సిస్టు దృక్పథాన్ని ఒక శాస్త్రీయమైన సాధనంగా వుపయోగించుకుని, తెలుగువారి రాజకీయార్థిక జీవితాన్నీ, కళారూపాల్లో వాటి పరావర్తనాన్ని నిర్దిష్టంగా చూపించే ప్రయత్నం అతి తక్కువగానే జరిగింది. ఆ కారణంగా

సృజనాత్మక రచనలు వచ్చినంత వేగంగా మార్క్సిస్టు భావనకి సంబంధించిన మౌలిక గ్రంథాలు మనకు అందుబాటులోకి రాలేదు. అంటే ఆ భావన వనరులు కూడా సరిగ్గా అందకుండానే దానికి సంబంధించిన వ్యతిరేక భావజాలం మాత్రం మన చుట్టూ రాశులుగా పడిపోయింది. రెండో ముఖ్యమైన అంశం మార్క్సిస్టు సాహిత్య విమర్శకి తెలుగులో అరవయ్యేళ్ళ పైబడిన చరిత్రే వున్నా అది ఇంతవరకూ ఏ రూపంలోనూ రికార్డు కాలేదు.

మార్క్సిస్టు కళాసిద్ధాంతాలకు సంబంధించి మనకు అపార్థాలే ఎక్కువగా వ్యాప్తిలోకి వచ్చాయి. పార్టీ నిర్మాణంలో ఏర్పడిన సంక్షోభాలు, వాటిని ఆధారంగా చూపించి మొత్తంగా ఆ వ్యవస్థ ఆచరణాత్మకతని ప్రశ్నించే ధోరణులూ కనిపిస్తాయి. ఈ క్రమం ఎక్కడిదాకా వెళ్లిందంటే మార్క్సిస్టు భావనని ఒక విశ్లేషణ సాధనంగా స్వీకరించడంలోనూ సంశయాలు బయలుదేరాయి. మార్క్సిస్టు భావనలతో గట్టి పరిచయం ఏర్పడిన రెండు దశాబ్దాల కాలంలోనే అంటే 1955 తర్వాతనే ఇలాంటి సంశయాలు ఏర్పడడం, అవి ఏదో ఒక రూపంలో కొనసాగుతూ వుండడం వల్ల మార్క్సిజం మౌలికభావనలైనా మన దాకా పూర్తిగా చేరే అవకాశం లేకపోయింది. మరో లోపం ఏమిటంటే సృజనాత్మక రచనలు వచ్చినంత వేగంగా మార్క్సిస్టు భావనకి సంబంధించిన మౌలిక గ్రంథాలు మనకు అందుబాటులోకి రాలేదు. అంటే ఆ భావన వనరులు కూడా సరిగ్గా అందకుండానే దానికి సంబంధించిన వ్యతిరేక భావజాలం మాత్రం మన చుట్టూ రాశులుగా పడిపోయింది. రెండో ముఖ్యమైన అంశం మార్క్సిస్టు సాహిత్య విమర్శకి తెలుగులో అరవయ్యేళ్ళ పైబడిన చరిత్రే వున్నా అది ఇంతవరకూ ఏ రూపంలోనూ రికార్డు కాలేదు. ఈ కారణంగా అది ఏ ఏ చారిత్రక మలుపుల్లో ఎలాంటి నిర్దిష్ట పాత్రని నిర్వర్తించిందో సరైన అంచనా లేకపోయింది. ఇలాంటి కొన్ని లోపాలు గమనంలో వుంటే తప్ప మార్క్సిస్టు సాహిత్య విమర్శ తర్వాతి కాలంలో అంటే ముఖ్యంగా 1980ల తర్వాత ఎదుర్కొన్న ప్రతికూలాంశాన్ని విశ్లేషించడం సాధ్యపడదు.

> Society does not consist of individuals but expresses the sum of interrelations, the relations within which these individuals stand
>
> -MARX

సాహిత్యంలో వ్యక్తివాదం ప్రాథమికంగా రెండు స్థాయిల్లో వ్యక్తమవుతుంది. మొదట సృజనాత్మక క్రమంలో అది సామాజిక పాత్రని నిరాకరిస్తుంది. రచయిత సృజనశీలత్వాన్ని వైయక్తిక ప్రతిభగా భావిస్తుంది. రచయిత చుట్టూ వుండే సామాజిక స్థిరీకరణల్నీ, బంధాల్నీ, వాటితో వ్యక్తిగా అతనికి వుండే సానుబంధ ప్రవృత్తినీ అది తృణీకరిస్తుంది. రచన అనేది trans-individual mental structure అని మార్క్సిస్టు అవగాహన. దీనికి పూర్తిగా వ్యతిరేకంగా వ్యక్తివాదులు రచనని కేవలం వైయుక్తిక మేధా సంపదగా భావిస్తారు. మార్క్సిస్టు కళాసిద్ధాంతం సృజనకి వుండే సామూహిక అస్తిత్వానికి ప్రాధాన్యత ఇస్తుంది కాబట్టి మౌలికంగానే సంప్రదాయిక వాదులూ, వ్యక్తివాదులూ ఆ దృక్పథాన్ని వ్యతిరేకిస్తారు.

కవిత్వ ధోరణులు వ్యక్తివాదులు భావమే వస్తువుగా భావిస్తారు. ఈ విధమైన భావన ప్రధానంగా కవిత్వాన్ని ఎక్కువ ప్రభావితం చేస్తుంది. అందుకే తెలుగు సాహిత్యంలో మిగిలిన ప్రక్రియల్లో కంటే కవిత్వంలో వ్యక్తివాదం కొంత బలంగా వ్యక్తమవుతుంది. ఆధునిక కవిత్వచరిత్రలోకి వెళ్తే, సంస్కరణోద్యమాల కాలం నుంచి ఇప్పటివరకూ సాహిత్య చరిత్ర క్రమాన్ని వక్రరేఖగా మార్చిన ధోరణులు కవిత్వంలోనే ఎక్కువగా కనిపిస్తాయి. సాధారణంగా కవులు వైయక్తిక స్వేచ్ఛని ఎక్కువ కోరుకుంటారు. సామూహికత అనేది వాళ్లకు ఒక ఖైదు కొట్టంలా కనిపిస్తుంది. దీన్నించి బయటపడే ప్రయత్నంలో కవిత్వం రూపం మీద ఎక్కువ

శ్రద్ధ చూపిస్తుంది. సాధనంగా వుపయోగపడాల్సిన నిర్మాణం తనే భావమై వూడలు చాస్తుంది. జాతీయోద్యమ కాలంలో భావకవిత్వం, 50లలో వచన కవిత్వం, 80లలో అనుభూతివాదం ఈ తరహా కవిత్వ సంప్రదాయాన్ని చూపిస్తాయి. భావకవిత్వం వైయుక్తిక ఊహాలోకాల సృష్టి, జాతీయోద్యమ కవిత్వం ఆ కాలంలో వున్నా, ప్రధానస్రవంతిగా భావకవిత్వమే కనిపిస్తుంది. కేవలం రూపమే ఉద్యమంగా ప్రచారమైన సందర్భం 1950ల తర్వాత కనిపిస్తుంది. అభ్యుదయ సాహిత్యంలోని నిర్దిష్టతని నిరాకరించి, సాహిత్యాన్ని విపరీతంగా సాధారణీకరించే ప్రయత్నం వచనకవిత్వ లక్ష్య లక్షణ నిర్దేశంలో కనిపిస్తుంది. వచన కవుల్లో చాలామందికి సిద్ధాంత పరంగా మార్క్సిజం పైన ఎలాంటి అగౌరవం లేదు కానీ నిబద్ధత గురించి కూడా వాళ్లకు పెద్ద పట్టింపు లేదు. ఈ కారణంగానే వస్తుబలం లేకుండా నిస్సారమైన వచనకవిత్వం ఎక్కువగా ఉత్పత్తి అయ్యింది. దిగంబర కవుల వచనకవిత్వం వస్తురాహిత్యం పైన చేసిన దాడి గమనించదగింది. కవిత్వంలో తిరిగి వస్తు ప్రాధాన్యాన్ని చెప్పడానికి విప్లవోద్యమం దోహదపడింది. విప్లవసాహిత్యం తగ్గుముఖం పట్టిన కాలంలో తిరిగి అనుభూతి వాద భావఛాయలు ప్రసరించాయి. అనుభూతివాదం అంటూ విడిగా ఏమీ లేదని అనుభూతి కవులు చెప్పుకున్నా అది కేవలం వారి వారి వైయక్తిక ప్రత్యేకతల్ని చెప్పుకోవడానికే తప్ప కవిత్వ తత్వాన్ని వివరించే ప్రయత్నం ఏమీ కాదు. మౌలికంగా ఈ కవులు సామూహికతకి వ్యతిరేకులు. కవిత్వసృజన గురించి వీళ్లకి సంప్రదాయబద్ధమైన భావనే పునాది. సృజన శ్రమలో వీళ్లకు విశ్వాసం లేదు, ఒక మెరుపులా తటిల్లున మెరిసే భావమే కవిత్వ వస్తువు. అదొక ideology కి పరావర్తనం అనే భావనే వాళ్లకు నచ్చదు. అందుకే ఈ కవులు ఉద్దేశపూర్వకంగానే మార్క్సిస్టు దృక్పథం పైన నిరసన ప్రకటించారు, మార్క్సిస్టు భావజాలాన్ని ప్రకటించే కవిత్వాన్ని హస్త్రళన చేయడం అంతకుముందు కన్నా ఎక్కువగా

**కొందరు మార్క్సిస్టు విమర్శకుల చేతుల్లో ఈ పద్ధతి ఒక పిడివాదంగా మారిపోవడం విచారకరం. వీరు వస్తువుకే కాని రూపానికి విలువ లేదనే వరకూ పోతున్నారు. శిల్పం, ప్రయోగశీలత మొదలైన అంశాలను దాదాపూ తిరస్కరిస్తున్నారు.**

కనిపిస్తుంది. ప్రధానంగా వ్యకివాద కవులు తమ కవిత్వ 'వస్తువు' ఫలానా అని చెప్పలేరు.

'నా కవిత్వమే నాకు అర్థం కాదు. నేను నాకు కాని స్థితిలో సమాజానికి ఎవరికీ కాని స్థితిలో.... కవిత్వం లాంటి అక్షరాల్నేవో రాస్తాను.' (మోహనప్రసాద్)

'జెండాలు, నినాదాలు, సిద్ధాంతాల సంకెళ్ళల్లో పడ్డ ఈ కాలపు కవిత్వం కాలుష్యంతో నిండిపోయింది. నిజమైన కవిత్వం కావాలి' (ఇంద్రగంటి శ్రీకాంతశర్మ)

అనుభూతివాద కవులు ప్రధానంగా తమ వైయక్తిక సృజనాత్మకతనీ, సమకాలీనంగా వున్న అతివాద కవిత్వ ధోరణుల్ని చెప్పడంతో పాటు వాటికి కారణం మార్క్సిజంలో వుందన్న భావాన్ని కలిగించే ప్రయత్నం కూడా చేశారు. అయితే, అలాంటి భావాలు కూడా పూర్తిగా వైయక్తికమై పోవడంతో వాటిలో విశ్వసనీయత లేకుండా పోయింది. అనుభూతివాదకవులు మార్క్సిస్టులతో పేచీ పడిన మొదటి అంశం : వస్తు-రూపాలు. వాస్తవానికి మార్క్సిస్టులు వస్తు-రూపాలను గురించి చేసిన మౌలికమైన ప్రతిపాదనలేవీ ఇప్పటివరకూ తెలుగులో రాలేదు, ఆయా సందర్భాల్లో చర్చలో భాగంగా వస్తు-రూపాలను గురించి చెప్పిన అంశాల్లో ఏకసూత్రత లేదు. వస్తువుని గురించి స్పష్టమైన దృక్పథం లేకపోవడం వల్ల పరస్పర విరుద్ధమైన అంశాలు చర్చకి వచ్చాయి.

'కొందరు అభ్యుదయ వాదులు ప్రమాదకరమైన ఒక నిర్ధారణ లాగుతున్నారు. సాహిత్యంలో వస్తువు అభ్యుదయకరంగా వుంటే ఇక ఏ విలువలూ అక్కర్లేదని. తెలిసో తెలియకో కొందరు చేస్తున్న ఈ నిర్ధారణ వల్ల దెబ్బతినేది శిల్పం' (రామచల్లు రామచంద్రారెడ్డి)

'కొందరు మార్క్సిస్టు విమర్శకుల చేతుల్లో ఈ పద్ధతి ఒక పిడివాదంగా మారిపోవడం విచారకరం. వీరు వస్తువుకే కాని రూపానికి విలువ లేదనే వరకూ పోతున్నారు. శిల్పం, ప్రయోగశీలత మొదలైన అంశాలను దాదాపూ తిరస్కరిస్తున్నారు. ఇవి మితంగా కనిపించినా వాటిని బూర్జువా లక్షణాలుగా వర్ణించి అవహేళన చేస్తున్నారు. తాను కేంద్రబిందువుగా వుంటూ ఇతర విమర్శనా పద్ధతుల్లోని మంచి లక్షణాలను అవసరం వచ్చినప్పుడు స్వీకరించగల విశాల తత్వం మార్క్సిస్టు విమర్శకు వుందన్న విషయాన్ని వీరు విస్మరిస్తున్నారు' (వల్లంపాటి)

ఈ రెండు అంశాలు అవగాహన లోపం మార్క్సిస్టు విమర్శకుల్లోనూ కొంత అవగాహనారాహిత్యం వుందన్న విషయాన్ని చెప్పక చెబుతున్నాయి. విమర్శకి సంబంధించినంతవరకూ మనం 'ఆబ్జెక్టివిటీ'ని ఇంకా అలవర్చుకోలేదనడానికి ఇది ఒక ఉదాహరణ. దీనికి కారణం మౌలికభావనల పట్ల మనకు అవగాహన లేకపోవడమే.

వస్తు - రూపాలకు సంబంధించి మార్క్సిజం ప్రధానంగా రెండు అంశాల్ని ప్రతిపాదిస్తుంది. ఒకటి : దృక్పథంతో కూడిన వస్తువు. రెండు : రూపొందిన వస్తువు (formed content) ఈ రెండింటికీ మధ్యా Organic connection వుండి తీరాలి. రెండిటిలో ఏది లోపమైనా అది లోపమే. పార్టీ సాహిత్యం, ప్రచార కవిత్వం అనే మాటను మొట్టమొదటి సారిగా నిర్దిష్టంగా వుపయోగించిన లెనిన్ కమ్యూనిస్ట్ కవిత్వంలో వస్తువు గురించే కాదు. రూపం గురించి కూడా మాట్లాడాడు. రూపం వస్తువుపై ప్రభావం కనబరిచే వైరుధ్య సందర్భం మాత్రం వద్దన్నాడు. కొత్త వస్తువు ఒక్కోసారి పాత రూపాన్ని ధ్వంసం చేస్తుందని ఎర్నెస్ట్ ఫిషర్ చెబుతాడు. లూనాచార్స్కీ రూపానికి 'ఒరిజినాలిటీ' వుండాలన్నాడు.

వ్యక్తివాదం లేదా ఆత్మాశ్రయత కనిపించే ఇంకో రూపం: సాహిత్యచరిత్ర నిర్మాణ క్రమం. సృజన క్రమంలోనే కాదు, విమర్శనలోనూ, చరిత్ర రచనలోనూ ఆత్మాశ్రయధోరణి ప్రభావం పడడం మనలో సంప్రదాయకంగా మిగిలివున్న సాహిత్య నిర్మాణ వ్యవస్థకి సంకేతం. సాహిత్య చరిత్ర రచనలో వున్న వ్యక్తివాదం ప్రాతిపదికగా యుగవిభజనలు చేయడం, ఆ కాలం సాహిత్య లక్షణాల్ని నిర్ధారించడం కనిపిస్తుంది. ప్రగతి భావాలు గల విమర్శకులు, సంప్రదాయ విమర్శకులు అనే భేదం లేకుండా సుమారు అందరిలోనూ సమానంగా ఈ ధోరణులు కనిపిస్తాయి. విశ్లేషణ, శాస్త్రీయత ప్రధాన లక్షణంగా వుండవలసిన విమర్శలో వస్తుగత దృష్టి కంటే వ్యక్తిగత దృష్టి ప్రధాన స్థానాన్ని ఆక్రమించడమే దీనికి కారణం' (కెకె రంగనాథాచార్యులు)

ఇక జీవిత చరిత్ర రచనావిధానంలో ఇప్పటికీ మనం పాత పద్ధతులనే అనుసరిస్తున్నాం. అభ్యుదయ దృక్పథం వున్న పత్రికల్లో తొలినాళ్లల్లోనే ఈ ధోరణిని ఒక లోపంగా ఎత్తి చూపించారు పుచ్చలపల్లి. సుందరయ్య గారు. 'అభ్యుదయ' పత్రికలలో జీవిత చరిత్రల్ని గురించి ఆయన వ్యాఖ్యానిస్తూ

'వారు చేసిందంతా గొప్పనీ, వారి వ్రాతలన్నీ గొప్పవేననే భావంతో ముగించారు. ఈ రకపు జీవితచరిత్రలు, వ్యక్తినే ప్రాధాన్యంగా చూపెట్టేవి ఎక్కువ ప్రయోజనకరాలు కావు. గుడ్డిగా వ్యక్తి పూజకు వుపయోగపడవచ్చు గాని ప్రజలను, రచయితలను తమ కర్తవ్యాన్ని నెరవేర్చడానికి, సమాజాన్ని మార్పు చేయడానికి, సమిష్టిగా కృషి చేయడానికి ప్రోద్భలమివ్వవు' అన్నారు. వైయక్తికత అనేది సాహిత్య రచనాక్రమంలో, విమర్శలో ఏ రూపంలో వున్నా అది ప్రతికూల ఫలితాలనే చూపిస్తుంది. రచనకి వుండే ఉనికిని మరుగున పరుస్తుంది. మొత్తంగా ఒక సామాజిక దృశ్యాన్నించీ, సందర్భాన్నుంచీ రచనని దూరంగా నెట్టేస్తుంది. అలాగే, విమర్శకి వుండే అనేక కోణాలు బహుముఖీనతని కూడా వైయక్తికత దెబ్బ తీస్తుంది. అన్నింటికీ మించి రచనలో కనిపించే జీవనపరావర్తనం ఒక వక్రరేఖగా మారుతుంది.

In reaching out to the new
the old is reinstated

-TOM MARIN

**పునర్నిర్మాణ దశ**

సాహిత్య సామాజికాన్వేషణ స్థలకాలాన్ని బట్టి మారుతుంది. కొత్త స్థల కాలాలతో పాటు కొత్త ప్రశ్నలు తలెత్తుతాయి. అవి జీవితాన్నీ, సమాజాన్నీ పునర్ నిర్వచించుకోవాల్సిన అవసరాన్ని కల్పిస్తాయి. అంటే అప్పటివరకూ వున్న పునర్ నిర్వచనాల పరిధి సంకుచితమై పోతుందన్న మాట. లేదా వాటి ఆచరణలోని లోపాల వల్ల అవి వాటి సహజమైన విశాలత్వాన్ని కూడా కోల్పోతాయి. మార్క్సిస్టు కళాసిద్ధాంతానికి 1980ల తర్వాత జరిగింది అదే. సాహిత్యతత్వాన్వేషణలో మన మార్క్సిస్టు విమర్శకులు ఏర్పర్చిన నిర్మాణాలు కొత్త సామాజికాన్వేషణకి సరిపోవన్న భావన ఈ దశలో బయలుదేరింది. సాధారణంగా కొత్త ప్రమాణాలనీ, కొత్త నిర్మాణాలనీ ఏర్పరచుకునేటప్పుడు మనం పాతవి అనుకున్నవాటిని అవసరానికి మించిన తీవ్రతతో వ్యతిరేకిస్తాం. ఆ వ్యతిరేకతలో నిర్మాణం కన్నా విధ్వంసం ఎక్కువ జరుగుతుంది. పాత కొత్త మేలికలయికలకి బదులు పాత విధ్వంసం, కొత్త నిర్మాణం చోటు చేసుకుంటాయి. నిజానికి మనం అనుకున్నంత తేలికగా పాత నిర్మాణాలు తొలగిపోవు. కొత్త నిర్మాణాలు అలవోకగా వొదిగిపోవు. రెండిటి మధ్యా వైరుధ్యాలూ, అంతర్గత సంఘర్షణలూ తప్పవు. ఈ పరస్పర వైరుధ్యాలు, సంఘర్షణల వాతావరణం 1980ల నుంచీ కనిపిస్తుంది. సాహిత్య సామాజికాన్వేషణ సాధనాల్ని పునర్నిర్మించుకునే ప్రయత్నమూ, పాతవాటిని పునర్మూల్యాంకనం చేసుకునే కృషీ ప్రారంభమైనందున దీన్ని 'పునర్నిర్మాణ' దశగా భావించవచ్చు.

సాహిత్యతత్వాన్వేషణలో మన మార్క్సిస్టు విమర్శకులు ఏర్పర్చిన నిర్మాణాలు కొత్త సామాజికాన్వేషణకి సరిపోవన్న భావన ఈ దశలో బయలుదేరింది. సాధారణంగా కొత్త ప్రమాణాలనీ, కొత్త నిర్మాణాలనీ ఏర్పరచుకునేటప్పుడు మనం పాతవి అనుకున్నవాటిని అవసరానికి మించిన తీవ్రతతో వ్యతిరేకిస్తాం.

ఈ పునర్నిర్మాణ క్రమం సహజంగానే మధ్య తరగతి భావజాలం కేంద్రబిందువుగా మొదలైంది. 1980లలో విప్లవోద్యమం తగ్గుముఖం పట్టిన తర్వాత ఉపరితల రంగంలో చాలా మార్పులు వచ్చాయి. కవిత్వంలో సమకాలీన రాజకీయాల పట్ల వైముఖ్యం ప్రధాన వస్తువుగా వ్యక్తమైంది. ముఖ్యంగా అదే దశకంలో తూర్పు యూరప్ పరిణామాలు కూడా సంభవించడంతో వామపక్ష రాజకీయోద్యమం ఉనికి సంక్షోభంలో పడింది. దాని ప్రతిఫలనం సాహిత్యంలోనూ కనిపించింది.

'1980 ఒక సందిగ్ధ దశాబ్దం. పద్దెనిమిది నెలల అత్యయిక స్థితి తర్వాత భారత రాజకీయ వ్యవస్థలో మౌలికంగా కొన్ని మార్పులు వచ్చాయి. అధికార వ్యవస్థ బలపడింది. సామాజికంగా నిరాశాపూరిత వాతావరరణం నెలకొంది. దేశాన్ని పట్టిపీడిస్తున్న సమస్యల ప్రభావం యువతరం పైన బాగా పడింది. భౌతిక పరిస్థితులే జీవనవిలువల్ని శాసించే స్థితి ఏర్పడింది. ఆదర్శ ప్రమాణాలనేవి నిత్య జీవితంలోంచి తప్పించుకున్నాయి. వివిధ దశలలో ఆర్థిక, సామాజిక, రాజకీయ, నైతిక రంగాలలో పెరిగిపోయిన తేడాలకు, నిరాటంకంగా సాగుతున్న అణచివేతలకు వ్యతిరేకంగా కొందరు, ఆ పరిస్థితుల ఆధిక్యం వల్ల 'శూన్యావరణం'లో చిక్కుబడిపోయిన నిరాశావాద కవులు కొందరు ఈ తరంలో కనిపిస్తారు. కాని, మౌలికంగా వీళ్లు స్థిరపడివున్న యధాతధ వ్యవస్థకి వ్యతిరేకులే.

వ్యవస్థ మారాలన్న స్పృహ, ఎలాంటి వ్యవస్థ కావాలన్న చైతన్యం వీరిలో వున్నాయి.'

(అఫ్సర్)

యధాతథ వ్యవస్థ నిర్మాణాల్ని ప్రశ్నించడం ఈ క్రమంలో జరిగిన మొదటి ప్రయత్నం. దీనికి మార్క్సిస్టు నిర్మాణాలు కూడా మినహాయింపు కాలేదు. ముఖ్యంగా మార్క్సిస్టు సైద్ధాంతికతకి కేంద్రమైన 'వర్గ' తత్వాన్ని నిర్దిష్ట వర్గాలు ప్రశ్నించాయి. కేవలం వర్గపోరాట దృష్టితో చూసినంత మాత్రాన్నే సామాజికాన్వేషణ సఫలం కాదని చెప్పాల్సి వచ్చింది. 1980లలో మొదలైన మధ్యతరగతి చైతన్యం లోంచి స్త్రీ వాదులు ఈ విషయంలో గట్టి వాదానికి దిగారు. మార్క్సిజానికి వున్న శాస్త్రీయ పునాదిని సహేతుకంగా అంగీకరిస్తూనే 'మార్క్సిజానికి కూడా కొన్ని పరిమితులున్నాయి. నిజానికివి మార్క్సిజంకు అంటే గతి తార్కిక పద్ధతికి వున్న పరిమితులు కావు. ఆ పద్ధతిని అన్ని సమస్యలకూ అన్వయించడంలో యేర్పడిన పరిమితులు' (ఓల్గా)గా భావించారు స్త్రీ వాదులు. ఆ పరిమితుల వల్ల మార్క్సిజం అన్వయంలో వర్గానికి వున్న ప్రాముఖ్యం 'జెండర్'కి లేకుండా పోయిందన్నదే స్త్రీ వాదుల వాదన.

అయితే, ఇదే చర్చ ఆవేశ తీవ్రత కవిత్వ పరిధిలోకి వచ్చినప్పుడు దాని ఆవేశతీవ్రత పెరుగుతుంది. 'నీలిమేఘాలు' కవితా సంకలనం పైన జరిగిన చర్చలో రెండు పక్షాలలోనూ ఆత్మాశ్రయత్వమే అధికంగా కనిపిస్తుంది. దీనికి కారణం ఇరువైపులా మార్క్సిజం అన్వయానికి సంబంధించిన సమన్వయం తెలియకపోవడమే. ఒక దశలో స్త్రీలను అసభ్య పదజాలంతో దూషించేవరకూ వెళ్ళిందంటే విమర్శసాధనాల దగ్గిర మనం ఎంత మొద్దుబారి పోయామో తెలుస్తుంది. 'కొంతమంది 'విప్లవ', 'ప్రజా', 'అభ్యుదయ', 'మహిళా' వాద రచయితలు స్త్రీవాద కవిత్వంపై వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలు మార్క్సిస్టు అవగాహనకు భిన్నమైనవనీ, కొన్ని సందర్భాల్లో వ్యతిరేకమైనవనీ (వరవరరావు) మార్క్సిస్టు విమర్శకులు నిర్ద్వంద్వంగా చెప్పిన విషయాలు

**స్త్రీవాదం నిర్మాణపరంగా వున్న అన్ని పరిమితుల్నీ ప్రశ్నించింది. కొత్త నిర్మాణాలకూ, పునర్నిర్మాణాలకూ దోహదపడే అన్నిటినీ స్వీకరించింది. అందుకే 'అన్ని ప్రజా ఉద్యమాలతో దాని సానుబంధ ప్రవృత్తి కొనసాగింది. ఇవాళ స్త్రీ వాదులు కేవలం శరీర రాజకీయాలే మాట్లాడటం లేదు.**

ఇక్కడ గమనించాలి. అయితే, స్త్రీ వాదులు వాటన్నిటినీ అధిగమించి, కవిత్వ పరిమితులను వదిలించుకుని వచన రూపాల్లోకి ప్రవేశించడం వల్ల వాళ్ల ఆలోచనల్లో సమన్వయం సాధ్యమైంది. సామాజికాన్వేషణలో వస్తుగత దృష్టి ఎంత ముఖ్యమో ఈ అనుభవసారం చెబుతుంది. స్త్రీ వాదులు వచనంలోకి అంటే సృజనాత్మకంగా కథల్లోకీ, నవలల్లోకీ, విమర్శనాత్మకంగా, పరిశోధనాత్మకంగా చరిత్రనిర్మాణ ప్రక్రియలోకీ ప్రవేశించడం వల్ల ఆ వాదపటిమ పెరిగింది. స్త్రీ వాద సాహిత్యాన్ని రెండు దశలుగా విభజిస్తే, రెండో దశలో స్త్రీ వాదులు సాధించిన విజయాలు దీనికి నిదర్శనంగా నిలుస్తాయి.

మొదటి దశలో స్త్రీ వాదులు మార్క్సిజానికి ఒక సాధనంగా వున్న పరిమితుల్ని గుర్తించారు. 'స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ విముక్తి, స్త్రీ, పురుష సంబంధాలలో మార్పు వీటిని అర్థం చేసుకోవడానికి మార్క్సిస్టు విమర్శనా పరికరాలు మాత్రమే సరిపోవు' (ఓల్గా)

I donot think it is possible to explain concreted forms of gender in eqality by theorising from macro-systems of patriarchy and capitalism. Further there are complex historically specific ways in which the structures and practice which make up these systems interact. (HARTMAN AND WALBY)

అప్పటివరకు ఉన్న నిర్మాణాలతో పాటు, రూపపరంగా స్థిరపడిన అంతర్గత వైరుధ్యాల్ని కూడా గుర్తించడం స్త్రీ వాదంలో మలుపు. చరిత్ర నిర్మాణానికి సంబంధించి స్త్రీ వాదుల్లో కలిగిన పునర్నిర్మాణ దృష్టి దీనికి ఆచరణ రూపం. సామాజికతలో అంతర్గతంగా వుండే వ్యవస్థల మధ్య అన్యోన్య సంబంధాన్ని అన్వేషించడానికి స్త్రీవాద దృక్కోణం నుంచి సాగిన చరిత్ర రచనా క్రమం ఉపయోగపడింది.

## పదును పెంచిన వాదన

స్త్రీ వాద వివాదం ఇంకో కోణం నుంచి మార్క్సిస్టు దృక్పథానికి కూడా పదును తీసుకు వచ్చింది. అందుకే 'స్త్రీ వాదం అనివార్యమైన ఒక సాంస్కృతిక చలనం' (కేతు విశ్వనాథరెడ్డి) అని, 'మార్క్సిజం పీడిత ప్రజల పోరాట చైతన్యాన్ని ఆవాహన చేసుకుని, సామాజికమైన మార్పులు సాధించే ఆయుధమైనప్పుడు 'పీడితుల్లోనూ పీడితులైన' స్త్రీలు చేసే పోరాటాన్ని తప్పకుండా బలపరచవలసిందే' (వరవరరావు) అని మార్క్సిస్టు విమర్శకులు అందులో గుణాత్మకమైన అంశాలను పరిగణనలోకి తీసుకున్నారు. స్త్రీ వాదులు కూడా 'వర్గ' ప్రాధాన్యాన్ని ఎక్కడా వ్యతిరేకించిన దాఖలాలు లేవు. 'ఇవాళ స్త్రీవాదులు వర్గం అనేదే లేనేలేదన్నట్లు మాట్లాడం లేదు. వర్గాలకూ, వర్గపోరాటాలనూ వాటి ప్రాముఖ్యతను గుర్తిస్తూనే సమాజం సమూలంగా మారాలంటే వర్గ, వర్ణ లింగ జాతిపరమైన దోపిడీలు అణచివేతలు పోవాలనీ వీటిలో ఏ ఒక్క దాని మీదనో యుద్ధం చేస్తే చాలదనీ అన్నింటిపైనా యుద్ధం చేయాలనీ చెబుతున్నారు' (ఓల్గా)

ఈ 'యుద్ధం' లో భాగంగానే స్త్రీ వాదులు జెండర్ దృక్పథంతో మాట్లాడడం మొదలు పెట్టారు. ఆ దృక్పథాన్ని నొక్కి చెప్పడం కోసం 'శరీర రాజకీయాల్ని' చెప్పారు.

questioning body and the pressurees of the state on body is more important than the question of ideology (MICHEL FOUCUALT)

అయితే అదే ప్రధాన ధోరణిగా స్త్రీవాదం కొనసాగి వుంటే గ్లోబలైజేషన్ పరిణామాల నేపథ్యంలో దానికి ఎలాంటి హేతుబద్ధత లేకుండా పోయేది. స్త్రీవాదం నిర్మాణపరంగా వున్న అన్ని పరిమితుల్నీ ప్రశ్నించింది. కొత్త నిర్మాణాలకూ, పునర్నిర్మాణాలకూ దోహదపడే అన్నిటినీ స్వీకరించింది. అందుకే 'అన్ని ప్రజా ఉద్యమాలతో' దాని సానుబంధ ప్రవృత్తి కొనసాగింది. ఇవాళ స్త్రీ వాదులు కేవలం శరీర రాజకీయాలే మాట్లాడటం లేదు. ఆ విధంగా విధించబడే పరిమితుల పంజరాన్ని కూడా గుర్తించి దాన్నించి బయట పడి ఇతర సామాజిక ఉద్యమాల్లో భాగమవుతున్నారు. ప్రాపంచిక దృక్పధాన్ని విస్తరించుకుంటున్నారు.

జెండర్ మాదిరిగానే కుల, మత వర్గాల గుర్తింపు చైతన్యం ఈ రెండు దశాబ్దాల్లో కొన్ని ప్రధానమైన ప్రశ్నల్ని లేవనెత్తింది. తొలిదశలో దళితవర్గం అనే విస్తృతమైన శ్రేణి కింద వర్గీకరించబడిన మైనారిటీ, బీసిలు తర్వాత్తర్వాత విడివిడిగా తమ గుర్తింపు చైతన్యాన్ని వ్యక్తం చేయడానికి ప్రయత్నించాయి. ఈ శ్రేణులు నిర్దిష్టమయ్యే కొద్దీ అంతకుముందు వున్న వర్గీకరణలపైన విమర్శ పెట్టడం ఒక ఆనవాయితీగా మారింది. దళితవాదులు రాజకీయంగానూ, సాహిత్య పరంగానూ ఏకకాలంలో మార్క్సిజన్ని ధోరణిపైన విమర్శనాస్త్రాలు సంధించారు. అయితే, అవి మౌలికంగా ఇక్కడి మార్క్సిస్టు ఆచరణకి సంబంధించిన విషయాలై వుండడం గమనించాల్సిన అంశం. ప్రాథమికంగా అంబేద్కరిజాన్ని, ఫూలేనీ, మార్క్స్‌నీ కలుపుకొని వెళ్తే తప్ప తమ సమస్యకి పరిష్కారం లేదన్న భావననే దళితవాదులు వ్యక్తం చేస్తూ వచ్చారు. అభ్యుదయోద్యమం నుంచి విప్లవోద్యమం వరకూ పీడితుడు అనేవాడు 'అమూర్తం' గానే వున్నాడన్నది ఒక విమర్శ. దానికి 'మూర్త' రూపం ఇవ్వడం అంటే దళితవాదం మీద దాడిచేస్తూ, కమ్యూనిస్టు 'బ్రాహ్మణీయత'ని కూడా ఎండ గట్టింది. అయితే, వాదనలోకి వచ్చేసరికి మార్క్సిస్టులతో స్త్రీవాదుల మాదిరిగా ఖరాకండిగా ఎక్కడా

**ఆధునికానంతరవాదం మీద తెలుగుసాహిత్య సాంస్కృతిక లోకానికి అంత గురి కుదిరినట్టు కనిపించదు. దానికి కారణం ఆధునికానంతరవాదం గురి మరచిన బాణం లాంటిది కావడమే. ఒక సిద్ధాంతంగా, ఒక తాత్విక దృక్పథంగానే నిలిచేంత బలం దానికి లేదు.**

విభేదించిన ఆధారాలు లేవు. దళితవాదం ఆ తర్వాత రాజకీయంగా ఎదుర్కొన్న ఆటుపోట్లు సాహిత్యం పైన గట్టి ప్రభావాన్ని వేశాయి. దళిత బ్రాహ్మణీయత' కూడా వుందన్న విమర్శ వచ్చింది. మాదిగలూ, బీసీలు, ముస్లింలు తమ గుర్తింపుని ఇతరేతర పునాదులపైన స్పష్టం చేసుకోవాల్సి వచ్చింది.

అయితే, ఈ విడి విడి వర్గ 'పోరాటాలన్నీ' తమ సామాజిక స్థాయితో పాటు ఆర్థిక పునాదిపైన జరుగుతున్న పీడన స్వభావాన్ని గుర్తించడంలో విఫలమవుతున్నాయి. తాత్వికదృక్పధంలో ఈ వర్గాలు పరస్పర విరుద్ధమైన అంశాలను ప్రతిపాదిస్తున్నాయి. వాటి 'మౌలికత' సందిగ్ధావస్థలో వుంది. దానికి ఉపరితలంలో కనిపించే స్పష్టమైన కారణం ఒక్కటే: దళితవాదం పైన ప్రతి కూలాంశాల ప్రభావం అధికంగా పడడం! దళిత సాహిత్యం వివిధ రూపాలు పొందే క్రమం పూర్తి కాకుండానే, అది కవిత్వంలోంచి ఇతర సాహిత్య ప్రక్రియల్లో పరిమితంగా మాత్రమే ప్రయాణించిన దశలోనే స్తబ్ధతకి లోనైంది. గుర్తింపు చైతన్యం తర్వాత అనుసరించాల్సిన మార్గం ఏమిటో స్పష్ట పడకపోవడం దీనికి ముఖ్య కారణం.

3

If all human existence is in some sense theoretical, then theory is an activity which goes on all the time

-TERRY EAGLESTON

80ల తర్వాత తెలుగు సాంస్కృతిక వాతావరణంలో కలిగిన చలనాలు మార్క్సిజంపై కొంత అసంతృప్తికి కారణమయ్యాయి. అంతర్జాతీయ పరిణామాలతో పాటు స్థానికంగా వచ్చిన మార్పులు కూడా దీనికి తోడయ్యాయి. నిర్దిష్ట, ఉద్యమాల అవగాహనకు మార్క్సిజం సరైన సాధనం కాదన్న అసంతృప్తి మొదలైంది. ఇలాంటి వారికి పోస్ట్-మోడర్నిజం ఒక ప్రత్యామ్నాయంగా కనిపించింది. 1980లలో మొదలైన సందిగ్ధ సంఘర్షణని 'సిద్ధాంతీకరించడానికి' కొందరు విమర్శకులు పోస్ట్-మోడర్నిజంని ప్రతిపాదించారు. వాస్తవానికి ఇలాంటి 'సిద్ధాంతీకరణ'కి పోస్ట్-మోడర్నిజం ప్రాథమికంగానే వ్యతిరేకం. ఇంకో విధంగా చెప్పాలంటే ఏ విధమైన నిర్వచనానికైనా అది వ్యతిరేకం. నిర్వచనమే సాధ్యం కానప్పుడు అందులో నిర్మాణం కూడా సాధ్యం కాదు. పోస్ట్-మోడర్నిస్టు దశ తెలుగు కవిత్వంలో 1980లోనే ప్రారంభమైందని సూత్రీకరించిన విమర్శకులు అది ఏ ప్రమాణాల్ని ఏ సంవిధానంతో స్వీకరిస్తుందో ఇప్పటివరకూ చెప్పలేకపోయారు.

'తెలుగునాట కమ్యూనిస్టు పార్టీల, కమ్యూనిస్టు సాహితీ సాంస్కృతిక సంఘాల వైఫల్యాల్ని బహిర్గతం చేస్తూ, పరిమితుల్ని అధిగమిస్తూ 1980ల తర్వాత నుంచి స్త్రీ వాదం, దళితవాదం, మైనారిటీవాదం మొదలైన ఉద్యమాలు రంగం మీదికి వచ్చాయి. ఆ వాదాలకి తాత్విక ప్రేరణ ఆధునికానంతరవాదం' **(బి. తిరుపతిరావు)** కాని స్త్రీ, దళిత, మైనారిటీవాదాలు 'ఆధునికానంతరవాదం' లోకి చేరుతాయా లేదా అన్నది వివాదాస్పదం. ఈ మూడు వాదాలకు చెందిన ఏ రచయితా, ఏ విమర్శకుడూ తాను 'ఆధునికానంతర వాది'నని చెప్పుకున్న నిదర్శనాలు లేవు. ఒకరిద్దరు వున్నా ఈ వాదాలు ఏ కోణం నుంచి ఆధునికానంతరవాదంలో చేరుతాయో వాళ్ళూ

చెప్పలేదు. అలాంటప్పుడు ఈ మూడు వాదాలకూ ఆధునికానంతరవాదమే తాత్విక పునాది అని చెప్పడం తొందరపాటు అవుతుంది.

ఆధునికానంతరవాదం మీద తెలుగుసాహిత్య సాంస్కృతిక లోకానికి అంత గురి కుదిరినట్టు కనిపించదు. దానికి కారణం ఆధునికానంతరవాదం గురి మరచిన బాణం లాంటిది కావడమే. ఒక సిద్ధాంతంగా, ఒక తాత్విక దృక్పథంగానే నిలిచేంత బలం దానికి లేదు. అలాగే, కేవలం కమ్యూనిస్టు వ్యతిరేకతే స్త్రీ, దళిత, మైనారిటీ వాదాలకు కేంద్ర బిందువు కాదు. ఈ మూడు నిర్దిష్ట వాదాలకు ముందు వాటి వాటి గుర్తింపు చైతన్యం ప్రధానం. వాటి తాత్విక పునాది ఆయా వర్గాల సాంస్కృతిక అస్తిత్వాన్నీ, మూలాల్నీ అన్వేషించడంలోనే వుంది. సమకాలీన సిద్ధాంతాల 'నిష్ప్రయోజకత్వాన్ని' చెప్పడం వాళ్లకు ద్వితీయాంశం మాత్రమే.

మరో ముఖ్యమైన అంశం - ఈ నిర్దిష్ట వాదాలన్నీ ఒక నిర్మాణ లేదా పునర్నిర్మాణ వ్యవస్థ కోసం తపిస్తున్నాయి. ప్రస్తుతం ఉన్న విలువలు కానీ, ప్రమాణాలు కానీ తమని గుర్తించలేని స్థితిలో వున్నందున వాటి స్థానంలో కొత్త విలువల్నీ ప్రమాణాల్నీ నిర్మించడం, పాత ప్రమాణాల్ని వినిర్మించడం ఇవి ప్రధానంగా భావించాయి. ఆ నిర్మాణక్రమంలోనే అవి పూర్వగాధల్నీ, మిత్స్‌ని పునః సృష్టించుకున్నాయి. వాటిలో ఆరాధనాభావంతో చెప్పిన అంశాల్ని ఆట పట్టించాయి. నిర్లక్ష్యం చేయబడిన లేదా అణచివేయబడిన అంశాల్ని తిరిగి 'ఉదాత్తీకరించాయి'. ఈ ప్రయత్నమంతా పునర్నిర్మాణం కోసమే! నిజానికి ఈ విధమైన పునర్నిర్మాణం పోస్ట్-మోడర్నిజం పరిమితుల్లో సాధ్యపడదు. ముఖ్యంగా పీడనకు సంబంధించి ఆధునికానంతరవాదంలో నిర్దిష్టమైన నిర్వచనం లేదు. పీడన స్వభావం తెలియకపోతే పాత సామాజిక నిర్మాణవ్యవస్థల్ని అర్థం చేసుకునే అవకాశమే తక్కువ. స్త్రీ, దళిత, మైనారిటీ వర్గాల ఉనికి సంక్షోభానికి పీడన, అణచివేతలే కారణం.

ఈ విధమైన పునర్నిర్మాణం పోస్ట్-మోడర్నిజం పరిమితుల్లో సాధ్యపడదు. ముఖ్యంగా పీడనకు సంబంధించి ఆధునికానంతర వాదంలో నిర్దిష్టమైన నిర్వచనం లేదు. పీడన స్వభావం తెలియకపోతే పాత సామాజిక నిర్మాణవ్యవస్థల్ని అర్థం చేసుకునే అవకాశమే తక్కువ. స్త్రీ, దళిత, మైనారిటీ వర్గాల ఉనికి సంక్షోభానికి పీడన, అణచివేతలే కారణం.

తమ వర్గమూలాల్లోకి వెళ్ళడం ద్వారా మాత్రమే ఈ వర్గాలు ఇలాంటి సంక్షోభాన్ని గుర్తించగలవు. లేదంటే వాటి అవగాహన ఒక అర్ధసత్యంగా మిగిలిపోతుంది. పాక్షికతలోంచి నిర్దిష్ట పోరాట మార్గాన్ని ఏర్పర్చుకోవడమూ సాధ్యం కాదు.

ఏ వాదానికి సంబంధించిన సాహిత్యానికైనా అంతిమ లక్ష్యం సత్యాన్వేషణ. ఒక్కో రచయిత తన జీవన పరిస్థితుల్ని బట్టీ, అవగాహనని బట్టి తనదైన అన్వేషణ సాగించడానికి సాధనంగా సాహిత్యప్రక్రియని వుపయోగించుకుంటాడు. ఆ సాహిత్య ప్రక్రియలతో సమాజానికి వుండే వివిధాలైన సంబంధాల్ని బట్టి దాని విలువా, స్థానమూ నిర్ధారితమవుతాయి. అయితే, ఈ సత్యాన్వేషణ అమూర్తమైంది కాదు, దానికి స్థలకాలబద్ధమైన నిర్దిష్ట పరిధులుంటాయి. అలాగే, సత్యాన్వేషణకి రచయిత కొన్ని తాత్వికమైన సాధనాల్ని కూడా ఎంచుకుంటాడు. అవి సాధనాలే తప్ప జీవన సర్వస్వం కావన్న మౌలికభావన ఏ వాదం ఉనికికైనా ప్రధానం. ఆచరణసంబంధమైన లేదా సంస్థాగతమైన ప్రయోజనాల వల్లా, రాజకీయ ఎత్తుగడల వల్లా వాదాలు కొన్ని తాత్కాలిక ప్రయోజనాల్ని ఏర్పర్చుకుంటూ వుంటాయి. వాటిని బట్టి జీవనసత్యాలు కానీ, వాస్తవికత కానీ మారడం ఎప్పుడూ జరగలేదు, జరగదు.

కాబట్టి, సైద్ధాంతిక సాధనాలకు సాపేక్షవాస్తవికత మాత్రమే ఆదర్శంగా వుంటుంది. పరిపూర్ణ వాస్తవికత అనేది అసాధ్యం. వాదాలు తమ ప్రయోజనాల కోసం తాము చెప్పిందే పరిపూర్ణ వాస్తవికత అని భరోసాతో చెప్పబోతాయి. సంస్థాగతమైన నిర్మాణం కోసం వాస్తవిక నిర్మాణాల చుట్టూ 'మహాకథనాలు' అల్లుతాయి. అవి జీవితాన్ని ఏ కోణం నుంచి కూడా వ్యాఖ్యానించలేవు. అప్పుడు సాధనాలే సర్వస్వమై, సంపూర్ణత్వ భ్రమని మాత్రం కలిగిస్తాయి. అలాంటి భ్రమల్ని బద్దలు కొట్టడానికి గతి తార్కిక పునరుత్పత్తి దశలే. దాని సాపేక్షవాస్తవికతే సమకాలీన సైద్ధాంతికతనీ, ఆదర్శాన్నీ పునర్నిర్మిస్తుంది.

తెలుగు సాహిత్యం ఇప్పుడు ప్రధానంగా గతంలోనూ, వర్తమానంలోనూ వదిలేసిన 'ఖాళీ'లను పూర్తి చేసే లక్ష్యంలో నిమగ్నమై ఉంది. ఆధునికత ప్రవేశించిన తర్వాత వివిధ రూపాల ఘర్షణలోనూ, ఏకత్వంలోనూ అక్కడక్కడా మిగిలిపోయిన ఖాళీలను, ఉద్దేశపూర్వకంగానో, నిర్లక్ష్యంగానో వదిలేసిన సామాజికాంశాలను, నిష్ప్రయోజనమనుకుని వదిలేసిన మూలాలను సాహిత్యం శోధిస్తోంది. గత రెండు దశాబ్దాల సాహిత్య పరిణామాన్ని గురించి సంక్షిప్తంగా చెప్పుకోవాలంటే ఇదే దాని సారం. వివిధ కారణాల వల్ల 'నిస్సారమై' పోయిన వర్గాల్నీ, అంతరాల్నీ, అగాధాల్నీ తొలగించి, వాటి స్థానంలో కొత్త నిర్మాణాల్ని ఏర్పర్చుకోవడం దీనికి పరిష్కారం.

ఈ క్రమంలోనే 'నిర్ణాయకశక్తుల' పేరిట పేరుకుపోయిన అర్థరహితమైన వైరూప్య, అసంబద్ధ వాస్తవిక స్థితుల్ని వినిర్మించడం ఇంకో కోణం నుంచి జరుగుతున్న ప్రయత్నం. ఇది కొంచెం సంక్లిష్టమైన బాధ్యత. సామాజికతని పునర్నిర్వచించుకుని, ఆ నిర్వచన పరిధిని ఎప్పటికప్పుడు విస్తరించుకునే సమన్వయం వుంటేనే ఈ చారిత్రక బాధ్యతని స్వీకరించడం సాధ్యం. ఆ విధంగా గతంలో కంటే ఇప్పుడు రచయిత భుజంపైన చరిత్ర భారం ఎక్కువే వుందనుకోవాలి.

కె. రామ చంద్రమూర్తి



# సాహిత్య స్పర్శ లేని జర్నలిజం అసంపూర్ణం

**హిత్యానికీ, జర్నలిజానికీ మధ్య గల సంబంధాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? జర్నలిజాన్ని హడావుడి సాహిత్యం అన్నారు కదా!**

సాహిత్య అధ్యయనం వల్ల సమాజాన్ని అర్థం చేసుకోవచ్చు. సంస్కృతీ సాంప్రదాయాలు తెలుస్తాయి. అన్నిటికీ మించి భాష పైన పట్టు సంపాదించవచ్చు. ఈ మూడు అంశాలూ జర్నలిజానికి మూడు ప్రాణాలు. మనం ఏ ప్రజల జీవితాలను ప్రభావితం చేసే సమాచారాన్ని తెలియజేస్తున్నామో ఆ ప్రజల చారిత్రక, సాంస్కృతిక, సామాజిక నేపథ్యాన్ని తెలుసుకోవడం చాలా అవసరం. ఇందుకు సాహిత్యం తోడ్పడుతుంది. ప్రజల ఆలోచననూ, ఆవేశాన్నీ సాహిత్యం పట్టి ఇస్తుంది. కనుక సాహిత్యానికీ, జర్నలిజానికీ మధ్య సంబంధం విడదీయరానిది. జర్నలిజం ఈజ్ లిటరేచర్ ఇన్ ఎ హరీ అంటారు నిజమే. పత్రికలలో వచ్చే వార్తా కథనాలూ, ప్రత్యేక మానవీయ కథనాలూ అన్నీ సాహిత్యాన్ని సంపన్నం చేసేవే. అంతేకాదు, అనువాద ప్రక్రియ ద్వారా సాహిత్యాన్ని సంపద్వంతం చేసేది కూడా జర్నలిజమే. ఏ రంగంలో ఏ కొత్త మాట వచ్చినా దాన్ని ముందు తెలుగులోకి అనువదించి ప్రజలకు అందించేది పత్రికలే. అనంతరం ఈ అనువాదాలను భాషావేత్తలు పరిశీలించినా, మార్పులు చేసినా అవి జన సామాన్యానికి చేరే అవకాశాలు తక్కువ. సాధారణంగా పత్రికలు చేసిన అనువాదమే క్రమంగా రూఢి అవుతుంది. పత్రికలు చేసిన అనువాదాలలో వ్యత్యాసాలు ఉన్నప్పుడు ఎక్కువ ప్రాబల్యం ఉన్న పత్రిక చేసిన అనువాదమే నిలబడుతుంది. ఇందుకు ఉదాహరణలు అందరికీ తెలిసినవే చాలా ఉన్నాయి. ఈ కారణంగా కూడా జర్నలిస్టులకు సాహిత్యంలో ప్రవేశం ఉండటం అవసరం. సాహిత్యంతోపాటు వివిధ రంగాలలో ఉపయోగించే భాషాజాలంతో, దాని నేపథ్యంతో పరిచయం ఉండాలి. అప్పుడే తక్కువ వ్యవధిలో చేసే అనువాదం మాతృకకు దగ్గరగా ఉంటుంది.

............✧............

పత్రికలలో వచ్చే వార్తా కథనాలూ, ప్రత్యేక మానవీయ కథనాలూ అన్నీ సాహిత్యాన్ని సంపన్నం చేసేవే. అంతేకాదు, అనువాద ప్రక్రియ ద్వారా సాహిత్యాన్ని సంపద్వంతం చేసేది కూడా జర్నలిజమే. ఏ రంగంలో ఏ కొత్త మాట వచ్చినా దాన్ని ముందు తెలుగులోకి అనువదించి ప్రజలకు అందించేది పత్రికలే.

............✧............

**రు పత్రికా రచనలో సాహిత్యాన్ని ఎలా ఉపయోగించు కుంటున్నారు? మీ అనుభవంలో జర్నలిస్టులకు సాహిత్యం అవసరం ఎంతవరకూ ఉంటుంది?**

పత్రికను సుసంపన్నం చేయడానికి సాహిత్యం దోహదం చేస్తుంది. దిన పత్రికకు ఒక ప్రొఫైల్ ఉంటుంది. సాహిత్యం లేకుండా అది పూర్తి కాదు. సాహిత్య వాసన లేని దినపత్రిక ఏదైనా ఉంటే అది అసంపూర్ణ పత్రిక అని చెప్పుకోవచ్చు. సర్క్యులేషన్ ఎక్కువే ఉండవచ్చు.

కె. రామ చంద్రమూర్తి | • వార్త సంపాదకుడు

కానీ ఒక ప్రధానమైన, చైతన్యశీలమైన అంశం ఆ పత్రికలో లోపించిందనే వాస్తవాన్ని ఎవ్వరూ కాదనలేరు. పత్రికలో శీర్షికలను ఆకర్షణీయంగా తీర్చి దిద్దడానికీ, వార్తా కథనాలను జనరంజకంగా మలచడానికీ సాహిత్యాన్ని సమర్థంగా ఉపయోగించుకోవచ్చు. అందువల్ల జర్నలిస్టులకు సాహిత్యం అత్యవసరం. సాహిత్య అధ్యయనం వల్ల జీవితం తెలుస్తుంది. అవగాహన పెరుగుతుంది. జీవన దృక్పథం ఏర్పడుతుంది. సాహిత్యం తెలియనివారు మంచి జర్నలిస్టులుగా రాణించలేరు. జర్నలిజం అన్నది కమ్యూనికేషన్. సమర్థంగా కమ్యూనికేట్ చేయాలంటే అందుకు మీడియా అయిన భాష చాలా కీలకమైనది. భాషపైన అధికారం కావాలంటే సాహిత్యం అధ్యయనం చేయడం అవసరం. ఒక పెద్ద విషయాన్ని క్లుప్తంగా చెప్పవలసిన పరిస్థితులు ఉంటాయి. ఇటువంటి సందర్భాలలో సాహిత్య ప్రవేశం ఉన్న జర్నలిస్టులే కృతకృత్యులవుతారు. తక్కినవారు తేలిపోతారు.

> **జర్నలిజం అన్నది కమ్యూనికేషన్. సమర్థంగా కమ్యూనికేట్ చేయాలంటే అందుకు మీడియా అయిన భాష చాలా కీలకమైనది. భాషపైన అధికారం కావాలంటే సాహిత్యం అధ్యయనం చేయడం అవసరం. ఒక పెద్ద విషయాన్ని క్లుప్తంగా చెప్పవలసిన పరిస్థితులు ఉంటాయి.**

బుకీ పురస్కార గ్రహీత, ప్రఖ్యాత రచయిత్రి అరుంధతీరాయ్ ఈ విషయం చాలా చక్కగా చెప్పారు. 'మై లాంగ్వేజ్ ఈజ్ ది స్కిన్ ఆన్ మై థాట్స్" అన్నారు. అంటే ఆలోచనలకు చర్మం వంటిది భాష. సౌందర్యాన్ని చాలా భాగం చర్మం నిర్ణయిస్తుంది. ఆలోచనలను ఎంత అందంగా చెప్పామనే విషయాన్ని భాష నిర్ణయిస్తుంది. ప్రముఖ ఇంగ్లీష్ దిన పత్రిక 'ది గార్డియన్' పత్రికల విధులను అద్భుతంగా నిర్వచించింది. 'ది న్యూస్ పేపర్స్ ఫంక్షన్ ఈజ్ టు రెస్పెక్ట్ ది న్యూస్, ది ఇంగ్లీష్ లాంగ్వేజ్ అండ్ ది రీడర్. ఇందులో ఇంగ్లీష్ లాంగ్వేజ్ బదులు 'తెలుగు లాంగ్వేజ్' అని ప్రతిక్షేపించుకుంటే తెలుగు పత్రికలకు సరిపోతుంది. పత్రిక విధులను ఇంతకంటే క్లుప్తంగా, సూటిగా, హృదయానికి హత్తుకునే విధంగా చెప్పడం అసాధ్యం అనుకుంటాను. వార్తాపత్రికలలో పనిచేసే ప్రతి జర్నలిస్టుకూ ఈ వాక్య ప్రాతఃస్మరణీయం. 'మాటలలో అభివర్ణించి వ్యక్తం చేయలేని అనుభవాన్ని గుర్తు పెట్టుకోవడం కష్టం' అని అమెరికన్ కాలమిస్టు వాల్టర్ లిప్‌మన్ అన్న మాటలు కూడా అక్షరసత్యాలు. ఆలోచనలకు పదును పెట్టే భాష లేకపోతే చివరికి ఆలోచనలే అడుగున పడిపోతాయని ఆయనే చెప్పారు. లివ్‌మన్, జేమ్స్ రెస్టన్ వంటి కాలమిస్టులు విశ్వ విఖ్యాతులు కావడానికి వారి ఆలోచనలూ, విశ్లేషణ శక్తితో పాటు ఇంగ్లీషు భాషపైన వారికున్న పట్టు కూడా కారణం. భాషపైన అధికారం ఉండబట్టే ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఎడిటర్‌గా పని చేసిన ఫ్రాంక్ మొరే చేసిన కొన్ని ప్రయోగాలు చిరకాలం గుర్తుంటాయి. 'షీ ఈజ్ ది ఓన్లీ మ్యాన్ ఇన్ ది కేబినెట్' అని ఇంధిరాగాంధీ గురించీ, 'బోన్‌లెస్ వండర్' అని స్వతంత్ర పార్టీ గురించీ ఆయన చేసిన వ్యాఖ్యలు ఎన్నటికీ మరుపురావు. చలపతిరావు ప్రముఖుల గురించి రాసిన 'పెన్ పోట్రెయిట్'లూ, పోతన్ జోసెఫ్ రాసిన కాలమ్ 'ఓవర్ ఎ కప్ ఆఫ్ టీ' అంత ప్రసిద్ధం కావడానికి వారి భాషాధికారమే ముఖ్య కారణం. తెలుగులో నార్ల వెంకటేశ్వరరావు ముక్కు మీద గుద్దినట్టు రాయగలిగేవారు కనుకనే ఆయన రచనలు శక్తివంతంగా ఉండేవి.

**ప్రస్తుతం పత్రికల్లో భాషాపరమైన జాగ్రత్తలు లోపిస్తున్నాయనే విమర్శల పట్ల మీ అభిప్రాయం?**

ఆ మాట నిజమే. హడావిడి ఎక్కువయింది. ఏదైనా అనుమానం వస్తే నిఘంటువు చూడటం, అనుభవ జ్ఞులను అడగడం లేదు. అంత వ్యవధి లేదు. సబ్ ఎడిటరే వార్త కంపోజ్ చేయాలి. ప్రూఫ్ రీడ్ చేసుకోవాలి. పేజీ పెట్టుకోవాలి. కనుక యాంత్రికంగా మారుతున్నారు. సృజన తగ్గి పోతోంది. సరైన మాట వాడాలనే పట్టుదల తగ్గింది. చేతికి ఏది వస్తే అది రాస్తే సరిపోతుందనే ధోరణి పెరుగుతోంది. అందుకే ఇంగ్లీష్ మాటలు యథాతథంగా పత్రికలలో కనిపిస్తూ ఉంటాయి. ప్రతిభావంతులైన జర్నలిస్టులు ఇప్పుడు కూడా ఉన్నారు. కానీ పని పెరగడం, వ్యవధి లేకపోవడం వల్ల భాషా పరమైన జాగ్రత్తలు తీసుకోవడం లేదు. దుష్ట సమాసాలు సరే సరి. కనీసం కర్ణ కఠోరంగా లేకుండా ఉంటే ఏ సమాసమైనా నష్టం లేదని చేరా మాస్టారు చెప్పిన దాంతో ఏకీభవించినప్పటికీ కొన్ని సందర్భాలలో బాధ కలుగుతుంది. కనీస జాగ్రత్తలు తీసుకున్నా ప్రస్తుత పరిస్థితులలో, మారిన విధులను నిర్వహిస్తూ కూడా భాష విషయంలో మరింత బాధ్యతాయుతంగా వ్యవహరించవచ్చు. ఈ దిశగా ప్రమాణాలు పెంచడానికి ప్రతి పత్రికా సంస్థాగతంగానూ, ప్రెస్ అకాడెమీ, జర్నలిస్టు సంఘాల ద్వారానూ కృషి జరుగుతోంది. కానీ ఫలితాలు చెప్పుకోదగిన స్థాయిలో లేవు. శిబిరాలలో ఇచ్చిన శిక్షణను విలేకరులు ఎంతవరకూ ఇంకించుకుంటున్నారో, అది వారి రచనల్లో ఎంతవరకూ ప్రతి ఫలిస్తున్నదో తెలుసుకునే వ్యవస్థ లేదు. వృత్తి నైపుణ్యాన్ని పెంచుకోవాలన్న పట్టుదల ఉన్న విలేకరులకు మాత్రం ఈ శిక్షణ ఉపయోగపడుతోంది. భాషపైనే ఈ శిక్షణలో ప్రధానంగా బోధన జరుగుతుంది. సంపాదక విభాగంలో పని చేస్తున్న అనుభవజ్ఞులలో కూడా భాషపైన పట్టింపు తగ్గిపోవడం, వారి విధులు విస్తృతమై పనిభారం పెరగడం కూడా భాష విషయంలో రాజీ పడటానికి ముఖ్యమైన కారణాలు. ఇప్పుడు ప్రతి పెద్ద పత్రికా స్వయంగా జర్నలిజం బోధనా విభాగాన్ని ఏర్పాటు చేసుకుంటున్నది. అందులో కొత్తవారికి శిక్షణ ఇవ్వడంతో పాటు సంస్థలో పని చేస్తున్నవారికి కూడా పునశ్చరణ తరగతులు నిర్వహిస్తున్నారు. ఇటువంటి కార్యక్రమాలు మరింత లక్ష్యశుద్ధితో జరగాలి.

**సాహిత్యానికి ప్రత్యేకించి కవులుకూ, రచయితలకూ పత్రికలు ఎంతవరకూ ప్రోత్సాహం ఇస్తున్నాయి? కొన్ని పత్రికలు అసలు ఆ విషయమే పట్టించుకోకపోవడాన్ని ఎలా అర్థం చేసుకుంటారు?**

ఇప్పుడు కొంతవరకూ తగ్గింది కానీ లోగడ పత్రికలే సాహిత్య కారుల్నీ, సాహిత్యాన్నీ ఎక్కువగా సృష్టించాయి. భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఉదయం, ఆంధ్రభూమి దిన, వార పత్రికలు

సాహిత్యానికి పెద్దపీట వేశాయి. విశాలాంధ్ర, ప్రజాశక్తి ఈ విషయంలో ముందు పీటలో నిలి చాయి. ఇప్పుడు వార్త కూడా కవులకూ, రచయిత లకూ విశేష ప్రాధాన్యం ఇస్తున్నది. 'ఈనాడు' మాత్రం సాహిత్యానికి ఇవ్వవలసినంత ప్రాముఖ్యం ఇవ్వలేదు. గతంలో యువకులను ప్రోత్సహించే శీర్షికను వారు మొదలు పెట్టినా స్వల్పకాలమే దానిని కొనసాగించారు. సాహిత్యకారులు పత్రికలు కొనరనీ, సాహిత్యప్రియులు పాఠకులలో తక్కువనీ ఆ పత్రిక నిర్వాహకుల అభిప్రాయం కావచ్చు. కానీ సాహిత్యాన్ని ఆ పత్రిక సంపాదకమండలి పూర్తిగా వినియోగించుకుంటుంది. ప్రతి శీర్షికా అంత్యప్రాసలతో కవితాత్మకంగా ఉండేది ఈనాడులోనే. కన్యాశుల్కం నుంచి ఒక్క ముక్కయినా ఉటంకించకుండా వారి సంపాదకీయం పూర్తి కాదన్నా అతిశయోక్తి కాదు. అదే విధంగా ప్రముఖ సాహిత్యకారులు ఆ పత్రిక సంపాదక విభాగంలో ఏదో ఒక సమయంలో పని చేశారు. ఆ పత్రిక వైఖరిలో కూడా కొంత మార్పు వచ్చినట్టు కనిపిస్తోంది. సాహితీ ప్రముఖుల మరణవార్తను ఇప్పుడు ముందు పేజీలో వేస్తున్నారు. ఇటీవల విశ్వనాథ సత్యనారాయణ ఇరవై అయిదవ జయంతి సందర్భంగా మంచి వ్యాసం ప్రచురించారు. సాహిత్యం కోసం ప్రజలు పత్రికను కొనుగోలు చేస్తారన్న అభిప్రాయం కలగబట్టే ఈ పని చేస్తున్నారనుకుంటా. వ్యాపార కారణాల వల్లనైనా సాహిత్యానికి ప్రాధాన్యం ఇస్తే ఆహ్వానించదగిన పరిణామమే కదా.

**కొందరు కవులూ, రచయితలూ అనవసరంగా అహంకారం ప్రదర్శించడం, తమ రచనలే అత్యుత్తమ మైనవని భావించడం, ప్రచురణలో ఏ కారణం వల్లనైనా జాప్యం జరిగితే గొప్ప అన్యాయం జరిగినట్టూ, సమాజానికి తీవ్ర నష్టం జరిగినట్టూ, సంపాదకుడో, సంపాదక మండలి సభ్యులో తొక్కి పడుతున్నట్టూ ఆవేశపడి వాదించడం, అందుకు కులాన్నీ, మతాన్నీ ఆపాదించడం సర్వ సాధారణం.**

ఇక కవులూ, రచయితల విషయానికి వస్తే వారి వైఖరి కారణంగా కొంతమందికి వారు ఆశించిన ప్రాధాన్యం ఇతర పత్రికలలో కూడా లభించి ఉండకపోవచ్చు. ధిషణాహంకారం బహు కొద్దిమందికే అలంకారంగా భాసిస్తుంది. కొందరు కవులూ, రచయితలూ అనవసరంగా అహంకారం ప్రదర్శించడం, తమ రచనలే అత్యుత్తమ మైనవని భావించడం, ప్రచురణలో ఏ కారణం వల్లనైనా జాప్యం జరిగితే గొప్ప అన్యాయం జరిగినట్టూ, సమాజానికి తీవ్ర నష్టం జరిగినట్టూ, సంపాదకుడో, సంపాదక మండలి సభ్యులో తొక్కి పడుతున్నట్టూ ఆవేశపడి వాదించడం, అందుకు కులాన్నీ, మతాన్నీ ఆపాదించడం సర్వ సాధారణం. కవులు తమ వ్యక్తిగత కక్షలను పత్రిక ద్వారా సాధించాలని ప్రయత్నిస్తారు. అందుకు సహకరించని సంపాదకులను నిందిస్తారు. ఇది అన్ని భాషాపత్రికల్లోనూ ఉన్నది. తెలుగుకే పరిమితమైన తెగులు కాదు. ఇవన్నీ ఉన్నప్పటికీ కవులనూ, రచయితలనూ ఇతోధికంగా ప్రోత్సాహించాలన్నదే నా అభిప్రాయం.

**గడ ఉదయంలోనూ, ఇప్పుడు వార్తలోనూ మీరు సాహిత్యానికి ప్రత్యేక శ్రద్ధతో అవకాశం కల్పించడానికి కారణం? మీ అనుభవాలు?**

సాహిత్యం వ్యక్తికీ, సమాజానికీ సంస్కారం ప్రసాదిస్తుంది. మానవత్వం పెంచుతుంది. అవగాహన కలిగిస్తుంది. ఏ విషయంలోనైనా ఒక దృక్పథం ఏర్పరచుకునేందుకు దోహదం చేస్తుంది. గుండెలో తడి ఆరిపోకుండా చూస్తుంది. సమాజపు వేళ్ళతో సంబంధం తెగిపోకుండా ఉంచుతుంది. ప్రజల నాడిని పట్టిస్తుంది. ఒక విధంగా ఒక కవితా రచన సమాజ హృదయావిష్కారం లాంటిది. అలాగే ఏ రచన అయినా సమాజంలోని సమస్యలనూ, మానవ సంబంధాలనూ, కార్యకారణ సంబంధాన్నీ తెలియజేస్తుంది. సమాజంలోని సమిష్టి ఆలోచననూ ఆవేశాన్నీ, ఆవేదననూ సాహిత్యం ప్రతిబింబిస్తుంది. ఏమి జరిగినా ప్రభుత్వం కన్నా, మీడియా కన్నా కవి ముందుగా స్పందిస్తాడు. పత్రికలు చేసే పని సమాజానికి సమాజం గురించి తెలియజేయడమే కదా! ఈ కర్తవ్య నిర్వహణలో సాహిత్యానికి చాలా ముఖ్యమైన భూమిక. ఈ విశ్వాసం నాకు మొదటి నుంచీ ఉన్న కారణంగానే నేను పని చేసిన ప్రతి పత్రికలోనూ నా మాట చెల్లినంత వరకూ సాహిత్యానికి అగ్రతర ప్రాధాన్యం ఇచ్చాను. దీనివల్ల పత్రిక మరింత సజీవంగా, చైతన్యవంతంగా రూపొందుతుంది. పత్రిక పట్ల ప్రజలలో గౌరవంతో పాటు ఒకానొక ఆత్మీయానుబంధం పెరుగుతుంది. ప్రతి కవితా పాఠకుల హృదయ తంత్రులను మీటుతుంది. ఆవేశపర్చుతుంది. ఆవేదనకు గురి చేస్తుంది. దుఃఖం కలిగిస్తుంది. లాలిస్తుంది. బుజ్జగిస్తుంది. ఓదార్చుతుంది. ఉపదేశిస్తుంది. కర్తవ్యబోధ చేస్తుంది. చైతన్యవంతులను చేస్తుంది. కార్యోన్ముఖుల్ని చేస్తుంది. పాఠకులతో ప్రత్యేకానుబంధం ఏర్పాటు చేసుకోవడానికి సాహిత్యం తోడ్పడుతుంది. నా అనుభవంలో తీపీ, చేదూ రెండూ ఉన్నాయి. ముందు ప్రశ్నకు చెప్పిన సమాధానంలో రేఖామాత్రంగా ప్రస్తావించాను. అంతకన్నా వివరించడం అనవసరం అనుకుంటా.

**వార్త ప్రత్యేకించి ఆదివారం సంచిక సెమీ సాహిత్య సంచిక లాగా ఉందని అంటున్నారు. ఇందుకు మీ కృషి, దానికి ప్రతిస్పందనలు ఎలా ఉన్నాయి?**

నా కృషి సహజంగానే ఉంటుంది. అంతకంటే మా పూర్వ సంపాదకులు ఎబికె ప్రసాద్ పెట్టిన ఒరవడి కొనసాగించడానికి అభ్యంతరం చెప్పని యాజమాన్యం పాత్రను చెప్పుకోవాలి. ఆదివారం అనుబంధంలో పని చేస్తున్న గుడిపాటి, రమేష్‌బాబు, ఇతరులూ స్వయంగా కవులూ, రచయితలూ, సాహిత్య విమర్శకులూ కావడం వల్ల ఆదివారం సంచిక మీరన్నట్టు సెమీ సాహిత్యం సంచికలాగా రూపొందుతోంది. సెమీ సాహిత్యం సంచికగా రూపొందుతోందనే మీ అభిప్రాయాన్ని నేను అభినందనగా స్వీకరిస్తాను. వార్త ఆదివారం సంచికకు సాహితీలోకం స్పందన అద్భుతంగా ఉంది. సాహిత్యం జీవితంలో విడదీయరాని భాగం. పత్రికల్లోనూ, టీవీల్లోనూ, సినిమాల్లోనూ సాహిత్యాంశం ఉంది. ఒక పాట వినకుండా రోజు గడవదు. ఆ పాటలోని సాహిత్యం మనల్ని ఏదో రూపంలో ప్రభావితం

చేస్తుంది. కనుక సాహిత్యంతో ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా, అందరికీ ఎంతో కొంత సంబంధం ఉంటుంది. జీవితానికి సంబంధించిన విభిన్న అంశాల్లో పాఠకుల ఆలోచనా సరళిలో మార్పులు తీసుకు రావాలన్న తపన వల్లనే సాహిత్యానికి ప్రాధాన్యం ఇస్తున్నాం. వార్త ఆదివారం సంచికలో కథ, కవిత, సాహిత్య వ్యాసాల్లోనే కాకుండా ఇతర శీర్షికల్లోనూ సాహిత్యాంశాలు కనిపించడానికి ఇదే కారణం.

**వ్యక్తిగతంగా మీరు కవితలూ, నవలలు కూడా రాశారు. రచయితగా మీ అనుభవాలు ఏమిటి?**

అభివ్యక్తికి తగిన రూపాన్ని ఎన్నుకునే విషయంలో ఇదివరకు నాపైన ఉన్న పరిమితులు కొన్ని ఇటీవల దూరమైనాయి. ఆ పరిమితుల్లో చాలావరకూ నాకు నేనుగా విధించుకున్నవే. కారణాలు అప్రస్తుతం. కానీ కవిత, కథ రాయడానికి ఉన్న సంకోచాన్ని కొందరి ప్రోత్సాహం ఫలితంగా వదిలించుకోగలిగాను. ఇప్పుడు రాస్తున్నది ప్రధానంగా రాజకీయ కవిత్వం. అది కూడా ఏదైనా ఘటన జరిగి అది నన్ను కదిలించినప్పుడు, నాకు వీలైనప్పుడు రాస్తున్నాను. పది సంపాదకీయాలలో, డజను వ్యాసాలలో చెప్పలేని విషయాన్ని అంతకంటే బలంగా ఒక కవితలో చెప్పవచ్చు. పత్రికా రచయితగా పనిచేస్తూ నవల రాయడం అసాధ్యం. ఉదయంలో ఉండగా 'అమీబా' అనే నవల రాశాను. అది జర్నలిజం వృత్తిపైన వ్యంగ్య రచన. దాన్ని పూర్తి చేయకుండానే మధ్యలో ఆపు చెయవలసి వచ్చింది. ఇటీవల రాసింది 'కాలమేఘం' ఇది కూడా నాకు అందుబాటులో ఉన్న సమాచారాన్ని పాఠకులకు ఎట్లా తెలియజేయాలా అన్న తపనతో రాసిందే. సెప్టెంబర్ 11, 2001 నాటి ఘటనలూ, ఆ తర్వాత ఆఫ్ఘనిస్తాన్ పైన అమెరికా చేసిన దాడులూ ప్రపంచాన్ని ఒక కుదుపు కుదిపాయి. పత్రికలలో టీవీ ఛానళ్ళలో, ఇంటర్నెట్‌లో కుప్పతెప్పలుగా సమాచారం వచ్చి పడింది. దాన్ని ఉపయోగించి వ్యాసాలు రాస్తే పాఠకులు ఆసక్తిగా చదువుతారన్న నమ్మకం లేకపోయింది. అందుకే నవలా రూపంలోకి అందించాను. అందులో తొంభయ్ శాతం వాస్తవాలే. తక్కిన పదిశాతం నవలను పాఠకులతో చదివించడానికి ఉద్దేశించిన కథాక్రమానికి సంబంధించిన కల్పన. ఈ నవల వార్తలోనే డెయిలీ సీరియల్‌గా వేశాం కాబట్టి, ఏ రోజుకు ఆ రోజు రాసే వీలున్నది కాబట్టీ రాయగలిగాను కానీ ఇతరత్రా అసాధ్యం. ఈ రచనలు పాఠకులు లేదా విమర్శకులు ఎట్లా స్వీకరిస్తారనేది పూర్తిగా తెలియదు. ఒక ఎడిటర్‌గా ఉన్నాను కనుక మొహమాటానికి బాగుందని చెప్పేవాళ్ళు చాలామంది ఉంటారు. ఇతరుల స్పందన నాకు ముఖ్యం కూడా కాదు. నాకు సంతృప్తి కలిగే రచనలే చేస్తాను. నేను చెప్పగలిగింది స్పష్టంగా, బలంగా చెప్పగలిగానా లేదా అన్నదే నాకు నేను వేసుకునే ప్రశ్న. ఇప్పుడు కవిగానో, నవలా రచయితగానో కొత్తగా ఎస్టాబ్లిష్ కావాలన్న కోర్కె లేదు. నేను ఏమి రాసినా అది జర్నలిజానికి అనుబంధంగానో, దోహదకారిగానో ఉంటుంది. నేను ప్రధానంగా జర్నలిస్టునే అని చెప్పడం ఉద్దేశం.


> **నేను చెప్పగలిగింది స్పష్టంగా, బలంగా చెప్పగలిగానా లేదా అన్నదే నాకు నేను వేసుకునే ప్రశ్న. ఇప్పుడు కవిగానో, నవలా రచయితగానో కొత్తగా ఎస్టాబ్లిష్ కావాలన్న కోర్కె లేదు. నేను ఏమి రాసినా అది జర్నలిజానికి అనుబంధంగానో, దోహదకారిగానో ఉంటుంది.**


**ఇప్పటి సాహిత్యం దృశ్యం పైన మీ అభిప్రాయాలు?**

ఏ భాషా సాహిత్యమైనా సజీవ స్రవంతి లాంటిది. తెలుగు సాహిత్య ప్రపంచం కూడా అంతే. నిత్య నూతనంగా ఉండటం దాని స్వభావం. అర్థవంతమైన చర్చలతో ముందుకు పోవడం మన సాహిత్యంలో కనిపిస్తుంది. తొంభయ్‌ల నుంచి తెలుగు సాహిత్య ప్రపంచంలో కొన్ని మార్పులు చోటు చేసుకున్నాయి. కొన్ని వాదాలు బయలు దేరాయి. స్త్రీ, దళిత మైనారిటీ వాదాలు మన సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. ఇప్పటికీ ఈ వాదాలు ఏదో ఒక స్థాయిలో కొనసాగుతున్నాయి. అంతమాత్రాన రచయితలంతా ఈ వాదాల పరిధిలోనే గుడిగుడిగుంచం ఆడుతున్నారని కాదు. ప్రపంచీకరణ, ఆర్థిక సంస్కరణలు, ప్రైవేటీకరణ వంటి ఆర్థిక విధానాల కారణంగా వివిధ రంగాల్లో నెలకొంటున్న పరిణామాలనూ, ప్రజల జీవితాలపైన అవి చూపుతున్న ప్రభావాలనూ సాహిత్యకారులు పట్టించుకున్నారు. 'గ్లోబల్ ఖడ్గం' పైన ఇటీవల విస్తృత చర్చ జరగడానికి కారణం అదే. ఇదే సమయంలో ప్రాంతీయ స్పృహ పెరిగి బలపడుతోంది. తెలంగాణా అస్తిత్వాన్ని చాటే రచనలు సాహిత్యాన్ని సంపన్నవంతం చేస్తున్నాయి. రాయలసీమ, ఉత్తరాంధ్ర నుంచి కూడా సాహిత్యం వెల్లువగా వస్తోంది. ప్రపంచీకరణ పరిణామాల పైన మంచి కథలు చాలా వచ్చాయి. కవులూ, కథా రచయితలూ ప్రపంచాన్ని పట్టించుకుంటూ, సమాజంలో సంభవిస్తున్న మార్పుల్ని ఎప్పటికప్పుడు అధ్యయనం చేస్తూ వాటికి అద్దం పడుతున్నారు. వెంటనే స్పందిస్తున్నారు. నవలా రచన మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా ఉంది. ముఖ్యంగా గత మూడు దశాబ్దాలుగా మనిషి జీవితంలో వచ్చిన పరిణామాలను నమోదు చేసిన నవలలు బొత్తిగా లేకపోలేదు కానీ బహు తక్కువ. ఈ లోపాల్ని నవలా రచయితలు పూరిస్తారని ఆశ. కొన్నేళ్ళ క్రితం విభిన్న ప్రాంతాల నుంచి లిటరరీ బులెటిన్స్ వస్తుండేవి. అదే విధంగా కొందరు వ్యక్తులు, కొన్ని పత్రికల చొరవ ఫలితంగా ప్రత్యేక సాహిత్య సంచికలు ఇప్పుడు వస్తున్నాయి. ప్రజాశక్తి సంస్థ తరపున ఇటీవల జరిగిన జనకవనం ఈ దిశగా స్వాగతించవలసిన మంచి ప్రయోగం. ఇటువంటి ప్రయోగాలూ, ప్రత్యేక సంచికలూ సమ కాలీన సాహిత్య దృశ్యాల్ని బలంగా ప్రతిఫలిస్తున్నాయి.

**యువ రచయితలూ, పాఠకులకు సూచనలు....**

కవి ఒకరి సలహాలు పాటిస్తాడని నేను అనుకోను. ఒకరికి సలహాలు చెప్పే అర్హత నాకుందని కూడా అనుకోవడం లేదు. సృజనపైన ఆసక్తి ఉన్నవారే ఈ రంగంలోకి వస్తారు. అధ్యయనం జీవితంలో భాగమైన వారే రాణిస్తారు. పది కవితలు రాసి పేరు

కొట్టేయాలన్న తాపత్రయం ఉన్నవాళ్ళు దెబ్బతింటారు. కీర్తి కండూతి సృజనకు శత్రువు. అస్తిత్వ సమస్యను కొని తెచ్చుకోవద్దు. సాహిత్య రాజకీయాలు తాత్కాలికం. దూరంగా ఉండండి. సాహిత్య సృజనే శాశ్వతం.

**అ** **ధ్యయనంలో బాగా ఉపయోగపడిన పుస్తకాలు?**

నేను జర్నలిస్టును కాబట్టి అనేక రకాల పుస్తకాలు చదువుతాను. నిజానికి జర్నలిజంలో బాధ్యతలు పెరిగిన తర్వాత పుస్తకాలు చదవడం బాగా తగ్గిపోయింది. పత్రికారంగంలో ప్రవేశానికి పూర్వమే ఎక్కువ చదివాను. చిత్రం ఏమిటంటే నేను గతి తార్కిక భౌతికవాదం, మావో ఆలోచనా విధానం, మార్క్స్, ఎంగెల్స్ రచనలు ఎంతగా చదివి వంటి బట్టించుకున్నానో అంతే ఇష్టంగా అయాన్ ల్యాండ్ రాసిన 'అట్లాస్ ష్రగ్గడ్', 'ది ఫౌంటెన్ హెడ్' చదివి ఇంకించుకున్నాను. బహుశా నాలో నాకే నిత్యం కనిపించే ద్వైదీ భావానికి ఇది నిదర్శనం కావచ్చు. సామూహిక కార్యాచరణ, సమసమాజం, సామ్యవాదం ఎంత బలంగా కోరుకుంటానో అంతే బలంగా వ్యక్తి స్వేచ్ఛ, ప్రజాస్వామ్య విలువలూ ఉండాలని ఆకాంక్ష. వీటికి తోడు గాంధేయవాదంలో విశ్వాసం. గాంధీ ఆత్మకథ 'మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్' నన్ను విపరీతంగా ప్రభావితం చేసింది. వ్యక్తిగత బలహీనతల గురించి అంత నిజాయితీగా రాయడం అబ్బురమనిపించింది. ఆయన సరళమైన, అందమైన ఇంగ్లీషును అనుసరించాలనే ప్రయత్నం అప్పుడే ఆరంభమైంది. అవే సూత్రాలను తెలుగులో సైతం పాటించాలనే ప్రయత్నం పత్రికారంగంలో ప్రవేశించిన తర్వాత మొదలయింది. ఈ ప్రయత్నం అనంతమైనది. ఇప్పటికీ కొనసాగుతోంది. ఎప్పటికీ సాగుతూనే ఉంటుంది. చార్లెస్ డికెన్స్, ఉడ్‌హౌస్‌ల ప్రభావం కూడా నా పైన ఉంది. వాస్తవానికి చదివిన ప్రతి పుస్తకం ఏదో ఒక రూపంలో పాఠకుడిని ప్రభావితం చేస్తుంది. కానీ ప్రగాఢమైన ముద్రను వేసిన పుస్తకాలు మాత్రం పైన పేర్కొన్నవే.

**ప** **త్రికలలో శీర్షికలూ, కథనాలూ కవితాత్మకంగా ఉండటాన్ని హర్షిస్తారా? లేక వ్యవహార సరళి ఉండాలంటారా?**

పత్రికలలో శీర్షికలని గవాక్షాలు (విండోస్ ఆఫ్ ది న్యూస్ పేపర్) అంటాం. పాఠకులను ఆకర్షించడం శీర్షికల ప్రధాన ఉద్దేశం. కవితాత్మకంగా ఉంటేనే బాగుంటుంది. కానీ కవిత్వం పాళ్ళు ఎక్కువై అర్థం కాకుండా వ్యర్థమై పోకూడదు. అలాగని మరీ సరళంగా పొడి పొడిగా డీలాగా ఉండకూడదు,. వార్త లేదా వ్యాసంలోని విషయం సూచన ప్రాయంగా తెలిపే విధంగా కవితాత్మకంగా ఉండాలి శీర్షిక. కొన్ని శీర్షికలను ఎప్పటికీ మరచిపోలేము. తెలుగుదేశం పార్టీ ఆవిర్భవించినప్పుడూ, మొదటిసారి ఎన్నికలలో గెలిచినప్పుడూ, అంజయ్య మరణించినప్పుడూ కొన్ని పత్రికలు ఇచ్చిన శీర్షికలు చాలామంది జర్నలిస్టులకు ఇప్పటికీ గుర్తుంటాయి. ఎందుకంటే అవి భావస్ఫోరకంగా, సులభగ్రాహ్యంగా, కవితాత్మకంగా ఉండాలి. అప్పుడే పాఠకులు ఆకర్షితులవుతారు. చంద్రుడిపైన అమెరికా రోదసీ యాత్రికుడు నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అడుగు పెట్టినప్పుడు ఆంధ్రప్రభలో బెల్లంకొండ రామదాసు రాసిన వార్తాంశాల్నీ, శీర్షికనీ ఇప్పటికి కొంతమంది చెప్పుకుంటారు. విషయం జటిలం కాకుండా సులభగ్రాహ్యంగా ఉంటూనే కవితాత్మకంగా చెప్పగలిగితే అది మంచి రచన. 'సే విత్ ఫ్లవర్స్' అన్నది పత్రికా రచయితలకు కూడా వర్తిస్తుంది. కానీ ఈ క్రమంలో వాస్తవాలకూ, కచ్చితత్వానికీ, అర్థానికీ, అభివ్యక్తికీ ఏ రకంగానూ భంగం కలగకూడదు.

- వావిళ్ళ రామశాస్త్రి వారి సోదరుల మామగారైన వెంకటాచల శాస్త్రితో కలసి 'వివేకరత్నాకర ముద్రాక్షరశాల' అనే పేరుతో ఒక ముద్రణాలయాన్ని స్థాపించి గ్రంథ ముద్రణ సాగించారు. కాని అది చక్కగా సాగలేదు. నిరుత్సాహ పడక స్వయంగా ఒక ముద్రాక్షర శాలను స్థాపించేందుకు యత్నించి, ధనవంతులైన కొందరు మిత్రుల వద్ద రుణం తీసుకొని 'హిందూ భాషా సంజీవిని' అనే ముద్రాక్షరశాలను స్థాపించారు. వీరు, వీరి అన్నగారు అనంత నారాయణ శాస్త్రి గారికి మైసూరులోని ఒక సంస్కృత పాఠశాలలో ఉపాధ్యాయుని పదవి లభించటంతో మైసూరు వెళ్ళారు. దానితో ఒంటరి అయిన రామశాస్త్రికి ఆప్తమిత్రులు, సరస్వతి తిరువెంకటాచార్యులు గారు మద్రాసు వదిలి నెల్లూరు వెళ్ళడంతో ఆగిపోయింది.
  ఎన్ని ఇబ్బందులెదురయినా వెనుకంజవేయని రామశాస్త్రి గారు మద్రాసు తండియార్పేటలోని తమ ఇంటిలోనే, 'ఆది సరస్వతి ముద్రాక్షరశాల'ను స్థాపించి గ్రంథముద్రణ కొనసాగించారు. అప్పటి నుండి వీరు బ్రతికినంత కాలం ముద్రణా కార్యక్రమం అక్కడ కొనసాగించారు. వీరి మొదటి ప్రచురణ 1854లో వెలువడింది. అప్పటి నుండి 40 సంవత్సరాల వరకు అవిచ్ఛిన్నంగా వారు ముద్రాపకులుగ, గ్రంథ ప్రచురణ కర్తగా, గ్రంథ సంపాదకులుగ పని చేస్తూ తమ ఆశయాన్ని నెరవేర్చుకున్నారు.

కవిత

ఆలి

# జోడెకి రఖం

సంతలో మూగ జీవాలు
ఇంటిలో ఆడ బతుకులు
ఛీ... ఛీ...లు, చీదరింపులు తప్ప...
మాట నోరు దాటితే ఖబర్దార్.
గులాబి రేకుల దేహం మీద
ముళ్ళై గుచ్చుకుంటుంది
అడవితనం.

షాది సంతలో...
తోడేలు చర్మం మీద
చమ్కీల మెరుపులు
రిశ్తేదారల నీలినీడలు
హైటెక్కు కులుకుల షాదిలో
దండుగ మారి వీడియో గ్రాఫిక్స్

నిఖా ముసుగులో షరియత్‌ను కప్పేసి
జోడెడికి రఖం... లేన్‌దేన్ కోసం
అంగలార్చడమే తప్ప...
మహెర్ నగదుగా దేనా
నహీఁ జాన్త క్యా?!

సర్కారు నౌకరుంటే చాలు
నిలువ నీడైనా సరే
ముష్ఠి రేటు కమ్మేసి
మాలులో కట్టిన జోడెడికి రఖం
ముట్ట చెప్పవలసిందేనా?
ఎన్నాళ్ళీ ఘోరాలు... నేరాలు?



ముక్క చెక్కలైన నా మనసును చూసి
పగుల బడినవ్వు కుంటుంది
సీలకు తగిలిన షరియత్.

షర్బత్ మధురంగా
వుండాలే జిందగి
షరాబి నౌకలో దిగజారిపోతుంది
నిజామాబాదు నజ్మా కళ్ళల్లో
సుర్మా బదులు, తేజాబ్ కుక్కినోళ్ళకు
నుప్పు తల్వార్‌పై లేవనంత కాలం
కుళ్ళిన గడ్డాలు పాడుస్తూనే వుంటాయి.

బొట్లు బొట్లుగా కారుతున్నది
నా ఎర్రని రక్తం చుక్కలు కాదు
ముక్కలు ముక్కలుగా తెగి పడుతున్న
నా షరాఫత్.

నా నెత్తిమీద మొలచిన
తెల్లని దారాల సాక్షిగా
ఇప్పుడు...
నీ హృదయాంతరాలలో ప్రవహిస్తున్నది.
షరియత్ రసం కాదు
చలి చీమలు పెన వేసకున్న షర్బత్.

జోడెకి రఖం = వరకట్నం, దురాచారానికి
బలౌతున్న ఎందరో నా బహెన్లకు అంకితం.

కేతు విశ్వనాథరెడ్డి




# విరూపం

ఇది వార్తో, వార్తా వ్యాఖ్యాతో, వార్తా కథనమో, భేటీయో, ముఖాముఖియో మరేదో చదివిన వెంటనే నా ఊకు అందటం లేదు. ఈ పత్రం రాయగలిగిన గ్రామీణ విలేకరి మా పత్రికకు ఉన్నాడా? అని ఆశ్చర్యపడ్డాను. రచన నిడివే ఎక్కువ. నిర్మాణమూ కొత్తదే. రచనలో వాడిన రెండు రకాలైన శైలుల్లో ఒకటి పత్రికా బాషకు సరిపడేది. మరొకటి పత్రికా భాషలో పూర్తిగా ఇమడదంది. ఇలాంటి రచనను ప్రచురించాలో ప్రచురించకుండా చంపాలో, ప్రధాన పత్రికలో వచ్చేందుకు హైదరాబాదుకు పంపాలో తోచటం లేదు.

వచ్చి పడిపోతున్న వార్తల కూర్పు పని ఒత్తిడిలో సతమతమవుతున్నాను. అంత ఇబ్బందిలో కూడా మా గ్రామీణ వివేకం పంపిన రచనను మళ్ళీ ఒకమారు చదివి నిర్ణయం తీసుకోవాలనుకున్నాను - ప్రాంతీయ కేంద్ర బాధ్యుడిగా - కంప్యూటరు తెరమీదే మొదటినుంచీ చదవటం మొదలు పెట్టాను.

'నీరూ - పైరూ'

తిప్పలూరు, ఏప్రిల్1. అది స్వర్ణాంధ్రప్రదేశ్‌లో ఒక చిన్న పల్లె. మజరా గ్రామం. పేరుకు వేపమాన్ల పల్లె. ఒకప్పుడు వందలాది వేపచెట్లుండే వనాలు గ్రామ నెత్తంలో ఉండేవని స్థానికులు చెప్పారు. ఇప్పుడు ఊరి పేరులో ఏదో ఉందనే దానికి గుర్తుగా ఊళ్ళో ఏ వేపచెట్టూ మిగలలేదు. ఒకప్పటి చీనీ తోటలూ లేవు. మూడు మట్లకు పైగా నీళ్ళతో కలకలలాడిన బావులూ లేవు. ఆ బావుల కింద తోటల్లో ఒకప్పుడు కనిపించిన చిలకపచ్చదనమూ లేదు. పూటిన బావులూ, ఎండి పోతున్న బోర్లూ మాత్రమే కన్పిస్తాయి. మెట్టచేల గట్ల మీద ఒకప్పుడున్న తుమ్మ, రేగ, కానుగ చెట్లు ఇప్పుడు కలికానికి కూడా కన్పించవు. ఇప్పుడా పల్లె సిమెంటు ధూళి ధూసరావృతమైన పర్యావరణ సీమ; నింగి కెగిరి నేల తాకి పల్లె ప్రజల నాసికాపుటాల ద్వారా ఊపిరితిత్తుల్ని చుట్టుకుంటున్న సిమెంటు గాలి దుమ్ము క్షేత్రం. ఈ జన్మభూమి, సిమెంటు కర్మాగారాలు లీలా విలాస కేళికి నర్తనశాల. ఈ కర్మభూమి, అన్నదాతలు ఫ్యాక్టర్ కార్మికులుగా మారిపోయిన అభివృద్ధి హేళకు రంగమండపం. ఫ్యాక్టరీకి వెళ్ళని సమయాల్లో, పల్లెలో ఇళ్ళ దగ్గరే ఉండిపోయిన పెద్దా చిన్నా, ముసలీ ముతడా, మహిళల లోతులో, నిరుద్యోగ రైతు కూలీల తోడ్పాటుతో అమ్ముకున్నవి పోగా మిగిలిన పొలాల్లో పంట కోసం కార్మిక రైతులు చేస్తున్న జయమెరుగని

పోరాట భూమి ఇది!"

ఉప్పర గురప్ప కథనం ప్రకారం :

'మా ఊరు నుంచా? దాపుదాపు నలభై మంది ఫ్యాక్టరీకి పోతా ఉండాం అన్నా!' పల్లెలో ఉండేదా - యాభై ఇండ్లు. ఈ కులమని ఆ కులమని లేదు. మొత్తం అందరం పోతా ఉన్నట్లే. పెద్ద కులం లేదు. చిన్న కులం లేదు. అంతా ఒక దారే... ఆ భూమి ఉండే రైతు కుటుంబాలు ఆ దారే; లేని కుటుంబాలూ ఆ దారే. నలభై ఎకరాలుండే కాపోల్ల పిలోడూ వస్తా ఉంటాడు - ముప్పయి ఎకరాలుండే కమ్మోళ్ళ పిల్లోడూ ఉండాడు. అట్లాగే పదైదెకరాల గొల్లోల్లూ, ఆఖరికి రెండు కాలాల్లోనూ ఫ్యాక్టరీ పనికి వస్తుంటారు. భూమి లేని కొదమోల్ల సంగతా? వాల్లూ ఉండరన్నా. రెండిండ్ల మంగలోల్లు, మాదిండ్ల వడ్డోల్లు, ఒకంటి భట్రోజోళ్ళు, ఒక నాలుగిండ్ల బోమోళ్ళు ఒక సాయిబుల ఇంటినుంచి వస్తుండారు. మర్చిపోయినా బోమోల్లకు భూమి ఉంది.

నాకా? ఆరెకరాలుంది ఏం లాభంలే అన్నా. ఇప్పుడే మూడేండ్లయింది. విత్తనాలకూ, పెట్టుబడికీ - అదే సేద్దెం. దుక్కి దున్నడానికీ... దుక్కికి పన్నటా యాభై. పాసిందానికి ఇన్నూటా యాభై. నాలుగు మాడెలు ఫాస్పేటు పదార్నూర్లు. కలుపులకూ దానికీ పంతొమ్మిద నూర్లు - విత్తనాలకు పద్నూర్లు. లెక్కేసుకో అన్నా. చిల్లర మల్లర ఖర్చులు కలుపుకొని యాడాదికి తొమ్మిదివేలు. మూడేండ్లకు ఎంతయింది? ఇరవై ఏడువేలు - ఏం పంట వేసినానో చెప్పలేదు. కుసుమలు - నల్ల కుసుమలు - పొద్దు తిరుగుడు అంటా ఉన్నా? సన్‌ప్లవర్ అంటూ ఉన్నా అన్నా... తలకాయ తిరిగేటట్లు - అయిదు నూర్లా నలభై రూపాయలొచ్చింది - ఒక కింటాలు కూడా రాలేదు. నలభై కేజీల కన్నా!

ఎందుకింత అద్మానమా? వర్షం రాకనే. జొన్నో గిన్నో వేసుకుండ ఇన్ని తిండి గింజలున్నా దక్కేవి అంటావా? బాగా చెప్తావన్నా! స్టోరు బియ్యం వచ్చినాక జొన్న ఎవడు తింటాడు? నువ్వు తింటున్నావా? వాటిన నానబెట్టాల. దంచి పొట్టు దియ్యాల. ఎండ బెట్టాలా? నూకలు విసరాల. ఎసుట్ల పొయ్యాల. గెలకాల. బండమీద ముద్దలు చెయ్యాల. ఎంత పని? ఒక తట్టు నేను ఫ్యాక్టరీకి పోతానా? నా పెండ్లాం కూలికి పోవాల్నా. బోరింగు కాడనుండి నీళ్ళు మోసుకుని తెచ్చుకోవాల్నా? ఇంటి పనులన్ని చూసుకోవాల్నా? ముగ్గురు కొడుకులు బడికి పోవాల్నా మా అమ్మా నాన్నా లేకపోయిరి. నేను ఫ్యాక్టరీ పనికి గ్యాప్ వచ్చినప్పుడల్లా పొలం పనులు చూసుకోవాలా? జొన్న సంగటి ఎక్కడవుతుందన్నా? కొర్రల సంగటి అంతే. నీకు తెలీందేముంది? తిండ పంటల కంటే డబ్బు పంటలే మేలనే కదా కుసుములో, పత్తినో వేసేది. డబ్బుంటే ఏవైనా కొనుక్కోవచ్చు. ఏమంటావు?

నా భార్యా? ఇంటి దగ్గరే ఉంటాది. ఏదన్నా పనికి పోతాంది. మిగతా ఇండ్లల్లో ఆడోళ్ళ సంగతంటారా? ఫ్యాక్టరీకి నలుగురైదుగురు ఆడోల్లు వస్తుండారు. పిల్లి రామయ్య కూతురు మొగుడు పోయి పుట్టింటికి చేరిన కుంటి సుబ్బయ్య కూతురు, మంగలోల్లామె బుడన్ సాయిబు పెండ్లాం - బూబమ్మ - ఆ పర్దా ముసుగు తీసి వస్తాంది. ముసుగులో ఏంది ఉందన్నా? అంతా బతకడంలో ఉంది. బూబమ్మ దేవత అనుకో - బీబీ నాంచారి పెద్ద రైతుల కుటుంబాల ఆడబిడ్డ ఎవరూ రావడం లేదు.

ఫ్యాక్టరీలో ఆడోళ్ళు చేసే పని 'ఎందుకంటావా?' సిమెంటు పొతరు కింద పోతాదే, దాన్ని ఊడ్చి మిషన్లో పోసే పని. ఏందో పిల్లేజి ఎల్పర్లు అంటారే వాళ్ళను - ఆ పని. కూలి సంగతా? మొగోళ్ళ కంటే తక్కువేలే. పని లేనప్పుడు వీళ్ళు కూడా పొలం పనులకు పోతారు - ఇంటి పనులూ అవీ చూసుకొని. వాళ్ళకే పని ఎక్కువంటారా? అవున్లే... పిల్లల్ని చూసుకోవాల. వండాల. మాజేజి, మాయమ్మ నా పెండ్లా కంటే ఎక్కువ పని చేసేవాళ్ళు. 'ఏందో అది అంతేనన్నా'!

మొగోళ్ళు చేసే పనా? లోడింగు. కష్టమైందే. నెలకు ఎంతిస్తారంటావా? నెలంతా పనిచేస్తే - అంటే కనీసం ఇరవై అయిదు రోజులన్నా పని ఉంటే పదైదు నూర్లు వస్తాది - ఖర్చులు పోను. టిఫినుకు ఆర్రూపాయలు. అన్నం పది.. మాకు ఫ్యాక్టరీ క్యాంటీను ఇవ్వరు. దినకూలీ వాళ్ళం కదా? టన్నేజి మీద మా కూలి పడుతుంది. మేమేం చదివినోళ్ళం కాకపోతిమి. ఈ పల్లెలో ఒక సెంటు పొలాన్ని కూడా ఫ్యాక్టరీ తీసుకోలేదు. ఇక్కడా దరిద్రమే. ఈ పల్లె పొలాల కింద ఏ రాయూ లేదంట - పనికి రాని మొరం తప్ప. అందుకే నన్నా చెప్పేది - మేమంతా లేబరు - కరెంటు పనోళ్ళు, పిట్టర్లు, వెల్డర్లు కాదు. లోడింగోల్లం.

ఈ ఫ్యాక్టరీ వల్ల మంచి జరిగిందా? చెడ్డ జరిగిందా? అంటావా?

జరిగినోల్లకు జరుగుతూనే ఉంది. జరగనోల్లకు జరగడం లేదు. ఎక్కువ పొలముండే వాల్లుండారా? వాల్లకు అంతో ఇంతో పండుతుందా? ఫ్యాక్టరీకి కూడా పోతా ఉండారా? ఒకరో ఇద్దరో అట్లా మిగిలించుకుంటూ ఉండారు. ఫ్యాక్టరీకి రావడానికి ఒకరిద్దరు మోటారు సైకిళ్ళు కొనుక్కున్నారు. టి.వి.లు కొనుక్కున్నారు. కొంతమందికి సైకిల్లుండాయి. కొంతమంది ఆటోల్లో వచ్చి పోతాఉండారు - రాను పోనూ నాలుగు రూపాయలిచ్చి ఇంకా కొంతమందీ, ఆడోల్లు నడిచే వస్తాండారు. ఇదే మంచి అనుకో. కర్చులు పెరిగినాయా? జల్సాలు పెరిగినాయా? గుడ్డా గురుసా మారిందా? నాలోంటోల్లం కొందరం సంచుల్లో సారా తాగడం మానేసి రమ్ము తాగుతూ ఉండామా? - రోజూ కాదనుకో. వారానికి ఒక మారాన్నా మాంసం తెచ్చుకోవాలా? చపాతీలో పూరీలో చేసుకోవాలా? ఇది మంచో చెడ్డో నాబోటిబాడికి తెల్దు. బతుకు మాత్రం మారింది. యాపారాలు చేసేవాల్లు మాత్తరం మా కంటే బాగుండారు. మేము పొలాన్ని వదులుకోలేము. ఫ్యాక్టరీ పనినీ వదులుకోలేము. ఏది పోయినా, ఎట్లా బతుకుతామో తెల్దు. నువ్వే చెప్పు.

తాగడం తప్పో కాదే నాకు తెల్దు. మా నాయన సారానే కాచేవాడు.



**మేము పొలాన్ని వదులుకోలేము. ఫ్యాక్టరీ పనినీ వదులుకోలేము. ఏది పోయినా, ఎట్లా బతుకుతామో**

అమ్మేవాడు. తాగేవాడు. నా సంగతి చెప్తా. షిఫ్టు నుంచి బయట పడతానా? ముక్కులోకి దొమ్మల్లోకి ఏం పోతాందో తెల్దు. ఒంటిమీద ఎంత దుమ్ము అంటుకుందో తెల్దు. ఏం జరుగుతాదో యాడ పట్టించుకుంటాం? నిండా మునిగినాక చలేముందన్నా? ఇంటి కొచ్చాక ఇన్ని వేన్నీల్లు పైన పోసుకునేది - ఇంత గొంతులోకి రాత్రిపూట రమ్మో, సారాయో పోసుకునేతది. ఇంత కడుపులోకి తినేది... పగలైతే డూటీ లేకపోతే మల్లా పొలం పని ఏదో ఒకటి ఉంటేనే ఉంటుంది. చెమటలు కార్చుకోవడం తప్పదన్నా!

మా ఆరోగ్యమన్నా ఫ్యాక్టరీ మేనేజ్‌మెంట్ చూస్తాదా అని అడుగుతుండావా? రెగులరు ఎంప్లాయిలకు మాదిరి మమ్మల్నీ చూడాలని కొట్లాడతా ఉండాం. వాల్లకిచ్చే సవుకర్యాలు మా కివ్వాలా వద్దా? జీతం సంగతి కాదు నేనవి - మిగతావి.

ఇదంతా సరేనన్నా! ఫ్యాక్టరీలో కొత్త సామాన్లు వేస్తే మాకు ఇంకా బాగుంటుంది. ముప్పయి రోజులు పని దొరుకుతుంది. పట్టుకునేది పోనూ రెండువేలా ఇన్నూరు దాకా గిట్టుతుంది. ఇప్పుడా? చెప్పినా గదా అన్నా? మూన్నాల్ల కొకమారి నిలబెడ్తారు. ఈ నెలల్లోనే మూడు మాట్లు సట్‌డవును. పనిలేక పోతేనా? ఏముంది? వారం గానీ, పది దినాలు గానీ బయట ఉండాల్సిందే - ఇంటి కాడే. పని చేచ్చేనే డబ్బులొచ్చేది. ఆఁ యూనియన్లుండాయి, గలాటాలు పోయినాయి. యూనియన్లు చేసేకాడికి చేస్తుండాయి. మేనేజ్‌మెంట్ చెయ్యాల గద! కొత్త సామాను వస్తుండాయి. ఇదో బిగిచ్చాం అంటారు. కొన్నేమో రావడం - బిగిచ్చడం అన్నీ మార్చరు. ఒక్కమాటు ఇదిట్లాగే... చట్టిలో కూడు, చట్టిలో ఉండాల, పిల్లలేమో బలంగా ఉండాలా అంటే ఎట్లా కుదురుతుంది? ఫ్యాక్టరీ నడిస్తేనే టన్నేజి పెరుగుతుంది. టన్నేజి పెరిగిపోతే మాకు లాబం.

మా కంటే వాల్లకే బాగా లాబం గదా? అంటుండావా? వాళ్ళు తింటే తిననీ మాకు ముప్పయి దినాలు పని దొరికితే చాలు. గవర్నమెంటు అన్నిట్నీ అయిన కాటికి ప్రైవేటోల్లకు తెగ నమ్ముతావుందట! ప్రైవేటోల్లు లాబం చూసుకోకుండా ఏదన్నా కొనుక్కుంటారా? నడుపుతారా? గవర్నమెంటు పాలసీ అది. ఈ ఫ్యాక్టరీలోల్ల పాలసీ ఇది. 'ఏం చెయ్యాల చెప్పు - చేతుల కష్టం అమ్ముకోక? అయినా ఈ ఫ్యాక్టరీని మద్రాసు బాపనోల్లు తీసుకున్నాక కొసింత మేలేలే - గలాటా లన్నీ తగ్గినాయి. ఎట్లనా? ఎందుకా? ఎక్కడ పడేసేది అక్కడ పడుండాది. యాడ పట్టుకునే వాల్లను ఆడ పట్టుకుంటూ ఉండారు.

ఫ్యాక్టరీ వల్ల పైర్లు దెబ్బతినలేదంటావా? పసుపచ్చటి చందమామ మాదిరుండే కుసుమ పువ్వుల మీద బూడిదరంగు సిమెంటు చూల్లేదా అంటావా? అన్నా! అన్నీ మీ కండ్లతోనే చూచ్చానే ఉండాం - కనిపించిన వారికి చూసి ఏం చెయ్యాల? ఇది మంచో చెడ్డో మాకు తెల్దు. అటికీ మా యూనియన్లు వాల్లు అడిగిచ్చినారు - ఎవర్తోనో. టి.వి.లో కూడా వచ్చిందట. నేను చూల్లేదు. ఆ దుమ్ము సంగతి పోనీ - పండేది బాగా పండేనా - పండి చస్తే బాగుండు. పొంత లోంచి పొయ్యి లోకి పడినట్లయింది ఈ బతుకు.

చూడన్నా! మా అబ్బతరం, మా నాయన తరం సంగతి అడిగినావు. మా అబ్బది ఉప్పరి పని. పైగా గానుగాడేవాడు. ఎక్కువగా ఆముదాలు, నువ్వులు, ఎప్పుడన్నా సెనగ్గాయల పప్పు. ఒక గానుగ, ఒక కుంటి ఎద్దూ, మా అబ్బా, జాజి, ఈ ఆరెకరాలూ మా అబ్బ కొనిందే. రాళ్లూరప్పల పొలం. మా నాయన, ఆ తర్వాత నేనూ బాగు చేసుకున్నాం ఇంటిల్లిపాదితో కలిసి. మా నాయన సేద్యానికుండేవాడు. గానిగ మూలబడింది. మా నాయన తరానికే గాని గాడించుకునేది పోయింది. నాకు ఇదిగో ఈ ఫ్యాక్టరీ పని దొరికి నప్పట్నుంచీ బాగు పడొచ్చుననుకుంటున్నా. ఈ ఆరెకరాల పొలం కూడా. పైరు పెట్టడానికి రాయికి అయింది, అయిదారేండ్లు నుంచే ఏమన్నా అను వాల్ల కాలం కంటే మాది నయమే. నా ముగ్గురు కొడుకుల్ని చదివించుకుంటే చాలు. పెద్దోడు ఏడు, నడిపోడు అయిదు. చిన్నోడు మూడు. ముందు ముందు వాల్లు ఏం చదవుతారో నాకు తెల్దు. ఉద్యోగాలొచ్చాయో లేదో నాకు తెల్దు. ఈ పొలం ఉంటుందో ఊడుతుందో నాకు తెల్దు. అన్నా! ముందు ముందు ఎట్లా ఉంటుంది అంటే ఏం చెప్పేది? నేనేమి పోతులూరు వీరబ్రహ్మడన్నా? గవర్నమెంటునా?...

ఉప్పరగురప్ప మూడేండ్ల కిందటి కధనాన్ని మా విలేకరి తానప్పుడు సేకరించిన వివరాలను - ఇటీవల గురప్పకు విన్పించాడు. తాజా పరిణామాల గురించి ప్రశ్నించాడు. గురప్ప మాటల్లోనే ఇటీవల వృత్తాంతం, అన్నావ్, ఈ మధ్యనే అలియర్లు వచ్చినాయి. మొగోని మాదిరి ఇరవైవేలు బాకీ తీర్చినా. ఇంకా పదివేలుందనుకో. లెక్కలేదు. దొమ్మ పొగరుంది. ఫ్యాక్టరీ ఉంది పొలం తల్లి ఉంది....



'అందుకే... అన్నా! ఈసారి ఆరెకరాల్లో పత్తి వేసినా - పెట్టాలది ఎంతైనా సరే. తెగించి పెడుతున్నా

పైగా కూలి పెరిగిందన్నా. మా కంట్రాక్టు లేబరుకు. ఇప్పుడు రోజుకు ఇన్నూటెనబై పడుతుంది. ఏడువేలకు పైన్నే నెలకు వచ్చాదా అంటావా? అంతొచ్చే ఇంకేం? నెలకు పది రోజులు కూడా పని ఉండడం లేదు. మల్లా, పిఎఫ్ అదీనూ మూడేండ్ల కిందటి లెక్కేననుకో - ఒక ఇన్నూరో మున్నూరో అటూ, ఇటూగా ఎక్కువే రావచ్చు. మరి గూబ ఎదిరేటట్లు అన్నీ పిరెం అయినాయి. పెంచడం ఏందో? పని రోజులు తగ్గించడమేందో? కూలిరేటు పెరిగితే, పని రోజులు తగ్గాలా? ఈ మాయ ఏందో తలకాయ కెక్కదు.

'అందుకే... అన్నా! ఈసారి ఆరెకరాల్లో పత్తి వేసినా - పెట్టాలది ఎంతైనా సరే. తెగించి పెడుతున్నా. కల్తీ విత్తనాలు, కల్తీ మందులు అంటావా? మా కెట్లా తెలుస్తుందన్నా! పురుగు పట్టకుండా చూసుకోవాల? పత్తి విరగ బుయ్యాల. ఇంటికి చేరాల. అంతే. మంచి

రేటు ఉంటుందో ఉండదో అంటావా? ఏమన్నా గానీ... అనంతపురం రైతులు మాదిరి నేను పురుగుల మందు తాగి నేను మాత్తరం చచ్చిపోను. అంత దరిద్రం నెత్తి మీద కూకుంటే, అప్పులు తీర్చు లేకపోతే ఒక పని చెయ్యడమే. సిమెంటు రాయి కంకర, బొగ్గు, ఎర్రమట్టి - అన్నిటితో పాటుగా మిషనులోకి దూకటమే .'ఏమవుతాది?' ఉడికి ఉడికి చచ్చి సున్నమై సిమెంటును కావడమే. పెండ్లాం, పిల్లోల్లు గతి ఏమంటావా? చచ్చినాక నాకు తెలిసిదేముంది?

దా'రుణ' సీమలోని ఒక జీవన దృశ్యం ఇది. పైరు, మనిషీ నీరుగా మారిపోతున్న 'నీరూ-మీరూ' లోకం ఇది. హైటెక్ చలనమిది!'

రచన చదవటం పూర్తి అయింది. ఆ క్షణంలో నాలో ఏ ఏ భావాలు కలిగాయో చెప్పలేను. శీర్షికలోని 'నీరు' ను గురించి ఆలోచించాను. పైరూ, మనిషీ నీరుగా మారిపోవడం అంటే ఏమిటి? నీరూ - మీరూ సరే సరి. ప్రభుత్వం ప్రచార నినాదంలో నీళ్ళున్నాయి. మరి గ్రామీణ విలేఖరి ఏ అర్థంలో వాడాడు? చప్పున స్ఫురించింది. నీరు అనే మాటకు మరొక అర్థం బూడిద అని. అది ఒకప్పటి నీరు అనే తెలుగు పదానికి ఇప్పటి రూపం అన్నమాట! మా గ్రామీణ, విలేకరి ఊహాశక్తిని మెచ్చుకోకుండా - మనసులోనే - ఉండలేకపోయాను. పని ఆపి కడప మోడెం సెంటరుకు ఫోను చేశాను. అక్కడి విలేకరి సుబ్రహ్మణ్యం దొరికాడు.

"నీరూ-పైరూ స్టోరీ రాసి పంపిన స్ట్రింగరు పేరేమి?" అని అడిగాను.

"అతనా సార్! నెల కిందట మన ఎడిటరు సారు కడపకు వచ్చినాడు గదా సార్? ఎం.ఎల్.ఎ సుబ్బిరెడ్డి మన ఎడిటరుకు చెప్పినాడు. ఉద్యోగం లేదు. బి.ఎ. పాసై అయిదేండ్లయింది. కమలాపురం. పైగా పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. గడిపేటంత సంసారం. తండ్రి టింకరు...



**"ఏదో స్టోరీ పంపారట. చూశాలే. తలా తోకా లేదు. ఈ స్ట్రింగర్లో వేగలేక చస్తున్నాం.**

నాకు తిక్కరేగింది. నా తొందర నాది. సమయం తరుముతోంది. నా చావు నాది. జిల్లాల పేజీలు పెట్టలే. ప్రింటింగు పూర్తి కాలేదు. ఈ సుబ్రహ్మణ్యం ఏదీ సూటిగా చెప్పడు; ఏదీ సూటిగా రాయడు. వివరాలు ఏకరువు పెడుతూనే ఉంటాడు. సమయాన్నీ, సందర్భాన్నీ పట్టించుకోడు. విసుగును అణచుకుంటూ అడిగాను.

"ముందు స్టోరీ రాసిన మనిసి పేరు చెప్పవయ్యా స్వామీ! వివరాలు రేపడుగుతాను"

"ఇస్మాయిల్ సార్! ముస్లిం, తెలుగు బాగా రాస్తాడు. కొంచెం తిక్క సార్..."

మా అనంత వచన విలేకరి ఇంకే వివరాలు చెప్పబోతాడో అనుకుంటూ పని తొందరలో ఫోను పెట్టేశాను.

'నీరూ-పైరూ'ను హైదరాబాదులోని మా అసిస్టెంట్ ఎడిటరకు మోడెం ద్వారా పంపివేశాను. ఆయన మానవతా వార్తల్ని రాయటంలో పేరున్న పత్రికా రచయిత. అవసరమైన మార్పులతో, ప్రతి శనివారం వెలువడే మా ప్రధాన పత్రికలోని ప్రత్యేక పేజీ 'రైతు ప్రపంచం'లో నీరూ-పైరూ రావచ్చు ననుకున్నాను. ఆయనకు ఏది ముఖ్యమో, ఏది కాదో, ఎట్లా, ఎందుకుపయోగించుకోవాలో తెలుసునని నా నమ్మకం.

నమ్మకాలు అన్ని సమయాల్లో నిజం కావు. మనం నమ్మినట్లు మనుషులందరూ ఉండరు.

రైతు ప్రపంచంలో మా గ్రామీణ విలేకరి ఇస్మాయిల్ వార్తా రచన రాలేదు. ఆ ఆదివారం మాత్రం మా ఎడిటరు గారి నుంచి ఫోను వచ్చింది - కంఠ స్వరంలోని రంగూ, రుచీ, వాసనా, ధ్వనీ, స్పర్శా భేదాలలో.

"ఏదో స్టోరీ పంపారట. చూశాలే. తలా తోకా లేదు. ఈ స్ట్రింగర్లతో వేగలేక చస్తున్నాం. మన ఖర్మ కొద్దీ దొరుకుతారు - ఇలాంటి వాళ్ళు. బాగా రాస్తాడని అంటే, ఇలాగా రాయటం? మన కడప కరెస్పాండెంట్ ఆ సుబ్రహ్మణ్యం లేడూ అతనితో మాట్లాడండి. ఇలాంటి వాటిని రాయవద్దని ఆ స్ట్రింగరుకు చెప్పమనండి. లైన్ ఎకౌంటు వార్తలేవో రాసుకోమని బుద్ధి చెప్పమనండి. మనది ఇంగ్లీషు జర్నలిజమూ కాదు. ఆ కొత్త స్ట్రింగరు మన కాలమిస్టూ కాదు. ముఖ్యంగా రాజకీయంగానో, మరొక రకంగానో నేను ఇరుక్కునే వాటిని రాయవద్దని తలకెక్కేట్లు చెప్పమనండి. వింటున్నారా?... అంతగా కావాలంటే స్వంతంగా కథలు రాసుకోమనండి. ఎక్కడైనా అచ్చు వేసుకో మనండి. మనకు సాల్మన్ రష్దీలో, అరుంధత్ రాయ్‌లో, రామ్‌లో అక్కర్లేదు. వింటున్నారు కదా! మనకు ప్రయోగాలొద్దండి. ఆ రకం వాటిని కిల్ చేసేది కూడా తెలియకపోతే ఎలాగండి. మీరు సీనియర్ అనే గదా అక్కడికి పంపింది. మన హిందువులు సృష్టించుకుంటున్న సంపదకు వ్యతిరేకంగా రాయటమేమిటండీ?...

మా ఎడిటరు గారి ఫోను గూటింపుతో నా బుర్ర తిరిగి పోయింది - మధ్య మధ్యలో సార్ సార్ ఆఁ అనటంలో తల దిమ్మెక్కింది. ఇంతకూ నీరూ-పైరూ రాజకీయమో, ఏ విధంగా మరొక రకమో నాకు అర్థం కాలేదు. పత్రికా రచన కథల కంటే ఎంతెత్తున ఉందో నాకు ఏ మాత్రం తెలియటం లేదు. ప్రయోగాలు నా ఒంటికి సరిపడతాయో లేదో అనే సంగతి ఏమో గానీ, వృత్తి భద్రతకు సరిపడవని మాత్రం ఎడిటరు గారి గొంతు తీరును బట్టి తెలిసిపోయింది.

ఎడిటరు గారి చివరి మాటే నాకు బోధ పడలేదు - ఎంత గింజుకున్నా ఆ వాక్యార్థాన్ని వెతుక్కుంటూనే ఉన్నాను - మా దిన పత్రికలోని వార్తల బట్టీ, మా సంపాదకుల ప్రత్యేక వ్యాసాల్ని బట్టీ - ప్రతిరోజూ వెతుక్కుంటూనే ఉన్నాను రాయలేలిన రతనాల సీమలో, తెలుగు గంగాజలం గొంతు తడపని - భూముల్లో... ఇస్మాయిల్ రచన మిగిల్చిన జ్ఞాపకాల్లో...

విశ్లేషణ

గుడిపాటి



## గ్లోబలైజేషన్

**మ**న ప్రమేయం లేకుండానే కాలం గడిచిపోతుంది. సరికొత్త ధోరణులు జీవితంలోకి చొచ్చుకువస్తాయి. మార్పులన్నీ మంచికే అనుకోడానికి వీల్లేదని అనుభవం నేర్పిన పాఠాలు ఉండనే ఉన్నాయి. అయినా విస్మయం గొలిపే పరిణామాల పరంపర తొలుత భ్రమలకు తావును ఇస్తుంది.

వాటి స్వరూప స్వభావాలు అర్థమయ్యేసరికి అసంతృప్తి, అసహనం, ఆక్రోశం పెల్లుబుకుతాయి. అప్పటికే వాటి ప్రభావం మనల్ని ముంచేస్తుంది. ఊపిరి పీల్చుకోవడమే కష్టంగా ఉంటుంది. అయినప్పటికీ గట్టెక్కడం కోసం ఎదురీదడం అనివార్యమవుతుంది. ఉనికి కోసం గడ్డి పోచమీదనైనా ఆధారపడక తప్పని స్థితి ఏర్పడుతుంది. అస్తిత్వం కోసం పెనుగులాట మొదలవుతుంది. గ్లోబలైజేషన్ పరిణామాల నేపథ్యంలో ఇప్పుడు సరిగ్గా మనం ఆ స్థితిలో ఉన్నాం. మనల్ని మనం మిగుల్చుకోవడానికి పెనుగులాడుతున్నాం. తొలినాళ్ళ భ్రమావరణం చెదిరిపోయింది. కాంతి వలయాలు మసక బారాయి. డాలర్ డ్రీమ్స్ కుప్పకూలాయి. ప్రపంచమంతా కుగ్రామంగా మారిపోతుందనుకున్న సంబరం ఎంతోకాలం నిలవలేదు. మన కాళ్ళ కింది భూమికి సైతం వెల కడుతున్న వ్యాపార ప్రపంచంలో ఉన్నామన్న కరకు వాస్తవం కలచి వేస్తోంది. మన కాళ్ళ మీద మనం నిలబడటమే కాదు, మన కాళ్ళకింది భూమిని కూడా కాపాడుకోవాల్సిన ఆగత్యంలోకి నెట్టి వేయబడ్డామన్న ఎరుక ఇప్పుడిప్పుడే వస్తోంది. ఈ నేపథ్యంలో సాహిత్యం ఆలీనం కాదు. సాహిత్యకారుడు అలీనంగా ఉండలేడు. కనుకనే ఇవాళ ముంచుకొచ్చిన పెనుముప్పు నుంచి తమను తాము కాపాడుకోవటం అనివార్యమన్న చైతన్యం సాహిత్యకారుల సృజనకు ప్రాతిపదికైంది. గతంలో సరళీకృత ఆర్థికవిధానాల్ని ప్రశంసించిన రచయితలు కళ్ళు తెరుచుకుని చూస్తున్నారు. గ్లోబలైజేషన్ సృష్టించిన కొద్ది అవకాశాల్ని తమకు లాభదాయకంగా మార్చుకోవాలనుకున్న వారు సైతం కంగు తిన్నారు. ప్రతిఘటించడం మినహా ప్రత్యామ్నాయం లేదని గుర్తించారు. ఇలాంటి వాతావరణం తెలుగు సాహిత్య స్రవంతిలో చలనం తీసుకొచ్చింది విభిన్న ప్రక్రియల్లో గ్లోబలైజేషన్ నిరసన ధ్వనులు వినిపిస్తున్నాయి. ఏడాది కిందటి వరకు

మనల్ని మనం మిగుల్చుకోవడానికి పెనుగులాడుతున్నాం. తొలినాళ్ళ భ్రమావరణం చెదిరి పోయింది. కాంతి వలయాలు మసక బారాయి. డాలర్ డ్రీమ్స్ కుప్పకూలాయి. ప్రపంచమంతా కుగ్రామంగా మారిపోతుందనుకున్న సంబరం ఎంతోకాలం నిలవలేదు. మన కాళ్ళ కింది భూమికి సైతం వెల కడుతున్న వ్యాపార ప్రపంచంలో ఉన్నామన్న కరకు వాస్తవం కలచి వేస్తోంది.

గుడిపాటి
• విమర్శకుడు కవి
పాత్రికేయుడు

గ్లోబలైజేషన్ పట్ల అనేకరకాలు భ్రమలు, గందరగోళం నెలకొని వుండేవి. కానీ తర్వాత తర్వాతనే స్పష్టత చేకూరడం మొదలయింది. అభివృద్ధి పేరిట సాగుతున్న ప్రక్రియ జీవితాల్ని ఎలా ధ్వంసం చేస్తుందో, మన జాగాలోనే మనల్ని ఎలా పరాయివాళ్లను చేస్తున్నదో అనుభవంలో తెలిసి వచ్చింది. గత నాలుగైదేళ్ళ కాలంలో ఆంధ్రదేశంలో వచ్చిన పరిణామాల్ని జాగ్రత్తగా పరిశీలిస్తే విధ్వంసపు విలయ స్వరూపం అర్థమవుతుంది. ఈ చైతన్యం, స్పృహ సాహిత్య సృజనకు భూమిక అయ్యాయి.

గ్లోబలైజేషన్ నేపథ్యంలో ఎలాంటి సాహిత్యం వస్తుంది? దాన్ని ఎలా చూడాలి? ఏ రకంగా అర్థం చేసుకోవాలి? ఇప్పటివరకు వచ్చిన సాహిత్యంలో మేలిమి ఎంత? వాటి ప్రభావం ఎంత? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవడం అవసరం. వ్యక్తీకరణం ఒక్కటే ప్రధానం కాదు. అది ఎంత శక్తిమంతంగా ఉందో కూడా ముఖ్యం. అది పాఠకునిపై చూపే ప్రభావం కూడా కీలకం. కనుకనే గ్లోబలైజేషన్‌ని నిరసించే సాహిత్యం గురించి నిర్మొహమాటంగా అంచనాలకు రావడం అవసరం.

గ్లోబలైజేషన్‌ను వ్యతిరేకించే సాహిత్యంగా పరిగణించడానికి ప్రమాణాలేమిటి? ముందుగా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలి. ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదం, మల్టీనేషనల్, గ్లోబల్, డాలర్స్, రూపాయి, మార్కెట్ వంటి పదాలు వాడగానే అది గ్లోబలైజేషన్ గురించి రాసిందనుకోవడం పొరపాటు. అలాగే ఈ రకమైన పదాలు వాడనంత మాత్రాన అది గ్లోబలైజేషన్ గురించి రాసిన సాహిత్యం కాకపోదు. అమెరికాను నాలుగు సార్లు తిట్టిపోయడం మాత్రమే గ్లోబలైజేషన్ సాహిత్య ధోరణి కాదు. సరళీకృత ఆర్థిక విధానాల నేపథ్యంలో ధ్వంస మవుతున్న జీవన విధానాల చిత్రణ ఈ సాహిత్యంలో ప్రధానం. ప్రాంతీయ అస్తిత్వాలకి, భాషా సంస్కృతులకి ముప్పుగా పరిగణించాలి. స్థూలంగా ఈ దృష్టితో చూసినప్పుడు గ్లోబలైజేషన్ పట్ల నిరసనతో వచ్చే సాహిత్యం తీరుతెన్నులు ఎలా ఉండాలో అర్థమవుతుంది. కనుక వస్తున్న రచనలని రెండు రకాలుగా పేర్కొనవచ్చు. 1. జీవితాల్లో బీభత్సాన్ని సృష్టించే గ్లోబలైజేషన్‌ని నేరుగా వ్యతిరేకించే సాహిత్యం. 2. ప్రాంతీయ అస్తిత్వాన్ని బలంగా వ్యక్తీకరించే సాహిత్యం. గ్లోబలైజేషన్ నేపథ్యంలో గత రెండేళ్ళుగా వస్తున్న సాహిత్యమంతా ఈ రెండు రూపాల్లోనే ఉంది.

**తెలుగునాట సాహిత్యంలో ఏ కొత్తధోరణి అయినా తొలుత కవిత్వ రూపంలోనే వ్యక్త మవుతుంది. గ్లోబలైజేషన్ కూడా ఇందుకు మినహాయింపు కాదు. ముందుగా కవులే తమ నిరసనను వ్యక్తీకరించారు. ఇటీవలి కాలంలో కొత్తగా రాస్తున్న కవులు సైతం గ్లోబలైజేషన్‌ను వ్యతిరేకిస్తున్నారు. ఈ నిరసన కవిత్వం పెద్ద ఎత్తున వస్తోంది.**

## కవిత్వానిదే పై చేయి

తెలుగునాట సాహిత్యంలో ఏ కొత్తధోరణి అయినా తొలుత కవిత్వ రూపంలోనే వ్యక్తమవుతుంది. గ్లోబలైజేషన్ కూడా ఇందుకు మినహాయింపు కాదు. ముందుగా కవులే తమ నిరసనను వ్యక్తీకరించారు. ఇటీవలి కాలంలో కొత్తగా రాస్తున్న కవులు సైతం గ్లోబలైజేషన్‌ను వ్యతిరేకిస్తున్నారు. ఈ నిరసన కవిత్వం పెద్ద ఎత్తున వస్తోంది. ఇప్పటి వరకు వచ్చిన కవితా సంకలనాల్లో మూడింటి గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. 1. వికసించిన విద్యుత్‌తేజం. విద్యుత్ చార్జీల పెంపుదలను నిరసిస్తూ ఏడాదిన్నర కిందట జరిగిన ఆందోళన పై ప్రభుత్వం తుపాకీ ఎక్కుపెట్టింది. ఈ సందర్భంగా వ్యక్తమయిన కవుల నిరసనకు ప్రతిఫలం వికసించిన "విద్యుత్ తేజం" కవితా సంకలనం. 2. గ్లోబల్ ఖడ్గం : ఇది కూడా విద్యుత్ ఆందోళన నేపథ్యంలో 'అక్షరం' తీసుకొచ్చిన కవితా సంకలనం. ఇటీవల సాహిత్య రంగంలో తీవ్ర వాదోపవాదాలకీ, చర్చలకీ దారితీసిన కవితా సంకలనమిది. పాఠకునిపై దీని ప్రభావమెంత అన్న చర్చను రేపిన పుస్తకమిది. నిరసన అవసరమే. కానీ ఆ నిరసన పదునైన రూపంలో ఉండాలన్న మాట సాహిత్యకారుల్లో ఆలోచనలకి ఆస్కారమిచ్చింది. కనుక గ్లోబలైజేషన్ పట్ల సాహిత్యకారుల అభివ్యక్తి శక్తిమంతంగా ఉండాలన్న వాదాన్ని కొట్టివేయలేం. 3. జనకవనం : సిపిఐ (ఎం) 17వ అఖిల భారత మహాసభల సందర్భంగా 'జనకవనం' అనే కార్యక్రమం జరిగింది. 'ప్రపంచీకరణపై ప్రతిధ్వని' అన్న నినాదంతో హైదరాబాద్‌లో జరిగిన ఈ కార్యక్రమంలో పాల్గొని కవులు తమ కవిత్వం వినిపించారు. వీరి కవితల సంకలనమే ఈ పుస్తకం. ఇందులో దాదాపు 170 మంది కవులు కవిత్వం ఉంది. ఇందులో కవిత్వం ఉంది. నినాదాలున్నాయి. పట్టరాని ఆగ్రహావేశాలున్నాయి. పిల్లలు మొదలుకొని పండిపోయిన పండిత కవుల వరకు రాసిన కవితలు ఇందులో ఉన్నాయి. 'యువత ఆలోచనలు అక్షరరూపం దాల్చి అపురూపం చైతన్యకాంతులు ప్రసరించాలి' అన్న లక్ష్యంతో ప్రజాశక్తివారు ఈ పుస్తకం తీసుకొచ్చారు. దీనికి కొన్ని పరిమితులున్నాయి. వీటిని దృష్టిలో ఉంచుకొని చూసినా ఈ సంకలనం ప్రయోజనం తక్కువేమీ కాదు. గ్లోబలైజేషన్ ఎంత ప్రమాదకారిగా పరిణమించిందో, దీన్ని వ్యతిరేకించాల్సిన అనివార్య అవసరమేమిటన్న స్పృహను కలిగించిన పుస్తకమిది. కనుకనే గ్లోబలైజేషన్ వ్యతిరేక కవిత్వంలో ఈ పుస్తకానికి కీలక ప్రాధాన్యం ఉంది. కొత్తగా రచనలు చేసేవారు సైతం గ్లోబలైజేషన్‌ను వ్యతిరేకిస్తున్నారన్న వాస్తవాన్ని చెబుతుంది పుస్తకం.

ఈ మూడు సంకలనాలు గ్లోబలైజేషన్ పై కవులు నిరసనకు ప్రతీకలు. ఇవిగాక కొన్ని దీర్ఘ కవితలు వచ్చాయి. కొంతమంది కవుల కవిత్వం లోనూ గ్లోబలైజేషన్ వ్యతిరేక ఛాయలున్నాయి. యార్లగడ్డ రాఘవేంద్రరావు

రాసిన దీర్ఘకవిత 'ముంతపొగ'లో రైతు జీవితంలో వచ్చిన మార్పుల చిత్రీకరణ ఉంది. ఈ మార్పులకీ, గ్లోబలైజేషన్ కారణంగా వ్యవసాయ రంగంలో చోటు చేసుకుంటున్న పరిణామాలకీ మధ్యన సంబంధం ఉంది. వ్యవసాయదారుల జీవితంలో ముసురుకుంటున్న చీకట్లకు మూలాలు గ్లోబలైజేషన్‌లో ఉన్నాయి. వీటి ఆనవాళ్ళు ఈ కవిత్వంలో కనిపిస్తాయి.

పత్తిపాక మోహన్ రాసిన దీర్ఘకవిత 'తెగినపోగు' లోనూ గ్లోబలైజేషన్ ప్రభావపు జాడలున్నాయి. చేనేత కార్మికుల వెతల్ని, వారి జీవితాల్లోని మృత్యుశీతల స్పర్శను గురించి చెప్పిందీ రచన. ఆర్థిక సంస్కరణల పర్వం చేనేత బతుకుల్ని కష్టాల కొలిమిలోకి నెట్టిన వైనం ఈ కవితలో చూస్తాం. ఈ సంస్కరణలకీ, గ్లోబలైజేషన్‌కీ ఉన్న సంబంధం ఏమిటో తెలిసిందే. అద్దేపల్లి రామమోహనరావు కవితా సంకలనం 'అయినా ధైర్యంగానే.....' లోనూ గ్లోబ లైజేషన్‌పై నిరసనరావం వ్యక్తమవు తోంది. సరళీకృత ఆర్థిక విధానాల నేపథ్యంలో మనిషి జీవితంలో డబ్బు పాత్ర ఎంతగా పెరిగిపోయిందో సున్నితంగా చెప్పిన కవిత సతీష్‌చందర్ రాసిన 'కను రూపాయి'.

ఇటీవలి కాలంలో స్త్రీలు రాసిన కవితల్లోనూ గ్లోబలైజేషన్ ప్రస్తావన ఉంది. స్త్రీ జీవితాల్లో చిచ్చు పెడుతున్న గ్లోబల్ సంస్కృతిపై నిరసన ఉంది. కొండేపూడి నిర్మల 'మల్టీ నేషనల్ ముద్దు', రెంటాల కల్పన 'నేను కనిపించే పదం' కవితా సంకలనాల్లో గ్లోబలైజేషన్ కారణంగా స్త్రీ పురుష సంబంధాల్లో చోటు చేసుకుంటున్న అవాంఛనీయ ధోరణులు కనిపిస్తాయి. స్త్రీ పురుషుల మధ్య ప్రేమకు బదులుగా వ్యాపార సంబంధాలు చోటు చేసుకోవడం పట్ల ఆగ్రహం కనిపిస్తుంది. స్త్రీని సెక్స్ సింబల్‌గా చూపే సైబర్ సంస్కృతి పట్ల పట్టరాని కోపం ఉంది. ఇదే క్రమంలో ప్రేమ ఒక మార్కెట్ వ్యవహారంగా మారిన వైనాన్ని వంశీకృష్ణ కవితా సంకలనం 'కొన్ని నేనులు' లోనూ చూడొచ్చు. ప్రేమైక సంబంధాలు సైతం ఈ గ్లోబల్ వాతావరణంలో కలుషితమయిన తీరును

> గ్లోబలైజేషన్ నేపథ్యంలో గతంలోనూ కొన్ని కథలు వచ్చాయి. ప్రైవేటైజేషన్ క్రమంలో దెబ్బతినే వర్గాల గురించి సోమరాజు సుశీల మంచి కథలు రాశారు. స్త్రీలలో ఆ తర్వాత కుప్పిలి పద్మ రాసిన కథల గురించి చెప్పుకోవాలి. 'ఇన్‌స్టంట్ లైఫ్', ప్రకంపనం, కుబుసం, సాలభంజిక, కథల్లో గ్లోబలైజేషన్ తెచ్చి పెడుతున్న ముప్పు ఎలాంటిదో పద్మ చిత్రీకరించారు.

కవిత్వంగా మలుస్తారు వంశీకృష్ణ. మానవ సంబంధాల్లోని స్పందనారాహిత్యాన్ని, పెరుగుతున్న వాణిజ్య ధోరణుల్ని వ్యంగ్యాత్మక ధోరణిలో వ్యక్తం చేసిన పుస్తకం 'కవిత్వం'. ఈ సంకలనంలోని కవితల అంతస్సారం అంతిమంగా గ్లోబలైజేషన్ నేపథ్యాన విచ్ఛిన్నమవుతున్న మానవ సంబంధాలపై నిరసనే. ఈ పుస్తకంలో అఫ్సర్, సీతారం ప్రేసన్, వంశీకృష్ణ కవితలున్నాయి. జూకంటి జగన్నాథం రాసిన దీర్ఘ కవితల్లోనూ గ్లోబలైజేషన్‌పై ధిక్కారం వ్యక్తమవుతుంది.

ప్రాంతీయతకీ, ఆయా ప్రాంతాల భాషా సంస్కృతులకీ ముప్పుగా పరిణమించింది గ్లోబలైజేషన్. పరిస్థితుల్లో ప్రాంతీయ స్పృహతో వస్తున్న కవిత్వాన్ని కూడా గ్లోబలైజేషన్‌ను వ్యతిరేకించే సాహిత్యంగానే పరిగణించాలి. ఈ దృష్టితో చూసినప్పుడు సుంకిరెడ్డి నారాయణరెడ్డి దీర్ఘ కవిత 'దాలి' ఈ కోవలోకి వస్తుంది. తెలంగాణ పల్లెపై వలసపాముపడగల నీడల గురించిన హెచ్చరిక ఈ కవిత. తర్వాత నందిని సిధారెడ్డి 'ఒక బాధగాదు' సంకలనంలోనూ గ్లోబలైజేషన్ కారణంగా దుఃఖ భాజనకమైన తెలంగాణా పల్లె జీవితాన్ని చూడొచ్చు. రైతుల, ఇతర చేతివృత్తుల వారి జీవితంలో అల్లకల్లోలం చోటు చేసుకోడానికి, ఆర్థిక సరళీకృత విధానాలకు గల సంబంధాన్ని సిధారెడ్డి కవిత్వం చెబుతుంది. మంజీరా రచయితల సంఘం వారి 'ఎడపాయలు' సంకలనం, డా. పులిపాటి గురుస్వామి సంకలనం 'చెమ్మ', అన్నవరం దేవేందర్ 'తొవ్వ', ఏనుగు నరసింహారెడ్డి 'నేను', సంకలనాలు, ఎం. వెంకట్ దీర్ఘకవిత 'వర్జి'లు కూడా ఈ కోవలోకి వచ్చే పుస్తకాలే. వేముల ఎల్లయ్య, పగడాల నాగేందర్, కందుకూరి దుర్గాప్రసాద్, తమ్మనబోయిన వాసు, బాణాల శ్రీనివాసరావు, దొడ్డి రామ్మూర్తి, కందుకూరి రమేష్‌బాబు, పప్పుల రాజిరెడ్డి, చొప్పదండి సుధాకర్, దేశపతి శ్రీనివాస్, రామగిరి శివకుమారశర్మ, కొమ్ము సుధాకర్, అలాజ్‌పూర్ కిషన్, దాసరాజు రామారావు మొదలైన కవులు ప్రాంతీయ స్పృహతో రాస్తున్నారు. వీరు రాసిన కొన్ని కవితలు మనిషి జీవితంలోని విషాదానికీ, గ్లోబలైజేషన్‌కీ మధ్యన సంబంధాన్ని వ్యక్తం చేశాయి. ఈ విధంగా ప్రాంతీయ స్పృహతో వస్తున్న విభిన్న ప్రాంతాల సాహిత్యమంతా కూడా గ్లోబలైజేషన్ వ్యతిరేక స్రవంతిలో భాగంగానే చూడాలి. మొత్తంగా ఇవాళ వస్తున్న కవిత్వంలో అధికభాగం గ్లోబలైజేషన్ పై సంధించిన అస్త్రంగా పరిగణించాలి. ఆర్థిక సంస్కరణల ఫలితంగా జీవితంలోని సకల రంగాల్లోనూ వ్యాపారధోరణులు చోటు చేసుకున్నాయి. అసమానీయత ప్రబలింది. దళితులు, స్త్రీలు, మైనారిటీలు.... ఇలా ప్రతిఒక్కరు సరళీకృత ఆర్థిక విధానాల కారణంగా గాయపడ్డవారే. నష్టపోయినవారే. వీరి ఆగ్రహావేశాల్ని ప్రతిఫలించే కవిత్వం ఇప్పుడు వస్తుంది. కనుక స్త్రీలు కేవలం స్త్రీలుగా తమ స్థానం గురించి మాట్లాడితే సరిపోదు. స్త్రీలుగా తమ అస్తిత్వం కోసం పోరాడుతూనే తమ జీవితాల్ని కబళించే గ్లోబలైజేషన్‌పై పోరాడటం స్త్రీలకి అనివార్యమైంది. కనుక రచనలు చేసేవారు గ్లోబలైజేషన్ పరిణామాలు చేస్తున్న గాయాల గురించి రాయకుండా ఉండలేరు. అందుకే కథా ప్రక్రియలో తొలుత గ్లోబలైజేషన్ ప్రభావం గురించి స్త్రీలు రాశారు.

### కథాక్రమం

గ్లోబలైజేషన్ నేపథ్యంలో గతంలోనూ కొన్ని కథలు వచ్చాయి. ప్రైవేటైజేషన్ క్రమంలో దెబ్బతినే వర్గాల గురించి సోమరాజు సుశీల

మంచి కథలు రాశారు. స్త్రీలలో ఆ తర్వాత కుప్పిలి పద్మ రాసిన కథల గురించి చెప్పుకోవాలి. 'ఇన్‌స్టంట్ లైఫ్', ప్రకంపనం, కుబుసం, సాలభంజిక, కథల్లో గ్లోబలైజేషన్ తెచ్చి పెడుతున్న ముప్పు ఎలాంటిదో పద్మ చిత్రీకరించారు. పేదలు, మధ్యతరగతి, ధనికులు ఇలా విభిన్న వర్గాల వారు గ్లోబలైజేషన్ పరిణామాల వల్ల ఎలా దెబ్బతింటారో పద్మ కథల్లో చూస్తాం. రంగనాయకమ్మ రాసిన 'మురళీ వాళ్ళమ్మ' కథకీ, ఈ పరిణామాలకీ సంబంధం ఉంది. ఎగ్జిక్యూటివ్ జాబ్ చేస్తూ మురళి పక్కదారులు పట్టడానికి గ్లోబలైజేషన్ కొన్ని వర్గాలకు కల్పించిన వాతావరణమే కారణం. ఇలాంటి పరిస్థితిలో కూడా మానవ విలువలతో కూడిన సంబంధాలు నిలుపుకోవడం కత్తిమీద సాము లాంటిది. గ్లోబలైజేషన్ గురించి ప్రస్తావించకుండానే రంగనాయకమ్మ ఈ కథ చెప్పారు. గ్లోబలైజేషన్ కారణంగా జీవితాల్లో, జీవన విలువల్లో చోటు చేసుకుంటున్న మార్పుల్ని మరికొందరు కథకులు చిత్రించారు. విజన్ 2020 పేరిట చంద్రబాబునాయుడు అమలు జరిపే కార్యక్రమం అంతిమంగా ఎలాంటి విపరిణామాలకు దారి తీస్తుందో 'కథ 2020'లో గీతాంజలి చిత్రించారు. ఓల్గా రాసిన 'మార్పు, ఓ పెళ్ళి కథ', ఆడెపు లక్ష్మిపతి 'విధ్వంస దృశ్యం', వి.అశ్వినీకుమార్ 'సంకెళ్లు', కె. రామచంద్రమూర్తి 'చెక్', సి. వెంకటేష్ 'గ్లోబల్ గ్రామం', జె. శ్యామల 'చాపకింద నీరు', పులిపాటి గురుస్వామి 'కాష్టం', ముదిగంటి సుజాతారెడ్డి 'నిశ్శబ్దం', ధూళిపాళ అన్నపూర్ణ 'సాలెగూ(గో)డు', బెజ్జారపు రవీందర్ 'గోగుపూల పాట', ఖదీర్ రాసిన 'ఖాదర్ లేడు', జి.ఉమామహేశ్వర్, 'నిశ్శబ్ద విప్లవం', సురేష్ 'టైటానిక్', గొరుసు జగదీశ్వరరెడ్డి 'బతుకు గోస' జూకంటి జగన్నాథం 'వైపని', తిగుళ్ళ సుధాకరశర్మ 'ప్రపంచతంత్రం', భాగవతుల సుబ్రహ్మణ్యం 'విపణి', ఎన్.కె.రామారావు 'అస్తవ్యస్తం', బమ్మిడి జగదీశ్వరరావు 'దూరానికి దగ్గరగా', మధురాంతకం నరేంద్ర 'చోటు', పెద్దింటి అశోక్ కుమార్ 'కీలుబొమ్మలు' మొదలైన వారి కథలు కూడా ఈ కోవలోకే

**జీవితంలోని సకల అంశాలకీ, గ్లోబలైజేషన్ పరిణామాలకీ మధ్యన సంబంధాలున్నాయి. వీటిని అర్థం చేసుకునే ప్రయత్నం మాత్రమే సరిపోతుందా? గ్లోబలైజేషన్‌కి సంబంధించి సమస్య అర్థమైనా పరిష్కారాన్ని మాత్రం సూచనప్రాయంగానైనా చెప్పలేకపోతున్నారు. రచయితలు పరిష్కారం చూపాలని చెప్పబోవడం లేదు గానీ దిశ ఏమిటో తెలియాలి.**

వస్తాయి. తెలంగాణా నుంచి కాలువ మల్లయ్య, తెలిదేవర భానుమూర్తి, శ్రీధర్ దేశ్‌పాండే, కాసుల ప్రతాప్‌రెడ్డి, పి. చంద్, కె.వి. నరేందర్, బోయ జంగయ్య, భూపాల్, అంబల్ల జనార్ధన్, పులుగు శ్రీనివాస్, ఐతా చంద్రయ్య, బోధనం నర్సిరెడ్డి మరికొందరు ప్రాంతీయ స్పృహతో రాస్తున్నారు. వీరి కథల్ని కూడా గ్లోబలైజేషన్ వ్యతిరేక సాహిత్యంలో భాగంగా పరిగణించాలి. తెలంగాణా గురించి వీరి ఇతివృత్తాల్లోని విభిన్నాంశాల్ని గమనిస్తే గ్లోబలైజేషన్ కారణంగా విచ్ఛిన్నమవుతున్న తెలంగాణా జీవితంలోని విభిన్న పార్శ్వాలు దర్శనమిస్తాయి. మరోవైపున డా. వి. చంద్రశేఖరరావు, నల్లూరి రుక్మిణి, సుంకోజు దేవేంద్రాచారి, సన్నపు రెడ్డి వెంకటరామిరెడ్డి ఇంకొందరి కథల్లోనూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో గ్లోబలైజేషన్ ప్రస్తావన, సంబంధం కనిపిస్తాయి. వీరేగాక ఇంకా చాలామంది రాస్తున్న కథల్లో గ్లోబలైజేషన్ కారణంగా ధ్వంసమవుతున్న జీవితాల తీరుతెన్నులు చిత్రితమయ్యాయి.

## ప్రభావం ఎంత?

పైన పేర్కొన్న వారందరి కథలు పాఠకుల్ని ఎంత వరకు ప్రభావితం చేస్తాయి? ఈ కథలు చదివిన పాఠకుల మానసిక సంచలనం ఎలా ఉంటుంది? వీటి తాలూకు ప్రభావం వారిపైన ఏ విధంగా ఉంటుంది? అన్నిటికీ సరైన, సంతృప్తికరమైన సమాధానాలు లభించవు. ఇతివృత్తాన్ని సరిగ్గా ఎంచుకుంటున్నారు గానీ కథను నడిపించే పద్ధతిలో తేడాలున్నాయి. ఒక్కోసారి మంచి ఇతివృత్తాన్ని తీసుకొని రాసినా కథా శిల్పంగానీ, ముగింపుగానీ పేలవంగా ఉంటుంది. జి.ఉమామహేశ్వర్ రాసిన 'నిశ్శబ్ద విప్లవం' కథ సరిగ్గా ఇలాంటి కోవకు చెందిందే. కలలో ఓ ఆందోళనకారుల గుంపు కంప్యూటర్లను ధ్వంసం చేయడం ఈ కథలో ముగింపు. టీవీల వల్ల మానవసంబంధాలు ఎలా దెబ్బతిన్నాయో చెబుతూ వచ్చిన కథలన్నిటా టీవీ పగలగొట్టడమే ముగింపు. కంప్యూటర్లు తెచ్చిన అనర్థాల గురించి వివరిస్తూ కూడా వాటిని ధ్వంసం చేయడమే ముగింపుగా చెప్పడంలో అర్థం కనిపించదు. ఇలాంటి అనుకరణ వల్ల ప్రయోజనం శూన్యం. ఆడెపు లక్ష్మిపతి 'విధ్వంస దృశ్యం' కథలోనూ నిర్మాణ పద్ధతి సరిగా లేదు. కథానాయిక స్వగతంలో నడిచే ఈ కథలో కార్యచరణ సంబంధాల వివేచన ఎక్కువ. కథలో ఇలాంటి వివేచన తగదని కాదు, కానీ కథకి భంగం కలిగించే రీతిలో కథకుడు విశ్లేషణ చేస్తూ పోవడం వల్ల కథ చదివించే లక్షణాన్ని కోల్పోతుంది. విధ్వంసదృశ్యం విషయంలో జరిగింది ఇదే. ఇలాంటి లోపం వల్ల ఇతివృత్తం ఎంత గొప్పదైనా పాఠకుడి మీద ఆ కథ ప్రభావం చూపదు. భావజాలంలో మార్పు రావాలి.

గత దశాబ్దకాలంగా దేశంలో, రాష్ట్రంలో ఉదారవాద ఆర్థికవిధానాల ఫలితంగా జీవితాల్లో పెనుమార్పులు చోటు చేసుకుంటున్నాయి. గ్లోబలైజేషన్ క్రమంలో ఎందరి జీవితాలో ధ్వంసమవుతున్నాయి. జీవితానికి సంబంధించిన నమూనాలు మారాయి. దాంతోపాటుగానే విలువలూ మారిపోతున్నాయి. విలువల్ని ప్రశ్నించడం కొందరి కథల్లో కనిపిస్తుంది. కానీ ఇది కేవలం విలువల ప్రశ్న మాత్రమేనా? ఆర్థిక రంగంలో వస్తున్న మార్పుల్ని వ్యక్తుల పరంగా, విలువల పరంగా చూడగలమా? జీవితంలోని సకల అంశాలకీ, గ్లోబలైజేషన్ పరిణామాలకీ మధ్యన సంబంధాలున్నాయి. వీటిని అర్థం చేసుకునే ప్రయత్నం మాత్రమే సరిపోతుందా?

గ్లోబలైజేషన్‌కి సంబంధించి సమస్య అర్థమైనా పరిష్కారాన్ని మాత్రం సూచనప్రాయంగానైనా చెప్పలేకపోతున్నారు. రచయితలు పరిష్కారం చూపాలని చెప్పబోవడం లేదు గానీ దిశ ఏమిటో తెలియాలి. ఆ దిశను తెలుసుకునే క్రమంలోనే ప్రాంతీయత, స్థానికత అన్న వాదనలు ముందుకొచ్చాయి. ప్రాంతీయ వరవైన ఆకాంక్షలు చోటు చేసుకుంటున్నాయి. ఇంతటితోనే సరిపోదు. అభివృద్ధి పేరుతో జీవితాన్ని శాసిస్తున్న భావజాలాన్ని ఎదుర్కోవాలి. ఇందుకోసం సరికొత్త తాత్విక భావజాలం వేళ్ళూనుకోవాలి. నిజానికి సరికొత్తగా అంటూ ఏం ఉండదు. విస్తృత అనుభవాలు, భావజాలాల్లోంచే జీవితాన్ని వికసింపజేసే ఆలోచనాధారను పునః సృజించుకోవాలి.

ఈ వదేళ్ళకాలంలో అభివృద్ధి, ఎదుగుదల, ఎంజాయ్‌మెంట్ అన్న మాటలు తరచుగా వినిపిస్తాయి. వీటి నమూనాల్ని అనుసరించడమే మనిషి జీవనరీతి అయ్యింది. అభివృద్ధి పేరిట చేస్తున్న అప్పులు ఇక్కడ పుట్టే బిడ్డల్ని కూడా చుట్టుకుంటున్నాయి. ఎదుగుదల అంటే ఏమిటో ఆలోచించకుండా పరుగులు పెడుతున్నారు. ఈ పరుగులు ఎందాకా? ఎందుకోసం? ఇలా ప్రశ్నించుకునే వరిస్థితి కూడా లేదు. వర్సనాలిటీ డెవలప్‌మెంట్ పేరుతో జరుగుతున్న తతంగంలో జీవితాల్ని ఎవరో నిర్దేశించిన సంకుచిత నమూనాల్లో కుదించుకోవటానికి ప్రయాస పడుతున్నారు. వస్తు సంపదల్ని పోగు చేసుకోవడమే ఎంజాయ్‌మెంట్‌గా భావించే స్థితి దాపురించింది. మన ఆహారపుటలవాట్లలో వచ్చిన మార్పుల్ని గమనిస్తే ఎంజాయ్‌మెంట్‌కు మనం ఎలాంటి అర్థాల్ని ఇస్తున్నామో బోధపడుతుంది. ఈ నమూనాలు మనల్ని మనుషులుగా కన్నా వినిమయదారులుగా మార్చివేశాయి. వీటి చిత్రీకరణ కూడా తెలుగులో తక్కువే. నిజానికి ఈ వాస్తవాల్ని చిత్రీకరించడంతోనే రచయిత పని తీరిపోదు. ఈ వాస్తవాల వెనుక దాగిన భావజాలాన్ని ఎరుక పరచాలి. అదే సమయాన

**జీవితాన్ని మనదైన పద్ధతిలో సృజించుకోవడం తెలియాలి. ప్రకృతిని అనుసరించి సహజమైన పద్ధతుల్లో జీవించడానికి ప్రయత్నించడమే ఇవాళ అవసరం. కానీ ఈ భావజాలం పరివ్యాప్తం చేయడానికి తగిన సైద్ధాంతిక భూమికను మనం ఏర్పరుచుకోవాల్సి వుంది. మన జీవన విధానాల్ని సంపూర్ణంగా మార్చుకోవాలి.**

ఇవాళ మనం అనుసరించాల్సిన జీవనమార్గం ఏమిటో స్పష్టం కావాలి. కనుక గ్లోబలైజేషన్ పరిణామాలపై కేవలం ఆవేదన సరిపోదు. విలువల గురించి వాపోవడంతో ఒరిగేదేముండదు.

జీవితాన్ని మనదైన వద్ధతిలో సృజించుకోవడం తెలియాలి. ప్రకృతిని అనుసరించి సహజమైన వద్ధతుల్లో జీవించడానికి ప్రయత్నించడమే ఇవాళ అవసరం. కానీ ఈ భావజాలం పరివ్యాప్తం చేయడానికి తగిన సైద్ధాంతిక భూమికను మనం ఏర్పరుచుకోవాల్సి వుంది. మన జీవన విధానాల్ని సంపూర్ణంగా మార్చుకోవాలి. అందుకు అనుసరించాల్సిన మార్గం వైపు చూపు ప్రసరించాలి. ఇక్కడే మనం జపాన్‌కు చెందిన మసనోబు ఫుకుఓకాను గుర్తుకు తెచ్చుకోవాలి. ఆయన రాసిన 'ది వన్ స్ట్రా రివల్యూషన్' అనే పుస్తకం తెలుగులో 'గడ్డిపరకతో విప్లవం' అనే పేరుతో వచ్చింది. ప్రకృతిని అనుసరించి జీవించడంలోని ఔన్నత్యం ఏమిటో ఆయన చెబుతారు. ఆహారపుటలవాట్లు సహజంగా ఉండటమంటే ఏమిటో ఈ పుస్తకం చదివితే తెలుస్తుంది. గ్లోబలైజేషన్ మన మీద రుద్దుతున్న జీవన విధానాల్ని ఎదిరించాలంటే ఫుకుఓకానే శరణ్యం. ఈ నేలపై బుద్ధుడు ప్రవచించిన జ్ఞానం కూడా ఎందుకు తోడ్పడుతుంది. మనం మన నేలని, మన ప్రాంత స్వభావాన్ని విస్మరించి పాశ్చాత్యులతో పోటీ పడటం వల్ల అభివృద్ధిని సాధించడం దుర్లభం. మన అభివృద్ధి నమూనాలు, జీవిత విధానాలు మనవైన పద్ధతిలో ఉండాలి. సమస్యలకి గల మూలాలు కేవలం ఆర్థిక విధానాల్లో మాత్రమే కాదు, తాత్విక చింతనల్లో, భావజాలాల్లోనూ ఉంటాయి. ఈ విషయానికి సంబంధించిన అవగాహన పెంపొందించుకోవడం ఇవాళ్టి రచయితకు అవసరం. అలాంటప్పుడే వాళ్ళ రచనలు పాఠకుల్లో హృదయ సంస్కారానికి దోహదం చేస్తాయి. ఈ సంక్షోభం నుంచి బయట పడటానికి తగిన ఆలోచనలు అందిస్తాయి. ఇప్పటివరకు జరిగిన సాహిత్య సృజనలో గ్లోబలైజేషన్ వ్యతిరేకత ఎక్కువే. కానీ ప్రత్యామ్నాయ జీవన విధానాల్ని గానీ, ఆలోచనల్ని గానీ బలంగా ప్రొది చేసిన దాఖలాలు లేవు. ముఖ్యంగా కథా సాహిత్యంలో ఈ పని జరగలేదు. జీవితానికి సంబంధించిన మనదైన తాత్విక చింతన ఏర్పడకుండా హృదయాల్ని కదిలించే, మానసిక ప్రపంచాల్లో మార్పుకు దారితీసే సృజన సాధ్యం కాదు.

కథల్లో, కవితలో కనిపించిన గ్లోబలైజేషన్ వ్యతిరేక భావజాలం ఇతర ప్రక్రియల్లో అరుదు. నాటకాల్లో 'పడమటి గాలి' చెప్పుకోదగింది. బలమైన నవలలు రావాల్సి వుంది. గ్లోబలైజేషన్ చేసే అపకారం గురించి అవగాహనే ఇంకా పెరగాలి. కనుక సాహిత్య సృజన పుంజుకోవడానికి ఇంకా సమయం పడుతుంది. ఇప్పటివరకు జరిగిన సృజనాత్మక కార్యకలాపమంతా అందుకు అవసరమైన రంగాన్ని సిద్ధం చేయడానికే పరిమితమైంది. ఇకముందు విభిన్న ప్రాంతాల్లోని రచయితలు, కవులు మరింత శక్తిమంతమైన రచనలు చేయడం వల్లనే ప్రజల ఆలోచనల్లో మార్పుకు ఆస్కారం ఉంటుంది. ఆ దిశగా రచయితలు ప్రయాణిస్తారన్నదే ఆశ!!

ఇంటర్వ్యూ

జి. కళ్యాణరావు

# నాది అల్లిక వారసత్వం



............ ✧ ............

అంటరాని వసంతం జీవితం తాలూకు రఫ్ నోట్సు. ఆ నోట్సు యింకా వుంది. మూడు భాగాలు రాద్దామనుకున్నాను. మొదటి భాగం రాయాల్సి వుంది. "అంటరాని వసంతం" నేను తయారు చేసుకొన్న రఫ్ నోట్సులో రెండో భాగం. మిగిలిన భాగాలు పూర్తి చేస్తాను. నా పూర్వీకులు వదిలి వెళ్ళిన బోలెడు అల్లిక వుంది. దాన్ని బయటకు తీసుకు రావాల్సి వుంది. ఏది చేసినా నాకు జీవితం రచన, పోరాటం వేరు కాదు. ఈ భూమ్మీద మనిషి హృదయంలో మంచి భవిష్యత్ మీద విశ్వాసాన్ని పెంచాలి.

............ ✧ ............

**అంటరాని వసంతం రచనకు ప్రేరణ ఏమిటి?**

జీవితం

దోస్తవిస్కీ నవల White nights (శ్వేతరాత్రులు)లో "మీ జీవిత కథ చెప్పండి" అని ఆమె అంటుంది. "నా జీవితానికి ఏ కథా లేదు" అని అతనంటాడు. ఏ కథా లేకుండా యింతకాలం ఎట్లా జీవించారని ఆమె ఎదురు ప్రశ్న వేస్తుంది. యిక్కడ మనం అనుకోవాల్సింది జీవితం, రచన వేరు కాదని.

అంటరాని వసంతంలో నేను చేసిందల్లా నన్ను నేను వెతుక్కోవటం. నా పరిసరాల్ని, నా వాళ్ళని, నా పూర్వీకుల్ని ముందుంచుకోవడం అంతే. అంతే చేశాను. నిజానికి మావాళ్ళు అద్భుతమైన సంస్కృతికి వారసులు. వాళ్ళు గొప్ప కళాకారులు. అమ్మ వైపు, నాన్న వైపు వీధి భాగోతాలు ఆడేవాళ్ళు, పాటలు అల్లిన వాళ్ళు.

నాది అల్లిక వారసత్వం. Netting heritage నవల ముందు మాట నవలలో భాగంగా వస్తుంది. నను పుట్టి నకులం నిషిద్ధం. నేను కోరుకున్న పోరాటం నిషిద్ధం. కాని ఆ రెండూ అద్భుత వసంతాలు. అవి ఎందుకు అంటరానివయ్యాయి. నా ప్రశ్నల్లా అక్కడే మొదలయింది.

చాలా చరిత్రే చదివాను. డి.డి క్యాంబి, రొమిల్లాథార్, ముజుందార్... అట్లా ఎన్నో వల పేజీలు చదివాను. వాళ్ళు చాలా కొత్త కోణాలు తాకారు. చాలా కొత్తం అంశాలు ముందుంచారు. కాని Something is missing ఏదో మిస్ అవుతుంది. My Page నా పేజీ కన్పించడం లేదు. దీనికోసమే వెతికాను. ఈ వెతుకులాటే అంటరాని వసంతం. చరిత్రను నా పూర్వీకుల కోణం నుంచి చూశాను.

ఈ దేశంలో దీని పక్కనే కులం ఉంది.

బహుశా తన పూర్వీకుల కోణం నుంచి చరిత్రని చూడటం అంటరాని వసంతంతోనే మొదలు అనుకుంటాను.

ఈ దేశంలో వర్గం వుంది. దాన పక్కన కులం వుంది. ఇక్కగ గాలికి, నీటికి, పంట కాల్వకి, పండే భూమికి, బడికి, గుడికి, రచ్చబండకి, తినే తిండికీ, వుండే యింటికీ, కట్టే బట్టకీ, మాటాడే మాటకీ, సాహిత్యానికి, సంస్కృతికి, రాజ్యానికి, దాని చట్టానికి, న్యాయానికి, న్యాయస్థానానికి, శవానికి, శ్మశాన వాటికకి, దేవుడికి, దెయ్యానికి అంతటా కులముంది. చరిత్రలు చాలా అంశాలు నోటే కాలేదు. అసలు ఈ దేశ చరిత్రే "అవుసోపాల, వాదోపాల సంకలనం". కనీసం

జి. కళ్యాణరావు | రచయిత
'అరుణతార' సంపాదకుడు



24

అక్కడా నేను లేను. నా పూర్వీకులు లేరు. మేము ఎందుకు అంటరాని వాళ్ళమయ్యాం. చరిత్ర పేజీలు వెతకండి. స్పష్టమైన జవాబు దొరికితే చెప్పండి. అందుకే అంటరాని వసంతంలో చరిత్రను నా పూర్వీకుల కోణం నుంచి చూశాను. "బకింగ్‌హాం" కాల్వ తవ్వకాల్లో కులం పేరుతో కూలిపని యివ్వలేదు. భయంకరమైన కరువులు చరిత్రలో అది రికార్డు కాలేదు. దానికోసం చరిత్ర పేజీల్లో కాదు పచ్చ రికార్డు వెతకాల్సి వచ్చింది.

తెలుగులో తొలి నవల "రాజశేఖర చరిత్ర" అని, తొలికథ 'దిద్దుబాటు' అని సాహిత్య విమర్శకులంటే నవ్వు, బాధ రెండూ పుడతాయి. నవ్వు ఎందుకంటే "రాతే అన్నిటికీ మూలం" అనుకొనే వాళ్ళ అజ్ఞానానికి. బాధ ఎందుకంటే ఈ నేల మీద ఎంత దుర్మార్గంగా తొక్కివేసింది అనుకున్నప్పుడు.

నాది అల్లిక వారసత్వమని ముందే చెప్పాను. యిట్లా అనుకొందాం.

భాష - సాహిత్యం - లిపి.

భాష - లిపి - సాహిత్యం.

పై రెంటిలో ఏది ముందు ఏది వెనుక. భాష పుట్టిన కొన్నివేల సంవత్సరాల తర్వాత లిపి పుట్టింది. అంటే లిపి కన్నా ముందు సాహిత్యం వుంది. అది అల్లిక సాహిత్యం, అలిఖిత సాహిత్యం. అంత నిజం ముందు పెట్టుకొని ఆదికవులు, నన్నయ్యలు అనటం ఎంతవరకు న్యాయం. అనువాదకుడు ఆదికవి ఎట్లా అయ్యాడో నాకు యిప్పటికీ అర్థం కాదు శ్రీనాథుడు రాశాడని చెప్పే పల్నాటి చరిత్రని మొదట మాలకన్న మదాసు వారసులు కథగా పాడారు. అదే శ్రీనాథుడు రాశాడని చెప్పే కాటమ రాజు కథని పాడారు. తెలుగు నాటకానికి మూలం మాల వీధి భాగోతం, మాదిగల చిందు భాగోతం యానాదుల వీధి భాగోతం, యర్ర గొల్లల వీధి భాగోతం, అదంతా అల్లిక సాహిత్యం. అల్లిక సాహిత్యంతో పండితవర్గాన్ని హైజాక్ చేస్తే 'పేరిణి' నృత్యం వచ్చింది. జానపదానికి నండూరి ఎంకీ నాయుడు బావల్ని పండితులు చెప్తుంటే నవ్వొస్తుంది. ఎంకీనాయుడు బావ ఫాక్‌లోర్ కాదు. ఫేక్‌లోర్. ప్రకృతిని వికృతి చేసి అదే జానపదమంటే అంతకన్నా దుర్మార్గం మరొకటి లేదు. ప్రజలకు భాష వుంది. అందులో ప్రకృతి లేదు. వికృతి లేదు. ఆ రెండూ పండితుల సృష్టి. గానానికున్న సహజత్వాన్ని చంపితే సంగీతమౌతుంది. పదానికున్న ప్రాణం తీసేస్తే అది పాండిత్యమౌతుంది. ఇక్కడ సాహిత్యానికి వర్ణం వుంది దానితో పాటు కులం వుంది సాహిత్య విమర్శకైతే అవి రెండూ మరీ బలంగా వున్నాయి. అందుకే సాహిత్య విమర్శానికి మళ్ళీ రాయాలని నేనంటాను.

ఆఫ్రికన్ రచయిత గూగీ రివర్ బిట్వీన్ నవలలో నదికున్న ఆవలివొడ్డు పాశ్చాత్య సంస్కృతి, ఈవలివడ్డు ఆఫ్రికన్ సంస్కృతి అని అంటాడు. ఈ దేశంలో వున్న పవిత్ర నదుల కున్న 'వొడ్డు'ల్లో ఏ వొడ్డు నది అని ఈ హిందూత్వ సంస్కృతి చెప్పింది. ఈ బ్రాహ్మణీయ సంస్కృతి చెప్పింది. విచిత్రమేమిటంటే ఈ నదులు, వొడ్ల నాటి పరిసరాల్లో కురిసిన తొలి వసంతం తొలి నాగరికత నా పూర్వీకుల.

నిజానికి అట్టడుగు వర్గాల సంస్కృతి ఎవరికన్నా తక్కువ కాదు. మిమ్మల్ని సంస్కరిస్తాం మేము అని ఎవరన్నా నేననేది వక్కటే మాట. వద్దు. మమ్మల్ని సంస్కరించవద్దు. నీ సంస్కృతి కన్నా నా సంస్కృతి ఎక్కువ కాదు. ఎవడి కులం గొప్ప వాడికుంది. నేను నీకు అంటరానివాడినైతే నీవు నాకు అంటరానివాడివి. ఆకలి, ఆత్మగౌరవం రెండూ నాకు పోరాటాలే. పోరాటం మాకు ఆదర్శం లేదు. అవసరం.

అక్కడ నుంచి పుట్టుకొచ్చింది అంటరాని వసంతం. ఏది ప్రేరణ అన్నారు మీరు. యించేత జీవితం దీనికి ప్రేరణ. నా పూర్వీకులు వాళ్ళు మహోన్నత సంస్కృతి, కళలు, అల్లిక వారసత్వం, సహజమైన మానవ సంబంధాలు.... పోరాటం అంతా ఓ చుక్కల ముగ్గు కర్ర. అంతే అల్లుకొంటూ పొయ్యాను.

**ప్ర: యిదానికి ఎంత కాలం తీసుకున్నారు?**

రాయటానికి సంవత్సరమే పట్టింది. కాని దాని ప్రిపరేషనే దాదాపు పదిహేను యిరవై ఏళ్లముందే మొదలైంది. చాలా సంవత్సరాల క్రితం వెన్నెలదిన్ని పేరుతో రాద్దామనుకున్నాను. ఒకేసారి అంతా రాయలేను. అరుణతార ఎడిటర్‌గా నెల నెలా కొంత రాస్తూ పూర్తి చెయ్యగలిగాను. అట్లా లేకపోతే యిప్పట్లో వచ్చేది కాదేమో :

**ప్ర: నవలకు అంత ఆదరణ రావటానికి కారణాలను రచయితగా మీరెలా చూస్తున్నారు?**

నేను నా జీవితాన్ని రాసుకున్నాను. నా జీవితాన్ని చదువుతూ పాఠకులు తమ జీవితాన్ని వెతుక్కున్నారు. అదే ఈ నవలకు అంత ఆదరణ రావటానికి ప్రధాన కారణం. చరిత్రలో నా పేజీ కోసం నేను వెతికినట్లే అంటరాని వసంతంలో తమ పేజీ కోసం వెతికారు. దొరికితే అనుభవించారు. దొరకలేని వాళ్ళు ఎందుకు దొరకలేదని ప్రశ్నించారు. నిజంగా అదో అద్భుత అనుభవం. ఓ రచన సక్సెస్ అక్కడే వుంటుంది. వెతుక్కోవడంలో, అనుభూతి చెందడంలో అడిగి ప్రశ్నించడంలో నిజానికి రాయాల్సింది చాల వుంది. కావాల్సిన అంశాలు బోలెడున్నాయి.

ఈ నవలలో శిల్పాన్ని గూర్చి చాలామంది మాట్లాడారు. చాలా రకాల పేర్లు పెట్టారు. ఎవరి పద్ధతిలో వాళ్ళు మెచ్చుకొన్నారు. ఆ క్రెడిట్ మొత్తం నాది కాదు. మా అమ్మమ్మది. నేను ముందే చెప్పాను. నాది అల్లిక వారసత్వమని. ఆ అల్లిక వారసత్వంలో అద్భుతమైన శిల్పం వుంది. అది చెప్పడం వినటంలా వుంటుంది. పెరల్ ఎస్. బక్ తనకు నోబుల్ బహుమతి వచ్చినప్పుడు చైనా నవలను గూర్చి మాట్లాడుతూ అంటుంది. చైనాలో నవల చదువురానివాళ్ళు చదువు రానివాళ్ళకు చెప్పడంలో వినటంతో మొదలై చివరకు రాజ మందిరాల్లోకి వెళ్ళిందని అంటుంది.

చెప్పడం వినటం ఎంత అద్భుతమైందో మా అమ్మమ్మ నాకు నేర్పింది. ఆమె "ఓ హెన్రీ" కన్నా గొప్ప కథకురాలు. ఆమె చెప్పటంలో ఆ పట్టు వుంది. అదే నేను నవలలో ఉపయోగించాను. చెబుతూ ఉన్నాను. గాయకుడికి ప్రేక్షకుడికి వున్న సంబంధం అది. అల్లిక వారసత్వం ఎంత గొప్పదో అంటరాని వసంతం రుజువు చేసింది.

తెలుగులో తొలి నవల "రాజశేఖర చరిత్ర" అని, తొలికథ 'దిద్దుబాటు' అని సాహిత్య విమర్శకులంటే నవ్వు, బాధ రెండూ పుడతాయి. నవ్వు ఎందుకంటే "రాతే అన్నిటికీ మూలం" అనుకొనే

వాళ్ళ అజ్ఞానానికి బాధ ఎందుకంటే ఈ నేల మీద ఎంత దుర్మార్గంగా తొక్కివేసింది అనుకున్నప్పుడు.

ఏ వర్గం జీవితం అంటరాని వసంతంలో వర్ణించానో ఆ వర్గాలు ఈ నవలని గుండెలకు హత్తుకొన్నాయి. గొప్ప అంశమేమిటంటే పల్లెల్లో ఈ నవలను ఒకరు చదువుతుంటే పదులుగా, వందలుగా కూర్చొని విన్నారు. వింటూ మాట్లాడుకున్నారు. చెప్పటం వినటం కాకపోతే చదవడం వినడం. నవల అంత ఆదరణకు నోచుకోడానికి యివన్నీ కారణాలు.

తెలుగునాటకం మీద నా మొత్తం వ్యాసం పూర్తి కాకముందే ఆయన తొందర పడ్డాడు. "తాను చేసిన విమర్శలో లోతుపాతులు కళ్యాణరావుకు పూర్తిగా తెలుసునా అని సందేహం పడవలసి వస్తుంది. పని ఆయన అన్నారు. ఎంతైనా కె. శ్రీనివాస్ పండిత వర్గానికి చెందిన వాడు.

**చారిత్రకంగా 'మాలపల్లి' - "అంటరాని వసంతం" రెంటికి మధ్య పోలిక, తేడాలు ఏమిటి?**

ఆంగ్లో యిండియన్ లిటరేచర్ వుంది. ఇండో ఆంగ్లికన్ లిటరేచర్ వుంది. రిడియార్డు కిప్లింగ్ 'కిమ్' నవలలో 'కిమ్' పాత్ర వుంటుంది. ముల్కరాజ్ ఆనంద్ 'అన్‌టచ్‌బుల్' నవలలో "మున్న" పాత్ర వుంది. కిప్లింగ్‌ది 'On looker View' బయట నుంచి చూసింది. 'కిమ్' విదేశస్తుడు రాసిన ఈ దేశం పాత్ర. మున్నా ఈ దేశస్తుడు రాసిన ఈ దేశం పాత్ర.

'మాలపల్లి' 'On looker View'. ఉన్నవ మాలపల్లి కన్పించదు. ప్రతి రచయితకి అతని సొంత జీవితం వుంటుంది. సాంఘిక జీవితం వుంటుంది. రాజకీయాలు వుంటాయి. ఉన్నవ గాంధేయవాది మాలపల్లి గాంధేయవాదం లోంచి వచ్చింది. అందుకనే సంగమ దాసు చనిపోయాడు. రామదాసు బతికుంటాడు. నేను విప్లవ రాజకీయాలు నమ్మినవాణ్ణి. అందుకే ఎల్లన్న వారసుడు 'జెస్సి' విప్లవోద్యమంలోకే వెళ్ళాడు. మాలపల్లిలో హిందుత్వ ప్రభావం వుంది. సంస్కరించాలనే శుద్ధ యజ్ఞం అది. అంటరాని వసంతం ఓ పోరాట జీవితం. ఆ పోరాటం ఆదర్శం కాదు. అవసరం. డా. అంబేద్కర్ "గాంధీ వున్నాడు జాగ్రత్త" అని అంటారు. గాంధీ సంస్కరణ మీద గొప్ప మాట అది.

**చిన్న వాక్యాలు రాయడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నారా?**

ప్రత్యేక శ్రద్ధ తీసుకోలేదు. అది నా శైలి. చలం వచనం అంటే నాకు చాలా యిష్టం. శ్రీశ్రీ కవిత్వం కన్నా ఆయన వచనం నాకు బాగా నచ్చుతుంది. ఆయన అద్భుత వచనమంతా మహాప్రస్థానంతో కొట్టుకుపోయింది. మామూలు జనం మాట్లాడేటప్పుడు వినండి. ఆ వాక్యాలు చాలా చిన్నవిగా ఉంటాయి. వాటిల్లో రిథమ్ వుంటుంది. నా శైలి ఆ మామూలుతనం లోంచి వచ్చింది. ఆ రిథమ్‌లో ప్రాణం పోసుకొంది. ఓ ఆఫ్రికన్ కుర్రాడు పిల్లనగ్రోవి అద్భుతంగా వాయిస్తున్నాడట. అది తనకు నేర్పమన్నాడట ఓ అమెరికన్. నేర్పటం తనకు రాదన్నాడట ఆ కుర్రాడు. నువ్వు ఎట్లా నేర్చుకున్నావన్నాడట ఆ అమెరికన్. నేను నేర్చుకోలేదని అన్నాడట ఆ కుర్రాడు. జనం శైలికి ఒకరు నేర్పటం నేర్చుకోవటం వుండదు. ప్రత్యేక శ్రద్ధ అంటూ వుండదు. అది గాలి, నీరు, వెలుతురు అంత సహజంగా ఉంటుంది.

**ఇతివృత్తానికి - కథనంలో ఉపయోగించిన భాషకి వైరుధ్యం వుందనే వ్యాఖ్య మీ దృష్టికి వచ్చిందా?**

రాలేదు. కథని రూతు చెప్పింది. రూబేను చెప్పాడు. అవసరం వచ్చినప్పుడు నేను (రచయితను) చెప్పాను. భాషావైరుధ్యం వచ్చే అవకాశం లేదు. దళిత సంస్కృతిలో జీవితంలో మానవ సంబంధాలలో వున్న రిచ్‌నెస్ చూపాను. చుక్కలతో చెలిమి మా వారసత్వమే. ఇతివృత్తానికి, కథనానికి, ఉపయోగించిన భాషకి వుంది సహజ సంబంధమే. వైరుధ్యం లేదు. అంతేకాదు. ప్రకృతికి కాలానికి, జీవితానికి, ఓ తెగని బంధం అట్టడుగు వర్గాల జీవితాల్లో చూస్తాం.

**నవలకు యిచ్చిన ముగింపు సహజమైందా? సైద్ధాంతిక నిబద్ధత నుంచి వచ్చిందా?**

సహజత్వం వుంది. సైద్ధాంతిక నిబద్ధత వుంది. రెండూ ఉన్నాయి.

**క్రైస్తవ మత పరిణామం గురించి చారిత్రకంగా చాలా పరిశోధించారు. ఈనాటి రాజకీయ నేపథ్యంలో ఈ సమస్యకు ప్రత్యేక ప్రాధాన్యతలు వున్నాయనుకుంటున్నారా?**

నిజమైన క్రైస్తవ మిషనరినీ, బ్రిటీష్ ప్రభుత్వాన్ని వేరు వేరుగా చూడాలి. ఈ నవలలో చాలా జాగ్రత్త పడ్డది కూడా అక్కడే. ఆ రోజుల్లో దళిత వర్గాలకు మిషనరీలు గొప్ప సేవ చేశారు. అంతేకాదు, దళితులు క్రైస్తవులుగా ఎందుకు మారారు అనేది కూడా వివరించాలనుకొన్నాను. మైనారిటీ మతాలమీద, వర్గాల మీద ఈ రోజు జరుగుతున్న దాడుల నేపథ్యంలో ఈ సమస్యకు ప్రత్యేక ప్రాధాన్యత కూడా వుంది.

**మీ అభిప్రాయాల గురించి 'గమనం'లో ఒక వ్యాసకర్త వ్యాఖ్య చేశారు. దానిమీద మీ ప్రతిస్పందన?**

తెలుగునాటకం మీద నా మొత్తం వ్యాసం పూర్తి కాకముందే ఆయన తొందర పడ్డాడు. "తాను చేసిన విమర్శలో లోతుపాతులు కళ్యాణరావుకు పూర్తిగా తెలుసునా అని సందేహం పడవలసి వస్తుంది. పని ఆయన అన్నారు. ఎంతైనా కె. శ్రీనివాస్ పండిత వర్గానికి చెందిన వాడు. సాహిత్యంలో లోతుపాతులు పండితవర్గాలకు మాత్రమే తెలుస్తాయి అనే అభిప్రాయం ఆయనకు వుండటంలో తప్పు పట్టాల్సిన అవసరం లేదు. ఒక విషయం యిక్కడ చెప్పాలనుకొంటున్నాను. కె. శ్రీనివాస్ గాని యింకా వర్తమాన పాండిత్యవర్గం గాని గుర్తు పెట్టుకోవాలి. ఆంగ్ల సాహిత్యాన్ని ఈ రోజు నిలబెడుతోంది ఆంగ్లేయులు కాదు. ఆఫ్రికన్లు. అదేవిధంగా తెలుగు సాహిత్యాన్ని ఈ రోజు నిలబెడుతోంది పండితవర్గం కాదు. అట్టడుగువర్గాలు. ప్రత్యేకించి దళిత వర్గాలు. ఈ విషయం శ్రీనివాస్ లాంటివాళ్ళు గుర్తుంచుకొంటే మంచిది. నా అభిప్రాయాలు నేను స్పష్టంగానే చెప్పాను. ప్రజల భాష అప్పుడూ యిప్పుడూ వాడుక బాషగానే అట్టాగే వుంది. ప్రజల భాషని కృత్రిమం చేసి గ్రాంధికం చేసింది పండితులే. తిరిగి వాడుక భాషంటే వాడుక

భాషా పితామహులైంది పండితులే. తెలుగు సాహిత్యంలో యిదో విచిత్ర విన్యాసం. ప్రజల భాషకు సంబంధించి గురజాడలు, గిడుగులు అక్కరలేదు. ప్రజలెప్పుడూ వాళ్ళ భాషను చెడగొట్టుకోలేదు. ప్రజల భాష ఎప్పుడూ సజీవంగానే వుంది. ఎప్పుడో అల్లుకొన్న భాష మనుషుల్ని కాదని అది మానవాతీతం కాలేదు. భాషే కాదు. కళలూ అంతే. అందుకే నేను సాహిత్య విమర్శని, విశ్లేషణని తిరిగి రాయాలంటున్నాను. నేను పండితుణ్ణి కాదు. పాండిత్యం నాకు చేతకాదు. ఈ సందర్భంలో నేను అల్లుకొన్న ఈ నాలుగు వాక్యాలు మీ ముందుంచుతాను.

మా అయ్య అల్లిందాన్నే
వాడయ్య రాసేడు
అల్లి, అంటరానిదైంది
రాతే మోరాజై కూసుంది.

ఎందుకో గాని తెలుగు సాహిత్యాన్ని అనుకొన్నప్పుడు, తెలుగు కథ, నవల, నాటకం, కవిత్వం, పాట, విమర్శ, విశ్లేషణ ఏదైనా కావచ్చు. వాటి మూలాల్ని అనుకొన్నప్పుడు నాకు ఆ నాలుగు వాక్యాలు పదే పదే గుర్తుకొస్తాయి. ఇది విమర్శకులు, విశ్లేషకులు గుర్తిస్తే మంచిది. అప్పటిదాకా తెలుగు సాహిత్య విమర్శ, విశ్లేషణ గొర్రెకు బెత్తెడుతోక.

**అంటరాని వసంతం' కు ముందు రచయితగా మీ అనుభవం?**

నాటకాలు రాశాను. నటించాను. దర్శకత్వం వహించాను. తొలిపొద్దు. సైటైర్, కులం, లాకప్ మొదలైన నాటకాలు.... ఆ రోజుల్లో ఒక రాత్రి, జైలు, అరుణ, ఇడియట్, సన్నివేశం, పార్లమెంట్ పాయిఖానా, నీడ, కాలేజ్ నెక్స్ట్ విటనెస్ లాంటి నాటికలు రాశాను. "నేనే మడిగానని" అనే కథా సంకలనం వచ్చింది. "కాలం" అనే సుదీర్ఘ కవిత రాశాను. యింకా కొన్ని కథలు, కవితలు రాశాను. "తెలుగు నాటకం - మూలాలు" తెలుగు నవల - విశ్లేషణ" మొదలైన విమర్శనలు రాశాను. రాత నాకు చిన్నప్పుడే అలవాటయింది. హైస్కూల్ చదివే రోజుల్లోనే నాటికలు రాశాను. కాలేజి రోజుల్లో నా కథలు ఆంధ్రజ్యోతి లాంటి వారపత్రికలలో వచ్చాయి. రచయితగా గుర్తింపు కోసం నేను ఏదీ రాయలేదు. నా విశ్వాసాలు నాకున్నాయి. నేను నమ్మిన సిద్ధాంతం నాకుంది. నేను విప్లవ రచయితని. పోరాటం, రచన ఆ రెండూ నాకు అవసరాలు. ఆదర్శాలు కాదు. ఆ అవసరమే నా చేత రాపించింది. రాపిస్తోంది అంతే.

**సాధారణంగా ఓ గొప్ప రచన తర్వాత ఆ స్థాయి రచన ఆశించుతారు. అందించాలని రచయిత భావిస్తాడు. మీరు మీ భావి ప్రణాళికలు?**

ఏది గొప్ప రచన? ఎవడు గొప్ప రచయిత? అదంతా పండిత వర్గాల విభజన. మనం అట్లా అనుకోవద్దు. మనకు నచ్చిందే గొప్ప రచన. అంటరాని వసంతాన్ని గుండెలకు హత్తుకున్నవాళ్ళున్నారు. బైటకు

మనకు నచ్చిందే గొప్ప రచన. అంటరాని వసంతాన్ని గుండెలకు హత్తు కున్నవాళ్ళున్నారు. బైటకు మెచ్చుకొని లోపల తిట్టు కున్నవాళ్ళున్నారు. రచన కన్నా జీవితం గొప్పది. ఆ జీవితం రచయితకి పాఠకుడికీ, విమర్శ కుడికి వుండాలి.

మెచ్చుకొని లోపల తిట్టుకున్నవాళ్ళున్నారు. రచన కన్నా జీవితం గొప్పది. ఆ జీవితం రచయితకి పాఠకుడికీ, విమర్శకుడికి వుండాలి. జీవితం తాలూకు అనుభవం లేనప్పుడు రచనలో మనకు కన్పించేది కేవలం సౌందర్యమే.

అంటరాని వసంతం జీవితం తాలూకు రఫ్ నోట్సు. ఆ నోట్సు యింకా వుంది. మూడు భాగాలు దాద్దామనుకున్నాను. మొదటి భాగం రాయాల్సి వుంది. మూడో భాగం రాయాల్సి వుంది. "అంటరాని వసంతం" నేను తయారు చేసుకొన్ని రఫ్ నోట్సులో రెండో భాగం. మిగిలిన భాగాలు పూర్తి చేస్తాను. నా పూర్వీకులు వదిలి వెళ్ళిన బోలెడు అల్లిక వుంది. దాన్ని బయటకు తీసుకు రావాల్సి వుంది. ఏది చేసినా నాకు జీవితం, రచన, పోరాటం వేరు కాదు. ఈ భూమ్మీద మనిషి హృదయంలో మంచి భవిష్యత్ మీద విశ్వాసాన్ని పెంచాలి. అట్లా పెంచడం మంచి రచన బాధ్యత. కర్తవ్యం. అవసరం అంటే అదే. యిక్కడ ఈ నేల మీద నూతన సమాజాన్ని కలలు కనే పోరాట యోధులున్నారు. వాళ్ళ కలలన్నీ వో విప్లవ సంకలనం. ప్రేమ, పోరాటం, త్యాగం ఆ సంకలనం నిండా అల్లుకొని ఉంటాయి. వీళ్ళు విజయాన్ని చవి చూస్తారు. నా విశ్వాసం చిన్నది కాదు. వాళ్ళు ప్రపంచాన్ని జయిస్తారు. నా నమ్మకం వొమ్ము కాదు. నా రచన, నా జీవితం, నా భవిష్యత్ ప్రణాళిక అక్కడే ఉంటుంది. అంటరాని వసంతంలో రూతు జ్ఞాపకం యుద్ధంలో విశ్రమిస్తుంది. నా రచనా అంతే యుద్ధంలోనే. నా విశ్రాంతి యుద్ధంలోనే. శ్వాస ఆగినా, కలం ఆగినా అక్కడే. నా భవిష్యత్ ప్రణాళిక నా చేతిలో లేదు. ప్రజల చేతిలో వుంది. వాళ్ళ పోరాట మార్గంలో వుంది. అంతా ఓ నడక.

**నిబద్ధ రచయితలకు వాస్తవ చిత్రణకు సామ్యం కుదరదనే దానికి మీ సమాధానం?**

'అంటరాని వసంతం' కన్నా మించిన సమాధానం అనవసరం. తెలుగు సాహిత్యంలో ఓ ప్రత్యేక స్థానాన్ని పొందిన ఆ నవలని విప్లవ రచయిత గానే కాదు, విప్లవ రచయితల సంఘానికి కార్యదర్శిగా వున్నప్పుడు రాశాను. నిబద్ధత లేని రచన ప్రాణం లేని శరీరం లాంటిది.

**మీ అభిమాన రచయితలు? పుస్తకాలు?**

చాలామంది రచయితలవి చదివాను. చలం, జాషువా, శ్రీశ్రీ, కొ.కు. రావిశాస్త్రి, ఆర్కే నారాయణ్, ముల్కరాజ్ ఆనంద్, జేమ్సు జాయిస్, హ్యూగో, డికెన్సు, హెమింగ్ వే జాన్ ఆస్టిన్ టాల్ స్టావన్, గోర్కీ, గూగి, షేక్స్‌పియర్, షెల్లీ, కీట్సు, అట్లా చాలామందివి చదివాను. నాకు అభిమాన రచయితలు, రచనలు లేవు, వెన్నాడే రచనలు వెంటాడే రచయితలున్నారు.

# నత్తల మారథాన్

గోడల్ని మోసుకుంటూ
వీధుల్లో వేలకొద్దీ నత్తలు....
క్లాక్‌వైజూ లేదు, యాంటీ క్లాక్‌వైజూ లేదు
ముల్లు లేని గడియారంలో రాత్రి లేదు
నియాన్ లైట్లు నిద్రని మింగేస్తాయ్
పనే తప్ప గంటల్తో పని లేదు
చెమట తియ్యగా వుంటుంది
నత్తలకు నాలుకల్లేవులే....!
సెన్సెక్స్ ముళ్ళమీద మనల్ని ఆరేసుకుంటూ
న్యూయార్క్ స్టాక్ ఎక్స్ఛేంజి పొయ్యి మీద
మన పేగుల 'చారటీ' కమ్మగా కుతకుతలాడుతుంది
గ్లాస్‌లో ఐస్‌ముక్కలా
చొంగ చల్లగా కరుగుతుంది
ఎవరో ఆకాశం బొందు లాగుతారు
నత్తలు తొల్లల్లో దూరి
గత్తర తప్పిందనుకుంటాయ్,
అక్కడెక్కడో వీధి మొగదల్లో
తలుపు వెనకల్నుంచీ
టీ.వీ. ధారావాహిక
కాలనీల్ని ఆక్టోపస్‌లా మింగుతూ...
నత్తలు తత్తరపడి
రిమోట్ మీద తలలు బాదుకుంటాయ్
చూపులు చప్పుడు చేయవు
ఆక్టోపస్ నాలుక చల్లగా తగిలి
కళ్ళు హాయిగా ఒళ్ళు విరుచుకుంటాయ్



ఫ్యాన్సీ షాపు షోకేసులో
రెప్పల్లేని ఐలాషెస
నిస్సిగ్గు బరువుతో కాలి, సోలి.....
చెప్పలేం, రేప్పొద్దున్న
షో కేసుల్లో వక్షోజాలూ, వృషణాలూ
వేలాడొచ్చు,
గ్లోబల్ చర్మం కింద
మీటలే తప్ప రక్తమాంసాలుండవ్!

కథ | డా॥ వి. చంద్ర శేఖర్‌రావు

# కాఫీ పరిమళాల మీదుగా నిద్రలేచి...



1

**ఒంటరి ఆకాశం, మబ్బులన్నీ ముసిరి, వానను ఊరిస్తూ మనోహరమైన ఉదయాన్ని వాగ్దానం చేసిన రోజున, సుందరం అదృశ్యం గురించిన కబురు తెలిసింది.**

2

ఒక కాఫీ పరిమళం కోసం ఉదయాలన్నీ వెతుకుతాను. కానీ ఇవి ఆనాటి ఉదయాలు కావు. కాఫీ పరిమళం, న్యూస్ పేపరు విరజిమ్మే వార్తలు వెచ్చని సూర్యకిరణం, దిండుకింద గుబాళించేకల, మధురమైన ఆమెనవ్వు (ఆమె నవ్వటం మానివేసి చాలా రోజులైంది) ఇప్పుడేదీలేదు. నగరం నిద్రలేచే సమయానికి వర్షం మొదలైంది. కిటికీలోంచి చెట్లు ఊగుతున్న దృశ్యం. లేత ఎరుపురంగు ఆకాశం, క్రమంగా నల్లబారి, తపతపమంటూ వర్షం. రేడియోలో ప్రాంతీయ వార్తలు మధ్యలో సమయం ఆరుగంటల నలభై అయిదు నిమిషాలని ప్రకటన. కిటికీలోంచి, వానలోంచి చూపుసారిస్తే, ఆరుగంటల యాభై నిమిషాలకు ఎప్పటిలాగే ఆ అమ్మాయి. ప్రతి రోజూ ఆ సమయానికి వేగంగా నడుచుకుంటూ 'గడియారపు పిట్ట' అని ఆ అమ్మాయిని పిలిచే వాడు సుందరం. ఇవాళ కూడా ఆ అమ్మాయి సరిగ్గా అదే సమయానికి పైన గొడుగు, చీరకుచ్చిళ్ళను ఎగదోపుకొని, నీళ్ళను ఈదుతూ వెళ్ళిపోయింది. దూరప్రాంతంలో ఎక్కడో ఉద్యోగంలేదా సంకేత స్థలంలో ఎదురు చూసే ప్రియుడు లేదా కాలాన్ని దైవంగా భావించే ఒక కార్యకర్త లేదా, లేదా రకరకాల ఊహాగానాలు చేసే వాడు సుందరం. ప్రతి రోజూ అదే సమయానికి ఆ అమ్మాయిని రోడ్డుపైన చూడం ఎంతో ఇష్టం సుందరానికి. ఆ అమ్మాయిని చూడటం కోసం, ఉదయం ఆరు గంటల యాభై నిమిషాల కోసం చాలా రాత్రులు మా యింట్లోనే గడిపేవాడు. కిటికీలోంచి ఆ అమ్మాయికి చెయ్యి ఊపుతూ ఆ అమ్మాయి సన్నని నవ్వుని ఎంజాయ్ చేస్తూ - వాన క్రమంగా పెద్దదయింది. వానాకాలం తన తొలి వర్షంతో పలకరిస్తుంది. ప్రచండమైన వాన. తెరిపిలేకుండా కురుస్తుంది. గోడలు, తలుపులు, దూరంగా ఉన్న ఒడ్లు, వరసగా పేర్చబడ్డ ఇళ్ళు, సమస్తమూ నీటిధారల మధ్యన వేలాడుతూ వాన అనే థ్రిల్ తెలుస్తుంది. భగవంతుడు మళ్ళీ బ్రతికివచ్చినట్లు వాన సుందరానికి ప్రియమైన విషయం. వానలో తడుద్దాం. మళ్ళీ మొలకెత్తుదాం!" అంటూ వానలోకి లాక్కు వెళ్ళేవాడు. వానాకాలంలో అతను రాసే కాలమ్ (సుందర కాలమ్ పేరుతో ప్రతి శనివారం వస్తుంది) ఒక అద్భుతం గొప్ప కవితాత్మకమైన ప్రోజ్ అతనిది. ఇవాళ శనివారం. ఇవాళా సుందర కాలం రాలేదు. వరుసగా మూడో వారం ఏమైంది సుందరానికి? అని వాకబు చేస్తే ఏమో ఏమో అనే

వారం ఏమైంది సుందరానికి? అని వాకబు చేస్తే ఏమో ఏమో అనే సమాధానంలోంచి సుందరం అదృశ్యం గురించిన కబురు తెలిసింది. ముందుగా అతని మాజీ ప్రియురాలు మోహినిని అడిగాను. ఎప్పటిలాగే ఆమె కళ్ళలో మౌనం. న్యూథియేటర్ కుర్రవాళ్ళ నడిగాను. రెండు వారాలయింది చూసి అన్నారు. మేక్‌బెత్ తెలుగు అనువాదం పూర్తి చేసి ఇవ్వాల్సి వుంది అని కూడా అన్నారు.

దేశి అనే కవి సుందరం గురించి కొన్ని సంగతులు చెప్పాడు. నాలుగు వారాల క్రితం సిమెట్రీ దగ్గర అతన్ని చూశాను. అమ్మ సమాధి కోసం కొంచెం స్థలం రిజర్వు చేయాలని వచ్చానన్నాడు. ఆశ్చర్యంగా చూస్తుంటే అది కాదు, అమ్మ ఆరోగ్యం గురించి నీకు తెలుసుకదా. జ్ఞాపకాలన్నీ చచ్చిపోయాయి. శరీరం కూడా క్షీణించి, పొగులు పొగులుగా విడిపోతూ, క్రమంగా ఏదో ఒక రోజు ఆమె మరణంగా మిగిలిపోవచ్చు. అమ్మ శవాన్ని నెత్తిన పెట్టుకొని మళ్ళీ మా పల్లెటూరు దాకా వెళ్ళలేను. అందుకే..' అని సంజాయిషీలా చెప్పేడు సుందరం" అదే దేశి కథనం. అతను చెప్పిన దాని ప్రకారం. ఆ స్థలం కూడా దొరకలేదు. జాగా లేదు. చనిపోనివ్వండి. అంతకు అవసరమైతే ఏదో ఒక సమాధిని పక్కకు జరిపి - అన్నాడట వారు దాంతో వాడితో గొడవ పెట్టుకున్నాడట సుందరం. మామూలుగా అనిపించే సుందరం అదృశ్యం గురించిన కబురు క్రమంగా గుబులు రేపే విషయంగా మారింది. వాన ఇప్పుడు సుందరాన్ని గుర్తు చేస్తుంది. ముఖ్యంగా హామ్లెట్ నాటకం. చివరి దృశ్యం, కత్తిపదును, చిమ్మిన రక్తం, థియేటర్‌ని మైస్మరైజ్ చేసిన సుందరం వాన ఇప్పుడు మరణిస్తున్న మనిషి పెనుకేకలా ఉంది.



### 3

సిటీ మనల్ని ఎప్పుడూ ఆశ్చర్యపెడుతూనే ఉంటుంది. ఇంత వానలోనూ సిటీబస్‌లోని సీట్లన్నీ నిండిపోయి ఉన్నాయి. అప్పుడే వదయింది. ఇక్కడ కాలం ఒక నమ్మకద్రోహంలాంటిది. ఆకుపచ్చరెయిన్ కోటుతో ఒళ్ళంతా కప్పుకొని, గేటు దగ్గర వేళ్ళాడుతూ, వానయింకా వెంటాడుతూనే ఉంది. బస్సులోపల గంభీరమైన వాతావరణం. ఎప్పుడూ కనబడే అరుపులు, కేకలు లేవు. కూర్చున్న వాళ్ళు గొప్ప ధ్యానంలో ఉన్న వాళ్ళలా, వాళ్ళలో చాలా మంది చేతుల్లో ఎఫేస్ ఆఫ్ టెర్రిజం అనే బిన్ లాడెన్‌పై పుస్తకం వుంది. పరీక్షకు చదువుతున్నంత శ్రద్ధగా బస్సు మధ్యలో గడియారపు పిట్ట అనే అమ్మాయి కనబడింది. నాలో ఉత్సాహం. జనాన్ని తోసుకుంటూ ఆ అమ్మాయి వైపు వెళ్ళాను. ఆ అమ్మాయి చేతిలోనూ పుస్తకం అయితే అది బిన్ లాడెన్ గురించినది కాదు. ఏదో కవిత్వం. సుందరం ఈ సమయంలో ఉంటే పెద్దగా ఉద్రేకపడి, బహుశా ఆ అమ్మాయిని పలకరించి, కబుర్లు చెప్పి అయ్యో సుందరం లేదే అని మళ్ళీ దిగులు.

### 4

సుందరం చనిపోయి ఉంటే, హఠాత్తుగా ఒక ఉలికిపాటు. బహుశా చనిపోయే ఉంటాడు. తనకిష్టమైన షేక్స్‌పియర్ నాటకాల పాత్రలాగే, ముఖంగా హామ్లెట్‌లాగా ఊహు! చనిపోయి ఉండడు. ఏదో రోజు అతను తిరిగి ప్రత్యక్షమవుతాడు. బహుశా ఒక ఉదయంపూట అతను ఆఫీసులో తనకిష్టమైన కిటికీ పక్క సీట్లో కూర్చుని, సన్నని నవ్వు ముఖంతో, సిగరెట్టు పొగ, టీవాసనల మధ్య తను కొత్తగా ఆ వారం రాసిన కాలమ్ చదివి వినిపిస్తూ లేదా యుద్ధం చేస్తున్నంత తీవ్రతతో ఎవరితోనో వాదిస్తూ, ఎదురు కావచ్చు. అతని అదృశ్యం గురించి మేం పడిన ఆందోళన వింటూ, నవ్వుకుంటూనో లేదా విసుక్కుంటూనో

### 5

రోడ్డుపై నీళ్ళు, నీళ్ళను చీల్చుకుంటూ సిటీబస్. కూర్చోడానికి సీటు దొరికింది. అదీ గడియారపు పిట్ట అనే అమ్మాయి వెనకసీట్లో ఆ అమ్మాయి దీక్షగా పుస్తకం చదువుతుంది కవిత్వం. బహుశా హైకూలు కావచ్చు. హలో అన్నాను. ముఖాన్ని వెనక్కుతిప్పి, నిలువుగా సాగదీసి, సన్నగా నవ్వి, మళ్ళీ ముందుకు తిరిగింది. పొద్దున్నే గడియారపు ముల్లు అంతఖచ్చితంగా ఎక్కడికి వెళుతుంటారు? అన్నాను. కాసేపు ఆశ్చర్యంగా నా వైపు చూసి, తల పక్కకు తిప్పుకొని నిముషం తరువాత, పుస్తకం మూసేసి నా వైపు తిరిగి కళ్ళు అటూ ఇటూ తిప్పుతూ, స్కూల్లో టీచరు ముందు పాఠం అప్పచెబుతున్నట్లుగా" పొద్దున్నే ఓల్డ్ ఏజ్డ్ హోంకి వెళతాను. పది గంటల దాకా వాళ్ళకు ఆయాగా ఇదుగో ఇక ఇప్పటి నుంచి ఎర్రగడ్డ ఎసైలమ్‌కి వెళతాను. రాత్రికి నిర్మల హృదయం వాళ్ళ మెంటల్ రిటార్డెడ్ పిల్లల హోమ్‌లో గడుపుతాను అంది ఎంతో సీరియస్‌గా. మళ్ళీ ఒక్క శనివారం మాత్రం ఎక్కడికీ వెళ్ళను ఆ రోజు సైకియాట్రిస్ట్ థా॥ రమణ క్లినిక్‌కి వెళతాను. ఆ రోజు ఆయనకు నేను కవిత్వం రాసి చూపించాలి. వారమంతా ఏం చేశానో వివరంగా చెప్పాలి" ఆ రెండు మాటలూ గడగడా చెప్పి మళ్ళీ పుస్తకం చదువుకోవటం మొదలు పెట్టింది. ఎందుకో మళ్ళీ ఆమెను కదిలించాలనిపించలేదు. వాన కురుస్తునే ఉంది. ఆ అమ్మాయి పెద్దగా గొణుక్కుంటూ పుస్తకాన్ని చదువుతుంది. వీధులిక నీ ప్రియమైన వాళ్ళను గుర్తు చెయ్యవు ఆ అమ్మాయి గొంతులోంచి ఒకటి రెండు పదాలు కిందకు జారిపడుతున్నాయి. ప్రవక్తల గొంతులా ఏ ఉద్రేకాలూ లేని స్వరం.

### 6

నిన్న పది గంటలకు ఆఫీస్‌లో ఎస్ఒఎస్ మీటింగ్ ఎడిటర్ అందరు సబ్‌లు, కార్టూనిస్ట్ నలుగురైదుగురు రచయితలు , కాలమిస్ట్‌లు ఉన్నారు. సుందరం అదృశ్యం గురించి చర్చ. ఇల్లు తాళం వేసి ఉంది. చాలా యేళ్ళుగా తెరవని ఇల్లులా దుమ్ముపట్టి ఉంది అన్నాడు. సినిమా పేజీ చూసే సబ్-సుందరం గురించి నాకు తెలియాలి! సాయంకాలానికి, కనసం రేపటికి ఎడిటర్ విసుకున్నాడు. ఆయనకు

చాలా కోపంగా ఉంది. ఇదేమిటిది! అరణ్యమా! నగరమా? ఒక జర్నలిస్టు కనబడకపోతే ఎవరికీ పట్టదు. మూడు వారాల తరువాత తాపీగా కనపబడలేదని చెబుతారా? పెద్దగా అరిచేడు రకరకాల ఊహాగానాలు, కామెంట్ల మధ్య మీటింగ్ ముగిసింది. పోలీస్ స్టేషన్, హాస్పటల్, మిత్రుల ఇళ్ళు, సాహిత్యపు వర్క్‌షాపులు బార్‌లు, తలో వైపుకు వెళ్ళవలసిందిగా ఆదేశించాడు ఎడిటర్

**7**

వాన తగ్గిపోయింది గాని, మబ్బులు మాత్రం మరో పెద్ద జల్లును ప్రామిస్ చేస్తున్నాయి. బస్సులో క్రమంగా శబ్దాలు మొదలయినాయి. వందనోళ్ళు వేల పదాలు, శబ్దాలు ఆ పదాలన్నీ గుట్టలు గుట్టలుగా పోగయి ఊపిరాడునట్లుగా ఉంది. ఆ గొడవ మధ్యన గడియారపు పిట్ట అనే అమ్మాయి గొంతు కూడా. "అతన్ని అర్థం చేసుకోండి! అతనిగాయంలోతైంది!" కవిత్వం కాబోలు నేరుగా చెవుల్లోకి ప్రవేశిస్తుంది. కళ్ళు మూసుకుంటే, ఆ కవిత్వం ఒక దృశ్యంలా మహానగరం విశాలమైన చౌరస్తా, వందల జనం, అటెన్షన్‌లో నిలబడ్డట్టు వేదికపై ఒకే ఒక వక్త. గడియారపు పిట్ట అనే అమ్మాయి, శ్రావ్యంగ కవిత్వం చదువుతూ, యుద్ధంలో లాగా, గాయాలు గాయాలుగా ఆ అమ్మాయి కవిత్వ పఠనం కొనసాగుతూనే ఉంది. మధ్యాహ్నామైంది. కొద్దిగా ఎండపొడ. సుందరం గుర్తుకొచ్చాడు. సుందరం ఈ రోడ్డు మధ్యన ఎక్కడో పుట్టుకొస్తాడు. జనం మధ్యలోంచి హఠాత్తుగా సుందరం రూపం తళుక్కుమంటున్నదేమోననే ఆశ. సుందరం పదేపదే తటస్థపడే కాందిశీకుడు. బస్సు కిటకిటలాడుతుంది. బరువుగా కదులుతున్న బస్సు రోడ్డు మధ్యన హఠాత్తుగా ఆగిపోయింది. కంగారు, భయం, అరుపులు తొక్కిసలాట ఏమైంది? ఎవరో అరుస్తున్నారు. దొమ్మి పోలీసు కాల్పులు, ఎన్‌కౌంటర్, బహుశా ఏదో ఒక పాత దృశ్యమే అయ్యుంటుంది. గౌలిగూడ బస్టాండ్‌లో బాంబు పేలిందట. ఎవరో అరిచారు. జనం బస్సు దిగి, అటూ ఇటూ పరిగెత్తుతూ బాంబు అరుస్తున్న ముఖాలు, భయాన్ని సూచించే కళ్ళు, బస్సులన్నీ ఆపివేశారు. ట్రాఫిక్ ఆగిపోయింది. గడియారపు పిట్ట అనే అమ్మాయిది పేరింకా కనుక్కోలేదు అనీజీగా ముఖం పెట్టి కవిత్వం పుస్తకాన్ని పర్సులో దాచేసుకొని జన ప్రవాహంలోకి జారబడింది.

**8**

వాదించటం సుందరానికిష్టం. అతనివాదం ఒక ప్రణాళికలా ఉంటుంది. ముందు రీజనింగ్‌తో మొదలు పెడతాడు. అది క్రమంగా గాఢమైన ఉద్వేగభరితమైన ప్రకటనలా మారుతుంది. అప్పటికీ అతనివాదన హేతుబద్దంగా తోస్తుంది. క్రమంగా అతనివాదన తీవ్రమైన యుద్ధంలా తోస్తుంది. చుట్టూ ఉన్న వాళ్ళందరూ అతని భావాల ముట్టడిలోకి వెళ్ళిపోవటం గమనిస్తాము.

**9**

గుంపులోంచి పక్కకు తొలిగి, దూరంగా ఒక మూలకు వెళ్ళి పాత సిమెంటు విగ్రహం కింద కూలబడ్డాను. ఆ విగ్రహం కవిదో, రాజకీయ నాయకుడిదో తెలియటంలేదు. విగ్రహం భుజంపై కూర్చుని రెండు పిచుకలు కబుర్లు చెప్పుకుంటున్నాయి. బహుశా యుద్ధ సమయాలపై చర్చ చేస్తున్నాయేమో! విగ్రహంపై పగుళ్ళు, నల్లని పూత జనం ఆ విగ్రహంలోని మనిషిని మర్చిపోయిన సంగతి తెలుస్తూనే ఉంది. పిట్టలకు మాత్రం అదో చర్చా స్థలం అయింది. పిచ్చుకలు, గోరంకలు, పిట్టలు ఇంకా సిటీలో కనబడటం ఆశ్చర్యమే. దూరంగా మసీదు గొంతు ఎక్కడో మనుష్యుల మధ్య నుంచి గుర్తు పెట్టు చెయ్యి ఊపే మిత్రుడూ ఇదీ ఆశ్చర్యమే!

**10**

నాలుగు వారాల క్రితం అప్పటికి సుందరం అదృశ్యమైన సంగతింకా తెలియదు. అతని గురించిన దుఃఖం శరీరంలోకి చొరబడని స్థితి అది. సుందరం ఇంటి వైపు మార్నింగ్ వాక్ వెళ్ళాను. ఇంటి నిండా కవితా సంపుటాలు, కాసెట్లు, అందంగా ఫ్రేమ్ చేయబడ్డ ఎన్నో పెయింటింగ్‌లు, వరండాలోంచి తొంగి చూస్తే కుడివైపుగది. దానిపైన మోహినీ వరణం. మోహిని గురించిన జ్ఞాపకాల స్థలం అని రాసి ఉన్న బోర్డు గదిలోని వందలాది ఫొటోల మధ్యన అయిదు అడుగుల ఎత్తు మోహిని ఫొటో సజీవంగా, కలలాంటి ఒక గతాన్ని గుర్తు చేస్తున్నట్లుగా గదిలో ఒక మూలన బంగారు రంగు అక్షరాలతో ఒక సైన్‌బోర్డు ఒక స్త్రీ, ఒక పురుషుడు వాళ్ళ ఒకప్పటి స్నేహానికి, ప్రేమకీ గుర్తుగా అని రాసి ఉంది.

ఆ గదికి కాస్త దూరంలో అమ్మగది అమ్మనివసించే స్థలం అని రాసి ఉన్న బోర్డు. దానికింద అమ్మకు క్రమంగా అన్నీ మర్చిపోయే జబ్బు. మీరెవరో గుర్తుండక పోవచ్చు. మిమ్మల్ని మీరు పరిచయం చేసుకోండి. అని రాసి ఉంది. గది ముందు గుట్టలు గుట్టలుగా ప్లాస్టిక్ వస్తువులు, పక్షులు, జంతువులు, అన్నిటిపైనా పేర్లు రాసి పెట్టి ఉన్నాయి. సింహం, అత్యంత క్రూరమైన జంతువు, వేణువు మాధ్యురాన్ని స్రవించె వెదులు బొంగు అట్లా అన్నిటి మీద బోర్డులున్నాయి. పెరటి నిండా వందలాది పూల మొక్కలు, మొక్కల మొదళ్ళలో చెక్కబోర్డులు తగిలించి, వాటిపై పేర్లు రాస్తున్నాయి.

**11**

'పోలీసు సైరన్లు, కార్ల హడావుడి జనం ఉరుకులు, పరుగులు, వర్షంపడి ఆగిపోయిన ఒక నగరపు మధ్యాహ్నం ఉండీ ఉండీ ఒక పెద్ద ఉరుము. కళ్ళు జిగేలు మనిపించే మెరుపులు. శరీరానికెక్కడో అతుక్కున్న వాన చుక్క. మధురమైన రోజులు ఎప్పటివో గుర్తొచ్చీ, 'గుర్తురాక

## 12

సుందరం గురించిన ఆలోచనలు వెంటాడుతుండగానే, సాయంత్రం గొప్ప దృశ్యంలా ఎదురైంది. ఎర్రని వెలుతురు చిమ్ముతూ ఆకాశం. వందలాది పక్షులు. గుట్టలు గుట్టలుగా ఆకాశమంతా వెదజల్లబడ్డట్టుగా సిటీలో సుందరం తరుచుగా వెళ్ళే ప్రదేశాలవైపు వెళ్ళాను. చార్మినార్ దగ్గర పురాతనమైన ఇరానీ టీ స్టాల్. వేడివేడితో పొగల మధ్యన ఆవేల్టి పేపర్లన్ని అక్కడే చదివే వాడు సుందరం. రాత్రి ఏడు గంటలకు ఆఫీసుకు చేరతాడు. హెడ్‌లైనో, ఎడిటోరియల్ హడావుడిగా రాసి కుర్రాళ్ళకిస్తాడు. ఆఫీసులో ఉన్నంతసేపూ ముళ్ళమీద ఉన్నట్లుగా ఉంటాడు. ఆకాసేపూ పరమక్రోధంగా ఉంటాడు. రాత్రి తొమ్మిదికి బయటపడి, ప్రెస్‌క్లబ్ దగ్గర కాసేపు గడుపుతాడు. అక్కడో ముషాయిరా షురు చేస్తాడు. రాత్రి పదికి అతని కిష్టమైన కేమెల్‌బార్‌కు చేరతాడు. బార్‌లో ఓ మూలన అతనికిష్టమైన చోటులో కూర్చుని, సరిగ్గా రాత్రి పదకొండుకు ఒక కవితా సమయం అవుతాడు. ఉర్దూ కవితల్లో, గద్దర్ పాటలో బీట్స్, శ్రీశ్రీ, కొత్త కవుల్లో పెద్దగా రిసైట్ చేస్తున్నట్లుగా ఆ రోడ్లన్నీ తిరిగాను. క్రాస్ రోడ్స్, ప్రెస్‌క్లబ్, పారడైజ్, కేమెల్ బార్ రాత్రి ఎనిమిది దాకా తిరుగుతూనే ఉన్నాను. ఒక్కొక్క చోటునే పోలిక పడుతూ, సుందరంతో ఒక్కో జ్ఞాపకాన్నే కెలుక్కుంటూ, దుఃఖభరితమైన నాస్టాలిజయాగా మారిపోయాను.

## 13

రోడ్లనిండా జనం మాట్లాడుకుంటూ అందులో ఎంతో గాసిప్. వర్షం వలన రాత్రి నిండా చల్లటి గాలులు నిండి, కబుర్ల మధ్య అకాలమైన ఈ చలిని గురించే చర్చ. రాజకీయ స్కాములు, టెర్రరిస్టులు, సరిహద్దుల్లో ఉద్రిక్తత-ఇవేవీ కాదు. శరీరాన్ని వణిచించే చలి ఇవాల్టికథ. ఒకానొక డిసెంబరు నెల తీవ్రమైన చలి జ్ఞాపకంగా ఉండిపోతుందని, ఉదయపు వాన, ఈ చలి -

ఎక్కడో పెద్దగా నినాదాల శబ్దం. పెద్ద సమూహపు గొంతుకాదు. నలుగురైదుగురు పెద్దగా అరుస్తూ, గ్లోబలైజేషన్ వ్యతిరేకిద్దామని, మల్టీ నేషనల్స్ వెళ్లిపోవాలని, ప్రవేటీకరణ వద్దువద్దని - ఒంటరి ప్రతిఘటనలా, వాళ్లు సరిగ్గా పదిమంది. నినాదం క్రమంగా దగ్గరవుతూ, పక్కనుంచి, శరీరాన్ని ఒరుసుకుంటూ - మెల్లగా దూరమైపోతుంది. మధ్యలోంచి హఠాత్తుగా "మనిషిని కాపాడండి!" అని అరుచుకుంటూ సుందరం ప్రత్యక్షమవుతాడేమో అని, ఒక భ్రమలాంటి ఆశకలిగింది. నినాదం ఇప్పుడు దూరమైంది. ఆ కాస్తా నినాదం దూరమైనాక మరింక చప్పుళ్లు లేవు. గాసిప్‌లు లేవు, కథలు లేవు, సినిమాపాటలు లేవు. "పద, నిద్ర పోవాల్సిన సమయమైంది." అనుకుంటూ సుందరం జ్ఞాపకాన్ని రోడ్డుపై వదిలేస్తూ బస్‌స్టాప్ వైపు నడిచాను.

## 14

బస్సులో కూర్చుని సుందరం అదృశ్యం అవడానికి కారణాలన్నీ ఆలోచించాను. ప్రత్యేక కారణం ఏదీ కనిపించలేదు. ఉద్యమాలు, ఓడిపోటాలు నిరాశల కాలం కాదిది. పోలికలు పట్టలేని ఒకానొక సంక్షోభం, అయితే ఇది స్లోడెత్ మాత్రమే, మనిషిని అదృశ్యం చెయ్యదు. సుందరం ఉద్వేగాన్ని దాచుకోలేడు. ముఖం పైనే అనేస్తాడు. బహుశా ఎంతోమంది అలా గాయపడి ఉంటారు. కులం వర్సెస్ ఉద్యమం, ఉద్యమం వర్సెస్ ఎన్.జి.ఓ. మరియు గ్లోబలైజేషన్ వర్సెస్ ప్రాంతీయ సభలు అనే వ్యాసం పెద్ద సంచలనాన్ని లేపింది. అతనికి బెదిరింపు కాల్స్ కూడా వచ్చాయి.

నెలక్రితం ఒక నిరసన ఊరేగింపులో అతన్ని అరెస్ట్ చేశారు. అందర్నీ రెండో రోజే వదిలేస్తే సుందరాన్ని మరో నాలుగు రోజులుంచారు. పోలీసుల అత్యాచారాలపై, రాజ్యహింసపై అతను రాసిన ఎడిటోరియల్ వ్యాఖ్యల గురించి ఇంటరాగేట్ చేశారని చెప్పారు.

## 15

బస్సు నెక్లెస్ రోడ్డు దగ్గర ఆగింది. ఎదురుగా గ్రేట్ హైదరాబాద్‌మాల్, హైదరాబాద్‌కున్న ఏకైక మీటింగ్ ప్లేస్ యిది. సుందరం దీన్ని ఆధునిక రంగస్థలం అంటాడు. అడుగు పెడుతూనే ఒక ఖరీదైన లోకంలోకి వచ్చిన అనుభూతి. మనిషిలో మొత్తంగా ట్రాన్స్‌ఫర్మేషన్ జరుగుతుంది. మాస్క్ ఒకటి ముఖం చుట్టూ మొలుస్తుంది. సుందరం ఈ గ్రేట్ మాల్‌పై పెద్దవ్యాసమే రాశాడు. సుందరం ప్రకారం మనందరం ఒక కొత్త భాషలోకి, బహుశా దాన్ని కన్స్యూమర్‌భాష అనవచ్చు. దానిలోకి కుదించబడ్డాము. ఇదో వింతభాష. మృదుత్వం, మాధుర్యం, జాలి లాంటి అభౌతిక భావనలు పూర్తిగా తీసివెయ్యబడ్డ భాష. సమసమైన మెటాఫర్లను, భావనలను ఈ కన్స్యూమర్‌భాషలోకి అనువదించి -

గ్రేట్‌మాల్‌కు బయట రోడ్డుపై ఫోటోఫ్రేములు అమ్ముకొనే వాడిచుట్టూ గుంపులుగా జనం. వాళ్లందరు చాలాసేపటినుంచి తపస్సులో వున్న వాళ్లలా, అక్కడ ఒక ఫోటోను దీక్షగా చూస్తూ. ఇంతదూరంనుంచి స్పష్టంగా కనిపిస్తుంది ఆ ఫోటో. మనిషి ఎత్తు ఫొటో అది. ఒక మగవాడు, ఒక ఆడమనిషి. పల్లెటూరు, దూరంగా ఎక్కడో వాగు. వాగులో బట్టలు ఉతుక్కునే ఆడవాళ్లు. వాగుకు అల్లంతదూరంలో పశువుల మందలు. మగవాడితో మాట్లాడుతూ షిడేళ్లకుర్రవాడు. తలకు గుడ్డచుట్టుకొని, ఒంటపై చొక్కాకూడాలేదు. చేతిలోని కర్రను ఎటువైపో చూపిస్తూ ఏదో అద్భుతాన్ని చూపిస్తున్న వాడిలా ఆ కుర్రవాడు ఆడమనిషి వాగునీళ్లలో కాళ్లు తడుపుకుంటూ, ఫోటోలోని దృశ్యం నిజంలాగా, ఇప్పటిలాగా - ఫోటోలోని ఆడమనిషి మనోహరంగా ఉంది. కళ్లనిండా వెలుగు, వజ్రాలపొడి వెదజల్లినట్లుగా, ఆమె జుట్టు జలపాతంలా గాలిలో ఊగుతూ ఆ ఫోటోను చూస్తున్న జనం, క్రమంగా ఫ్రేమ్‌లోని దృశ్యంలోకి వెళ్లి అక్కడే జీవిస్తున్న వాళ్లలా ఉన్నారు ఆశ్చర్యం! ఇక్కడనుంచి చూస్తే ఆ ఫోటోలో ఉన్న మగవాడు,

ఆడమనిషి సుందరం, అతని ప్రియురాలు మోహినిలా కనిపించసాగారు నాకు.

16

బాక్‌టు హోమ్! ఇంటిచుట్టూ తెల్లని ముసుగులా మంచు. తలుపుల్ని తోసుకొని లోపలికి వచ్చి, ఒంటరి ప్రపంచాన్ని, మంచంపై పరుచుకొని, స్వెట్టరు, మఫ్లర్, చుట్టకొని, ఆమె, పిల్లలు అప్పటికే నిద్రపోయారు. చిరిగిన స్వెట్టరులోంచి సన్నని దారపు పోగులు అట్లా మంచంపై వేళాడుతూ - ఆమె దారపు పోగుతో సంభాషణ మొదలు పెట్టింది. అట్లాగే మంచం పైకి జారి, మూసిన తలుపుసందులోంచి తోసుకొచ్చేగాలి గురించీ, చలి హెచ్చరికల్ని పట్టించుకొని దోమల గురించీ సంభాషణ మొదలు పెట్టాను. నిద్రలోనే ఆమె ఊ కొడుతుంది. మంచంపై నుంచి ఆమె అటు దొర్లగానే సంభాషణ తెగింది. గది మళ్లీ వంటరిదయింది. బయట చల్లటిగాలి జుమ్‌జుమ్ మంటూ తలుపుల్ని, కిటికీల్ని బాదుతుంది. పగలంతా నా లోపల గిలగిల లాడిన ఒక దిగులు, రాత్రికి నాతోనే, నా పక్కనే పడుకొని, నేను దాన్నే ప్రేమిస్తూ -

17

మళ్లీ సుందరం గుర్తు కొచ్చాడు. మరింక అతన్ని చూడలేనేమో అన్న దిగులు. అతని జ్ఞాపకాలు, రూపు రేఖలు పదేపదే మనోచిత్రంపై యాడ్స్‌లా ప్రత్యక్షమయి, ఆరడుగులు, తెల్లని ఛాయ, వెడల్పయిన నుదురు, తీక్షణమైన కళ్లు, గుబురు గడ్డం, లాల్చీపైజామా, పైనొక ఖద్దరు జాకెట్టూ - సుందరం రూపం అట్లా వెంటాడుతూనే ఉంది. బహుశా ఈ రాత్రంతా - రేపు మళ్లీ ఆఫీసులో, ఎప్పటిలా బిజీ-బిజీ బహుశా రేపో, మరునాడో, లేదా ఇంకో వారానికో మరింక రొటీన్‌లో పడిపోతూ, అతన్ని మొత్తంగా మర్చిపోతానేమో - పత్రికాఫీసులో సుందరం బదులు మరొకడు, బహుశా రెండో సుందరమో, మూడో సుందరమో వచ్చి చేరతాడు. వాడూ సుందరంలా ఒక నియంతలా మారి - అవును సుందరం నియంత. దేన్నీ లక్ష్యపెట్టడు. అతనివి గాఢమైన విశ్వాసాలు, నమ్మకాలు. ఆ మేరకే పత్రిక నడవాలంటాడు. నిజానికి ఈ మూడు వారాల్లో ఆఫీసంతా విముక్తం కాబడ్డట్టుగా కనిపించసాగింది. అంతటా స్వేచ్ఛా వాయువులు. కొత్త శీర్షికలు, కొత్త గెటప్, ఊపిరాడనితనం లోకి ప్రాణవాయువు ప్రసరించినట్టుగా -

వందల వేల సార్లు సుందరం నాతో వాదించి ఉంటాడు. అన్ని సార్లు అతని వాదనా పటిమ ముందు నేను తలవంచేవాణ్ని. కత్తి అంచులా పాదరసం ప్రయాణిస్తున్నట్లుగా, అతని ఆలోచనాధార స్పష్టంగా, నిరంకుశంగా సాగేది. ఆ క్షణానికి అతను ఒక మోళీ విప్పుతున్న మంత్రికుడిలా - పూర్తిగా అతనికి సరెండర్ అయిపోతాను.

18

ఈ రాత్రి ఒంటరిగా, చలిలో, చీకటిలో సుందరాన్ని జ్ఞాపకం చేసుకుంటుండగా - అతని వాదనలు, తర్కాలు గుట్టలు గుట్టలుగా గదిమొత్తం పేరుకుపోయి, బహుశా ఆ మేరకు అవి నన్ను శుద్ధి చేసి ఉంటాయి. సుందరం బలమైన మానవునికి కొత్త ఆలోచనల మానవునికి ప్రతీక. అతన్ని అంతగా ఇష్టపడలేము. అతను లేకుండా బ్రతకనూలేము. అతన్ని ద్వేషించడంలో చాల హాయిగా ఉంటుంది. అం రేపు ఈ సుందరాలదే. ఈ ఒప్పుకోకుండా ఉండడానికి ఎంతగానో ప్రయత్నిస్తుంటాము.

19

బహుశా రేపటికింత దిగులు ఉండదు. వాతావరణంలో ఇంత చలీ ఉండదు. గడియారపు పిట్ట అనే అమ్మాయి మళ్లీరేపు ఉదయం ఆరుగంటల యాభై నిముషాలకు ప్రత్యక్షం కావచ్చు.

20

బహుశా సుందరం ఇకరాడు. అతని అదృశ్యం నిజం కావచ్చు. కానీ అతనెప్పుడూ పక్కనే ఉంటే ఎంత బాగుండునో అనే కోరిక గదిలోనూ, మంచంపైనా, నాలోనూ -

- రీనా డెకార్ట్ అనే ఫ్రెంచి తత్త్వవేత్త The reading of good books is like a conversation with the finest men of past centuries అన్నారు. మంచి మంచి గ్రంథాలు చదవటం అంటే గత శతాబ్దాల మహా మేధావులతో పరోక్షంగా సంభాషించడమే. షేక్‌స్పియర్‌నో, బెర్నార్డ్‌షానో చదువుతున్నామంటే జీవితం పట్ల వారి అవగాహనను మన ప్రత్యక్షంగా తెలుసుకుంటున్నామన్న మాట. ఆ అవగాహన నుంచి ప్రయోజనం పొందుతున్నామన్న మాట.

ఎన్. వేణుగోపాల్

# తెలుగు సాహిత్యంలో ఆర్థికాంశాలు

'తెలుగు సాహిత్యంలో ఆర్థిక అంశాలు' అనే విషయం ఎక్కడ ప్రారంభించి ఎక్కడ ముగించాలో తెలియడం లేదు. ఎందుకంటే ఈ చర్చనీయాంశంలో ఎన్నెన్నో ఉప అంశాలు, కోణాలు, వాదనలు, ప్రతివాదనలు ఇమిడి ఉన్నాయి. ఇది ఎంత విస్తృతమయినదంటే దీని మీదనే ప్రత్యేకంగా పరిశోధన చేయవచ్చు. పుస్తకాలు రాయవచ్చు. అంత విశాలమైన విషయాన్ని ఒక చిన్న వ్యాసంలోకి కుదించడానికి ప్రయత్నించడం కష్టసాధ్యమైన పని.

అంతేగాక, సంపాదకులు నాకు ఇచ్చిన ఈ విషయాన్ని స్థూలంగా రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. ఒకటి, తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియలలో వివిధ రూపాలలో అభివ్యక్తి పొందిన ఆర్థిక అంశాలు అని అర్థం చేసుకోవచ్చు. అప్పుడు ఆ అంశాన్ని పరిశీలించడానికి సాహిత్య చరిత్రలోకీ, ప్రక్రియల చరిత్రలోకీ, నిర్దిష్టంగా కొన్ని రచనల విశ్లేషణలోకీ వెళ్ళవలసి ఉంటుంది.

రెండు - తెలుగు సాహిత్యంలో, సాహిత్య వ్యాప్తిలో మార్కెట్ సంబంధాలు ఎట్లా కొనసాగుతున్నాయి, అవి సాహిత్య రూపాలను ఎట్లా ప్రభావితం చేస్తున్నాయి అని చర్చించడం గానూ అర్థం చేసుకోవచ్చు. అప్పుడు పుస్తక ప్రచురణకు, పంపిణీకి, రచయితల పారితోషికాలకు, పుస్తకాల అమ్మకాలకు, ప్రచురణ రంగంలోని ఆదాయ వ్యయాలకు సంబంధించిన అంశాలు చర్చించవలసి వస్తుంది. (ఈ విషయం మీద 'వ్యాపార సాహిత్యం - సంస్కృతి' అని చిన్నపాటి పరిశోధనా వ్యాసం ఒకటి గతంలో రాశాను. మనలో మనం, సాగర గ్రంథమాల, విశాఖపట్నం, 1990)

ఇక్కడ తెలుగు సాహిత్యంలో వేరు వేరు ప్రక్రియలలో ఆర్థిక జీవనానికి సంబంధించిన అంశాలు ఎట్లా ప్రతిఫలించాయో అధ్యయనం చేయడానికి అవసరమైన కొన్ని ప్రాతిపదికలను సూచించడానికి, చర్చించడానికి మాత్రం పరిమితమవుతాను.

ప్రతిపాదనలు

1. సాహిత్యానికి - సృజనకూ వ్యాప్తికీ కూడ - సామాజిక జీవనాన్ని గానీ, ఇటు వ్యక్తిగత జీవితాన్ని గానీ శాసించే, నిర్ణయించే, మార్చే ప్రబల శక్తులలో ఆర్థిక జీవనం ఒకటి. కనుక సాహిత్య రూపం ఏదయినా ఉద్దేశ్యపూర్వకంగా గాని, అసంకల్పితంగా గాని ఆర్థిక జీవనాన్ని ప్రతిఫలించకుండా ఉండడం అసాధ్యం.

2. ఆర్థిక జీవనాన్ని, సమాజంలో కొనసాగుతున్న ఆర్థిక సంబంధాలను సాహిత్యం ప్రతిఫలిస్తుందన్నప్పుడు అది సూటిగా, ప్రత్యక్షంగా, పారదర్శకంగా ఆ పని చేస్తుందనో, చేయాలనో అర్థం చేసుకోకూడదు. ఆయా సాహిత్య ప్రక్రియల పరిమితులనూ, అవకాశాలనూ బట్టి ఆర్థికాంశాలు ఆ ప్రక్రియలో సహజంగా ప్రవహిస్తాయి.

3. ఆర్థికాంశాలు సాహిత్య ప్రక్రియలలో ప్రవహించడమనేది ఎవరో కొందరు సాహిత్యకారులు తలచుకున్నంత మాత్రాన జరిగే పని కాదు. సమాజ నిర్మాణంలోనే మనుషులు

............✧............

ఆర్థికాంశాలు సాహిత్య ప్రక్రియలలో ప్రవహించడమనేది ఎవరో కొందరు సాహిత్యకారులు తలచుకున్నంత మాత్రాన జరిగే పని కాదు. సమాజ నిర్మాణంలోనే మనుషులు జీవించాలంటే ఉత్పత్తి మీద ఆధారపడాలి గనుక, ఉత్పత్తి విధానమే మానవ జీవితానికి నిర్ణాయక శక్తిగా ఉంటుంది. ఆ జీవితంలోని చైతన్య రూపాలన్నీ ఆ ఉత్పత్తి విధానపు ధాతువులను ఏదో ఒక రూపంలో ప్రతిఫలిస్తుంటాయి. భాష, సాహిత్యం, సంస్కృతి వంటి చైతన్య రూపాలలో ఈ గత, వర్తమాన ఆర్థిక సంబంధాలకూ, వాటివల్ల మానవజీవితంలో ఏర్పడుతున్న ఘర్షణకూ తప్పనిసరిగా స్థానం దొరుకుతుంది.

............✧............

ఎన్. వేణుగోపాల్ • విమర్శకుడు, పాత్రికేయుడు

జీవించాలంటే ఉత్పత్తి మీద ఆధారపడాలి గనుక, ఉత్పత్తి విధానమే మానవ జీవితానికి నిర్ణాయక శక్తిగా ఉంటుంది. ఆ జీవితంలోని చైతన్య రూపాలన్నీ ఆ ఉత్పత్తి విధానపు ధాతువులను ఏదో ఒక రూపంలో ప్రతిఫలిస్తుంటాయి. భాష, సాహిత్యం, సంస్కృతి వంటి చైతన్య రూపాలలో ఈ గత, వర్తమాన ఆర్థిక సంబంధాలకూ, వాటివల్ల మానవజీవితంలో ఏర్పడుతున్న ఘర్షణకూ తప్పనిసరిగా స్థానం దొరుకుతుంది. రచయిత సమాజ జీవితాన్ని యథాతథంగా, నిజాయితీగా చిత్రించినట్టయితే, ఆర్థికాంశాల ప్రతిఫలనంలో అనివార్యంగా వచ్చి తీరుతుంది.

4. ఇక్కడ సాహిత్య కారుల పాత్ర గురించి అర్థం చేసుకోకపోతే పై ప్రతిపాదనకు సంకుచిత, పిడివాద వ్యాఖ్యానం వచ్చే అవకాశం ఉంది. సాహిత్య రచన ఒక సంకల్ప పూరిత, సృజనాత్మక మేధో ప్రక్రియ. అందువల్ల సామాజిక జీవనంలోని ఆర్థికాంశాలు, సాహిత్యంలో వాటి ప్రతిఫలనం అనేది సరళరేఖ కాజాలదు. ఊహాశక్తి, తాత్విక రాజకీయాభిప్రాయాలు వంటి ఎన్నో జల్లెడలు, అడ్డుగోడలు ఉన్నాయి. సామాజిక జీవనంలోని ఆర్థికాంశాలు ఈ జల్లెడలలోంచీ ఈ అడ్డుగోడలు దాటుకునీ సాహిత్య ప్రక్రియలలోకి ప్రవహిస్తాయి. మళ్ళీ అక్కడ ఆ సాహిత్య ప్రక్రియలకు దేనికి దానికీ ప్రత్యేకంగా ఉండే పరిమితులూ, అవకాశాలూ ఆ ఆర్థికాంశాల ప్రతిఫలనాన్ని రూపుదిద్దుతాయి.

5. మొత్తంగా చెప్పాలంటే, చైతన్య రూపాలన్నిటికీ సహజంగా ఉండే సామాజిక స్వభావం, రచయిత సృజనాత్మక వ్యక్తిత్వం, ప్రక్రియ ప్రత్యేకతలు అనే మూడు అంశాలతో తయారయిన పట్టకం లోంచి మాత్రమే సమాజంలోని ఆర్థికాంశాలు సాహిత్యంలోకి పరావర్తనం చెందుతాయి. ఈ పరావర్తనంలోని సంక్లిష్టతల, సంకీర్ణతల వల్ల తెల్లని కిరణంగా ప్రారంభమైనది, అసలు తెలుపే కనబడని ఏడు రంగుల ప్రతిఫలనంగా పాఠకుల ముందుకు వస్తుంది.

సమాజ ఆర్థిక జీవితంలో వచ్చే మార్పులు కవిత్వంలో త్వరత్వరగా ప్రతిఫలిస్తాయి. అయితే వకిత్వానికి ఒక ప్రక్రియగా ఉన్న ప్రత్యేకతల వల్ల విడిగా ఒక కవితను విశ్లేషించి ఆర్థికాంశాల ప్రతిఫలనం చూపడం కష్టం కావచ్చు. మొత్తంగా ఒక కాలపు కవిత్వం, దాని తక్షణ స్పందనాశీలం వల్ల, ఆర్థిక పరిణామాలను స్థూలంగా అక్షరీకరించ గలుగుతుంది.

6. ఈ ప్రక్రియలలో చిట్టచివరి గ్రహీతగా కనబడే పాఠకులు నిజానికి గ్రహీతలు మాత్రమే కారు. ఆర్థిక సంబంధాలలోని ఘర్షణలను మనుషులు సాహిత్య, తదితర భావజాల రూపాలలోని గుర్తించి, ఆ ఘర్షణను పరిష్కరించడానికి పోరాడుతారని మార్క్స్ అన్నప్పుడు, ఆ ప్రక్రియ ఏకముఖమైనది కాదని, పాఠకులు అంతిమ గ్రహీతల స్థానంలో మాత్రమే లేరని అర్థం. సాహిత్యంలో ఆర్థికాంశాల ప్రతిఫలన ప్రక్రియ పాఠకుల పఠనంతో, అధ్యయనంతో సమాప్తమయిపోదు. ఆ పఠనం ద్వారా, అధ్యయనం ద్వారా చైతన్య ఉన్నతీకరణ పొందిన పాఠకులు ఆ సాహిత్య రచనలోని లోపలి అర్థాల కోసం అన్వేషిస్తారు. పాత్రల స్వభావాలలో, ప్రవర్తనలలో, మంచి చెడులలో ప్రతిఫలించిన ఆర్థిక సంబంధాలను గుర్తిస్తారు. ఆ గుర్తింపు తర్వాత ఈ ప్రక్రియ వర్తుల ప్రక్రియగా మారిపోతుంది.

7. సామాజిక జీవనంలోని ఆర్థిక సంబంధాలు - సాహిత్యపు సాధారణ ప్రతిఫలక స్వభావం - రచయితల నైపుణ్యం - ప్రక్రియ పరిమితులు - పాఠకుల అధ్యయనం అనే ఈ సరళ రేఖలా కనిపించే ప్రక్రియ సంక్లిష్టంగా మారడం మాత్రమే కాక, పాఠకుల విశ్లేషణ ఆర్థిక సంబంధాల మీద ప్రభావం వేసే మరొక ముందడుగు వేసి వర్తులంగా మారుతుంది. అయితే ఈ వర్తుల క్రమం ఏ ఒక్క రచయిత మాత్రమే నిజం కాకపోవచ్చు. ఈ ప్రక్రియకు తప్పనిసరిగా సామాజిక స్వభావం మాత్రమే ఉంటుంది.

**ఉదాహరణలు**

ముందే చెప్పినట్టు ఒక పరిశోధనాంశం కాగలిగినంత విస్తృతి ఉన్న ఈ చర్చనీయాంశానికి ఉదాహరణలు ఇవ్వడం ఇక్కడ స్థలాభావం దృష్ట్యా సాధ్యం కావడం లేదు.

దాదాపు అన్నీ భారతీయ భాషలలోకీ మహాభారతం అనువాదం కావడానికీ, భూస్వామ్యం పెరుగుదలకూ ఉన్న సంబంధం గురించి డిడి కొశాంబీ విశ్లేషించి ఉన్నారు. ప్రబంధ యుగానికీ నాటి దేశకాల (ప్రధానంగా ఆర్థిక) పరిస్థితులకూ ఉన్న సంబంధం గురించీ, దక్షిణాంధ్ర నాయకరాజుల కాలపు ఆర్థిక జీవనానికీ, నాటి సాహిత్యానికీ ఉన్న సంబంధం గురించీ వివరమైన చర్చే జరిగింది.

సమాజ ఆర్థిక జీవితంలో వచ్చే మార్పులు కవిత్వంలో త్వరత్వరగా ప్రతిఫలిస్తాయి. అయితే వకిత్వానికి ఒక ప్రక్రియగా ఉన్న ప్రత్యేకతల వల్ల విడిగా ఒక కవితను విశ్లేషించి ఆర్థికాంశాల ప్రతిఫలనం చూపడం కష్టం కావచ్చు. మొత్తంగా ఒక కాలపు కవిత్వం, దాని తక్షణ స్పందనాశీలం వల్ల, ఆర్థిక పరిణామాలను స్థూలంగా అక్షరీకరించ గలుగుతుంది.

కథ, నవల, నాటకం వంటి రచనా ప్రక్రియలలో జీవిత చిత్రణ, మానవ సంబంధాల చిత్రణ వివరంగానూ, వాటి సంక్లిష్టతతోనూ ఉండే అవకాశం ఉంది గనుక ఈ ప్రక్రియలలో ఆర్థికాంశాల ప్రతిఫలనం చాల ఎక్కువగా ఉంటుంది. మన సాహిత్య చరిత్రనే చూస్తే, ఆధునిక సాహిత్యంలో వచన ప్రక్రియలలో ఆర్థికాంశాలు ప్రతిఫలించని రచనలను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. ప్రత్యక్షంగా ఆర్థికాంశాల ప్రస్తావన వచ్చిన డిప్రెషన్ చెంబు (వేలూరి శివరామశాస్త్రి), వేయి పడగలు (విశ్వనాథ సత్యనారాయణ), చదువు (కొడవగంటి కుటుంబరావు) లాంటి కొన్ని రచనల గురించి చర్చ జరిగింది గాని, ఇంతకన్నా సంక్లిష్టంగా, పరోక్షంగా ఆర్థికాంశాల

కవిత

# అసలు సంఘర్షణ

బాళాల శ్రీనివాసరావు

గతం ఎన్నటికీ తరగని అనుభూతి కిరణం
వర్తమానం గుండెల్లో....
భవిష్యత్ ఊహలు మాసి పోవు ఎప్పటికీ
కాలమెంత కరిగినా ఘనీభవించనిదే జ్ఞాపకం
గంటలు... నిముషాలు అలవోకగా జారిపోయినా
ఎద లోపల్నుంచి తొంగి చూస్తూ ఏల మాటల కందని భావాలు
చిర్నవ్వుల పెదాల పూరేకులపై
వాలిన మంచి బిందువుల్లా....
నిరీక్షణకు బాధ లేదు
కనుపాపల్లో ఆరూపం కదలాడితే
కాళ్ళు కదలనంత కాలం
దూరం దగ్గరకు రాదు
జీవితం ఒక మతిమరుపుల విరామం
విరామం ప్రారంభానికి ముంగింపుకి మధ్య వారధి
మనసులు కలిసిన చోట
విషయాలకు విశ్రాంతుండదు
మాటలకు అంతముండదు
చెట్టు నీడలో రాలే ఒక్కొక్క ఆకును
గుండెలకు హత్తుకుంటూ



నిశ్శబ్ద గీతాల్ని నెమరేసుకుంటూ
సంగీతం... సాహిత్యం...
చిత్రలేఖనంలతో
సాగే నిరంతర సంభాషణ
హఠాత్తుగా బాధ్యతల్ని గుర్తు చేస్తూ
కాలం ముల్లు కళ్ళల్లో గుచ్చుకుంటే
కలిసుండలేక... విడిపోలేక...
మొదలయ్యేదే అసలు సంఘర్షణ...

చిత్రణ జరిగిన రచనలు కోకొల్లలుగా ఉన్నాయి.

కన్యాశుల్కం నాటి నుంచి ఇటీవలి ప్రపంచీకరణ వ్యతిరేక కథల వరకూ ఒక శతాబ్దానికి పైగా తెలుగు సాహిత్యంలోని వచన ప్రక్రియలకు ఆర్థికాంశాలను ప్రతిఫలించిన ఘనమైన చరిత్రుంది. అయితే ఆర్థికాంశాల చిత్రణే సాహిత్యం పని అని మొరటుగా అనుకుని ప్రక్రియల ప్రత్యేకతలను గుర్తించకుండా వెలువడిన రచనలూ లేకపోలేదు. ఈ మొత్తం చరిత్ర మీద నిశితమైన, లోతయిన అధ్యయనం చేస్తే గాని తెలుగు సాహిత్యంలో ఆర్థికాంశాల గురించి సమగ్రమైన అవగాహన కలగదు. ప్రధానంగా మానవ సంబంధాల ఇతివృత్తం మీద నడిచినట్టనిపించే కథలు, నవలల్లో కూడ విశ్లేషించి చూస్తే ఆర్థికాంశాల జాడ కనబడుతుంది.

సివి సుబ్బారావు సంపాదకత్వంలో సామాజిక శాస్త్రవేత్తలు సాహిత్యం పై చేసిన అధ్యయనం 'విభాత సంధ్యలు' అటువంటి విశ్లేషణలో ఒక ముఖ్యమైన ముందడుగు. కాని ఆ తర్వాత ఆ కృషిని కొనసాగించడం, విస్తరించడం జరగలేదు.

ఈ లోగా తెలుగు వ్యాస ప్రక్రియలో ఆర్థికాంశాల గురించిన చర్చ విస్తృతంగా మొదలయింది. ముఖ్యంగా నూతన ఆర్థిక విధానాల ప్రవేశం తర్వాత గత దశాబ్దానికి పైగా పత్రికల లోను, విడిగాను నేరుగా ఆర్థిక అంశాల గురించి, ఇతర రంగాలపై ఆర్థికాంశాల ప్రభావం గురించి విరివిగా వ్యాసాలు వెలువడుతున్నాయి. రాజకీయార్థిక శాస్త్ర వ్యాసాలను సాహిత్యంలో భాగంగా గుర్తించే సంప్రదాయం లేదు గనుక వీటిని స్పష్టంగా సాహిత్యంలో ఆర్థికాంశాలుగా చూడలేము.

కుప్పిలి పద్మ

# మంచుపూల వాన

యింటి గుమ్మం ముందు నిల్చుని పర్సు తెరిచాను. కాగితాలు, చిల్లర, పెన్ను, బొట్టు బిళ్లలు, సేఫ్టీ పిన్స్ యిలాచి పొట్లం, పేపర్ నాప్‌కిన్స్, టెలిఫోన్ నెంబర్ల పుస్తకం, లైబ్రరీ ఐడి కార్డు. యేమేవో తగుల్తున్నాయి. తాళాలు మాత్రం తగలట్లేదు. ఆ అరా యీ అరా వెతుకుతూనే వున్నాను. రోజూ యిదే వెతుకులాట. యిలా వెతుక్కునే ప్రతిసారీ అనుకుంటూ తాళాలని యెప్పుడూ ఒకే అరలో వుంచాలని. ఆ అరలో ఉంచితే అలవాటై గుమ్మం ముందుకు రాగానే చప్పున తాళం వేయవచ్చని. వెతికే ప్రతిసారీ అవిశ్రాంతి.

తాళం చేతికి దొరికింది. తలుపు తీస్తూనే కంపు. అలవాటైన కంపు. మిక్సర్. బూంది. చిప్స్. చికెన్ 65. ఫిష్ టిక్కా. కాగితాలునూనె కంపు. పులిసిపోయిన లిక్కర్ కంపు. సిగరెట్ల కంపు. బూడిద కంపు. కంపు... కంపు... కంపు... కంపు... కడుపులో దేవినట్టే లేదు... అలసట. వాలిపోవాలి. కాసేపు నిద్ర పోతే కానీ యే పనీ చేయలేను. గదిలోకి వెళ్ళాను. ముక్కిన బట్టల కంపు. లైట్ స్విచ్ నొక్కాను.

అసహ్యంగా వెలుగు.

పరుపుపై దుప్పటెక్కడా కనిపించడం లేదు. విడిచేసిన లుంగీలు. టీ షర్ట్స్. తువ్వాళ్ళు - చెల్లా చెదురుగా కుప్పలుగా. తడి కంపు. యెక్కడివక్కడ పారేయాలనే లేదు. యెక్కడివక్కడ వుంచుకోవాలని మర్చిపోవటం.

ప్చ్!

గదిలోంచి బయటికి వచ్చేసాను.

కుర్చీలో పేపర్లు పక్కన పెట్టి ఆ కంపులోనే కూర్చున్నాను.... మనసంతా నిస్సారంగా. వొక్కసారా రెండుసార్లా... రోజూ యిదే కంపు... యెన్నిసార్లు చెప్పినా పట్టించే లేదు. లోపల్లోపల అశాంతి.

యెందుకిలా జరుగుతోంది!?

యెక్కడుంది మెలిక?

తనెందుకు కనుక్కోలేకపోతుంది?

తామిద్దరూ వొకరినొకరు యిష్టపడ్డారు. యెప్పుడూ కలిసి బతకాలనుకొన్నారు. తామిద్దరి జీవనం పరిమళిస్తుందనుకొన్నారు. కానీ కంపు కొడుతోంది.

యెక్కడ ఏం జరిగింది! యే క్రిమి తమ జీవన సారాన్నంతా పీల్చిపీల్చి కంపు కొట్టిస్తోంది! పంటలకి పట్టిన చీడని వదిలించుకోలేక జీవితాలనే వొక్క తాపు తంతున్నారు. ఆ చీడేంటో అర్థం కావడం లేదు.



జీవనానికి పట్టిన చీడను అసలు యెప్పటికైనా వదిలించుకుంటారా?! అసలిది చీడని అనుకొంటున్నామా?!

ప్చ్... నా వల్ల కావటం లేదు. పారిపోవాలి.. బయట పడాలి. యీ అశాంతి నుంచి. గదిలోంచి బయటికి వచ్చి తాళం వేసి మెట్లు దిగుతోంటే వేసి వుంచిన కిటికీ తలుపుల్లోంచి టీవీ ఛానల్స్ శబ్దాలు శబ్దాలుగా. పూర్తిగా కిందికి వచ్చాక యెక్కడికి వెళ్ళాలి. పెద్ద ప్రశ్న. సందేహం. బహుశా జీవితాంతం తోడుండే సందేహం.

వాలిపోయే వాళ్లే తప్పా వాలనిచ్చే వాళ్లేరి?!

నాలుగు అడుగులు వేసానో లేదో పొగ... పొగ.. ఆక్సిజన్ అందటం లేదు... క్లీన్... గ్రీన్... శనివారం కదా... మాస్క్... యీ శనివారం కాదు కదా... రోడ్డు దాటి యెటు వెళ్ళాలో తెలియక యిరుకైన ఫ్లైవోవర్‌ని చూస్తున్నా. వొక్క రోజులో పెరిగిన మొక్కలు. రంగు రంగుల దీపాలు నడుమ జుమ్మని ఫౌంటేన్‌లో నీళ్ళున్నాయో లేవో!

పొగ.. పొగ.. పొగ యీ పొగ కంటే యింట్లో కంపే సుగంధంలా తోస్తుంది. తిరిగి యింటికి. రానంత సేపే... రాగానే కమ్ముకొంటున్న అనీజీ.

నూనె మరకల పొట్లాల్ని నమిలి పిప్పిపిప్పిగా వదిలేసిన కోడి యెముకల్ని ఖాళీ బీరు సీసాల్ని విస్కీ గ్లాసులు వాడేసిన దుప్పట్లని విడిచేసిన బట్టల్ని కాల్చి పారేసిన సిగరెట్టు పీకల్ని చెత్త బుట్టలోనూ సింక్‌లోనూ వేసేసి యిల్లంతా వూడ్చి తడి బట్టతో వొత్తి ఫ్యాన్‌ని కాసేపు పూర్తి స్పీడ్‌లో వేసి... ఆపి... అగరొత్తులు వెలిగించా.



స్నానం చేయడానికి వెళితే బాత్రూమ్‌లో డ్రమ్ ఖాళీ. వుదయం ఆఫీసుకి వెళ్ళేముందు పూర్తిగా నింపిన డ్రమ్ము. మధ్యాహ్నం అతనూ అతని స్నేహితులు పూర్తిగా ఖాళీ చేసేశారు. తిరిగి రెండ్రోజుల వరకూ నీళ్ళు రావు. నీళ్ళు లేకపోతే గోలగోల చేస్తాడు. కానీ వొక్కరోజూ తెల్లారగట్ల లేచి నీళ్ళు పట్టిన పాపాన పోలేదు. వంట గదిలోకి వెళ్ళి వంట కోసం పట్టి వుంచిన మంజీరా నీళ్ల తీసుకొచ్చి తలారా స్నానం చేసాను. చీర కుచ్చిళ్ళు దోపుకుంటుంటే ఆగకుండా కాలింగ్ బెల్ మోత.

తను తప్ప యెవరూ అంతలా మిస్ బిహేవ్ చేయరు.

తలుపు తీశాను.

గట్టి నవ్వులతో నరేంద్ర.

వెనగ్గా నలుగురు గంజి పెట్టిన నలిగిన తెల్లని యిస్త్రీ చొక్కాలు.

కనుబొమ్మల నడుమ చెమట కారుతున్న కుంకుమ. బీర్ బాటిల్స్ మూట. మిరపకాయ బజ్జీలు. మిక్చర్. లోపలికి వస్తూనే టీవీ ఆన్.

నమస్తే.... వదినమ్మ....

వాళ్ళ పలకరింపు వినిపించనంత త్వరగా దూరంగా లోపలి గదిలోకి వచ్చేసాను. నరేంద్ర నవ్వు మాటలు గట్టిగట్టిగా.

తలారిపోయింది.

పాటలు వింటూ వంట చేసుకొని యింత తిని నిద్ర పోదాం అనుకొన్నా.

యిప్పుడీ! కొలువు తెల్లార్లూ.

'మేఘా గ్లాసులు. ఐస్ సోడా వుంది కదా. వోపెనర్' గదిలోకి వస్తూ హడావుడిగా అడిగాడు నరేంద్ర.

ట్రేలో పెట్టి యిచ్చిన గ్లాసులు అందుకొంటూ 'మేఘా... ఫ్రైడ్ ఎగ్స్. డీప్ ఫ్రై' నరేంద్ర బయటికి వెళ్ళిపోయాడు.

అప్పుడేమైనా కాదంటే యిల్లు క్షణాల్లో అరుపుల్తో నిండిపోతుంది.

'మేఘా... కమ్... హియర్... విస్కీ... వేడ్కా... అడుగుతున్నాడు అక్కడనుండి...

'మోడ్రన్ కవులు ...'

'యింగ్లీషు సినిమాల్లాగా' ఆ వచ్చిన వాళ్ళ మనసుల్లా కదుల్తున్నవి పైకి వచ్చాయి.

వంట గదిలోకి వచ్చి 'వూ... యేం తీసుకొంటావు' అడిగాడు.

ఫ్రైడ్ ఎగ్స్‌పై పెప్పర్ చల్లి ప్లేట్ అందించా.

'కమ్ మేఘా.... నీ కంపెనీ అంటే నాకిష్టం. రా... మేఘా...

అవును వొకప్పుడు తామిద్దరికి వొకరి సాంగత్యమంటే వొకరికి యిష్టం.

అవుట్ గేట్ దగ్గర కలుసుకునే సాయంకాలానికి మా గుసగుసలతో పూసిన బరాణీ తీగెలకి పార్క్ హోటల్ వెనక ఆటలకి భీమ్లీ రోడ్డు రెండో మలుపుకి సరుగుడుతోటల నీడల దోవలకి యెర్రమట్టి దిబ్బల మట్టి మెరుపుకి తెలుసు మా యిష్టం.

లైబ్రరీ గోడలకి, నెట్ స్క్రీన్‌కి తెలుసు మా యిష్టం.

యిక్కడ కూర్చోవద్దు. అక్కడ తిరగొద్దనే పోలీసోళ్ళతో గొడవలు.

సముద్ర తీరంలో మా యిరువురి స్పర్శలో యెన్నో వుదయాలు సాయంకాలాలు రాత్రులు మధ్యాహ్నాలు సముద్రం వుప్పొంగి యెగసేది - అమావాస్య కాలమైనా వెన్నెల దినాలైనా కలిసి చదువుకున్నాం. యీత నేర్చుకున్నాం. బీర్ తాగాం. కథలని చదువకున్నాం. పాడుకొనేవాళ్ళం.

'మనిద్దరం వాళ్ళకి కంపెనీ యివ్వకపోతే బాగుండదు' అన్నాడు.

రూంలోకి వెళ్ళిపోయాను.

స్టేట్ పాలిటిక్స్ ఎన్.డి.ఎ గవర్నమెంట్... మాటలు అలా అలా కుటుంబాలు సినిమాలు అమ్మాయిలు. లోపలికి బాగ వినిపిస్తున్నాయి.

అమ్మాయిల విషయంలో, చిన్న మాటైనా పొరపాటున దొర్లించేవాడు కాదు. స్నేహంగా వుండేవాడు. యిప్పుడే సంకోచం లేకుండా కొలతలతో తూల్తున్నాడు. అస్సలు భరింపశక్యం కాని విషయం. యెందుకిలా..!

అసలిదంతా యెప్పుడు మొదలయింది? అతనిలో ముందు నుంచి యీ ధోరణి వుందా? తను కనిపెట్టలేకపోయిందా? నో నెవ్వర్... అతనిలో మార్పు...

చదువు అవ్వగానే అతను హైదరాబాదులో చిన్నాన్న గారింటికి వెళ్ళిపోయాడు. తనింకా యం.ఫిల్ అంటూ అక్కడే వుండిపోయింది. జూనియర్ కాలేజ్‌లో లెక్చరర్‌గా చేరాడు. రోజూ బస్సులో వెళ్ళి పాఠాలు చెప్పొచ్చేవాడు. తను అతని దగ్గరకి వచ్చినప్పుడు బంజారా రాళ్ళన్నీ

కబుర్లతో నింపేసే వాళ్ళం.

మా యిద్దరం కలిసి వొకే యింట్లో బతకాలనుకున్నాం.

'రిజిస్టర్డ్ మ్యారేజ్' అన్నాడు

'యెందుకు'

'నువ్వు వదిలేస్తే'

'ఆ ఆలోచనే వస్తే యే రిజిస్ట్రేషన్ ఆపలేవ్'

'మా యింట్లో వాళ్ళు అడుగుతున్నారు. నువ్వేం అనుకోకు... వాళ్ళు డబ్బు విషయం మాట్లాడితే'

'కట్న కానుకలా'

'అని కాదు యింటికి కావల్సినవి...'

'నువ్వేం అనుకుంటున్నావ్'

'నాకేం లేదు. వాళ్ళ విషయం చెప్పానంతే.

'వాళ్ళు వీళ్ళు యేం అనుకోవటం ముఖ్యం కాదు. మనం మేం అనుకుంటున్నామని'

'యింటికి కావల్సినవి అమ్మాయి విషయమని యింట్లో అనుకుంటున్నారు. మీ యింట్లో యేమంటున్నారు' అడిగాడు.

'నువ్వసలు తగిన అల్లుడివే కాదనుకుంటున్నారు'

అతని ముఖం చిన్నబోయింది. అంతలోనే పౌరుషంగా 'నాకేం తక్కువ. అమెరికా వెళ్లొచ్చు' అన్నాడు.

'వాళ్ళ పొరపాటేం లేదమ్మా. వొకప్పుడు డాక్టర్స్. ఇంజనీర్స్. యిప్పుడేమో సాఫ్ట్‌వేర్. యిలా అల్లుళ్ళకి గిరాకి కదా. అమెరికా అల్లుడు అయితే వాళ్ళకీ తృప్తి. మనమేం చెయ్యగలం. అమెరికా యూరప్ మిడిల్‌యీస్ట్ - ఆఫ్రికా యిలా బోల్డంత ప్రపంచం చూడాలనే వుంది. చూడడానికి వీసా యిస్తారంటావా.

మనకి యిష్టమై ప్రపంచాన్ని చూడాలి. కానీ అదో క్వాలిఫికేషనా కలిసి బతకటానికి.

'యిల్లు సామాను' అడిగాడు.

'మనిద్దరి జీతంతో కొనుక్కుందాం.'

'చాలాకాలం పడుతుంది కదా. మా యింట్లోవాళ్ళు యేమైనా అనుకుంటారేమో' అన్నాడు.

'వొకపని చేద్దాం, ముందు యింటిని సామానుతో నింపి అప్పుడు బతుకుదాం. యీలోగా నేనొకసారి పాలరాయి కొండల్నుంచి కావేరి ప్రవాహాన్ని చూసొస్తా'

'యేంటి తగాదా' పక్కని కూర్చుంటూ అడిగాడు సలీల్.

'యెప్పుడొచ్చావ్' అడిగాడు నరేంద్ర.

'నిన్న వుదయం' అంటూ పొడవైన చేతిగుడ్డ సంచిలోంచి మూడు రాళ్ళు తీసి మేఘనాకి యిచ్చాడు. సీగ్రీన్ నాచు రంగులో వున్న ఆ బుజ్జిబుజ్జి రాళ్ళ మనుపుతనాన్ని బుగ్గలకి రాసుకుంటూ 'థాంక్‌యూ' అంది

టూ బై త్రీ టీ చెప్పాడు నరేంద్ర.

'మంచు కొండలపై నుంచి వెళుతుంటే యెన్నిసార్లు గుర్తొచ్చావో. వచ్చే యేడాది మళ్ళీ వెళదాం' అన్నాడు సలీల్.



'నే గుర్తు రాలేదా! స్కిన్ టోన్ అయిపోయిందే' అన్నాడు నరేంద్ర.

'స్నో పడటం చూసావా' అడిగింది.

'మీరిద్దరూ సీరియస్ చర్చలో వున్నట్టున్నారు' అడిగాడు సలీల్.

'సంసారం...' అన్నాడు నరేంద్ర.

'గుడ్... గుడ్... నా యేరియా కాదు'

'పెళ్ళి... కలిసుండటం... యేం వద్దా'

'ప్రస్తుతానికి.... అంత ప్రేమేసినప్పుడు ఆలోచిస్తా. సీ యూ బై... అని ఆగి గెడ్డాన్ని చేత్తో రాసుకుంటూ మేఘన వైపు చూస్తు 'నీకొకటిస్తా నాకేం యిస్తావ్' అడిగాడు.

'మూడు రాళ్ళు యిచ్చావుగా. యింకా యేం తెచ్చావ్'

'చెప్పు యేం యిస్తావ్?'

'యేం కావాలి'

'నీ దగ్గర చాలా ఫ్లూట్స్ వున్నాయి కదా... ఆ బుజ్జి ఫ్లూట్ కావాలి'

'వూ'

సంచిలో చేయి పెట్టి వో కాసెట్ తీసి ఆమెకి యిచ్చాడు.

యేంటన్నట్టు చూసింది.

'గొర్రెలు కాసేవాళ్ళు ఆ మంచుకొండల్ని యీ పాటల్తో వెచ్చపరుస్తారు' చెప్పాడు సలీల్.

సలీల్ వెళ్ళిపోయాడు.

మరో టీ ఆర్డరు చేసారు.

'చెప్పు యేం చేద్దాం అడిగాడు నరేంద్ర.

'యీ కేసెట్ విందామా'

'తర్వాత. ముందు మన విషయం'

'నువ్వేం అనుకుంటున్నావో చెప్పు'

'నీ యిష్టం'

యేంటి యింట్లోవాళ్ళ వొత్తిడి యెక్కువగా వుందా?

'నీకు లేదా'

'ప్చ్! చెప్పానుగా. అమెరికా గ్రీన్‌కార్డ్. నెలకోసారి అమెరికా యూరప్ వెళ్ళాలనుకుంటున్నారు. అన్నయ్య యూరప్. అక్క అమెరికా. నేను అమెరికాలో.. వుంటే బాగుండుననిపిస్తోంది వాళ్ళకి. దేశదేశాలు తిరగటం. చూడటం యిష్టమే. కాని అవి స్టేటస్ సింబల్‌గా చూస్తారనుకో యిబ్బందిగా వుంటుంది. యింట్లో అదే చెప్పాను. యిట్స్ వో.కె. అంత తల పట్టుకోవాల్సిన విషయం కాదు. నీ విషయమే అర్థం కావటం లేదు.'

"యేం లేదు... సో యెప్పుడు కొత్త యిల్లు తీసుకుందాం?'

'త్వరలో... వెదుకుదాం'

కాపురం పెట్టిన వేళ మా యిద్దరి జీవితంలో గందరగోళం యేం లేదు.

మా యింట్లో యెటు చూసినా సంతోషమే. వుల్లాసమే. కొద్దిగా వంట సామాను. పరుపు. చాప. పక్కింటి రేడియోలోంచి వినిపించే వివిధభారతి పాటలు. యెన్నో సాయంకాలాలు నడుస్తూ నడుస్తూ

యెప్పటికో తిరిగొచ్చేవాళ్ళం. యింటికి కావాల్సినవన్నీ వొక్కొక్కటి మెల్లమెల్లగా యెంపిక చేసి కొనుక్కునేవాళ్ళం. అనవసరంగా వొక్క చిన్న స్పూన్ కూడా కొనేవాళ్ళం కాదు. వో పొడవైన హాలులో గోడవారగా కేరళా కొబ్బరాకుల చాప. దానిపై బోల్డన్ని బుజ్జిబుజ్జి తలగడాలు. మరో పక్క రంగురంగుల పాత చీరలతో కుట్టిన బొంత. దానిపై రెండు దిళ్ళు. చిన్న ఫ్రిజ్. మ్యూజిక్ సిస్టమ్. కేసెట్. పుస్తకాలు చిన్ని మట్టికుండలో పెన్. పెన్సిల్స్. అక్కడక్కడా ఆకుపచ్చ సీసాలో నీళ్ళు పోసి ఫ్రెష్ పువ్వుల్ని వుంచేవాళ్ళం.

మా యింటికి యెవరు రావాలి. వచ్చేవాళ్ళు యెవరు అనే విషయంలో చాలా పట్టింపుగా వుండేవాళ్ళం. జీవనానికి మరింత తడిని. వెలుగుని యివ్వగలిగే స్నేహితులు మా యింటికి రావటానికి యెఫర్ట్ పెట్టేవాళ్ళం. మా సమయాన్ని శక్తులని అర్థవంతమైన స్నేహాలకి వెచ్చించేవాళ్ళం. మా చిన్ని యింటిని కలిసి నిర్మించుకోవడానికి మేమిద్దరం కలిసి శ్రమ పడ్డాం. కలలూ కన్నాం. ఆ శ్రమలో ఆనందం ఆశా యింకా తడిగానే వున్నాయి. యిప్పుడా తడి ఆవిరైపోతోంటే బాధ. ఆ ఆవిరిని నిలవరించాలనే తపన.

'రా... వాళ్ళు నువ్వు రాలేదని నొచ్చుకుంటున్నారు. రా..." నరేంద్ర పిలిచాడు.

నిశ్శబ్దం.

అతను వో క్షణం నిలబడి విసురుగా వెళ్ళిపోయాడు.

యీ మధ్య తరచుగా యివే గొడవలు.

ఆ రోజు సలీల్ వచ్చేసరికి తను వంటగదిలో వంట చేస్తోంది. అతనూ వాళ్లతో హాల్లో వున్నాడు.

కాసేపటికి 'బై' అని వినిపించింది సలీల్ స్వరం.

తలతిప్పి చూసింది.

'యింటికి రా' అన్నాడు.

మౌనం...

'రోజురోజుకీ తన క్వాలిటీ ఆఫ్ లైఫ్ పూర్తిగా యెటో పోతోంది. ది బెస్ట్ అనుకున్నవన్నీ అతన్నుంచి దూరమైపోతున్నాయి. చెప్పలేవా? యెలా వుండేవాళ్ళం యూనివర్శిటీలో. యెవరు వాళ్ళంతా? పవర్ మనీ కోసం యేమైనా చెయ్యడానికి వెనకాడని వాళ్ళు. వాళ్ళు మన యిళ్ళకి రావటం. మనం వాళ్ళ యిళ్ళకి వెళ్లటం...

'నేనెవరింటికీ వెళ్ళలేదు' చెప్పాను

'వాళ్ళు యీ యింటికి తరచుగా వస్తున్నారు'

'యిది మా యిద్దరి యిల్లు'

'అటువంటి స్నేహాలు చాలా ప్రమాదకరం. వెళ్తున్నా' సలీల్ వెళ్ళిపోయాడు

నరేంద్ర జీవితం లోంచి పుస్తకాలు పాటలు మరుగైపోయి చాలాకాలం అయింది. సలీల్ వొక్కడే అప్పుడప్పుడు వచ్చేవాడు. తనూ చెప్పేసాడు.

అసలిదంతా యెలా మొదలయింది?

ఆ రోజు మా యిద్దరం నొకర్నొకరం పెనవేసుకొని గాఢ నిద్రలో వున్నాం. ఆగకుండా తలుపు చప్పుడు. మా యిద్దరికీ నొకరినొకరం విడిచి వెళ్ళిపోవాలని లేదు.



చాలా అయిష్టంగా వెళ్ళి తలుపు తీసాను.

నరేంద్రని వెదుక్కుంటూ హఠాత్తుగా వచ్చిన గంగాధర్.

గదిలోంచి వస్తూ 'యిల్లెలా తెల్సింది' అడిగాడు నరేంద్ర.

'మీ చెల్లెలు యెడ్రస్ యిచ్చింది'

వాళ్ళిద్దరూ చిన్నతనం నుంచీ యింటర్‌మీడియట్ వరకు స్నేహితులు. హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. వంటగదిలో ముగ్గురికీ కాఫీ కలుపుతోంది.

డికాషన్‌లోకి పాలు వంపుతోంటే హఠాత్తుగా పెట్టిన టీవీ శబ్దానికి చేతిలోని పాలగిన్నె అదిరింది.

గంగాధర్ వాల్యూమ్ పెంచుతూనే వున్నాడు.

'యెన్నాళ్ళయిందిరా యిక్కడికి వచ్చి'

'రెండేళ్ళు!'

'పెళ్ళయి'

'ఆర్నెలలు'

యింటిని కలియజూస్తూ వచ్చి 'రెండేళ్ళయి కూడా సర్కిలేం పెంచుకోకుండా యేం చేస్తున్నావ్....

అదీ మొదలు

'మాదాపూర్‌లో సైట్ వుందట కొనుక్కోకూడదు' అడిగాడో రోజు నరేంద్ర.

'మాదాపూర్‌లో సైట్... అంటే నేల....'

'ఆఁ'

'యెందుకు'

'ముందు ముందు బాగా డెవలప్ అవుతుంది' అన్నాడు.

'యిప్పుడు కూడా బానే వుందిగా'

'కొనుక్కో'

'సైట్ అంటే.... సైట్ కొట్టటం అనుకుంటున్నావా యేంటి?'

'జోక్స్ వద్దు. కొని డవలప్ చేసి అమ్మాలి. యెన్నాళ్ళిలా... ఆ ప్లేస్ చాలా బాగుంది అసలా ఏరియాలో ఆ లాండ్ దొరకటమే అదృష్టం. పార్టీల దగ్గర అడ్వాన్స్ తీసుకొని డవలప్ చేయొచ్చు' అన్నాడు.

'అంత అదృష్టవంతమైన లాండ్ నీకెలా తెలిసింది'

'గంగాధర్‌కి పార్టీలో తెలిసిన వాళ్ళున్నారు. వాళ్ళు ఎరేంజ్ చేసారు' చెప్పాడు.

'వాళ్ళకేంటి యింట్రస్ట్'...

'కమీషన్ వుంటుంది. మెల్లమెల్లగా అర్థమవుతాయిలే, ముందు సైట్ విషయం చూడు'

'నేనా...'

'వూ... నువ్వే'

'అబ్బాయ్ఁ.. అబ్బాయిలకే సైట్ కొట్టటం రాదు. యింకీ సైట్ విషయాలేం తెలుస్తాయి. రేపు సాగర్ వెళదామా'

'సైట్ విషయం చాలా సింపుల్. మనీ అరేంజ్ చేయ్'

'మనీ... నా దగ్గర యెక్కడుంది'

'మీ వాళ్ళనుంచి రావల్సి వుందిగా.

అందులోంచి వాళ్ళని కొంత అడుగు'

బొంతపై పడుకుంటూ గిన్నెల్లో వండుకొంటున్న రోజుల్లో కూడా అతనెప్పుడూ యింట్లోంచి డబ్బులు తీసుకురమ్మని అడగలేదు. యిప్పుడు యింత పెద్ద మొత్తం... దిగులేసింది. యీ ఆలోచనని యిప్పుడే తుంచేయకపోతే చిక్కుల్లో యిరుక్కుంటాం అనిపించింది.

'నాకే ప్రాపర్టీ పై ఆసక్తి లేదు. వాడను. యెవ్వర్నీ అడిగి డబ్బులు తీసుకు రాను. నెలంతా పని చేసి యెంత సంపాదించగలనో అంతే ఖర్చు చేయటం. అంతకుమించి డబ్బుపరంగా నా నుండి యేం రాదు. నీ విషయం నే చెప్పొచ్చే లేదో కానీ కలిసి కొన్ని పంచుకున్నాం. కలసి బతుకుదాం అనుకున్నాం. నీ ఆలోచనలు ప్ఛ్... నువ్వే కాస్త కూల్‌గా ఆలోచించు...

ఆ రోజు రాత్రికి అతను యింటికి రాలేదు. ఆ రాత్రంతా వస్తాడనే చూపులో నిద్ర విరిగిపోయింది. ఆదుర్దా - సతాయింపుగా రాలేదా... లేక యేమైనా అయిందా?

తెల్లారేక తొమ్మిది గంటలప్పుడు వచ్చాడు. ఆఫీసుకి బయలు దేరుతోంటే.

'యేమైపోయావ్ రాత్రంతా'

'సారీ' అన్నాడు.

'వో.కె. రెస్ట్ తీసుకుంటావా? కాఫీ యివ్వనా' హేండ్ బ్యాగ్‌ని భుజం నుంచి తీస్తు లోపలికొస్తూ అడిగా.

'యేం వద్దు. నువ్వు వెళ్ళు' అన్నాడు.

'వో.కె. బై... తిరిగి గుమ్మం దాటబోతోంటే 'వాళ్ళకి యేం చెప్పమంటావ్' అడిగాడు.

'సో... అతను ఫీల్ అయి సారీ చెప్పలేదా? అతని ఆలోచనల్లో మార్పు వచ్చిందనుకోగానే కాస్త తగ్గ్గముఖం పట్టిన అనీజీ తిరిగి నర్రున కమ్ముకొంది.



అతనితో మాట్లాడటమే ముఖ్యమనిపించింది - ఆఫీసు కెళ్ళటం కంటే.

'హితబోధలేం వద్దు. డబ్బు విషయం చెప్పు'

నిర్లిప్తంగా కూర్చుండిపోయాను.

'యివ్వవా' తిరిగి అడిగాడు.

'అసలు నీ ఆలోచనే యేంటోలా వుంది'

'అంటే'

'నువ్వేం అంటున్నావో అర్థం అవుతుంది. కానీ ఆ డీల్ ఫెయిర్ కాదు కదా'

'నిన్ను డబ్బు అడగ్గానే చాలా చెపుతున్నావ్. బెగ్గర్‌లా కనిపిస్తున్నానా?

నిశ్శబ్దం.

'వాళ్ళకి మాట యిచ్చాను. నువ్వు నన్ను పరాయిగా చూస్తావనుకోలేదు. మనిద్దరం వొక్కటే అనుకున్నా....

సాగుతున్న మాటలు.

అచేతనంగా వింటూ.

అతను యింట్లోంచి వెళ్ళిపోయాడు.

రాత్రి రాలేదు. యెక్కడ వెతకాలో తెలియదు. యెవర్ని అడగాలో తెలియదు.

తెల్లార్నే వస్తాడని చూస్తే రాలేదు.

సాయంకాలం అవుతుంటే కాలేజ్‌కి కాల్ చేస్తే వారం రోజులుగా రాలేదని చెప్పారు.

రాకపోతే రాలేదు అనుకోలేక సలీల్ ఆఫీసుకి వెళ్ళాను. చేస్తున్న పని ఆపి బయటకు వచ్చాడు.

క్యాంటీన్‌లో టీ ఆర్డరు చేస్తూ 'యేమైనా తింటావా' అడిగాడు.

వద్దన్నట్లు తలాడించింది.

'రెండ్రోజులుగా నరేంద్ర రాలేదు'

'యెనీ ప్రాబ్లెమ్' అడిగాడు సలీల్.

'వూ'

'వస్తాడు.. కంగారు పడకు. వెతకనా'

'యెక్కడని వెతుకుతాం. వారంగా కాలేజ్‌కి వెళ్ళలేదు. అతని ఆలోచనల్లో మార్పు వచ్చింది'

'వాట్స్ ది ప్రాబ్లమ్'

'అతని చదువుకి తగ్గ వుద్యోగం దొరకలేదు. ఆ కాలేజ్‌లో ఫుల్‌టైమ్ లెక్చరర్ కాదు. తనకి జాబ్ సాటిస్‌ఫేక్షన్ లేదు. చుట్టూ ప్రపంచం చాలా ఆకర్షణీయంగా వుంది. అతనికి క్విక్ మనీ కావాలని వుంది. సైట్ చూసాను. కొందాం అంటాడు. డబ్బు తీసుకురమ్మంటాడు. యిదీ గొడవ. యెలాగోలా సంపాదించాలనే కోరికకి వచ్చేసాక ఆపలేం కదా'

'ఫెయిర్ డీల్ కాదనా' అడిగాడు

'కాదని తెలుస్తూనే వుంది'

'మీ వాళ్ళని అడిగితే యిస్తారా?'

'యిస్తారా యివ్వరా అన్నది కాదు ప్రశ్న. అడగను.'

'మీ యిద్దరి మధ్యా గ్యాప్ వస్తుందేమో'

'వచ్చినట్టేగా'

'యేం చేద్దాం'

'యింటికి రాకుండా యిలా ఎమోషనల్ బ్లాక్‌మెయిలింగ్ చేయటం కష్టంగా వుంది'

'వెయిట్... చూద్దాం. అతను రియలైజ్ అవుతాడేమో' అన్నాడతను.

'యెక్కడుంటాడంటావ్'

'కూల్‌గా వుండు. తనే వస్తాడు' అన్నాడు సలీల్.

'పది గంటల వరకు పనుంది. పనయ్యాక యింటికి వస్తా. అప్పుడు మాట్లాడుకుందాం' అన్నాడతను.

'సరే '

వారం రోజులు జరిగిపోయాయి. నరేంద్ర యింటికి రాలేదు.

అతని అమ్మగారు, పెద్ద చెల్లెలు భారతి వచ్చారు.

'నువ్వెందుకలా ప్రవర్తిస్తావ్? యేం పట్టనట్టు. వాడితో మాట్లాడి యింటికి రమ్మను' అన్నారు.

'డబ్బులు లేకపోతే అనుకోవచ్చు. వుండి యివ్వటానికి అభ్యంతరం యేమిటి?' అంది భారతి.

'నా పిల్లలందరిలోకీ వాడు చాలా మంచివాడు. అందమైన ఆడపిల్లల తండ్రులు మంచి కట్నంతో వాడికోసం తెగ తిరిగేవాళ్ళు. డబ్బు మీద వాడికేం ఆశ లేదు. నిన్ను చేసుకుంటానన్నప్పుడు నిజానికి మా యింట్లో యెవ్వరికీ యిష్టం లేదు - నాకు తప్పా. వాళ్ళ అయిష్టమంతా డబ్బు పెద్దగా రాదని. మీ వాళ్ళ నుంచి వాడికొచ్చే సపోర్ట్ కనిపించలేదు. పాలిటిక్స్‌లో మీవాళ్ళు యెవ్వరూ లేరు కదా. అయినా మేం యెవ్వరం పెద్దగా వాడిని కాదనలేదు. నువ్వేమో సామాను కూడా యిద్దరం కలిసి కొనుక్కుందాం అంటావ్ తప్ప ఆస్తిలో నీ వాటా విషయం అప్పుడూ మాట్లాడలేదు. నీకే కాస్త తెలివొచ్చి నీ వాటా అడుగుతావు అనుకున్నాం. కానీ నీకా ధ్యాసే లేదు. నీ వాటాతో వ్యాపారం చేస్తే పెరిగేది నీ ఆస్తే కదా. వాడి ఫ్రెండ్స్ మా బంధువులంతా కూడా యెక్కువగా రియల్ ఎస్టేట్స్‌లో వున్నారు వాడికీ పదిమందిలో బాగుంటుంది. వాడిని నొప్పించకమ్మా' ఆంటీ చెపుతూనే వున్నారు.

'మేఘనా.... యెవ్వరి సంసారాల్లో యీక్వల్ రిలేషన్‌షిప్ వుండదు. మగవాళ్ళకి సంపాదించటం, పవర్‌ఫుల్‌గా వుండటం చాలా ముఖ్యం. మొగుళ్ళు పవర్‌ఫుల్ అయితే మన స్టేటస్ కూడా పెరుగుతుంది కదా. మగవాళ్ళ కేంటి మనకీ ఆ రెండూ ముఖ్యమే కదా. మొగుడూ పిల్లలూ కూడా అంతే ముఖ్యం, అంది భారతి.



'పవర్‌ఫుల్ అంటే'

'మన పేరు చెబితే వెంటనే గుర్తు పట్టే పరిస్థితి. బోల్డంత డబ్బు. మనం చెబితే పనులవుతాయని, రోజూ పదిమంది మన దగ్గరికి రావటం. స్టేటస్ చాలా ముఖ్యం.... అన్నయ్య పైకొస్తే మేం కూడా యిక్కడికి షిఫ్ట్ అవుదాం అనుకుంటున్నాం. ఫ్లైవోవర్స్ హైవే కాంట్రాక్ట్ తీసుకొన్నవాళ్ళు చాలామంది నరేంద్ర ఫ్రెండ్స్. బంధువులు. సబ్‌కాంట్రాక్ట్ తీసుకోవచ్చు. కాస్త సంపాదించాక హోటల్ స్టార్ట్ చేద్దాం. మనం కూడా ఆ వర్క్‌ని షేర్ చేయొచ్చు. మనమంతా హేపీగా వుండొచ్చు. వాడికి మనీ యిచ్చి కోఆపరేట్ చెయ్. ప్లాన్ ఫర్ మై చైల్డ్... అప్పుడు నీ యెనర్జీస్ అన్నీ చైల్డ్ పై పెడతావ్. అన్నయ్య పైనుండి నీ అటెన్షన్ తగ్గుతుంది. నీది మంచి జాబే కానీ సంపాదన యెక్కువైతే యెంచక్కా జాబ్ మానేసి యెంజాయ్ చెయ్యొచ్చు కదా... అంటుంది భారతి.

'యిదంతా మీకు బాగుందా ఆంటీ'

'సంపాదించటం బాగుంటుంది కదా. సంపాదన లేకపోతే యేం అనుభవిస్తాం. అడ్వర్‌టెయిజ్‌మెంట్ చూసి మురిసిపోవాల్సిందే. సత్తెకాలపు పిల్లలా వున్నావ్. మీవాళ్ళు యేం అనుకోరు. అడుగు. నీకు చేత కాకపోతే భారతిని తీసుకెళ్ళు' నవ్వుతూ తల నిమురుతూ మందలింపుగా అన్నారాంటి.

నిర్లిప్తం. నిశ్శబ్దం.

'మొగుడూ పెళ్ళాలన్నాక సవాలక్ష వుంటాయిరా.... మీ నాన్న అడిగినవన్నీ నే మాత్రం తేగలిగానా? నీలాగే మీ నాన్న అలిగి యిల్లొదిలొస్తే మీ అందరు యింతింత అయ్యేవారా? యింటికిరా. అక్కడెక్కడో కూర్చుని అదేం సతాయింపు. కావాలని చేసుకున్నావ్. యిందుకేనా? ముందింటికిరా. మనకీ ఆడపిల్లలున్నారు' - కొడుకును ఫోన్‌లో మందలిస్తూ ఆంటీ.

నరేంద్ర చివరికి యింటికి వచ్చాడు.

చీలిక చీలికే

సజావుగా మాటలు సాగటం లేదు. మనసులూ కలవటం లేదు. శరీరాలు పెనవేసుకోవటం లేదు.

అతని ఆలోచనలన్నీ యెదగటం పైనే.

అతను సైట్ కొన్నాడు. కాంట్రాక్ట్ మొదలు పెట్టాడు.

'డబ్బు యెక్కడిది' అని అడిగానో రోజు.

'నీకెందుకు' అన్నాడు.

అతని చూపుల్లో చూపు నిలిపి 'తెలియాలి నాకు'

'యెందుకు? యివ్వనన్నావ్. అయిపోయే. యెక్కడిదైతే నీకెందుకు'

'డబ్బులెక్కడివి'

'బెగ్గర్‌ని కదా. అడుగుతోంటే యెవరో వొకరు రాలుస్తుంటారు' హేళనగా అన్నాడు.

నిశ్శబ్దం

'యివ్వనన్నావ్ కదా, నీకెందుకు నా విషయాలు' తిరిగి అడిగాడు.

నిస్సహాయం. మౌనం.

'చూడమ్మా. నీ కోడలికి నా గురించి. ఆరా అయిపోయింది. అన్నాడు.

'నీకెందుకమ్మా ఆరా. వాడి గొడవేదో వాడు పడతాడు' అన్నారామె.

అప్పటికి ఆ సంభాషణ అలా తెగినా ఆ డబ్బులు యెక్కడివని మనసు పీకుతోంది.

యేకాంత సమయాలు అదృశ్యమవుతూ వచ్చాయి. మెల్లమెల్లగా కమ్ముకొంటున్న పరాయితనం. అతన్ని అల్లుకొంటున్న పరాన్న భుక్కులు....

'నువ్వు లేకపోతే అసలు మేం యీ సీటీలో యెందుకూ పనికిరాం. నువ్వు మాకు చాల చాల ముఖ్యం' - అంటూ అతని అక్కలు చెల్లెళ్ళు. బావలు. వారి పిల్లలు మెల్లమెల్లగా యిల్లంతా పాకిపోయారు.

అతను యే తెల్లార్లో యింటికి రావటం. వస్తూనే గదిలో మంచంపై పూర్తిగా వాలిపోయి క్షణంలో నిద్ర పోవటం. యింట్లో యెటు చూసినా మనుషులు. తన వాళ్ళ ముందు తాగడు. యింటికొచ్చే అతని తాగే స్నేహితులూ తగ్గారు. బయటికి వెళ్ళే యితను యెప్పుడొస్తాడో తెలియదు. యెక్కడికి వెళతాడో తెలియదు. మేం అడిగినా నీకెందుకనే సమాధానం.

ఆ రోజు అతను యింటికొచ్చేసరికి వొంటి గంటైంది.

'అన్నం పెట్టనా'

'తినొచ్చా' అంటూ భుజాల చుట్టూ చేతులేసాడు. ఆత్రంగా చెవి పక్కన ముద్దు పెట్టుకొని బలంగా దగ్గరికి లాక్కున్నాడు.

వో పక్క బాగ తాగొచ్చిన వాసన. అంత బలాన్ని భరించటం వినుగ్గా వుంటుందని అతనికి తెలును. అయినా అతను యిటువంటివన్నీ మరిచిపోయాడు. చలనరహితంగా నిలబడిపోయిన ఆమెని మంచంవైపు లాగి 'డల్‌గా వున్నావేంటి' అడిగాడు.

'ప్చ్'

'చెప్పు'

అతని చేతుల్ని తప్పించుకొంటూ 'ప్చ్ చదివిన చదువుకి వుద్యోగాలు లేవ్' కాంట్రాక్ట్ వుద్యోగమే అయినా వుమెన్ ఎంపోర్‌మెంట్ పోగ్రామ్స్ అంటే జాయిన్ అయ్యాను.... యిప్పుడేమో వరల్డ్ బ్యాంక్ లోన్ మీద నడిపే పోగ్రామ్‌కి పని చేయమంటున్నారు. ప్చ్! యీ గ్లోబల్ పోగ్రామ్స్ చాల మంచివని నమ్మి పోగ్రామ్స్ డిజైన్ చెయ్యాలి....' అంది యెదురుగా వున్న కుర్చీలో కూర్చుంటూ,

'వుద్యోగం మారినప్పుడంతా బాధపడటం నీకో కాలక్షేపం అయిపోయింది. వాళ్లు చెప్పేది చేసి రావటానికి నీకెందుకంత బాధ.... పోనీ అసలు వుద్యోగమే మానై. మనకిప్పుడేం తక్కువ... పోనీ ఏదైనా మొదలు పెట్టు.... అన్నాడు నరేంద్ర. వ్యాపారం.... నా వల్ల కాదు. మరో నచ్చిన వుద్యోగం దొరికే వరకూ యిక్కడే వుండాలి. విశ్వనాథన్ సెన్స్‌బుల్. లేకపోతే మరీ కష్టంగా వుంటుంది'

'మీ బాస్ సెన్స్‌బుల్ అంటున్నావ్‌గా. ఆయన చేయటం లేదా. నువ్వే అవీ యివీ వూహించుకొని బాధపడుతుంటావ్. మారే లోకంతో మారాలి. అంతేకాని యిలా బాధపడితే యెలా... గ్లోబల్ డవలప్‌మెంట్ లేకపోతే నేనింతగా సంపాదించే అవకాశాలు వచ్చుండేవా' నరేంద్ర చెపుతూనే వున్నాడు.



ఆమె చుట్టూ చూస్తుంటే ఆ యింటి నిండా పేరుకొన్న పెద్దపెద్ద సోఫాలు పొడవైన డైనింగ్ టేబుల్స్, బరువైన బీరువాలు, కుర్చీలు వాషింగ్ మిషెన్స్ టి.వి. ఫ్రిజ్ పెద్దపెద్ద మంచాలు ముదరు రంగు సిల్క్ కర్టెన్స్.... స్టీలు సామాను గాజు సామాను అవసరమైనవి కానివి యిల్లంతా యిరుకిరుగ్గా సామాను. అతని డ్రస్, ప్రవర్తనా చివరికి యేకాంత సమయాలలో కూడా కమ్ముకుంటున్న లౌడ్‌నెస్.... భరించటం కష్టంగా వుంది. యిదంతా శుభ్రం చేసుకోవాలి. మాట్లాడాలి.... అనుకుంటూ....

'మనం యెలా వుండబోతున్నాం' అని అడిగా.

'అంటే'

'మనిద్దరి సమయం అంటూ యేం కనిపించటం లేదు.'

'మా యింట్లో వాళ్ళు యీ యింట్లో వుండటం నీకిష్టం లేదు కదూ' అని చప్పున గదిలోంచి బయటికి వెళుతూ 'వాళ్ళుంటే నీకేమిటంటా' అని అరుస్తూ యింట్లో అటూ యిటూ తిరుగుతూ 'రెండ్రోజుల్లో మీరంతా వేరే యిళ్ళకి వెళ్ళిపోండి' అని చెప్పేసాడు.

గదిలో వున్న నాకు వాళ్ళ చూపులు మాటలు తెలియనంత అచేతనం.

వాళ్ళంత వెళ్ళిపోయారు. వాళ్ళ ఖర్చు అంతా యితను భరించే వొప్పందంతో.

తిరిగి అతని స్నేహితులు - బీర్ విస్కీ సోడా!... టి.వి. శబ్దాలు. అరుపులు. కమీషన్ గందరగోళం. అంటే వాళ్ళంతా వున్నప్పుడు రానివాళ్ళు యిప్పుడు రావటం. తిరిగి అతనెప్పుడూ 'వాళ్ళ వాళ్ళుంటే' అనే తగాదా యేం పెట్టుకోకపోవటం. అతనికి వాళ్ళని బయట క్లబ్బులో పబ్స్‌లో కలవటం యిష్టం లేదు. విషయాలు పొక్కుతాయనే భయం. వేరే గెస్ట్‌హౌస్‌లు మెయిన్‌టెయిన్ చేసేటంత స్థోమత లేదు యిల్లైతే బోల్డంత సౌకర్యం.

అంటీవాళ్ళని మాకోసం వేరే వుండమనలేదు. అతని కోసం. తన సమయాల కోసం వో స్థలాన్ని యేర్పాటు చేసుకోవటం కోసం. నా మాటలని అవకాశంగా మల్చుకొని పంపించాడు. అతన్ని అతనితో పెనవేసుకుపోయిన అనేక సమయాలని నేనెప్పుడూ తరచితరచి చూడలేదు. అతను నా ఎమోషన్స్ పై ప్లే చేస్తున్నాడని అర్థమవుతున్న కొద్దీ లుంగలుంగలుగా బాధ. ఆఫీసు నుంచి బయటికి వస్తూ బండి స్టార్ట్ చేసాను. యింటికి వెళ్ళాలనిపించలేదు. వుదయం నుంచి మీటింగ్స్ మీద మీటింగ్స్. గాలి ఆడ్డం లేదు. యెటైనా వెళ్ళాలి. యింత పెద్ద ప్రపంచం మనల్ని మనంగా ఆవిష్కరించుకోగలిగే వొక్క ఆత్మ బంధువూ లేకపోవటం నిజమైన వంటరితనం -

వెళుతున్న బండి అప్రయత్నంగా ఆగింది. పార్క్ చేసి యింటి ముందు నిలబడి కాలింగ్ బెల్ కొట్టాలనిపించక చేత్తో తలుపు కొట్టాను.

'యస్ కమిన్'

లోపలికి వెళ్ళాను.

లో లెవెల్ కుర్చీలో కూర్చుని యం.టివీలో మార్క్ యాంతోనిని వింటున్నాడు సలీల్. అతని ముందు కూర్చున్నాను. అతని గుండెల వరకు వచ్చిన తలని గుండెలపై ఆన్చాను అలసటగా.

'అలిసిపోయావా బుజ్జమ్మాయ్' అంటూ మెడ వెనక చేతి వేళ్ళతో మెల్లమెల్లగా నొక్కుతూ 'కాఫీ తాగుతావా' అని అడిగాడు.

'కాసేపయ్యాక'

అతని చేతివేళ్ళు ఆమె వీపుపై వెన్నుపూస పక్కగా నిదానంగా నొక్కుతున్నాయి.

అలసట కొద్దిగా తేలికవుతోంటే మూసుకొంటున్న కనురెప్పలు. కాసింత విశ్రాంతి.

అతను కాస్త ముందుకు వంగి ఆమె తలపై చిన్న ముద్దు పెట్టి 'యిదేం ఫెర్‌ఫ్యూమ్ యిన్ని రకాలుగా వాసనేస్తోంది' అని అడిగాడు.

'గ్లోబల్.... దుబాయ్ మధ్యాహ్నం యిండోనేషియా సింగపూర్ ఆస్ట్రేలియా అమెరికా... వరల్డ్ బ్యాంకు అందర్నీ పెట్టుబడులు పెట్టమని మీటింగ్స్... షాపింగ్ కాంప్లెక్స్. మాల్స్. ఎగ్జిబిషన్స్. పర్చేసింగ్ పవర్. యేసీ హాల్స్ కదా. వొక్కో దేశం వొక్కో పెర్‌ఫ్యూమ్. అన్నీ కలగలిసిపోయి అతుక్కుపోయి ఆఫీసుకి వెళితే చాలు కలగాపులగపు వాసన. యింటికి వెళితే నానారకాల కంపు. యేంటో నాకూ రెండూ పడటం లేదు.'

సలీల్ నవ్వి 'యేం మనవాళ్ళు యిండస్ట్రీస్ పెట్టారంట'

'ప్రొడక్షన్ పై యెవ్వరికీ ఆసక్తి లేదు. యిన్‌ఫ్రాస్ట్రక్చర్ పెరగాలనుకున్నారు. దానిపై పరుగు. యిప్పుడా పరుగు కాస్త ఆపారు. వాళ్ళకి మన జనాభా ఆకర్షణీయమైన ఆస్తి'

'షాపింగ్ మాల్స్... కొంటారా....'

'ఆ... మెల్లమెల్లగా వాటిని చౌకచౌకగా అమ్ముతూ పరిచయం చేస్తారు. విశాలమైన మాల్. చల్లగా లైట్ మ్యూజిక్. పాప్‌కార్న్ తింటూ కోక్ తాగుతూనే చూయింగ్ గమ్ నములుతూనే సూది నుంచి కారు వరకూ కొనుక్కోవటం బానే వుంటుంది..'

'మన కంటే చిన్న దేశాలని మనమూ కబ్జా చేయమా...'

'నో సలీల్... యెవ్వరికీ కూడా మన దేశంలోకి యెవరు రావాలి యెందుకు రావాలి వస్తే యేమవుతుంది - యిలాంటి పట్టింపులు లేవ్. కాపిటల్ మూవ్ అవుతుందంటారు... యెలా మూవ్ అవుతుంది! బ్యూరోక్రాట్స్ యిది మంచిదని అనుకున్నారేమో. మెల్లమెల్లగా వాళ్ళలో కొంతమందికి యేం జరుగుతుందో కాస్త కాస్త తెలియటం మొదలు కాగానే యీ పాపంలో భాగం కాకుండా వుండటం యెలాగని తర్జన భర్జన పడుతూ మంచి చేయటానికి ప్రయత్నించటం. మా బాస్ విశ్వనాథ్‌కి పాపం యెప్పుడూ యిదే చింత. ప్చ్! నరేంద్రకి యే చింతా లేకుండా పోయింది. యింటికి యెవరొస్తున్నారనే పట్టింపే లేదు... ప్చ్.... బయట సోకాల్డ్ సొఫిస్టికేటెడ్ కంపు, యింట్లో జిడ్డు కంపు'.



సలీల్ ఆమె నుదుటిపై ఆ కొన నుంచి యీ కొన దాకా చేతివేళ్ళతో చిట్టిగా నొక్కుతూ 'మార్పు అత్యంత సహజం కదా. నువ్వెందుకలా డిస్టర్బ్ అవుతావ్....

ప్రేమ కూడానా... మా ప్రేమ కూడానా.... మా యిద్దరి మధ్యా ప్రేమా... మా యిద్దరి వుద్యోగాలు కలలూ అన్నీ అన్నీ మారిపోవలసిందేనా... కదుల్తున్నాయామెలో.

'నరేంద్రకి యీ మొత్తం పై అసంతృప్తి వుంది. బాధ పడుతున్నాడు' అన్నాడు సలీల్.

'యే మొత్తం పై...'

'వారం రోజుల క్రితం నరేంద్ర వచ్చాడిక్కడికి.'

'బీర్ కావాలి' అడిగాడు నరేంద్ర.

చిల్డ్ బీర్ వో సిప్ చేసి 'యింటికి రావటం లేదేం' అడిగాడు.

సలీల్ నవ్వాడు చిన్నగా.

ఖాళీ అయిన టిన్‌ని టేబుల్ పై పెడుతూ 'నా సర్కిల్స్ రకరకాలుగా పెరుగుతున్న కొద్దీ మా యిద్దరి మధ్యా గ్యాప్ పెరుగుతోంది. యెదగాలనుకున్నాను. వున్నదంతా నాన్న ఆదర్శాలకే ఖర్చు అయింది. సిటీబస్‌లో వేలాడిపోతూ ప్రయాణం నుంచి జీవితం ఏ.సి. కారు వరకు వస్తే తనకి నా పట్ల వ్యతిరేకత. యింతవరకూ నా కారు ఎక్కలేదు. వో చోట లంచం యిస్తా. మరోచోట తీసుకుంటా. నా చుట్టూ వున్న సర్కిల్‌కి ట్రేసి, చామ్స్కీ, సోమాలియా, Simone De beawvoir తెలియక పోవచ్చు. వాళ్ళు తెల్సిన సర్కిల్‌కి యీ రోజేంటి చాలాకాలంగా వుద్యోగాలు లేవు. వాళ్ళని అడ్డంగా అడ్డు పెట్టుకొని బతకట్లేదా... అదంతా న్యాయ సంపాదనే... యెక్కడా... యెక్కడా... వొకప్పుడు మనం కలగన్న ప్రపంచం జీవితం లేదు. మారక తప్పదు... డబ్బు అడిగా... తనని... తప్పే... యివ్వొచ్చుగా... మా యిద్దరం వొకటే కదా. నీది నాది తనది కాదు. అంతా మనది అని నమ్మే అడిగా.... వూహుఁ... యివ్వలే... పడిందో బంగారు చిలక... పెళ్ళిపెళ్ళి అంటుంది. కానీ నేనే మేఘాకి అన్యాయం చేయదల్చుకోలేదు. మేఘాకి జీవితం అర్థం కాదు. నా చదువుకి తగ్గా ఉద్యోగం రాదు. వాడికిందా వీడి కిందా చిన్న వుద్యోగాలు చేయలేను. తెలివుంది. కలిసొచ్చింది. పై కొచ్చాను. కాని మేఘాకి యివేమీ పట్టవు. నేనేదో ఘోరం చేసినట్టు యీ డబ్బు ముట్టదు. మా యింట్లో అందరికీ నేను చేసేవన్నీ నచ్చుతాయి. వోన్ చేసుకుంటారు. కానీ మేఘా అలా కాదు. వొక్కసారి కూడా... ప్చ్... నాలుగో టిన్ కూడా పూర్తయిపోయింది. అయిదో టిన్ తెరిచి కాస్త తాగాడు. సెల్ తీసి నెంబర్స్ నొక్కాడు.

'హా... నేను నరేంద్రని... బీరు తాగుతున్నా... చూడు రత్నా... మీ సెక్రటరియా.. పర్మిషన్... ప్చ్... చూడమ్మాయి... యెంత బాగా నవ్వుతావ్... డబ్బులేగా... నీవి యిచ్చేస్తా... మొత్తం... ఆ కనకాంబరం చీరలో చాలచాల అందంగా వున్నావ్... నీ వాయిస్ వినాలని పిస్తోందమ్మాయ్... మాట్లాడమ్మాయ్...' అలా వో గంట సాగింది సంభాషణ... అన్నాడు సలీల్.

మేఘా చిన్నగా నవ్వుతూ 'ఆకలి' అంది.

'మాట్లాడటం నీకిష్టం లేదని తెలుస్తోంది. కానీ తనని బాగు చేసుకోరాదు' అన్నాడు సలీల్.

'యెలా, యెందుకు'

'యెలాగోలా... అతని రిక్వేర్‌మెంట్ తెలిసిందిగా. సాటిస్‌ఫై చేయకూడదా'

'యెందుకు'

'మీ మధ్య గ్యాప్ తగ్గుతుందేమో'

మేఘా చిన్నగా నవ్వుతూ 'ఆకలి' అంది.

'యింత సీరియస్ విషయం మాట్లాడుతోంటే'

'చూడు సలీల్.... మారటం బాగు చేసుకోవటం యిదంతా అవ్వదు. వొకప్పుడు మా యిద్దరం బై ఆల్ మీన్స్ వొకరికొకరం కావాలనుకొని వో డిఫ్పైడ్ రిలేషన్‌షిప్‌లోకి వచ్చాం. యీ రోజు మారిపోయాడని నేనూ - మారలేదు తనూ అని అతను అనుకుంటున్నాం. యిట్స్ వో.కె. యిన్ ప్రిన్సిపుల్ తేడాలొచ్చాయి. నీకూ అతని పంథా నచ్చలేదు. స్నేహితుడివి కాబట్టి మెల్లగా తప్పుకున్నావ్. కానీ భార్యని కాబట్టి అతని రిక్వేర్‌మెంట్‌ని సంతృప్తి పర్చమంటున్నావ్ కదా...

'సారీ' నొచ్చుకుంటూ అన్నాడు.

'యిట్స్ ఆల్‌రైట్. నిజంగానే ఆకలేస్తోంది.'

అతను ఫ్రిజ్ తెరిచాడు.

ఖాళీ...

'బయటికి వెళదామా' అడిగాడు.

'వెంటనే. ఆకలేస్తోంది'

మేఘ యింటికి వచ్చేసరికి నరేంద్ర హాల్లో కూర్చుని వున్నాడు. టివి వైపు నుంచి చూపు తిప్పి యెక్కడికి వెళ్ళావ్. నీ కోసం యెప్పట్నుంచో యెదురు చూస్తున్నా. యింటికొచ్చేసరికి నువ్వు లేకపోతే భలే బోర్ కొడుతుందనుకో...'

యేదైనా అవసరం వుంటే యిలా మాట్లాడటం అలవాటే.

'సలీల్ యింటికి'

'వూహూఁ... రేపు మా కొత్త వెంచర్ స్టార్ట్ చేస్తున్నాం... యం.ఎల్.ఏ గారు మంత్రిగారు వస్తున్నారు' అన్నాడు.

'వూ'

అతను ఆమె దగ్గరకి వొచ్చి మెడ చుట్టూ చేతులేసి చప్పన వీపు మీద వేళ్ళతో నిమురుతూ భుజంపై ముద్దు పెట్టాడు - చాలాకాలం తర్వాత ఆమెని స్పర్శించటం. ఆ స్పర్శలో బోలుతనం ఆమెలోకి పాకుతోంది. సెల్ మోగింది. అతని చేతులు సెల్ వైపుకి. అక్కడే నిలబడి ఆమె.

మాటలయ్యాక 'రేపు వుదయం వేం ఆరున్నరకల్లా బయలు దేరాలి.' అన్నాడు.



'యేంటన్నట్లు చూసింది...

కొత్త వెంచర్ ప్రెస్టీజియస్ వెంచర్ అన్నాడు.

'నేనెందుకు'

'జస్ట్ లైక్ దట్' భుజాలని యెగరేస్తూ అన్నాడు.

'వీలవ్వదులే'

'యేం యెందుకని'

'ఆఫీసుకెళ్ళాలిగా'

'ఛా. లీవ్ పెట్టు. అయినా నీదేం పర్మినెంట్ జాబ్ కాదు కదా. కాంట్రాక్ట్ జాబేగా' అన్నాడు.

యెప్పటిలా మౌనం.

'రేపు మనం వెడుతున్నాం'

'యెందుకలా పట్టుబడుతున్నావ్'

'పూజుంది. పీటలపై మనిద్దరం కూర్చోవాలి'

'నీకు తెలుసుగా... నాకవన్నీ అలవాటు లేవని'

'అన్నీ అలవాటైతేనే చేస్తామా! నాకు మాత్రం యింతకు ముందు అలవాటుందా? యిప్పుడు కదా బాగ అలవాటైంది. రానంటే యెలా? నీ పెళ్ళాం యేదంటే యెవర్ని చూపాలి. నీకు అసూయ... రావొచ్చుగా...

'ప్చ్... స్టాప్ యిట్... మరీ మనం యిలా మాట్లాడుకోవద్దు యిష్టం లేదు. అంతే.

'యెందుకు' అడిగాడు.

'నీ బిజినెస్‌లోకి నువ్వు డబ్బులు తెచ్చిన పద్ధతి. ఆ వ్యాపారంలో నువ్వు ఆపరేట్ చేస్తున్న పద్ధతి నాకు నచ్చలేదు. మనిద్దరం యీ యింటికి యెవరు రావాలి అనే విషయంపై చాలా పట్టింపుగా వుండేవాళ్ళం. వొకే యింట్లో జీవితాలని పంచుకోవాలనుకున్న వాళ్ళం. నీ జీవితంలో వో ముఖ్య పార్శంతో నాకే సంబంధం లేదనుకోలేను. నీ పనులు నువ్వు చేసుకుంటున్నావ్, నన్నందులోకి లాక్కు'.

'నీ డబ్బేం కాదు కదా. నచ్చి యిచ్చినవాళ్ళనంటావేం' అన్నాడు.

'నువ్వు చేస్తున్నదేంటో నాకు తెలుసు. యెందుకీ మాటలు. మరింతగా మనిద్దరం మనకిష్టం లేని మన గురించి మాట్లాడుకోవటం'

'నువ్వంటే నాకు యిష్టం. రత్న యెన్నిసార్లు అడిగినా పెళ్ళికి వొప్పుకోలేదు. నీకేం అర్థం కాదు' అసహనంగా అన్నాడు.

అసహన నిశ్శబ్దం.

'రత్న మొగుడు రత్నా విడిపోయి చాలాకాలం అయింది. గంగాధర్‌కి చుట్టం. డబ్బుంది. యిచ్చింది. నేనంటే యిష్టం. పెళ్ళి చేసుకుందాం అంది కానీ నేనెప్పుడూ యస్ చెప్పలేదు.' అన్నాడు.

'నో అని కూడా చెప్పలేదు. పెళ్ళి లాంటిదేదో ప్రామిస్ చేసాకే డబ్బిచ్చారనుకుంటా'.

'యేదో చెప్పానులే... తన డబ్బులు తనకి యిచ్చేస్తాగా' తేలిగ్గా అనేస్తూ, 'రేపు రానని అనకు. మంత్రిగారి భార్య, ఎం.ఎల్.ఎ గారి భార్య వస్తున్నారు. నువ్వు రాకపోతే బాగుండదు' అన్నాడు.

'రాలేను. అసలు మనమిలా కలిసి బ్రతకడంలో అర్థమేమైనా వుందా?'

'ఛ... ఛ... నేను యింట్లో వుండను వెళ్ళిపోతా'

'కాస్త సహనంతో చెప్పేది విను. యింట్లోంచి వెళ్ళిపోవటాలూ యీ గందరగోళాలేం వద్దు. నిజానికి మనం యింకా యీ విషయం గురించి మాట్లాడుకోవటం మంచిది. మనం కలిసి నడుద్దాం అనుకున్నాం. కొంతకాలం నడిచాం. అంతే. కలిసి నడవటం మానేసి చాలాకాలం అయింది.'

'అంటే విడిపోదామనా'

'మనం విడిపోయి చాలాకాలం అయింది'

'నాకు రత్నకి మధ్య....

ఆమె అవిశ్రాంతంగా నవ్వి 'రత్నా... గంగాధర్... నువ్వూ... ప్చ్ వీళ్ళెవ్వరూ కాదు మన సమస్య. ఆ విషయాలు యింక వదిలేద్దాం. మనం నమ్మిన వాటికి పక్కకి జరగడానికి యిద్దరం సిద్ధంగా లేం. కాస్త ప్రశాంతంగా విడిపోదాం'. యిల్లంతా కలియతిరుగుతోన్న చూపులు. పంచుకొన్న క్షణాలు... పోగుచేసుకొన్న జ్ఞాపకాలు.... నిర్విరామంగా వెంటాడుతోంటే వూపిరి చిక్కుకుపోయింది.

'సరే చెప్పు. సామాన్లు యెలా పంచుకొందాం' అన్నాడు.

'చెప్పు'

'మనిద్దరం కలిసి కొన్నవి పంచుకొందాం. నే కొన్నవి యెలాను నీకొద్దు కదా'

నవ్వింది.

గిన్నెలు, తపేలాలు, దుప్పట్లు, తలగడాలు అతనే వంతులు వేసేశాడు.

యిద్దరి చూపులు ఆ వొకే వొక్క బొమ్మపై నిలిచిపోయాయి.

కృష్ణుడు, సత్యభామ ప్రేమగా వొకర్నొకరు చూసుకొంటున్న పాలరాయి బొమ్మ. అరుదైన ఆ బొమ్మని జైపూర్ వెళ్ళినప్పుడు యిద్దరూ ముచ్చటపడి కొన్నారు.

యెవరు తీసుకోవాలి?!

చివరికి అతనే అడిగాడు 'యెవరు తీసుకొందాం'

ఆమె మాట్లాడలేదు.

'టాస్ వేద్దామా?' అడిగాడు.

'వద్దు. నువ్వు తీసుకో' అంది.

యిద్దరూ తీరిగ్గా గోడలకి అమర్చుకొన్న ఫొటోలను వొక్కో మేకు నుంచీ తీస్తుంటే మనసు గిలగిలలాడింది.

మా యిద్దరి సాంగత్యంలో అత్యంత మౌనవీయ క్షణాలవి స్నేహాన్ని ప్రేమనీ చూసిన నాకు యీ మొత్తం సంఘటన కాలుస్తోంది. అగ్నిప్రవాహంలా దహించి వేస్తోంది. కలిసి యే సమయాలనీ గడపకపోతే యే విషయాలనీ పంచుకోకపోతే ఆ స్నేహానికీ ప్రేమకూ అర్థమే లేదు. యిష్టాలు మారాయి. అసలు యింత ప్రేమ గాయపడటానికేనా... తప్పదు.

అవే సూర్యోదయాలు. సాయంకాలాలు. చంద్రోదయాలు. అమావాస్య దినాలు. వరదలు. చలిగాలులు. వడగాల్పులు...

థింక్ గ్లోబల్ యాక్ట్ లోకల్... కాన్ఫరెన్స్‌లో విశ్వనాథ్ మాట్లాడుతున్నాడు వింటున్నంతసేపు అనీజీ.

'యీ పని నుంచి తప్పించి వేరే చోట వేయండి' విశ్వనాథ్‌ని అడిగింది.

'యెక్కడికి వెళ్ళినా యివే కాన్సెప్ట్. మెల్లమెల్లగా యీ మొత్తం యిష్యూని మనవాళ్ళకి యెక్కువ హాని చేయకుండా యెలా డీల్ చేయాల్లో ఆలోచించడానికి నీలాంటి వాళ్ళుండాలి' చెప్తున్నాడు విశ్వనాథ్.

'యేంటి ఆలోచిస్తున్నావ్' అడిగాడతను.

'యివేం వద్దు'

'యేం చేస్తావ్'

'చదువుకోవాలని వుంది'

'యేం చదువుకొంటావ్'

'చరిత్ర'

'హిస్టరీ'....

'ఆఁ'

'చదివేం చేస్తావ్'

'వెతుకుతాను'

'యేంటి'

'మమ్మల్నీ... మనల్ని... నన్ను నేను... మనందర్నీ... కదుల్తున్నాయి.

ఆమె చూపులు అతని టేబిల్‌పై వున్న వెడ్డింగ్‌కార్డ్ పై ఆగాయి.

'నరేంద్ర పెళ్ళి. యింట్లోవాళ్ళు కుదిర్చిన పెళ్ళి. శ్రీవిద్యా వెడ్స్ నరేంద్ర. నరేంద్ర వెడ్స్ శ్రీవిద్య అని రెండు కార్డు వచ్చాయి' అన్నాడు.

'గుడ్'

* * *

బేగేజ్ సెక్యూరిటీ చెక్‌కి పంపించి సలీల్ దగ్గరికి వచ్చింది మేఘన.

'థాంక్యూ... నువ్వూ విశ్వనాథ్ పూనుకోకపోతే యింత త్వరగా చదువుకొనే అవకాశమే వచ్చుండేది కాదు' అంది.

'నాకేం తెస్తావ్...' అడిగాడు.

'మంచు'

'నో... నార్త్ అమెరికా కదా' అన్నాడు.

'చదువు పూర్తి చేసి వెనక్కి వస్తూ హరప్పామొహంజదారా చూడాలి' అంది.

'యిక్కడికిరా నాక్కూడా చూడాలని వుంది. కలిసి వెళదాం. సింధూనదిని చూసొద్దాం.' అన్నాడు.

'వో... గుడ్...'

అనౌన్స్‌మెంట్...

వంగి హేండ్‌బ్యాగేజ్ అందుకొంటూ అతని మెడ చుట్టూ చేయి వేసి దగ్గరకి జరిగి బుగ్గపై ముద్దు పెట్టుకొని నవ్వింది. ఆమె మెడ వెనక చేతివేళ్ళతో చిన్నగా నొక్కుతూ అతనూ నవ్వాడు.

ఆ నవ్వుల్లోంచి లీలగా వినిపిస్తున్న అనౌన్స్‌మెంట్.

'నిజంగా మంచుని తెస్తావా'

'వూహూ... మంచుపూలవానల్నే తీసుకొస్తా...

'మనకోసం' యిష్టంతో స్పష్టంగా అడిగాడు.

అతని అరిచేతిని ముద్దు పెట్టుకొని నవ్వింది జల్లులు జల్లులుగా మంచుపూలవానలా....





# మనో చిత్రణా సాహిత్యం

సాహిత్య సృష్టి ప్రారంభమైనప్పట్నించి రచయితలు మానవుడి మనస్సంచారాన్ని తమ రచనల్లో బొమ్మ కట్టడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. వాల్మీకి కావొచ్చు, వెచామర్ కావచ్చు, సాఫోక్లీజ్ కావొచ్చు, భవభూతి కావొచ్చు, కాళిదాసు కావొచ్చు, షేక్స్పియర్ కావొచ్చు.. యే గొప్ప రచయితైనా తమ పాత్రల మనస్సు మారుమూలన్ని శోధించటానికి ప్రయత్నించిన వాళ్ళే



నవీన్ | • రచయిత, కాలమిస్టు

మనిషంటే శరీరం మాత్రమే కాదనీ, మనిషంటే మనసుకూడా అనీ అందరికీ తెలుసు - శరీరం లేందే ప్రాణం లేదు - ప్రాణం లేందే మనసు లేదు - మనసు, శరీరం వేర్వేరు? వేర్వేరని కొందరు, ఒకటేనని కొందరు చాలా కాలంగా వాదించుకుంటూనే ఉన్నారు - రెండు వాదనల్లోనూ కొంత నిజముందనే వాళ్లూ ఉన్నారు - మనసు అనేది మనిషి మెదడులో పుడ్తుంది - మెదడు శరీరంలోని ఓ భాగమే కాబట్టి మనసు కూడా శరీరంలోని ఓ భాగమే -

మానవుడి మనస్సనేది అత్యంత సంక్షుభితమైన, సంక్లిష్టమైన ప్రపంచం - శారీరికశక్తి పరిమితమనీ, మానసికశక్తి అపరిమితమనీ మేధావులంటారు - ఈ మనస్సనేదాన్ని విశ్లేషించి అర్థం చేసుకోవడానికి, అర్థం చేయించడానికి ఎందరో మహా మేధావులు తమ రచనలద్వారా ప్రయత్నించారు - అట్లా ప్రయత్నించి వాళ్ళల్లో కవులు, నాటకకర్తలు, నవలాకారులు ముఖ్యులు. సాహిత్య సృష్టి ప్రారంభమైనప్పట్నించి రచయితలు మానవుడి మనస్సంచారాన్ని తమ రచనల్లో బొమ్మ కట్టడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. వాల్మీకి కావొచ్చు, వెచామర్ కావచ్చు, సాఫోక్లీజ్ కావొచ్చు, భవభూతికావొచ్చు, కాళిదాసు కావొచ్చు, షేక్స్పియర్ కావొచ్చు.. యే గొప్ప రచయితైనా తమ పాత్రల మనస్సు మారుమూలన్ని శోధించటానికి ప్రయత్నించిన వాళ్ళే - అయితే మనస్సుమర్మాన్ని చాలా వరకు విప్పి చెప్పిన మొట్టమొదటి మహామేధావి - సిగ్మండ్ ఫ్రాయిడేనని చెప్పాలి. సిగ్మండ్ ఫ్రాయిడ్ కంటె ముందు మహాకావ్యాలు రాసిన రచయితలు మనస్సుమర్మాన్ని కొంతవరకే విప్పి చెప్పగల్గారుకానీ సిగ్మండ్ ఫ్రాయిడ్ అత్యంత సంక్లిష్టమైన మనిషి మనస్సును లేబోరేటరీలో పెట్టినట్టుగా పెట్టి, దాని మీద అనేక ప్రయోగాలు చేసి దాని మర్మాన్ని శాస్త్రీయంగా పరిశోధించి, ఛేదించిన మొదటి మానసిక శాస్త్రజ్ఞుడు. ఇరవయ్యో శతాబ్దపు ప్రారంభంలోనే మనస్సును గూర్చిన సిగ్మండ్ ఫ్రాయిడ్ సిద్ధాంతాలు బహుళ ప్రచారాన్ని పొందటం ప్రారంభమైంది.

మనిషి మనసులో మూడు అరలుంటాయనీ, అవి. అచేతన, ఉపచేతన, చేతన అనీ, ఈ మూడింట్లో అచేతన అన్నదే మనస్సులోని చాలా ఎక్కువభాగాన్ని ఆక్రమిస్తుందనీ, ఇదే ఓ వ్యక్తి బాహ్య ప్రవర్తన మీద చాలా ఎక్కువ ప్రభావాన్ని కల్గిస్తుందనీ ఫ్రాయిడ్ చెప్పాడు - మనిషిలోని ఈ 'అచేతనాన్ని' కనుక్కోవడమే ఫ్రాయిడ్ సాధించిన మహత్తర విజయమని ఇవ్వాళ అంటూ

అంగీకరిస్తున్నారు - అయితే ఫ్రాయిడ్ మాత్రం మనిషి మనస్సులో ఈ అచేతన అనేదొక టుందుందనీ తనకంటె ముందే సొ ఫోక్లీజ్, షేక్స్పియర్ లాంటి మహా రచయితలకు తెలుసునని అనేకసార్లు చెప్పాడు. ఫ్రాయిడ్ సాధించిన విజయమేమిటంటే మనోవిశ్లేషణ అనే ఓ నూతన పద్ధతిని కనుక్కొని, ఈ పద్ధతి ద్వారా మనిషిలోని అచేతనాన్ని బహిర్గతం చేసి మనిషికి అతనిలోని అధో లోకాల్ని చూపించడం - పందొమ్మిదివందల పదో సంవత్సరం నుండి యూరోప్‌లో ఫ్రాయిడ్ మనోవిశ్లేషణా సిద్ధాంతాలు బహుళ ప్రచారాన్ని పొందటం మొదలెట్టాయి. "ఈడిపస్ కాంప్లెక్సు" (ఈడిపస్ భావగ్రంధి) "ఇన్‌ఫాంటైల్ సెక్సువాలిటి" (శైశవ లైంగికత) లాంటి ఫ్రాయిడ్ సిద్ధాంతాలు యూరోప్ ఖండాన్ని అతలాకుతలం చేశాయి - వెంటనే ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రభావం సాహిత్యం మీద అత్యంత గాఢంగా పడింది. డి.హెచ్. లారెన్స్, వర్జీనియా ఉల్ఫ్, జేమ్స్ జాయిస్, జోసెఫ్ కాన్రాడ్ లాంటి అనేకమంది రచయితలు ఫ్రాయిడ్ సిద్ధాంతాల నేపథ్యంలో సాహిత్యంలో అనేక ప్రయోగాలు చేశారు. అట్లా ఈ రచయితలు రాసిన నవలల్ని మనోవైజ్ఞానిక నవలలన్నారు - ఈ నవలల్లో ప్రధానంగా మానసిక వాస్తవికత ఉంటుందన్నారు - సంక్లిష్టమైన మానవుడి మనస్సును చిత్రించే ప్రయత్నం ఈ తరహా రచనల్లో జరుగుతుంది - దీన్నే 'మనోచిత్రణ' అనొచ్చు - మనిషి బాహ్యా రూపాన్ని, బాహ్య పరిస్థితుల్ని చిత్రించడంకంటె ఎక్కువగా మనిషి అంతరంగ చిత్రణ, బాహ్య ప్రపంచం ఈ అంతరంగ ప్రపంచంలో సృష్టించే ప్రకంపనల చిత్రణ ఈ తరహా సాహిత్యంలో ఎక్కువగా జరుగుతుంది - తెలుగులో ఈ మనోచిత్రణా సాహిత్యం పందొమ్మిది వందల నలభై ఆరులో గోపీచంద్ రచించిన "అసమర్థుని జీవయాత్ర" నవలతో ప్రారంభమయిందని చెప్పొచ్చు. ఈ నవలలో ఒక పాత్ర మనఃప్రపంచంలోకి అదివరకు యే రచయితా వెళ్ళనంత లోతుల్లోకి గోపీచంద్ వెళ్ళి "సీతారామారావు" అనే పాత్రను సృష్టించాడు - నవలను గోపీచంద్ ఆత్మకథాత్మక నవల అనొచ్చు. సీతరామారావు పాత్ర సృష్టిస్తున్నప్పుడు గోపీచంద్ తనను తాను మరొకరు పరిశీలిస్తున్నట్టుగా పరిశీలించుకున్నాడు - అంటే ఇక్కడ పరిశీలకుడూ, పరిశీలితుడూ ఒక్కరే - సాధారణంగా మనో విశ్లేషణాత్మక రచనల్లో ఇదే జరుగుతుంది. రచయిత తనను తాను మరొకరు పరిశీలిస్తున్నట్టుగా పరిశీలించుకొని ఆ పరిశీలన ఆధారంగానే తన నవలలోని పాత్రల్ని సృష్టిస్తాడు - యే రచయితకైనా తన మనసులో యేం జరుగుతున్నదో తెలిసినంతగా మరొకరి మనుసులో యేం జరుగుతున్నదో తెలీదు - అందుకే తనను తాను వేరొకరిలా విశ్లేషించుకోగల్గినప్పుడే ఓ రచయిత తన పాత్రల మనో చిత్రణను అత్యంత వాస్తవికంగా, చెయ్యగల్గుతాడు -

> **ఫ్రాయిడ్ శిష్యుడు అడ్లర్ ప్రతిపాదించిన ఆత్మన్యూనతాభ్రాంతిని మనం ఈ దశలో సీతారామారావులో చూస్తాం - సీతారామారావు తనను తానే అసహ్యించుకునే స్థితికి చేరుకొని తనతో తనే యుద్ధం చేసి తనను తాను సంహరించుకోవడంతో ఈ నవల ముగుస్తుంది.**

## గోపీచంద్ నేపథ్యం

గోపీచంద్ వ్యక్తిగత జీవితంలోని ఒక దశను అతని తండ్రి త్రిపురనేని రామస్వామి చౌదరి చాలా ప్రగాఢంగా ప్రభావితం చేశాడు - గోపీచంద్‌కు అతని తండ్రి ద్వారా యాంత్రికమైన హేతువాదం సంక్రమించింది - దాంతో గోపీచంద్ తన చుట్టూఉన్న సమాజంతో రాజీపడలేకపోయాడు. ప్రతిదాన్ని ఇలా ఎందుకు జరగాలి?" అని ప్రశ్నించడం మొదలెట్టాడు - అట్లా ప్రశ్నించినప్పుడు జీవితం వ్యర్థమనే సమాధానం లభించింది - దాంతో అతడికి యేమీచెయ్యలేని పరిస్థితి ఏర్పడింది - నేనో అసమర్థున్ని అనే భావం కల్గింది - ఇది తనను తాను అసహ్యించుకునే స్థితికి దారి తీసింది - దాంతో అతనిలో ఆత్మన్యూనతా భ్రాంతి అనేది బలంగా ఏర్పడింది - ఈ స్థితిలోంచి బయటపడ్తే తప్ప తనకు విముక్తి లేదనుకున్నాడు - 'అసమర్థుని జీవయాత్ర' అనే నవల రాయడం ద్వారా గోపీచంద్ తనలోని సీతారామారావును సంహరించుకొని, ఆత్మన్యూనతా భ్రాంతి లోంచి బయటపడే మామూలు మనిషి కాగలిగాడు.

'అసమర్థుని జీవయాత్ర'లో ప్రధానపాత్ర సీతారామారావు - సీతారామారావు ప్రతిదానికి హేతువాదాన్ని అన్వయిస్తూ ఎందుకు అని ప్రశ్నిస్తూ, సమాజం చేత అసమర్థుడుగా చిత్రించబడ్డాడు - సీతారామారావును సమాజం అసమర్థుడనడమేకాదు. తనను తానుకూడా అసమర్థుడుగానే భావించుకునే స్థితికి చేరుకుంటాడు. ఫ్రాయిడ్ శిష్యుడు అడ్లర్ ప్రతిపాదించిన ఆత్మన్యూనతాభ్రాంతిని మనం ఈ దశలో సీతారామారావులో చూస్తాం - సీతారామారావు తనను తానే అసహ్యించుకునే స్థితికి చేరుకొని తనతో తనే యుద్ధం చేసి తనను తాను సంహరించుకోవడంతో ఈ నవల ముగుస్తుంది. ఆర్.ఎస్.సుదర్శనం అన్నట్టు "ఈ నవల వ్రాయటం ద్వారా తనలోని సీతారామారావు మరణించడం ద్వారా, గోపీచంద్ మానసికంగా పునర్జన్మ వంటి అనుభూతి పొంది, జీవితం పట్ల కొత్త దృక్పథాన్ని ఏర్పరచుకోవడం జరిగింది"

## చివరకు మిగిలేది

బుచ్చిబాబు రచించిన "చివరకు మిగిలేది" నవలలో కూడా మనోచిత్రణ అద్భుతంగా జరిగింది - ఈ నవలలోని ప్రధానపాత్ర దయానిధి సృష్టికూడా బుచ్చిబాబు తనను తాను మరోవ్యక్తి పరిశీలించినట్టుగా పరిశీలించుకోవడం వల్లనే జరిగింది - ఈ నవలలోని దయానిధి పాత్ర ఎదుర్కొన్న ప్రధాన సమస్య తనతోతాను సమాధాన పడలేకపోవడం - ఎంతోమంది స్త్రీలు అతని జీవితంలో ప్రవేశించినా ఎవరితోనూ అతడు సహజంగా ప్రవర్తించలేకపోవడం - యదార్థం

నుండి పారిపోయి కలల్లో బతకాలని ప్రయత్నించడం - యువకుడైన దయానిధి సెక్స్‌ను గురించి ఎంతో ఆలోచిస్తాడే తప్ప యే స్త్రీతో కూడా లైంగిక సంబంధాన్ని పెట్టుకోలేకపోతాడు - లైంగిక జడత్వానికి లోనవుతాడు - తనిలా ఎందుకు తయారయ్యానని తనను తాను ప్రశ్నించుకొని తనుతాను విశ్లేషించుకోవడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడతడు తనకు తనతల్లిపట్ల ఒక విపరీతమైన అనుబంధం ఏర్పడిందనీ, తాను తన తల్లిని గూర్చి తన హృదయంలో ప్రతిష్ఠించుకున్న రూపానికీ, బాహ్య ప్రపంచంలో అంటే సమాజం దృష్టిలో అతని తల్లికున్న రూపానికీ, బాహ్య ప్రపంచంలో అంటే సమాజం దృష్టిలో ఉన్న అతని తల్లికున్న రూపానికీ తీవ్రమైన వైరుధ్యం ఉందని తెలుసుకుంటాడు దయానిధి ఎదుర్కొన్న సమస్యను మనోవిశ్లేషణలో "ఈడిపస్ కాంప్లెక్సు" అంటూరు. కొడుకు తండ్రి పట్ల ద్వేషం తల్లిపట్ల విపరీతమైన ప్రేమ (దీంట్లో లైంగిక పరమైన అనుబంధం కూడా అచేతనములో) ఉంటుంది. దీన్నే ఫ్రాయిడ్ "ఈడిపస్ కాంప్లెక్స్' అన్నాడు - దయానిధి మనస్సులో స్థిరీభావం చెందిన తల్లి రూపం కారణంగానే అతడు అతని తల్లికి మరోరూపంలా కనిపించే అమృతంతో తప్ప మరే ఇతర స్త్రీతోనూ, తన భార్య ఇందిరతోకూడా సహజంగా ఉండలేకపోతాడు. చివరకు దయానిధి తనను తాను తెలుసుకోవడం ద్వారా తన సమస్యను తెలుసుకొని తనలోతాను సమాధానపడటం తప్ప తన సమస్యకు మరో పరిష్కారం లేదని తెలుసుకుంటాడు.

**అల్పజీవి**

మనోవిశ్లేషణా సూత్రాల్లోని ఆత్మ న్యూనతాభ్రాంతి అనే సూత్రానికి తు.చ తప్పకుండా సాహిత్య రూపాన్నిచ్చిన నవల "అల్పజీవి" ఫ్రాయిడ్ శిష్యుల్లో ఒకడైన అడ్లర్ ఈ 'ఆత్మన్యూనతాభ్రాంతి' సూత్రాన్ని వివరించాడు. బాల్యంలో జరిగిన ఒక అఘాతం కారణంగా వ్యక్తుల్లో ఈ ఆత్మ న్యూనతాభ్రాంతి ఏర్పడుతుందని, ఈ భ్రాంతి కారణంగా ఆ వ్యక్తులు చాలా పిరికివారుగా, అసమర్థులుగా మారిపోతారని, వారి బాల్యంలో జరిగిన అఘాయిత్యాన్ని వాళ్ళ అంతశ్చేతనలో అణచివేస్తారని, తిరిగి ఈ అఘాత సంఘటనను వాళ్ళ చేతనలోకి తెచ్చి దాన్ని వాళ్ళు గుర్తించేలా చేస్తే వాళ్ళల్లో ఏర్పడిన ఈ ఆత్మన్యూనతా భ్రాంతి తొలగిపోతుందని అడ్లర్ చెప్పాడు - 'అల్పజీవి'లోని సుబ్బయ్యలో సరిగ్గా ఇలాగే జరుగుతుంది - అతని బాల్యంలో అతని తండ్రిని ఓ స్త్రీ - ఆమె చూడటానికి చాలా భయంకరంగా ఉంటుంది - చాలా దారుణంగా అవమానిస్తుంది - సుబ్బయ్య తండ్రి పక్కనున్నప్పుడే ఇది జరుగుతుంది. ఈ అఘాతం కారణంగా సుబ్బయ్య పరమ పిరికివాడుగా మారిపోతాడు. నవల చివరల్లో మనోరమ అన్న అతన్ని ప్రేమించిన స్త్రీ అతని అంతశ్చేతనలో అణచివెయ్యబడిన ఈ సంఘటనను వెలికితీసి సుబ్బయ్యలోని ఆత్మన్యూనతాభ్రాంతిని పోగొట్టగల్గుతుంది.

ఆర్.ఎస్.సుదర్శనం రాసిన 'మళ్లీ వసంతం', 'సంసారవృక్షం' మొదలైన నవలల్లో చాలా లోతైన మానసిక చిత్రణ కనిపిస్తోంది. ఆర్.ఎస్. సుదర్శనం అస్తిత్వవాది. అస్తిత్వవాదులు వ్యక్తి స్వేచ్ఛకు చాలా ప్రాముఖ్యం ఇస్తారు. ఏ వ్యవస్థ విధించే నియమాలనుగానీ, నిబంధనల్నిగాని అస్తిత్వవాదులు అంగీకరించారు - అలాగే మనిషిమనస్సు చాలాసార్లు అహేతకంగా సంచరిస్తుందని అస్తిత్వవాదులు నమ్ముతారు - మనస్సు యొక్క ఈ అహేతుక సంచారాన్ని చిత్రించడానికి అస్తిత్వవాదులు ప్రయత్నిస్తారు - 'మళ్ళీ వసంతం' నవలలో ఆర్.ఎస్. సుదర్శనం ఈ నవలలోని ప్రధాన పాత్ర ఉర్మిళ కనే కలలద్వారా ఆమె అంతశ్చేతనలో యేయే శక్తులు సంచరిస్తున్నాయో చెప్పడానికి అంటే వ్యవస్థ మధ్య జరిగే సంఘర్షణకు, మనస్సుకు శరీరానికి మధ్య జరిగే సంఘర్షణను - ఈ కారణంగా వ్యక్తిలో ఏర్పడే ద్వైదీభావాన్ని ఆర్.ఎస్.సుదర్శనం "మళ్ళీవసంతం"లో చిత్రించారు.

> పాత్రల మనో చిత్రణకు అత్యంత ప్రాముఖ్యంగా ఇచ్చే రచయితల్లో వాసిరెడ్డి సీతాదేవి పేరును ప్రముఖంగా చెప్పాలి – ఆమె రచించిన 'సమత' 'మట్టిమనిషి' 'మరీచిక' 'మానని-మనస్సు' మొదలైన నవలల్లో స్త్రీ పాత్రల మానసిక సంఘర్షణల్ని అద్భుతంగా చిత్రించింది

అస్తిత్వవాద నేపథ్యంలో వెలువడిన మరో నవల వడ్డెర చండీదాసు రచించిన 'హిమజ్వాల' ఈ నవలలోని ప్రధానపాత్ర గీతాదేవి మనస్సంతా సమరాన్ని రచయిత అద్భుతంగా చిత్రించాడు.

పాత్రల మనో చిత్రణకు అత్యంత ప్రాముఖ్యంగా ఇచ్చే రచయితల్లో వాసిరెడ్డి సీతాదేవి పేరును ప్రముఖంగా చెప్పాలి - ఆమె రచించిన 'సమత' 'మట్టిమనిషి' 'మరీచిక' 'మానని-మనస్సు' మొదలైన నవలల్లో స్త్రీ పాత్రల మానసిక సంఘర్షణల్ని అద్భుతంగా చిత్రించింది - 'సమత'లో అరుంధతి పాత్ర చిత్రణలోనూ, 'మట్టిమనిషి'లో వరూధిని పాత్ర చిత్రణలోనూ ఆమె స్త్రీ హృదయపు లోతుల్ని శోధించగల్గింది. వివాహేతర సంబంధాల్ని పెట్టుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడినప్పుడు స్త్రీలు ఎలాంటి మానసిక సంఘర్షణకు లోనవుతారో 'సమత'లోనూ, తను సాధించదల్చుకున్న లక్ష్యాన్ని సాధించటంకోసం ఓ స్త్రీ ఎలా తన సర్వశక్తుల్ని ఒడ్డి పోరాడుతుందో 'మట్టిమనిషి'లోనూ సమర్థవంతంగా చిత్రించింది.

**నవీన్ రచనలు**

నవీన్ రచించిన నవలలన్నింట్లోనూ పాత్రల అంతరంగ జగత్తు లోతు శోధించే ప్రయత్నం జరుగుతుంది. 'అంపశయ్య'లో

ఆరంభ యౌవనంలో ప్రవేశించిన యువకుల్లో ఏర్పడే లైంగిక అశాంతిని, అభద్రతాభావం వల్ల ఏర్పడే వ్యాకులతని, తల్లిదండ్రులకు మనమేదో అన్యాయం చేస్తున్నామన్న భావం వల్ల ఏర్పడే అపరాధ బావాన్నీ తాము నమ్మిన సిద్ధాంతాల్ని వ్యతిరేకిస్తున్న వాళ్ళతో ఏర్పడే వర్గ సంఘర్షణల్ని నవీన్ చిత్రించాడు - అలాగే "ముళ్ళపొదలు" నవలలో ఐదుగురు నిరుద్యోగ యువకుల మనస్సంచారాల్ని, 'అంతస్స్రవంతి'లో ఇడ్, ఈగో, సూపర్, ఈగోల మధ్య జరిగే సంఘర్షణల్ని ఈ రచయిత, బలంగా చిత్రించాడు - 'విచలిత' 'తారుమారు' 'రుణ' 'దాగుడుమూతలు' 'చీకటి మూసిన ఏకాంతంలో' 'ఏమెన్స్ కాలేజ్' 'బాంధవ్యాలు' మొదలైన నవలల్లో స్త్రీల మనస్తత్వాల్ని అత్యంత సహజంగా చిత్రించాడు.

ఇటీవల నవలలు రాస్తున్న రచయితల్లో కాశీభట్ల వేణుగోపాల్ పాత్రల మానసిక చిత్రణకు అత్యంత ప్రాముఖ్యం ఇస్తాడని ఆయన రాసిన నేనూ - చీకటి" 'తపన' అన్న నవలలు రుజువు చేస్తాయి - పాత్రల అంతర్గతంలోని - చీకటికొణాల్ని ఈ రచయిత అద్భుతంగా బహిర్గతం చేస్తాడు -

నవలల్లోనే కాకుండా కథల్లో కూడా రచయితలకు తమ పాత్రల అంతరాంతర జ్యోతిస్సీమల్ని చిత్రించడానికి చాలా అవకాశం ఉంటుంది - బుచ్చిబాబు రాసిన కథలన్నింటిల్లోనూ పాత్రల అంతరంగ జగత్తుల చిత్రణే ఎక్కువగా ఉంటుంది - ఆయన రాసిన "నిరంతరత్రయం" "ఎల్లోరాలో ఏకాంతసేవ" "అరకులోయలో కూలిన శిఖరం" "కలలో జారిన కన్నీరు" "చైతన్య స్రవంతి" మొదలైన కథల్లో బుచ్చిబాబు పాత్రల చేతనకు, అంతశ్చేతనకు మధ్యన జరిగే సంఘర్షణకు అత్యంత కళాత్మంగా చిత్రించాడు-

రా.వి.శాస్త్రి మొదట్లో రాసిన "జరీ అంచు తెల్లచీర" "వర్షం" మొదలైన కథల్లో పాత్రల మనస్సుల్లో వాస్తవానికి స్వైరకల్పనలకూ మధ్య జరిగే సంఘర్షణను గొప్పగా చిత్రించాడు.

**ఈ తరహా రచనల్ని చదివినప్పుడు పాఠకులక్కూడా తమలోకి తాము చూసు కోవాలన్న తహతహ కల్గుతుంది - తమ లోకి తాము చూసుకునే అంతర్దృష్టిని పెంపొందించడమే ఈ రచనల ప్రధానలక్ష్యం**

నవీన్ రాసిన అనేక కథల్లో రచయిత పాత్రల మనస్సుల మీద ఎక్కువగా కేంద్రీకరించడమే కనిపిస్తుంది - లో చూపు లేక అంతరదృష్టి నవీన్ కథల్లో ప్రధానంశం - అయిన రాసిన 'అధోలోకం' 'రెండోపెళ్ళి' 'నిప్పరవ్వలు' 'హత్య' మొదలైన కథల్లో ఫ్రాయిడ్ మనోవిశ్లేషణాసూత్రాల నేపథ్యంలో పాత్రల మనస్సంచారాల చిత్రణ జరుగుతుంది.

ఇటీవల కథలు రాస్తున్న రచయితల్లో ఆడెపులక్ష్మీపతిలో గొప్ప అంతరదృష్టి గోచరిస్తుంది. ఆయన రచించిన "జీవస్మృతుడు" కథ తెలుగు సాహిత్యంలో వెలువడిన గొప్పకథల్లో ఒకటి - ఈ కథలోని ప్రధానపాత్రలో ఏర్పడిన అభద్రతాభావాన్ని, తల్లా-పెళ్ళామా అన్న ద్వైదీ భావాన్ని, తల్లికి అన్యాయం చేస్తున్నానన్న అపరాధభావాన్ని ఈ రచయిత చాలా లోతుగా, సమర్ధవంతంగా, కళాత్మకంగా చిత్రించాడు.

మనోచిత్రణకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడే సాహిత్యం వల్ల కల్గే ప్రయోజనమేమిటి అన్న ప్రశ్న ఉత్పన్న మౌతుంది - లోచూపు ప్రధానంగా కల్గిన ఈ తరహా రచనల్ని చదివినప్పుడు పాఠకులక్కూడా తమలోకి తాము చూసు కోవాలన్న తహతహ కల్గుతుంది - తమ లోకి తాము చూసుకునే అంతర్దృష్టిని పెంపొందించడమే ఈ రచనల ప్రధానలక్ష్యం - ఈ తరహా నవలల్ని, కథల్ని చదవడం ద్వారా పాఠకులు మొదలు తమను తాము విశ్లేషించుకొని తామేమిటో తెలుసుకోగల్గుతారు - తామేమిటో తెలుసుకొని సమాజాన్ని తెలుసుకోగల్గుతారు - వ్యక్తికీ సమాజానికీ ఉండే సంబంధమేమిటో తెలుసుకోగల్గుతారు. పాఠకులు తామేమిటో తెలుసుకొని, తమను తాము రూపొందించుకొని విశ్వశ్రేయస్సుకు దోహదం చేసినవాళ్ళవుతారు. సాహిత్యానికి ఇంతకంటె గొప్ప ప్రయోజనం మరొకటి ఉంటుందని నేననుకోను.

- ఆధునిక పద్ధతులలో ఆంధ్ర దేశంలో మొదటి పౌర గ్రంథాలయం 1886 సంవత్సరంలో విశాఖపట్టణంలో నెలకొల్పినట్లు తెలుస్తోంది. దీనిని మంతిన ఆదినారాయణ మూర్తి అను ప్రాథమికోపాధ్యాయుడు స్థాపించాడు. అప్పటికి మనదేశంలో గ్రంథాల యోద్యమం ప్రారంభం కాలేదు. సేవాతత్వము కలిగిన ఉత్సాహవంతులైన యువకులు ఆంధ్రదేశంలో గ్రంథాలయాలు స్థాపించారు. 1905 నాటికి తెలుగునాట 20 గ్రంథాలయాలు లెక్కకు వచ్చాయి.

కవిత
మద్దూరి నగేష్‌బాబు

# అమెరికన్ డ్రీమ్స్ - ఆర్యన్ ప్రేమ్స్

ఎంత కళ్లుంటే మాత్రం
కన్నీళ్ళు కార్చాలి - అదీ చాటుమాటుగా కార్చాలి గానీ
ఏకాఏకి కలలే కంటావా పెద్దాయనా...?
అందునా అమెరికన్ కలలా...!

బీదలకు సువార్త ప్రకటిస్తూ
సంపదని సమభాగం చేసి హితవత్సరాన్ని ప్రకటించినందుక్కాదూ
ఏసుక్రీస్తుకి శిలువని బహూకరించారు యూదులు

రిజర్వేషన్ ఉచ్చునుండి వెలివాడను వెలేసి
ప్రైవేటాకాశపు అంచుల్లో ఎగరేయాలని నువ్వంటే
నువ్వు ఫరోవైనా.... ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా అయినా
వీళ్లూరుకుంటారా....?

నోళ్లు తెరుస్తారు
వాదనలు సూదుల్తో నీ నోరు కట్టేస్తారు
వీళ్ల కౌటిల్యులు తండ్రీ... కౌటిల్యులు

*　　　*　　　*

ఇన్నేళ్లుగా రిజర్వేషనే సక్రమంగా కాని ఈ గడ్డమీద
ఈక్వల్ డిస్ట్రిబ్యూషన్ కోసం కలవరిస్తావా... అయ్యయ్యో...

ఎప్పుడో అందే స్కాలర్‌షిప్‌లు కూడా
చట్టాల వల్ల కాక ఉద్యమాల వల్లే పుట్టుకొస్తాయని
ఊదరగొట్టే ఉద్యమకారులున్న ఈ ఉన్మాదోపఖండంలో
ప్రైవేటంటేనే తెలియని దళితుల కోసం
ప్రైవేట్ రంగం తలుపులు తెరవాలంటావా...ప్చ్!

ఎంత పిచ్చోడివి తాతా
ఇది ఇండియా తాతా... ఇండియా!
ఇప్పటికైనా అక్కడి అమెరికన్ తెల్లోడు
నల్లనీగ్రో మల్లల్లో నాలుగు మెతుకులు విదిల్చినా
ఇక్కడి నల్ల తెల్లగద్దలు మాత్రం
కులం తక్కువ శవాల్ని మాత్రమే పీక్కుతింటుంటే
అమెరికాకీ ఆర్యావర్తానికీ సంబంధం చూస్తావా...?

ఇసువంటి ఎగుడు దిగుళ్ల ఎడారి మాగాణిలో
నీలాంటి పెద్ద పెద్దోళ్ళు మాట్లాడాల్సిన మాటలేనా అవీ....?
అందుక్కాదూ... మనోళ్లకి పెద్ద పెద్ద పదవలివ్వకుండా వుందీ....?

నీకు తెలవదు గానీ...
సర్వ సైన్యాధ్యక్షుడు సైతం సాయిబాబాల పాదాల మీద నిద్రపోయినా
తనకున్న ఒక్కగానొక్క మెదడుని జేబులో దాపెట్టుకోని
పార్లమెంట్ ఉరిమి చూస్తే చాలు... వొణికిపోతూ వేలిముద్ర లేసినా
నేను రాష్ట్రానికి పతిని కాదూ... సతీ సుమతినని సర్దుకుపోయినా...
తప్పు కాదు!
కానీ... వొకానొక రాష్ట్రపతి
తన కళ్ళూ కలలు కలగలవనీ



తన మెదడూ ఆలోచించగలదని నమ్మి
తన తల్లివేరుకి ఉగ్గిన్నెడు నీళ్లు పోయాలంటేనే....
దేశద్రోహం... అజ్ఞానం.... మెరిట్‌లెస్ మీనింగ్‌లెస్‌నెస్!

ఇక్కడి ప్రగతిని కూడా పై కులాపోళ్లే నిర్ణయించాలి తాతా!

*　　　*　　　*

మనకెంత నోళ్ళుంటే మాత్రం
గోడలతో మాట్లాడుకోవాలి
లోపలి ఇటికెల క్కూడా వినపడనంత గుట్టుగా గొణుక్కోవాలి గానీ
హవ్వ..... పెట్టుబడీదారీ పతివ్రత పైట లాగుతావా....?
అందునా పెరట్లో రోలుని బజార్లో పెట్టమంటావా...?

మెరిట్ అనేది ఫలానా కులపు సెమన్‌లోనే ఉంటుందని నిర్ధారించే
ఈ అవుపేడ మెదడున్న ఆర్య సెక్యులిజస్టుల పశు వైద్యశాలలో
ఉన్న ప్రభుత్వోద్యోగాల పడకల్నే ఈసాతునులు ఎత్తి పారేస్తుంటే....

కనీసం బానిసలక్కూడా బరిలో నిలిచే సందిచ్చిన అమెరికా వైపుకాక
ఇంకా కనుగొనబడని చీకటి ఖండాలవైపు పరిగెత్తించే
ఈ కుంటికాళ్ళ పరుగు పందెంలో
మావోళ్ళ రెండుకాళ్లు చూసైనా పందెంలో చోటివ్వమని నువ్వంటే
వీళ్లూరుకుంటారా

కలాలు దూయరూ...
కులం తక్కువ బుద్ధి ఎక్కడికి పోతుందని ఎద్దేవా చేయరూ...
వీళ్ల మనువులు తండ్రీ.... మనువులు

*　　　*　　　*

నువ్వన్న మాట ఎక్కడ చట్టమై వాళ్ల చక్రాన్ని బద్దలు కొట్టుద్దోనని
వీళ్ళ స్టాక్ ఎక్స్ఛేంజీలు మల్లగుల్లాలు పడుతున్నాయి తెలుసా....?
ఏదేమైనా తాతా..... నువ్వుండాల్సినోడివే
సిగతరగ.... ఇప్పుడైనా ఆమాత్రం లేకపోతే ఎట్టా....!



రమణజీవి

# మూడో నెప్పి



ఎడమకాల్లో నెప్పి వొక అడవి నుండి మొదలయింది.

వొకరోజు - రెణ్ణెలయిందనుకుంటా నేనూ నా బాల్య స్నేహితుడు వెంకటేష్ కలసి వాళ్ల వూరు రాయదుర్గానికి దగ్గర్లో చిట్టడివిలో వుండే మరో స్నేహితుడి ఇంటికెళ్లాము. అర్ధరాత్రి వొంటి గంటయింది, అక్కణ్ణించి బయల్దేరేటప్పటికి. ఆ అడవిలో అంతకు వారం క్రితమే ఓ బస్సుకు అడ్డంగా ఓ రెండు చిరుతపులి పిల్లలు వచ్చాయుట. ఎలుగుబంట్లయితే అడపాదడపా కనిపిస్తూనే వుంటాయట.

"పొద్దున్నే పోదాంలేరా" అన్నాను కొంచెం సందేహిస్తూ.

"పులీ లేదు. నా............ లేదు. పారా" అన్నాడు వూగుతూ ఎర్రబడ్డ కళ్ళతో వెంకటేష్.

వెంకటేష్ డయోలా కాలేజీలో మాత్స్ ప్రొఫెసర్. గవర్నమెంటుకి క్వశ్చన్ పేపర్లు కూడా సెట్ చేస్తూ వుంటాడు.

సరే నేనయితే తప్పని సరై బయలు దేరాను. నాకు తాగే అలవాటు లేదు. నాటుకోడి ఇష్టం. అంత వరకే.

మోటార్ సైకిల్ శబ్దంలో కీచురాళ్ళ అరుపులు వినిపించడం లేదు. ఎప్పుడో పులుల్ని గురించి చదివిన ఓ ఆర్టికల్ గుర్తొచ్చింది. పులి ఎప్పుడూ మనిషి వెనకనించే దాడి చేస్తుందట. అందుకని ఓ అడవిజాతి వాళ్లు తల వెనక మనిషి బొమ్మ మొహాన్ని మాస్కులా తొడుక్కొని తిరుగుతుంటారట. అంటే పులికి రెండువేపులా మనిషి మొహం కనపడి దాడి చెయ్యడానికి భయపడి వూరుకుంటుంది. అందుకే నేను ఎందుకయినా మంచిదని మోటార్‌సైకిల్ మీద వెనక్కి తిరిగి కూచున్నాను. ముందువైపు వెంకటేష్ మొహమూ! వెనక నా మొహమూ!! ఇంకెక్కడ దాడి చేస్తుంది చిరుతపులి?

అయితే అనుకోకుండా ఓ వుపద్రవం జరిగిపోయింది. మోటార్ సైకిల్ వెనక చక్రం పంచర్ అయింది. దడదడలాడుతున్న గుండెలలో కందకు దిగాను. అప్పుడు అడవి తాలూకు శబ్దాలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. చలిగాలి అయినా చమట మొహం నిండా కారిపోతూ. అడవి వాసన పసరుగా. వగరుగా. భయంగా. ఏం చెయ్యాలి? చివరికి పంచరైన టైరు మీదే ప్రయాణం చేద్దామని నిర్ణయించుకున్నాము.

నేను డ్రైవ్ చేస్తూంటే వెంకటేష్ నాకు మాస్కులా కూచున్నాడు. వేగంగా పోదామని ప్రయత్నించి మోటార్‌సైకిల్‌ని కింద పడేశాను. ఆ తర్వాత వెంకటేష్ కొంచెం నిదానంగా నడుపుకుంటూ రాయదుర్గానికి తీసుకొచ్చాడు జాగ్రత్తగా.

అయితే ఆ పడినప్పుడు ఎడమపాదం వేళ్ల కింద కొంచెం నెప్పి పుట్టింది. దానికి అడవినెప్పి అని పేరు పెట్టాను. అప్పట్నించి మా అమ్మాయితో రోజూ పాదం పిసికించుకునే వాణ్ణి.

వొకరోజు తను అడిగింది

"నాన్నా! ఈ నెప్పి తగ్గుతుందా ఎప్పటికైనా"

"బహుశా చచ్చిపోయినప్పుడు తగ్గుతుందనుకుంటారా" అన్నాను ఏదో ఆలోచిస్తూ.

"ఎవరు? నేనా! మీరా!!"

నేను భళ్ళున నవ్వేను. పాపేమీ సంతోషించినట్టు లేదు. మా ఆవిణ్ణి పిల్చి చెప్పి మళ్లీ బిగ్గరగా నవ్వేను. వాళ్ళిద్దరూ ఒకళ్ళ మొహం వొకళ్లు చూసుకుని తరవాత నావేపు చూశారు కాళ్ళు పిసికించుకోడానికి ఇన్ని వేధవ్వేషాలు అక్కర్లేదన్న భావం ఉంది వాళ్ళ మొహాల్లో.

"దాన్నెందు కట్ల చంపుకు తింటారు అడవినెప్పి అడవి నెప్పని" అని లోపలికి వెళ్ళిపోయింది మా ఆవిడ. ఆ మాటలతో నన్ను చులకనగా తీసుకుని మా పాపా వెళ్ళిపోయింది, చదువుకోవాలని ఆవాళ్టికి.

సరే ఇది జరిగిన మూడు రోజులకి మా ఆఫీస్‌వాళ్ళు కాంట్రాక్ట్‌కి తీసుకున్న కన్‌స్ట్రక్షన్‌లో వున్న ఓ అపార్ట్‌మెంటును పరిశీలిస్తూంటే మెట్లమీద స్లిప్పయి ఎడమకాలి నుడమ పట్టేసింది.

సరే మొత్తానికి రెండు నెప్పులు వచ్చేశాయి.

అడవి నెప్పి..... నగర నెప్పి.....

పిసికేటప్పుడు మాత్రమే తెలుస్తుది నెప్పి.

పాప పిసుకుతుంటే నేను విశ్లేషించుకుంటూ వుండేవాణ్ణి. రెండు నెప్పులకూ మెదడులో వొకటే కేంద్రమా లేక విడివిడి కేంద్రాలా? వొక్కోసారి తల్లో కాకుండా కాల్లోనే నెప్పి తెలిసేది. అంటే నెప్పి తాలూకు చిన్నచిన్న కేంద్రాలు శరీరంలో ఎక్కడికక్కడే వుంటాయన్న మాట, సబ్‌స్టేషన్ల్‌లాగా.



పాప కాళ్ళు పిసికే మిషన్లేమయినా వుంటాయేమో ఆరాలు తీస్తున్నట్లు చెప్పింది నాతో వొకనాడు. నేను ఆ విషయం గురించి పెద్దగా ఆలోచించలేదు. నా నెప్పి తాలూకు ఆనందంలో మునిగిపోవడమే సరిపోయింది నాకు.

ఓ రోజు ఆఫీసులో పన్లో తలమునకలుగా వున్న సమయంలో నాకు ఇంటినించి ఫోనొచ్చింది. పాప కనిపించడం లేదని. స్కూల్‌నించి బయలుదేరి రెండు గంటలయిందనీ - అప్పుడు మార్నింగ్ స్కూల్ దానికి. చెప్పకుండా ఎక్కడికీ పోదు. ఫ్రెండ్సింటికి కూడా. నేను హడావిడిగా ఇల్లు చేరుకున్నాను. చివరకి తను రాసిన వుత్తరం దొరికింది.

నా కాళ్ళు పిసకలేక తను జీవితం మీద విరక్తితో ఇంట్లోంచి పారిపోతున్నట్టు రాసింది. నాకు తొలిసారి జీవితంలో ఇలా కూడా జరుగుతుందని తెలిసింది.

పిల్లల్లో స్పోర్టివ్‌నెస్, ధైర్యం లేకపోవడం పట్ల విచారం కూడా కలిగింది. చెప్పొచ్చుగా పిసకనని. పెద్దలు చెప్పిన అన్నిటికీ తల ఎందుకు వూపాలి?

పేపర్లో అడ్వర్‌టెయిజ్‌మెంట్ ఇప్పించాను నా కాలు నెప్పి తగ్గిపోయిందనీ తను నిర్భయంగా ఇంటికి రావొచ్చనీ, వాళ్ళమ్మ మంచం పట్టిందనీ.

ఇంతా చేస్తే పాప ఎక్కడికీ వెళ్ళలేదు. మా బంధువుల ఇంట్లోనే వుంది. అమ్మానాన్న వాళ్ళు తిరపతెళుతున్నారు వారం దాకా రారని చెప్పిందట అడ్వర్టయిజ్‌మెంటు చూసి వాళ్ళు పాపను తీసుకొచ్చారు.

వాళ్ళమ్మ కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

మానవ సంబంధాల మధ్య వున్న ఏదో అపసవ్యత మొదటిసారి స్పష్టంగా తోచింది.

అప్పట్నించీ నా కాళ్ళు నేను పిసుక్కోవడం ప్రారంభించాను. తల్లో కూడా వివిధ కేంద్రాలకు బదులు వొకే కేంద్రం వున్నట్టు అనిపించసాగింది. సబ్‌స్టేషన్ గురించే ఇంకా స్పష్టత ఏర్పడలేదు. అయితే ఏదీ స్థిరంగా వుండేట్టు లేదు చూడగా చూడగా. మా పాప మళ్ళీ తనంత తానే నా కాళ్ళు పిసకడం ప్రారంభించింది కొంత కాలానికి. నా గురించి జాలి కలిగినట్టుంది. పదహారు గంటలు ఎంసెట్‌కి ప్రిపేర్ కావడం. రెండు గంటలు నా కాళ్ళు పిసకడం.

కాలం తన ఇష్టమొచ్చినట్టు గడిచిపోతోంది. పాప ఇంటర్మీడియెట్ పూర్తి చేసి ఎంసెట్ కూడా రాసింది.

ఓ రోజు వుదయం న్యూస్‌పేపర్ చదువుతున్నాను.

జీనోం ప్రాజెక్టును క్లింటన్ ఎలక్షన్లకు బహుశా వాడుకోడనే అనిపించింది నాకయితే.

సరిగ్గా అదే సమయంలో.

అక్కడ రాయదుర్గంలో వెంకటేష్ మెల్లిగా కళ్ళు తెరిచాడు. కళ్ళ నిండా ఇంకా పూర్తిగా వొదలని నిద్రమగత. లేచి కూచున్నాడు.

కూచోగానే అతడి మనసులో చిరుతపులి గాండ్రింపూ, స్త్రీ ఆర్తనాదమూ వినిపించాయి.

అసలు ఆమె ఆర్తనాదం చేసుకుంటుందా?

అంత సావకాశం ఆమెకి వుండకపోవచ్చనే అనిపించింది వెంకటేష్‌కు.

మహా అయితే ఓ మూలుగు మూలిగుంటుంది. ఆ లోపలే ఆ చిరుత ఆమె మెడలోకి పళ్ళని దించేసి వుంటుంది.

ఎడమ చెయ్యి కిందికి సాచి కిందున్న న్యూస్‌పేపర్ని చేతికి తీసుకుని మళ్ళీ చదివాడు ఆ వార్తని.

చిరుత దాడిలో మహిళ మృతి

తిరుపతి, జూలై 29, చిత్తూరు జిల్లా తిరుపతి పట్టణం మంగళం సమీపంలోని వెకటేశ్వర కాలనీలో శనివారం తెల్లవారుఝామున

32 సంవత్సరాల మహిళను చిరుతపులి చంపేసింది. శనివారం వేకువ జామున బహిర్భూమికి వెళ్ళిన ఆమెపై చిరుతపులి దాడి చేసి సుమారు కిలోమీటరు దూరం ఈడ్చుకుంటూ వెళ్ళి అక్కడ తినేసింది. తల, నడుము కింద భాగం తప్ప శరీరంలోని మిగతా భాగాలన్నీ పూర్తిగా తినేసింది. వాళ్ళ ఇల్లు గ్రామం చివరలో వుంది. సమీపంలోని తిరుమల కొండల నించి వచ్చిన చిరుత ఆమెపై దాడి చేసింది.

వెంకటేష్ ఆ వార్తని పొద్దున్నించి కనీసం పదిసార్లన్నా చదివుంటాడు. మధ్య మధ్యలో మూడుసార్లన్నా నిద్రపోయి వుంటాడు. అంతకు క్రితం రాత్రి శనివారం నిద్రపోయేసరికి వుదయం మూడు గంటలు దాటింది.

పేపర్ని తీసుకుని బాల్కనీలోకి వచ్చాడు. ఉదయం ఆకాశం అతణ్ణి ఎర్రటి చిరునవ్వుతో పలకరించింది.

బాల్కనీ రెయిలింగ్ మీద ఆకాశానికి అరికాళ్ళు తన్ని పెట్టి కేన్ ఛెయిర్‌లో కూచున్నాడు.

ఇంకా వివరంగా రాయొచ్చుగా. ఆ వార్త మీద ఆసక్తి చావడం లేదు ఎంతకీ.



ఆ వార్తలోని చాలా పదాలు అతడి మనసును వట్టేశాయి. ఆ పదాలను అండర్‌లైన్ చేసుకున్నాడు.

'32 ఏళ్ళ మహిళను' 'బహిర్భూమికి' 'కిలోమీటరు దూరం ఈడ్చుకుంటూ వెళ్ళి' 'తినేసింది' 'తల, నడుము కింది భాగం తప్ప' 'తిరుమల కొండలనించి వచ్చిన చిరుత' తనకి నచ్చిన అన్ని పదాల్ని అండర్‌లైన్ చేశాక చూస్తే అండర్‌లైన్ చెయ్యని పదాలు రెండు మూడు కంటే మించి లేవు. దీనికంటే మొత్తం న్యూస్‌కి మొదట్లో వొకటి చివర్లో వొకటి బ్రాకెట్ పెడితే సరిపోయేదిగా అనుకున్నాడు.

ఇలాంటి వార్తలకి ప్రాముఖ్యత ఎందుకివ్వరు ఈ పత్రికలవాళ్ళు. వివరాలు తెలీకా? తెలిసే వుంటుంది. ఫొటో కూడా వచ్చే వుంటుంది. వస్తే సరిపోదుగా. దాని ఇంపార్టెన్స్ తెలియాలిగా. ఫ్రంటు పేపరులో వేసినవి గొప్ప వార్తలా?

జెట్మలానీ వూడితేనేమి.... జీనోం ప్రాజెక్టను క్లింటన్ ఎలక్షన్లకు వాడుకుంటాడా వాడుకోడా... ఫరూక్ పాక్‌కు శాంతిబాటను సూచిస్తే ఏమవుతుంది.

వీటన్నిటి కంటే తీసిపోయిందా చిరుతపులి స్త్రీ వార్త?

పత్రికాఫీసుకు ఫోన్ చేసి చెడామడా వాయించాలి. అనుకుంటూ, లేచాడు వెంకటేష్.

సరిగ్గా అప్పుడే నేను ఫోన్ చేశాను.

"హల్లో..."

"ఏరా వెంకటేష్! నిద్ర లేచావా? లేపానా??" అడిగాను.

"కాదండీ మేమెందుకు కొనేది మీ న్యూస్‌పేపర్లు? ఏదో మాకు కావల్సిన ఐటమ్స్ వుంటాయని కదా" అన్నాడు వెంకటేష్.

"ఏం లేదురా అర్చన సీటు విషయమే. కనుక్కున్నావా" అడిగాను.

"ఐటమ్స్ వుండడం కాదండీ... మాక్కావల్సినట్టు వుండాలిగా" వెంకటేష్.

"ఏంట్రా రాత్తిర్తి దిగిందా లేదా...." నేను.

"ఇప్పుడు వుదాహరణకు ఆ చిరుతపులి వార్తే తీసుకోండి. అదేనండీ ఇవ్వాళ తిరుపతి అడవుల్లో ఓ స్త్రీని పులి చంపిందని వేశారు చూడండి దాని గురించి మాట్లాడేది"

"నాకు చాలా టెన్షన్‌గా వుందిరా.... ఎందుకంటే ఎడ్మిషన్ టైమ్ అయిపోవస్తోంది. ఇంకా సీటు ఫైనల్ కాకపోతే చాలా ఇబ్బంది"

"ఆ వార్తనే కాస్త వివరంగా వెయ్యొచ్చుగా. ఫొటో దొరకలేదాండీ మీకు. భలే వాళ్ళు సార్ మీరు? ఏం చెబుతారు సార్ మీరు. కిలోమీటటరు దూరం లాక్కెళ్ళింది. తల, నడుం కింది భాగం తప్ప మిగతా అన్ని భాగాల్నీ తినేసింది ఇన్ని విషయాలు ఎట్టా తెలుస్తాయి పొయ్యి చూస్తేనే కదా. స్పాట్‌కు పోయినోళ్ళు ఓ ఫొటోగ్రాఫర్‌ను తీసికెళ్ళద్దాండీ"

"ఆర్ఈసీలో అయితే కంప్యూటర్స్ దొర్కపోయినా పర్వాలేదురా. మామూలు మెకానికల్ ఇచ్చినా పర్లేదు వరంగల్‌లో అయితే" అన్నాను.

"నడుం కింది భాగాన్ని ఎందుకు తిన్లేదంటారు. బహుశా అది ఆడపులి అయివుంటుంది. మగపులయితే ఆనందంగా తినివుండును ఏమంటారు?"

నాకు ఇక మాట్లాడే ఓపిక లేకపోయింది.

కాలమంతా ఏ క్షణానికాక్షణంగా విడిపోయినట్టుంది.

ఫోన్ పెట్టేశాను.

నా కాలు పిసుక్కోవడం ప్రారంభించాను చాలా కాలం తర్వాత పాప చేతుల్ని తొడుక్కుని. అర్చనగా మారిపోయిన పాప ఇక ఎప్పటికీ రాదని నాకు తెలుసు. నా కళ్ళలో నీళ్ళు తిరిగే వ్యవధి లేకపోయింది. కారణం మా ఆవిడ కాళ్ళ పట్టీల చప్పుడు వాకిట్లో. భయంతో గట్టిగా అరిచింది మా ఆవిడ, వెనకనించి నన్ను చూసి. వొకవేళ ముందు నుంచి చూస్తే అంతే గట్టిగా ఏడ్చేది.

బహుశా నా కళ్ళలో నీళ్ళు తిరగవు ఇహ. ఎందుకంటే-

సబ్‌స్టేషన్ గురించి అయితే ఓ అవగాహన వచ్చినట్టుగా అనిపించింది.

లేదూ దాన్ని ఇట్లా కూడా చెప్పుకోవచ్చు.

సబ్‌స్టేషన్ గురించి ఓ అవగాహన పోయినట్టుగా అనిపించింది.

విశ్లేషణ

రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి



# తెలుగు కథా సాహిత్య విమర్శ -సామాజిక దృష్టి

**1.** అసంతృప్తులు - పరిమితులు : "కథ ఉంది. కథా విమర్శ లేదు" అన్నధోరణి ( ఆంధ్రభూమి 10.5.2001) ఫిర్యాదుగాని, " తెలుగు కథ అద్భుతంగా ఉందా?' అన్న జి. మోహనాచార్యులు ( ఆంధ్రభూమి 10.9.2001) ఎదురు ప్రశ్నగాని సానుకూలంగానే అర్థం చేసుకోవాలి.

ఇలాంటివి తెలుగు కథా సాహిత్య చరిత్రలో చాలా ఉన్నాయి . ఈ ఫిర్యాదులు, ప్రశ్నలు తెలుగు కథపట్ల, కథావిమర్శ పట్ల రచయితలలోను, విమర్శకులలోను ఉన్న అసంతృప్తిని తెలియజేస్తాయి. తెలుగు కథ తీరు తెన్నుల్ని గురించి ఇవాళకాదు. కథ పుట్టిన రెండు దశాబ్దాలకే విమర్శకులు హెచ్చరించడం ప్రారంభించారు. "దేశమాత కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నది. మనం విలాసత్వంలో మునిగి తేలుతున్నాం. కథాకారుల్ని చీమైనా కుట్టుటలేదు" (భారతి, మార్గశిర, 1938) " ఇది సంఘర్షణ యుగము. భారత హృదయం స్వాతంత్ర్యం కావాలని పరితపిస్తున్నది. కిసానులు, కార్మికులు తమ వ్యక్తిత్వాన్ని గుర్తించారు. తమ హక్కుల్ని రక్షించుకోవటానికి సంఘర్షణ చేస్తున్నారు. ఏ మూల చూచినా స్వాతంత్ర్య భావమే. ఈ భావమే మన కథా సాహిత్యంలో ప్రతిబింబించాలి". (భారతి, పుష్య 1938) అని ఎం. నాగేశ్వర్ రావు కథకుల వెనుకబాటు తనాన్ని ఎత్తి చూపుతూ, తెలుగు కథలో వస్తుపరంగా రావలసిన మార్పును గుర్తు చేశారు. 1961-62 సంవత్సరాల మధ్య వచ్చిన తెలుగు కథల్ని 1963 భారతిలో సమీక్షిస్తూ ఒక విమర్శకుడు (?) తెలుగు కథ సామాజిక వాస్తవికతను విస్మరించి కాల్పనికతామత్తులో జోగుతున్నదని నిరసించారు. మధురాంతకం రాజారాం " గ్రహణం పట్టిన తెలుగు కథ" ( ఆంధ్రజ్యోతి 20.9.93) అని ప్రకటించగా, వల్లంపాటి వెంకటసుబ్బయ్య" తెలుగు కథ సమకాలిన విషాదం. (కథ-97కు ముందు మాట) అని పెదవి విరిచారు. తెలుగు కథ విషయంలోనే అసంతృప్తి ఉన్నప్పుడు, కథావిమర్శపట్ల ఉండదా ?

అయితే ఇక్కడ రెండు విషయాలను గుర్తించాలి ఒకటి జీవితం విశాలమైంది. అది వైరుధ్యాల పుట్ట, ఏ దేశంలోనూ ఏకాలంలోనూ ఎందరు రచయితలు ప్రయత్నించినా మొత్తం మానవ జీవితాన్ని సాహిత్యంలో ప్రతిబింబించడం సాధ్యం కాదు. కళలు సాహిత్యం మనకు చూపించగలిగేది నమూనా జీవితాన్నేగాని మొత్తం జీవితాన్ని కాదు. రెండు : రచయిత లందరూ

. . . . . . . . . . . . .

**"కథ ఉంది కథా విమర్శలేదు' ' అని నిరాశకు లోనయ్యేంతగా లేదు. కథ ఉంది కథా విమర్శాఉంది. కథా విమర్శ కానిదీ ఉంది. కథల ఎన్నికలో లాగే కథా విమర్శలనూ జల్లెడ పట్టాలి. కాలక్షేప విమర్శనుంచి' కరుకైన విమర్శను వేరు చెయ్యాలి. ఈ పనిని వ్యక్తులు కాదు సంస్థలు చేయాలి.**

. . . . . . . . . . . . .

రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి | •విమర్శకుడు, పరిశోధకుడు

ఒక్క రకంకాదు. వాళ్ళ మధ్య అనేక వైరుధ్యాలున్నాయి. ఒకరికి సాహిత్యం వంటింటి పోపు డబ్బా మరొకరికి అది పడకటింటి మల్లెపువ్వు, ఇంకొకరికిది బాత్‌రూంలో బూతుబొమ్మ. ఏ కొందరికో సాహిత్యం ఒక సామాజికాయుధం. ఈ నాలుగో రకం వాళ్ళు సృష్టించిన సాహిత్యం గురించి గట్టిగా ఆలోచించాలి విమర్శకులు.

అలాగే విమర్శకులు కూడా ఒక్క రకం కాదు. కొందరికి విమర్శ కేవలం పరిచయం, మరి కొందరికి అది సామాజిక ఆయుధం. సాహిత్య విమర్శకుల్లో రచయితలకు సాహిత్యకారులకు నిబద్ధత ఉండకూడదని దబాయించేవాళ్ళు, నిబద్ధత సృజనాత్మకతను చంపేస్తుందని భయపెట్టేవాళ్ళు ఉన్నారు. రచయితలకు నిబద్ధత ఉండొచ్చు, విమర్శకులకు ఉండరాదని, విమర్శకులకు నిబద్ధత ఉంటే తమకు నచ్చిన సాహిత్యాన్నే మెచ్చుకుంటారని, అన్నింటినీ మెచ్చుకోరని చెప్పే సహృదయులున్నారు. రచయితకైనా విమర్శకుడికైనా నిబద్ధత అనివార్యం అని తెగేసి చెప్పేవాళ్ళున్నారు. అప్పుడే వాళ్ళు చెప్పేదాంట్లో విశ్వసనీయత ఉంటుందని అలాంటి వాళ్ళ అభిప్రాయం. ఈ చీలికల్లోంచి విమర్శకుల బాధల్ని అర్థం చేసుకోవాలి. జీవితంలోని ప్రతి అంశాన్నీ సాహిత్యం ప్రతిబింబించడం సాధ్యం కానట్లే, వచ్చిన సాహిత్యంలో ప్రతి చిన్న రచనను విమర్శించడం విమర్శకులకు సాధ్యమయ్యేపనికాదు. పైగా వచ్చిన సాహిత్య విమర్శంతా గొప్పది కాదు. పుంఖానుపుంఖంగా వస్తున్న కథల్లోంచి మంచి కథల్ని ఏరుకున్నట్లే, వస్తున్న, అపార కథా సాహిత్య విమర్శల్లోంచి మంచి కథా సాహిత్య విమర్శను ఏరుకోవాలి. తప్పదు.

ఇక్కడే మరొక సున్నితమైన విషయాన్ని కూడా ప్రస్తావించుకోవాలి. "రచయితలు విమర్శను భరించేస్థితిలో లేరు" అని విమర్శకుల నుంచి ఫిర్యాదులు, విమర్శలు ఎదగలేదు". అని రచయితల నుంచి ఫిర్యాదులు వింటున్నాం. ఈ రెండు అభిప్రాయాలు కలగడానికి సాహిత్య

అనేక రూపాలలో కథా విమర్శ వస్తున్నా కథా విమర్శ ఇంకా వెనుకబడి ఉంది, అనే అభిప్రాయం వ్యక్తమౌతూ ఉంది. బహుశా ఈ అసంతృప్తి ఇలాగే కొనసాగుతుందేమో. కొన్ని వేల పుటలలో కథా సాహిత్య విమర్శ వచ్చినా, వచ్చిందంతా గొప్ప విమర్శకాకపోవడమే ఇందుకు కారణం.

చరిత్రలోనే ఆధారాలున్నాయి. ఒక కథలోని అవాస్తవికతను ఎత్తి చూపినందుకు, ఆ కథారచయిత దానిని రాష్ట్ర స్థాయి సమస్యగా చేసిన సందర్భాలున్నాయి. విమర్శ పేరుతో బండ ఎత్తి. పాఠకులకు కంపం పుట్టించిన విమర్శకులకూ కొదువలేదు. రచయితలు గుడ్లురిమినంత మాత్రాన విమర్శకులు భయపడకుండా నిలబడిన సందర్భాలు, విమర్శకుల ప్రేలాపనలను రచయితలు తిప్పి కొట్టిన సందర్భాలు కథా సాహిత్యంలోనే ఉన్నాయి. ఈ అవగాహనతో తెలుగు కథా విమర్శలోని సామాజిక దృష్టిని పరిశీలిద్దాం.

**2. కథా విమర్శ - అనేక ఆకరాలు :**

తెలుగు కథానిక పుట్టి నూరేళ్ళయితే, తెలుగుకథా విమర్శపుట్టి ఎనభై ఏళ్ళయిందని చెప్పవచ్చు. 1922లోనే నోరినరసింహ శాస్త్రి "కథ లెల్లా వ్రాస్తారు ?" అనే వ్యాసాన్ని 1925లో దిగవల్లి వెంకటశివరావు" "చిన్న కథలు ఆంధ్ర వాఙ్మయమున వాని స్థానము" అనే వ్యాసాన్ని రాసి కథా సిద్ధాంత విమర్శకు, కథా సాహిత్య చర్చకు శ్రీకారం చుట్టారు. అప్పటి నుంచి నేటి దాకా కొన్ని పదుల సంఖ్యలో కథా విమర్శ పుస్తకాలు, కొన్ని వేల కథా విమర్శ వ్యాసాలు వచ్చాయి. (వేదగిరి రాంబాబు " కథానికా లక్ష్యము - లక్షణాలు" అనే గ్రంథంలో ఇరవై పుస్తకాల పట్టిక నిచ్చారు) పుస్తక రూపంలోగాని, వ్యాస రూపంలోగాని వచ్చిన కథా విమర్శ రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి కథా సాహిత్యాన్ని చారిత్రకంగానో, ఉద్యమపరంగానో, సమన్వయపరంగానో విమర్శించడం, రెండు ఒక రచయిత కథల్ని విడిగా విమర్శించడం కథా సాహిత్య విమర్శ అనేక ఆకారాలనుండి లభిస్తుంది. రచయితల మీద గాని, సామూహికంగా గాని రాసిన విమర్శ వ్యాసాలు, గ్రంథాలు, కథా సంపుటులకు, సంకలనాలకు రాసిన పీఠికలు, వాటిపై వచ్చిన సమీక్షలు, రచయితల జీవిత సందర్భాలలో ప్రచురించిన ప్రత్యేక సంచికలు ఇలా కథా విమర్శ అనేక రూపాల్లో లభిస్తుంది. రచయితలతో ఇష్టాగోష్ఠులు, రచయితతో పాఠకులు వంటి కార్యక్రమాల ద్వారా, ఎంతో కథా విమర్శ వచ్చింది. విశ్వ విద్యాలయాలలోంచి వచ్చిన పరిశోధన గ్రంథాలు కూడా ఉన్నాయి. అనేక రూపాలలో కథా విమర్శ వస్తున్నా కథా విమర్శ ఇంకా వెనుకబడి ఉంది, అనే అభిప్రాయం వ్యక్తమౌతూ ఉంది. బహుశా ఈ అసంతృప్తి ఇలాగే కొనసాగుతుందేమో. కొన్ని వేల పుటలలో కథా సాహిత్య విమర్శ వచ్చినా, వచ్చిందంతా గొప్ప విమర్శకాకపోవడమే ఇందుకు కారణం. తెలుగు కథా విమర్శ చాలా వరకు పరిచయాత్మకంగా ఉంది. అయితే నిర్దిష్టమైన సామాజిక దృష్టితో, భావజాలంతో వచ్చిన తెలుగు కథా సాహిత్య విమర్శకూ కొదవ లేదు. దాన్నైనా ఒక వ్యాసంలో పరిచయం చెయ్యడం విశ్లేషించడం కష్టమే కాబట్టి కొన్ని కొండ గుర్తులతో అర్థం చేసుకుందాం.

**3. కథా విమర్శ- రెండు కేంద్రాలు :**

కథా విమర్శ రెండు కేంద్రాల నుంచి ఉత్పత్తి అవుతున్నది. ఒకటి, విశ్వ విద్యాలయాలు. రెండు : వాటికి వెలుపల. విశ్వ విద్యాలయాలలో పరిశోధించి విమర్శ రాసేవాళ్ళు సాధారణంగా లేలేత విద్యార్థులు. ఆరితేరిన విమర్శకులు తక్కువగా ఉంటారు. ఉద్యోగానికి అవసరమైన డిగ్రీకోసం జరిగే పరిశోధనలో ప్రామాణికత పరిమితంగానే ఉంటుంది. ఎక్కువ భాగం కథా పరిచయంగా ఉంటుంది. చిన్నపాటి విశ్లేషణ కూడా ఉంటుంది. సూత్రసంబంధమైన విమర్శ విశ్వ

విద్యాలయాలకు వెలుపల్నుంచే ఎక్కువగా వస్తుంది. అనుభవజ్ఞులైన విమర్శకులు, జీవితాన్ని విమర్శకోసమే వెచ్చించే వాళ్ళనుంచే అసలైన విమర్శ వస్తుంది.

**3.1 : విశ్వ విద్యాలయాలు : తెలుగు కథా విమర్శ :**

వెల్దండ నిత్యానందరావు " విశ్వ విద్యాలయాలలో తెలుగు పరిశోధన గ్రంథం ద్వారా ఇప్పటికి విశ్వవిద్యాలయాలలో దాదాపు 250 మంది తెలుగు కథమీద అనేక పార్శ్వాలనుంచి పరిశోధన చేసినట్లు తెలుస్తున్నది. వాటిలో ప్రచురణకు నోచుకున్నవి అత్యల్పం. బహుశా గ్రంథాలయాల్లో మూలుగుతున్న వ్రాత ప్రతులు అత్యధికం. పి. దక్షిణామూర్తి "కథానిక" స్వరూప స్వభావాలు "విశ్వ విద్యాలయ కథాపరిశోధన గ్రంథాల్లో అచ్చయిన మొదటి గ్రంథం. సాధారణంగా విశ్వ విద్యాలయ స్వభావానికి ప్రత్యేకించి మన సమాజంలోని ఒక భావజాల వర్గానికి తగినట్టుగానే, దక్షిణామూర్తి కథా మూలాల్ని వెదకడంలో వేదాలదాకా వెళ్ళొచ్చారు. అయితే " కథానిక సమాజం అనే అధ్యాయంలో తెలుగు కథానికల్ని వస్తువరంగా తెలుగు జీవితంతో సమన్వయించే ప్రయత్నం చేశారు. ఇలా ఈ గ్రంథం పౌరాణిక సామాజిక దృష్టులతో రెండుపాయల్లో నడిచింది. కనక్ ప్రవాసి " శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కథలు - సమగ్ర సమీక్ష"తో శ్రీ పాదకథల్ని సాంఘిక చారిత్రక విభాగం చేసి వ్యాఖ్యానించారు. ఒక్కొక్క కథనూ పరిచయం చేస్తూ దాని సామాజిక నేపథ్యాన్ని వివరించారు. ఈ మార్గంలోనే వావిలాల సుబ్బారావు " చలం గారి కథానికా సాహిత్యం అను శీలనము"లో చలం కథానికల్ని స్త్రీ పురుష సంబంధాల దృష్టితో వ్యాఖ్యానించారు. ఎస్. రామచంద్ర" చలం సాహిత్యం - సామాజిక దృక్పథంలో చలం కథల్ని సంఘ సంస్కరణల పార్శ్వం నుండి విశ్లేషించారు. కె లక్ష్మీనారాయణ హరిజనాభ్యుదయము - తెలుగు కథానికలో తెలుగు కథానికలు ప్రతిబింబించిన దళిత జీవిత దర్శనం చేశారు. ఈ గ్రంథంలో దళితేతర రచయితల కథలలో కన్నా దళిత రచయిత కథలలోనే దళిత జీవితం విశ్వసనీయంగా ప్రతిబింబిస్తుందని సూత్రీకరించి నిరూపించే ప్రయత్నం చేశారు. అడివి బాపిరాజు కథల మీద పరిశోధించిన వి. నమ్మాన్న, రూప చర్చకే అధిక ప్రాధాన్యతయిచ్చి, వస్తు చర్చను అరడజను పేజీల్లో ముగించారు. ఎ. వీరాచారి " తెలుగు నాట సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం - కవులు, రచయితలు అనే అంశంమీద మాత్రం శ్రీకాకుళ పోరాటం సాహిత్యం మీద పరిశోధించారు. అయితే ఎక్కువగా కవిత్వం మీద దృష్టి సారించారు. సాహిత్యమంటే నాలుగు ప్రక్రియలు కదా ! కథానికకు సంబంధించి ఇంకా అనేక మంచి పరిశోధనలే జరిగినా అవి అచ్చు కాకపోవడం వల్ల వాటి తీరు తెన్నులు తెలియడం లేదు.

> తెలుగుకథా సాహిత్యం ఉద్యమాలు వర్గ వర్ణ లింగాది బేధాలన్నింటినీ గర్భీకరించుకుందన్నది వాస్తవం. కథా సాహిత్య విమర్శకూడా ఈ దృష్టులన్నింటినీ పట్టించుకోవాలి. పట్టించుకుంటున్నది.

**3.2 పత్రికలకు వెలుపల : అనంత కథా సాహిత్య విమర్శ :**

విశ్వ విద్యాలయాలకు వెలుపల శక్తివంతమైన కథా సాహిత్య విమర్శ సామాజిక దృష్టితో అది భిన్నంగా వస్తున్నది. ఈ విమర్శకు ప్రధానంగా పత్రికలు దోహదం చేస్తున్నాయి. కథలకు పత్రికలు వేదికలైనట్లే కథా విమర్శకుకూడా పత్రికలే వేదికలు. ఆతర్వాత కొన్ని సాహిత్య సంస్థలు, ప్రచురణ సంస్థలు కూడా మంచి కథా సాహిత్య విమర్శను ప్రచురిస్తున్నాయి. ఈ విమర్శ సృష్టిలో అసంఖ్యాకంగా రచయితలు, విమర్శకులు పరిశోధకులు పాల్గొంటున్నారు.ఈ విమర్శను ప్రణాళికా బద్ధంగా అర్థం చేసుకుందాం.

**3.2.1 సామాజికోద్యమ నేపథ్యంలో కథాధ్యయనం :**

తెలుగు కథల్ని సామాజికోద్యమాల నేపథ్యంలో అధ్యయనం చేసే ప్రయత్నం కొంత జరిగింది. ఇది సాహిత్యాధ్యయనంలో మంచి పద్ధతి. సాహిత్యం రెండు రకాలుగా ఉంటుంది. నిర్దిష్టమైన ఉద్యమాల ప్రభావంతో వచ్చేది ఒక్కటి, రోజు సాంఘిక ఆర్థిక పరిణామాల ప్రభావంతో వచ్చేది ఇంకొకటి. సాహిత్యాన్ని ఈ రెండు రకాలుగానూ పరిశీలించవచ్చు. వేదగిరి రాంబాబు నాలుగేళ్ళ క్రితం కేంద్ర సాహిత్య అకాడమీ వారి కథా సదస్సును నిర్వహించారు. హైదరాబాద్‌లో ఆ సదస్సులో ఒక రచయిత్రి ప్రసంగిస్తూ, తెలుగుకథ, ఎప్పుడూ ఉద్యమం కేంద్రంగా రాలేదని, మనిషి కేంద్రంగా వచ్చిందని అన్నారు. రసికులు చప్పట్లు కొట్టారు. ఆమె మరోమాట కూడా అన్నారు. సాహిత్యానికి ఆడేమిటి ? మొగేమిటి ? అని దానికీ రసికులు చప్పట్లు కొట్టారు. అయితే తెలుగుకథా సాహిత్యం ఉద్యమాలు వర్గ వర్ణ లింగాది బేధాలన్నింటినీ గర్భీకరించుకుందన్నది వాస్తవం. కథా సాహిత్య విమర్శకూడా ఈ దృష్టులన్నింటినీ పట్టించుకోవాలి. పట్టించుకుంటున్నది.

'రంజని' సంస్థ "రజత రంజని" అనే వ్యాస సంకలనం ప్రచురించింది. (1988) ఉద్యమాల పరంగా ఒక్కో ప్రక్రియ మీద ఒక్కొక్కరు వ్యాసం రాశారు. తెలుగు సాహిత్య చారిత్రల్లో ఈ గ్రంథం ప్రత్యేకమైంది. అందులో తెలుగు కథానికమీద పాలపర్తి వేణు గోపాల్ (సంప్రదాయ కథ) వాసిరెడ్డి నవీన్ (సంఘ సంస్కరణకథ) ఘండికోట బ్రహ్మాజీరావు (జాతీయోద్యమకథ) దేవరాజు మహారాజు (కాల్పనికకథ) జ్వాలాముఖి (హేతువాదకథ) చందు సుబ్బారావు (అభ్యుదయకథ) శిలావీర్రాజు (విప్లవ కథ) వ్యాసాలు రాశారు. తెలుగు కథానికల్ని విభిన్న

ఉద్యమాల నేపథ్యంలో విశ్లేషించారు. వీటిలో ఒకటి రెండు వ్యాసాలు పేలవంగా ఉన్నా, తక్కినవి ఉద్యమవాణిగా తెలుగు కథానిక నిర్వహించిన చారిత్రక భూమికను నిరూపించాయి. "మతం, దేవుడు, నమ్మకాలు ఎలా స్వార్థపరుల ఆచ్ఛాదనలై సమాజాన్ని విషయుక్తం చేస్తున్నాయి. గ్రహించి గురజాడ వాటి నిజస్వరూపాన్ని బయట పెట్టడానికి వెనుకాడలేదు. మీ పేరేమిటి కథలో మనుషులు చేసిన దేవుళ్ళు ఎలా దొంగభక్త పరాధీనలైనదీ వివరించారు. (జ్వాలాముఖి) "ఈ నాటికీ దేశాన్ని కులమతాల జాడ్యం పీడిస్తూనే వుంది......... దారుణంగా కులాల మతాల మధ్య కొట్లాటలు తారా స్థాయికి చేరి దేశాన్ని కుదిపేస్తున్నాయి. వాటి ప్రమాదాన్ని 80 ఏళ్ళనాడే (1988 నాటికి) గమనించిన" గురజాడ మీ పేరేమిటి ? పెద్ద మసీదు, కథలు రాశారు. (వాసిరెడ్డి నవీన్) "భూషణం చెప్పిన అడివంటుకుంది. అప్పల్నాయుడు చెప్పిన బుగతోడు, పోడు పోడు వథాలు ప్రత్యకంగానూ పరోక్షంగానూ అడవికీ అడవికింద ఊళ్ళకీ అనాదిగా వస్తూవున్న దోపిడీ సంబంధం వివరించే కథలు (శిలావీరాజు) వంటి విశ్లేషణలు తెలుగు కథా విమర్శలో సామాజిక దృష్టిని తెలియజేస్తాయి. ప్రజాసాహితి " తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట సాహిత్య సమీక్ష సంచిక (జులై - ఆగస్టు 1981)లో వాసిరెడ్డి నవీన్ తొలి తెలంగాణా పోరాట ప్రభావంతో వచ్చిన కథల మీద " తెలంగాణా సాయుధ పోరాటం-తెలుగు కథలు" అనే వ్యాసం రాశారు. ఉద్యమంలోని విభిన్న దశలకు తెలుగు కథలలో సాక్షిగా ఎలా నిలబడిందో ఈ వ్యాసంలో నవీన్ స్పష్టంగా నిరూపించారు. 1946 వరకు వచ్చిన కథల్లో ఎక్కువభాగం దేశ్‌ముఖ్‌లు, అధికారులు, ప్రజలను పెట్టిన చిత్ర హింసలను, వీరి కడగండ్లను చిత్రించేవిగా ఉంటే, ఆ తర్వాత వచ్చిన కథలు ప్రజలకు తిరుగుబాటు తత్వాన్ని నేర్పేవిగా ఉంటాయి. 1948 వచ్చే సరికి ఆ కథ యుద్ధభూమికి చేరి పోరాటాన్ని వస్తువుగా చేసుకొని ప్రజల మధ్యకు

> **నూరేళ్ళ తెలుగు కథమీద ఒక్క చేతి మీదుగా ఇంకా సమగ్రమైన చారిత్రక అధ్యయనం జరగలేదు. అయితే విడివిడిగా కొంత కొంత కాలం పరిమితిగా పెట్టుకొని తెలుగు కథా సాహిత్యాన్ని విమర్శకులు అధ్యయనం చేశారు.**

వచ్చింది. అన్న చారిత్రక విశ్లేషణ తెలుగు కథాధ్యయనంలోని చారిత్రక దృష్టికి నిదర్శనం. అరుణతార నూరవ సంచికలో (ఏప్రిల్ 1988) రుక్మిణి " నక్సల్బరీ వెలుగులో తెలుగు కథ, నవల అనే వ్యాసం రాశారు. పోరాటాన్ని ప్రతి బింబించటమే కాక, పోరాటపు దశలనూ చిత్రించాయి. అంటూ ఏయే కథలూ ఏయే అంశాలకు ప్రతిఫలిస్తున్నాయో సోదాహరణంగా వివరించారు. 1969 నుండి 73 వరకు వచ్చిన కథలు పోరాటాన్నే కాక పోరాట చైతన్యంతో కార్మిక వర్గ దృక్పథంతో మధ్య తరగతి జీవితాలను చెప్పారని, 1977 నుండి వచ్చిన కథలన్నీ పోరాట కథలేనని అన్నారు. దీనికి ముందే ఇలాంటి వ్యాసాన్నే కాత్యాయనీ విద్మహే కదలిక ఫిబ్రవరి 1986 సంచికలో "తెలంగాణ పోరాటం తెలుగు కథ నవల" పేరుతో రాశారు. తెలంగాణా పోరాట కథల్ని పోరాటానికి ముందుండిన దోపిడి పరిస్థితులను చిత్రించినవి, ప్రజలు తమ మీద జరుగుతున్న దోపిడీ దౌర్జన్యాలను భరించలేక ఎదురు తిరుగటానికి సిద్ధమైన స్థితిని చిత్రించినవి.... నిర్బంధాల మధ్య పోరాటాల కొనసాగింపును చిత్రించినవి వంటి ఏడు రకాలుగా విభజించి చర్చించారు. ఉద్యమ నేపథ్యంలో కథను అధ్యయనం చెయ్యడానికి ఈ మూడు వ్యాసాలూ మంచి నమూనాలు. 'కథనరంగం' గ్రంథంలో జ్వాలాముఖి రాసిన "తెలుగు కథానిక ఉద్యమాల ప్రభావం" అనే వ్యాసం రాష్ట్రంలో దేశంలో వచ్చిన ఉద్యమాలు తెలుగు కథానికను ఎలా ప్రభావితం చేశాయో. ఉద్యమాలలోని పరిమితులు కథల్లో ఎలా కపబడుతున్నాయో విశదంగా చర్చించారు. ఇది కూడా చాలా విలువైన వ్యాసం. ఈ దృష్టితో ఈ వ్యాస కర్త రాసిన " తెలంగాణా సాహిత్యం విప్లవోద్యమ కథ" (వాఙ్మయి నవంబర్ 1997) భారత స్వాతంత్ర్యోద్యమం తెలుగు కథానిక (కమ్యూనిజం-మార్చి ఏప్రిల్ 1999) వ్యాసాలు కూడా పరిశీలించదగినవి. పడి లేచిన కడలి తరంగం శ్రీకాకుళ ఉద్యమ సాహిత్యం" ( వార్త 22.6.1996) వ్యాసంలో ఎన్. వేణుగోపాల్ ఇవాళ వస్తున్న శ్రీ కాకుళ ఉత్తరాంధ్ర కథల్లో ఒకనాటి శ్రీకాకుళ పోరాటం కొనసాగింపుగా ఎలా చిత్రించబడిందో చర్చిస్తూ గతానికి వర్తమానానికి మధ్య జరిగే సంభాషణ చరిత్ర అనే అభిప్రాయంతో సమన్వయం చేశారు.

**3.22. తెలుగు కథానిక చారిత్రక సమీక్ష :**

నూరేళ్ళ తెలుగు కథమీద ఒక్క చేతి మీదుగా ఇంకా సమగ్రమైన చారిత్రక అధ్యయనం జరగలేదు. అయితే విడివిడిగా కొంత కొంత కాలం పరిమితిగా పెట్టుకొని తెలుగు కథా సాహిత్యాన్ని విమర్శకులు అధ్యయనం చేశారు. బహుశా 1972లో ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ననుకుంటాను. పోరంకి దక్షిణామూర్తి తెలుగు కథానిక పేరుతో చిన్న మోనోగ్రాఫ్ రాశారు. గురజాడ నుంచి అరవై ఏళ్ళలో వచ్చిన తెలుగు కథల్ని కొన్ని కొండ గుర్తులతో పరిచయం చేశారు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వాళ్ళు" ఆధునికాంధ్ర సాహిత్య వికాసం (1900 నుండి 194 దాకా) తోడి వెంకట్రామయ్య తెలుగు కథను గురించి వ్యాసం రాశారు. ఇందులో ప్రముఖ కథారచయితలు ప్రస్తావించబడ్డారు. మధురాంతకం తెలుగు కథా పరిణామం మీద కొన్ని వ్యాసాలు రాశారు. 1. తెలుగు కథా పరిణామం (1910-92)2. కథనడచిన దారి 3. తొలినాటి తెలుగుకథలు (1936-

45) 4. ఒక దశాబ్ది తెలుగు కథలు (1946-55) 5. మూడు తరాల తెలుగు కథ. ఈ అయిదు వ్యాసాలు చదివితే తెలుగు కథ విభిన్న చారిత్రక సందర్భాలలో ఎలా వికాసం పొందుతూ వచ్చిందో తెలుసుకోవచ్చు. తెలుగు కథ పుట్టుక, పత్రికల దోహదం, ప్రవాసాంధ్ర కథకుల ధోరణులు వంటి వాటిని రాజారాం ఈ వ్యాసాల్లో వివరించారు. " ఒక ప్రక్రియ యొక్క సార్థకత అది నమకాలీన నమాజాన్ని ఎంత వరకు ప్రతిబింబించింది? ఎట్టి నందేశాన్ని యివ్వవగలిగింది? అన్న విషయాలపైన అధారపడి ఉంటుంది. అన్న అవగాహనతో కథా సాహిత్యాన్ని వస్తువు పరంగా 1. అట్టడుగు తరగతికి చెందిన బడుగు జీవుల కథలు, 2. పల్లె సీమలకు చెందిన కథలు, 3. నారీ జీవనాన్ని గురించిన కథలు, 4. మనస్తత్వ విశ్లేషణకు ప్రాధాన్యమిచ్చిన కథలు, 5. నవ సమాజనిర్మాణ అవశ్యకతను పలు విధాలుగా వివరించిన కథలు అని అయిదు రకాలుగా వర్గీకరించి చర్చించారు.

తొలి వ్యానంలో వాసిరెడ్డి నవీన్ ప్రజాసాహితి నూరవ సంచికలో రెండు దశాబ్దాల తెలుగు కథానిక (1960-80) పేరుతో గొప్ప విశ్లేషణాత్మక వ్యాసం రాశారు. ఇరవయ్యేళ్ళలో తెలుగు కథ సమాజ పరిణామాలలో సాక్షిగా నిలబడిన తీరును అందులో చర్చించారు. ఈ వ్యాసం చదివితే పోయిన పొల్లు పోగా తెలుగు కథల్లో మిగిలిన గట్టిలోని సారం తెలిసి వస్తుంది. ఒక కాలాన్ని పరిధిగా పెట్టుకొని కథల్ని పరిశీలించి ఆ కాలపు జీవిత పరిణామాలను ఆ కథల్లో అన్వేషించే విధానం తెలిసి వస్తుంది. 'కథను కదిలిస్తే ఎంత చరిత్ర' "పేరుతో కవిత ఎనిమిది దశాబ్దాల తెలుగు కధల్ని చారిత్రకంగా విశ్లేషించారు. (ఆంధ్రప్రభ, 12.9.1994) తొలి నాటి కథల్లో కుటుంబ జీవనం ముఖ్యంగా దంపతుల అన్యోన్యత, సంఘ సంస్కరణ, రాజకీయ స్వాతంత్రాభిలాష, అధునికత, భావి స్వప్నం ప్రధాన వస్తువులయ్యాయని, ఆ తరువాత కథల్లో అనేక జీవన పరిణామాలు, వస్తువులయ్యాయని పేర్కొన్నారు. ఇది గొప్ప

> ఈ దృష్టితో మొదట పేర్కొనదగినవారు కొడవటిగంటి కుటుంబరావు. చారిత్రక దృష్టి, శాస్త్రీయదృక్పథం, చిత్తశుద్ధి కలగలిసిన స్వభావంగల కొకు వందలకొలది కథల్ని రాయడమేగాక, వందల కొలది కథల్ని విమర్శించారు. ఆ విమర్శలో సామాజిక వాస్తవికతా దృష్టి ప్రధానంగా కనిపిస్తుంది. 1935-80 సంవత్సరాల మధ్య తెలుగు కథానికమీద నలభైకి పైగా వ్యాసాలురాసి తెలుగు కథాధ్యయనంలో ఉండవలసిన సామాజిక దృష్టిని నేర్పారు.

అధ్యయనంతో కూడిన వ్యానం. ఈ దశాబ్దంలో (1980-90) తెలుగు సాహిత్యం' ' అని యువభారతి వాళ్ళ చిన్న పుస్తకంలో ఆదశాబ్దంలో తెలుగు కథ మీద వాకాటి పాండురంగారావు వ్యాసం రాశారు. తెలుగు కథ జీవ జీవాలు తెలిసిన, చారిత్రక దృక్పథంగల వారయ్యుండీ వాకాటి ఏమీ చెప్పలేకపోయారు. సాహిత్యాన్ని గురించి తెలియనివారు చెబితే నష్టం, సాహిత్య చరిత్ర తెలిసిన వాళ్ళు మరీ నష్టం. కేతుశ్వనాథరెడ్డి రాసిన ఏభై ఏళ్ళ తెలుగు సాహిత్యంలో కథ (1947-97) తెలుగు కథానిక - దశాబ్ది ధోరణులు (1984-94)" తెలుగు కధానిక" అనే మూడు వ్యాసాలు తొమ్మిది దశాబ్దాల కథా ప్రయాణాన్ని తెలుసుకోవడానికి మంచి దివిటీలు " గురజాడ మొదలుకొని ఈ నాటి వరకు ఉన్న వేలాది రచయితల్లో కనీసం వంద మందికి పైగా కథ రచయితలు మనకు గతం వర్తమానం భవిష్యత్‌ల పట్ల స్పృహ కలిగిస్తారు. అనే అవగాహనతో 1946కు ముందటి కథలకు, తర్వాతి కథలకు మధ్య గల పరిణామాత్మక భేదాన్ని వివరించారు. ఒక దశాబ్దిలో వచ్చిన కథల్ని వస్తు పరంగా ఎలా విశ్లేషించుకోవాలో రెండో వ్యాసంలో విశ్లేషించి చూపించారు. ఇరవయ్యోశతాబ్దం చివరి దశాబ్దంలో తెలుగు కధకు గ్రహణం పట్టిందని మధురాంతకం (ఆంధ్రజ్యోతి 20.9.93) అన్నారు. 1994-97 సంవత్సరాలమధ్య వచ్చిన కథల పట్ల వల్లంపాటి వెంకటసుబ్బయ్య పెదవి విరిచారు. అది తెలుగు కథకు సంబంధించిన సమాకాలీన విషాదం అన్నారు. (కథ 97కు ముందుమాట) యువకథా రచయితలోని నశించిన తాత్త్విక దృక్పధాన్ని దృష్టిలో పెట్టుకొని వల్లంపాటి చెప్పినమాట ఇది. అయితే కాట్రగడ్డ దయానంద్ తొంభై తర్వాత తెలుగు కధ (ఆంధ్రజ్యోతి 26.2.96) అనే వ్యానంలో ఇవాళ కథకుడు తాత్త్వికుడైనాడు. సామాజిక శాస్త్రజ్ఞుడైనాడు. మానసికవైద్యుడైనాడు. సమస్తమానవజీవితాన్ని ప్రేమించి నిర్వచించే అద్భుత కళాకారుడైనాడు అన్నారు. గత దశాబ్దిలో వచ్చిన కధల్ని విప్లవ, స్త్రీవాద, పర్యావరణ, ప్రాంతీయవాది దృష్టులలో వివేచించారు. "వస్తువిస్తృతిలోను, కథా సంవిధానంలోను, శిల్ప పరిణతిలోను విప్లవకథ అత్యున్నత స్థాయికి చేరుకుంది ఈ కాలంలోనే, వంటి స్పష్టమైన నిర్ధారణలు ఈ వ్యాసంలో ఉన్నాయి. వల్లంపాటి "కథా శిల్పం" గ్రంథంలో ఒక అధ్యాయంలో తెలుగు కథా వికాసం మీద చేసిన చర్చ తెలుగు కధకు స్థూల చరిత్ర. పోలాప్రగడ సత్యనారాయణమూర్తి రచించిన "తెలుగ కథానిక" (1999) 1910 నుంచి శతాబ్ది చివరి దాకా తెలుగు కధల్ని కొంతనెమ్మదిగా విమర్శించిన గ్రంధం. ఈయన 1910 నుంచి 1940, 1940-1952, 1952-1965, 1965-1992 దశలుగా కాలాన్ని విడగొట్టి ఆయా కాలాల్లో వచ్చిన తెలుగుకధల్ని చర్చించారు. ఈ గ్రంథంలో 'కధానికలు-సమాజం' లనే అధ్యాయం సామాజిక దృష్టితో తెలుగు కధా వస్తువును చర్చించింది. అలాగే పెద్దిభొట్ల సుబ్బరామయ్య, భమిడిపాటి జగన్నాధరావుల ఉపన్యాసాలు "తొంభైఏళ్ళ తెలుగు కథ"గా అచ్చయ్యాయి. తొలినాటి నుంచి 1950 దాకా పెద్ధిభొట్ల, తర్వాత కాలం మీదభమిడిపాటి ప్రసంగించారు. జీవితంలోని విషాదాన్ని చెప్పగలిగిన తెలుగు కథకులు జీవితంలోని ప్రేమ, కరుణ, దయవంటి వాటిని ఎందుకు పట్టించుకోలేదోని సందేహం వ్యక్తం చేశారు భమిడిపాటి. ఈ రెండు వ్యాసాలు తెలుగు కథా చరిత్రను మరోసారి పరిచయం

చేస్తున్నాయి.

**3.2.2 కథా రచయితలే కథా విమర్శకూ...**

తెలుగు కథా సాహిత్యం తీరుతెన్నుల్ని సామాజిక దృక్పథంతో విమర్శించడంలో రచయితలుకాని విమర్శకుల పాత్రకన్నా రచయితలైన విమర్శకుల పాత్ర ఎక్కువ ఉందంటే అతిశయోక్తికాదు. తెలుగు కథా సాహిత్య చరిత్రలోనే ఈ ప్రత్యేకత ఉన్నట్లుంది.

ఈ దృష్టితో మొదట పేర్కొనదగినవారు కొడవటిగంటి కుటుంబరావు. చారిత్రక దృష్టి, శాస్త్రీయదృక్పథం, చిత్తశుద్ధి కలగలిసిన స్వభావంగల కొకు వందలకొలది కథల్ని రాయడమేగాక, వందల కొలది కథల్ని విమర్శించారు. ఆ విమర్శలో సామాజిక వాస్తవికతా దృష్టి ప్రధానంగా కనిపిస్తుంది. 1935-80 సంవత్సరాల మధ్య తెలుగు కథానికమీద నలభైకి పైగా వ్యాసాలురాసి తెలుగు కథాధ్యయనంలో ఉండవలసిన సామాజిక దృష్టిని నేర్పారు. "చలం కథలలో సమాజంమీద శాపనార్థాలే ఉండేవికాని శాస్త్రి (శ్రీపాద) గారి కథలలో సాంఘిక విమర్శ ఉండేది.. గోఖలే రచనా విధానమూ వస్తువూ భాషా పూర్తిగా (పొలిటేరియన్...కాని గోఖలే కథలకు చెప్పుకోదగిన సాంఘిక ప్రయోజనం లేకపోయిందేమో" వంటి నిర్మోహ మాటంతో కూడిన వ్యాఖ్యలతో తెలుగు కథా విమర్శకు పదును పెట్టారు. కొ.కు. (చూ.కొ.కు సాహిత్య వ్యాసాలు)

తెలుగు సమాజం తెలుగు కథ జంటగా నడచివచ్చిన దారిని పట్టుకునే ఉద్దేశంతో అనేక వ్యాసాలు రాసిన మధురాంతకం చాలా వ్యాసాల్లో తెలుగ కథను సామాజిక దృక్పథంతో విశ్లేషించారు. తెలుగుకథ-తెలుగుదనం, తెలుగు కథ- వాస్తవికత, దేశీయత-వాస్తవికత వంటి వ్యాసాలందు కుదాహరణలు. "తెలుగునేలపైన కథానిక అడుగుపెట్టని చోటులేదు-పలకరించని వ్యక్తిలేదు. అయితే ఒకటి. చీకటికోణాలపైన మెరుపులా ప్రసరించి మాయమయిన కథలే ఎక్కువ. స్పాట్‌లైట్‌లా స్థిరంగానిలిచి చీకటి కోణాలలోని తీరని బాధల్ని, ఆరని వ్యధల్నీ స్పష్టంగా చూపెట్టి పాఠకుడి గుండెపైన స్థిరముద్ర వేసిన కథలు చాలా తక్కువ" అనే అవగాహనతో కొలకలూరి ఇనాక్ వంటి వాస్తవికత వాదులు కథల్ని పరిశీలించారు. "కడచిన నలుబదేబది యేళ్ళలో తెలుగు గృహిణి నాలుగు రకాల పాత్రలు ధరించింది. మునిమాణిక్యం 'కాంతం', రామలక్ష్మిగారి 'పార్వతి', ఇచ్ఛాపురం జగన్నాథరావుగారి 'సుజాత' ముప్పాలరంగనాయకమ్మగారి 'విమల' వంటి సామాజిక విశ్లేషణలు మధురాంతకం విమర్శలో చూడవచ్చు. కథా విమర్శను గూడ జానపథ కథలాగా చెప్పడం మధురాంతకం లక్షణం.

> 'కథాశిల్పం' గ్రంథప్రచురణతో తెలుగు కథా సాహిత్య విమర్శకు ఒక నిర్దిష్టమైన రూపాన్ని కల్పించిన వల్లంపాటి వెంకటసుబ్బయ్య ఒకనాటి కథా రచయితే. కథానికను బూర్జువా సమాజం మధ్యతరగతికిచ్చిన మహత్తరమైన కానుకగా నిర్వచించి, కథా శిల్పాన్ని సామాజికదృష్టి కోణం నుంచి అర్థం చేసుకోవడానికి అవసరమైన సూత్రాలందించారు వల్లంపాటి.

'కథాశిల్పం' గ్రంథప్రచురణతో తెలుగు కథా సాహిత్య విమర్శకు ఒక నిర్దిష్టమైన రూపాన్ని కల్పించిన వల్లంపాటి వెంకటసుబ్బయ్య ఒకనాటి కథా రచయితే. కథానికను బూర్జువా సమాజం మధ్యతరగతికిచ్చిన మహత్తరమైన కానుకగా నిర్వచించి, కథా శిల్పాన్ని సామాజికదృష్టి కోణం నుంచి అర్థం చేసుకోవడానికి అవసరమైన సూత్రాలందించారు వల్లంపాటి. కొ.కు, కా.రా, బీనాదేవి కలువకొలను సదానందల కథలమీద రాసిన విమర్శలు, 'రాతిపూలు' సమీక్ష ఆయన కథా విమర్శలోని సామాజిక దృష్టిని పట్టిస్తాయి. కొ.కు 'నువ్వులు తెలకపిండి' పరిశ్రమలో దోపిడిని చిత్రిస్తుంది, ఈనాటి వ్యవస్థలో 'కళకూడా ఎలా 'సరుకు'గా మారిపోయిందో నూచిస్తుంది... కుటుంబంలో వచ్చిన ఆర్థికపరమైన పరిణామాలనూ, డబ్బుకూ నైతికవిలువలకూ మధ్యఏర్పడ్డ సంఘర్షణనూ 'ఆడముండ' అన్న కథ అద్భుతంగా చిత్రించింది - వంటి సూత్రీకరణలు తెలుగు కథల్ని జీవితం ఆధారంగా అర్థం చేసుకోడానికుపయోగపడతాయి.

కొ.కు. కల్పనా సాహిత్యాన్ని పాఠకుల కందించడంలో చరిత్ర సృష్టించిన కేతు విశ్వనాథరెడ్డి సామాజిక శాస్త్రాల నేపథ్యంతో తెలుగు కథల్ని గురించి అనేక విమర్శలు చేశారు. "ఆధునిక తెలుగు వచన కల్పనా సాహిత్యం, పర్యావలోకనం, తెలుగు కథానిక గాంధేయ దృక్పథం తెలుగు నవల, కథ-అంతర్జాతీయ స్పృహ వంటి వ్యాసాలు చూడవచ్చు. "వ్యవసాయ సంస్కృతినుంచి పారిశ్రామిక సంస్కృతికి మారే సమాజ దశలో లిఖిత రచనాభివృద్ధి జరుగుతుంది. అనే అవగాహనతో తెలుగు కథానికా సాహిత్యాన్ని చరిత్ర, ఉద్యమం, ప్రాంతం వంటి పార్శ్వాలనుంచి వ్యాఖ్యానించడం కథా విమర్శకు ఈయన చేసిన దోహదం. (చూ: దృష్టి)

తెలుగు కథా సాహిత్య విమర్శకు సామాజిక దృష్టిని జోడించిన మరో కథా రచయిత కొలకలూరి ఇనాక్ "వాస్తవికత: తెలుగు కథానిక" వంటి సైద్ధాంతిక వ్యాసాలను రాయడమేగాక, మునిమాణిక్యం 'కాంతం' భానుమతి 'అత్తగారు' పాత్రల్ని కుటుంబ జీవిత వరిధిలో వరిశీలించారు. ఇంకా మధురాంతకం, రంధిసోమరాజు వంటి వాళ్ళ కథలనూ పరిశీలించారు. "తెలుగు కథానికా సాహిత్యంలో స్వాతంత్ర్యానికి పూర్వం అల్పంగా, అనంతరం అధికంగా వాస్తవికత గోచరమవుతుంది" అని కొలకలూరి విశ్లేషణ.

బి.ఎస్.రాములు రచించిన "50 ఏళ్ళ తెలుగుకథ", రంగనాయకమ్మ "యజ్ఞం" కథమీద రాసిన వ్యాసాలు, ఓల్గా "కథకులు-కథనరీతులు"లో రాసిన అనేక వ్యాసాలు "తెలుగు కథానిక-మనోవిశ్లేషణ" వంటి వాకాటిపాండురంగారావు వ్యాసాలు ఈ దృష్టితో పరిశీలించదగినవి.

**3.2.4 తెలుగు కథావిమర్శ : సంకలనాలు,**

**సంపుటాలు, గ్రంథాలు:**

తెలుగు కథా విమర్శ ఎదగటానికి అనేక సంస్థలు సంఘాలు దోహదం చేస్తున్నాయి. విమర్శ వ్యాసాలను గ్రంథాలుగా, సంపుటాలుగా, సంకలనాలుగా తెస్తున్నాయి. వందలమంది విమర్శకులు ఈ ఉద్యమంలో పాల్గొంటున్నారు. విశాలాంధ్ర తరఫున మధురాంతకం రాజారాం, సింగమనేని నారాయణ సంకలనం చేసిన 'తెలుగు కథకులు-కథనరీతులు" మూడు సంపుటాలు తెలుగు కథా విమర్శ పరిణతికి విస్తృతికి నిదర్శనాలు. గురజాడ నుండి, మధురాంతకం మహేంద్ర దాకా భిన్న తరాలకు, భిన్న భావజాలాలకు, భిన్న ప్రాంతాలకు చెందిన కథకుల మీద రాయించిన 75 వ్యాసాలు స్వల్ప వ్యవధిలో తీసుకురావటం విశేషం. ఈ వ్యాసాలలో అన్నీ కాకపోయినా చాలా వ్యాసాలు తెలుగు కథలను కథకుల్ని సామాజిక దృష్టితో పరామర్శించాయి. కథకుల జీవితాలు, జీవన సమస్యలకు వాళ్ళు స్పందించిన తీరు, తెలుగు కథకులు నిర్వహిస్తున్న సామాజిక బాధ్యత ఎలాంటిదో ఈ వ్యాసాలు తెలియజేస్తాయి. ఈ సంకలనాల్లో కథా విమర్శకులలోని రెండు తెగలు - కాలక్షేప, కాల నిక్షేప వాదులు దర్శనమిస్తారు. కర్ర వున్న వాడిదే బర్రె అన్నట్లుగా సాగుతున్న వ్యవస్థాస్వరూపాన్ని కళ్ళకు కట్టించే కథ "గ్యారాకద్దూబారా కొత్వాల్" (సురవరం) అని కాలువ మల్లయ్య వివరించారు. "భావ కవిత్వం ప్రజల నుండి ఎడంగా వుండాలను కున్నట్టు కథ వుండదలచుకోలేదు"(కొడు) అని ఓల్గా తీర్మానించారు. "మధ్యతరగతి సంస్కారాన్నీ, హిపొక్రసీనీ, మిథ్యావిలువల్నీ వ్యంగ్యధోరణిలో ఆయన (చాసో) అనేక కథల్లో చిత్రించారు" అని సింగమనేని పేర్కొన్నారు. "కొంగ్రాయిపక్షి... బల్లకట్ట పాపయ్య మొదలైన కథలన్నీ పెత్తందార్ల చేతుల్లో నలిగే సామాన్యుల మూలుగుల్నే వినిపిస్తాయి" అని పాపినేని విశ్లేషించారు. "కుటుంబ హింసకు బలౌతున్న స్త్రీలపక్షాన నిలబడి సామాజిక దుర్లక్షణాల మీద నిరంతర

బి.ఎస్.రాములు "కథల బడి" పేరుతో రచించిన గ్రంథం "కథాశిల్పం"లాగే ఒకేసారి కథా సిద్ధాంతగ్రంథమూ, తెలుగు కథా విమర్శ అవుతుంది. కథా రచయితలు సామాజిక మార్గదర్శకులనే అవగాహనతో రాములు కథకు సంబంధించిన అనేక సాంఘిక పార్శ్వాలను చర్చకు పెట్టారు. ఈ గ్రంథంలో నెమ్మదిగా చర్చించాల్సిన అంశాలకు కొదవలేకపోయినా విమర్శకులు, కథకులు తెలుసుకోదగిన అంశాలు చాలా ఉన్నాయి.

పోరాటం చేయటానికి ప్రజా ఉద్యమాల నిర్మాణం అవసరాన్ని గుర్తిస్తూ రంగనాయకమ్మ 'అనుభవం' కథ రాశారని కాత్యాయనీ విద్మహే సూత్రీకరించారు. కొలకలూరి "ఊరబావి" కథ మాదిగ వాస్తవికతను పకడ్బందీగా చిత్రించటంతో ఆగిపోలేదు. అందులో దళిత స్త్రీవాదం తొలిసారి రెక్కలిప్పింది" అని లక్ష్మీనరసయ్య నిర్ధారించారు. కేతు విశ్వనాథరెడ్డి "ఇచ్ఛాగ్ని కథ ప్రేమ-పెళ్లి మధ్యవున్న వాస్తవికతను విశ్లేషించిన కథ "అని నంజీవమ్మ వాఖ్యానించారు. ఈ మూడు సంపుటాలు చదివితే ఇలాంటి సూత్రీకరణలు, నిర్ధారణలు కొల్లలుగా దొరుకుతాయి. అవి తెలుగు కథా విమర్శలోని సామాజిక దృష్టికి ప్రతీకలుగా నిలుస్తాయి.

నిజానికి ఇలాంటి సంకలనాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇరవయ్యేళ్ల క్రితమే "తెలుగుకథా రచయితలు" పేరుతో తెచ్చింది. గురజాడ మొదలైన పన్నెండు మంది కథకుల మీద భాస్కరస్వర్ణాంబ వంటివాళ్లు రాసిన విమర్శవ్యాసాలు చాలా విలువైనవి. దానికి పరిణామరూపమే పై మూడు సంకలనాలు. దానికన్నా ముందే గొర్రెపాటి వెంకటసుబ్బయ్య 'అక్షరాభిషేకం' లో తొమ్మిదిమంది వచన రచయితలను పరిచయం చేశారు. అందులో పరిచయం, ప్రశంస ప్రధానం. ఇటీవల 'వేదగిరి కమ్యూనికేషన్స్ ద్వారా వేదగిరి రాంబాబు తెలుగు కథానిక ప్రచారం గురించి బాగా కృషి చేశారు. ఒక్కో ఏడాదిలో ఒక్కో పత్రికలో వచ్చిన కథల మీద ఒక్కో విమర్శకునితో వ్యాసాలు రాయించి ప్రచురించారు. ఇవి తెలుగు కథలకు తక్షణ స్పందనలు. ఉప్పల నరసింహం 'కథావేదిక' ద్వారా తెలుగు కథాసంరక్షణ ప్రచారాలకోసం చేసిన కృషి మరువరానిది. ఈ సంస్థల కృషిలో కనీసం వందమంది విమర్శకులతో పాలుపంచుకుని తెలుగు కథానికల నిగ్గును తేల్చే ప్రయత్నం చేశారు.

సామాజిక దృష్టితో కథా విమర్శ పదునెక్కిందనడానికి ఎన్.వేణుగోపాల్ ఇటీవల ప్రచురించిన 'కథా సందర్భం' చాలు. సామాజిక పరిణామాలకు, మానవ విలువలకు సంబంధాలకు గల అవినాభావ సంబంధాన్ని తెలుగు కథల్లో వేణుగోపాల్ అన్వేషించిన తీరు శాస్త్రీయం. అలాగే ఇటీవల తెలుగు సాహిత్యంలో బాగా వినిపిస్తున్న పరాయీకరణ భావనను తెలుగు కథలకు అన్వయించటం వేణుగోపాల్ చేసిన గొప్పపని. రచయిత దృక్పథాన్ని బట్టి కథ ఎట్లా రూపుదిద్దుకుంటుందో ఎడారికోయిల (మధురాంతకం) మధ్యవర్తులు (అల్లంరాజయ్య) కథల ఆధారంగా నిరూపించడం కథా విమర్శలోని నిశితత్వానికి నిదర్శనం. తెలుగు కథా పుట్టుకకు సంబంధించిన సామాజిక సాహిత్య మూల్యాలను ఇదివరకటి విమర్శకుల అభిప్రాయాల కన్నా పరిణితంగా సమగ్రంగా వేణు వివరించారు.

బి.ఎస్.రాములు "కథల బడి" పేరుతో రచించిన గ్రంథం "కథాశిల్పం"లాగే ఒకేసారి కథా సిద్ధాంతగ్రంథమూ, తెలుగు కథా విమర్శ అవుతుంది. కథా రచయితలు సామాజిక మార్గదర్శకులనే అవగాహనతో రాములు కథకు సంబంధించిన అనేక సాంఘిక పార్శ్వాలను చర్చకు పెట్టారు. ఈ గ్రంథంలో నెమ్మదిగా చర్చించాల్సిన అంశాలకు కొదవలేకపోయినా విమర్శకులు, కథకులు తెలుసుకోదగిన అంశాలు చాలా ఉన్నాయి.

కథా సాహిత్యసృష్టికి సంబంధించి అనేక కొత్త ఆలోచనల్ని ఈ గ్రంథం కలిగిస్తుంది. 'యజ్ఞం' కథకీ 'జీవన్మృతుడు' (ఆడెపు లక్ష్మీపతి) కథకీ మధ్యగల పరిణామాత్మక సంబంధాన్ని దర్శించగల నిశిత దృష్టి రాములిది. రా.రా. రచించిన "వ్యక్తి స్వాతంత్ర్యం-సామాజిక శ్రేయస్సు"లోనూ "రారా లేఖలు"లోనూ తెలుగు కథను సామాజిక కోణం నుండి అర్థం చేసుకోడానికి కావలసిన కొన్ని 'క్లూ'లు లభిస్తాయి. ఈయన రాసిన 'కథానికా దాని శిల్పమూ" అనే వ్యాసం ఒక థీసిస్‌గా పేరుపొందింది. జయంతి పాపారావు రచించిన "కథనూ వెంటాడుతూ గతంలోకి" ఉత్తరాంధ్ర కథకుల్ని సామాజిక నేపథ్యంలోంచి విశ్లేషించిన గ్రంథం.

హైదరాబాద్ బుక్‌ట్రస్ట్‌వాళ్ల 'కథాయజ్ఞం' సామాజిక దృష్టితో వచ్చిన తెలుగు కథా విమర్శలో ఒక మైలురాయి. కాళీపట్నం రామారావు కథలమీద, ప్రత్యేకించి 'యజ్ఞం' కథమీద సాంఘిక చారిత్రక, ఆర్థిక రాజకీయ దృష్టులతో విస్తృతమైన చర్చ జరిగింది. కె.రాధాకృష్ణమూర్తి 'యజ్ఞం' కథలోని నాటకీయతను గురించి రాస్తూ "అందులోని సంఘర్షణ ఉన్న వాళ్లకీ లేని వాళ్లకీ మధ్య. వ్యక్తుల్ని బట్టిచూస్తే అప్పల్రాముడికీ, గోపన్నకీమధ్య, సూక్ష్మంగా విచారిస్తే అంతకన్నా ఉన్నతమైన సంఘర్షణ దృక్పథాలకి సంబంధించినది అని నిగ్గు తేల్చారు. శ్రీపతికూడా దానిని ప్రధానంగా ఆర్థిక వ్యవస్థలోని వైరుధ్యాల సంఘర్షణగా పేర్కొన్నారు. టి.కృష్ణాబాయి కా.రా కథల్లోని స్త్రీ పాత్రలను వర్గపాత్రలుగా విశ్లేషించారు. 'యజ్ఞం' కథ వచ్చిననాటినుంచీ ఇంకా విమర్శవ్యాసాలు వస్తూనే ఉన్నాయి. కా.రా. రచించిన 'కథాకథనం' గ్రంథానికి ఆర్.ఎస్.రావు "ఆంటీహీరో నుంచి ఆల్టర్నేటివ్ హీరోదాకా" అనే ముందుమాట రాస్తూ 'యజ్ఞం' కథ మీద ఆర్థిక చారిత్రక సామాజిక, అభివృద్ధి దృష్ట్యా చక్కని విశ్లేషణ చేశారు. రజనీకుమారి (ఆంధ్రపత్రిక-జులై నెల 1989) 'మరోసారి యజ్ఞం' పేరుతో రాసిన సుదీర్ఘ వ్యాసం తెలుగు కథా విమర్శలో పెరిగిన సామాజిక దృష్టి గాఢతకు మరో తార్కాణం.

> తెలుగు కథా సంపుటాలకు సంకలనాలకు సంకలన కర్తలు, విమర్శకులు రాసిన ముందు మాటల్లో కూడా సామాజిక దృష్టితో వచ్చిన ఎంతో కథా విమర్శ దొరుకుతుంది.

ఒక్కో కథకుని మీద వచ్చిన విమర్శ గ్రంథాలలో ఈ వ్యాసరచయిత రచించిన "గురజాడ "తొలికొత్త తెలుగు కథలు" కాత్యాయినీ విద్మహే, మార్కుయాదయ్య ఉమ్మడిగా రచించిన "రావిశాస్త్రి సాహిత్య దృక్పథం" యు.ఆర్.నరసింహమూర్తి రచించిన "కథా శిల్పి చా.సో" వంటివి పేర్కొనదగినవి. 'రావిశాస్త్రి సాహిత్య దృక్పథం' ఆయన కథలలో ప్రతిబింబిస్తున్న మధ్య, శ్రామిక, ఉన్నత, అడుగులోతు వర్గజన జీవితాలను పరామర్శించింది. 'కథా శిల్పి చాసో, ప్రధానంగా ఆయన కథాశిల్పాన్ని చర్చించినా ఆయన కథలలోని స్త్రీలు, పురుషులు, జీవనతత్వం వంటివి కూడా పరామర్శించింది. "గురజాడ : తొలికొత్త తెలుగు కథలు" ఒక్కో కథలోని వస్తువును, శిల్పాన్ని విడివిడిగా విశ్లేషించే ప్రయత్నం చేసింది. సొదుం రామ్మోహన్ "సాహిత్య శిల్పం"లో అనేకుల కథల్ని సమాజ దృష్టితో వ్యాఖ్యానించారు.

**తెలుగు కథా విమర్శ : "ముందుమాట" ల్లో అందుబాటు :**

తెలుగు కథా సంపుటాలకు సంకలనాలకు సంకలన కర్తలు, విమర్శకులు రాసిన ముందు మాటల్లో కూడా సామాజిక దృష్టితో వచ్చిన ఎంతో కథా విమర్శ దొరుకుతుంది. ముఖప్రీతి కోసం, ఉబుసుపోక కోసం రాసిన ముందు మాటలకు తక్కువ లేదు గానీ, కథా ప్రక్రియను శక్తివంతమైన సాహితీ రూపంగా భావించి రాసిన ముందుమాటలు చాలా ఉన్నాయి. కథా సాహిత్య విమర్శలోని సామాజిక దృష్టికి అవి కూడా మూల స్తంభాలుగా నిలుస్తాయి. 1958లోనే కేంద్ర సాహిత్య అకాడమీ వారి "ఆంధ్ర కథా మంజూష"కు సంకలనకర్త (వేలూరి శివరామశాస్త్రి) రాసిన పీఠికలో ఎంతో ముందు చూపున్న ముందుమాట. 'శ్వేతరాత్రులు', 'మట్టి తీగలు', 'రక్త స్పర్శ' వంటి సంకలనాలకు సంపుటలకు వరవరరావు చాలా లోతైన ముందుమాటలు రాశారు. వాటిలోని కథలకు జీవితానికి గల విడదీయరాని సంబంధాన్ని నిరూపించారు. 'మట్టితీగలు' సంపుటిని పరిచయం చేస్తూ బమ్మిడి జగదీశ్వర్‌రావు కథలన్నిట్లోనూ పరాయీకరణ అంతస్సూత్రంగా ఉన్నదని సూత్రీకరించారు. 'పెనం' కథను సరకుమీద ప్రేమ మానవ సంబంధాల విధ్వంసానికి దారి తీసే స్థితికి ప్రతిబింబమని వ్యాఖ్యానించారు. 'శ్వేతరాత్రులు'లో 'చావు విందు', 'తుపాను' వంటి కథలు మానవాన్వేషణ సమిష్టిపోరాట స్వభావాన్ని ఒక పెద్దనేపథ్యంలో చూపుతాయన్నారు. 'శారద' కథలో 'రక్తస్పర్శ'లో ఇవాళ మార్క్సిజంపైన వస్తున్న విమర్శలకు సమాధానం లభిస్తున్నదన్నారు. ఇలాంటి వాక్యాలు కథా సాహిత్యాన్ని చూడవలసిన సాంఘిక చూపును నిర్దేశిస్తున్నాయి. 'వంశధార కథలు'కు ముందు మాట రాసిన కోడూరి శ్రీరామమూర్తి, 'ఆక్రమణ (మానేపల్లి) కథలో రోడ్ల వెడల్పు కార్యక్రమ డొల్లతనాన్ని, సందిగ్ధసంధ్య (ఎ.ఎ.రెడ్డిశాస్త్రి) కథలో విద్యను వ్యాపారంగా మార్చిన శక్తులను చూడగలిగారు. 'అడవిలో వెన్నెల' సంకలనానికి ముందుమాట రాసిన కె.బాలగోపాల్ ఆ కథలన్నీ ప్రజలే నిజమైన విప్లవకారులని చాటుతున్నాయన్నారు. ఎండ్లూరి సుధాకర్ 'మల్లెమొగ్గల గొడుగు'కు ముందు మాట రాసిన జి.లక్ష్మీనరసయ్య ఆ

కథల్లోని పాత్రలన్నీ ప్రకాశం జిల్లా కనిగిరి మండలం రావిగుంటపాలెం పల్లె ప్రాంతాల మాదిగల జీవితాలకు ప్రతినిధులని నిర్ధారించారు. 'ఒంటరిగాలేం మనం' సంకలనానికి ముందుమాట రాసిన జి.కళ్యాణరావు ఆ కథల్లో జీవితం తననితాను రాసుకుందన్నారు. ఆ కథల్లోని సీతమ్మ, ఈరమ్మ వంటి స్త్రీలు జీవితంలోంచే వచ్చారని, కథలు చదివాక వాళ్లు మనల్ని వెన్నాడుతున్నారని అన్నారు. 'విసుర్రాయి' (ఎం.సుజాతారెడ్డి) కథలకు ముందుమాట రాసిన బి.ఎస్.రాములు 'విసుర్రాయి' కథ 'విసుర్రాయికి ఎంత చరిత్ర ఉందో 'స్త్రీల విసుర్రాయి జీవితానికి అంత చరిత్ర ఉందని' నిరూపిస్తున్నదన్నారు. బమ్మిడి 'రెక్కలగూడు'కు ఓల్గా ముందుమాట రాస్తూ స్త్రీవాద కథలలోని 'భరణం'లో కుటుంబ వ్యవస్థలో భాగంగా రాజ్యం నిర్వహించే పాత్రను చూడగలిగారు. సంకలనకర్తగా వాసిరెడ్డి నవీన్ తెలుగుకథ (1960-85)కు ముందుమాట రాస్తూ 1960కి ముందు ఆయా రచయితలు ఎంచుకున్న యితివృత్తాలను సమస్యలను మధ్యతరగతి దృక్పథంనుండే పరిశీలించారని, ఆ తర్వాత వచ్చిన కథల్లో శ్రామికవర్గ దృక్పథం స్పష్టంగా ఉందని నిర్ధారించారు. తెలుగు కథా సాహిత్యాన్ని చారిత్రక, వర్గ దృష్టితో అధ్యయనం చెయ్యడానికి ఇలాంటి అభిప్రాయాలు ఉపయోగపడతాయి. 'మమతలు-మానవ సంబంధాలు' (బి.ఎస్.రాములు)కు ముందుమాట రాసిన జి.గంగాధర్ 'వారసత్వం' కథలో 70ఏళ్ల సమాజ చరిత్ర పరిణామాలను పసిగట్టారు. అ.ర.సం-గుంటూరు జిల్లా శాఖ ప్రచురించిన 'కథా స్రవంతి' సంకలనాలకు పురాణం వంటివారు రాసిన ముందుమాటలు విలువైన విమర్శలే. కె.లక్ష్మీనారాయణ 'దళిత కథలు' సంకలనాలకు రాసుకున్న ముందుమాటల్లో విలువైన కథా విశ్లేషణ ఉంది. ఆ కథల్లో దళితుల ఆర్థిక సాంఘిక రాజకీయ సాంస్కృతిక జీవిత ప్రతిఫలనాన్ని ఆయన ముందుమాటల్లో వివరించారు. 'కథా సాహితి' తరఫున ఏడాది కథానికల్ని

విలువైన విమర్శలే. కె.లక్ష్మీనారాయణ 'దళిత కథలు' సంకలనాలకు రాసుకున్న ముందుమాటల్లో విలువైన కథా విశ్లేషణ ఉంది. ఆ కథల్లో దళితుల ఆర్థిక సాంఘిక రాజకీయ సాంస్కృతిక జీవిత ప్రతిఫలనాన్ని ఆయన ముందుమాటల్లో వివరించారు.

తీసుకొస్తున్న పాపినేని శివశంకర్, వాసిరెడ్డి నవీన్‌లు రాసిన ముందుమాటలు అటుండగా, పది సంకలనాల్లోని కథల్లోని వస్తువును విశ్లేషిస్తూ కాత్యాయనీ విద్మహే (కథ 2001) రాసిన వ్యాసం దానంతట అదొక సిద్ధాంతవ్యాసం. తెలుగు కథా విమర్శలోని సామాజిక దృష్టికి ఆ వ్యాసం తిరుగులేని సాక్ష్యం. 'మలుపులు' (కె.ఎస్.రమణ)కు ముందుమాట రాసిన కేతు విశ్వనాథరెడ్డి, చరిత్రలో శాశ్వతమైన ప్రశ్నలూ ఉండవు. శాశ్వతమైన జవాబులూ ఉండవు, గతి నిర్దేశక సంస్కారం మాత్రమే వుంటుందంటూ, ఆ సంస్కారం రమణ కథల్లో ప్రతిఫలిస్తున్నదన్నారు. 'సీమకథలు' సంకలనానికి సింగమనేని రాసిన ముందు మాట ఒక సాంస్కృతిక అధ్యయనపత్రం. ఒక ప్రాంత జీవనపోరాటపాట. ఇట్లాంటి ఆలోచనాత్మకమైన, సాంఘిక స్వభావం గలిగిన వాస్తవిక దృష్టి గలిగిన ముందుమాటలు సామాజిక దృష్టితో కూడిన తెలుగు కథా విమర్శను అభివృద్ధి పరచడంలో తమవైన దోహదం చేశాయి.

**ప్రత్యేక సమయాలూ - ప్రత్యేక సంచికలూ : తెలుగు కథా విమర్శ :**

కథా రచయితల జీవితంలోని విశేష సమయాలలోనూ సందర్భాలనూ గుర్తుగా పెట్టుకొని సంస్థలూ, పత్రికలూ తీసుకొచ్చే ప్రత్యేక సంచికలు తెలుగు కథా విమర్శకు లభించే మరొక అవకాశం. అనేకమంది మిత్రులతో విమర్శకులతో ఆయా రచయితల కథానికలమీద రాయించే వ్యాసాల్లో మంచి మంచి కథా విశ్లేషణలు లభిస్తాయి. 'భావ విప్లవ కారుడు-కో.కు' 'జులై-30' (రావిశాస్త్రి షష్టిపూర్తి) 'జననీరాజనం' (చా.సో.సంచిక) 'సాహితీ చైత్రరథం' (జ.వి.కృష్ణారావు సంచిక), 'కేతు వ్యక్తిత్వం - సాహిత్యం' (కేతు విశ్వనాథ్‌రెడ్డి షష్టి పూర్తి సంచిక) వంటివెన్నో వచ్చాయి. వాటిల్లో కొన్ని వ్యాసాల్లో ప్రశంసాత్మకత ప్రధానంగా ఉన్నా గంభీరమైన విశ్లేషణలు కూడా ఉంటాయి. ఉన్నాయి. 'భవిష్యత్తు తెలుగు కథదే' అన్న ధీమాగల కేతు విశ్వనాథరెడ్డికి అరవయ్యేళ్లు పూర్తయిన సందర్భంగా వచ్చిన సంచికలో అనేకులు ఆయన కథల్ని విశ్లేషిస్తూ వ్యాసాలు రాశారు. 'నమ్ముకున్న కల' కథలో మనిషికీ నేలకూ ఉన్న సంబంధాన్ని అతడు, వారన్న అంగడి సుబ్బరాయుడు పాత్రల దృక్పథంనుంచి ప్రదర్శింపబడిందనీ, ఈ కథ రాయలసీమ వల్లెల విషాదగాథ అని వల్లంపాటి పేర్కొన్నారు. ఈ కథ కేవలం కరువును వర్ణించే కథ కాదనీ, కరువు కాలంలోని మానవ సంబంధాలనూ, కరువుకు పరిష్కారంగా వచ్చిన పారిశ్రామికీకరణ మానవ సంబంధాల్లో తీసుకొచ్చిన మార్పుల్ని చిత్రిస్తుందని అనడం తెలుగు కథను సాంఘిక చారిత్రక కోణంలో చూడటమెలాగో చెబుతున్నది. విశ్వనాథరెడ్డి రాసిన 50కథల్లో ఇరవై కథలు స్త్రీ ప్రధానకేంద్రంగా వచ్చాయంటూ ఓల్గా స్త్రీ పాత్రల విశ్లేషణ చేశారు. 70వ శతాబ్దంనాటి ఆయన స్త్రీ పాత్రలు ఏ భౌతిక పరిస్థితులలో పుట్టి పెరిగాయో ఆ పరిస్థితుల తాలూకు చైతన్యం మేరకు మాత్రమే ఎదిగాయని, వాళ్ల స్త్రీ జాతిలో వస్తున్న లేదా రావాల్సిన చైతన్యానికి ప్రాతినిధ్యం వహించే పాత్రలు కారని, ఆ తర్వాత ఆయన స్త్రీపాత్రలు మారవని నిర్ధారించారు. ఈ పరిశీలన కథానికల్లో పాత్రల పరిణామానుశీలనకు ఒక నమూనా. "కడపలో కష్టజీవి పారమ్యాన్ని చూసిన

కమిట్‌మెంట్ ఆయనది" అన్న జ్వాలాముఖి అభిప్రాయం చూడటానికి సూత్రప్రాయం. ఆలోచనకు భాష్యప్రాయం. "రాయలసీమ కథలు ఉప్పుకారం ఉన్న కథలు, తెలంగాణా కథలు చీమూ నెత్తురున్న కథలు, కళింగాంధ్రగకథలు మనుగడ పోరాటాలు, కోస్తా కథలు హాబీ కథలు" అన్న జ్వాలాముఖి వర్గీకరణలోని వాస్తవికతా శాతం పరిశీలించదగింది. కేతు కథల మీద సింగమనేని నారాయణ రాసిన వ్యాసం ఒక నిర్దిష్ట ప్రాంతానికి చెందిన రచయిత కథల్ని ఆ ప్రాంత ఆర్థిక రాజకీయ సాంఘిక నేపథ్యంలో ఎలా అధ్యయనం చెయ్యాలో నేర్పుతున్నది.

తెలుగు పత్రికలు అప్పుడప్పుడూ తీసుకొచ్చే ప్రత్యేకసంచికలు కూడా తెలుగు కథా విమర్శకు సామాజిక పరిమాణాన్ని అద్దుతున్నాయి. ఉదాహరణకు ప్రజాశక్తి పత్రిక తీసుకొచ్చిన దర్పణం చూడవచ్చు. దీన్లో కథకు సంబంధించి గుడిపాటి, సింగమనేని, గంటేటి, కాలువమల్లయ్య, వల్లంపాటి వంటి విమర్శకుల వ్యాసాలు ఇంటర్వ్యూలు ఉన్నాయి. కాలువ, సింగమనేని, గంటేడలు రాష్ట్రంలోని మూడు ప్రాంతాల కథా సాహిత్యాన్ని అంచనా కట్టినతీరు ఆయా ప్రాంతాల జీవితం తన కథల్ని తానెలా సృష్టించుకుంటుందో రుజువు చేస్తున్నది. ఒక ప్రాంతం కథల్ని చారిత్రక దృష్టితో ఎలా అర్థం చేసుకోవాలో కూడా ఈ వ్యాసాలు నేర్పుతాయి. "హృదయ సంస్కారానికి దోహదం చేస్తున్న తెలుగు కథ" అనే వ్యాసంలో గుడిపాటి ఇటీవలి తెలుగు కథల్లో వచ్చిన మార్పులు, అందుకు దోహదం చేసిన అంతర్జాతీయ జాతీయ నేపథ్యాన్ని వివరించారు.

**3.2.7 : తెలుగు కథా విమర్శక్షేత్రం : తెలుగు పత్రికల విహారం :**

మొదటే చెప్పుకున్నట్లు తెలుగు కథను తెలుగు కథా విమర్శకు దిన, వార, మాస పత్రికలే వేదికలు. పత్రికలే లేకపోతే ఇవి కావు. ఇప్పటిదాకా నాలుగైదు వేల వ్యాసాలు, సమీక్షలు తెలుగు పత్రికల్లో వచ్చుంటాయి. వాటిలో సామాజిక దృష్టితో కూడిన

> తెలుగు పత్రికలు అప్పుడప్పుడూ తీసుకొచ్చే ప్రత్యేకసంచికలు కూడా తెలుగు కథా విమర్శకు సామాజిక పరిమాణాన్ని అద్దుతున్నాయి. ఉదాహరణకు ప్రజాశక్తి పత్రిక తీసుకొచ్చిన దర్పణం చూడవచ్చు. దీన్లో కథకు సంబంధించి గుడిపాటి, సింగమనేని, గంటేటి, కాలువమల్లయ్య, వల్లంపాటి వంటి విమర్శకుల వ్యాసాలు ఇంటర్వ్యూలు ఉన్నాయి.

కథావిమర్శకు కొదవేమీలేదు. నిజానికి ఇప్పటిదాకా మనం ఉదహరించుకున్న చాలా వ్యాసాలు పత్రికల్లో వచ్చినవే. విడివిడి రచయితల మీద, సమస్యలమీదా వారాల మీద, ఒక్కో కథ మీద - ఇలా ఎన్నోరకాల విలువైన కథా విమర్శ పత్రికల్లోనే రెపరెపలాడుతున్నది. ఏమైనా ఉదాహరణలిచ్చుకోవచ్చు. కొన్నైనా చూద్దాం. తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన 'పనిపిల్ల' కథ మీద తెలుగు పత్రికల్లో ముఖ్యంగా ఆంధ్రజ్యోతి, ఉదయంలో సాగిన చర్చ చదివితే తెలుగు కథా విమర్శ సంతరించుకున్న సామాజికత తెలుస్తుంది. అది వరకెప్పుడో పనిపిల్ల కథ మీద పి.రామకృష్ణారెడ్డి విమర్శ రాసినట్లున్నారు. ఆయన అభిప్రాయాలను వ్యతిరేకిస్తూ గుడిపాటి ఆంధ్రజ్యోతిలో 28.11.94న "స్త్రీ పురుష సంబంధ విశ్లేషణలో కొత్తకోణం 'పనిపిల్ల' కథ" అనే వ్యాసం రాశారు. పెరుగుతున్న వినిమయ సంస్కృతి, వ్యాపార సంబంధాల ఫలితంగా మధ్యతరగతి కుటుంబాలలో కృత్రిమ విలువల చోటు చేసుకుంటాయని, వస్తువుల్ని ఇంటినిండా నిపండమే మధ్యతరగతి జీవితదృక్పథమై పోయిందని, భార్యాభర్తల్లో ఒకరిది ఈ దృక్పథం కానప్పుడు ఏర్పడే ఘర్షణను పనిపిల్ల కథ చిత్రించిందని, రామకృష్ణారెడ్డి కథను సరిగా అర్థం చేసుకోలేదని అభిప్రాయపడ్డారు. కథలో రచయిత భార్యా భర్తల మధ్య పోరాటాన్ని వర్గ పోరాటంగా ఎక్కడా చెప్పలేదని స్పష్టం చేశారు. ఆ తర్వాత ఈ చర్చ 'ఉదయం'లోకి మారి అనేక అనేక మలుపులు తిరిగింది. ఈ కథను 'స్త్రీ స్వేచ్ఛపై కాల్పనిక కుట్ర' అనే పేరుతో కాసుల ప్రతాపరెడ్డి విమర్శించగా (27.2.95) 13.3.95న అల్లం రాజయ్య "సమస్తమానవ సంబంధాల్లోనూ ఆ కథలోని మహేంద్ర, ఆయన భార్య, యశోధ పాత్రల సంబంధాల ద్వారా నిరూపించారు "పనిపిల్ల కథ వర్గపోరాటాల వ్యక్తీకరణే కాదు, దాని బహుముఖాలను అర్థం చేసుకోడానికి చేసిన ఒక ప్రయత్నం - వేసిన ఒక అడుగు అని నిర్ధారించారు. 20.3.95న ఎస్.రామకృష్ణ "వీరు నేర్చుకున్నదేమీలేదు - మరచిపోయిందేమీ లేదు" పేరుతో రాసిన వ్యాసంలో కాసుల ప్రతాపరెడ్డిని సమర్థించి అల్లం రాజయ్యను వ్యతిరేకించారు. తుమ్మేటి రాసిన ఇతర కథలతో పోలిస్తే పనిపిల్ల కథ వెనక ఖచ్చితమైన రాజకీయ ఉద్దేశముందున్నారు. సమాజంలో కుల, లింగపరంగా సాగిన అమానుష అణచివేతను విప్లవోద్యమాలు పట్టించుకోకుండా కేవలం జనరాలిటీస్‌పైనే ఇన్నాళ్లు మాట్లాడినట్లే అల్లంరాజయ్యకూడా పనిపిల్ల కథలోని వైరుధ్యాల జోలికి పోకుండా 'పని' అనే జనరల్ ఉపరితలాంశం మీద కేంద్రీకరించారు" అన్నారు. 27.3.95న ఎస్.జగన్‌రెడ్డి 'యాంత్రికవాదం నుంచి యాంత్రికవాదంలోకి" పేరున రాసిన వ్యాసంలో, అంతకుముందే పి.రామకృష్ణారెడ్డి ఈ కథపై చేసిన వాదానికి కొనసాగింపుగానే ప్రతాపరెడ్డి వాదాన్ని పేర్కొని, ఈ యిద్దరి తోపాటు ఎస్.రామకృష్ణ వాదాలన్నీ "తొక్కితే పాతాళానికి తొక్కడం ఎత్తితే ఆకాశాని కెత్తడంలాంటి విపరీత ధోరణులతో సాగిపోతున్న తెలుగు సాహిత్య విమర్శకు పనిపిల్ల కథపై వచ్చిన వ్యాసాలు ఉదాహరణలన్నారు. అంతేకాదు, ఇటు ప్రతాపరెడ్డి వంటి వారు, అటు రాజయ్యవంటి వారు - రెండు రకాల వాళ్లు యాంత్రికవాదంలోకి వెళ్లిపోయారని

తీర్మానించారు. దళిత స్త్రీవాద సాహిత్యాలు ఉధృతంగా వస్తూ గుర్తింపు పొందుతున్న దశలో ప్రజాసాహిత్యాన్ని శక్తివంతంగా సృష్టించే రచయితనుంచి ఈ కథ రావటం దురదృష్టకరమన్నారు ఓల్గా. వర్గసంబంధాల తోపాటు జండర్ సంబంధాలు కూడా పురాతనమైనవని, దళిత స్త్రీ వాదాలను తిరస్కరించడం వర్గవాదులకు మంచిది కాదని ఆమె తీర్మానించారు. ఈ వాదాల్లో ఎవరు మునిగారు, ఎవరు తేలారు అనేది కాదు మనకు కావలసింది. సమాజంలోని భిన్న ఆలోచనా విధానాలు తెలుగు కథా విమర్శకు దాని అభివృద్ధికి ఎలా దోహదం చేస్తున్నాయన్నదే ప్రధానం. ఆంధ్రజ్యోతిలో 1994 అక్టోబర్ 17, 24, 31 తేదీలలో పి.సత్యవతి రాసిన "చిన్న కథల్లో స్త్రీవాదం" జూపల్లి ప్రేంచంద్ 1993 ఏప్రిల్, 5,12,19 తేదీలలో 'అనంతం' కథ మీద రాసిన "ఎడారి జీవితాల ఆర్ద్రకథనం", బి.ఎస్.రాములు, చందు సుబ్బారావులు చేసిన,చర్చ : కథలో వాస్తవాలు ఎలా ప్రతిఫలిస్తాయి (23.3.95) ''కథలో వాస్తవాలు ... విమర్శలో అవాస్తవాలు''(27.3.95) చందుసుబ్బారావు, వి.చెంచయ్యలు చేసిన చర్చ నీరసించి పోతున్న తెలుగు కథ (15.10.90) తెలుగు కథ నీరసించిపోలేదు (22.10.90), వార్తలో కాలువ మల్లయ్య, మిట్టపెల్లి పాణిగ్రాహి చేసిన చర్చ "తెలుగులో తెలంగాణాది తిరుగులేని స్థానం (18.11.2001) తెలంగాణా కథాంతా గంతేనా (2.12.2001) దానికి కొనసాగింపుగా వెతాచంద్రయ్య ఆంధ్రభూమిలో రాసిన వ్యాసం, వార్తలోని బి.ఎస్.రాములు, గుడిపాటి చేసిన చర్చ 'దృశ్యకథన పద్ధతి ప్రజారచయితలకు శిరోధార్యం' (5.7.93) కథన పద్ధతులపై పాఠాలు చెప్పడం (12.7.97) వంటివి. అక్కడక్కడ కొంత దెప్పి పొడుపులు, ఆవేశాలు ఉన్నా తెలుగు కథ గురించి సామాజిక దృష్టితో చూచేచూపులోని వైవిధ్యానికి సంకేతాలుగా నిలిచాయి. వార్తల్లో గుడిపాటి రాసిన గ్లోబలైజేషన్ నేపథ్యంలో మూడు కథలు (కుప్పిలి పద్మ కథలు) 11.2.2001), నరేంద్ర 'కథానికలు మానవసంబంధాలు' వ్యాసం(11.3.01 & 18.3.01) వంటివి ఎన్నైనా ఉన్నాయి. కె.వి.ఎస్.వర్మ క్రీడారంగం నేపథ్యంతో ఆరు కథల్ని విమర్శిస్తూ రాసిన వ్యాసం (వార్త 31.8.96) తెలుగు కథావిమర్శలో కొత్తకోణం. రావిశాస్త్రి సారాకథల్ని (1962 నాటివి) 1993 (ఆగస్టు 16న-ఆంధ్రప్రభ)లో సారా వ్యతిరేక మహిళోద్యమం నేపథ్యంలో కాత్యాయినీ విద్మహే వ్యాఖ్యానించిన తీరు తెలుగు కథల పునర్మూల్యాంకనానికి నిదర్శనం. "పునాది అయిన ఆర్థిక వ్యవస్థతోనూ దానికి అనుగుణమైన రాజ్యాధికార వ్యవస్థతోనూ సారాకు ఎంత దగ్గర సంబంధం ఉంటుందో - సారాను ఏదో ఒక రూపంలో నిలిపి ఉంచటానికి ఈ నాటి ప్రభుత్వాలు పడే తపననుండి మనం అర్థం చేసుకోవచ్చు" అంటూ సారా కథల్లోని రాజ్య స్వభావాన్ని ఆమె నిరూపించిన తీరు తెలుగు కథను అధ్యయనం చేయడంలో విమర్శకులు ఎదిగిన ఎత్తుకు తార్కాణం. అయినా వీళ్లందరికన్నా చాలా ముందుగానే కోటారి రామమూర్తి భారతిలో రాసిన "తెలుగు కథానిక మీద మార్క్సిజం ప్రభావం" తల మానికం.

ఇటీవల తెలుగు కథల్ని ఉపోద్ఘాతాలతో, వ్యాఖ్యానాలతో పుస్తకాలుగా తీసుకువచ్చే ధోరణి ఒకటి వచ్చింది. త్రిపుర కథలను అలా తీసుకొచ్చారు. అత్తలూరి రాసిన నరసింహారావు. ఒకప్పుడు ఒక్కో కథకు ఒకో విమర్శకునితో వ్యాఖ్యరాయించారు. ''వందేళ్ల తెలుగుకథ''కు వాడ్రేవు చిన వీరభద్రుడు ఒక్కో యుగం కథలకు ముందుగా చారిత్రక దృష్టితో నేపథ్యం చెప్పారు. "కథా సమయమూ, సందర్భమూ' 'పేరుతో వచ్చిన పుస్తకంలో గోపిని కరుణాకర్ రాసిన ''కానగపూలవాన' కథకు బి.తిరుపతిరావు చేసిన విశ్లేషణ మీద వార్త 27.5.2001న వి.వి.ఎన్.మూర్తి "పక్కదారి పట్టించే ప్రబోధాలు కథకులకు చేటు" అనే వ్యాసం రాశారు. రచయితల్ని ఆలోచించటాన్ని మానుకోవాలని విశ్లేషకులు సలహా ఇవ్వటాన్ని ఆక్షేపించారు. ఇలాంటి వ్యాసాలు తెలుగు కథావిమర్శ సూక్ష్మమైన మూలాల్ని వెతుక్కుంటూ పోయి అసాంఘిక ధోరణుల్ని పట్టి ఎండగట్టుతున్నారని రుజువు చేస్తాయి. ఈ మహాగమనానికి పత్రికలే ఊతమైనాయి.

అందువల్ల తెలుగు కథానికా విమర్శ అధ్వాన్నంగా లేదు. ఒకవేళ వెనకబడి ఉన్నా "కథ ఉంది కథా విమర్శలేదు" అని నిరాశకు లోనయ్యేంతగా లేదు. కథ ఉంది కథా విమర్శాఉంది. కథా విమర్శ కానిదీ ఉంది. కథల ఎన్నికలో లాగే కథా విమర్శలనూ జల్లెడ పట్టాలి. కాలక్షేప విమర్శనుంచి కరుకైన విమర్శను వేరు చెయ్యాలి. ఈ పనిని వ్యక్తులు కాదు సంస్థలు చేయాలి. తెలుగు విశ్వవిద్యాలయం వంటి సాంస్కృతిక విశ్వవిద్యాలయాలు చెయ్యాలి. తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగం దాన్ని గురించి ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. వాళ్ల ఇటీవల ఒక ఏడాదిలో వచ్చిన వ్యాసాలను సంకలనాలుగా తీసుకొచ్చేపనిని మొదలు పెట్టారు. అయితే ఆ ప్రణాళికను విస్తృత పరచి, కథ, కవిత, నవల, నాటకం, సాహిత్య విమర్శ ప్రక్రియల మీద ఆయా సంవత్సరాలలో వచ్చిన వ్యాసాలోంచి ఎన్నిక చేసి విడివిడిగా పుస్తకాలు వేస్తే పని స్పష్టంగా ఉంటుంది. ఈ రకంగా అయితే సామాజిక దృష్టితో వచ్చిన విమర్శను ఎక్కువగా ప్రజలకు అందించడానికి అవకాశముంటుంది. ఇతర సాహిత్య ప్రచురణ సంస్థలు, ఔత్సాహిక వ్యక్తులు కూడా ఈ బాధ్యతల్లో భాగం పంచుకోవచ్చు. ఫిర్యాదులు చెయ్యడం సరే పనికి నడుమూ బిగించాలి.

తెలుగు విశ్వవిద్యాలయం వంటి సాంస్కృతిక విశ్వవిద్యాలయాలు చెయ్యాలి. తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగం దాన్ని గురించి ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. వాళ్ల ఇటీవల ఒక ఏడాదిలో వచ్చిన వ్యాసాలను సంకలనాలుగా తీసుకొచ్చేపనిని మొదలు పెట్టారు.

ఇంటర్వ్యూ బీనాదేవి

# కథ ప్రారంభం పిలక పట్టుకుని లాక్కుపోవాలి

**తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచిపోయిన మంచి నవల "పుణ్యభూమీ కళ్లుతెరు"కు ప్రేరణ ఏమిటి? నేపథ్యం ఏమైనా వుందా?**

ప్రత్యేకంగా ఏముంది? మంచి నవల రాద్దామనుకున్నాం, రాశాం. నేనూ, నరసింగరావు గారు, శ్రీరంగం శ్రీనివాసరావు అని మా తమ్ముడు వుండేవాడు.బాగా చదివే వాడు. మేం ముగ్గురం కలసి అనుకుని రాశాం. ఇక నేపద్యం అంటారా. మాది విశాఖ పట్టణం దగ్గర చోడవరం. నరసింగరావు గారు మా అమ్మ తమ్ముడు. నాకు మేనమామ అన్నమాట. అలా ఇద్దరం ఒకే వాతావరణంలో పెరిగాం. మా కుటుంబంలో మూడు తరాల నుంచి లాయర్లే. నరసింగరావు గారి తాతగారు, నాన్నగారు, మా నాన్న గారు కూడా లాయరు చేశారు.అలా పూర్తిగా కోర్టువాతావరణంలో పెరిగాం. ఇంట్లో చర్చలు కూడా కోర్టుల గురించే. అప్పటి జుడిష్యరికి ఇప్పటికి చాలా తేడా. అప్పట్లో లాయర్ అంటే దేవుడిలా చూసేవారు.చిన్నతనంలో మా కళ్ల ముందు జరిగిన పరిణామాలు మాకు తెలియకుండా మనసులలో వుండిపోయి, రచన ప్రారంభించిన తర్వాత బయటకు వచ్చాయి.1965లో మేము రచనలు మొదలుపెట్టాం.ఆ పల్లెటూరి వాతావరణమే మా రచనలలో ప్రతిబింబించింది.

మాఫాదర్, మదర్ బాగా చదివే వాళ్లు. విశాఖ పట్టణంలో అప్పుడు పెద్ద పుస్తకాల షాపు వుండేది కాదు.గుప్తా బ్రదర్స్ అనేది ఒక్కటే వుండేది.....

**నరసింగరావు గారు, మీరు రచనలు కలసి చేసేవారా?**

ఔనండి. ఆయన నరసింగరావు,నేను త్రిపుర సుందరీ దేవి. రెండు పేర్లు కలిపి బీనాదేవి అని పెట్టుకున్నాము.అప్పట్లో అదేదో తమాషాగా వుండేది. కాని ఇప్పుడు మామూలై పోయింది.

**మీ మధ్య పని విభజన ఎలా వుండేది?**

పని విభజన అంటూ ఏమీ లేదు. ఏదైనా రాయాలనుకుంటే చర్చించుకుని రాసేవాళ్లం. అంతే.

**అంటే తిరుపతి వెంకట కవులు పరుచూరి బ్రదర్స్, ఇలా ఏ జంట కవులు రచయితలను తీసుకున్నా కూడా వారి మధ్య ఏదో అవగాహన వుంటుంది. మీరు అలా..**

అలాటిదేమీ లేదు. అనుకుని రాసేవాళ్లం. ఆయన ప్రమేయం లేకుండా నేను మాత్రమే రాసింది ఒక్కటే- భూమి గుండ్రంగా వుంది అనే నవల. ఆయన ముస్సోరిలో ఏదో క్లాసులు చెప్పడానికి వెళ్లినపుడు రాశాను.

**మీరు పల్లెటూరి బ్యాక్‌గ్రౌండ్ గురించే చెప్పారు, కాని బీనాదేవి రచనలలో అర్బనిటీ చాలా వుంటుంది కదా.. ఉదాహరణకు డ్రైవర్లు, క్లీనర్లు, రోడ్డు పక్క హోటళ్లు, పై తరగతివారి అలవాట్లు ఇవన్నీ...**

అదంతా తర్వాత చూసిందండి. మేము ఉద్యోగ రీత్యా తిరుగుతున్నప్పుడు చూసింది.పైగా ఆ రోజులలో బొగ్గు బస్సులు వుండేవి.వాటి కోసం డ్రైవర్లు క్లీనర్లు పల్లెల్లో మకాం వేసేవారు. ఆ భాషే గమనించి రాశాము.

. . . . . . . . . . . . .

. . . . . . . . . . . . .

ఆయన చాలా సోషల్‌గా వుండేవారు. అహం వుండేది కాదు. మా ఇల్లు సత్రంలా వుండేది.అందరితో కలసి మెలసి తిరిగేవారు.సోషల్ సర్కిల్ చాలా ఎక్కువ. మానవతా వాది. చాలాకాలం మేమిద్దరం పిల్లల చదువుల కోసం దూరదూరంగా వుండాల్సి వచ్చింది. చివరలో హైదరాబాదు వచ్చాకే కలసి వుంది. . . . . . . . . . .

| బీనాదేవి | . భర్త కీ.శే. బి. నర్సింగరావుతో కలసి రాసిన త్రిపుర సుందరీ దేవి |
|---|---|

**భాష విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధ వహించేవారా?**

వేరే ఏం లేదండి.మాకు తెలిసిన భాసే రాసేవాళ్లం. మేము ఉద్యోగ రీత్యా అటూ ఇటూ తిరిగినా మా భాష మాత్రం మారలేదు. అలాగే వుండి పోయింది.ఆ మధ్య వేమము నరసరావుపేటలో వున్నప్పుడు ఏదో యూనివర్సిటీవాళ్లు పరీక్ష జరిపి బీనాదేవి భాష మాత్రం మారలేదని ప్రకటించారు.

**నరసింగరావు గారు సాహిత్యం బాగా చదివే వారా?**

ఔనండి. అయితే తెలుగు ఎక్కువగా చదివేవారు కాదు.ఇంగ్లీషు పుస్తకాలే చదివేవారు ఎక్కువగా. విశాఖ వచ్చి రావిశాస్త్రి పరిచయమైన తర్వాతే తెలుగు చదవడం మొదలు పెట్టారు.ఆ ప్రేరణతోనే కొత్త తరహా రచనలు ప్రారంభించాము. రావిశాస్త్రి రచనలు చదివిన తర్వాత ఏదో రాయాలనే "కిల్లింగ్ డిజైర్" తనను పట్టుకుందని ఆయన రాశారు.

**రావిశాస్త్రి ప్రభావం చాలా వుంది కదా... కొన్ని కథలు ఆయన ప్రేరణతో రాసినట్టు పేర్కొన్నారు..**

ఆయన ప్రభావం చాలా వుంది. ఒకసారి ఆయన విశాఖ నుంచి వెలువడే విశాఖ అనే పత్రికలో కథలు రాయడానికి పనికి వచ్చే ఇతివృత్తాలు ఇచ్చారు.వాటిలో ఒకటి తీసుకుని - ఒకటే ఇంజక్షన్ వున్నప్పుడు ఎవరికి ఇవ్వాలనే డైలమా వస్తే డాక్టర్ ఏం చేస్తారనేదానిపై కథ రాశాము. ముగింపు మేము వేరే ఇచ్చామనుకోండి. మూలం మాత్రం ఆయన చెప్పిన సూచన నుంచి వచ్చిందే.

అలాగే శాస్త్రిగారు కథ ప్రారంభం, ముగింపు చాలా పకడ్బందీగా వుండాలనేవారు మొదలు .పిలక పట్టుకుని చదివించాలని చెప్పేవారు. మొదలు పెట్టినవాడికి పక్కన పెడదామనిపిస్తే అది మంచి కథ కాదనేవారు. ఆ సూత్రాన్ని చాలా వరకు పాటించాము.

**కొస మెరుపులు ఎక్కువే కదా మీ కథల్లో.**

అది ఒ. హెన్రీ ప్రభావం.

**నరసింగరావు గారి గురించి చెప్పండి..**

ఆయన చాలా సోషల్‌గా వుండేవారు. అహం వుండేది కాదు. మా ఇల్లు సత్రంలా వుండేది.అందరితో కలసి మెలసి తిరిగేవారు.సోషల్ సర్కిల్ చాలా ఎక్కువ. మానవతా వాది. చాలాకాలం మేమిద్దరం పిల్లల చదువుల కోసం దూరదూరంగా వుండాల్సి వచ్చింది.చివరలో హైదరాబాదు వచ్చాకే కలసి వుంది.

**వామపక్ష ప్రభావం వుండేదా?**

మీరు లెఫ్ట్ రైట్ అనకండి. నాకు నచ్చదు. ఆయనది మానవతా వాదం అంతే.

**కాని పుణ్యభూమి కళ్లు తెరులో దళారీలు, దోపిడీ, శ్రమ జీవితం వగైరాలన్ని కనిపిస్తాయి. ప్రత్యక్షంగానో పరోక్షంగానో వామపక్ష ప్రభావం లేకుండా ఇది సాధ్యమా?**

అవి వున్న మాట నిజమే. ఆయనకు మాత్రం రాజకీయాలతో సంబంధం లేదు. చాలా మంది కమ్యూనిస్టు అనుకునే వారు.

**ఏమిటో, అప్పట్లో అది చర్చ అయింది.మేము ఎంచుకున్న టైటిల్ అదే. కాని పుస్తకం వేసిన నవభారత్ ప్రకాశ రావు గారు " పుణ్యభూమీ కళ్లు తెరు " అని కలిపారు.నిజానికి అది మాకు నచ్చలేదు. అయితే వెళ్లి పోయింది.**

**ఆ కారణంగా ఎలాటి ఒత్తిళ్లకు గురయ్యారా?**

లేదు. ఆయన ఎలాటి వారో తెలుసుకనక ఎవరూ ఒత్తిడి చేయడానికి సాహసించేవారు కాదు.ఒక వేళ ఏదైనా కేసులో ఇబ్బందులు ఎదురైతే తాను వదులు కుంటున్నానని మరెవరైనా విచారిస్తారని అక్కడే ప్రకటించేవారు. అంత సూటైన మనిషి.

**హేంగ్ మి క్విక్ అని ఇంగ్లీషు టైటిల్ పెట్టి అప్పట్లో చర్చకు కారకులయ్యారు కదా..**

ఏమిటో, అప్పట్లో అది చర్చ అయింది.మేము ఎంచుకున్న టైటిల్ అదే. కాని పుస్తకం వేసిన నవభారత్ ప్రకాశ రావు గారు " పుణ్యభూమీ కళ్లు తెరు " అని కలిపారు.నిజానికి అది మాకు నచ్చలేదు. అయితే వెళ్లి పోయింది. కావాలని ఇంగ్లీషు టైటిల్ పెట్టామని చాలా మంది అనుకున్నారు కాని అదేం లేదు.కథను బట్టి అది సరిపోతుందనుకున్నాం. అంతే. ఇప్పుడు చూడండి.కథల్లో టీవీ సీరియళ్లలో సగం సంభాషణలు ఇంగ్లీషులోనే వుండటం లేదా?

**పుణ్యభూమి కళ్లు తెరు ప్రసిద్ధ దర్శకుడు బిఎన్ రెడ్డి సినిమా తీస్తారని అప్పట్లో అని మళ్లీ విరమించుకోవడానికి కారణం?**

నిర్మాత వెనక్కు పోవడమే. సినిమా కోసం మేము డైలాగులు కూడా రాశాము.

**మీ రచనల గురించి చెప్పండి..**

నేను ఆయన కలసి రాస్తామనే దానిపై రకరకాల వ్యాఖ్యలు వచ్చేవి.మేమెప్పుడూ పట్టించుకోలేదు. 1990లో ఆయన పోయాక మూడేళ్లు నేనేమి రాయలేదు.అప్పట్లో రచన పత్రిక సాయి వచ్చి ఇలా అయితే మీగురించి అనే మాటలు నిజమవుతాయి అన్నారు. బీనాదేవి గారు కూడా రాయగలరని అర్థం కావాలి అన్నారు.దాంతో పట్టుదల వచ్చి మళ్లీ రాయడం ప్రారంభించాను.వేదగిరి రాంబాబు ఒత్తిడిపై మరి కొన్ని రాశాను. అయితే ఇప్పుడు కూడా కొంత మంది నేను ఆయన గతంతో రాసినవే ఇస్తున్నానని అన్నారు. ఇప్పటి విషయాలపై ఆయన గతంలోనే ఎలా రాయగలరో మరి? ఏమైనా నేనిప్పుడు ఎక్కువగా వ్యాసాలు రాస్తున్నాను.ఆయన వ్యాసాలు రాసేవారు కాదు.

ఇప్పటి వాళ్ల రచనలు చదువుతున్నారా? ఏమనిపిస్తుంది?

నిజం చెబితే ఏమీ అనుకోనంటే చెబుతాను.నేను అవి చదవడంలేదు. చదవాలనిపించవు. కాకపోతే మా అమ్మ మంచి క్రిటిక్. తను చదివి ఏదైనా బాగుందని అంటే వింటాను.నర్సింగరావు గారు పోయాక ఆమే నాకు క్రిటిక్. ఏదైనా రాసి వినిపిస్తే మరోసారి రాయకూడదూ అంటూ మెరుగుపరచడానికి సలహాలిస్తుంది. మా అమ్మాయి కూడా డాక్టరు పని చేస్తూనే చదివి చెబుతుంటుంది.

కథ

బమ్మిడి జగదీశ్వర రావు

# ఊరు



'అనగనగా ఒక ఊరు'...

నే కత మొదలు పెట్టానో లేదో 'ఊరంటే?' ఏమిటని అడిగింది మా చిట్టితల్లి. అవును, వూరంటే ఏమిటని తడుముకున్నాను. ఊ.. ఉ-లూ... అ.. ఆ-లూ చదివాను. నా చాత కానితనాన్ని దిద్దేందుకు సిద్ధపడిన మా నానిగాడు చకచకా గీతలు గీసాడు. డ్రాయింగ్ స్టాండ్ మీద ఊరు విస్తరిస్తోంది.

'అనగనగా ఒక ఊరు'...

నే కత మొదలు పెట్టానో లేదో 'ఊరంటే?' ఏమిటని అడిగింది మా చిట్టితల్లి. అవును, వూరంటే ఏమిటని తడుముకున్నాను. ఊ.. ఉ-లూ... అ.. ఆ-లూ చదివాను. నా చాతకానితనాన్ని దిద్దేందుకు సిద్ధపడిన మా నానిగాడు చకచకా గీతలు గీసాడు. డ్రాయింగ్ స్టాండ్ మీద ఊరు విస్తరిస్తోంది.

పూరి పాకలు... కూలి గోడలు... మాసిన చింపిరి జిత్తుల మనుషులు (?)... దారి లేని కాలువలు... తీరులేని రహదారులు.. పాడు బడిన పారశాల... పశులు తోలే పసివాళ్ళు... బక్క చిక్కిన పశువులు... నీటికోసం కడవలు పట్టుకొని దూరంగా సాగిపోయే మహిళలు... మన్ను తినేస్తున్న ఎడ్లు లేని బళ్ళు... వూడిన దర్వాజాలు... పోలేరమ్మ గుడి.... పక్కనే పెంట... పెంట మీద పందులు... దూరంగా రాబందులు... వాటి రెక్కల కింద వల్లకాడు... కాట్లో కాలుతున్న చితిమంట...

మాకు సెగమంట వెచ్చగా తగిలింది. డ్రాయింగ్ బోర్డుకు దూరంగా జరిగాను. అవి పెన్సిల్ గీతలు కావు, నిజంగానే ఊరు... అవి బొమ్మలు కావు... ప్రాణమున్న (?) మనుషులు. కదులుతున్న వూరు... ప్రవహిస్తున్న ఊరు...

కళ్ళముందు ఊరు కాదు, వూరి ముందరే మేమున్నాం...!?

మా చిట్టితల్లి ఊపిరి తియ్యడం మర్చిపోయి ఊరుని చూస్తోంది. దాని కళ్ళనిండా వూరు సద్దు మణిగి వుంది. నానిగాడు తానే బొమ్మై చూస్తూ వున్నాడు. వాళ్ళిద్దరి వెనకాలే నేనున్నా...

ఊర్లోకి పోవాలని అడుగు వేయబోతే రహదారి ప్రారంభంలో వున్న రావిచెట్టు రతనాలు చల్లినట్లు తను ఆకులు రాల్చి ఆహ్వానం పలికింది.

కోయిల కూత లేదు గాని సెవ్వఁడు కాకి అరుపే పిలుపులా వినవచ్చింది. అంబా అని కొట్టాంలోంచి లేగదూడలు అమ్మనో మమ్మల్నో రమ్మని పిలుస్తున్నట్లే అనిపించింది.

అడుగులు ముందుకు పడ్డాయి.

ఊరి మొదల్లో రచ్చబండ దాటకముందే శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి ఎదురయ్యారు. టాంకుబండ్ మీద వున్న వీరబ్రహ్మేంద్ర స్వామికీ ఈ వీరబ్రహ్మేంద్రస్వామికీ తేడాలున్నాయి. ఒక్కలా లేకపోయినా ఆ కూర్చునే పద్ధతి చూసి మా చిట్టితల్లి వెంటనే పోల్చేసింది. నేను చేతులు జోడించి దండవెఁట్టాను. నేను ధ్యానంలో

పడి... మా చిట్టిది ఊరి గురించి అడిగిందో, అడక్కుండానే ఆయనగారు తెలుసుకున్నారో? - తెలీదు గాని... నేను కళ్ళు తెరిచేసరికి స్వామివారు 'కాలజ్ఞానం' బోధిస్తున్నారు.

శ్రీశ్రీశ్రీ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వామి ఏం చెప్పేరు?,

'కలియుగము 4,500 సంవత్సరములు పోయిన వెనుక ధర్మదేవత! పుణ్యస్థలంబులు! పుణ్య దేశంబులు! తిరుగు చుండును! అందుననేక కలహంబులు పుట్టును! అతిహారం బుట్టును! అతి నిద్ర పుట్టును! నిలచిన తావున నిలవక! సకల మృగాదులు సంచరించును! శాంతులు కోపవంతులగుదురు! అధికులు ఎందుకూ కొరగాక పోదురు! అడివి మృగాలు పల్లెలకు జేరేని! పల్లెలు పట్నాలయ్యేని! అసత్యము రాజ్యమేలుతుంది!'...

వింటూనే, ప్రకృతి వైపరీత్యాలు?' అన్నాను, లేదు మనసులో అనుకున్నాను. బ్రహ్మేంద్రస్వామి గ్రహించినట్టే వున్నారు.

'నెత్తురు వాన కురిసేని. అలంపూరు జోగులాంబ కంటనీళ్ళు గారేని. యేనుగుకు పంది బుట్టేని. బెండ్లు మునిగిని గండ్లు తెలేని. కడప యెుద్దనున్న కమలాపురములో కప్ప కోడికూత కూసేని. గద్దనొడి కాకి తన్నేని. కందుకూరులో స్త్రీ పురుషుడయ్యేని. కంచి కామాక్షమ్మ నెత్తురు కక్కేని. అప్పుడు పుట్టిన బిడ్డలు మాట్లాడేని...'

అంతా చెప్పి 'కాలజ్ఞానం' గురించి చెప్పాలంటే కాలం పట్టదు' అన్నారు బ్రహ్మేంద్రస్వామి.

'వూసుకోలు కబుర్లెందుకు? ఊరు గురించి చెప్పండి' అన్నట్లు చూసింది చిట్టితల్లి. నేను లెంపలు వేసుకున్నాను.

'కాని... ఆ కాల జ్ఞానానికీ కొరవా వుండిపోయింది' అన్నారు బ్రహ్మంగారు. సెలవియ్యండని చేతులు జోడించి, చెవులు చాచేను.



బ్రహ్మంగారి మఠం బావురమన్నది... కంది మల్లెయ పల్లిలో కలవరమయినది... ప్రజలు నాలుకలు వెల్లబెట్టినారు. అప్పుడు ఆకాశవాణి బ్రహ్మంగారి గొంతుతో మరొక్కమాట పలికింది?!....

'కరీంనగరమందలి పల్లెల్లో ప్రజలచే ఉద్యమాలు పోలీసులు నడిపించేని! విప్లవాలు పలికించేని!'

వీర బ్రహ్మేంద్రస్వామి గారి చివరి మాటల పాఠం చెవిన పడింది కాని మనసున ఇంక లేదు. కొన్ని పాఠాలు అనుభవాన్ని బట్టి అర్థమవుతాయని సరి పెట్టుకున్నాను.

అప్పటికే పిల్లలు రచ్చబండను దాటారు. నేను మరోసారి బ్రహ్మంగారికి దండం పెట్టి పిల్లల వెంట పరుగు తీసాను.

రచ్చబండ మీద మనుషుల అలికిడి లేదు. తుడిచేసినట్టు మనిషి కాదు కదా, పిట్ట అలికిడి లేదు. ఖర్ఫ్యూనా..? ఇక్కడ రోజూ ఖర్ఫ్యూ వుంటుందా? మా చిట్టితల్లి అడిగేదే, కాని గాంధీ గారడ్డుకున్నారు!?

గాంధీ గారి చేతిలోని కర్రనీ... ఆయన నడుస్తున్న భంగిమనీ చూస్తే ఆయన కూడా వడివడిగా వూరొదిలి పారిపోవాలని పరుగెత్తలేక నడుస్తున్నట్టుగా వుంది! చిట్టితల్లి తాతగారి కాళ్ళకడ్డం పడింది. నానీగాడు గీసుకున్న బొమ్మలా లేదు. బాపూలా లేదు. అందుకేనేమో పెన్సిల్‌తో తల గోక్కున్నాడు.

'గాంధీగారూ మీరెక్కడికి వూరొదిలి వెళ్ళిపోతున్నారు?' మా చిట్టితల్లి ప్రశ్నించిందా ఏమో?...

'పల్లెలే దేశానికి పట్టుగొమ్మలు' గాంధీగారు ఇప్పుడనలేదు గాని ఎప్పుడో అన్నమాటే అప్పుడూ ప్రతిధ్వనించింది...?!

గాంధీ గారినీ ఒగ్గలేదు, ఊరు చూపించమని అడిగింది చిట్టితల్లి.

ఆ చెయ్యికి ముంజెయ్యి లేక పోవడం గమనించినట్టులేదు. తాతగారి చెయ్యి చొరవతో పట్టుకుంది, ఆ చొరవకి ఆయనే మాతో వచ్చి ఊరు చూపిస్తాననుకున్నాను. కాని ఆయన కదల్లేదు. కాలి దగ్గర చివర పాదం లేదు. అదెప్పుడో రాలి మన్నులో కలిసి మన్నయి పోయిందేమో గాని తాతగారి ముఖంలో చిరునవ్వు చెరగలేదు.

చిట్టితల్లి సీతాకోకచిలుకల్లే ఎగిరి ఏ ఆచ్ఛాదనా లేని బాపూజీ గుండెల మీద వాలబోయింది. బాపూ గుండె బీటలు వారింది. చిట్టితల్లి తడిమింది. సిమెంటు పగులు కాదు, చర్మం చీలినట్టే వుంది. లోపల తీగలో... నరాలో.. నల్లగా కమిలి... తుప్పు పట్టి కనిపిస్తున్నాయి.

చిట్టితల్లి మనసు చివుక్కుమందేమో వెనక్కి తగ్గింది. మరి రెండడుగులు వెనక్కి వేసింది. ఆ చిట్టి సీతాకోకచిలుకకు రెక్కలు తెగినట్టే నిలబడి వుంది. కూలబడి వుంది.

'అమెరికా ఒక దేశం కాదు, ఆంధ్ర ప్రదేశ్ ఒక రాష్ట్రం కాదు. అనకాపల్లి పట్నం కాదు, అలమండ ఒక గ్రామం కాదు, మరి..? ఇప్పుడు ప్రపంచమే ఒక గ్రామం. కాదు కాదు, కుగ్రామం' అమెరికా అధ్యక్షుడో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రో ఐటీ సాక్షిగా అయిటయిటికీ చెప్పడం వల్ల... నే ఊరుని వెతకలేదు, పిల్లలు చెప్తే వినరు, ప్రయాస పడుతున్నారు.

నానీగాడు గందరగోళంలో పడినట్టున్నాడు. జాతిపిత ఇలాగవుంటే జాతి నెలాగ చిత్రించడమా అనేది వాడి చిన్ని బుర్రకి పట్టేట్టు లేదు. మనసు లాంటి సున్నితమైన పెన్సిల్ మొన విరిగింది. కిందపడి. విరిగిన పెన్సిల్ మొన బండగా వూర్లోకి దారిని వేసుకుంటూ గీసుకుపోయింది. అలా గీచిన దారిలో మేం మళ్ళీ నడవడం ప్రారంభించాం...

హైటెక్ నగరాన్ని ఆ భవంతుల్నీ చూసిన కళ్ళతో - పూరి పాకల్నీ పెంకుటిళ్ళను చూస్తుంటే ఏదో పెయింటింగ్ ఎగ్జిబిషనో... ఫొటో ఎగ్జిబిషనో చూస్తున్నట్లుగా వుంది. చిట్టితల్లి చేతుల్లోకి తీసుకోవాలనుకుంది ఆ దృశ్యాన్ని అది బొమ్మ కాదు, నిజంగా నిజం... తను చిగురుటాకులా చేతులు కట్టుకు నిలబడి పోయింది.

నానీగాడు కొన్నింటిని మనసు మీదకు ఎత్తుకున్నాడేమో నడవలేక భారంగా అడుగులు వేసాడు.

అలా వీధిలోకి నడిచాం.

వీధి కాదు కదా.. అరుగుల మీదా అలికిడి లేదు. తలుపులు సగం తెరిచీ తెరవక ఉన్నాయి. ఎక్కువగా మూసే వున్నాయి. ఇల్లు ఇల్లులా లేవు. పుట్టల్లా వున్నాయి. ఎక్కువగా మూసే వున్నాయి. మనుషులెక్కడో లోపల లోపల వుండీ లేనట్లుగా వున్నారు. పిసరంత పిట్ట అలికిడి

కోసం నాలుగు వీధులూ తొంగి చూసాము.

మనుషుల్లేని ఊరుని ఊహించడము ఎప్పుడూ వల్ల కాలేదు. వల్లకానిది అనుభవంలోకి వస్తే ఎంత అలజడలజడికి గురవుతామో అంత అలజడికీ గురయ్యాము. చిట్టితల్లి చిన్నగా వణకడం... ఆ వణుకులాటలో ఆమె చిన్న పెదాల మధ్య పై పళ్ళు వరస కింది పళ్ళ వరస టకటక కొట్టుకోవడం తెలుస్తోంది. తొలిసారిగా భయం వెన్నులో ప్రసరించడమంటే ఏమిటో అర్ధమయింది. చిట్టితల్లికి ధైర్యం చెప్పలేకపోయాను. చెప్పే సాహసం కూడా నాకు లేదు!?

అవును మరి... 'మా వూరు' అని వూరించి వూరించి వర్ణించి కతలు కతలుగా చెప్పేను. అమ్మా నాయినా - నాయినమ్మా తాతా - అమ్మమ్మా తాతల ఊసులూ - వూరి మట్టి బాసలూ - ఏటి గలగలల గుసగుసలూ వూరు వుమ్మడి కుటుంబంలా వుంటుందని చెప్పాను. వూరు కత ఒక రోజుతో తెల్లవారేదా... ఏళ్ళకి ఏళ్ళు సాగిన భారతమిది...

'ఊరు ఎందుకు వదిలేసావు?'

ఊర్లో ఉంటే చదువులో? ఉద్యోగాలో? సౌకర్యాలో? డెవలప్ కావడమో? - ఊర్లో వుంటే అందరిలాగే పాడయిపోతారంది అమ్మ. అది సత్యం!

అంటే... ఊరు ఎంత అందమయిందో అంత అనాకారి అయింది. వూరు ఎంత ఆత్మీయమైందో అంత అనవసరమయింది. అదెప్పుడు జ్ఞాపకాల సముద్రం. సముద్ర వొడ్డున సాయం సంధ్యల్లో సరదాగా తిరిగి రావచ్చు. అక్కడే ఇల్లు కట్టుకు నివసించమంటే... నో... నెవ్వర్...

నా ఆలోచనల్ని కాదు... రక్తమాంసాల గోడల్ని పెకలించుకుంటూ బుల్లి పిచ్చుక!... కిచ... కిచ... శబ్ధం... నానీగాడు బుల్లి పిచ్చుకని గీస్తున్నాడు. బహుశా మా ఒంటరితనాన్ని ఆ పిచ్చుకతో తరిమెయ్యడానికేమో?! చిట్టి తల్లి చిన్న కళ్ళు పెద్దవి చేస్తూ చూస్తోంది.



నానీగాడు సృష్టికర్తలా తీక్షణంగా వున్నాడు.

సృజన...

నానిగాడు పెన్సిల్‌తో నోటిని గియ్యగానే కిచ కిచమంటూ ఆ పిచ్చుక కువకువలు మొదలు పెట్టింది. రెక్కలు గియ్యగానే గీచిన రెక్కలు టపటపమంటూ ప్రాణమొచ్చి కొట్టుకున్నాయి. పొట్ట గీస్తుంటే పొదివి పట్టుకోమన్నట్లు వొదిగిపోయింది. తోక గియ్యగానే సిగ్గొచ్చి లోపలికి ముడుచుకొంది. కన్ను గీస్తూ - పెన్సిల్‌ని చెక్కబోతే నాని చేతివేలు తెగింది. రక్తపు చుక్కలు బొట బొటా... చిమ్మితే... గీసిన కంటికి గుడ్డుగా అతికాడు. దాని కళ్ళు ఎర్రబడ్డాయి.

'ఎర్రకళ్ళ పిచ్చుక' అంది ఉత్కంఠ ఆపుకోలేని పిచ్చితల్లి.

అంతలోనే ఆ పిచ్చుక ఎగిరి గాల్లోకి లేచి నానిగాడి చుట్టూ ప్రదక్షిణ చేసింది. ఆ తర్వాత చిట్టితల్లి భుజం మీద వాలింది. చిట్టితల్లి పులకరించిపోతూనే ఊరు గురించి చెప్పమని పిచ్చుకని అడిగింది.

ఎర్రకళ్ళ పిచ్చుక ఎగిరి వాసాముపై వాలింది. అది అలికిడి చేస్తూ అరిచింది. బుల్లి పిచ్చుకలన్నీ బుడబుడమంటూ ఎట్నుంచి వచ్చాయో గాని అన్నీ ఒక్క చోట చేరాయి. ఆ గుంపులో ఎర్రకళ్ళ పిచ్చుక కలగలిసిపోయింది. బహుశా ఊరి గురించే మాట్లాడుతూ వుండి వుంటుందని చిట్టితల్లి గ్రహించిన విషయాన్ని నానీకి చెపుతోంది.

వాటి కిలకిలలు వింటూ తన్మయంగా కళ్ళు మూసుకున్నారు పిల్లలు. ఇంతలో ఎక్కడో ఏదో శబ్దం... పిచ్చుకలన్నీ పారిపోయాయి. ఎర్రకళ్ళ పిచ్చుక ఎగిరి వచ్చింది. ఏదో చెప్పాలని నోరు తెరిచింది. వినవస్తున్న శబ్దం ఎర్రకళ్ళ పిచ్చుక గొంతుకని మూసేసింది...కిచ కిచ శబ్దమూ లేదు. దాని కళ్ళలోలోంచి రొండు నెత్తుటి చుక్కలు... నానీ చిట్టితల్లీ చెరో కన్నూ తుడవబోతే చేతుల కంటిన నెత్తుటి మరకలు..

ఎర్రకళ్ళ పిచ్చుక కళ్ళలోని భావాన్ని చదవలేక పోయాము. బిత్తరచూపులు అర్థమయినాయి. ఎందుకో తెలిసింది కాదు... ఎంత నిమిరినా దాని వణుకు తగ్గింది కాదు.. అంతలోనే అది గాల్లోకి లేచింది. వీధుల మలుపుల వరకూ తేలియాడి రెండుమార్లు తిరిగి వచ్చింది. మూడో మారు వెళ్ళిన పిచ్చుక తిరిగి రాలేదు?

పిచ్చుక కోసం కళ్ళు తిప్పకుండా రెప్ప వేయకుండా చూసాము. వెళ్ళిన పిచ్చుక తిరిగి రాలేదు.

'ఎర్రకళ్ళ పిచ్చుక' అంటూ చిట్టితల్లి కళ్ళు పులుముకుని ఏడుస్తోంది. నానిగాడూ వాడి రంగుల పెన్సిలూ దుఃఖం ఆపలేక తడిచి ముద్దయినాయి. నా కళ్ళు తడవలేదు. కాళ్ళూ కదలలేదు. వీధి మలుపు వరకు పోయి చూసి వద్దామన్న చొరవా తెగువా నాకు లేదు...

పిల్లలు వద్దన్నా వినకుండా వీధి మలుపులోకి పరుగు తీసారు. నేను వారి వెంట పడ్డాను ఆపుదామని. అందకుండా పరుగెడుతున్నారు. ఒక చోట ఆపకుండానే ఆగిపోయారు. కుప్ప కూలినట్టు మట్టిలో కూర్చుండి పోయారు. వాళ్ళ చేతుల్లో ఎర్రకళ్ళ పిచ్చుక. దాని రెక్క మీద బూటుకాలి ముద్ర. తెల్లని వీపు మీద కాల్చి పెట్టినట్టు లారీ గుర్తు... దాని కళ్ళ గుడ్లు కరిగిపోయినట్టు ఎర్రని నెత్తురు నేలన ఇంకిపోతూ వుంది. కొన కొన ప్రాణం చల్లారిపోతున్నట్టు అప్పటికే ఎగురుతూ వున్న దాని ఈకలు దిక్కులేనివిగా అటూ ఇటూ తిరిగి... దుఃఖం పట్టలేనట్లు నేలమీద పడి పొర్లుతున్నాయి. చిట్టితల్లి పిచ్చుక ఈకను తీసి పదిలంగా ఊరు గురించి రాసుకుందామని తెచ్చిన నోటు బుక్కులో దాచుకుంది. నానిగాడు కూచున్న చోటు నుండి లేవలేదు.

పిల్లల్ని అత్యవసరంగా అక్కడ్నుంచి బలవంతాన ఈడ్చుకుపోయాను. ఉరుములూ మెరుపులూ తేలిపోయాయేమో... ఓ ముసలవ్వ అరుగు మీద కొచ్చి కూర్చుంది. పాలు గారే చంటాడు విరిగిన కుక్కి మంచం పట్టుకుని ఎవ్వరూ లేని అనాధలా చూస్తున్నాడు. నాలుగిళ్ళవతల ఓ ముసలాడు చుట్టపీకని వెలుగు లేని కళ్ళతో వెలిగించుకుంటూ... అక్కడక్కడా ఆడవాళ్ళు... వేరే గ్రహం మీద దిగినట్టుగా వుంది. ఎవ్వరూ కళ్ళలో కళ్ళు కలపడం లేదు. కలిపినా పలుకరింపు లేదు. సంభాషణ లేదు.

మేం దారి తప్పినట్లే వున్నాము.

ఊరుని గురించి పుస్తకాల్లో చూసుకోవచ్చు అనుకున్నాను. అదే అన్నాను. ఊరంతా ఒక్కలానే వుంది... ఇది వూరు కాదు, వల్లకాడు అని అనలేకపోయాను. నాకున్న సంస్కారంతో సర్దుకున్నాను.

పిల్లలు నాతో సర్దుకు పోలేక పోయారు.

'నువ్వు చెప్పావేఁ అలాంటి వూరు నాకు కావాలి. చూపించవూ?' చిట్టితల్లి ఆశగా అడిగింది.

నేను చూపించలేనన్నట్లుగా చులకనగా కాకపోయినా నిష్ఠూరంగా చూసాడు నానిగాడు. చిట్టితల్లి కళ్ళలోకి చూసి ఏమనుకున్నాడో ఏమో... తన పెన్సిల్‌ని అందుకున్నాడు. దానిని కొన దేల్చాడు. అప్పటికే చిట్టితల్లి డ్రాయింగ్ షీట్ పరిచి పట్టుకుంది. నానిగాడు తను ఎరికలో వుంచుకున్నది గీస్తున్నాడు. ఊరు విస్తరిస్తోంది...

**'నానీ... నాకు మనుషుల్లేని ఊరిని చూస్తే భయమేస్తోందిరా...' చిట్టితల్లి ఆ మాట అంటున్నప్పుడు ఆమె గొంతు వణికింది. నానిగాడు చిట్టితల్లి కళ్ళలో ఎర్రకళ్ళ పిచ్చుక కళ్ళని చూసాడు!**

"నాకు ఊరినిండా జనం కావాలి

నాకు ఇంటి నిండా జనం కావాలి....'

చిట్టితల్లి మనసు పట్టలేక అరచింది. నానిగాడి చేతులు చరచరా కదులుతున్నాయి. పెన్సిల్ బరబర మంటోంది. కాగితం మెత్తని తన దేహాన్ని ఒత్తి అద్దికగా అందించింది.

ఊరి నిండా జనం...

జనమే ఊరు...



చిట్టితల్లి కళ్ళలో ఆనందం. ముసలమ్మ పసిపిల్లలా గెంతుతోంది. తాతయ్య కర్ర పారేసి మరీ నడిచి... ఆహఁ పరుగు తీస్తున్నాడు. ఆడవాళ్ళు అంగడిలోకి వచ్చారు పసి పిల్లల కళ్ళలో బెరుకు లేదు, మెరుపు ఒంటిగా ఎవ్వరూ లేరు. మేమూ లేము!? ఇప్పుడు ఊరు నిండా జనం.. జనం.. జనం..

ఇప్పుడు ఊర్లో అన్ని వయసుల వాళ్ళూ వున్నారు. మొలతాడు కట్టిన మగవాళ్ళు కొందరు మిగిలారు. కొందరు వేస్తున్నప్పుడే చెరిగిపోయారు. పెన్సిల్ రాయక, గీత పడక కొన్ని ఇల్లు ఖాళీగానే వుండిపోయాయి. మొత్తానికి ఊరు సందడిగా వుంది సంతోషంగా వుంది. కళగా వుంది!

చిట్టితల్లి ముఖంలో ఆనందాన్ని అందుకున్నాడు నానీగాడు నాకూ కొంత ధైర్యం వచ్చింది. ఊళ్ళో కొచ్చాము.

ఓ ఇంటి ముందు జనం గుమిగూడి ఉన్నారు. పిల్లలు ఉత్సాహంగా ఉరకలు వేస్తూ పరిగెత్తారు. నేనూ గుంపుని ఛేదించుకుంటూ వెళ్ళి చూసాను. ఊయల కాదు, వూగుతున్నది పసివాడూ కాదు. ఉరితాడుకు ఓ పెద్దమనిషి... చిన్నరైతు వేలాడుతూ... భార్యాబిడ్డలు కాబోలు గగ్గోలు పెడుతున్నారు. దించిన శవం పై పడి ఏడుస్తున్నారు.

చిట్టితల్లి కళ్ళు చిట్లి పోతున్నట్టే వున్నాయి. ఎర్రకళ్ళ పిచ్చుకే చచ్చిపోతూ చూసిన చూపు వెంటాడుతోంది...

ఇలాంటివి చూడకూడదన్నట్టు... పిల్లల్ని తీసుకు పొలాల్లోకి చల్ల బడదామని తీసుకు వెళ్ళాను. పొలంలో ఎవరో పెరుగన్నం తింటున్నారు. పిల్లా పాపలతోటి...

ఆ దృశ్యం చిట్టికి నచ్చినట్టే ఉంది. అలాగే నిలబడిపోయింది. నానిగాడూ చూస్తున్నాడు. నేను నాకున్న జ్ఞాపకాల 'సేని కుండ' దించుదామని అనుకున్నాను. దించకుండానే కుండ బద్దలయింది. నురగలు కక్కుకుంది. ఒకటి కాదు... రెండు కాదు... ఇంటిల్లిపాదీ... పురుగన్నమే పెరుగన్నమయి... కాళ్ళూ చేతులు తన్నుకుంటూ.. కొట్లాడి కొట్లాడి... చల్లబడ్డారు.

'ఊరొద్దు...' పిల్లలు కాదు, నేనే అన్నాను.

పిల్లలు నా వెంట అచేతనంగా నడిచారు.... గొంతెండి పోతోంది. బోరు దగ్గర బోరుమని ఏడుస్తూ ఎద పొసుకుంటూ రైతు. కరెంటులాగే కాలుతున్న కుర్రాళ్ళు... చల్ల బరుస్తున్న పెద్దలు... పవర్ తీసేస్తూ ప్రభుత్వం... వాలిపోతూ పంటచేను...

'దాహం.. దాహం' చిట్టితల్లి గొంతు ఆర్చుకుపోయి వేలాడిపోతూ వుంది. నానిగాడికీ అలాగే వుంది.

నానిగాడు చినుకుల బొమ్మలు వేద్దామనుకొని చేతివంక చూసుకున్నాడు. చేతిలో పెన్సిల్ లేదు. అదెప్పుడో అరిగిపోయింది. కరిగి మాయ మయిపోయింది... ప్చ్....

ఊరు ఎడారిలా వుంది...

నానిగాడు తన బొమ్మ గీసిన ఊరుని గురుతు తెచ్చుకున్నాడు... కళ్ళ ముందుకి. కాదు, నిజంగానే చాలామంది ఆడవాళ్ళు కడవలు పట్టుకు కోసెళ్ళు కోసెళ్ళు నడిచి నీళ్ళకోసం వెళుతున్నారు.

వాళ్ళను నీళ్ళు అడగటమంటే వాళ్ళ ప్రాణాలని అడగడమే! నోరు రాలేదు. మాట లేకపోయినా మనసు కనుగొన్నట్లు ఓ నడివయసు స్త్రీ మా దోసిళ్ళలో నీళ్ళు పోసి మా గొంతులు తడిపింది.

ఏమి బదులివ్వలేక కృతజ్ఞతగా చూసాము.

నీళ్ళతో పోయిన ప్రాణం తిరిగొచ్చిందేమో పిల్లలు మళ్ళీ ఊళ్ళోకి నడిచారు. ఊరును వెతక్కుంటూ ఇంత దూరం ఎలాగూ వచ్చాం, చూసే పోదామని నాకు నేను సర్ది చెప్పుకున్నాను.

మరో నిండు కుండ ఎదురయింది. మట్టి కుండ కాదు. మట్టిమనిషి. ఒట్టి మనిషి కాదు, నెలలు నిండిన మనిషి భారంగా అడుగులు వేస్తూ... ఆమె చుట్టూరా అమ్మలక్కలు. మగ మనుషులు సరుగులు తీస్తున్నారు. ఎవరో బండి పూస్తున్నారు... ఎడ్లను తోలుకొచ్చి-

నిండు కుండ నేలన పడింది. పగిలి పోతుందన్నట్టు అంతా ఆత్రం పడ్డారు. మోయలేని భారం దించుకోవాలన్నట్టు నిండుకుండ పెనుగులాడుతోంది. పిచ్చి పట్టినట్టు రోధిస్తోంది.

'హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళండి... అంబులెన్స్‌కు ఫోన్ చేయండి...' చిట్టిది పెద్ద ఆరిందాలా అర్థం చేసుకుంది. ఆ గోసలో చిట్టి మాట ఎవరికీ వినిపించినట్టు లెదు. కాని జవాబు వచ్చింది. ఎవరో 'ఈ వూర్లో

ఒక ఆసుపత్రా... ఇక్కడ మనుషులొక మనుషులా?' అంటున్నారు. మరెవరో ఏలిన వాళ్ళను తిడుతున్నారు. నిండుకుండని తొనక నీయవద్దని భగవంతున్ని కోరి ఆమెని దీవిస్తున్నారు. వూరికి వున్న ఒక్కగానొక్క ఏయన్నెమ్' డ్యూటీకి రాలేదు, పట్నంలో ఆమె కాపురం పదిలంగా వుందని దెప్పి పొడుస్తున్నారు ఇంకెవరో. పొద్దు పొద్దుబోయింది.

నాటు బండిలో గడ్డి పరిచి నిండుకుండను తీసుకుపోతున్నారు. గతుకుల మట్టి రోడ్డుని ఎన్ని బళ్ళు ఇలా నడిచీ నలిగీ నిర్మించాలో నాకయితే అర్థం కాలేద. రోడ్లు లేవు. దీపాలు లేవు. చంద్రుడు కూడా సగం తెగిపోయి పీలికలా బెండు పడి వున్నాడు. ఒళ్ళు చేయడానికి కొన్ని రోజులు పడతాయి గావాల. ఒళ్ళు చేసినా తరుగూ పెరుగుల గుడ్డి దీపమది...

ఏ లాంతర్ల లంగరు వేసినా వెయ్యకపోయినా ఆ రాత్రిని దాటి పగటి ఒడ్డును చేరాం.

మళ్ళీ మా అన్వేషణ మొదలయ్యింది...

'ఇవాళైనా నాకు మన పారాల్లోని ఊరు కనిపిస్తుందా? తప్పిపోయిన లేగదూడ తల్లిని చేరుకోవాలన్నట్లుగా వుంది చిట్టితల్లి మాట.

చిట్టీ పొట్టీ పాపలు పలకలు పట్టుకు వెళుతుంటే ముచ్చటగా వారి వెంట పడ్డాం. వాళ్ళకు సరైన దుస్తులు లేకపోవడం. టై... బెల్టు... ఇంకా బూట్లు లేకపోవడం, టిఫిన్ బాక్స్... బేగ్ ఏమీ లేకపోవడం ఎంతో ఆశ్చర్యానికి గురి చేసినట్టే వుంది. చిట్టితల్లి చిత్రంగా చూస్తోంది. నాని గాడూ అలానే వున్నాడు.



తెరుకోకముందే పాఠశాల్లోకి వచ్చేసాం. ఇదే పాఠశాల అని చెప్పిన వరకూ నమ్మలేదు. చెప్పినా నమ్మలేదు. పాఠశాలో పశువుసాలో లోపల వుండే ప్రాణుల్ని బట్టే చెప్పాలి. కొత్తగా కట్టిన రొండే గదులు... వరండా చెట్టు కిందా...! నా ఎండాకాలం చదువులు గుర్తుకు వచ్చాయి. పల్లెలు మారలేదన్న ఇలాంటి విషయాల్లో జ్ఞాపకాలు ప్రెస్సుగా వున్నాయి.

ఐదువందల కోట్ల రూపాయలతో ప్రెస్టేజియస్‌గా హైటెక్ సిటీలో నెలకొల్పిన బిజినెస్ స్కూలు గురించి ఇది వరకే మా ఇంట్లో చర్చ జరిగింది. ఆ స్కూలు గురించి వార్తలూ వచ్చాయి. ఆ స్కూలు పెయింటింగ్ గీయాలనుకున్నాడు కూడా నానీ. అందులో నువ్వూ నేనూ చదువుకోవచ్చా?' అమాయకంగా అడిగింది చిట్టితల్లి. నాకొచ్చిన నవ్వు తనది పిచ్చి ప్రశ్నని కొట్టి పారేయడంతో 'అది ఎవరి కోసమో అయితే మనకెందుకు?' నా గర్వాన్ని చిన్న ప్రశ్నతో చిత్తు చేసి ఏమి ఎరగునట్టు వెళ్ళిపోయింది, ఆ మర్నాడు నుంచి మళ్ళా ఎప్పుడూ ఆ స్కూలు గురించి మాట్లాడింది లేదు.

సూరీడు నడినెత్తి కొచ్చాడు. ఇంకా స్కూలు మాష్టారు మాత్రం రాలేదు. చదువులు చాలనట్టు తల్లిదండ్రులు తమ తమ పిల్లల్ని పనులకు పిలుచుకు పోతున్నారు. మంది పల్చబడ్డది...

పక్క వూరులో బడి ఎత్తేసినట్టుగా... పిల్లలు లేరని మనూరి బడి బంద్ చెయ్యగలరు... పిల్లల్ని వుంచమని ఎవరో ముసలాయన కేక గాల్లో కలిసి పోయింది.

'ఒక టీచరు పోస్టు ఖాళీ. ఒక టీచరీ మధ్యనే రిటైరయ్యేడు. వున్న ఒక్క టీచరూ పట్నం నుంచి ఒళ్ళలిసిపోయేలా రోజూ యేం తిరుగుతాడు? అందుకే స్కూలుకి సెలవు. పిల్లలు పనులకి సెలవు. మాష్టార్ల కొలువే కొలువు.. అదృష్టమంటే గవర్నమెంటోడి ఉద్యోగంలోనే వుంది... ఉస్సురమన్నాడొక ఆసామి.

'పుస్తకాల్లో ఇలా వుండదుగా?!' చిట్టి బుర్రకు చింత తీరలేదు. నానిగాడు 'ఈసారి డ్రాయింగ్ పోటీల్లో ఇలాంటి స్కూల్‌నే వెయ్యాలి' అన్నాడు. కాని ఆ బొమ్మ దిగువున స్కూలని రాయాలి' చెప్పింది చిట్టితల్లి. 'విలేజ్ స్కూల్' కూడ బలుక్కున్నాడు నానిగాడు.

బడి పిల్లలందరూ వెళ్ళిపోయాక మాష్టారొచ్చారు. మేం మిగిలాం. మీరు..?' అడగబోయి నన్ను గుర్తు పట్టాడు మాష్టారు. అప్పుడెప్పుడో నిరుద్యోగ సంఘీభావ కమిటీ సభ్యులుగా కలుసుకున్న జ్ఞాపకం. గుర్తు పట్టేడు. అడక్కముందే 'అప్పటి ఉద్యమాలు ఇప్పటికీ కొనసాగుతున్నాయి. నాడు నిరుద్యోగిగా... నేడు ఉద్యోగిగా' అంటూ తమ టీచర్స్ డిమాండ్లు నన్ను గవర్నమెంటుని చేసి వినిపించాడు. ఆఖర్లో తన ఇంక్రిమెంటు గురించి కూడా చెప్పుకున్నాడు.

చిట్టి ఎందుకో మావంక అసహ్యంగా చూస్తోంది.

మాష్టారు అర్థం చేసుకున్నట్టే వున్నారు. ఈలోపల ఎవరో 'మాష్టారొచ్చేసారు... రాత్రి బడికి' దూరంగా అనుకుంటూ వెళ్ళినా దగ్గరగా వినిపించింది. ఇది 'పనిష్‌మెంటు ప్లేసు'గా నన్ను ట్రాన్స్ఫర్ చేసారు. ఎడ్యుకేషనల్ ఆఫీసరు తన కేస్టు వాళ్ళని రక్షిస్తూ - తనని భక్షిస్తున్నాడని వివరాలు చెప్పుకున్నాడు మాష్టారు.

అవును... ఇక్కడ పని చేయడం పనిష్‌మెంట్! ఇది పనిష్‌మెంట్ ప్లేసు ప్రభుత్వమే గుర్తించింది! శిక్షించడానికో... క్రమశిక్షణలో పెట్టడానికో మాత్రమే ఇక్కడ ఏ శాఖలో నయినా ఎవర్నయినా నియమిస్తుంది. మరి ఇక్కడ ప్రజలకో? ఎప్పుడూ పనిష్‌మెంట్! ఊరంటే పనిష్‌మెంట్...! పిల్లలకి అలా చెప్పడం ఎందుకో నాకు ఇష్టం కాలేదు, పిల్లలు అంగీకరించరనేనా?

మాష్టారు పిల్లల పేర్లు అడుగుతున్నారు, వివరాలు అడుగుతున్నారు వారి అయిష్టత వాళ్ళని నోరు విప్పనీయకపోతే - సిగ్గు పడుతున్నారని ఆ మాష్టారితో కలిసి నేనూ సరి పెట్టుకున్నాను.

చిట్టి తల్లీ నానీ కూడబలుక్కున్నట్టు ఆరోజంతా నాతో ఏమీ మాట్లాడలేదు. నేను రొండు మూడు దఫాలు ప్రయత్నించి భంగపడ్డాను. ఎర్రకళ్ళ బుల్లి పిచ్చుక ఈకని నోట్‌బుక్ లోంచి తీసి దానితో వూసులాడుకున్నారు. వాళ్ళకెందుకో దుఃఖంగా వున్నట్టు వేళ్ళాడిన బుగ్గలు బుంగలయి చెపుతున్నాయి.

నేను ఏదయినా మాట్లాడమన్నాను.

నానీ చిట్టీ ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకున్నారు. మొదట చిట్టి

తన వంతు మాటగా ప్రశ్న వేసింది. 'మాకు అన్నమయినా అవసరమయినా ఎవరు చూస్తారు?' పిల్ల ప్రశ్నలనుకొని నవ్వి 'అమ్మ నాన్నలే' సింపుల్‌గా చెప్పేను.

'మేం తప్పు చేస్తే ఎవరు దండిస్తారు?' నానీ గాడి ప్రశ్నకు - రెండు ప్రశ్నలకు సమాధానం ఒకటేనన్నట్టు 'తల్లిదండ్రులే' అన్నాను అంతే సింపుల్‌గా.

'మరి మనందరికి తల్లిదండ్రులెవరు?' ఇద్దరిదీ ఒకే గొంతు.

ఒక్క క్షణం తడబడ్డా సులువుగా 'ఆ భగవంతుడు'... మీద భారం వేసి అదే చెప్పాను.

వాళ్ళ చూపుల్లోని తీక్షణత నన్ను సీరియస్‌గా వుండమని, మాట్లాడమని హెచ్చరిస్తున్నాయి. ఆలోచనలో పడ్డాను. 'ఆలనా-పాలనా' చూసేది ఎవరని పదే పదే ప్రశ్నించుకున్నాను. ఆలనా-పాలనా... ఆలనా-పాలనా... పదే పదే ఉచ్చరించేసరికి ఆలనేమోగాని, 'పాలన' చూస్తున్నదెవరో - చేస్తున్నదెవరో - వాళ్ళు తల్లిదండ్రుల్లా ఎలా వుండాలో... వ్యవహరించాలో... అలా వున్నారో... లేదో... లేనప్పుడు ప్రజలేం చేస్తారో... ఏం చేస్తే యేం జరుగుతోందో...

ఊరిని చూడబోతే ఉరి పడినట్టే వుంది. పిల్లలకు నేను జవాబుదారీ కాదలచుకోలేదు. అలా అయితే నా అస్తిత్వమే ఆవిరయిపోయేట్టుగా వుంది. అందుకే పిల్లల మీద బలప్రయోగం చేస్తూ - బరబరా ఈడ్చుకుపోయాను! మొండికేస్తే చెయ్యి చేసుకున్నాను.



పిల్లల పాలన చూస్తున్నప్పుడూ నేనూ గవర్నమెంటునవుతాను గాని మాన్నానా పిల్లలు పెడితే తినాలి, పెట్టకపోతే పడుండాలి! అసలు పిల్లలెందుకు ఇలాగయిపోతున్నారు?

ఊరు ఉడుకుతున్నట్టే వుంది.

ఊర్లోని ప్రజలూ వుడుకుతున్నారు. అందుకు ఎర్రకళ్ళ పిచ్చుక సాక్ష్యం. దాని కళ్ళే సజీవ సాక్ష్యం!

పిల్లలు అదుపు తప్పుతున్నారు.

ప్రజలు అదుపు తప్పుతున్నారు.

ఏలిన వాళ్ళు గూఢచారుల్ని పంపేరు. ప్రజల్ని పరీక్ష చేసేరు. ప్రజల నాడి చూసేరు. వేడి చూసారు. వైద్యుల్లా చేయి పట్టుకున్న మనిషికే కాక, వాడి అబ్బేడు వంశాల చరిత్రను శోధించారు. మట్టి వాసనని పసి గట్టారు. ప్రజల పాదాల కంటిన పరమాణువుల్ని తీసి పరీక్షకు పంపేరు.

ఫలితాలొచ్చాయి. ప్రజల మీద చేసిన పరిశోధనల వల్ల ఒక కొత్త జీవిత సత్యాన్ని కనుగొన్నారు?! శాస్త్రవేత్తలకు అందని అంశాల్ని అందుకున్నారు.

యాభై నాలుగేళ్ళగా అనేక ఋతువుల్ని చూసిన జనం ఇంకా కొత్త ఋతువులకు అలవాటు పడినట్టు లేరు. పడరు? ఋతువు ఋతువుకీ ఆశ పడీ భంగపడీ యుద్ధం చేస్తారు. ఓడిపోతారు. వెనక్కి తగ్గుతారు. మళ్ళీ ముందుకు వస్తారు. తిరుగుబాటు చేస్తారు. ఉద్యమాలు తీస్తారు. ప్రాణాలు వదిలేస్తారు. త్యాగాలంటారు. ఈ మనుషులు ప్రశాంతంగా శాంతియుతంగా వుండరు, వుండలేరు. అందువల్లనే ఏ ఋతువులో నైనా శాంతి భద్రతల సాగు కోసం రక్షక భటులు ప్రధాన బాధ్యత తీసుకోవలసి వస్తోంది....

శాంతి భద్రతల సమస్యల్లో భాగంగా ప్రజలకు స్పందన నేర్పాలి... చైతన్యం పోయాలి.. తిరుగుబాటు చేర్పాలి... ఉద్యమాలు చేయించారు... ప్రజలకు ఏదో ఒక ప్రోగ్రామింగ్ ఇవ్వడం వల్ల చల్లబడతారు. వాళ్ళలోని రసాయనిక చర్యలకు అదుపు వస్తుంది. శాంత పడతారు. రాజ్యం సుభిక్షమవుతుంది.

దేశభక్తి, దైవభక్తి ప్రోగ్రాములు నిరంత రాయమైనవి. వాటికెప్పుడూ సీజనల్ డిమాండు వుంటోంది. ఇప్పటికే ఆ పనిలో ప్రజలున్నారు వుండకుండా పోతారు... పోనీ..

ఇప్పుడు ప్రోగ్రామ్ ఊరికే వూరికిచ్చారు!

ఊరందుకుంది!

ఊపందుకుంది!

కట్టేసిన ఊపిరితిత్తుల్ని స్వేచ్ఛగా వదిలేయడంతో ఆశల్ని శ్వాసించి ఆందోళనతో ఉరికి వస్తున్నారు జనం. ఉవ్వెత్తున లేస్తున్నారు జనం.

ఆ జనంలో నేనూ చిట్టీ నాని కలిసిపోయాం.. ప్రమాదం లేని ఉద్యమమైనా పాత అనుభవాలు నన్ను కలవనివ్వడం లేదు. ఏదో భయం. భయం లేదంటూ ఎగదోస్తున్న పోలీసులు...

ఊరు మారినా తీరు మారలేదు...

వందలాది ఊరులు బారులు తీరి వున్నాయి....

పోలీసులే ప్రోత్సహిస్తున్నారు. పోలీసులే వెనక వుండి శాంతి భద్రతల్లో భాగంగానే ధర్నాలూ... రాస్తారోకోలూ... నిరసన దీక్షలూ... నిరాహార దీక్షలూ... ప్రజా సమూహం ప్రవహిస్తున్నది...

నిలదీస్తున్నారు... నినదిస్తున్నారు.... ప్రజల్లో ప్రజాప్రతినిధులూ కలగలసి పోయారు. ఈ ఉద్యమంలో జెడ్‌పీటీసీలూ, ఎంపీటీసీలూ, రాజకీయ పార్టీ కార్యకర్తలూ.. పాలక ప్రతిపక్షాల తేడా లేదు.. ఏదైనా పోలీసులకే సాధ్యమని నిరూపితమయ్యేలా జనజీవన స్రవంతి. డ్వాక్రా గ్రూప్ మహిళలూ, స్వయం శక్తి బృందాలూ చురుకుగా చైతన్యవంతంగా కదిలిపోతున్నారు. మాజీలు (?), సారా కాంట్రాక్టర్లూ సకల జనావళి... తీర్థాంకని!

నానీ చిట్టీలకు ఎంతో కొంత అర్థమయింది. వాళ్ళూ ఆశగా అడుగులు వేస్తున్నారు. ఊరిదంతా ఒక దారయితే ఉలిపి కట్టెలా నేనెలాగ వుండగలను? నలుగురితో నారాయణ అంటూ నడిచాను.

'ఊరు బాగుపడుతుందా?'

'ఊరు దొరుకుతుందా?'

ఊరు ఉనికిని గురించిన అనేక ప్రశ్నలు... చిట్టీ నానీ గురించిన ఆశలతో అలుపు సొలుపూ లేకుండా నడుస్తున్నారు.

పంచాయితీ ఆఫీసుకు చేరారు. కొత్త రిబ్బను కత్తిరించిన పూదిరి తాళాలు తెరిచారు. ఉద్యోగులు లేని కుర్చీలకు స్నానాలు చెయించి

శుభ్రం చేసి పసుపు పూసి బొట్టు పెట్టి అమ్మోరు తల్లికి వేసినట్టు పూలదండ వేసారు. ఒక నివేదన పత్రం పెట్టారు. దండ వెట్టారు.

దండు కదిలింది... ఊరు దాటి... వాడ దాటి పట్నాలకు నగరాలకు పోతోంది. తిన్నగా ఇళ్ళకే వెళ్ళారు. దండవేసి దండ పెట్టారు. బొట్టు పెట్టారు. 'మా ఊరికి రండి' అన్నారు. సర్కారు సిబ్బందికి స్వాగతం' పలికారు. 'మా గ్రామం మీ స్నేహాన్ని కోరుతున్నది. మీరు జీతభత్యాలు పొందుతూ నగరాల్లో సుఖంగా జీవిస్తున్నారు. మరి మా గ్రామప్రజల మాటేమిటి? మీ విధుల మాటేమిటి?' నిలదీసారు.

గ్రామ ప్రజల మాట... సౌకర్యాల బాట తెలియక పోయినా విధులకు హాజరవుతున్నారు. వేతన శర్మ వంశీకులు. విధులకు హాజరవడం కాదు, మా గ్రామాల్లోనే నివసించాలి' బతుకు కొందరిదెలాగ?, అందరిదీ అంటూన్న జనతాండవం చూసి - పడగ దాచుకొని... తలకాయలు అటో ఇటో ఎటో ఆడించి అంగీకారం తెల్పారు.

జనంకి పని దొరికింది! కొందరికి ప్రజాసేవ చేసుకొనే అవకాశం లభించింది. లాభించింది.

'ఓరి నువ్వా...' పాత చుట్టం.. జనం రాలీలో కలిసినందుకేమో కొత్త బంధుత్వంతో అభినందించేడు. అతనొక రక్షక భటుడు కావడంతో చిట్టీ, నానీలు వెనక్కు తగ్గారు. నన్ను ఠాణాకు రమ్మన్నారు. పిల్లలు ఎర్రకళ్ళ పిచ్చుక దెబ్బతినడానికి ముందు బేల కళ్ళతో చూసినట్టు చూస్తున్నారు.



ఆ రక్షకుడు వెంట నడవక తప్పలేదు. అతను నాకు మావయ్య అవుతాడట. 'లంజకొడకా' అంటూ మాటి మాటికీ ఆత్మీయత ప్రదర్శించేడు. 'నీయమ్మ' అనబోతే 'మీకు చెల్లవుతుంది' అని నేను గుర్తు చేయడానికి కూడా భయపడ్డాను. నా భయాన్ని గౌరవంగా స్వీకరించాడేమో నన్ను మెచ్చుకోలుగా చూస్తూ లోపయికారీ విషయాలు కూడా దాపరికం లేకుండా మాట్లాడాడు.

'ప్రజల వద్దకు పాలన' అన్నాడు. 'ప్రజల వద్దకు పోలీసు'లన్నాడు. 'మా ఊరికి రండి' అన్నాడు. ఏమరుపాటుగా వున్నానేమో 'ఏ వూరికి'? అని అడిగి, నాలిక కరుచుకున్నాను. 'మావయ్యతో జోకులేస్తున్నావే... లంజికొడకా' ఆఖరి పదం తిట్టగానే నాకిన్నాళ్ళూ తెలుసు గాని, అది ఎంత అభినందనీయమో ఆ నోట్లో నాని బయట వడ్డాకే తెలుసుకున్నాను.

ప్రజల్లో స్పందన రావాలి. తిరుగుబాటు రావాలి. చైతన్యం రావాలి. విప్లవాత్మక మార్పులు ఊళ్ళలో తీసుకురావాలి. అందుకు పోరు బాట నడవాలి. యుద్ధం ప్రకటించాలి. కమీనిష్టుల్లో కెల్లా వీర కమీనిష్టుగా... నక్సలైటులాగ మాట్లాడేడు. మా చుట్టపు పోలీసోడు.

నా మనస్సులో వున్నది గ్రహించినట్టు.. ఆవలిస్తే అంగుట్లోంచి పేగులు మొత్తం లెక్క పెట్టినట్టు నా ఆలోచనల్ని గ్రహించేసాడు కాబోలు... ఇది ఒకప్పుడు నక్సలైటుల ప్రోగ్రామే... ఇప్పుడు మనం తీసుకున్నాం' అంటూ నన్నే కాదు, జాతి మొత్తాన్ని తనలో కలిపేసుకున్నాడు. ఇక ఏ కార్యక్రమమూ ఎవరికీ వదిలిపెట్టేది లేదన్నంత గర్వంగా ఆత్మవిశ్వాసంగా వున్నాడు. తుపాకీతోనయినా అమలు చేస్తామన్నట్టు మాటి మాటికీ తుపాకీని తడుముకున్నాడు. అంతే మాటిమాటికీ తమ 'కులపెద్ద'ని మెచ్చుకున్నాడు. కుర్రోడే' అన్నాడు. మల్లేశ్వరి దేశానికి పేరు తీసుకు వస్తే మా 'కులపెద్ద' మా కులానికే పేరు తీసుకొచ్చాడని మరోమారు పొగిడాడు.

నేనిక సెలవు పుచ్చుకుందామని లేవబోయాను. కుదిరింది కాదు. నా ముందు ఏవేవో దిన పత్రికలు తెచ్చి పడేసాడు. తమ కులపెద్ద గురించి ఇన్ని మంచి మాటలు రాసినందుకు మేధావులు ఎంతగా ఆనందపడుతున్నారో ఆ వ్యాసాలన్నీ చూపించాడు నాకు. చదువు రానట్టు చదివి వినిపించాడు. నేను మాటిమాటికీ లేస్తుంటే 'కడుపు నడుస్తోందా' అని 'ఏం తిన్నావ్' చమత్కారమాడాడు. నేను అడ్డంగా తలూపాను. కాదా మరిదేనికి లేస్తావు, పర్వాలేదు కూర్చో' నాది అంతా మర్యాదగానే తీసుకున్నాడు నేను భయపడ కూడదనేమో టోపీ, లాఠీ తీసి పక్కన పెట్టాడు.

చివరకు పిల్లలు నాతో ఊరు చూద్దామని వచ్చిన విషయం చెప్పాను, సెలవు తీసుకుందామని. నా మాట విన్నాడే గాని నా విజ్ఞాపన ఆలకించినట్టు లేదు. ఏవో నెంబర్లను పిలిచి ఆర్డరు వేసాడు. జీపు సిద్ధమయింది. తను కూర్చున్నాడు. నన్నూ ఎక్కమన్నాడు.. 'పిల్లలు..' గొణిగాను. అక్కడికే అన్నాడు. రోడ్డు మీద ఆపి చిట్టీని నానిని జీపెక్కమన్నాడు. 'వయసులో ఉన్న దానిలాగ పసిదాన్ని ఠాణాకి తీసుకురాకుండా బయటే నిలబెట్టావేం..' అన్నాడు నా దగ్గర సమాధానం లేదు.

నానీ చంటి ఎర్రకళ్ళ పిచ్చుకలై చూస్తున్నారు.

'మీరు ఎక్కడికి?...' తీసుకెళ్తున్నారనబోయి 'ఎక్కడ వుంటున్నారు..' అని సర్దుకొని 'ఈ ఊళ్ళో వుండడం లేదా?' ఏదో మాట్లాడాలని మాట్లాడాను.

'ఈ ఊర్లోనా..?' అని పగలబడి నవ్వి 'బతకమనేనా?' అని అడిగాడు ఊర్లో 'విడిది'గా ఒక ఇల్లు వుందన్నాడు. టౌన్లో 'ఫామిలీ' వుంచానన్నాడు. నా చూపుని ఏమని అర్థం చేసుకున్నాడో...' మాకు ఇరవై నాలుగ్గంటల ఉజ్జోగం.. ఎక్కడ వున్నా డ్యూటీలో వున్నట్టే'... నన్నాడు. నేను నిజమే నన్నట్టు చేతులు ఒద్దికగా కట్టుకున్నాను. నా మౌనానికి ఆయన మనసు చెదిరనట్టే వుంది. 'ఊర్లు ఊర్లులా వుంటే బాగున్ను... వల్లకాళ్ళులా వున్నాయి. వల్లకాడు కాపలాకి ఎక్కడుంటే ఏం?... అయినా పిల్లల చదువులూ... అవీ... కాంపెటేటీవ్ ఫీల్డులో... విలేజ్‌లో వుంటే ఎట్టా కుదురుతుంది? ... పోనీ వైద్యం, వసతులూ పక్కన పెట్టినా' అన్నాడు. నేను ఉలకలేదు, పలకలేదు. ఊర్లలో ఏవుంది? నాలుగెకరాలు వున్నా ఎవరికో కౌలుకిచ్చి ఇంతా అంతా గాల్లే టౌన్లలోకి షిఫ్టయిపోయారు...

జీపులో కూర్చుని డ్రైవ్ చేస్తున్న కానిస్టేబులూ వెనకాల కూర్చున్న కానిస్టేబులూ నోరు పడిపోయినట్లు తలలూపుతున్నారు. డిసిప్లెన్‌గా వున్నారు.

... అయినా ఇప్పుడదంతా నక్సలైట్ల ప్రోబ్లమ్ ఎక్కువగా వుంది.

రిస్కు తప్పించుకోవడానికి ఊర్లో వుంటే కాదు' అదే ఆఖరి మాటయినట్లు, ఆ మాటకు తిరుగులేనట్లు మౌనంగా... జీపు గడగడల శబ్దం మాత్రమే...

పోలీసంకుల్ మాటల్లోనయినా ఊరు దొరుకుతుందేమోనని ఉవ్విళ్ళూరుతూ కూర్చున్న చిట్టి ముఖంలో నిరాశ. నానిగాడికి తన బొమ్మల మీద తనకే నమ్మకం పోయినట్టుంది. ఊరు బొమ్మ సరిగా రూపు కట్టినట్టులేదు, ఏదో అందకుండా వున్నదాన్ని ఆలోచిస్తున్నట్టే వున్నాడు.

టౌను మొదల్లోనే ఓ బంగళా ముందు జీపాగింది. అయ్యగారి వెనక అందరం అణకువగా ఇంట్లోకి నడిచాం. ముందుగదిలో టీవీ ముందున్న సోఫాలో కూర్చున్నాం. కూల్ వాటరూ ఆ వెనకే మజ్జిగ వచ్చింది భోం చేసే వెళ్ళాలని ఆర్డరు వేసారు. లోపల పోలీసు కుర్రాళ్ళే వంటలు చేస్తున్నారు. అమ్మగారు లోపలెక్కడో వున్నట్టే వున్నారు.

ఒకరి ముఖాలొకరు ఎంతసేపు చూసుకుంటామన్నట్టుగ అతను టీవీ పెట్టాడు. ఆ ఛానలూ ఈ ఛానలూ మార్చి దద్దరిల్లిపోతున్న తేజా టీవి పెట్టారు. వాల్యూమ్ తగ్గించినా గొంతులు తగ్గలేదు.



అసెంబ్లీ కార్యక్రమాల లైవ్ వస్తోంది...

'ఈ లంజ కొళ్ళందరూ మనకి తెలుసు' అన్నాడు సిగరెట్టు ముట్టించి చొక్కా గుండీలు విప్పుతూ-

ఆ మాట నాకు బోధ పళ్ళేదు, నాకు ఉపయోగించినట్టు వాళ్ళకీ మంచిగానే ఉపయోగిస్తున్నాడేమో అని అనుకున్నా... అనుమానం తీరలేదు.

'ఒక్కోడు... ఒక్కో డెకాటీ లంజికొడుకు...' అందరి చరిత్రంతా విప్పేవాడే గాని, డ్రెస్సు విప్పేయడం వల్ల పులిని స్నానానికి రమ్మని కబురొచ్చి తీసుకువెళ్ళింది...

... అధ్యక్షా... ఇవాళ ఉద్యోగస్తులెవరూ ఊళ్ళలో వుండడం లేదు అధ్యక్షా... ప్రజలకు సేవ చేయడానికే మనమున్నామని మర్చిపోతున్నారధ్యక్షా... వాళ్ళ మీద యేం చర్య తీసుకుంటారో సెలవివ్వాలధ్యక్షా..'

ఊరు మమ్మల్ని యింకా వెంటాడుతోంది...

అక్కడయినా ఊరు కనిపిస్తుందేమోనని చిట్టితల్లి కన్నార్పకుండా చూస్తూ వింటోంది. నానిగాడు విసుగ్గా వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

'సిక్స్‌టెన్ జీవో అమలు జేస్తే ఎక్కడి వాళ్ళక్కడుంటారు...'

మధ్యలోనే మాట ఆగిపోయింది. కరెంటు పోయింది. పులి గుహలో వున్నట్టు వున్నామే గాని ఎవరమూ ఫ్రీగా లేము.

కరెంటు వచ్చింది.

పులిలా ఆయన కదలి వచ్చి పక్కనే కూర్చున్నారు. ఆయన పొట్ట మాత్రం ఆయన ఒడిలో కూర్చుంది.

'.... మా దగ్గర ఇన్ఫర్మేషనంతా వుంది. ఎవరెవరు ఏమిటి అనే రికార్డు వుంది. యాక్షన్ తీసుకొంటా. ఊర్లో ఏ ఉద్యోగి వుండకపోయినా వాళ్ళకి హౌస్ అలవెన్సు నిలిపేస్తాం. ఇంక్రిమెంట్లు బంద్ చేస్తాం. మిస్ కాండక్టుగా కూడా నమోదు చేసి ప్రమోషన్లు ఇవ్వకుండా చేస్తాం. ఇదంతా కాదు అధ్యక్షా... ఎవరైతే గ్రామ ప్రజలున్నారో... వారికి విజ్ఞప్తి చేసేదేమంటే.. మీరు నిలదియ్యండి.. సక్రమంగా ఉద్యోగం చేస్తే చేసుకోనివ్వండి.. లేదా... నేను మనవి చేసేదేమంటే.. సివియర్... ఫర్ యాక్షన్...'

ఆఫీసరు గారు అవతలి మాటను వినబడ నివ్వలేదు. పెద్ద గొంతుతో... 'ఎంతమంది లం... కొడుకులు ఎటెండయ్యారో చూసేవా?' గద్దించి నన్నే అడిగాడు ఆ సీరియస్‌నెస్ అందుకున్నట్టు నేనూ కెమేరా తిప్పుతున్నంత మేరా ఖాళీ సీట్లను చూసాను. చూస్తూనే వున్నాను...

'... ఒక్కో కొడుక్కి జీతం ఎంతనుకున్నావ్? ముప్పైవేలు... పదీ పాతికా కాదు ముప్పై వేలు... కంప్యూటర్లూ... వాటికి రాయితీలు... కార్లు అవి జాతీయాలు.. చాలక విదేశీయానాలు.. ఒక్క నా కొడుకు కానిస్టెన్సీలో వుండడు. ఊర్లో ఉండడు. చుట్టపు చూపుగా వస్తాడు. దెంగెస్తాడు... ఈ ... కొడుకులకి సెక్యురిటీ... హైటెక్ సిటీలో ఓల్డు న్యూ క్వార్టర్సూ... తిరిగి ఖజానా అంతా జీతభత్యాలకే ఖాళీ అయిపోతోందని గగ్గోలు...' సుదీర్ఘమైన ఉపన్యాసాలు... ఆ బూతులు... మీకేం చెపుతాను, పక్కనే పసి పిల్లలున్నారు.

నేను తల గంగిరెద్దులా ఆడిస్తూనే ఉన్నాను.

'మనం జీతం మీదయితే చచ్చిపోమూ... మా ఎకౌంట్సు లేకపోయినా పై రాబడులు వుంటాయి. తెరిచిన పుస్తకం.. ఇంక చెప్పాలా?'

వద్దన్నట్టు తలూపలేక పోయాను. నాకు జీతం నాతం లేదు, అసలు ఉద్యోగమే లేదు.. అనీ చెప్పలేక పోయాను.

అంతలోనే ఆయన టీవి బంద్ చేసి అసలు విషయాని కొచ్చినట్టున్నారు. భోజనాలకు పిలిస్తే వెళ్ళాం... ఊర్లో భోజనమయితే నోరు చచ్చిపోతుందనే ఇక్కడికి తీసుకొచ్చినట్టు చెప్పారు.

ఊరనగానే అదేదో ఉరుములా నానీ చిట్టీ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. వాళ్ళని నేను తప్ప ఎవరూ గమనిస్తున్నట్టు లేరు.

అన్నంలో కూరా... పచ్చడీ... పప్పు.. పెరుగూ.. ఒక్కొక్కటీ కలిపి చుట్టరికమూ కలిపాడు. మీ అమ్మానాయినా ఊర్లో వుండిపోవడం వల్ల... మన సంబంధాలు తెగిపోయాయి గాని ఒకరి కొకరం కావలసిన వాళ్ళమేనన్నాడు. ఊరన్నప్పుడు పిల్లలు అన్నం తింటూ పొలమారారు. ఆయనది సహజమన్నట్టు పట్టించుకోలేదు. మాట్లాడుతున్న విషయాన్ని ఆపలేదు. 'నువ్వయినా ఊరొదిలి బాగు పడ్డావ్... ఊర్లో ఉన్నవాళ్ళంతా ఉట్టికీ మట్టికీ కాకుండా పోయారు' అని నన్ను మెచ్చుకున్నాడు. ఊళ్ళో ఉన్నోళ్ళు నాశనం గాక ఏమవుతార్లే...' తీసి పారేసాడు.

పిల్లల కళ్ళల్లో నీళ్ళు... పొలమారడం వల్లో... దేనివల్లో నీళ్ళు తాగమని కళ్ళతో సైగ చేసాను. అందిందో.. లేదో... నీళ్ళయితే తాగలేదు ఆకలి పూర్తిగా తినకుండానే మందగిస్తోంది.

నేను అన్నం తినలేక పోవడం గ్రహించి 'ఎండాకాలం... తినబుద్ధి

వేయదు' అని అర్థం చేసుకున్నట్టు ఆత్మీయంగా మాట్లాడాడు. తినకపోతే వదిలేయమన్నాడు. పళ్ళ జ్యూస్ ఏది కావాలని అడిగాడు. ఊర్లో అన్నీ పండినా అక్కడ కొందామంటే ఒక్కటీ దొరకదు... అన్నట్టు హైదరాబాద్‌లో అన్ని పళ్ళూ దొరుకుతాయి' అంటూనే నేను ఎక్కడ వుంటున్నదీ అడిగారు.

చెప్పాను. అలా కాదన్నట్టు వినరంగా అడ్రసుల డెయిరీ యిచ్చి రాయమన్నాడు. కలతగానే రాసిచ్చాను.

... యేం లేదు.. నా ట్రాన్సుఫర్ కుదురుతుందో లేదో... అక్కడికి ఫామిలీని షిఫ్ట్ చేయడమో... మావాడ్ని కోచింగ్‌కు పెట్టడమో చేయాలి... లేదా మిత్రులెవరెవరో వున్నారు' చెపుతుంటే 'మా యింట్లో వుంటాడని అనలేకపోయాను. ఆ మాట మాట వరసకయినా అనవేమని నవ్వేసాడు.

'అంతకన్నానా... మాలాంటి వాళ్ళ ఇంట్లో...' నిర్జీవమైన నవ్వు నవ్వేను. పిల్లలు అప్పటికే కడుక్కొని బయల్దేరమన్నట్టు సిద్ధంగా నిలబడ్డారు. నేను శలవు తీసుకుంటున్నట్టు చేతులు జోడించాను. వస్తూ పోతూ ఉండమన్నాడు. ఊరికి రావడమయితే కష్టం, ఇక్కడికేమి?' అన్నాడు. జీపు డ్రైవర్ని పిలిచి బస్టాండులో దించి రమ్మన్నాడు. నేను భయానికి వద్దన్నాను. మొహమాటానికనుకొని దగ్గరుండి జీపెక్కించాడు.



జీపు బంగళాలోంచి బయట పడి రోడ్డు మీద పరుగెత్తుతోంది. నా భయం ప్రకంపనాల్ని ఆ డ్రైవర్ గమనించినట్టున్నాడు. 'ఇక్కడ వరవాలేద్సార్... ఊర్లోనయితే ఎక్కడ మందుపాతర పేలుతాదో... పైకే పోతామని భయపడటానికి...' అన్నాడు. నేను గడ్డ కట్టినట్టు నవ్వయినా నవ్వలేకపోయాను.

పిల్లలు నా ముఖమే చూస్తున్నారు. నేనూ వాళ్ళ ముఖమే చూస్తున్నాను. ఊరుని మోస్తూనే బస్టాండ్‌లో దిగాం. డ్రైవర్ ఎందుకో నవ్వుతూ వెళ్ళిపోయాడు.

'సిటీకి పోదాం' అన్నాను.

'ఊరు మీదుగానే పోవాలి కదా?' నానిగాడి మేపు నాలెడ్జికి తిరుగు లేదు. అందుకే అందరం బస్కెక్కాం. బస్సు దాదాపుగా నిండింది, కాని తియ్యలేదు. ఎవరో ఓ కుర్రాడు... వయసులో ఉన్నవాడే బస్సు ఎక్కుతున్నాడు, దిగుతున్నాడు. ఎవరో ముసలామె ఏడుస్తోంది.

ఆ మధ్యాహ్నం వేళ మాటలు వినిపిస్తున్నాయి.. నెమ్మదిగానైనా.

'నువ్వు ఊరికి పోవద్దుర కొడుక...'

దుఃఖం పైటు మాటున అదుముకోలేక పోతోంది. కన్నీళ్ళయితే కనబడనివ్వకూడదన్నట్టు ఒత్తుకుంటూ వున్నా ప్రయోజనం లేదు.

'నాకేం కాదమ్మా...' కుర్రాడు గుండె పెకలించుకొని పెకలించుకొని గొంతులోంచి ఒక మాట జార్చాడు.

'మమ్మల్ని అనాధల్ని చెయ్యకురా...'

'అమ్మా... నే చేసేది మేష్టారి ఉద్యోగమే...' అంతకంటే చెప్పడం ఆ కుర్రాడికి చేత కానట్టే వుంది.

'కొడుకా ఆ వూరొద్దు... నౌకరీ వద్దు' అంటూ మోగిన బస్సు హారను విని కొడుకుని మరింత గట్టిగా పట్టుకొని కదలనివ్వకుండా చేయాలని ప్రయత్నించింది. ఆ కుర్రాడు బలంగా విదిలించుకొని కదులుతున్న బస్సెక్కి వచ్చి, నా పక్కనే కూర్చున్నాడు.

ముసలిదాని ఏడుపు వెంట పడిందే గాని, అంటనివ్వకుండా బస్సు పరుగులు తీస్తోంది.

నేను ఏమీ జరగనట్టు మామూలుగానే వున్నాను. పిల్లలు మాత్రం నవ్వలేదు. అమ్మని ఎందుకు ఏడిపించావన్నట్టు. నేను కలుపుగోలుగా నవ్వాను. మాట కలిపాను.

తను... ఊర్లో టీచరట. ఆ ముసలామె అతని తల్లట. భార్యకు నెలలట. తల్లి దగ్గర టౌనులో వున్నదట. తను ఇన్నాళ్ళూ అప్ అండ్ డౌను చేసేవాడట. ఇప్పుడు ఇక మీదట ఊర్లోనే వుంటాడట.

తప్పదన్న కారణాలు ఎరిగినవే, కాని తల్లిడిల్లిన కారణాలు తెలీక నేను అయోమయంలో పడ్డాను. పరాయిదేశం పోతున్నట్టు ఆమె ఎందుకలా ఏడుస్తోందని అడగకుండా వుండలేకపోయాను.

ఆ టీచర్ నా కళ్ళలోకి చూసాడే కాని కారణాలు చెప్పలేదు.

'మీరయినా ఊరు చూపిస్తారా?' చిట్టితల్లి మళ్ళీ మొదటి కొచ్చింది.

మాష్టారు మాట్లాడుకుంటూ నవ్వాడు. ఆ నవ్వులో నమ్మకమున్నట్టే వుంది. నానిగాడు కూడా ఎలర్ట్ అయ్యాడు.

ఎవరో పరిచయస్థులు మాష్టార్ని విష్ చేసారు.

నే వెయ్యబోయే ప్రశ్న తెలుసుకున్నట్టుగా 'పిల్లలకు పాఠాలు చెప్పడం కన్నా ఆనందం ఏముంటుందండి' అన్నాడు. అని, 'మా ఉపాధ్యాయుల్లోనూ నానా జాతుల ఉపాధ్యాయులున్నార'న్నాడు. నాకర్థం కాలేదు. నా ముఖం చూసి నవ్వి చిట్ ఫండో చిల్లర వ్యాపారమో - ఇన్సూరెన్సులో - ఏదో ఒక వ్యాపకం... పాపం పల్లెలో ఎలా వుంటారన్నాడు? నవ్వుతూ..

తనెందుకు ఇంతవరకూ వుండలేదో మాత్రం చెప్పలేదు.

బస్సు మధ్యలో టీ టిఫిన్ల కోసం ఆపారు. టీచరుతో పాటు చిట్టీ నానీ దిగారు. మీరు కూర్చోండి భయం లేదన్నట్టు ధ్వనించే చూపుతో చూసాడు. వాళ్ళు వెళ్ళాక ఇందాక విష్ చేసినాయన్ను అడిగాను. 'టీచరు గారు మీకు తెలుసా?' అని ఆ అపరిచిత రైతు దండకమే చదివాడు...

'..ఎవరా? ఊరి తలలో నాలుక. బడిలోనూ ఇంటి దగ్గరా పాఠాలు చెప్పేవాడు. ఊరి కుపకారి. మా పెద్ద నేస్తం. సాలక సలాదారు. ఎవరికేనా? ఆఫీసుకు పిటీషను పెట్టాలన్నా బేంకు పారము నింపాలన్నా అతగానే వుండాల. ఉత్తరమొస్తే సదవాలన్నా... మనియార్డరు నింపాలన్నా.... అంతెందుకు నోటీసులొస్తే ఇప్పి సెప్పి మళ్ళీ ఆటికి జవాబులు యేం రాయాలో సలా చెప్పాడు. తనే రాసి పంపాడు. సర్కారుతో మారిన రూల్సు... ఇదిగిదని ఇవరించేవోడు... ఊళ్ళో చిన్న

చిన్న తగువులొస్తే అతనే కోర్టయేవాడు. తీర్పు చెప్పేవోడు. ఏ పంటకు ఏ చీడో... దానికే మందో చెప్పేవాడు. మొక్కకే కాదు మనిషికీ వైద్యం చేసేవాడు. అతగాడు గొప్ప సాహసకారి...'

ఆ టీచర్ వచ్చేసాడు, చిట్టీ నానీ అతనికి నేస్తాలయిపోయి నట్టున్నారు. ఏదో మాట్లాడుకుంటూ - నవ్వుకుంటూ - చెట్టాపట్టాలు వేసుకుంటూ చెరో చెయ్యి పట్టుకుంటూ వచ్చారు.

'అతగాడు బోలా శంకరుడు గాడు' అని దండకం చదివి నాయిన నోరు మూసుకున్నాడు.

ఊరికి పోయే దారి దొరికింది అన్నారు పిల్లలు.

నేను కొంత ఆశ్చర్యపోయినా - పిల్లల ఆనందం మాత్రం నాకూ వచ్చి చేరింది. ఆ ఆనందంలో అలసిన మనసుకు నిద్ర ముంచుకొచ్చింది.

తెలతెలకువన లేపితే మెలకువ వచ్చి బస్సు దిగాను. పిల్లలు రాత్రంతా నిద్ర పోయారో లేదో తెలీదు.. నన్ను పట్టించుకోకుండా ఆ టీచరుతో అడుగులేస్తున్నారు. నేను వెనక బడ్డాను. అది దారికాని దారి. నడవడం కష్టంగా వుంది... ఆగమన్నాను.



'ఊరు చూడాలంటే కష్టపడాలి' చిట్టితల్లి కంఠం కంచులా మోగుతోంది.

సూరీడు పెచ్చబడక ముందే మేం చేరాల్సిన చోటుకి చేరుకున్నాం పూరి పాకల మధ్య నడుస్తున్నాం...

వేం ముందుగా అతను నివాసముండబోయే గదికి చేరాం... ఆ గది పాతదే అయినా కొత్తగా వుంది. సున్నాలు వేసి వున్నాయి. ఇంటి ముందు ఫెన్సింగు .. అందులో పూల మొక్కలు... పెరట్లో ప్రత్యేకించి కొత్తగా కట్టిన బాత్‌రూమ్... లేవట్రీ.. దూరంగా నీళ్ళు మోసుకు వచ్చి కుండీలూ కడవలూ నింపుతున్నారు.

అంతా అప్పటికప్పుడే ఆ వూరి వాళ్ళు నిర్మిస్తున్నారు. 'శ్రమైక జీవన సౌందర్యం' మాటకు అక్షరాల అద్దం పడుతోంది.

ఒకటేమిటి... మనిషికి ఆధునిక జీవనంలో అవసరమయిన సమస్తమూ సమకూర్చడానికి సాయశక్తులా కష్టపడుతున్నారు, నిధులు లేనందుకు లోపమే కాని శ్రమ లోపం కాదు...

సకల సౌకర్యాలు చూసి నాకు కాంక్షత్యాలు గుర్తుకొచ్చాయి. తీర్చుకొని తేలిక పడ్డాను.

అంతా పూర్తి కానిచ్చి అద్దం తిరిగేడు టీచరు. ఈ సౌకర్యాలు మా ప్రభుత్వోద్యోగులకే కాదు, మీకు కావాలన్నాడు. ఇవాళ నుండి రేపు పోయే నేనుండడం కోసం కాదు, మా కోసం కాదు, మీరూ ఊర్లో ఎల్లకాలం వుండడానికి మీకు సౌకర్యాలు కాకపోయినా... కనీస అవసరాలు అందాలన్నాడు. ప్రాంతీయ అసమానతలు తగ్గితే ఊర్ల 'వెలివేత' పోతుంది అన్నాడు. ఈ ధర్నాలూ - రాస్తారోకోలూ - నిరసన దీక్షలూ - నిరాహార దీక్షలూ - మాకోసం కాక మీకోసం చేయండి! మీకోసం మీరు. మీ హక్కుల కోసం మీరు.. మీ ప్రాధమిక అవసరాల కోసం మీరు.. స్పందించండి...చైతన్యవంతులు కండి... తిరుగుబాటు చెయ్యండి... ఉద్యమించండి.. అప్పుడు మీ కనీస అవసరాలతో పాటు మా కనీస అవసరాలూ తీరుతాయి. అప్పుడు మీరు బతిమాలక్కరలేదు, బలవంతం చేయనక్కర్లేదు, ఊరు బాగు పడుతుంది... ఊరు ఊరవుతుంది...!

ఊరు.. అలాంటి వూరు కోసం వుగ్గబట్టుకు కూర్చున్న చిట్టితల్లి ఆ టీచరు వంక తదేకంగా చూసింది. నానిగాడు తన బొమ్మ గీయడానికి ఊరు దొరుకుతుందన్న ఆశతోనే చూస్తున్నాడు.

'నువ్వు చెప్పావే అలాంటి వూరు కావాలి మాకు' ఇద్దరూ కూడబలుక్కుని అన్నారు. ఆ టీచరు పిల్లల ఆశకూ ఆకాంక్షకూ అభినందన పూర్వకంగా చూసాడు.

జనమంతా ఊరు కోసం కొత్త ఉద్యమం చేపట్టారు. ఏలికల్నీ పాలకుల్నీ అడుగుతున్నారు. నిలదీస్తున్నారు. నిలబడుతున్నారు...

అంతా అల్లకల్లోలంగా వుంది.

పిల్లలకే కాదు, నాకూ భయం వేసింది.

'ఊరుని చూస్తామా?' ఆవేదనగా అడిగారు పిల్లలు.

'నేను కాకపోయినా... రేపు మీరు తప్పక చూస్తారు' టీచరు ధృడంగా చెప్పాడు. అప్పుడు అతని కళ్ళలోకి చూసాను. ఆశ్చర్యం.... అవి ఎర్రకళ్ళ బుల్లి పిచ్చుక కళ్ళే! నేను గుర్తు పట్టాను. పిల్లలు ఏనాడో గుర్తు పట్టినట్టు వాళ్ళ చెలిమిని చూస్తే అర్ధమయ్యింది.

చిట్టితల్లి ఊరు గురించి తన ఊహలు చెప్పింది!

నానిగాడు తన పెన్సిల్ గీసిన కతంతా చెప్పాడు. అలాంటి పెన్సిల్ దొరికితేనా?, కొత్త ఊరును గీద్దును అన్నాడు!

అతడు నవ్వి, తన రెండు అరచేతులూ ముందుకు చాచాడు. పదివేళ్ళు కావవి?! పది పెన్సిళ్ళు...! అవి సున్నితంగా సుకుమారంగా సృజనాత్మకంగా వున్నాయి వాటితో 'ఊరు'ని గీయొచ్చు.. నిజమైన ఊరుని కళ్ళముందు నిర్మించొచ్చు! చిట్టి తల్లి తాళలేక ఆ చేతుల్ని ముద్దాడింది. నానిగాడు తన లేత చేతులతో తనివి తీరా తడిమాడు.

ఆ రాత్రి అందరం ఆనందంగా నిద్రపోయాం. ఊరును వూహిస్తూ ఆదమరచి నిద్రపోయాం. కలలనిండా విస్తరిస్తున్న ఊరు అందచందాల్ని ఆరోగ్యాన్నీ చూసి తెలివిలేని నిద్ర పోయాం.

తెల్లవారింది. ఊరు తెల్లబోయింది.

'... అవి ఊళ్ళు కావని చెప్తే వినకపోతివి కొడుకా... గూటిలో వుండమంటే గూడు దాటి పోతివి కొడుకా... మమ్మల్ని అనాధల్ని చేస్తివి కొడుకా...' బద్దలవుతున్న ముసల్దాని గుండెలోంచి నెత్తుటి ఊటతో దుఃఖపు గొంతు పూడుకు పోతోంది... మళ్ళీ పూరుతున్న దుఃఖపు రొద మనసుల్ని మెలి పెడుతుంది.

పిల్లలు పిచ్చివాళ్ళలా అడుగులు వేసారు.

'గీస్తున్న ఊరు చెరిగి పోయింది'

పిల్లల కళ్ళలో మునుపటి తడిలేదు. పొడిబారిన కళ్ళతో నావెంట

కవిత

రాంరెడ్డి

# భయంగానే వుంది



అల్లంత దూరం నుండి ఏ పండక్కి వచ్చినా
ఆకాశమంత మనస్సు
వెన్నెలంత ఆనందం
నక్షత్రుల్లాంటి నవ్వులతో ఎదురొచ్చే నాన్న
తల ఎత్తీ ఎత్తకుండానే
ఏ పలకరింపూ లేకుండానే
గడప దాటి పోతంటేనే అనుమానం వ్చంది
గుమ్మపాలు తసీఉకొని
సేరుపాలు తాగిందాకా దగ్గరుండే నాయనమ్మ
సవాసేరు వెన్నముద్ద
తినిందాకా వూరుకోని అమ్మ
వంటినిండా పాల మీడద
ఒకటికి పదిసార్లు రుద్దే మేత్త
నా మాటకోసం
పాలేరుల్లా నిలబడే తమ్ముళ్ళు
మబ్బుకి తాడు కట్టి
మేఘాల కడుపుతో ఉయ్యాలేసే బావమరుదులు
తాటిచెట్ల చేనుకాడ పొద్దు కల్లు తాగుదామన్న సావాసగాళ్ళు
పలకరించకుండానే పక్కనుండి పోతుంటే
జరమొచ్చినట్టయింది-
మండపం దగ్గర
పాలేరు కొడుకుల్తో సావాసం తప్పనీ
వాళ్ళ బుజం మీద చెయ్యేస్తూ నడవటం తప్పనీ
వాడ ముందు వూరిని సిగ్గు పడమనటం
తప్పులన్నింటిలో పెద్ద తప్పనీ
మా తాత పెదకాపై,
కులపోళ్ళంతా బండి నాటుల్లా కాపేసి కాస్తుంటే
ఇమానాలతో గుద్ది నట్టయింది.
ఇంట్లో మాటల్లేవ్
చుట్టపు చూపుల్లేవ్
సావాసగాళ్ళ గేతుల్లేవ్
అసలు వంటిమీద మొలతాడు బిగసకపోయి వురిమి చూస్తుంటే
నా పేరు రాంరెడ్డి అంటే నరికేస్తారేమోనని
భయంగానే వుంది.

నడుస్తున్నారు. వీటన్నిటి నుండి వెళ్ళిపోవాలని నడక వేగం పెంచాను. కాని అడుగులు పడడం లేదు. తడబడుతున్నాయి. తూలుతూనే ముందుకి... ఆ ఊరు కాని వూరు నుంచి వెనక్కి...

దారిలో... దారి కాని దారిలో...

అచ్చం... ఎర్రకళ్ళ పిచ్చుకలానే పడి వున్నాడతను. తునాతునకలయిన దేహం... మట్టిని ముద్దాడుతూ - నేలను కరచుకుంటూ - నెత్తురు కక్కుకుంటూ పడి వున్నాడు.

చిట్టి చేతిలోంచి ఊరి గురించి రాసుకుందామని తెచ్చుకున్న నోటుబుక్ జారి పడింది. గాలికి పుస్తకం రెపరెపలాడింది. అందులోని ఎర్రకళ్ళ పిచ్చుక ఈక ఎగురుతూ వెళ్ళి అతని చుట్టూ ఎగురుతూ ప్రదక్షిణ చేసి అతని గుండెల పై వాలింది.

'ఎర్రకళ్ళ పిచ్చుక' ఉచ్చరించింది చిట్టి.

నానిగాడు పెన్సిళ్ళ కోసం ముందుకు పోయాడు. అవి ముద్దయి నెత్తురోడు తున్నాయి. ఆనవాళ్ళు లేకుండా వున్నాయి.

పిల్లల్ని వెనక్కి లాగాను.

'ఇక ఊర్లుండవా?' పిల్లల ప్రశ్నకు నా దగ్గర సమాధానం లేదు.

విశ్లేషణ

డా. కడియాల రామమోహనరాయ్



# ముత్యాల సరాలనుండి హైకూల వరకు

## ప్రక్రియలు - ప్రయోగాలు - ప్రయోజనాలు

వెయ్యి సంవత్సరాల ఉజ్వల చరిత్రగల తెలుగుపద్యం గురజాడవారి ముత్యాలసరంతో కొత్త మలుపు తిరిగింది. ఎంతమంచి కొత్త విషయమైనా కొన్నాళ్లకు పాతబడక తప్పదు. క్రీ.శ.19వ శతాబ్దంలో భారతీయుల సాంఘిక జీవనంలో పెనుమార్పులు చోటు చేసుకున్నాయి.

ఆంధ్ర జనజీవితం చాలా మారింది. ఇంగ్లీషు చదువులు ప్రపంచాన్ని దగ్గరగా చూపించాయి. మత విశ్వాసాలు సడలిపోసాగాయి. దేవుడొక్కడేనని, అన్ని మతాల సారం ఒక్కటేనని విద్యావంతులు భావించసాగారు. 'యుగపురుషుడు' వీరేశలింగం ఆంధ్రుల సాంఘిక విప్లవానికి అనేక విధాల తోడ్పడ్డారు. ఈశ్వరదత్తమైన పుస్తకమేదీ లేదని తేల్చి చెప్పారు.

కవిత్వం "మూగ చెవిటి వారి ముచ్చట కాదని" వీరేశలింగం తెలుసుకున్నారు. ఆయన దృష్టికి తెలుగు కవితా సరస్వతి నియమాల సంకెళ్లలో బంధింపబడి బాధ పడుతూ కనిపించింది.

"దయమాలి తుదముట్టకలదట్ల నిగిడించి
ధీరుడై నన్ను బాధించునొకడు
పాదంబులోపల పాదంబులిమిడించి
వీరుడై నన్ను నొప్పించునొకడు
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లొదవించి
పోటుబంటై నన్ను పొడుచునొకడు
బెండుపల్కులు గూర్చి నిండించి నగలంచు
విట్టయై జెవులు వేధించునొకడు ఖడ్గచక్రాధిరూపముల్ గానిపించి
వర్ణములు మార్చి నేను జిక్కుపరచునొకడు
కుమతులొడవెల్ల విరిచి ప్రాణములు తీయ
నొడలి పసలేక శుష్కించియున్నదాన" అని ఆమె వాపోయింది. ప్రాణము లేని ఆ బొందినే నవ మేధావులు పొగడుతున్నారట!

కవితా సరస్వతికి కవులు ఆపాదమస్తకమూ అలంకరించిన నగలు ఆమెను తేలుకాటులాగ

.............✧.............

ఆంధ్ర జనజీవితం చాలా మారింది. ఇంగ్లీషు చదువులు ప్రపంచాన్ని దగ్గరగా చూపించాయి. మత విశ్వాసాలు సడలిపోసాగాయి. దేవుడొక్కడేనని, అన్ని మతాల సారం ఒక్కటేనని విద్యావంతులు భావించసాగారు. 'యుగపురుషుడు' వీరేశలింగం ఆంధ్రుల సాంఘిక విప్లవానికి అనేక విధాల తోడ్పడ్డారు. ఈశ్వరదత్తమైన పుస్తకమేదీ లేదని తేల్చి చెప్పారు.

.............✧.............

డా.కడియాల రామమోహనరాయ్ | ప్రముఖ కవి పాత్రికేయుడు

బాధిస్తున్నాయట! "నా పలుకుల యర్థము నాకే తెలియదు నుమ్మీ! యివుడు భావములేమిన్" అని ఆమెబాధపడింది. రసహీనమైన కవితకు అలంకారాలు శవానికి చేసిన అలంకారాలేనని ఆమె తెల్పింది. 'సుందర బహురసపుష్టితో' అమందానందవీ కలిగించకపోతే అది కవిత్వమే కాదని, ఛందోబద్ధంబగు పద బృందాటోపము" కవిత్వం కానేకాదని ఆమె అన్నది. ఛందో బద్ధంబను ఘనకారణముననే బ్రతుకు గననగు నేనిన్ కవితా సతికిన్ మృతి నొందుటయె లెస్స!" అని ఆమె ఖండితంగా తేల్చింది.

కవిత్వానికి ఛందస్సుకూగల సంబంధాన్ని వీరేశలింగంగారు "సరస్వతీనారద విలాపము"లో సరికొత్త రీతిలో తెలిపారు. ఛందోబద్ధంబగు బృందాటోపము కవిత్వం కాదని తెల్పటం ఆయన కాలంలో గొప్ప సాహసమే.

ఛందఃప్రశస్తి : "ఛందోహీనోనశబ్దోస్తి నచ్ఛందశ్శబ్ద వర్జితమ్ (భరతముని నాట్యశాస్త్రము) ఛందస్సుకు లోబడని శబ్దమంటూ ఉండదు. శబ్దాన్ని వదిలి ఛందస్సూ ఉండదు. 'ఛందోభూతమిదం సర్వం' తెలుసుకోగల వాడికి సర్వ వాఙ్మయమూ ఛందోమయమే. రసాత్మకశబ్ద విస్తరణమంతా ఛందోమయమే.

ఆహ్లాదము కలిగించే వాక్య సమూహము ఛందస్సని నిఘంటువులు తెలియజేస్తున్నాయి. ఛందోబద్ధమైన వాక్కు ఎక్కువకాలం జ్ఞాపకముంచుకోవటానికి వీలుగా ఉంటుంది. ఛందస్సు కవిత్వానికి సౌందర్యాన్ని స్మరణ శక్తినీ కలిగిస్తుంది.

"విద్య లోపల నుత్తమ విద్య కవిత్వంబు
మరి కవిత్వము ఛందోవేద్యము" అని అనంతామాత్యుడు ఛందోదర్పణంలో తెలిపాడు. ఛందోవేత్త కానివాడు కావ్యవేత్త కాజాలడని ఆయన తలచాడు.

మరి ఎన్నో విధాల ప్రశస్తమైన ఛందస్సు 19వ శతాబ్దం వచ్చేసరికి వెగటెందుకయింది? అని ఆలోచిస్తే కవులు ఛందస్సును దుర్వినియోగ పరచటమేననిపిస్తుంది. ఛందస్సును కావ్యేతర ప్రయోజనాల కోసం దుర్వినియోగపరచటంవల్ల దానిపై గౌరవం తగ్గిపోయింది. సంస్కృత శాస్త్ర గ్రంథాలను తెనిగించేటప్పుడు పాదపూరణ కోసం తెలుగు శాస్త్ర గ్రంథకర్తలు వ్యర్థపదాలను విరివిగా

ఛందస్సును కావ్యేతర ప్రయోజనాల కోసం దుర్వినియోగపరచటంవల్ల దానిపై గౌరవం తగ్గిపోయింది. సంస్కృత శాస్త్ర గ్రంథాలను తెనిగించేటప్పుడు పాదపూరణ కోసం తెలుగు శాస్త్ర గ్రంథకర్తలు వ్యర్థపదాలను విరివిగా వాడారు. యతి అంటే విశ్రాంతి అన్నసంగతి కొందరు కవులు, శాస్త్రవేత్తలు మరచిపోయారు.

వాడారు. యతి అంటే విశ్రాంతి అన్నసంగతి కొందరు కవులు, శాస్త్రవేత్తలు మరచిపోయారు. అచ్చుమీద, హల్లుమీద, పోలికగల అక్షరాల మీద యతిని విచక్షణా రహితంగా పాటించి పద్యగమన సౌందర్యాన్ని పాడు చేశారు.

(గణంతోజగడంకో
దగాదగదుకానిదాని రస్సాగొయ్యా అని శ్రీశ్రీ 'ర-ఠ లకు యతిని పాటించి - కంటికింపయిన యతి' అని చమత్కరించారు. -1947)

ప్రత్యక్షర ప్రాసలు, విషమ ప్రాసలతో, ఢమఢమార్భటులతో పద్యంలో ఆటోపం హెచ్చింది. భావగాంభీర్యం పేరుతో తలబద్దలు కొట్టుకుంటేగానీ బోధపడని పద ప్రయోగాలు చోటు చేసుకున్నాయి. సులభంగా బోధపడవలసిన శ్లేష చమత్కారాలు కఠినతరమయ్యాయి. రెండర్థాల కావ్యాలరచనతో మొదలైన కావ్యప్రయోగాలు ప్రత్యర్థి, చతురర్థిగా సాగి చివరకు ఒక్క కందపద్యానికే 250 అర్థాలు చెప్పగలిగిన స్థాయికి చేరుకొన్నాయి.

అశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వాలలో ఆశు కవితకు, చిత్రకవిత్వానికి ఆదరణ హెచ్చు కావటం సాహిత్యలోకంలో క్షీణదశే. గంటకు వందపద్యాలు చెబుతామని, ఒక జాములోనే కావ్యరచన పూర్తి చేస్తామని, శతఘంటకవనము సల్పుతామని ఆశుకవులు ప్రతినలు పలకటం, పలకటమే గాక మాట నిలబెట్టుకొని రాజులు, జమీందారుల నుండి సత్కారాలు పొందటం, రాజాస్థానపండితుల మెప్పు పొందటం 1750-1850 మధ్యకాలంలో పరిపాటి అయింది.

రసవత్కవిత్వానికి బదులు కవులు సహృదయుల బుద్ధికి పదునుబెట్టే చిత్రకవిత్వం రచించసాగారు - పద్యాలలో నాగబంధం, చక్రబంధం, గోమూత్రికాబంధం మొదలైన ప్రయోగాలు, అన్నీ లఘువులతో పద్యాలు, ముందునుండి వెనక్కి చదివినా, వెనకనుండి ముందుకు చదివినా మార్పులేని పద్యాలు, విషమాక్షర ప్రయోగాలతో కొందరు సరససాహిత్య వాతావరణాన్ని ఛిన్నాభిన్నం చేశారు.

వీరేశలింగం 'శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము' (1871) రాయటం ఆకాలపు సాహిత్యస్థితిని చక్కగా తెలియజేస్తుంది. ఇది సరైన మార్గం కాదని గ్రహించిన తర్వాత ఆయన సరస్వతీనారద విలాపము (1895) రచించారు.

కొప్పరపు సోదరకవులు, తిరుపతి వేంకట కవులు ఆశుకవిత్వంతో, అవధానాలతో ప్రజలను ఆకర్షిస్తున్న కాలంలోనే పానుగంటి లక్ష్మీనరసింహారావు 'కంఠాభరణము(1917)లో అశుకవులను ఎద్దేవా చేశారు.

'కంఠాభరణము'లో రామలక్ష్మణులనే ఆశుకవులు

"దుష్కర ప్రాసంబులతో
శుష్కప్రాయంబు గాగ సారిదింగవితన్
నిష్కపట చెవ్వవారము" అని సుబ్బిసెట్టి అనే 'రసికుని' యెదుట రెచ్చిపోతారు. భట్రాజు 'మాంస' కవితకు 'పప్పుచారు' కవిత సరికాదంటారు. 'ఇట్లా' అనటానికి 'ఇట్రా' అని, కవిత్వమనటానికి 'కవి' అని పలికి తమ ప్రయోగాలను 'గంగదాసు మహాకవి' రైలుబండిపాటను నిదర్శనంగా చూపి సమర్థించుకుంటారు.

'అశుకవిత యొకటి యావుపేడ యొకటి
స్వయముగాగ శుద్ధచయము భువిని
వానికిలను వేఱుపరిశోధనము కూడ
దవని జెలంగ వెలయనమరభువిని'
అని

ఘంటాపథంగా పలుకుతారు.

ఇరవయ్యవశతాబ్ది ప్రారంభంలోనే రాయప్రోలు సుబ్బారావుగారు ఆశుకవితను 'వేగాతి వేగోక్తి దుర్వ్యసనం'గా నిరసించారు. కానీ ఇరవైయొకటో శతాబ్దంలో శత, సహస్రావధానులు ఆశుకవితతో మేళాలు జరపటం ఆశ్చర్యకరంగా తోస్తుంది.

పద్యరచనలో ప్రయోగాలు : ద్విపదులు, నాలుగు పదాల పద్యాలు ప్రాచుర్యంలోకి వచ్చినట్లుగా తెలుగులో త్రిపదులు వ్యాప్తిలోకి రాలేదు.

సీసపద్యపునామ సాదృశ్యంతో కొక్కొండ వేంకటరత్నంగారు వెండి, బంగారు వంటి పద్యాలు రచించారుగానీ వాటిని తర్వాత ఎవరూ పట్టించుకోలేదు.

కవివాక్కు స్వేచ్ఛగా వెలువడటానికి యతి ప్రాసలు ఆటంకంగా ఉన్నాయనే భావం ఇరవైయవ శతాబ్ది ప్రారంభంలో కొందరు కవులకు కలిగింది. రాయప్రోలు సుబ్బారావు 'దూతమత్తేభము'ను యతి ప్రాసలు లేని మత్తేభవృత్తాలతో రాశారు.

ముచ్చటైన మాటల 'ముత్యాల సరాలు' : గతానుగతికమైన పద్యరచనతో ముఖం మొత్తిన తెలుగువారికి 'ముత్యాలసరాలు' అందించి గురజాడ మహోపకారం చేశారు. కథ, దాన్ని చెప్పేతీరూ, ఛందస్సు మూడింటిలోనూ కొత్తతోవ ఏర్పరచి గురజాడ ఆధునిక కవితకు ఆద్యులయ్యారు.

మాత్రా ఛందస్సులో మిశ్రగతి నడకను గ్రహించి గురజాడ ముత్యాల సరాన్ని రూపొందించారు. మొదటి మూడు పాదాలలో 14మాత్రలు, నాలుగవ పాదంలో 7మొదలు 14వరకు మాత్రలు ఉండే ఛందస్సు ముత్యాల సరమని ఆయన పేర్కొన్నారు. "ఒక జాతి పార్సీ గజల్ నడక ముత్యాలసరాలు లో తెచ్చుటకు నే ప్రయత్నించితిని" అని ఆయన తెలిపారు.

అసలు ముత్యాలసరం తెలుగుభాషకు కొత్తది కాదని పరిశోధకులు నిరూపించారు.

"గుమ్మడేడే గోపి తల్లి
గుమ్మడేడే ముద్దుగుమ్మా
గుమ్మడేడే కన్నతల్లీ
గుమ్మడేడమ్మా! అనే జానపద గేయం 'ముత్యాలసరమే' ముత్యాలసరానికీ పై జానపద గేయానికీ వున్న సామ్యాన్ని శ్రీశ్రీ 1935 ఫిబ్రవరి 'ఉదయిని' త్రైమాసిక పత్రికలో రచించిన 'ముత్యాలసరం-ఒక కృషి' వ్యాసంలో గుర్తించారు. అయినా "గురజాడ అప్పారావుదే యీ ఛందస్సు" అని శ్రీశ్రీ అన్నారు.

గురజాడ తెల్పిన పార్సీ గజల్ నడకయే గాక తెలుగు వృషభగతి రగడకు, కన్నడ భామినీషట్పదికీ అచ్చంగా తెలుగులో ఒకానొక జానపద గేయరీతికి కూడా అచ్చగా తెలుగులో

---

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటలు
క్రొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెఱుంగులు చిమ్మగా"
అని గురజాడ 1910లో కవిత్వంలో
కొత్తదనానికి వరవడి పెట్టారు.
మేలుకలయికను కోరారు.

---

ఒకానొక జానపద గేయరీతికి కూడ ముత్యాల సరంతో పోలికను పరిశోధకులు గుర్తించారు.

కంకంటి పాపరాజు 'విష్ణుమాయావిలాసం'లో
"పైట తొలగ బటాక బయలగు
బటువు గుబ్బలమీద చుక్కల
సాటియై ముత్యాల సరములు
నీటుగుతూన్" అనే త్రిపుటలో ముత్యాలసరం అనే పదం కూడా ఉన్నది

గురజాడవారు రగడలను, జానపద గేయాన్ని ప్రస్తావించకపోవటానికి కారణం ఏమిటో తెలియదు. బహుశా పార్సీ గజల్ నడక వారికి నచ్చి ముత్యాలసరాల రచనకు పూనుకొని ఉండవచ్చు.

"ఉత్పలమాల, ఆటవెలది ఇత్యాదిగా పద్య రూపాలకు పేర్లున్నట్టు వివిధ గేయచ్ఛందో రూపాలకు పేర్లు లేవు. కొన్ని గేయ మౌలిక రూపాలైన రగడ భేదాలను పూర్వ లాక్షణికులు మధురగతి, ద్విపదగతి, ఇత్యాదిగా పేర్కొని, అదిగతి ప్రధానాలనే అంశాన్ని సూచించారు. వారు చూపిన మాత్రాచ్ఛందో గేయ భేదాలకు మించిన రూపాలు చాల ఉన్నాయి. వాటిల్లో ఒకదానికి గురజాడ ముత్యాలసరం అనే పేరు పెట్టారని కోవెల సంపత్కుమారాచార్య తలచారు (పీఠికలాంటిది - ఆధునికాంధ్ర గేయ కవిత్వం - డా.జి.చెన్నకేశవరెడ్డి)

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటలు క్రొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెఱుంగులు చిమ్మగా" అని గురజాడ 1910లో కవిత్వంలో కొత్తదనానికి వరవడి పెట్టారు. మంచి గతమున కొంచెమేనని నమ్మిన గురజాడ పాత కొతలని అనకుండ క్రొత్తపాతల మేలుకలయికను కోరారు.

"యెల్లలోకము వొక్కయిల్లై
వర్ణభేదము లెల్లకల్లై
వేలనెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ,
మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును లాంటి మహత్తరమైన భావాలను ముత్యాల సరాలులోనే తెలిపారు. కాని గురజాడ అప్పారావు గారు ముత్యాల సరాన్ని మెలకువతో నిర్వహించలేదనే చెప్పాలి. ఈయన తర్వాతి కవులలోనే వీరికంటే తీవ్రత, జాగరూకత కానవస్తున్నవని ఒప్పుకోవాలి. అలక్ష్య ఫలితములూ, ప్రమాదపతితములూ అయిన అనేక వ్యాకరణ దోషాలూ (ఇవికావు ప్రౌఢత్వ ద్యోతకం) నిర్వహణ వైవిధ్యం లేకపోవటమేగాక ఎటూకాని చోట విరువబడి పాడయిన పాదాలు (ఉదా: 'కానులు') అప్పారావు గారి ఛందోవ్యవస్థకు బలహీనత ఆపాదిస్తున్నది. హెచ్చిన అవలక్షణాల వల్ల లక్షణానికే విరూపత తటస్థిస్తుంది.

ఇంతకూ గనిలో నుంచి మొట్టమొదట తీయబడి లోహం వంటిది వీరి ముత్యాల సరం అన్నారు శ్రీశ్రీ (ముత్యాల సరం - ఒక కృషి)

ముత్యాల సరాలు ప్రాశస్త్యాన్ని గుర్తించి రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, కృష్ణశాస్త్రి, శివశంకరశాస్త్రి, బసవరాజు అప్పారావులు యీ ఛందస్సును ఆదరించారు. కొడవటిగంటి వెంకట సుబ్బయ్యగారి ముత్యాలసరం

"ఆగుమాగుము తెరువరీ ఆ
యూసభేదం బపనయింపుము
మా గృహాంగణకుసుమ సముదయ
మధుపులియ్యవిగో!" - భావకవిత్వానికేమకుటాయమానమైనది.

"భావ కవులు ముత్యాలసరాన్ని ఒక పద్యంలో పాటించినంత క్రమశిక్షణ (డిసిప్లిన్) పాటిస్తూ రచించారని చేకూరి రామారావు సోదాహరణంగా వివరించారు (ఆధునిక కవిత్వంలో ముత్యాల సరాలు - 1983) ముత్యాలసరంలో పూర్తిగా ప్రాసను పాటించడం ద్వారా అందాన్ని సంతరించవచ్చునని చేకూరి రామారావు

తలచారు గాని ముత్యాల సరాలల్లో ప్రాసను పాటించటమంటే కోరి సంకెళ్లను తగిలించుకోవటమే.

"1920-40ల మధ్య తెలుగు కవులు దీన్ని బాగా వాడుకున్నారు. 1940-60ల మధ్య కూడ కొంతకాలం అక్కడక్కడా కనిపించింది. 1960 నుంచి దాదాపు కనిపించటం మానేసింది" (చేరా-ఆధునిక కవిత్వంలో ముత్యాలసరాలు)

ప్రద్యాలలో వాడుకభాష: గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషోద్యమం వచన రచయితలను ప్రభావితం చేసినట్లు కవులను కదిలించలేదు. కన్యాశుల్కంలో ఉన్న సహజమైన వాడుక భాష గురజాడ కవితలలో కథానికలల్లో లేదు. గిడుగురామమూర్తిగారి స్ఫూర్తితో గిడుగు సీతాపతిగారు వాడుక భాషలో పద్యాలు రాశారు గాని అవి అంతగా గుర్తింపుపొందలేదు. అక్కడక్కడా వాడుక భాషా ప్రయోగాలున్నా భావకవుల పద్యాలు ఎక్కువగా వ్యాకరణయుక్తమైన భాషల్లో, ప్రౌఢ గంభీరమైన రీతిలోనే ఉన్నాయి.

1910లోనే 'ఆంధ్రభారతి' ఒక అజ్ఞాత కవి రాసిన 'మాలవాండ్రపాట'ను ప్రచురించింది. ఈ కవి నిమ్న జాతుల వెతలను వారిభాషలోనే తెలిపే ప్రయత్నం చేశారు.

అభ్యుదయ కవిత్వోద్యమ కాలంలో కూడ గేయాలలో భాష చాలవరకు శిష్టవ్యావహారికమే. 1980 తర్వాత వాడుక భాష 'మాండలికం' కవిత్వంలో కొద్దిగా కన్పించింది అది కూడ తెలంగాణ ప్రాంతపు మాండలికమే - ఇతర ప్రాంతాల వాడుక భాషలో గేయ రచనలు విరివిగా రావటంలేదు.

"తెలుగులో నవ్య రీతులకునూ తన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటికవిని నేనే. నా కావ్యకళ నవీనం, కావ్య యితివృత్తాలు భారతీయం, కవితలోనేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను. జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి కథా కవితా రూపంలో దాని తత్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను" అని పలికిన గురజాడ "ముత్యాల సరాలు" తెలుగు జాతికి వెలుగు మార్గం చూపాయి.

వచన కవిత్వం బాగా వ్యాప్తిలోకి వచ్చిన తర్వాత ముత్యాలసరాలు వంటి సరళమైన భాష, శైలి, గాన గుణమో గలిగిన ఛందస్సు కనుమరుగుకావటం బాధాకరం.

అభ్యుదయ కవిత్వోద్యమ కాలంలో కూడ గేయాలల్లో భాష చాలవరకు శిష్టవ్యావహారికమే. 1980 తర్వాత వాడుక భాష 'మాండలికం' కవిత్వంలో కొద్దిగా కన్పించింది. అది కూడ తెలంగాణ ప్రాంతపు మాండ లికమే - ఇతర ప్రాంతాల వాడుక భాషలో గేయ రచనలు విరివిగా రావటంలేదు.

భావకవిత్వం: ఛందస్సులో స్వేచ్ఛ: భావ కవులు తమ పద్యాలను ప్రచురించేటప్పుడు పద్యాలకు మొదట ఉండే 'ఉ-చ-శా-మ' మొదలైన గుర్తులను తొలగించారు. నాలుగు పదాల పద్యాన్ని ఆరు పంక్తులుగా, ఎనిమిది పంక్తులుగా ప్రచురించారు. భావం పూర్తి అయిన తరువాత పద్యం పూర్తి చెయ్యాలనే ప్రయత్నం మానుకొని మూడుస్వర పంక్తులైనా, రెండున్నర పంక్తులైనా వాటినలాగే విడిచిపెట్టారు. యతిప్రాసలను మాత్రం చాలవరకు పాటించారు.

"భావకవుల స్వేచ్ఛా ప్రియత్వము బహువిషయములగా గానవచ్చుచున్నది. సంప్రదాయానుగతములైన ఛందస్సులనేగాక నూతన ఛందములను గూడ గ్రహించి వానిలో భావములను బాగుగా పలికించి రసమెప్పించుట, పాద భాగములో ఖండిక ప్రారంభించుట; పాదాంతము కాకుండనే కావ్యము ముగించుట, నూతన ప్రయోగములు చేయుటలో వెనుదీయకుండుట, కొన్ని ఖండికలకు నామముంచకుండుట-ఇత్యాదివిశేషములు సహృదయులకు నవ్యకళలాపాదించు గుణములుగా గోచరించును. ఇవి శివశంకరశాస్త్రి భావకవులు ఛందస్సు విషయంలో అవలంబించిన స్వేచ్ఛను గూర్చి తెలిపారు. (కృష్ణపక్ష సింహావలోకనము)

వచన కవిత్వం ఆరంభ వికాసాలు: భావ కవులు అనుసరించిన స్వేచ్ఛతో సరిపెట్టుకోక దువ్వూరి రామిరెడ్డి, కవికొండల వెంకటరావు మొదలైన వారు దరిదాపు గద్య కవిత్వమన దగిన రచనలు చేశారు. రామిరెడ్డిగారికి ఛందస్సుంటే అపరిమితమైన గౌరవం ఉన్నది. "యథార్థమైన కవిత్వమునకు అనివార్యముగా ఛందస్సు అనుగతమౌను అని ఆయన విశ్వసించారు (తెలుగు కవితల్లో కొత్త తెన్నులు - కవి కోకిల గ్రంథావళి)- ఛందస్సును ధిక్కరించటం ఆయన వుద్దేశ్యం కాదు. కాని కొత్తను వెదుక్కుంటూ ఆయన చేసిన ప్రయోగాలే వచన కవిత్వానికి తొలిరూపాలుగ కన్పిస్తున్నాయి. దువ్వూరి వారి యీకొత్త రచనలు వచన గేయరూపం గలిగినవేగాని వచన కవిత్వం కావు.

వచన కవితకు ఆద్యుడిగా పేర్కొనదగిన కవి శిష్ట్లా ఉమామహేశ, 1930 నుండి యీయన రాసిన వచన గీతాలు 1939లో 'విష్ణుధనువు; నవమి చిలుక, సంపుటాలుగా వచ్చాయి.

శిష్ట్లా తన కవిత్వాన్ని 'ప్రౌఢ' కవిత్వమన్నారు. "ప్రౌఢకవిత్వం, ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది. అన్నారాయన ఇతడు భావ కవిత్వముపై తిరుగుబాటు చేసెనేగాని కొత్తబాట వేయలేదని ఒప్పుకోక తప్పదన్నారు. సి.నారాయణరెడ్డి (ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము ప్రయోగములు)

వచన కవిత్వ వ్యాప్తికి కృషి చేసిన తొలితరం కవులలో ముద్దు కృష్ణ, నారాయణ బాబు, శ్రీశ్రీ, పఠాభి, పాలగుమ్మి పద్మరాజు, పురిపండా ప్రముఖులు.

నయాగరా కవులు (బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు) అజంతా, బైరాగి, కాళోజీ, దాశరథి, ఆరుద్ర, సోమసుందర్, అనిసెట్టి, కె.వి.రమణారెడ్డి, దుంగినేని మొదలైనవారు తర్వాత తరంలో వచన కవిత్వం ఒక కవితా ప్రక్రియగా నిలబడటానికి పాటుబడ్డారు.

శ్రీశ్రీ ఛందో రహితమైన కొత్త కవిత్వానికి 'వచనగేయం', వచన పద్యం, ఫ్రీవర్స్, వెర్స్‌లిబర్, ముక్తచ్ఛందకవిత, అనే పేర్లు వాడుకలోకి వచ్చాయిగాని వచనకవిత్వమనే పేరు ఎక్కువగా వాడుకలో ఉన్నది.

"ప్రాచీన ఛందస్సులో ప్రాచీన సంగీతం గోచరించినట్లే నవీన కల్పనలో నవీన శ్రావ్యతలు గోచరిస్తాయి. క్రొత్తసంగీతం లోహవిహంగాలు, పారిశ్రామిక యంత్రాల ధూమనౌకలు, విద్యుచ్ఛకటాల వివిధ

విచిత్రఘోషలలో నుండి బయలుదేరుతున్నట్ల నవీన గీతాలు కవి యొక్క రసాత్మనుండి అనేక ధోరణులలో ప్రవహిస్తాయి. ఇందుకు కారణం ఈ కాలపు పారిశ్రామిక యుగధర్మమే అని శ్రీశ్రీ పారిశ్రామిక యుగధర్మానికి వచనకవితకు గల సంబంధాన్ని తేటతెల్లం చేశారు: (నేటి తెలుగు కవిత కొత్తపోకడలు - భారతి - 1939)

ఛందస్సును ధిక్కరించిన కవులు అంత్యప్రాసకు వశులైనారన్న ఆరోపణ వచ్చింది. ఈ ఆరోపణలో కొంత వాస్తవమున్నది. వచన కవులు అంత్యప్రాసను వేలంవెర్రిగా అనుసరించారు. ఇప్పటికీ కొందరింకా ఆ వ్యామోహం నుండి బయటపడలేదు.

**వచనకవిత్వం - లక్షణ నిర్దేశం:** వచన కవిత్వంలో ప్రయోగాలు జరగాలనే ఉద్దేశ్యంతో కుందుర్తి "ఆశ: శక్తిమిటి?" నాటికలు పూర్తి వచన కవితా రీతిలో రచించారు, లేదా రూపంలో గీతాలు రచించారు. చరిత్రతో విజ్ఞప్తి చేస్తున్నట్లు ప్రజలను ఉద్బోధించారు. తెలంగాణ కావ్యాన్ని కుందుర్తి పద్దెనిమిది పర్వాలుగా విభజించి వచన కవిత్వానికి బలమైన పునాది కల్పించారు.

వచన కవిత్వంలో కథా- కావ్యాలు రావాలనే తలంపుతో అజ్ఞాతశైశవం: ఆరంభయౌవనం: అసమర్థ కౌమారం; అవసాన వార్ధక్యం" గీతాలు రాశారు. ఈ ప్రయత్నాన్ని కొనసాగిస్తూ శీలావీర్రాజు "కొడిగట్టిన సూర్యుడు; ముళ్లరెమ్మ; అద్దెగది, హృదయం దొరికింది." కథా కావ్యాలను వచన కవిత్వ పద్ధతిలో రాశారు.

**పఠాభిపన్‌చాంగమ్ :** "భావకవిని మాత్రము కాన్నే నహంభావ కవిని ఎలుగెత్తి చాటి తెలుగు కవిత్వంలోకి చిచ్చుర పిడుగులాగ ప్రవేశించినకవి పఠాభి ఫిడేలు రాగాల సజన్ కావ్యం వస్తువులో, భాషా ప్రయోగంలో నూతన ప్రయోగం (1936-37) పఠాభి పాత విలువలను ధ్వంసం చేసి నూతన కవితకు మార్గం, సుగమం చేశారు. ఈ కొత్త దనాన్ని శ్రీ శ్రీ ఆహ్వానించారు. ఛందస్సుల చండ శాసనానికి నాడు కాలం వెళ్ళిపోయింది. కవి హృదయంలో రాగాలాపన ఎట్టి తీగెలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి. కవి సర్వతోముఖస్వాతంత్ర్య దూత స్వేచ్ఛాదాత కవి మాత్రలు మింగకూడదు.

> ఛందస్సును ధిక్కరించిన కవులు అంత్యప్రాసకు వశులైనారన్న ఆరోపణ వచ్చింది. ఈ ఆరోపణలో కొంత వాస్తవమున్నది. వచన కవులు అంత్యప్రాసను వేలంవెర్రిగా అనుసరించారు. ఇప్పటికీ కొందరింకా ఆ వ్యామోహం నుండి బయట పడలేదు.

పఠాభిపన్ చాంగం తెలుగులో సరికొత్త ప్రయోగం (1964) శబ్దార్థ శేషలు మనకు పూర్వ కాలంలో నుండి వున్నప్పటికీ సమకాలిక సమాజాన్ని వర్ణించటానికి ఉపయోగించుకున్న కవి పఠాభి ,,, అని పఠాభి పన్‌ల ద్వారా సాంఘిక ప్రయోజనాన్ని సాధించారు.

వివిధ చందస్సులలో పఠాభి ప్రయోగాలు 'కయితనాదయిత (1978)లో ఉన్నాయి. ఉక్తివైచిత్రి తప్ప యీ ప్రయోగాలు సాధించిన ప్రయోజనమేదీ లేదు.

పసిడిపన్‌ల పఠాభి చమత్కారాలు రసజ్ఞులకు చిరకాలం జ్ఞాపకముంటాయి.

**చందస్సుతో శ్రీ శ్రీ ప్రయోగాలు :** ప్రభవ రచించి కవిగా పేరు పొందాక శ్రీ శ్రీ కొత్త దనం కోసం వెదుక్కొంటూ 1929లో సుప్తాస్థికలు రచించారు. శ్రీ శ్రీ కూడ వచన కవిత వైపు ఆకర్షితులయ్యారు. కొద్ది కాలంలోనే ప్రయోగవాదులైన అతి నవ్య కవుల్లో అగ్రగణ్యులైనారు.

**నిరంతర ప్రయోగశీలి శ్రీ శ్రీ**

ప్రాస క్రీడలు : "వ్యక్తుల ప్రైవేటు బ్రతుకు వారి వారి సొంతం, పబ్లిక్‌లో నిలబడితే ఏమైనా అంటాం" అని ప్రముఖ వ్యక్తుల్ని అపహాస్యం చేసే అధికారం, పత్రికల్లో కార్టునులు వేసేవారికి వున్నట్లే కవికీ ఉన్నదని తలుస్తారు. "అడుగుజాడ గురజాడది / అది భావికి బాట/మనలో వెధవాయత్వం మరిపించే పాట" వంటి ప్రాసక్రీడలు మనస్సును అలరిస్తాయి.

**లిమబుక్కులు :** శ్రీశ్రీ ప్రచరించిన ఐదుపాదాల వచన గీతం 'లిమబుక్కు' ఇది ఇంగ్లీషు సాహిత్యం లోదే. "A humourous short : poen with two long lines that Rhyme with each other followed by too short lines that Rhyme with each other and ending with a Rong line that Rhymes with the first two" Jx Linetick లక్షణాన్ని ఇంగ్లీషు నిఘంటువు తెలియజేస్తుంది.

"నా యింటిపేరు ప్రపంచం
ప్రజలే నా కుటుంబం
వెదజల్లుతా దిగ్దిగంతం
అభ్యుదయ సుగంధం
అప్పుడు నా జీవితమే ఒక ప్రబంధం"

వంటి అహ్లాదకరమైన రచనలు శ్రీశ్రీ 'లిమబుక్కులు'

**కోయీరహాహై :** "కోయీ రహాహై" అనే రచనలో శ్రీశ్రీ వచనాన్ని కవిత్వంగా పరివర్తింపజేశారు. కవిత్వానికి ఛందస్సుతో పనిలేదని యీ గీతం నిరూపిస్తుంది.

శ్రీశ్రీ ప్రాసక్రీడలకు, లిమబుక్కులకు చెప్పుకోదగిన అనుసరణలేవీ రాలేదు.

"తెలుగుభాష చేత యితడు చేయించిన గారడీలు బహుశా ఒక్క శ్రీనాథుణ్ని మినహాయిస్తే యింకెవరూ చేయించలేదేమో" అని తెలుగు స్వతంత్రలో ఎవరో రాస్తే ఆనందవాణిలో దాన్ని ఉద్ధరించి తానే యిలా వ్యాఖ్యానించాడు శ్రీశ్రీ - 'బహుశా! బహుశా! (గండభేరుండం-కె.వి.రమణారెడ్డి-శ్రీశ్రీ రచనల సర్వస్వం)

**ఆరుద్ర ఛందఃప్రయోగాలు :** ఛందస్సుల చేత అందంగా చాకిరీ చేయించుకోగలిగిన ఆరుద్ర వచన కవిత్వంలో రకరకాల ప్రయోగాలు చేశారు. 'త్వమేవాహమ్'లో ఆరుద్ర కాలాన్ని ఇసుక, నీటి గడియారాలు, గడియారంలో మరలూ, ముళ్లూ, పర్వతదశ, ప్రవాహదశలుగా - ఒక ప్రణాళికాబద్ధంగా వివరించారు- ఈ కావ్యంలోని 'వేదనాకలశం' అనే భాగం చక్కని ఆధునిక ప్రయోగాత్మక నాటకం. ఇందులో కవి వచన కవిత్వం మధ్యలో ఉత్సాహ, మత్తకోకిల, కవిరాజవిరాజితం, పృధ్వి, తరలాలను ఇమిడ్చటం గొప్ప శిల్ప నైపుణ్యం. ఇందులో కవి ఒక బుర్రకథ కూడా ఇమడ్చటం విశేషం.

ఆరుద్ర నీవాలి కావ్యం వైవిధ్యభరితమైంది. పద్యం గేయం, వచనం కలగలిసిన కావ్యమిది. ఇందులో నాటకరీతిలో

సాగిన సంభాషణలు హృద్యమైనవి.

ఇంటింటి పజ్యాలు : ఆరుద్ర ఇంటింటి పజ్యాలు ఇంటిల్లిపాది చదువుకోడానికి రాసిన పద్యాలు - అమెరికన్ కవి ఆగ్డెన్‌నేష్‌కవితలు ఆరుద్రకు ప్రేరణ - ఆగ్డెన్‌నేష్ 'పాఫింగ్ ప్రాఫెట్' గా పేనుతికెక్కాడు. నండూరి రామమోహనరావు తలచినట్లు "ఆరుద్రన్ ఆధునిక కవిత్వంలో ఒక ఫినామినన్ "

కొంటెపిల్లకాయల్లేని కన్నతండ్రి
గోదావరి పొంగుల్లేని రాజమండ్రి" (చిన్న బాలశిక్ష)

లాంటి పలుకులతో ఆరుద్ర యీ పజ్యాలలో ఆనందపుజల్లులు కురిపించారు.

కూనలమ్మపదాలు : అసలు కూనలమ్మ పదాలు జానపద కవిత్వంలోవే

"జపతపంబులకన్న
చదువు సాములకన్న
ఉపకారమే మిన్న - ఓ కూనలమ్మా"

ఈ పదాలు ఆరుద్రను మంత్రముగ్ధుణ్ణి చేశాయి. ఇటువంటివి - ఇంతహాయిని గొలిపేవి ఆరుద్ర మరికొన్ని కూనలమ్మ పదాలు పలికారు.

"ఏకపత్నీవ్రతము
ఎలుగెత్తు మనమతము
వేల్పు భార్యలు శతము" లాంటి పదాలు ఆలోచనామృతమైనవి.

ఆరుద్రగారి 'కూనలమ్మ పదాలు'కు అనుకరణలు కోకొల్లలుగా వచ్చాయి. అయితే ఎవరూ ఆరుద్రగారి కవితాస్ఫూర్తిని అందుకోలేకపోయారు.

వరద ప్రయోగాలు : అబ్బూరి వరద రాజేశ్వరరావుకు వచనకవిత్వం అనేమాటే సరిపడదు. దాన్ని 'మిల్లు ఖద్దరు' అంటారాయన. పద్యమన్నా గేయమన్నా ఆయనకు ప్రీతి. వాటితో రకరకాల ప్రయోగాలు చేయటం ఆయనకు సరదా. "మాత్రాగణాలను వివిధ పద్ధతులలో కలుపుతూ కొత్త ఛందస్సులను సృజించటం వరదకు అలవాటు. ఈ కలపటం వల్ల సాంప్రదాయికమైన మిశ్రగతులుగాక కొత్తమిశ్రగతులు సాధ్యమవుతాయి" (నిరంతరాన్వేషిని నిత్య ప్రయోగశీలివరద - చేకూరి రామారావు)

"పదముందుకు, వెనక అపద
ముదికనులకు లేదు కౌముది
గది లోపలి నలుపుమూ గది

పేరడీ అంటే ఒక కవి లేక రచయిత రచనను అచ్చంగా అనుకరించినట్లే అనుకరిస్తూ, అర్థాన్ని తేలిక పరుస్తూ అపహసిస్తూ చేసే రచన. ఇది సాధారణంగా ఇష్టంతో చేసే రచన. ద్వేషంతో చేసే రచన కాదు. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి అనితర సాధ్యమైన రీతిలో విశ్వనాథకృష్ణశాస్త్రి, నాయని, శ్రీశ్రీల కవితలకు అద్భుతమైన పేరడీలు రాశారు.

పద నేస్తం వెనుక "ఆపద"లాంటి రచనలో వరద శబ్ద ప్రయోగవైచిత్రి ఆశ్చర్యం గొల్పుతుంది.

శ్రీశ్రీ వరద ఆరుద్రల సమిష్టి ప్రయోగాలు : జీవితానికి అర్థాన్ని పరమార్థాన్ని అన్వేషిస్తూ శ్రీశ్రీ, వరద, ఆరుద్రల కవితా సమాహారం 'మేమే', ఇవన్ని నిషాఖుషీలో పలవరించినవి. వీటికి శ్రావ్యమైన గేయగుణం వున్నది. దాదాపు ప్రతి గీతంలో మృత్యువు భగవంతుడి ప్రసక్తి వున్నది.

"సిరిసిరి మువ్వలం
చెరిగిన దవ్వులం
మృత్యువు పెరట్లో
మందార పువ్వులం
భగవంతుని వితంతువులం
భాషించే జంతువులం
కరుణకు మా బ్రతుకు
కవనం మా మెతుకు" లాంటి గీతాలు కవిత్వాభిమానులకు ఆనందం కలిగించగలవి.

సాహిత్యోపనిషత్: శ్రీశ్రీ, వరద, ఆరుద్రల కవితాత్మక సంభాషణ సాహిత్యోపనిషత్, ఆధునిక తెలుగు కవిత్వంలో ఇదొక గొప్ప ప్రయోగం.

ఏది కవిత్వం? ఎందుకోసం కవిత్వం? కవిత్వం ఎలా ఉండాలి? ఎలా ఉండకూడదు? సంప్రదాయమంటే ఏమిటి? కవి బాధ్యత ఏమిటి? ఛందస్సెందుకు? కవిత్వం ఎవరికోసం? వర్తమాన సాహిత్యస్థితి ఎలా ఉన్నది? లాంటి మౌలిక విషయాలను యీ కవులు యిందులో చర్చించారు.

పేరడీ : పేరడీ అంటే ఒక కవి లేక రచయిత రచనను అచ్చంగా అనుకరించినట్లే అనుకరిస్తూ, అర్థాన్ని తేలిక పరుస్తూ అపహసిస్తూ చేసే రచన. ఇది సాధారణంగా ఇష్టంతో చేసే రచన. ద్వేషంతో చేసే రచన కాదు. జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి అనితర సాధ్యమైన రీతిలో విశ్వనాథ కృష్ణశాస్త్రి, నాయని, శ్రీశ్రీల కవితలకు అద్భుతమైన పేరడీలు రాశారు. ఆ కవుల జీవనాడిని, ఆయువుపట్లనూ గ్రహించి పునఃసృష్టి చేసి వారి కవితలతోపాటు తన పేరడీలకు కూడా చిరస్థాయిని కల్పించారాయన. పేరడీ రచనలో మాచిరాజు దేవీప్రసాద్, శ్రీరమణలు కూడా సిద్ధహస్తులు.

ఇరవైయవ శతాబ్ది తెలుగు సాహిత్య సమాజ పరిణామాలను జలసూత్రం ఆశ్వాసాంతం 'అద్భుతం'గా చిత్రించింది.

దాశరథి కవిత్వ ప్రయోగాలు : "విద్యుత్తులా ఊహించగల మనకు మద్యంలా పారే పాత ఛందస్సు పనికిరాదని వచన కవిత్వాన్ని విద్యుత్ ఛందస్సని దాశరథి సంభాషించారు. పద్యం నడక, గేయపు సొగసు బాగా తెలిసిన దాశరథి ఆధునిక కవిత్వంలో పెక్కు ప్రయోగాలు చేశారు.

ఉర్దూ కవితా పద్ధతులు గజల్, రుబాయత్‌లను తెలుగు సాహితీవనంలో పాదుకొలిపారు.

రుబాయీ: 'రుబా' అంటే అరబ్బీ భాషలో నాలుగు అని అర్థం. రుబాయీలో నాలుగు పంక్తులుంటాయి. పారసీ కవి ఉమర్ ఖయ్యాం వల్ల, ఖయ్యాం కవితకు ఫిట్ జెరాల్డ్ ఆంగ్లానువాదం వల్ల రుబాయీకి ప్రపంచ ప్రసిద్ధి వచ్చింది.

రుబాయీకి గల నాలుగు పంక్తుల్లో 1,2,4 పంక్తుల్లో అంత్యప్రాసను పాటించటం సంప్రదాయం. దాశరథి యీ పద్ధతిలో కొన్ని ఉత్తమరచనలు చేశారు.

"పులినుండి మేకనొకడు విడిపించాడు
నెనరుబూని ఇంటిదాక నడిపించాడు
అతడు కరుణామయుడని అనుకొనె మేక
కత్తి తీసి మేక మెడను ఖండించాడు"

తిరుమల శ్రీనివాసాచార్య దాశరథి మార్గంలో కొన్ని రసవంతమైన రుబాయీలు రచించారు.

గజల్ : గజల్ అంటే ప్రియురాలితో చేసే సంభాషణ: ప్రియురాలికి రాసే ప్రేమలేఖ అని రసజ్ఞుల భావం. "అడవిలో వేడికి అకస్మాత్తుగా

పులి ఎదురైనప్పుడు లేడి నోట్లోంచి తటాల్న బైటికి వచ్చే శబ్దం ఏదైతే ఉందో దాని పేరు గజల్" అని తత్వజ్ఞులు చెప్పేమాట.

ఉర్దూలో గజల్ రెండు వందల సంవత్సరాల క్రితమే ప్రారంభమైంది. వలీ, సౌదా, మీర్, ఇన్షా, జాఖ్, గాలిబ్, జఫర్, మోమిన్, దాగ్, హాలీ, ఇక్బాల్ మొదలైన వారు గజల్ రచనను సుసంపన్నం చేశారు. గాలిబ్ గీతాలను దాశరథి తెలుగువారికి నలభైయేళ్ల కిందట పరిచయం చేశారు. గాలిబ్ తెలుగు కవి అన్నంతగా గాలిబ్ గీతాలు రసజ్ఞుల ఆదరం పొందాయి.

గజల్‌లో రెండేసి పాదాల ద్విపదలు ఏడు, ఎనిమిది ఉంటాయి. అందులో ఒక్కో ద్విపదిని షేర్ అంటారు. పాదాన్ని 'మిశ్రా' అంటారు. షేర్లో మొదటి పంక్తి కేవలం సామాన్య వాక్యంగా ఉంటుంది. రెండవది విశేషంగా ఉంటుంది. గజల్ పల్లవిని 'మత్లా' అంటారు. చివరి చరణాన్ని 'మక్తా' అంటారు. పల్లవి చివర ఉన్న పదం ప్రతి చరణం చివర అంత్యప్రాసను రూపొందిస్తుంది. కొన్నింట్లో అంత్యప్రాసకు ముందు మరో ప్రాసపదం ఉంటుంది. వీటిని రదీఫ్ కాఫియా' అంటారు. చివరి చరణంలో కవి నామ ముద్ర ఉంటుంది. దీనిని 'తఖుల్లస్' అంటారు.

భాగ్యనగర్ నాటకంలో ఉపయోగించటం కోసం శేషేంద్ర, తెలుగులో కొన్ని గజల్లు రాశారు. "ఈ నగరం జాబిల్లి దక్కను ప్రేమాగల్లీ/ గులాబీలు వీధుల్లో గునగున లాడే చోటు / మధుశాలలు మశీదులు మనుసును చీల్చే చోటు" లాంటి రమ్యమైన భావాలు శేషేంద్ర గజల్లలో ఉన్నాయి.

సినారె 'తెలుగు గజల్లు' కవిత్వాభిమానుల ఆదరణ పొందాయి. గజల్ జీవగుణాలు "సరసభావన, చమత్కార ఖేలన, ఇంపూ కుదింపూ" తెలుగు గజల్లలో ఉన్నాయి.

నియమాలను పాటించటం కష్టం కావటం వల్లనో లయజ్ఞానం, గానగుణం కొరవడటం వల్లనో తెలుగు కవులెక్కువగా గజల్ రచనకు పూనుకోవటం లేదు. అద్దేపల్లి రామమోహనరావు, రెంటాల శ్రీ వేంకటేశ్వరరావు, తటవర్తి రాజగోప బాలం ఇటీవల కొన్ని గజల్లు రాసి ఈ ప్రక్రియకు పుష్టిని చేకూరుస్తున్నారు.

గజల్‌లో రెండేసి పాదాల ద్విపదలు ఏడు, ఎనిమిది ఉంటాయి. అందులో ఒక్కో ద్విపదిని షేర్ అంటారు. పాదాన్ని 'మిశ్రా' అంటారు. షేర్లో మొదటి పంక్తి కేవలం సామాన్య వాక్యంగా ఉంటుంది. రెండవది విశేషంగా ఉంటుంది. గజల్ పల్లవిని 'మత్లా' అంటారు.

**'దిక్‌లు':** దిగంబర కవులకు వచన కవిత్వం అనే మాట నచ్చలేదు. తమ కవితలను వారు 'దిక్'లని పిలుచుకున్నారు. కాని యీ పేరు వ్యాప్తిలోకి రాలేదు. వారి కవితారూపాన్ని పాఠకులు, విమర్శకులు వచన కవిత్వంగానే తలుస్తున్నారు.

**సినారె కావ్య ప్రయోగాలు :** మాత్రా ఛందస్సులలో ప్రణయ కవిత్వాన్ని, చారిత్రక గాథలను రచించి ప్రఖ్యాతులైన సి.నారాయణరెడ్డి ఛందస్సుతో రకరకాల ప్రయోగాలు చేశారు. గజల్లు, మా కందాలు, ప్రపంచపదులు, ద్విపదులు సినారె కావ్య రూపాలలో ప్రముఖమైనది.

**మాకందాలు :** కందపద్యంలో 1,3 పాదాలు పొట్టిగా, 2,4 పాదాలు పొడవుగా ఉంటాయి. పొట్టిపాదాలను 1,2గా పొడుగు పాదాలను 3,4గా మార్చి సినారె 'మాకందం' రూపొందించారు.

కంద పద్యానికి వింతగతులు, సమకూరుస్తూ స్పందమునకు కొత్తశ్రుతులు సంపాదిస్తూ తానీ మార్పు చేసినట్లు సినారె తెలిపారు. ఈ ప్రయత్నం సఫలమైనట్లు తలచలేం. ఈ ప్రయోగం ప్రయోగ దశలోనే మిగిలిపోయింది. ఇతర కవులెవ్వరూ 'మా కందాలు' రాయలేదు.

**ప్రపంచపదులు :** సినారె రూపొందించిన ప్రపంచపదులకు అయిదు పంక్తులు 1,2,4,5 పాదాల్లో కవి అంత్యప్రాసను పాటించారు. ఇందులో "ఛందస్సు వంచపదీయం, వస్తువేమో ప్రపంచపదీయం"

"నమ్మిన నేస్తం, పాదుగును కుమ్మితే నరకం
శీలం ముఖాన నిందల బురదను చిమ్మితే నరకం
మనసును కాల్చే బాధకు నరకం మరోపేరు.
పుచ్చిన నాలుక ఇంతని అంతని పొగిడితే నరకం
నీచుడు వేసిన దండను మెడలో నిలిపితే నరకం"

ప్రపంచపదుల రచనకు ఇతర కవులెవరూ ఉత్సాహం చూపలేదు. సినారె మాత్రం మారే విలువలకు ప్రపంచపదులు దారి మలుపులు అంటున్నారు.

**ద్విపదులు:** ద్విపద ఛందస్సు పాతదే. దీనికి మూడు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం ఉంటాయి. ఈ నియమాన్ని కాదని సినారె దీన్ని ఖండగతిలో సాగే గేయంగా మార్చారు.

"కదిలే హృదయం ఉంటేనే చక్కని ఆలోచన పుడుతుంది
కాగినప్పుడే కాదాపాలకు కమ్మని పరిమళమొస్తుంది"

సినారె ద్విపదులు ఎక్కువగా సూక్తులు, ఇతర కవులు ద్విపదులపై ఆసక్తి చూపలేదు.

**ఇతిహాసం:** శేషేంద్ర 'నా దేశం నా ప్రజలు' కావ్యం రచించి దాన్ని ఆధునిక ఇతిహాసంగా పేర్కొన్నారు. పూర్వ సాహిత్య శాస్త్రవేత్తలు తెల్పిన ఇతి హాస లక్షణాలతో రచించిన గ్రంథం కాదిది.

"వర్తమాన ఆంధ్ర కవిత్వంలో ఇతిహాసం ఒక అచుంబిత ప్రక్రియ. ఈ కాలంలో ఇతిహాసం ఈనాటి మనిషి ఆశల్ని, ఆశయాల్నీ గానం చెయ్యాలి. ఈనాటి తిరుగుబాటును గురించి గర్జించాలి" (నా దేశం నా ప్రజలు - భూమిక - శేషేంద్ర) ఇందులో శేషేంద్ర సామాన్య కర్షకుడిని కథానాయకుణ్ణి చేశారు.

ఆధునిక కవులపై శేషేంద్ర ప్రభావం ప్రగాఢంగానే వున్నది కాని ఆయన అనుయాయులెవ్వరూ మరొక ఇతిహాసరచనకు పూనుకోలేదు.

ఇతిహాస రచన చేయటానికి కవికి మానవ నగరికత, సంస్కృతుల పట్ల సరైన అవగాహన ఉండాలి. శేషేంద్ర ప్రతిభకు తగిన పాండిత్యం గల కవి కాబట్టే యీ సాహసానికి పూనుకున్నారు.

'నాదేశం నా ప్రజలు'ను ఆధునిక ఇతిహాసంగా సంభావించటానికి ఎటువంటి

అభ్యంతరం ఉండనక్కరలేదు.

మినీ కవిత: 'అల్పాక్షరాలల్పో, అనల్పార్థరచన' ఏ కాలంలో అయినా కవిత్వానికి అవసరమే. 'మినీ కవిత' పేరు మొదట ఎవరు ప్రయోగించారో తెలియదుగాని పత్రికలలో ఖాళీ జాగాలను పూరించటానికి సంపాదకులు మినీకవితను ప్రోత్సహించారు.

నిగూఢమైన భావాన్ని కొద్ది పంక్తులలో పొదిగి ఒక రసవత్కావ్య ఖండికను చదివిన అనుభూతి కలిగించటం మినీ కవిత ప్రత్యేకత.

"కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటేగద యీ ప్రయాణం"
(చంద్రసేన్)

కావ్య ఖండిక పొడవు ఎంత ఉండాలో కవే నిర్ణయించుకోవాలి. 'మహాప్రస్థానం'లో కవితా! ఓ కవితా! - అః అనేవి రెండూ ఉత్తమ రచనలే, ఇందులో ఒకటి మెక్సీ కవిత అని, రెండవది మినీ కవిత అనీ అనుకోనక్కరలేదు.

1980 ప్రాంతాలలో ఒక కెరటంలాగ ఎగసి పడిన 'మినీకవిత' కాల ప్రవాహంలో కలిసి పోయింది.

నానీలు : డా.ఎన్.గోపి ప్రారంభించిన కవితారూపం నానీలు ఇవి పత్రికల్లో వస్తున్నప్పుడే సహృదయులను ఆకట్టుకొన్నవి. నానీలంటే 'నావీనీవీ' అని అర్థం. ఇందులో నాలుగు పంక్తులుంటాయి. మొత్తం 20-25 అక్షరాలు గల చట్రం - రెండేసి పాదాల్లకొక భావాంశముంటుంది.

"అనుభవమా!
ఇప్పుడేం లాభం?
విరిగిన వేలికి
ఉంగరం దొరికినట్టు" ఆలోచనా మృతమైన కవిత్వాన్ని కొత్తరూపంలో అందించిన గోపి కృషి అభినందించదగినది.

ద్వా.నా.శాస్త్రి వంటి వొకరిద్దరు నానీలు రాస్తున్నారు.

హైకూ : హైకూ ఒక జీవిత విధానం, ఒక కవితాపద్ధతి - ప్రకృతికి సహజమైన పక్షిలాగ, పువ్వులాగ హైకూ జపాన్ సారస్వతంలో క్రీ.శ. 14వ శతాబ్దంలో అవతరించింది. హైకూకు బౌద్ధం తాత్విక భూమిక చేకూర్చింది.

తెలుగులో హైకూ ప్రస్తావన దువ్వూరి రామిరెడ్డి, కట్టమంచి రామలింగారెడ్డి గార్ల రచనల్లో మొదట కన్పిస్తుంది... మళ్లీ చాలాకాలం తరువాత 1990లో గాలి నాసరరెడ్డి

సమకాలీన భారతీయ భాషలలో తెలుగు కవిత్వం సమున్నతస్థానంలో ఉన్నది. ఇందుకు కావ్య వస్తువులతోపాటు కవితా ప్రక్రియలు కూడా తోడ్పడ్డాయి. ఆధునిక జీవితంలోని సంక్లిష్టత ఆధునిక కవితారూపాల అవతరణకు కారణమైంది. కవితకు వైశిష్ట్యం ఎంత ముఖ్యమో వైవిధ్యమూ అంత అవసరం.

అయిదు తెలుగు హైకూలు రచించారు.

"చెట్టూ చెరువూ
విశాల గగనమూ
కొంగరెక్కల్లో"

హైకూలో మూడు చిన్న పాదాలుంటాయి. మొదటిపాదంలో అయిదూ రెండవపాదంలో ఏడు మూడవ దానిలో అయిదూ మొత్తం పదిహేను మాత్రలుంటాయి. ఈ నియమాలు తెలుగు భాషకు నప్పవని, మూడు పంక్తుల నియమాన్ని పాటిస్తే చాలునని ఇస్మాయిల్ అభిప్రాయపడ్డారు.

ఇస్మాయిల్ హైకూలు సహృదయులను, యువకవులను బాగా ఆకట్టుకున్నాయి.

"చిన్న రాత్రి
ఎంత వెన్నెల కాసింది
కాకులు కూడ నిద్రపోలేదు"

ఆహ్లాదకరమైన హైకూలు రాస్తున్నవారిలో బి.వి.వి. ప్రసాద్ పెన్నా శివరామకృష్ణ, భగ్వాన్, లలితానంద్, రత్నమాల, శిరీష, బి.వెంకటరావు, రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు పేర్కొనదగినవారు.

హైకూ స్వరూపం తెలియకుండానే కొందరు మూడు పొట్టి పాదాల రచనను హైకూగా చలామణి చేయజూస్తున్నారు. అవాంఛనీయమైన ఇటువంటి రచనలను పత్రికలు ఎక్కువచోటు ఆక్రమించవన్నే ఉద్దేశ్యంతోనేమో ప్రచురిస్తున్నారు. ఒక క్రొత్త కవిత్వ ప్రక్రియ ప్రారంభమైనపుడు తక్కువ స్థాయి రచనలు రావటం మామూలే.

హైకూ కవిత్వం తెలుగు సాహిత్యానికి కొత్త వన్నెచిన్నెలు చేకూర్చింది. ఇది ఆహ్వానించదగిన పరిణామం.

ఆధునిక ఆంధ్ర కవిత్వంలో ముత్యాల సరాల నుండి హైకూ దాక చాల ప్రక్రియలు పాఠకులను అలరించాయి. కవులెప్పుడూ కొత్తదనం కోసం అన్వేషిస్తూనే ఉంటారు.

నన్నయాదులు ఆదరించిన పద్యాన్ని ఏమనేది లేదని, అయితే తెలుగు కవితకు పద్యమే తుది స్వరూపమని అంగీకరించలేమని కుందుర్తి అభ్యుదయోద్యమ కాలంలో అన్నారు.

నన్నయకు పూర్వం నుండి వున్న పాట నేటికీ కవితా వాహకంగా కొనసాగుతున్నది. 1970-80 మధ్య కాలంలో విప్లవగేయం కవిత్వంలో ప్రముఖస్థానం వహించింది. కాని ఒకే రకమైన ఎలిజీలు, కవిత్వాభిమానులకు విసుగు కలిగిస్తున్నాయి. రేడియో, టి.వి. సినిమాలలో వచ్చే పాటలు ఏ కొద్దిగానో తప్ప కవిత్వమనిపించుకొనదగిన స్థాయిలో ఉండట్లేదు.

సమకాలీన భారతీయ భాషలలో, తెలుగు కవిత్వం సమున్నత స్థానంలో ఉన్నది. ఇందుకు కావ్య వస్తువులతోపాటు కవితా ప్రక్రియలు కూడా తోడ్పడ్డాయి. ఆధునిక జీవితంలోని సంక్లిష్టత ఆధునిక కవితారూపాల అవతరణకు కారణమైంది. కవితకు వైశిష్ట్యం ఎంత ముఖ్యమో వైవిధ్యమూ అంత అవసరం.

# ఆపద

కథ
చిలుకూరి దేవపుత్ర




సెలవువిడిస్తే చాలు మా ఊరికి ఎపుడెపుడు పోదామా అని ఉరుట్లూగుతా వుండేది నేను.

నాకి మా ఊరంటే ఎంతిష్టమో మా యవ్వంటే అంతకంటే ఇష్టము. అసలు మా ఇల్లు ఊర్లోలేదు మరి, ఊరికి పడమటి దిక్కుకి, రొండుమైళ్ల దొవ్వులో ఉండాది.

ఆ అడవిలో ఇల్లు...

ఇంటి ముందర వేప, చింతచెట్లు...

ఇంటెనక రెండు దిగుడు బాయిలూ...

దాన్లకి ఒక పక్క చీనా చెట్లూ...

ఇంకొక పక్కన ఎరిమడి...

దాన్ల చూట్టూరా తుమ్మచెట్లూ, కత్తాళీ...

మడికి చివరలో బంక ఇరిక్కాయల చెట్టూ...

ఇవన్నీ నన్ను రంగుల ప్రపంచంలోకి తీసుకపోయినట్లు అనిపిస్తాది. అందుకే మా వూరన్నా, మా ఇల్లు అన్నా, మా యవ్వన్నా నాకి అంత ఇష్టము.

మా యవ్వకి తోడుగా ఎవరూ లేరు. ఆయమ్మ ఒక్కతే దెయ్యమా కట్ల బతుకుతాంటాది.

"ఒంటరిగా ఎట్లుంటావవ్వా?" అనడిగితే "పగలంతా కూలోల్లతో, రాత్రంతా దెయ్యాలతో మాట్లాడతానురా"... అంటానని నగుతాది. నిజ్జంగా ఆయమ్మ దెయ్యాలతో మాట్లాడే మనిషే అనిపిస్తాది. రేతిరి పూట ఆ చింపిరి జుట్టూ జూస్తే దెయ్యమే హడలుకదా మరి!

పెద్ద పరీక్షలు అయిపోయి, ఎండాకాలం సెలవులు మొదలయినాయి. ఆ పొద్దు పొద్దున్నే నేను మా ఊరికి జేరుకుండాను.

నేను వచ్చిననాని మా యవ్వకి సంతోషము సంతోషము గాదు. చిక్కని పాలతో కాఫీ జేసి ఇత్తడి చెంబుకు పోసుకొని వచ్చి నట్టింట్లో పెట్టింది. ఇద్దురమూ సక్కాబల్లం యేసుకోని తాగేసి కూకుండాము. ఆ చెంబులో యంత లేదన్నా ఆరుగలాసుల కాఫీ వుంటాది. చెరీ మూడుగలాసులు తాగేదన్న మాట. మాయవ్వకి కాఫీ పిచ్చి. దాన్ని నాకి గూడా అంటించినాది.

కడుపు నిండా కాఫీ తాగి చేన్లేకి ఎల్లబారితిమి. నేను అనంతపురం సుద్దులన్నీ జెప్తావుంటే, మా యవ్వ సంతోషంగా 'ఊ' కొడతా వుండాది. పగలంతా ఎట్ల గడిచిపోయిందో తెల్దు.

సందకాడ మొబ్బయితా వున్నెట్లే సెనిక్కాయ వురిమిందీ, రాగిముద్దా ఇంత మింగి బయట వుండే కుక్కిమంచం మింద కూకోని వుండాము.

పగలంతా ఊరికే మా యవ్వ యెంబడి తిరిగిందానికి అలుపు వచ్చినట్లు వుండాది నాకి, ఆయమ్మ జూచి పొద్దన్నించీ పనిజేస్తావుంది. రొంతన్నా అలసిపోలా... మేతకు పొయ్యి వచ్చిన ఆవుల్ని కట్టేసింది. పాలుపిండింది. బుడ్డీదీపం పట్టుకోని పోయి గడ్డి దొడ్డిలోనించి మేతతెచ్చి ఎద్దులకు వేసింది. ఇంట్లో దూరి యేందో ఎగబెడతా, సగబెడతా ఉండాది.

రెండు దినాల తర్వాత వున్నవేంవెూ- వెన్నెల పాలారబోసినట్లుండాది.

ఇత్తడి గలాసునిండా ఉడుకుడుక్కు పాలు తెచ్చి ఇచ్చి నాపక్కనే కూకుంది. మాయవ్వ - వక్కాకు యేసుకుంటా పాలన్నీ తాగేసినాక!

"వక్కాకు నాకు ఇయ్యవ్వా!" అంటానని అడిగితి.

"ఈనికి వక్కాకు పిచ్చికటి!" అంటానని గొణుగుతానే ఇచ్చింది వక్కాకు.

మా ఇంటికి కూత వేటు దూరంలో మా పెద్ద తాత ఇండ్లు మూడుండాయి. ఎన్నెట్లో ఆ మిద్దెలు తెల్లగా కనబడతా వుంటాయి.

వక్కాకు రసం మింగుతాంటే వేడికి పెయ్యంతా చిరుచెమట్లు పడతావుండాయి.

చింతచెట్టుకాడ వున్నెట్లుండి బట్టావుయాలో అదోమాదిరి బుసలు కొడతావుంది ఏంటికట్ల జేస్తా వుందో అర్థంకాలేదు నాకి. అప్పటిదాంకా మా దగ్గిరే కూకోని వుండిన ఎర్రకుక్క జిమ్మిగాడు అక్కడికి పోయి మొరిగేది మొదలుపెట్టింది. అది మొరిగేదాంట్లో ఏందో ప్రమాదం వున్నెట్ల అనిపిస్తావుంది నాకి.

మా యవ్వ గూడా పసిగట్టినట్లుండాది ఆ ప్రమాదాన్ని. 'నువ్వు మంచం మిందే వుండప్పయ్యా! నేను ఇప్పుడే చూసొస్తా' అంటానని బుడ్డీ దీపం పట్టుకోని పోయింది. చింతచెట్టు నీడలో వుండేదేందో కనిపెట్టేదానికి.

చెట్టు నీడలో పారజూస్తావుంది బుడ్డీ వెలుతుర్లో. ఆ యమ్మ యేం జూస్తా వుండాదో తెల్దు. దెగ్గిట్లో వుండే కంది కట్టె చేతిలోకి దీసికోని నేలమింద సప్పిడి జేస్తా - "యాల వస్తివమ్మా! ఏడ యేంది తిందామని వస్తివే తిక్కదానా. అట్లపో, తినేదానికి దొరుకుతాది. పోయే...పొమ్మా.... పోపో... అంటూనే ముందుకి పోతా వుంది మెల్లగా. మా యవ్వతో పాటి జిమ్మిగాడు మొరుక్కుంటానే పోతా వుండాది.



ఆయమ్మ ఏమిటితో మాట్లాడతా వుండాదా? అంటానని గబుక్కున మంచం దిగి మా యవ్వ కాడికి పరిగెత్తినా.

తీరా చూస్తే - అది నాగుంబాము.

బారెడు జంపు వుండాది.

నా రెట్టలావు వుండాది.

మెల్లగా వంపులు తిరుగుతా పోతా వుండేది.

మా యవ్వ కందికట్టెని నేలకి రాపాడిస్తానే వుండాది. చీనా చెట్ల కల్లసాలలోకి పోతానే ఎనిక్కి తిరిగింది మా యవ్వ.

"ఆ పాముని పుట్టినింటికి సాగపంపినట్ల సాగనంపితివి, సంపితే పాయెగదవ్వా!" అనంటి.

"యేంటికప్పయ్యా! దాన్ని సంపేది. అదేం జేసిందిరా మనకి పాప్కు దాని తిండి యాడన్నా దొరుకుతాదేమోనని యెతుక్కుంటా వచ్చిండాది" అనె మా యవ్వ.

"అది గాదవ్వా! దాన్ని అట్లే బతకనిస్తే ఎవుర్నన్నా కాటేస్తాది గదా!" అనంటి.

"ఏం లేదప్పా! అది ఊరుకూరికేనే ఎవుర్నీ కాటెయ్యదు. మనుసులం గదా... మనకి ముందు సూపు ఎక్కువరా! అందుకే అది కాటేస్తాది, ఇది కరుస్తాది, ఇంకొగటి కుడుతాది అంటానని అన్నిటినీ సంపేస్తావుంటాము. అవీ మనట్లా ప్రాణాలే నప్పా...! అవిట్లకి మనమాదిరి ముందు సూపు లేదు పాప్కు! దాన్ల ప్రాణాల్ని కాపాడుకోనేకి మాత్రమే అవి కాటేస్తాయి. లేదంటే కుడతాయి. అంతకు తప్పా అనవసరంగా యానాడు మనకి అపకారం జెయ్యవు. అవన్నీ విషపురుగులనీ మనము తేలు కనబడితే సంపేదే - పాము కనబడితే సంపేదే, ఆకిరికి జెర్రిపిల్ల కనబడినా సంపేదే! ఈ అడవిలో అన్నీ సంపుకుంటా పోతే ఎన్నని సంపాల్లప్పా. అసలు అన్నిటికంటే విషపురుగు మనిషేరా" అంటానే ఎనిక్కి తిరిగింది మా యవ్వ.

అవ్వతో పాటి నేనూ వచ్చి మళ్లీ మంచం మింద కూకుండాను. తోట చుట్టు పక్కల ఎంతెంత పెద్ద పాముల్ని ఎపుడెపుడు చూసి చెప్తావుంది.

పాముల భయంతో కాళ్లు మంచం మిందే పెట్టుకోని శ్రద్ధగా వింటా వుండాను.

ఎక్కడినించో ఎవురో కేకేసి నట్లయింది. మా యవ్వ చెప్పేది ఆపేసి ఇనింది.

"ఎవురవ్వా!" అనడిగితి.

"ఎవురోనప్పయ్యా! మీ నడిపి తాతోళ్ల చేన్లో గొర్లోళ్లేమోరా! ఎవురికోసరమో కేకలు యేస్తా వుండారులే!" అంటానని మళ్లీ మళ్లీ చెప్పేకి మొదలు పెట్టింది.

ఈ సారి మరింత గట్టిగా - "ఓ పిన్నమ్మా" అంటానని కేక విని పిచ్చె.

"అవ్వా నిన్నే - పెద్దవారాదప్ప చిన్నాయన పిలుస్తావుండాడు. మిద్ది కాట్నించి!" అనంటి.

"అవున్రా నిజమే" - అంటానే మా యవ్వ గూడా "ఏమప్పయ్యో - వారాదీ!... ఏమీ... అంటానని గావుకేక పెట్టె గొంతు చీలి పోయేటట్లు

అప్పుడు బదులు కేక దూసుకోని వచ్చింది- ఓ పిన్నమ్మా ఊర్లో అగ్గి బడింది. అగ్గిబడిందీ బిరీన రా, రా! " అంటానని

"ఊగురే... వస్తానప్పా ! వస్తాను, వస్తాను" అంటానని మా యవ్వ తిరిగా కేక పెట్టే

"పదరా పోదామి ఊర్లో ఇండ్లు అంటు కుండాయంట... ఎవురెవురిండ్లు కాలిపోయనో గదరా !" అంటానని గొణుగుతా బిరి బిరి ఇంటికి బీగము యేసి, చెప్పులు యేసుకోని యల్లబారే నేను మా యవ్వ యెనకే-

మాకుక్క జిమ్మిగాడు కూడా మాతో పాటే యల్లబారింది.

"నీకేం పనిరా ఈడ వుండకుండా యల్లబారతా వుండావు". అంటానని జిమ్మిగాన్ని కసిరింది.

అక్కడ కుక్కకీ, ఆవులకీ పాములకీ మా యవ్వ భాష బాగా అర్థమయి తుందేమో మరి

జిమ్మిగాడు అట్లే ఆగిపోయింది.

మే మిద్దరుమూ మా పెద్ద తాతోళ్ళ మిద్దె కాడికి చేరేదప్పటికి ఆడ ఎవరూ పిల్లాకంత మనసి లేకుండా అప్పటికే ఊర్లేకి పోయినారు.

ఇంగేం జేసేదీ- మీ మిద్దరమే అవ్వా మనుమడూ ఊర్లేకి

ఎల్లబారితిమి

మిట్ట మిందికి పొయ్యే దప్పటికి ఊరు కనబడుతాంది. మాగేర్లోనే అగ్గి బడినట్లు పెద్దగా వెలుతురు వస్తా వుండాది. అది జూస్తానే ఎద బాదుకొనేది మొదలు బెట్టె మాయవ్వ "ఇంగెట్లప్పా జేసేది ... అంతా నాశనమైపోయ గదరా ! మన గేరంత కాలి పోయేనప్పా ! మనిల్లు కూడా కాలిపాయెరో... కాలిపాయె... మొన్ననే నాలుగు మూట్ల వడ్లూ, రెండు మూట్ల జొన్నలూ, అర్ధమూట కందులూ ఆడ బెట్టి వస్తి గదరా అంతా కాలి బూడిదయిపాయె... ఈడ వున్నా పున్నెమాకట్ల వుంటాండే గదరా!" అంటానని ఏడుపు గొంతుదో రాగాలు తీసి అంటా వుండాది.

మా యవ్వ మాటలకే నాకి గూడా ఏడుపొస్తావుండాది.

"లేదు లేవ్వా ! మనిల్లేమీ కాలి పోయిండదు" అనంటి అట్లా అన్నానే గాని నాకి గానీ తెల్దు ఏందో మా యవ్వకి ధైర్యమిచ్చేకి అట్ల మాట్లాడినాను అంతే -

"అట్లే గానప్పా ! నీ నోటి సలవతో అట్లే గానిరా" అనింది. కొంగుతో ముక్కు తుడుచుకుంటూ ఉరికెత్తినట్ల నడుస్తా వుంది. మా యవ్వ

ఊరిదెగ్గిరికి పోతావున్నెట్లే మంటలు మా ఇంటి పక్క కాదు, అన్నది మా యవ్వకి రూడి అయిండాది.

"మనోళ్ల ఇండ్లన్నీ కాలిపాయెరా - అంతా పాడయిపాయె గదరా ! ఇంగేమి జేసేది, నలుమాలుగాని ఇల్లు కాలిపాయె నేమో, సన్న తిప్పగాని ఇల్లు కాలిపాయెనేమో, అంటానని మా యవ్వ తమ్ముళ్ళ ఇండ్లనీ, దెగ్గర బందువలు ఇండ్లనీ పేరు పేరున చెప్తావుంది. ఏడుపు గొంతుతో.



తీరా మా గేర్లొకి పోయే తలికి అగ్గి బదిండేది అడగాదు, మా గేరికి అవల వుండే గేర్లో నింటీ మంటలు కనబడతావుంటాయి.

ఎవురేగాని ఇండ్లలో లేరు. అందరూ ఆడికే పోయి నట్లుండారు.

"లచ్చుమమ్మొదినా ! పోతావుండేది"- అన్న మాటలు పక్కనుండే ఇంటిలోనించి వచ్చినట్లయి తిరిగి చూస్తిమి ఇంటి వారు పాకలో వుండే అరుగుమింద దుప్పటి కప్పుకొనిండే ఆకారము కనిపించింది.

"నేనమ్మో వదినా ! ఓళేసప్పని". అంటానని ఆ ఆకారం "యాడన్నా ! అగ్గిబదిండేది - మన గేర్లోననుకోని ఆదాబాద ఉరికెత్తుకుంటా వస్తిమన్నా - మేలే, మన గేరికాదు. నిజ్జంగన్నా ! నా కయితే కాళ్ళూ జేతులూ సల్లగయి పొయే మనోళ్ళంతా ఏమయిపాయెరో గదరా, అని నడుగు అంటుకోనిందన్నా ! ఇప్పుడు పాపం కొంచెం కుదుట పడింది. యాడన్నా ! అసులు అగ్గి బదిండేది. కుమ్మరోళ్ళ ఇండ్ల కల్లానా ? అనడిగె మా యవ్వ.

"కాదొదినా మాదిగ గేరిలో కొట్టాలు అంటుకుంటాయి. ఊరు ఊరంతా ఆడే వుండమ్మో... నేను నడవలేను గదా అందుకే ఈడే ఉండి పోతి" అనె ఓళేసప్ప తాత.

"అట్లానా ! అయ్యెయ్యో ! యంత పనయ్యిందన్నా ! నారాయణిగాడు ఎట్లుండాడో, ఆ పిల్లోని కొట్టం గీన కాలిపాయెనో, యేమో, వాడు గంపెడు పిల్లలుంటే వాడు పొప్పు యేమాయెనో గదప్పా !" అంటానని ఏడుపు గొంతుతో మాట్లాడు కుంటానే ముందుకు నడిచింది మా యవ్వ.

మాదిగ గేరిలో ఒక్క నారాయణప్ప మిందే ఎందుకంత ఇది. యాలంత బాధపడతా వుండాది. ఆ మాటే అడిగితే మా యవ్వని.

" వాడు మనింటి ఆయాగాడప్పా ! మనకి చెప్పులు కుట్టేది ఆ పిల్లోడే. మన చేన్లో, తోట్లో యా పనికన్నా సరే పిలిస్తే సాలు- " వస్తాలేత్తా! " అంటానని చేతిలో పని పక్కకి పారేసి వస్తాడురా !

వాడికి కడుపు నిండా పిల్లోల్లప్పా ! ఐదుగురు ఆడ పిల్లోల్లా ఎట్లో గుట్టు చప్పుడు కాకుండా సంసారాన్ని ఎల్లీడు కొస్తావుండాడురా" అట్లా వాని కొట్టం కాలిపోతే ఎట్లా అనేదిరా నా యదారంతానూ.." అనే మా యవ్వ.

" అంటే మాదిగ గేరంతా ఏమయి పోయినా పరవా లేదా ?" అనడిగితి.

"నువ్వెక్కడోనివిరా ! తిక్కోడా ! అందరూ బాగుండాలప్పా ! ఆ పద ఎవురికి వచ్చినా బాధ పడతామురా ! అదే మన దగ్గరోళ్ళ కొస్తే ఎక్కువ బాధ పడ్తాము. అట్లా ఆపద మనకి గానీ, మన వాళ్ళకి గానీ రాకూడదని కోరుకుంటాము." అనే మా యవ్వ.

అయిదు నిమిషాలలో మాదిగ గేరి జేరుకుంటిమి. ఆదిజూస్తే ఏడుపులు పెడబొబ్బలూ, వినబడుతుండాయి. ఒక పక్క ఇంకొక పక్క ఆరు కొట్టాలు నిలిచి కాలుతావుండాయి దాన్ల పక్కనుండే కొట్టాలు అంటరికొనే అవకాశాలు ఎక్కువగా వుండాయి. అయితే నారాయణప్ప కొట్టాని కేమీ కానందుకు మా యవ్వ మనసు కుదుట పడింది.

అంటుకోనిండే కొట్టాల్ని ఆర్పేదానికి ఊరు ఊరంతా కష్టపడతా వుండారు. వాళ్ళలో కమ్మోళ్లేమి, రెడ్లేమి, కురువోళ్ళేమి , ఈదిగోళ్ళేమి, అన్ని కులాలోళ్ళూ వుంటారు,

అక్కడ అంటరాని కులాలకు, అగ్ర కులాలకీ పెద్దెన తేడాలు కనిపించలేదు.

రెడ్డి చేతిలోని బిందెని కురవాయప్ప తీసికొని పోతావుండాడు. వైశ్యుల చేతుల్లోని కడవల్ని మాదిగోళ్ళూ, మాలోళ్ళు తీసుకొని పోతావుండారు.

వాళ్ళు మంటల్లో నీళ్ళు గుమ్మరిస్తా వుంటే య మూలలోనూ ఆరిపోలేదు. అయినా పోస్తానే వుండారు. నీళ్ళు మాదిగ గేరి అంతా గోల గోలగా వుండాది.

ఒకవైపు పిల్లా జెల్లా ముసిలీ ముతకా లబలబమంటూ నోరు కొట్టుకుంటా వుండారు.

" ఏం పాడయి పోయె కాలమెచ్చెనర్రా ! మా గేరికి... పాయెనప్పా ! అంతా పాయె.... నాసిన మై పాయె ఇంగేమి జేసేదిరా బగమంతుడా

# ప్రేమ కాటు

కవిత

మందరపు హైమవతి

ఆకాశంలో ఎగిరే పావురాలకు
నేలమీద జల్లిన నూకలే తప్ప
వల కనిపించదు
స్వప్న గగనంలో విహరించే అమ్మాయిలకు
రంగు రంగుల ప్రేమ గాలిపటం తప్ప
కఠిన వాస్తవం కనిపించదు

పొడి మాటల పలకరింపుల
ప్రథమ పరిచయం
ఒక క్షణం కూడ
చూడకుండా వుండలేని వ్యవసనంలా
ఎప్పుడు మారుతుందో తెలీదు

విద్యుత్తరంగాల మోహ ప్రవాహాల
ప్రేమికుని కరాంగుళుల స్పర్శలో
ప్రాణానికి ప్రాణంగా పెంచిన
అమ్మ జ్ఞప్తికి రాని పాట
ముంచెత్తిన కాంక్షా తరంగాల కౌగిలిలో
ఈ ప్రపంచ మొక విస్మృత స్మృతి

ప్రత్యూషా!
లక్షలాది ప్రేక్షకుల
అభిమాన నాయికా
నీ క్రీగంట వీక్షణం కోసం
నీ ముంగిట ప్రేమ యాచకుల బారులు
కానీ పెళ్ళికోసం
ప్రియుని ముంగిట
నీవొక భిక్షాపాత్రవు

నటనలో ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ
తారాపథంలో దూసుకు పోవల్సిన
ప్రత్యూష సౌందర్యమిపుడు




ప్రదోషకిరణ విషాదం
ఇద్దరు కలసి విషం తీసుకున్నప్పుడు
ఒక్క అమ్మాయి మాత్రమే
ఎందుకు మరణిస్తుందో
నాకెప్పటికీ అర్థం కాని ప్రశ్న
సి.బి.ఐ. కూడ భేదించలేని రహస్యం

మంచినీళ్ళు తాగితే
ప్రతిఫలించే గాజుకంఠం
ఒక్కొక్క చుక్క విషం
గొంతులో దిగుతుంటే
కాలిపోయిన కాగితంలా
కమిలిపోవడం ఎంత వికృతం

ప్రేమ సర్పం సిద్ధార్థుడు
కాటేసిన పచ్చని జీవనతరువు
కళ్ళముందే కాలి బూడిదైన దృశ్యం
అమ్మ కడుపులో ఆరని అగ్ని గుండం

ప్రపంచీకరణ నేపథ్యాల
అబద్ధాల ప్రేమల
మోసాల పెళ్ళిళ్ళ యుగంలో
పాము కాటుకు మరణించిన
ప్రేయసి ప్రమద్వరకు
సగం ఆయుష్షు నిచ్చిన
రురు మహర్షి లాంటి ప్రేమమూర్తి
ఎప్పటికీ అలభ్యం

! పిండీ నూకలు పాయె - జొన్నలు సద్దలు పాయె, బట్టా బాతా పాయే కుండా సట్టీ పాయె. ఇంగేమి జేసేదప్పా" అంటానని ఒక ముసల్డి ఎదబాదుకుంటా పాదుకొని ఏడుస్తా వుంది. ఆయమ్మతో పాటి మా యవ్వ గూడా ఎద బాదుకుంటా వంత పాడతావుంది.

కండ్లముందే ఆరు గుడిసెలు తగులబడతావుంటే - ఎన్ని నీళ్ళు పోసినా మంటలు మరింత ఎక్కువయితా వుంటే ఏం చేయాలో ఎవురికీ తోచకుండా వుండాది.

అదృష్టమేమంటే గాలిలేదు. లేకుంటే ఆగేర్లో వుండే ముప్ఫయి కొట్టాలు మాత్రం జాగ్రత్త తీసుకుంటారు.

అంతా అయ్యే తలికి అర్థరాత్రి మీరిపాయె

వచ్చేదప్పుడు మా యవ్వతో " అది కాదవ్వా ! మామూలుగా అంటూ ముట్టూ అని దుండే పెద్ద కులమోల్లు కూడా ఈ పొద్దు అవేమీ పట్టిచ్చు కోకుండా మాదిగోల్ల కొట్టాలు ఆర్పేకి వచ్చినారు. నిజంగా నాకి బలే సంతోషమయ్యింది. అంతా బాగ కలబడినారు. కదవ్వా " అంటివి.

"ఏమనుకుంటివి రా ! ఒక ఆపద వచ్చిందిరా అంటే అందరూ అట్ల కలబడి ఒకటి కావల్ల. ఆ ఆపద మాదిగోళ్ళది మాత్రమే కాదురా సన్నోడా ! మాదిగ్గేరికి అవతల వుండే గద్దిదొడ్డెండ్లన్నీ ఎవురివి అనుకుంటివి ? ఆ మంట లార్పే రెడ్డోళ్ళవీ, కమ్మోళ్ళవీ, అందుకే అంత అంటు ముట్టు లేకుండ మంటలార్పుతా ఉండేది" అనింది మా యవ్వ ఎక్కడో పంటి కింద రాయి పడినట్లు అనిపించింది నాకి.

# కుదువపడి కాలిపోయిన చెట్టు

కవిత

జగన్



పోలీస్ తండ్రి
తాళ్ళతో కట్టి బూట్లతో తన్నింది గుర్తుకొచ్చి
చదువుకు శాశ్వతంగా కుదువ పడింది సత్యమే
అసహాయతను అగ్గిని ఓపలేక... అపస్మారక ప్రకంపనాలు
మృత్యు కలశాన్ని నెత్తి కెత్తుకున్నదీ నిజమే

* * *

కాళ్ళను రోడ్డుకు కట్టివేస్తే
ప్రాణానికి
పాదానికీ
మధ్య
ఎప్పటికీ పూడ్చలేని ఖాళీ
ఏ భరోసా లేక కూలబడిన గాలి

* * *

రాని ఎక్కాలకు ఎక్కిళ్ళు పట్టి ఏడ్చిందీ లేదు
పంతులమ్మ వేళ్ళు విరగ్గొట్టిందనీ
ఇంగ్లీషు పాఠాలు ఒప్పచెప్పిందీ లేదు
నువ్వు అంటే మీరు అనడమే మర్యాదనీ కొడితే
చేతులు చాపక చేసిందేమీ లేదు
మార్నింగ్ షోలో
స్మితా పాటిల్ని, నానా పటేకర్నీ జోహుకుం అన్నాను
కోఠీలో కొలువు తీరాయ్ నెత్తికెక్కని డిక్షనరీలు... గ్రామర్లు
రెన్ మార్టిన్‌ను కుదువ పెడితే సగం ధరే వచ్చింది
అక్షరాలు నేర్చినందుకే సంబరపడ్డ నాయనమ్మ అమ్మ నాయిన
అరవై మార్కులు తెచ్చుకోవాలని పోరిందీ లేదు
మ్యాట్నీ కానిచ్చేద్దామని దిగాను బ్లాకుకు
లాఠీ దెబ్బలకు వాచిపోయాయి కొంకులు

* * *

పరీక్షలకు గైడ్‌లు చదవలేక నకల్ కొట్టిందీ నిజం
పదవతరగతి ఫేలైై మా అమ్మ నేను ఏడ్చి చచ్చింది నిజం
దొంగలెక్కలు చేయలేక చెవులు పిండిచ్చుకుంది నిజం
క్లాసులు ఎగ్గొట్టి
మార్నింగ్‌షోలో మళయాళీ(A) సినిమాలు చూసిందీ నిజం
బాపన్ పోరీకి కనుగొట్టి... చిట్టీలు పంపి చంపలు వాయకొట్టిచ్చుకుందీ నిజం
లాగులపై మాసికలు...
తల దించుకున్న వీర తెలంగాణ రైతు బిడ్డల అభిమాన గతం

* * *

పారిపోయాను పదే పదే! బడి నుంచి... ఇంటి నుంచి...

* * *

గజ్జి పుండ్ల బాల్యం...! నల్లులతో గడిచింది
తినడానికి ఏదీ దొరకక ఎవరినీ అడగక
పొట్ట వెన్నముకకు అంటుక పోయింది
కప్పుకోవడానికి ఏమీ లేక చిమ్మ చీకటిలో
చలినుంచి చాప కాపాడింది
చాయి బన్ను చారాణా కోసం సాచిన రోజులు
గణేష్ బీడీలు, దాల్ రైసులతో సరిపెట్టుకోలేదు
ఇరానీ కేఫ్‌లో కడిగాను ఎంగిలి గ్లాసులు
పుండ్లు పడి పుచ్చిపోయాయి చేతులు
తొడుక్కున్న లాగును మల్ల మల్ల తొడుక్కున్నాను
చీరుకపోయాయి గజ్జలు

* * *

పగటి బాల్యం ఫుట్‌పాత్‌ల పాలైంది
అర్ధరాత్రి కౌమార్యం అవిటిదై... రైల్వేస్టేషన్లలో
నలిగింది.

* * *

బొద్దింకలు ఎద్దు బొమికలు
లక్క పురుగులు పుస్తకాల సావాసాన
పుట్టగతులు
లేని పునరావాసిని

* * *

దండలు మార్చిన పాపానికి
సంసారిని
పుస్తే
తెంపుకోవడమే
మిగిలింది
నీకు
ఇక

విశ్లేషణ

నాళేశ్వరం శంకరం



# ఈ శతాబ్దపు తాలకరి కవిత్వం

దేశ భాషలలో తెలుగు భాషా కవిత్వం ఒక ఇంద్రధనస్సు లాంటిది. ఒం అగ్ని ఖడ్గం లాంటిది. ఒక శీతల జలపాతం లాంటిది. ఒక సాగరపు హోరు, అలల విన్యాసం, అట్టడుగు పొరల్లో దాగిన కవిత్వ ఖనిజ సంపద అంతాయింతా కాదు. సృజనాత్మక ఫలసంపదకూ, పంటపొలాలకూ, ఘర్మ జలాలకూ గొప్ప వారసత్వ శీలం గల కవిత్వం మనదే.

ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవనాన్ని పరిరక్షించగల, దిశానిర్దేశం చేయగల సామర్థ్యం మన కవిత్వానికుంది. వేగుంట మోహనప్రసాద్ గారితో మొదలు పెట్టి వరవరరావు గారి కవిత్వం దాకా తిరగవేసినా, అనేక ఉద్యమ కవిత్వాలతో మొదలు పెట్టి , వివిధ వాదాల కవిత్వం దాకా నెమరు వేసుకున్నా ఇంత పర్ఫెక్షన్ ఈ ప్రక్రియకున్నందుకు గర్వపడాలి. అయితే తామే వెయ్యి కాపీలు అచ్చు వేసుకుని కవులకూ, రచయితలకూ, విమర్శకులకూ, పత్రికా సమీక్షకులకూ, సాహిత్యాభిమానులకూ పంచి పెట్టుకునే విషాదంలో ఉన్నందుకు బాధగానే వుంది. అసంఖ్యాక ప్రజలకు చేరవేయగల శక్తిసామర్థ్యాలు కవులకు లేనందునా, స్థానిక బహుళజాతి పుస్తక ప్రచురణ సంస్థలు లేనందునా (ఉన్నావేయవు) మన భాషాకవిత్వం దేశీయ కవిత్వంలోకి గానీ, అంతర్జాతీయ వేదికల మీదికి గానీ మన కవిత్వ అనువాదాలు యేమాత్రం రానందునా మన కవిత్వం మన జాతిలోనే భూస్థాపితమైపోతోంది. అయినా సరే మన కవులు నేల విడిచి కవిత్వం రాయరు. గారడీ కవిత్వ విద్యను ప్రదర్శించరు. మూస కవిత్వాన్ని గౌరవించరు. కవుల కవిత్వ నిఘా యెల్లప్పుడూ సంక్షుభిత సమాజం మీదే. రాజకీయ రణరంగం మీదే. పాలక హింసను ధిక్కరించే ఖడ్గచాలనం మీదే. కాకపోతే అడపాదడపా అనుభూతి, ఆధునికానంతర అనుభూతి ద్వారాలు తెరిచి స్వేచ్ఛా స్వరాలతో తమతో సహ ధిక్కరించే ఫెళ ఫెళార్పాటులు చేయగలరు. బాధ్యత గల కవులు లక్ష్యసిద్ధి కోసం చేదువిషం జీవఫలాన్ని ఎత్తిచూపే కవిత్వం రాస్తే, కీర్తిభజనల కవులు మాత్రం తామే పకడ్బందీకవులుగా గణత కెక్కడానికి కారణం యేమిటో తప్పక ఆలోచించాలి.

ఈ సంవత్సరం కవిత్వం పంటపొలాలకు నీళ్ళు మళ్లించే విధంగానే వుంది. పాట ప్రక్రియ తరువాత యే ప్రక్రియలో లేని భావోద్విగ్నత, ఊహాశక్తి, సృజనాత్మక నిర్మాణం, మానవ మనోసీమల్ని ప్రభావితం చేయగల గాఢత తెలుగు కవిత్వంలో బలంగా పెరిగింది. ఈ సంవత్సరం వచ్చిన వచన కవితా సంకలనాలు, సంపుటులు తిరగేయండి. వీటితో పాటు దిన, వార, మాస ప్రత్యేక

మన భాషాకవిత్వం దేశీయ కవిత్వంలోకి గానీ, అంతర్జాతీయ వేదికల మీదికి గానీ మన కవిత్వ అనువాదాలు యేమాత్రం రానందునా మన కవిత్వం మన జాతిలోనే భూస్థాపితమైపోతోంది. అయినా సరే మన కవులు నేల విడిచి కవిత్వం రాయరు. గారడీ కవిత్వ విద్యను ప్రదర్శించరు. మూస కవిత్వాన్ని గౌరవించరు. కవుల కవిత్వ నిఘా యెల్లప్పుడూ సంక్షుభిత సమాజం మీదే.

నాళేశ్వరం శంకరం
• కవి, పరిశోధకుడు

సంచికలలో అచ్చయిన నక్షత్ర మెరుపుల్లాంటి కవిత్వాలను ఒక చోట చేర్చుకుని అధ్యయనం చేయండి. మన కవిత్వపు లోతు, విస్తృతి, విశాలత్వం అర్థమవుతుంది. సిద్ధాంత గ్రంథం చదువలేదు. కవిత్వం మీద ప్రేమకొద్దీ చదివాను. చదివిన తరువాత నాకేర్పడిన అభిప్రాయాలను మీతో పంచుకోవడానికే యీ ప్రయత్నం.

2001 అత్యంత దారుణమైన సంవత్సరం. యుద్ధాలూ, కన్నీళ్ళూ, ఆత్మహత్యలు మిగిల్చిని సంవత్సరం. మతోన్మాదానికి పురి గొల్పిన సంవత్సరం. అప్రజాస్వామిక గుత్తాధిపత్య రాజకీయ, ఆర్థిక్యవస్థలు మన గుమ్మంలోకి పాదం మోపిన సంవత్సరం. అమెరికా, అఫ్ఘానిస్తాన్ యుద్ధ భయోత్పాతం వల్ల రాజకీయ పెత్తనం యెలా వుంటుందో తెలిసి వచ్చింది. రాజ్యహింస పౌరహక్కుల కోసం ఉద్యమించిన వాళ్ళను పొట్టన పెట్టుకోవడం వల్ల దాని కార్యాచరణ బయట పడింది. ప్రపంచీకరణం వల్ల బహుళ జాతి సంస్థలు బాగుపడ్డాయో, బహుజనులు బాగుపడ్డారో తెలిసి వచ్చింది. ఇలా ఈ సంవత్సరం సంభవించిన సమస్యల మీద యెంతో కవిత్వం వచ్చింది. కవితా సంకలనాలు వచ్చాయి. గ్లోబల్ ఖడ్గం, కగితపులి కళ్ళలో భయం, ప్రశ్నల యాది, వెంటాడే కలాలు, ముద్ర, ఏడుపాయలు, సీమ కవిత, కడుపు మీద కొట్టకుండ్రి.

అక్షరం వేదికవాళ్ళు 'గ్లోబల్ ఖడ్గం' అనే సంచలనాత్మకమైన కవితా సంకలనం తెచ్చారు. ఈ సంకలనం తిట్లకూ, దీవెనలకు గురయింది. ఇందులో విద్యుత్ ఘాతుకాన్నీ, ప్రపంచీకరణను నలభై యెనిమిది మంది కవులు, కవయిత్రులు ముక్త కంఠంతో ధిక్కరించారు. అన్వర్ 'వలసల యవ్వనం' అఫ్సర్ 'గ్లోబలిటీస్', కృష్ణమూర్తి యాదవ్ సిక్కంల పడ్డ సంగం, జూకంటి జగన్నాథం 'వాస్కోడిగామా. కామ్', నాళేశ్వరం శంకర్ 'గ్లోబల్ ఖడ్గం', కొండేపూడి నిర్మల 'సీజనల్ లవ్', కోడూరి విజయకుమార్ 'ఒక హెచ్-1 కల', ఖాజా 'నరం తెగిన కవాసు', దేవిప్రియ 'కొన్ని ప్రశ్నలు ప్రేమతో....!' పొట్లపల్లి శ్రీనివాసరావు 'బర్కతు లేని బతుకు', యం. రత్నమాల 'సామ్రాజ్యవాదమే మృత్యువు', రాణి

2001 అత్యంత దారుణమైన సంవత్సరం. యుద్ధాలూ, కన్నీళ్ళూ, ఆత్మహత్యలు మిగిల్చిని సంవత్సరం. మతోన్మాదానికి పురి గొల్పిన సంవత్సరం. అప్రజాస్వామిక గుత్తాధిపత్య రాజకీయ, ఆర్థిక్యవస్థలు మన గుమ్మంలోకి పాదం మోపిన సంవత్సరం. అమెరికా, అఫ్ఘానిస్తాన్ యుద్ధభయోత్పాతం వల్ల రాజకీయ పెత్తనం యెలా వుంటుందో తెలిసి వచ్చింది

శివశంకర్ 'ఇంద్రుడూ చంద్రుడూ రాముడూ లక్ష్మణుడూ హిట్లరూ ప్రజాస్వామ్యమూ', సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'విద్యుత్ దహన నాటిక', సూర్యవంశి 'డంకెల్ పారం - పన్ను - ప్రపంచబ్యాంకు', వేముల ఎల్లయ్య 'ఒరక్కా మొక్కరా', వరవరరావు 'జంటనగరాలలో ఫైబర్ తుఫాన్', ప్రసేన్ వంశీకృష్ణ సీతారాం అఫ్సర్ 'టేకోవర్' జయధీర్ తిరుమలరావు 'కొత్తమలుపులు', శివారెడ్డి 'ఆగస్టు-28', అద్దేపల్లి రామమోహనరావు 'కొండచిలువ దండయాత్ర', ఎస్వీ 'క్షీరసాగర మధనం', జ్వాలాముఖి 'క్షీణ చంద్రుడు, కందుకూరి శ్రీరాములు 'బషీర్‌బాగ్' దర్భశయనం 'ఉనికి', లోకేష్ 'ఒక తైనాతీ మరియు మాయల ఫకీరూ', యాకుబ్ 'పెంజీకటి', మద్దూరి నగేష్‌బాబు 'దిష్టి' కవితలు విద్యుత్తు సంస్కరణల్నీ, ప్రపంచీకరణనీ, సరళీకృత ఆర్థిక విధానాల్నీ ధిక్కరించారు. విద్యుత్ ఉద్యమాన్ని అణచి వేసిన పాలకుల దుర్బుద్ధిని ఖండించిన కవిత్వంతో పాటు, ప్రపంచీకరణను నిలదీస్తూ, స్థానికీకరణను సమర్థించిన ఈ కవిత్వాన్ని హక్కున చేర్చుకోవలసిన అవసరం యెంతైనా వుంది.

'కాగితపు పులి కళ్ళల్లో భయం' అనే కవితా సంకలనాన్ని విరసం ప్రచురించింది. ప్రజాదరణ పొందిన కవితలు చాలా ఉన్నప్పటికీ ఈ సంకలనం పై ఘాటైన విమర్శలు రావడం, చర్చలు, వాదోపవాదాలతో పాటు వేడి వేడి ఎండలను కూడా కవులు స్వీకరించడం ముదావహం. ప్రపంచీకరణను సమర్థించేవాళ్ళు ఈ సంకలనాన్ని వ్యతిరేకించారు. ఇందులోని ప్రతి కవిత అమెరికా యుద్ధోన్మాద వ్యతిరేకతను విప్పి చెబుతుంది. సాధారణ పాఠకుడు సైతం ఈ సంకలనాన్ని చదివి యుద్ధానికి కాలు దువ్విన అమెరికాను వ్యతిరేకించగలడు. రెంటాల కల్పన 'మూడు యుద్ధాలు', హెచ్చార్కె 'గౌతమ్ 'మనోగ్ర ప్రతిఘటన', నాళేశ్వరం శంకరం 'డాలర్ యుద్ధం', వరవరరావు 'మర్చంట్ ఆఫ్ వెనిస్', ఆశారాజు 'తెగిన భుజకీర్తులు', జూలూరి గౌరీశంకర్ 'మూడు ప్రపంచాలు', వంశీకృష్ణ 'యుద్ధ శకలాలు', అనే కవితలు అమెరికా అధీకృత రాజకీయ హింసని ధిక్కరించిన ప్రతి కవితలోనూ విలక్షణత దాఖలాలు స్పష్టంగా కనిపిస్తాయి.

రాజ్యహింసకు పౌరహక్కుల నాయకులు పురుషోత్తం, ఆజం అలీల హత్యకు గురయ్యారని, ఈ హింసను ధిక్కరించాలనీ, వాళ్ళను స్మరించుకుంటూ రాసిన కవుల సంకలనం ప్రజల ముందుకు తెస్తే, ప్రజలు మరింత చైతన్యవంతులు కాగలరనీ, చైతన్యవంతుల్ని చేయాల్సిన అవసరం ఈ సందర్భంలో యెంతైనా వుందనే బాధ్యతతో విరసం ప్రచురించిన మరొక సంకలనం 'ప్రశ్నలయాది' పౌరహక్కుల మీద, నాయకుల మీద, సానుభూతిపరుల మీద పెట్టే నిర్బంధాలను ఈ కవితలు వ్యతిరేకిస్తాయి. ఆలీ స్మృతులు తలచుకుంటూ రాసిన ఎలిజీ కవితలు అధికంగా ఉన్నాయి. ఆజం ఆలీని గౌతమ్ తలచుకుంటూ "ముసల్మాన్ బిడ్డా! ఆజం అలీ, కోట్ల హృదయాల వొకే వొక్క సగర్వ ప్రకటనా, నీ దేశభక్తికి పరిపరి వందనాలు" అని ఆత్మను తెచ్చుకుని "జీవగంజి వేనోళ్ళకు, జీవించే హక్కు నేర్పి, ఏ దిక్కు లేనోళ్ళకు, పోరాడే దిక్కు చూపి, మా నోట్లో నాలుకైతివో - మాయన్నా పురుషోత్తమా, మా గూట్లో దీపమైతివో మాయన్నా పురుషోత్తమా" అని ఆవేశాన్నీ, దుఃఖాన్నీ మేలవించి రాశారు. వీరి కవితలతో పాటు మజ్హాల 'దృశ్యం', వడ్డెబోయిన శ్రీనివాస్ 'అప్పులు-హక్కులు-హత్యలు', రివేరా 'హంతకుడు నిజం చెప్పడు', కందుకూరి రమేష్‌బాబు 'జ్ఞాపిక', కళ్యాణరావు 'మళ్ళీ చిగురించేది',

దేశపతి శ్రీనివాస్ 'పాలమూరు మట్టిబిడ్డ' వంటి మంచి కవితలు ఈ సంకలనంలో ఉన్నాయి. మాట్లాడాల్సిన వాళ్ళంతా మౌనంగా వుండి, మాట్లాడుతున్న ఒక్కడే మాట్లాడుతూ వుంటే, వాడు మాత్రం ఎంతకాలం మాట్లాడనిస్తాడు? కామ్రేడ్స్ మాట్లాడదాం! మనమంతా మాట్లాడదాం" అనే భావనను సమీకరించిన మంచి కవితలు ప్రయత్నాన్ని తప్పక అభినందించే విధంగా ఉంది.

### రాయలసీమలో

రాయలసీమలో యెన్నో విషయాలలో వెనకబడి ఉన్నట్లే కవిత్వంలోనూ వెనకబడి ఉంది. రాయలసీమ స్థానిక సమస్యలనూ, ప్రజా జీవన దుఃఖాన్నీ, క్షామాన్నీ, విషాదాన్నీ. ఫ్యాక్షన్ సంస్కృతినీ, దాహార్తితో విలపిస్తున్న సీమనేలని వర్ణించిన, విశ్లేషించిన, దృశ్యమానం చేసిన మంచి కవితా సంకలనం 'సీమ కవిత' సీమ కవిత్వాన్ని సీమేతర ప్రాంతాల వారికి, కవిత్వం ద్వారా తమ బతుకు వున్నకాన్ని మొదటి ప్రయత్నంలోనే ఫలవంతంగా అందించినందుకు 'మిత్రజ్యోతి' ప్రొద్దుటూరు వారిని అభినందించాలి. తెలంగాణా విప్లవకవి ఈ 'సీమకవిత' కు ముందుమాట రాయడం గౌరవంగా ఉంది. ఇందులోని కవిత్వాన్ని వరవరరావు విశ్లేషిస్తూ "రాయలసీమలో ఎంతగా ఫ్యాక్షన్ సంస్కృతి గురించి మాట్లాడుకుంటున్నామో, ఈ సంకలనం కూడా ఊహించ గలిగినన్నీ ఇమేజరీలతో చెప్పిందో, అంతే బలమైన కమ్యూనిస్టు పార్టీ చరిత్ర కూడా ఉన్నది. ఈ చరిత్రకు బొమ్మా బొరుసు ఉండవచ్చు, అంతటా ఉన్నట్లే, కాని వాళ్ళనుంచి చెకుముకి రాళ్ళు, నిప్పురాళ్ళు, చెరుగుతున్న చరిత్ర దాఖలాలు ఈ సంకలనం లోనూ కనిపిస్తాయి. పరారీలో ఉన్న పాతపాటకు పోటీలో నిలిచి గెలవగలమని నిజం చెప్పే పోరాట పాటల సమాధానాలు ఇందులో ఉన్నాయి. ఇది ఎండిన మట్టే కాదు మండుతున్న మట్టి" కూడ అంటారు. ఇందులో విద్వాన్ విశ్వం 'పెన్నేటిపాట' మొదలుకొని రఘువర్మ 'రుద్రసీమ' వరకు నలభై యెనమండుగురి కవితలున్నాయి. నాగప్పగారి సుందరరాజు, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, దాదాహయాత్, రాదేయ, గోపినీ కరుణాకర్, రాప్తాడు

దళిత కవిత్వం ఈ సంవత్సరం విస్తృతమైంది. సూక్ష్మమైన అనుభవాల్ని సాహిత్యవేదిక మీదికి తీసుకు రాగలిగింది. దళితకవిత్వంలో మాలమాదిగల 'ఫేన్' అర్థం చేసుకుంటున్న సందర్భంలోనే వెనుకబడిన కులాల కవుల కవితా సంకలనం జూలూరు గౌరీశంకర్ సాహసం చేసి తేగలిగారు.

గోపాలకృష్ణ, నూకా రాంప్రసాద్ రెడ్డి, ఎస్. జయ, హనుమంతరెడ్డి, మహమూద్, షమీవుల్లా, జహీర్ అహమ్మద్, అబ్దుల్ ఖాదర్, వులికంటి కృష్ణారెడ్డి, నన్నవు రెడ్డి వెంకటరామిరెడ్డి, జూపల్లి ప్రేమ్‌చంద్, దినకర్, భావన, ఎ.ఎస్ మొదలగు కవుల కవిత్వాలు ఒక నిర్దిష్టతనీ, స్థానిక జీవన సంఘర్షణనీ, గాయాన్నీ తమతమ స్వానుభవాల్లోంచి సీమను దృశ్యమానం చేయగలిగారు.

దళిత కవిత్వం ఈ సంవత్సరం విస్తృతమైంది. సూక్ష్మమైన అనుభవాల్ని సాహిత్యవేదిక మీదికి తీసుకు రాగలిగింది. దళిత కవిత్వంలో మాలమాదిగల 'ఫేన్' అర్థం చేసుకుంటున్న సందర్భంలోనే వెనుకబడిన కులాల కవుల కవితా సంకలనం జూలూరు గౌరీశంకర్ తేగలిగారు. ఈ సంకలనం పేరు 'వెంటాడే కలాలు', ఈ సంకలనం వస్తూ వస్తూనే సంచలనంతోనే వచ్చింది. ప్రసేన్, జూలూరి గౌరీశంకర్ ముందుమాటను ముఖ్యంగా దళితులు అధిక్షేపించారు. విమర్శ పెట్టారు. వెంటాడే కలాలను వెంటాడే కులాలుగా ఎత్తి పొడిచారు. అయినప్పటికీ తెలుగు కవిత్వంలో కులాల ఆదిగ్రంథం కూడా. దళిత కులాలలో యెన్ని వందల కులాలున్నాయో అన్నివందల సంకలనాలు రావడంలో తప్పులేదు. వాళ్ళ వాళ్ళ 'పేన్స్'ను వినిపిస్తే యేమవుతుంది. భావప్రకటన ఇప్పుడిప్పుడే వెనకబడిన కులాల కవులో బలంగా అధిక సంఖ్యలో చేయాల్సిందే. అయితే బాధకు పరిష్కారం గురించి ఆలోచించేటప్పుడు యేదారి గుండా వెళితే శాశ్వత పరిష్కారం దొరుకుతుందో ఆదారిని వెతుక్కోవాలి. వారివారి బాధల్లోంచి ఉద్యమస్వభావం పెంచుకోవాలి. రాజకీయ దృక్పథం నిర్ణయించుకుని పని చేయాల్సిన అవసరం వెనకబడిన కవులకు ఉంది. వెంటాడే కలాల్లోని కవిత్వం మిగతా సంకలనాల కన్నా భిన్నమైంది. ఇందులోని కవులు కులవృత్తుల నేపథ్యంలోంచి రాశారు. కుల సమస్యల్లోంచి ప్రపంచ సమస్యల దాకా బతుకును విశ్లేషించుకునే నైపుణ్యం ఈ కవులకుంది. బాణాల శ్రీనివాసరావు, బెల్లి యాదయ్య, దెంచనాల శ్రీనివాస్, జి. విజయలక్ష్మి, జుగాష్‌విలి, జూలూరి గౌరీశంకర్, జూపల్లి ప్రేమ్‌చంద్, కో.ప్ర., యం. వెంకట్, మందవరపు హైమవతి, నాళేశ్వరం శంకరం, ప్రసేన్, సీతారాం, ఎన్.గోపి, యస్వీ సత్యనారాయణ సిద్ధార్థ, వరదయ్యల కవితలు వాళ్ళవాళ్ళ నేపథ్యాల లోంచే రాశారు. ప్రసేన్, జూలూరి గౌరీశంకర్ ముందుమాటలో చివర్నిలా అంటారు. ''కులాలు, కులవృత్తులు, ఆ వృత్తుల్లో ఉన్న తమ తాతలు, తండ్రులు, తల్లులు పడిన బాధలను తమ తరుపు చైతన్యంతో పల్లవి కట్టే ప్రయత్నం చేశారు. దళిత కవిత్వానికి లేని అంతర్జాతీయ చైతన్యం ఈ కవులకుంది. విధానంగా మారాలన్న ఆకాంక్షలలో భాగంగా ఈ కవిత్వం వెలువడిందని అన్నారు. 'వెంటాడే కలాలు' సంకలనంలో మరికొంతమంది సీనియర్ కవుల్ని చేరిస్తే బాగుండేది.

### కవయిత్రుల ముద్ర

ఇన్నిన్ని సంకలనాల భావాల మధ్యన స్త్రీల కవితా సంకలనం రావడం ముదావహం. శీలా సుభద్రాదేవి, భార్గవీరావులు కలిసి వందమంది కవయిత్రుల కవితల్ని సంకలనం చేసి 'ముద్ర' పేరుతో వెలువరించారు. ముద్రకు యే దృష్టి, దృక్పథం లేదనీ స్త్రీ వాద ముద్ర తగ్గించడానికే ఈ ముద్ర వచ్చిందనే విమర్శ ఉంది. సంపాదకులకు అటువంటి దురభిప్రాయం లేదనే ముద్రను తిరగవేస్తే అర్థమవుతుంది. "ఒకప్పుడు సాహిత్యానికి ముడిసరుకు భక్తి మాత్రమే. తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, రంగాజమ్మ మొదలైన ప్రాచీనాంధ్ర కవయిత్రులు చక్కటి పద్యకవితలు

రచించారు. స్త్రీ విద్యాధికురాలై ప్రగతి పథంలో అడుగు పెట్టిన తర్వాత సామాజిక సమస్యలు, స్వాతంత్రోద్యమ కవితలతో పాటు విభిన్నమైన వస్తువుల నెంచుకుని చక్కటి అభివ్యక్తితో రచనలు చేశారు. అభ్యుదయ దృక్పథంతో, హేతువాద ధోరణితో కవితలు రాసారు. ఆధునిక స్త్రీ పితృస్వామ్య వ్యవస్థను నిరసిస్తూ కవితాత్మకంగా తన్ను తాను ఆవిష్కరించుకుంది. అంటరానితనాన్ని, అవమానాన్ని ధిక్కరించింది. కవితలకు స్ఫూర్తినిచ్చి కవితా వస్తువులుగా నీరాజనాలందుకున్న నీరజాక్షులు కవిత లెందుకు ఎక్కువగా రాయలేదు? రాయలేకపోయారా? రాయనివ్వలేదా? అన్న ప్రశ్నలకు జవాబే - ఈ ముద్ర'' అని చెప్పుకున్నారు. ఇందులోని భావాలు యే ఒక ఉద్యమానికో, వాదానికో, అభ్యుదయ నిరోదానికో, విప్లవ దృక్పధానికో ప్రాతినిధ్యం వహించేట్లుగా ఉండవు. నిజానికి తిమ్మక్క దగ్గర నుండి భార్గవీరావు దాకా యెంచుకున్న కాలం చాలా విస్తృతమైంది. ఇది మంచి ప్రయత్నం. ఇందులో చాలా మంచి కవితలున్నాయి. అందరి కవయిత్రుల కవిత్వం చదివామన్న తృప్తి లభిస్తుంది. యశోదారెడ్డి, పి. శ్రీదేవి, కల్లూరి శ్రీదేవి, కొలకలూరి స్వరూపరాణి, చల్లపల్లి స్వరూపరాణి, వేదవతి, రత్నమాల, విమల, ఘంటసాల నిర్మల, కొండేపూడి నిర్మల, పాటిబండ్ల రజని, చిల్లర భవానీ దేవి, ఆదూరి సత్యవతీ దేవి, ఓల్గా, మహిజబీన్, రెంటాల కల్పన, యస్. జయ, అనిశెట్టి రజిత, మొక్కపాటి సుమతి, సావిత్రి, రేవతీదేవి, మందవరపు హైమవతి, వసంత కన్నాభిరాన్, రావులపల్లి సునీత, పసుపులేటి గీత, కె.గీత, వర్రే రాణి, శైలజ, శిలాలోలిత, కొండపల్లి కోటేశ్వరమ్మ, వాణీ రంగారావు, ఇంద్రగంటి జానకీబాల, షహజానా, వాసా ప్రభావతి, శారదా అశోక వర్ధన్, శరత్ జ్యోత్స్నా రాణి, కె.బి.లక్ష్మి, ముక్తేవి భారతి వంటి విభిన్న భావాల, ఆదర్శాల, వాదాల, ఉద్యమాల, అనుభూతి వాదాల కవయిత్రుల కవిత్వం చదువుతుంటే బలే సరదాగానూ, సీరియస్‌గానూ ఉంటుంది. ఈ గొప్ప కవిత్వ ప్రక్రియలో మహిళల మనోభావాలు ఏకకాలంలో చదువుకోగలం.


> ఈ సంవత్సరం వచ్చినన్ని దీర్ఘ కవితా సంపుటాలు ఇటీవలి సంవత్సరాలలో రాలేదు. సీనియర్ కవుల తరువాతి తరం కవులు ఈ దీర్ఘ కవితల సంపుటాలు తేవడం ఒక విశేషం.


మంజీరా రచయితల సంఘం, సంఘ సభ్యుల రాసిన కవితలను సమీకరించుకుని 'ఏడుపాయలు' అనే సంకలనాన్ని ప్రచురించింది. ఈ సంకలనాన్ని విమర్శిస్తూ పి.సి.రాములు ఇలా అంటాడు. "నేటివిటీ అనేది కేవలం ఒక భాషలోనో, యాసలోనే ఉట్టిపడేది కాదు. ఇది ఆ మట్టిలో, ఆ నీటిలో, ఆ గాలిలో, ఆ జనం జీవనాడిలో అంతర్లీనంగా ప్రవహించే ఒకానొక ప్రాదేశిక స్రవంతి. వీటన్నిటినీ ఆకళింపు చేసుకుని ఆ మట్టి గొంతుతో ఈ 'ఏడు పాయలు' కవులందరూ కవిత్వాన్ని పలికించడం వీరి ప్రత్యేకతకి నిదర్శనం. ఇందులోని కవిత్వంలో స్థానిక జీవితం ఉంది. వ్యవసాయ సంక్షోభం ఉంది. చిన్నాభిన్నమవుతున్న గ్రామీణ వ్యవస్థ ఉంది. తెలంగాణ విముక్తి ఉంది.

## తెలంగాణ నేపథ్యంలో

తెలంగాణ ఉద్యమ నేపథ్యంతోనూ, వలసవాదుల వల్ల యేర్పడిన ఆధిపత్యాలనూ, స్థానిక భూస్వాముల ఆగ్రహాలను, అన్ని విధాల వివక్షతకు గురవుతున్న తెలంగాణను విశ్లేషించిన సంకలనం 'సుక్క పొడుపు'. నిజానికి ప్రత్యేక తెలంగాణ కావాలనే తెలంగాణ ఉద్యమం ముమ్మరం అవుతున్న సందర్భంలో రచయితల సంఘాలు పెరుగుతున్నాయి, రేపోమాపో తెలంగాణ కవితా సంకలనాలు రాబోతున్నాయి. నిజానికి తొలి సంకలనం 'సుక్కపొడుపు' అవుతుందేమో! ఈ సంకలనానికి కాళోజీ ముందుమాట రాస్తూ "ఎవరి వాడుక బాష వారు మాట్లాడాలె, రాయాలె, ఇట్ల రాస్తే అవతలోనికి తెలుస్తదా అని ముందరే మనమనుకునుడు, మనను మనం తక్కువ చేసుకున్నట్లు అయితది. ఈ బానిస భావం పోతెనే మనం, మన బాన, యాస బాగుపడ్తయి. అది మనం ముందుగాల గుర్తించాలె. బాస బడిపలుకుల బాస కావద్దు, పలుకు బడుల బాస కావాలె అని ఎన్నోసార్ల చెప్పిన నేను. రెండున్నర జిల్లాలోండ్లు, వాండ్లలో రెండున్నర - చదువుకున్న - తెగలోళ్ళు మాట్లాడే బాసనే యాసనే అందరి మీద రుద్దుడు, బద్మాష్ గిరీయే'' అని ఈ సంకలనం లోని కవులకు ధైర్యం చెప్పే మాటలే రాశాడు. కాళోజీ కోరుకున్నట్లు శీలం రాజేశం నమిలి కొండ బాలకిషన్ రావు, జితేంద్రరావు, అనిశెట్టి రజిత, పొట్లపల్లి శ్రీనివాసరావు, పేర్వారం జగన్నాథం, అన్వర్, వరిగొండ కాంతారావు, నందిని సిధారెడ్డి, మోతుకూరి అశోక్‌కుమార్, ఐలేని గిరి, పప్పుల రాజిరెడ్డి, వేణు సంకోజ్ కవితల్లో తెలంగాణ భాషానిగనిగలు, సమాజం మీద ఉండే కోవతాపాలు, కోళోజీ 'యాస'ను రక్షించుకొమ్మని హితం చెప్పిన విధంగా నూటకి తొంబై శాతం కవులు గ్రామీణ తెలంగాణ యాసలోనే రాశారు. ఈ సంకలనం చూపులో చిన్నదైనా, దానికున్న ప్రాధాన్యతను బట్టి చూస్తే పెద్ద సంకలనాలు చేయలేని పనిని ఈ సంకలనం చేయగలిగింది.

## దీర్ఘ కవితలు

ఈ సంవత్సరం వచ్చినన్ని దీర్ఘ కవితా సంపుటాలు ఇటీవలి సంవత్సరాలలో రాలేదు. సీనియర్ కవుల తరువాతి తరం కవులు ఈ దీర్ఘ కవితల సంపుటాలు తేవడం ఒక విశేషం. సుంకిరెడ్డి నారాయణ రెడ్డి 'దాలి', శీలా సుభద్రాదేవి 'యుద్ధం ఒక గుండె కోత' జూలూరి గౌరీశంకర్ 'మూడవ గుణపాఠం', దర్భశయనం శ్రీనివాసాచార్య 'ఆట', ఆర్. రామకృష్ణ 'గొడిముక్క', యార్లగడ్డ రాఘవేంద్రరావు 'ముంతపొగ' సాగర్, శైలజ, జె.వియస్. మూర్తి కలిసి 'ఇదేదో చాటు మాట వ్యవహారం' వంటి దీర్ఘ కవితా సంపుటాలను చదివాను. ఈ సంపుటాలలోని వస్తువు, శిల్పం వైవిధ్యంగా ఉంది. వీళ్ళందరూ తొలుదొల్త

దీర్ఘకవితలు రాసినప్పటికీ, వారి వారి శైలీ విన్యాసం ప్రత్యేకమైంది. యెవరికి వారు తమతమ స్వానుభవంలోంచీ, స్వంత గొంతును వినిపించే స్వరాల్లోంచే రాశారు.

సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'దాలి' చదువుతున్నప్పుడు ఆయనలోని కసికి కారణాలను గ్రహించగలుగుతాం. తెలంగాణ 'యెక్కడ వేసిన గొంగడి అక్కడే' అన్నట్లు యెందుకుందని ప్రశ్నిస్తాడు. ఒకే యెమోషన్‌తో సాగిన నడక, తెలంగాణ భాష, ఆవేశం, ధిక్కారం, వలసపెత్తనపు స్వరూప, స్వభావం ఒకేమారు కళ్ళ ముందుకు వస్తుంది. నగ్నముని కొయ్యగుర్రం తరువాత, తెలంగాణ నేపథ్యంలో తెలంగాణ ప్రాంతం నుంచి వచ్చిన దీర్ఘకవిత ఇది.

శీలా సుభద్రాదేవి సీనియర్ కవయిత్రి. 'యుద్ధం ఒక గుండె కోత' అనే దీర్ఘకవిత ఆమె రచనల్లో మొదటిది. అమెరికా, ఆఫ్ఘనిస్తాన్ యుద్ధ నేపథ్యంతో వచ్చిన మొదటి దీర్ఘ కవిత ఇదే. అమెరికా రాజకీయ ఆధిక్యత వల్ల యేర్పడిన ఈ యుద్ధం, మన సాంఘిక, ఆర్థిక, మానవ సంబంధాలను సంక్షోభంలోకి నెట్టివేసింది. అన్ని సంబంధాలు యుద్ధం వల్ల గుండెకోతకు గురయ్యాయి. నిజానికి యుద్ధమెప్పుడూ గుండెకోతనే తెచ్చి పెడుతుంది. సుభద్రాదేవి స్త్రీ వాద దృక్పథంతో కాకుండా ఒక మాతృమూర్తి హృదయ నేపథ్యంతో కూడిన వస్తువును యెన్నుకుని రాయడం వల్ల ఈ దీర్ఘకవిత ప్రారంభం మొదలుకొని చివరి దాక ఆర్తితో, గాయంతో, తపనతో ఆరాటంతో నిండి పోయింది. కళ్ళు చెమ్మగిల్లే వస్తువును తనదైన శైలిలో మనముందుంచారు. "ఉగ్రమో అగ్రమో, పదునెక్కిన రెండుకొమ్మల అమానుష మృగాలు, ఆవురావురుమంటూ కాలు దువ్వుతున్నప్పుడు, మదం తలకెక్కినవి కొన్ని, మతం దిమ్మెక్కినవి కొన్ని, రెండు తలల సర్పాలు, రెండు నాల్కల సరీసృపాలు, పెనుబునల ఊపిర్లతో, అంతకంతకూ మంటని రాజేస్తున్నప్పుడు, ఇతిహాసాల లోంచి సైతాన్లూ, హిరణ్యకశిపులూ, నల్ల మాంత్రికులూ, భస్మాసురులూ ఏ మత గ్రంథాల లోంచో, ఊపిర్లు పోసుకుని భూగర్భ సమాధుల్లోంచి పైకి లేస్తున్నప్పుడు నిస్సహాయ

> సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'దాలి' చదువుతున్నప్పుడు ఆయనలోని కసికి కారణాలను గ్రహించగలుగుతాం. తెలంగాణ 'యెక్కడ వేసిన గొంగడి అక్కడే' అన్నట్లు యెందుకుందని ప్రశ్నిస్తాడు. ఒకే యెమోషన్‌తో సాగిన నడక, తెలంగాణ భాష, ఆవేశం, ధిక్కారం, వలసపెత్తనపు స్వరూప, స్వభావం ఒకేమారు కళ్ళ ముందుకు వస్తుంది.

మానవీయ విలువలు గుప్పున గాలిలో తేలి పోతున్నప్పుడు బూడిద కుప్పలుగా మారుతున్నపుడు, ఊళ్ళు భూగర్భంలోకి కుంగిపోతున్నపుడు అవును ఇప్పుడిక అంధకార స్మశానంలో దారి చూపేందుకు ఒక తల్లి గర్భం కావాలి, శాపగ్రస్తులై రాతిగా మారిన అహల్యలారా, మీ గర్భాల్ని అరువియ్యండి, మళ్ళీ ఈ భూగోళాన్ని, మానవీయ స్పర్శతో పునీతం చేసే మనుషులతో నింపుదాం" అంటుంది. హృద్యమైన తల్లి ప్రేమతో కాన్వాసుపై మొదలై మళ్ళీ తల్లుల్ని కాంక్షించే భావనతోనే ఈ దీర్ఘ కవిత ముగుస్తుంది.

**ఉత్తరాంధ్రలో**

ఉత్తరాంధ్ర ప్రాంతం నుండి ఆర్. రామకృష్ణ 'గొడిముక్క' ఒక మంచి దీర్ఘ కవిత. రామకృష్ణ సుప్రసిద్ధ కవిగా ఈ 'గొడిముక్క' దీర్ఘ కవితతో నిలిచిపోగలడు. ఉత్తరాంధ్ర పాలేరుల ఆత్మకథనానికీ, జీవన నేపథ్యానికి అక్షరరూపం కల్పించారు. మూడు తరాల పాలేరు కవితాత్మక కథాకవిత్వం ఇది. కళ్యాణరావు గారి 'అంటరాని వసంతం' నవలలోని ఏడవతరం పాత్ర, ఉద్యమంతో మమేక మయినట్లే, ఈ 'గొడిముక్క' లోని మూడవతరం పాలేరు పోరాట జీవితంలో ఐక్యమవ్వటం గమనించవలసిన అంశం. పాలేరు ముసలితల్లి "బతుకుంతా పేడలు తీసి తీసి తానే పేడకుప్పయిపోయిందట". "బుగతలు కల్లాలు తుడిసి, దాని కళ్ళల్లో ధూళి మేఘాలు కమ్మేసాయి. కోతలు కోసి, కోసి, దాని నడుము కొడవలయిపోయింది. సెరిగి సెరిగి దాని సేతులు అరిగిన సేటలయిపోయాయి" అంటాడు కవి. గొడిముక్కలో దళిత జీవితముంది. దళిత వేదన ఉంది. దళిత ఆగ్రహముంది. సాయుధ పోరాటపు ప్రభావముంది. గొడిముక్క ప్రాంతీయ పదం. పశువుల కాపరి చేతి కర్రను గొడిముక్క అంటారు. 'గొడిముక్క' ఒక విప్లవ సంకేతంగా కవి వాడుకున్నాడు.

యార్లగడ్డ రాఘవేంద్రరావు 'ముంతపొగ' ఒక బలమైన భాషా సంపన్నమైన, నిర్మాణ సంపన్నమైన లాంగ్ పోయెం. లాంగ్ పోయెంలోని వస్తువిస్తృతి, నిర్మాణ రహస్యాలు ఒక పరిపక్వ కవి వాడుకున్నట్లు వాడుకున్నాడు. గ్రామీణ వ్యవసాయం ప్రస్తుతం త్రిశంకు నరకంలో ఉంది. గాయం కాని రైతు లేడు. రైతు సంక్షోభంలోని సమస్త శకలాలను ఈ దీర్ఘ కవిత మన ముందుంచింది. రాఘవేంద్రరావుకు బాల్యంలో చూసిన రైతు జీవితం, పెరిగి పెద్దయి కన్నవూరు వెళ్ళి చూసినప్పటి రైతు జీవితం భిన్నంగా అనిపించి ఉండవచ్చు. వ్యవసాయ కుటుంబం లోంచి వచ్చినవాడు కావడం వల్ల తన తండ్రి పరిణామాన్నే పసిగట్టి ఉన్నాడనుకుంట. అతడి స్వానుభవం, సార్వజనీనంగా మలచ బడిందనుకుంట. రైతు కుటుంబంతో మొదలై, ప్రపంచీకరణ లోని రైతు కుటుంబందాకా ఈ దీర్ఘ కవిత ప్రయాణం చేస్తుంది. వ్యవసాయం రైతుల చేతుల్లోంచి యెలా చేయి జారి పోతుందో చూపుతుంది. రైతు ఆత్మహత్య వెనకనున్న ప్రపంచ రాజకీయాలు, ఆర్థిక సంక్షోభాలు, గ్లోబల్ విషవాయువులు కుటిలత్వాన్ని రాఘవేంద్రరావు పసిగట్టి కళ్ళ ముందర వ్యవసాయ సంస్కృతి యెందుకు నాశనమైపోతుందో యెత్తి చూపుతాడు. 'పుణ్య భారతాన, రైతన్నల బతుకులు రాజుకున్న దాలి ముంతలు' గా అభివర్ణిస్తాడు. 'రైతంటే, మట్టి కడుపు దోచి, మనిషి కడుపు నింపే వాడురా' అని వ్యాఖ్యానిస్తాడు. 'అడగ వెలువెత్తిన శాపం' అని భావిస్తాడు. 'ఎండుటాకు లాంటి తను ఎరువుగా మార్చుకుని, మడికి మడికీ పురుడు పోసుకుంటూ పోతున్న పత్రహరితు'డిగా రైతును వర్ణిస్తాడు. అలాంటి రైతు ఆత్మహత్యకూ, హననానికీ కారణమవుతున్న

గ్లోబల్ గ్రామీణ వ్యవస్థను నిరాకరిస్తాడు. రైతు 'ధరణి ముంగిట ధ్వజస్తంభమయినా, అమ్మకం ముద్రేసి, సంతలో నిలిపిన పాడి ఆవులాంటి అతడెప్పుడూ, పలుపుతాడు బంధంలో చిక్కుకుపోయి, అక్కడే ఆ కట్టు కొయ్య వద్దే దీనంగా.... హేయంగా..... అశ్రుతప్తంగా.....' ఉన్న సందర్భాలను తలుచుకుని తానూ దుఃఖిస్తాడు. 'తెగిపడ్డ కలల తుంపుల్ని కలిపి కుట్టుకుని, నేల నరాల్లోంచి గునపాలై ఎగిసిపడి, దగా చేస్తున్న కాలాన్నీ, కాలం కౌగిలించుకునే చరిత్రను, కబ్జా చేయడమే, ఇప్పుడిక యేకైక కర్తవ్యం' అని హితబోధ చేస్తాడు. ఇంత సుదీర్ఘమైన రైతు జీవితాన్ని లాంగ్ పోయంగా మలచటం, ఈ మలిచిన దాన్ని చదువుతూ ఉంటే మన కళ్ళముందు న్యూస్‌రీల్ కదిలిపోతున్నట్లుంది.

దర్భశయనం శ్రీనివాసాచార్య 'ఆట' సాధారణ పాఠకుడికి సైతం అర్థమయ్యే దీర్ఘకవిత. 'ఆట' పదాన్ని అదే అర్థంలో కాకుండా ప్రతీకాత్మక అర్థంలో వాడుకున్నారు. విద్యావిధానం సంపన్నుల జూదం కింద మారింది. కంప్యూటర్ ద్వారాలను విశ్వ విద్యాలయాలు తెరవడంతో ప్రైవేటు 'వేటు'కు విద్యార్థిలోకం బలైపోతుంది. అన్ని రంగాలు ప్రైవేటు పరం కావడం, నిరుద్యోగం మరింత పెరగడం, మానవ సంబంధాలు మార్కెట్ మయం కావడం, ప్రపంచీకరణ వల్ల కాసుల జూదం ముందుకు రావడం వంటి అనేక అంశాల 'ఆట'కు ముడిసరుకు. 'ఆట' అంతా సుదీర్ఘజీవన సంఘర్షణనే. 'ఆట' ఒక అర్థంలో వాడబడదు. అనేకార్థాలలో వాడబడింది. "బతుకు పొడుగూతా ఆటే కానీ, ఆట తీరు ఒకలా లేదు, అందరూ ఆటలోనే కానీ, అందరి ఆట ఒకలా లేదు" అంటాడు. దర్భశయనం ఎన్నో విధాలైన ఆటల్ని ప్రతిపాదించి తనకు యే ఆట కావాలో చెబుతాడు. "అన్ని తలకిందుల ఆటల నుంచి విముక్తం చేసే, తలెత్తే ఆట కావాలి. తలెత్తే ఆట బతకాలి" అని తాను సమర్థించే ఆట అవసరాన్ని చెబుతాడు. "బిగుంపుల నడుమ ఒకింత విడుపునే. మంట నడుమ ఒకింత ఊరటనూ, ఇస్తుందే - అలాంటి అలాంటి ఆట కావాలి" అని కోరుకుంటాడు. పిల్లల అమాయకత్వం, వినోదం, ఆహ్లాదం, శరీరం

> 'తెగిపడ్డ కలల తుంపుల్ని కలిపి కుట్టుకుని, నేల నరాల్లోంచి గునపాలై ఎగిసిపడి, దగా చేస్తున్న కాలాన్నీ, కాలం కౌగిలించుకునే చరిత్రను, కబ్జా చేయడమే, ఇప్పుడిక యేకైక కర్తవ్యం' అని రాఘవేంద్ర రావు హితబోధ చేస్తాడు. ఇంత సుదీర్ఘమైన రైతు జీవితాన్ని లాంగ్ పోయంగా మలచటం, ఈ మలిచిన దాన్ని చదువుతూ ఉంటే మన కళ్ళముందు న్యూస్‌రీల్ కదిలిపోతున్నట్లుంది.

వ్యాయామం, ఆరోగ్యం, ఉత్సాహం వంటి యెన్నో అంశాలు వాళ్ళ వాళ్ళ 'ఆట' వల్ల పొందుతారు. అదే 'ఆట' పాలకులూ, సంపన్నులూ, పెత్తందారులు ఆడే 'ఆట'ను దర్భశయనం వ్యతిరేకిస్తున్నాడు.

జూలూరి గౌరీశంకర్ 'మూడవ గుణపాఠం' ఒక తాత్విక పునాదితో రాయబడిన లాంగ్ పోయం. దళిత, మైనారిటీ నేపథ్యం మూడవ గుణాపాఠానికున్న వస్తు వైవిధ్యంగా భావించవచ్చు. ఈ దీర్ఘ కవిత స్వరూప స్వభావంలోనే తాత్వికత ఇమిడి ఉంది. మానవ చరిత్రను మహా ప్రమాదానికి నెట్టిన "డిసెంబర్ 6 నాగరిక, సెప్టెంబర్ 11 పగుల గొట్టు, ఆగస్టు 14 అర్ధరాత్రి విభజించి ఆగస్టు 28 పగటి రాత్రికి బీహార్" వంటి సంఘటనల, సందర్భాల, అధీకృత పాలక రాజకీయాల అధ్యయనం వల్ల వాటిలో జూలూరి గౌరీశంకర్ ఐక్యమవ్వడం వల్ల వచ్చిందే ఈ 'మూడవ గుణపాఠం' అమెరికా, ఆఫ్ఘాన్ యుద్ధం, మన దేశ మత రాజకీయాల మైనారిటీల సంక్షోభం ఈ కవిత ప్రధాన వెన్నెముకలోని భాగాలు. ఈ దీర్ఘ కవిత వ్యక్తీకరణ సీరియస్‌గా అనిపించదు. ఒకటి రెండు పాదాలు కాగానే, సీరియస్‌ను అన్ సీరియస్‌గా చెబుతున్నట్టు, అన్ సీరియస్‌గా యేదైతే అనుకుంటారో దాన్ని సీరియస్‌గా చెబుతున్నట్టు ఉంటుంది. మామూలు ఆత్మ నేపథ్యం లోంచి ఒక తాత్విక నేపథ్యం లోకి లాక్కుపోతాడు. ఈ దీర్ఘ కవితలో తనకు ఆత్మీయులైన, ప్రశ్నించ దగిన అనేక కవుల పేర్లను ఉటంకిస్తాడు.

"యుద్ధమంటే ఒరేయ్ రమణా, ప్రపంచ పటాన్ని అడ్డంగా నిలువుగా, ఒప్పచెప్పటం కాదురా, నల్ల నినాదంతో ఆరోవర్ణం అరుపులు, కూలని నిచ్చెన మెట్లను పైనుంచి కిందకు కుదపటం" రా అన్నాడు. రమణతో యేదో మామూలు విషయం చెబుతున్నట్లు ప్రారంభించి సీరియస్ విషయం చెప్పే పద్ధతిలోకి తీసుకు పోతాడు. సీరియస్‌ను సింపులుగా చెప్పడం, "ప్రపంచానికి, ఇప్పుడు, కమ్యూనిస్టు ఇంటర్నేషన్ కుప్పకూలిందని ఎరకయిందహో!!" పాదాలు అన్ సీరియస్‌గా వ్యక్తీకరించినా సీరియస్ అంశమే అందులో ఉంది. "ఒరేయ్ గౌరీ బద్మాష్ ఎన్నిసార్లు చెప్పాన్రా నీకు, విషయాన్ని వదిలి కవిత్వాన్ని కౌగిలించుకోవద్దని" హితం చెబుతాడు. మరి దేన్ని ఆలోచించమంటాడంటే "వ్యాపారమంటే మిత్తి, మిత్తి పుల్‌ఫామ్ డబ్యుటివో, మిత్తి అంటే మిత్తవ, మిత్తవ అంటే మృత్యువు, డబ్ల్యు...డబ్ల్యు...డబ్ల్యు...టి...సి..., ఒకటోసారి, రెండవసారి, ముచ్చటగా ఇగో మూడోసారి.... మూడు కలలు, మూడు పాఠాలు, గుణ పాఠాలు, మూడు ప్రపంచాలు, మూడవ యుద్ధం - అమెరికాకి మూడిన యుద్ధం ఇప్పటిదాకా మేము, కాగితాల్లో సదువుకున్న యుద్ధం.... మార్కెట్ హింసలో మనిషి నెత్తురు హైజాక్, యుద్ధమా రాజ్యమే, సరళీకరణ మంటల్లో ఆజ్యమే!" అంటాడు దళిత కవులు ప్రపంచీకరణను సీరియస్‌గా తీసుకుంటున్నారనడానికి జూలూరి గౌరీశంకర్ ఈ దీర్ఘ కవిత ఒక ఉదాహరణగా భావించవచ్చు.

ఈ దశాబ్దపు తొలకరి కవిత్వం అంతా స్థానిక వాతావరణాలూ, ప్రభావాలూ, ప్రపంచ యుద్ధాలు, సరళీకరణ, ప్రపంచీకరణ దాడులు, ఉద్యమాలు, వాదాలూ, పోరాటాలు, స్మృతులు ఇలా అనేక అంశాల మీద సంకలనాలు, దీర్ఘ కవిత్వాలు వచ్చినట్లే వివిధ కవులు విడివిడిగా వేసుకున్న కవితా సంపుటులు సంకలనాల కన్న దీర్ఘ కవితల పుస్తకాల కన్న రెండింతలు యెక్కువే వచ్చాయి. వీటన్నిటినీ విశ్లేషిస్తే మూడు నాల్గు సిద్ధాంత గ్రంథాలు రాయవచ్చు. మచ్చుకకు ఈ సంవత్సరం వచ్చిన కవితా సంపుటాలు ఇవి.

మంచికంటి - నీటిపొద్దు, నల్లూరి

రుక్మిణి - ప్రశ్నే ప్రశ్నార్థకమైన వేళ, ఎం.ఎస్.నాయుడు - ఒక వెళ్ళిపోతాను, కల్పనా రెంటాల - నేను కనిపించే పదం, ఎల్. భూదేశ్వరరావు - సాక్షీగీతాలు, కొండేపూడి నిర్మల - మల్టీ నేషనల్ ముద్దు, దావులూరి జయలక్ష్మి - గుండెలోతుల్లోంచి, డొంకన శ్రీశైలం - అమ్మా, కె. గీత - ద్రవభాష, గోపగాని రవీందర్ - అంకురం, ద్వానా శాస్త్రి - సాహిత్య నానీట, నందిని సిధారెడ్డి - ఒక బాధ కాదు, జూకంటి జగన్నాథం - వాస్కోడిగామా.కామ్., చిల్లర భవానీ దేవి - వర్ణనిశి, దాసరాజు రామారావు - గోరుకొయ్యలు, అయినంపూడి శ్రీలక్ష్మి - అలలవాన, యెన్నం ఉపేందర్ - కర్రు పుట్టింది, అన్నవరం దేవేందర్ - తొవ్వ, సోమేపల్లి వెంకట సుబ్బయ్య - తొలకరి చినుకులు, బనలింగవ్వ - నన్ను మాట్లాడనివ్వండి, ప్రసేన్ వంశీకృష్ణ - సీతారాం, అఫ్సర్ - కవిత్వం, కందుకూరి శ్రీరాములు - సందర్భం, కె.జె.రమేష్ - వర్తమాన లిపి, ఆశారాజు - సారంగి, ఎస్.ఆర్. భల్లం - చిగురు కేక, పులిపాటి గురుస్వామి - చెమ్మ, ఇక్బాల్ చంద్ - ఆరోవర్ణం, ఎన్. జగన్‌రెడ్డి - నేనొక్కనే, రమణ జీవి - నలుగురు పాండవులు, గుండెడప్పు కనకయ్య - వీణవంక, వేణు సంకోజు - మనం, శ్రీకాంత్ - అనేక సమయాలు, చెమన్ - ఆవిష్కరించిన దృశ్యం, వంటి అనేక సంపుటాలు ఈ శతాబ్దపు తొలకరి జల్లుగా రావడం, తెలుగు సాహిత్య నేల పరిమిళమై కవిత్వ వాసనలు వ్యాపించడం ముదావహమే. డా.సి.నారాయణరెడ్డి, సూర్యవంశి వంటి మరికొంతమంది సుప్రసిద్ధ కవిత్వం నాకింకా లభ్యం కాలేదు. వివిధ కవులు సంపుటాలు తెచ్చినట్లే, అనువాదాలు కూడా రావడం విశేషం. జె. భాగ్యలక్ష్మి - రవీంద్రుని గీతాలు, కె. బాలాజీ, కె. శివారెడ్డి కలిసి అనువదించిన వచనాలు, దీవి సుబ్బారావు గారి నవనవం వంటి అనువాద సంపుటాలు వచ్చాయి. అలాగే యం.కె. సుగమ్‌బాబు కవిత్వం, యాకూబ్ కవిత్వం, శిఖామణి కవిత్వం ఆంగ్లంలోకి అనువాదం కావడం తెలుగు కవిత్వ తేజానికి ఇవి కాసిన్ని ఆనవాళ్ళు మాత్రమే. వివిధ కవులు కొన్ని కవితా సంపుటాలను విశ్లేషించగలను కాని అన్నిటినీ విశ్లేషించటం ఇక్కడ అసాధ్యం.

> ఈ దశాబ్దపు తొలకరి కవిత్వం అంత స్థానిక వాతావరణాలూ, ప్రభావాలూ, ప్రపంచ యుద్ధాలు, సరళీకరణ, ప్రపంచీకరణ దాడులు, ఉద్యమాలు, వాదాలూ, పోరాటాలు, స్మృతులు ఇలా అనేక అంశాల మీద సంకలనాలు, దీర్ఘ కవిత్వాలు వచ్చినట్లే వివిధ కవులు విడివిడిగా వేసుకున్న కవితా సంపుటాలు సంకలనాల కన్న దీర్ఘ కవితల పుస్తకాల కన్న రెండింతలు యెక్కువే వచ్చాయి.

నందిని సిధారెడ్డి 'ఒక బాధ కాదు' లోని కవిత్వం, తెలంగాణ గ్రామీణ నేపథ్యానికీ, రైతుల జీవన సంక్షోభానికీ అద్దం పడుతుంది. ఇందులోని అధికశాతం కవిత్వం రైతుల గుండె లోతుల్లోంచి వచ్చిందే. ఒకప్పటి రైతు సమస్యలు, ఇప్పుడున్న రైతు సమస్యలు ఒకటి కావు. పాత బాధలు పోయి కొత్త బాధలు వచ్చాయని కాదు. ఉన్న బాధలు ఉన్నవే. అందులో అదనంగా చేరిన బాధలతో రైతులు అతలా కుతలమై పోతున్నారు. బాధలతో కొట్టు మిట్టాడుతున్నారు. గతించిన కాలానికీ, వర్తమాన కాలానికీ మధ్యన తెలంగాణ రైతు జీవితం ఒక ఊబిలోంచి మరొక ఊబిలోకి పోయినట్లయింది. రైతులకు ఒక బాధ కాదు. అన్నీ బాధలే. ఆ బాధల్లోంచే సిధారెడ్డి ఈ కవిత్వం రాశారు. "జ్ఞాపకం జ్ఞాపకం కోసం కాదు, బతుకుతున్నామో లేదో చూసుకోవడానికి" ఈ కవిత్వం నిలుస్తుంది. ఆనవాలు, వాన పడని నేల మీద, విజన్, నిర్నిద్ర, తొవ్వలు, ఎండిన చెరువుముందు, బతక వోయిన బతుకు, ఇజ్జత్, ముగింపు, అస్తమయం, ఉలిపి కట్టె, నెల పొడుపు, చినుకు ఒక్కటే... వంటి కవితలు సిధారెడ్డి కవిత్వ పరిపక్వతను పట్టి చూపుతాయి. వ్యవసాయ జీవనం అధ్యయనం చేసి రాసి నట్టుండవు. తానే వ్యవసాయ జీనవంలో ఉన్నట్టుంటాయి. విన్నది, కన్నది, చూసినది చెప్పినట్లు కాకుండా రైతులు తమను గురించి తామే చెప్పుకుంటున్నట్టున్నాయి ఇందులోని కవిత్వాలు. "ముడివేసిన కాలమే ముడివిప్పి ఛెళ్ళున చరుస్తుంది. అప్పుతో ఉరిపడి శవం చేసిన ఆర్తనాదానికి, భూమి పగిలి నీళ్ళు పొంగుతయి", "కడుపు మండిన రైతు, కొత్త తొవ్వ తొక్కుతడు, ఆ తొవ్వల పైనను సుతా తొక్కుతడు" "ఎండిపోయిన చెరువు ముందు నిలబడితే చూపు పెళ్ళలు పెళ్ళలుగా విరిగి పడుతుంది", వంటి కవిత్వ పాదాలు రైతు బతుక్కు అద్దం పడతాయి. గ్రామీణ వ్యవస్థ లోని అన్ని వర్గాల ప్రజల ఆర్తికి ఈ 'ఒక బాధకాదు' లో చిరునామాలు దొరుకుతాయి. అంతేకాదు పాలక హింసనూ, అమెరికావాడి రాకను కూడా ధిక్కరించే కవిత్వం ఇందులో ఉంది.

కల్పనా రెంటాల 'నేను కనిపించే పదం' సంపుటితో తెలుగు సాహిత్య నేలమీద బలమైన పాదం మోపిందనే చెప్పాలి. యోగ్యతా పత్రాలు కల్పనకు అవసరం లేదంటూనే ఓల్గా, చేకూరి రామారావులు ధృవపత్రాలిచ్చారు. కల్పనది స్త్రీ వాద కవయిత్రులలో స్వంత గొంతు. చీకిపారేసిన చెరుకుగడల వంటి కవితావస్తువుల్ని తీసుకుని మళ్ళీ మళ్ళీ రాయడానికి కల్పన ఉపక్రమించదు. అంతేకాదు సున్నితమైన భావ వ్యక్తీకరణ. స్వంత గొంతు, స్వంత మార్గం వెతుక్కుంటుంది. ప్రపంచ మైనారిటీ స్త్రీల రాజకీయ స్పృహను పెంచే కవిత్వం రాసింది. "క్షమించండి మీ ఫత్వా కాదని మాట్లాడుతున్నా, అల్లాసాక్షిగా అంతా నిజమే చెబుతాను" అని మొదలు పెట్టి "శతాబ్దాల యుద్ధ చరిత్రలో నేను యుద్ధం చేసిందెన్నడు"...... "ఇప్పుడు నాకు యుద్ధం చేయాలని ఉంది. ఇప్పుడు నే వెళ్ళేది మసీదుకు కాదు. రణభూమికి! చెప్పండి నాతో యుద్ధానికి ఎవరు వస్తారో? అమెరికానా, పాకిస్తానా? లాడెనా? తాలిబనా! ఎవరైతేనేం అందరూ నాకు శత్రువులే" అంటుంది.

కొండేపూడి నిర్మల స్త్రీ వాద రచయిత్రే అయినప్పటికీ, మార్క్సిస్టు దృక్పథంతో కూడిన అభ్యుదయ, విప్లవ భావజాలం గల కవిత్వం రాస్తూ వచ్చింది. అందుకు సాక్ష్యం ఆమె తాజా సంపుటి 'మల్టీ నేషనల్ ముద్దు'ను చెప్పుకోవచ్చు. మల్టీనేషనల్ ముద్దులోని కుట్రదారుని పేరు నాగరికత అనే పాలమూరు లేబర్ మీద రాసిన కవిత, 'కాటి సుంకం' అని పత్తి రైతుల మీద రాసిన కవితతో పాటు

అలలెవ్వుడు తీరం మీదే, ఇతడేనటే స్నేహితుడేనటే, శబ్ద ప్రపంచం, మల్టీ నేషనల్ ముద్దు, వలసల రాజ్యం కవితలు 'ఆమె వస్తు వైవిధ్యాన్ని యెత్తి చూపే కవితలు "మార్కెట్ చౌర్యం అందరి రక్తంలోకి యింకిపోతోంది, అల్లుకున్న మన పెదవుల మధ్య వగరుగా జీవ భౌతిక రుచులు దోచే మల్టీ నేషనల్ ముద్దు మొగ్గ లోంచి పువ్వు బైట కొచ్చినంత సహజంగా, నోట్లోంచి మాట రావడం మానేసింది" అంటుంది. సహజాతి సహజంగా ఇద్దరు వ్యక్తులు మానవీయ ప్రేమ సంపదను వ్యక్తీకరించుకునే 'ముద్దు' మల్టీనేషనల్ మార్కెట్లూ, మానవీయ సంబంధాలను అమానవీయం చేస్తున్న ప్రైవేటు గుత్తాధిపత్యాన్ని నిర్మల ధిక్కరిస్తుంది. నిర్మల కవిత్వంలో గ్లోబలైజేషన్ను వ్యతిరేకించే కవిత్వంతో పాటు స్త్రీ వాద ఇతివృత్తాలు ఈ సంకలనంలో యెన్నో వున్నాయి. ఇవన్నీ సామాజిక స్వానుభవాలకు దగ్గరగా ఉన్నాయి. చెప్పబోయే ఇతివృత్త వాతావరణం మన కళ్ళ ముందర ఉంచడంలో ఆమెకో ప్రత్యేకత ఉంది.

కె. గీత 'ద్రవభాష' లోని అధికశాతం కవిత్వం స్వానుభవంతో రూపుదిద్దుకున్నవే. స్వానుభవంతో చెప్పే కవులు చాలా మట్టుకు ఫేల్యూర్స్‌ను ఎదుర్కొంటారు. స్వానుభవాన్ని సామాజీకరించడంలో గీతకు మంచి నైపుణ్యం ఉంది. ఇస్త్రీవాడు, స్పాట్‌డెడ్, ఏడుపాయల ఖిల్లా, లేడీస్ స్కాలర్స్ హాస్టల్, మెకానిక్ కుర్రాడు వంటివి యెన్నో వున్నాయి. స్వానుభవాన్ని సామాజికం చేయడంలో 'రైలు బండి రాగం' అనేది ఒక కవిత. నాన్నమ్మా! నువ్వీ జన్మలోనూ చెప్పలేందోటడగనా! బతుకెందుకు బ్రిడ్జి లాగ గజగజలాడుతుంది" అంటుంది. 'నినాదం' కవితలో మన్ని మనమే శంకించుకునే చోటు నుంచి ముందు తరాల స్థిర భద్రతా జీవితాన్ని, సువిస్తరం చేద్దాం రండి! దిక్కులు పిక్కటిల్లే నినాదాల్తో, పట్టుదలతో, కొత్త జీవితాన్ని - ఆహ్వానిద్దాం రండి" స్త్రీలను చైతన్యవంతుల్ని చేయడంలో సఫలీకృత కవిత్వం రాస్తుందనటానికి ఇటువంటివి యెన్నైనా ఉదహరించవచ్చు. 'నేను ఋతువునైన వేళ' ఆమె కవితల్లో మంచి కవిత. "శరీరమంతా ఒకచోటే గడ్డ కట్టినపుడు, ఒక

ఆశారాజు 'సారంగి' సున్నితమైన ఊహాశక్తినీ, బలాన్నీ ముందుకు తెచ్చింది. ఆయన కవిత్వం సఫలీకృతమైంది ఇక్కడే. సునాయాసంగా తనదైన వస్తు సౌందర్యంలోకి లాక్కుపోయే నైపుణ్యం యే కవికి లేనివిధంగా ఉంది ఆశారాజులో. ఆయన కవిత్వాన్ని స్పృశించిన ప్రతిచోట లభ్యమవుతుంది.

వైయక్తిక పరత్వం నిశ్శబ్దంగా విస్ఫోటనం చెందినపుడు, నేను బాధని అరచేతిలో వట్టుకోనడాన్కి, విఫల యత్నాలు చేస్తుంటాను" అన్నప్పుడు స్త్రీలకుండే ప్రత్యేక ఫీలింగ్స్ పాఠకుల్ని బాగా ఆకట్టుకోగలవు.

ఆశారాజు 'సారంగి' సున్నితమైన ఊహాశక్తినీ, బలాన్నీ ముందుకు తెచ్చింది. ఆయన కవిత్వం సఫలీకృతమైంది ఇక్కడే. సునాయాసంగా తనదైన వస్తు సౌందర్యంలోకి లాక్కుపోయే నైపుణ్యం యే కవికి లేనివిధంగా ఉంది ఆశారాజులో. ఆయన కవిత్వాన్ని స్పృశించిన ప్రతిచోట లభ్యమవుతుంది. రాచపాలెం చంద్రశేఖర్ రెడ్డి ఆయన మొత్తం కవిత్వాన్ని విపులాతివిపులంగా విశ్లేషించి ఒక స్మాల్ యం.ఫిల్ థీసెస్ లాంటి పీఠికను రాశారు. ఇటీవలి సంవత్సరాలలో ఇంత విపులమైన వెనక మాట రాసినవాళ్ళు లేరనుకుంట. ఆశారాజు ఒక పరిపక్వ ప్రయాణంలో ఉన్నాడు. మానవ సంబంధాలు అమానవీయం అయితే ఆశారాజు సహించలేడు. అవి మతం వల్ల గానీ, కులం వల్ల గానీ, ప్రాంతం వల్ల గానీ, జెండర్ వల్ల గానీ, పాలకపక్షం వల్ల గానీ, మరే కారణం వల్ల గానీ యేర్పడితే అసహనానికి గురవుతాడు. యేదో ఒక కవితలో ఈ అసహనాన్ని వ్యక్త పరచకుండా ఉండలేదు. 'మతం ఈ దేశానికి మత్తుమందు, మనిషిని మేల్కొనివ్వదు'. 'ఈ డాలరు స్వర్గంలో దేనికీ లోటుండదు, ఒక నా ఊరే కనిపించదు, ఎలాంటి ఆత్మీయతా కనిపించదు, ఏడ్వాలన్నా నవ్వాలన్నా కంప్యూటర్ మీట నొక్కాల్సిందే'. 'మతం మనిషిని మనిషితో కలువనివ్వదు. మనిషిని మనిషిగా బతకనివ్వదు' వంటి భావాలు ఈ అసహనం లోంచి వచ్చినవే. చల్లని చలి వెల్తురు, ఒక నమ్మకం, సీతాకోక చిలుక చనిపోయింది, అందెలు, దోసిలి నిండా, బాధపడే మనసుంటే సుఖపడటం కష్టమే! నా మీద ప్రేమతోనే, రాజకుమారి ఉంగరం, సారంగి, సూర్యునికి గజ్జెలు కట్టి, ఏక్‌తార వంటి కవితలు మనోస్పర్శకు లోను చేస్తాయి. హృద్యమైన ఈ కవితల్లో వర్ణించిన సారాలు మళ్ళీ మళ్ళీ మననం చేసుకోవడానికి ఉపకరిస్తాయి. ఆశారాజు కవిత్వం విలక్షణమైన అనుభూతి నిస్తుంది.

పాలక హింసని ధిక్కరించే స్వభావం, ఉద్యమాన్ని అభిమానించే వ్యక్తిత్వం ఉన్న కవుల్లో కందుకూరి శ్రీరాములు ఒకరు. ఆయన 'సందర్భం' ఒక యెమోషనల్ కంటెంట్‌తో వచ్చింది. ఆవేశం, ఆర్ద్రత, అమాయకత్వం ఆయనలోనూ, ఆయన కవిత్వంలోనూ ఉన్నాయి. సామాజిక, ఆర్థిక, రాజకీయ 'సందర్భం' మారినప్పుడల్లా సందర్భంలోని కవితలు కొత్త సందర్భంలో కూడా వీటికి రిలవెన్స్ ఉంటాయనే అనుకుంట. నంగి నంగి మాటలూ, తప్పించుకు తిరిగే వ్యక్తీకరణలు, పదలాలిత్యపు ముసుగు శ్రీరాములు కవిత్వంలో ఉండదు. ఒక ద్రవీభూత స్వభావం ఒక ఐక్యమయ్యే వ్యక్తిత్వం, ఒక స్పష్టమైన మార్గ నిర్దేశ వ్యక్తీకరణ 'సందర్భం' అన్నీ కవితల్లోనూ కనిపిస్తుంది. ఆర్ద్రమైన ఇంప్రెషన్స్ ఇతని కవిత్వంలో పట్టుకోగలం. అమ్మ మీద రాసిన మూడు కవితలు చదవండి ఆయన మమకారం తెలుస్తుంది. చంద్రమండలం నాకు నచ్చిన కవిత. జనపదం - జలపాతం, బషీర్ బాగ్, కనకపు సింహాసనమున, చీమ క్షేత్రం, ఎర్రనేల, పట్టాలు పరిగెత్తుతాయి, అమ్మ మాట, మొలక, పల్లెకల, ప్రేమకు జీవితం సరిపోదు, వెన్నెల అల వంటి కవితలు నిర్దుష్ట స్వభాన్నీ, నిబద్ధతనీ, ఆశయ సిద్ధినీ తెలియ జేస్తాయి. "తుపాకులూ మీవే తూటాలూ మీవే, అశ్వాలు మీవే, బాష్పవాయువులు మీవే, రాళ్ళూ మీవే, లాఠీలు మీవే, సహజ సిద్ధమైన కాళ్ళూ, కళ్ళూ

మావి, చేతులు చెవులూ ముక్కూ మూతి ఇవే మాడాలూ కత్తి" రాజ్యహింసను వ్యతిరేకిస్తూ విద్యుత్ యుద్ధం వచ్చినప్పుడు రాశాడు. మట్టెప్పుడూ ఇక్కడ పొత్తిళ్ళ వాసనే, మనిషే ఒక మమకార పరిమళం' - అంటాడు. "తెగిన గాలివటమో, ఎగిరిన రొట్టెముక్కనో, ఆకాశానికి అంటుకుని వేళ్ళాడుతుంది. గగనం మీద గంజి వొలకబోశారేమో, మిణుకు మిణుకు మంటున్నాయి మెతుకులు" ఇంత బలమైన ఊహాశక్తి ఉన్న 'సందర్భం' అంతా విప్లవ సానుభూతి కవిత్వంలో నిండి వుందంటే విమర్శిస్తారేమో!

చిల్లర భవానీదేవి 'వర్ణనిశి'ని ఎన్.గోపి 'మానవీయవాణి భవాని' ఒకరు పీఠిక రాస్తే, కాత్యాయనీ విద్మహే 'భవానీదేవి కవిత్వ శక్తి' అని మరొకరు ముందు మాట రాశారు. ఈ రెండు ముందుమాటలు చాలు భవానీదేవి కవిత్వ విశ్లేషణకి 'జీవితంలోని చీకటిని గుర్తించటం, చీకటిపై యుద్ధం ప్రకటించటం 'వర్ణనిశి' కవితల సారం అని కాత్యాయని విశ్లేషిస్తే, ఎన్.గోపి వర్ణనిశి "కవితల్లో జీవితంలోని అన్ని కోణాలు ప్రదర్శిత మౌతున్నాయి. కాసేపు స్త్రీవాదిగా తోస్తారు. ఇంకో కవితలోకి వెళ్తే అభ్యుదయ భావజాలాలతో చెలరేగుతారు. మరోచోట ఆర్ద్రమూర్తిగా అమ్మగా స్పందిస్తారు. ఈమెను ఏయిజాల గుంజకు కట్టివేయలేం! ఆలోచిస్తే మా యిద్దరి గోత్రం ఒక్కటే అనిపిస్తుంది' అంటారు భవాని కవిత్వాన్ని విశ్లేషిస్తూ, ఇందులో ఆ ఇల్లు, వేకువ పువ్వు, కొలువు, పడమర గాలి, జ్వలన గీతం, సమయస్ఫూర్తి టెర్మినేటర్ వంటి కవితలు ఆమె మానవీయతకూ, స్త్రీ స్వేచ్ఛకు, రాజకీయ పరిణతికి మచ్చుకలు మాత్రమే. ఏ హిపోక్రసీని ఇష్టపడని కవి బసలింగప్ప. ఈయన తాత్త్వికుడైనా కవిత్వంలో విద్యార్థినే నంటాడు. నన్నెక్కనివ్వండి బోను అని ఇదివరకు ఓ కవి అంటే ఇవాళ ఈ కవి 'నన్ను మాట్లాడనివ్వండి' అంటాడు. నలభై మూడు కవితల ద్వారా. దేవీప్రియ 'అప్ప' కవీయం అని హృద్యమైన ముందుమాట రాశారు. ఇందులో నన్ను మాట్లాడనివ్వండి, అతను, త్రికాలత్వం, అహం, పదవి, దళ, వంటి యెన్నో మంచి కవితలున్నాయి. మావూరి జ్ఞాపకాలు నాకు

ఈ సంవత్సరం వివిధ కవులు విడివిడిగా వేసిన మరికొన్ని పుస్తకాలు దీవి సుబ్బారావు - చిన్నప్పుడన్నీ ఆశ్చర్యమే, పెద్దోజు నాగేశ్వరరావు - చిలుక పలుకులు, విజయచంద్ర - మౌనలిపి, ఉదారి నారాయణ - ఆకుపచ్చని ఎడారి, యం. వెంకట్ - వర్జి, జి.ఆర్‌కుర్మే - ధమ్మపథం వివిధ వస్తు నిర్దేశాలతో వచ్చినవి. దీవి సుబ్బారావు గారి కవిత్వం ఈ సంవత్సరం వచ్చిన కవిత్వంలో ప్రత్యేకమైంది.

నచ్చిన కవిత. బసలింగప్ప మానవశక్తిపై ఆశ కలవాడు పదవుల కోసం పాకులాడేవాళ్ళను 'పదవి' కవిత ద్వారా నిరసిస్తాడు. వసుధైకంలో 'జనం నా వూరు, జనం నా పేరు' అని తనలోని విశ్వ మానవ సౌశీల్యాన్ని ప్రకటించుకున్నాడు. 'పరీక్ష'లో నిందలు తప్పవు, నిజాయితీగా ఉండాలనుకుంటే, వ్యధలు తప్పవు, వ్యక్తిత్వం నిలుపుకోవాలంటే' అంటాడు. 'ద్వారానికి కట్టిన, కర్టన్ మీది పూలు కదిలితే నా మనసు పరిమళిన్నంది' అనటంలో ఆయన సున్నితత్వం వ్యక్తమవుతుంది. ఆ సున్నితపు మార్గంలో మంచి కవిత్వం రాస్తున్న కవి బసలింగప్ప. యాకూబ్ ఆయన్ను అప్పాసార్ అంటాడు. నిజానికి ఆయనకా అర్హత ఉంది. అట్లాగే ఆయన కవిత్వానికి.

ఈ సంవత్సరం వివిధ కవులు విడివిడిగా వేసిన మరికొన్ని పుస్తకాలు దీవి సుబ్బారావు - చిన్నప్పుడన్నీ ఆశ్చర్యమే, పెద్దోజు నాగేశ్వరరావు - చిలుక పలుకులు, విజయచంద్ర - మౌనలిపి, ఉదారి నారాయణ - ఆకుపచ్చని ఎడారి, యం. వెంకట్ - వర్జి, జి.ఆర్.కుర్మే - ధమ్మపథం వివిధ వస్తు నిర్దేశాలతో వచ్చినవి. దీవి సుబ్బారావు గారి కవిత్వం ఈ సంవత్సరం వచ్చిన కవిత్వంలో ప్రత్యేకమైంది. పిల్లల మీద సీరియస్ కవులు కవిత్వం రాస్తే మైన్‌స్ట్రీమ్ కవిత్వంలోంచి పక్క తొలుగు తామునో, ఆ కవిత్వం పట్ల చిన్న చూపో తెలియదు కానీ తెలుగులో చాల తక్కువ కవిత్వం వస్తుంది. దీవి సుబ్బారావు బాల్యం మీద రాసిన 'చిన్నప్పుడన్నీ ఆశ్చర్యాలే' చదివితే మనకు అన్నీ విస్మయాలే మళ్ళీ మనం పసివాళ్ళం కాగలమా, అమాయకంగా స్వచ్ఛంగా, బాల్యానికి దూరమైన మనల్ని సుబ్బారావు ప్రశ్నిస్తారు. బాల్యం చుట్టూ అల్లుకున్న కవిత్వమిది. ఉదారి నారాయణ 'ఆకుపచ్చని ఎడారి' ఆదిలాబాదు ప్రాంతపు జనజీవన క్షోభను వ్యక్తీకరించిన సంకలనం. గ్రామీణ ఆదిలాబాదు జీవితంలో సంభవించిన అతిసారా, మలేరియా వ్యాధుల్ని ప్రజలకు విడమరచి చెప్పేవిధంగా ఇందులో కొన్ని కవితలున్నాయి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో ఈ ఆకుపచ్చని ఎడారి చదివితే తెలంగాణ ఆక్రోశం, తెలంగాణ యాస కోసమైనా దీన్ని చదవాలి. బాల్యం బడిలో, ధోకాబాదల్, పురుగు కాటేసిన మనిషి, నేను గిట్లనే మాట్లాడతా, వాణ్ని నమ్మొద్దు, ఆకుపచ్చని ఎడారి వంటి కవితలు నచ్చాయి. "అమ్మ గుమ్మంపై నిల్చొని, చూపుల జవాన్లను, బడి గోడల దాకా కాపలా పంపేది" "నేను గిట్లనే మాట్లాడుతా, మా అవ్వ జెప్పింది, మీరు మాట్లాడుతే సురాగుంటది, మేము నోరు దెరిస్తే నగుతరా!! అంటాడు తెలంగాణ యాసను యెద్దేవా చేస్తే సహించని స్వభావంతో రాసిన మంచి కవిత్వమిది. తెలంగాణ నేటివిటికి దగ్గరగా ఉన్న కవిత్వమిది.

కందుకూరి దుర్గాప్రసాద్ 'ఇసుక గొంతులు' సంపుటి వచన కవితల సంపుటి కాదు. మినీ కవితలు అందామనుకున్నా వేమన పద్యాల్లాగా చిన్నచిన్న టుమీరీలు ఉన్నాయి. ఇది టుమీరీ కవిత్వమని కొట్టి పారేయరాదు. గాఢమైన అభివ్యక్తి ఉంది. ఒక్కో టుమిరి ఒక్కో అనుబాంబు లాగా పేలుతుంది. ఈ టుమ్రీల్లో ఒక ప్రతిపాదన, విశ్లేషణ, ముగింపు పైన కవికి శ్రద్ధ ఉంది. ఇందులో వ్యంగ్యం ఉంది. సెన్సిటివ్ ఉంది. ఒక తాత్త్విక పునాది ఉంది. గాఢమైన ఊహాజనిత గుణం కూడా ఉంది. స్వానుభవంలోకి వస్తే గాని, కవిత్వం రాయలేని కందుకూరి దుర్గాప్రసాద్ పుస్తకమంతా ఆ అనుభసారం లేకుండా రాయనందుకు అభినందించాలి. వగడాల నాగేంద్ర ముందుమాట రాస్తూ "దినంలోంచి ఒక క్షణం జారినా, నాణెం కింద పడ్డ చప్పుడు

వినబడుతున్న ఈ అత్యాధునిక కాలంలో మనసు అంతరాంతరాలలో మరుగున బడ్డ ప్రేమలకు, స్పందనలకు జీవం పోయాలనుకునే తపనే ఈ కవిత్వం. తెలంగాణ మట్టి వాసనలోంచి వచ్చిన కందుకూరి దుర్గాప్రసాద్ కన్నీటి తడితో నిండిన ఈ కవిత్వాన్ని 'ఇసుక గొంతులు' గా విన్పించాడంటారు. "పావురం తెగ చెక్కర్లు కొడుతోంది, తెలంగాణ అని తెలీదనుకుంటా...., ల్యాండ్‌మైన్ మీద నిలబడి, లాండింగ్ సిగ్నలెలా ఇవ్వను" అంటాడు. ఇందులోని ప్రతి టుమ్రి మెచ్చుకోదగ్గట్టుగా ఉంది.

వేణు సంకోజు 'మనం' కవితాసంపుటి ద్వారా మానవీయ సంబంధాల్ని మనందరకీ టానిక్‌లా అందించ ప్రయత్నించారు. నగ్నముని ముందు మాటలో "మన గురించి - మనం నిత్యం ధరించే మాస్కుల గురించి, మన అసమానత సమాజం గురించి, మన రాజ్య కీచక రాజకీయం గురించి, మనలోని సమస్త అపసవ్య ధోరణుల గురించి, వికటాట్ట హాసం చేస్తున్న బీభత్సం గురించి ప్రస్తావించిన కవితలున్నాయి. వీటన్నిటిలో పరోక్షంగా ప్రముఖ పాత్ర వహించేది సామాన్యుడే. ఛిద్రమవుతున్నది సామాన్యుని జీవితమే... వేణు సంకోజు కవితలు సామాన్యుని సంతకాలు" "అమ్మలేని తనమంతా నరికేసిన అడివి, వేయి ముఖాల దుఃఖం' "జీవితానికే నటించడం చేతనవును, మృత్యువు యదార్థవాది", "మతమంటే ఆకుపచ్చ జ్ఞాపకాల్ని నెమరేయించే ఒక కొత్త రుతువు కావాలి, మనిషి కోసం మనిషిచ్చే ఒక జీవిత హామీ కావాలి" వంటి పాదాలు నిత్యం చదువకోదగ్గవి ఈ పుస్తకం నిండా ఉన్నాయి. అఫ్సర్ మరో ముందు మాటలో" వేణుకి కవిత్వం ఒక అన్వేషణ. జీవితంలోని పసితనం నుంచి చివరి క్షణం వరకూ ప్రతీదీ అతని అంతర్నేత్రాన్ని తెరిచే సాధనమే. ఒక గమ్యంగా స్థిరపడిపోవాలన్న విపరీత కాంక్ష అతనికి లేదు. గమనం లోంచి జీవితంలోని స్వచ్ఛతనీ, నికార్సయిన సమాధానాన్ని రాబట్టుకునే ప్రయత్నం వేణుది" అంటాడు. "వ్యంగాన్ని మంచి వ్యక్తీకరణ సాధనంగా వుపయోగించుకోవడం వల్ల వేణు కవిత్వం పదునెక్కింది" అన్నారు. ఈ పదును మొదటి నుంచి చివరి దాకా ఉంది తోకలొస్తున్నాయి జాగ్రత్త, కావాలే, ఇష్టం, వాడి ముఖం, మనం, మనిషనే పచ్చినిజం, జీవిత మొక్కటే, బతికిన ఆనవాలు వంటి కవితలు నాకు ఈ సంపుటిలో బాగా నచ్చినవి.

ఈ సంవత్సరం వివిధ దిన, వార, మాస, ప్రత్యేక సంచికలలో అచ్చయిన కవితల్ని లెక్కిస్తే వందల సంఖ్య దాటి వేల సంఖ్యలోనే అచ్చయినాయి. ఈ సంవత్సరం అచ్చయిన కవితల్లో కొన్ని పేర్లను మాత్రమే ఉటంకిస్తాను

యెన్నం ఉపేందర్ 'కర్రు పుట్టింది' సంపుటి దళిత దుఃఖంలోంచి వచ్చిన కవిత్వమిది. ఉపేంద్ర జీవితానికీ, కవిత్వానికీ వ్యత్యాసం లేదు. పోరాట శీలం గలవాడు. సృజన గలవాడు. నైపుణ్యం కలవాడు. కవిత్వ నిర్మాణ రహస్యాలు తెలిసినవాడు. యాస అన్నింటికన్న యెక్కువ తెలిసినవాడు. తెలంగాణ తల్లి వేరురుణం తీర్చుకునే కవి. స్థానిక జీవితం, స్పృహని కవిత్వీకరించే కవి. ఉపేంద్ర కవిత్వం సాఫీగా సాగుతుంది కాని మేధోపరమైన, హృదయ పరమైన అసహనం ఇతని సాఫీగా సాగే కవిత్వం ఉంది. ఇతని కవిత్వం చదివిన తరువాత మరొకరి కవిత్వం చదవాలనిపించనటువంటి మంచి కవితలు కర్రులో ఉన్నాయి. కర్రు పుట్టింది, కొవ్వొత్తి నయిత, ఊరును ఆలింగనం చేసుకున్న తీరు మరుపు రాదు. అల్పపీడనం వేసింది, ఊడలు సిట్లుతున్నై, వూరి పుటల్లోంచి, మాట నేర్పింది ఈ నేల, నల్లతోలు మనిసిని నేను వంటి కవితలు ఆలోచనకు గురి చేస్తాయి. ఉపేంద్రను నిలబెడతాయి.

ఈ సంవత్సరం వివిధ దిన, వార, మాస, ప్రత్యేక సంచికలలో అచ్చయిన కవితల్ని లెక్కిస్తే వందల సంఖ్య దాటి వేల సంఖ్యలోనే అచ్చయినాయి. ఈ సంవత్సరం అచ్చయిన కవితల్లో కొన్ని పేర్లను మాత్రమే ఉటంకిస్తాను. దాట్ల దేవదానం రాజు-వెలితి, దేవి ప్రియ-నూతన చంద్రుడో, పాలిపోయిన సూర్యుడో, డా. సి.నారాయణరెడ్డి - మీట గలిగితే, మూలాల్లోకి వెళ్ళితే, ఏనుగుల నర్సింహారెడ్డి - పహిలీకీ బాత్, జావెద్ - తెగిన నమ్మకం, త్రిపుర - ఒక కాఫ్కా జీవితం కావాలి, రమణ జీవి - ఆ తర్వాత, ఎవరిదో, ఎండ్లూరి సుధాకర్ - ప్రకంపనాలు, శోకదినం, ఆజం - హెచ్చరిక, గౌతమ్ మహోగ్ర ప్రతిఘటన, సతీష్ చందర్ - కనురూపాయి, కె.యస్. రమణ - సంఘం శరణం గచ్ఛామి, గుడిపాటి - అంతర్ముఖాలు, ఎన్.గోపి - ఎయిర్‌పోర్ట్, వంశీకృష్ణ - పేరు సిరిసిల్లా, ఎస్.జయ - టైమ్ అండ్ స్పేస్, శ్రీకాంత్ - ప్రశ్న, వాడ్రేవు చినవీర భద్రుడు - మహాబలిపురం తీర దేవాలయం, చల్లపల్లి స్వరూపరాణి - బిడ్డ సంచులు, విమల - ఒకానొక నోస్టాల్జియా, నలిమెల భాస్కర్ - గది, అఫ్సర్ - ఒక గ్లోబల్ విలేజిలోంచి, కత్తి పద్మారావు - పతాక శీర్షిక, నిఖిలేశ్వర్ - అప్రకటిత యుద్ధం, ప్రసేన్ - మూడు దృశ్యాలు, ఇక్బాల్ చంద్ - సీతాకోక చిలుక, దేశరాజు సాము సడలని రాత్రి, నందిని సిధారెడ్డి - పరవశం, శివసాగర్ - జ్ఞాపకాలు, చిక్కడు దొరకడు, యాకూబ్ I'am and out అను అంతరంగం, షేక్ కరీముల్లా - నిషిద్ధాశ్రువు, జింబో - కన్వెషన్, మహజబీన్-సహచర, నగ్నముని - వాక్యాలు, దెంచనాలు శ్రీనివాస్ - ఝూం మని, ముకుంద రామారావు - విత్తనాలు, దర్భశయనం - దేహకాంతితో, పులిపాటి గురుస్వామి - అస్తమించే వాన, సత్య శ్రీనివాస్ - చాకలి కల, అయిలా సైదాచారి - షడ్డమశాంతి, కె. శివారెడ్డి - నా తల్లి లాంటి తల్లి, పత్తిపాక మోహన్ - తెగినపోగు, రాధాకృష్ణమాచార్యులు - మానవత్వం విత్తన మైదానాలు, శ్రీకాంత్ - మరొక రోజు వంటి మంచి కవితల లిస్టు

కవిత

శిలాలోలిత

# కొత్త కోణం



చెట్టుకు అల్లుకుని పాకుతున్న తీగలా
ఎండపొడ తగిలి మెరిసే నేలలా
ప్రేమతో చుట్టుకుని మెరుస్తున్నాను
సముద్రం విరిగి ముక్కలై
అలల్లా పరుచుకున్న దృశ్యం ముందు
నీటి తుపరలా నిల్చున్నాను
నాలోని చెట్లనూ, తీగల్ని, ఎండపొడల్ని, నేలని ప్రేమని
ధరించే కళ్ళను
దేనికది విడదీసుకుంటూ, లోపలికి తొంగి
చూసుకుంటూ రూపం ధరించని మట్టి ముద్దలానే
ఇంకా మిగిలి ఉన్నాను
నా లోపలికి దూసుకొచ్చే యుద్ధాలు
నన్ను బంధించే స్త్రీత్వాలు
నన్ను వర్ణించే 'సహనవతి' ప్రతీకలు-
గంభీరమైన సముద్రం ముందు
హోరెత్తుతున్నాను
అలలా విరిగి పడుతున్నాను. ఎగుస్తున్నాను, చెదిరి
చెదిరి తుంపర్లుగా మారిపోతున్నాను
నన్ను చూడనీయన చరిత్రలు,
నన్ను కన్నెత్తనీయని కభోది
ధర్మాలు,
నాకే ముఖమూ లేకుండా
చెక్కేసిన పరుష శిల్పులు-
మళ్ళీ నేను మట్టి ముద్దలోంచి
మానవి రూపంలోకి
ప్రయాణిస్తున్నాను.
వ్యక్తీకరణ నా కొత్తకోణం!

రాసుకుంటూపోతే యెంత లేదన్నా మరో రెండువందల కవితల పేర్లు రాయవలసి ఉంటుంది.

నిజానికి ఈ వ్యాసంలో మైన్‌స్ట్రీమ్‌గా రాయవలసినది ఎం.ఎస్. నాయుడు - ఒక వెళ్ళిపోతాను, శ్రీకాంత్ - అనేక సమయాలు, ఇక్బాల్ చంద్ - ఆరోవర్ణం, పులిపాటి గురుస్వామి - చెమ్మ, రమణజీవి - నలుగురు పాండవులు, ఎన్. జగన్‌రెడ్డి - నేనొక్కన్నే.

శ్రీకాంత్, గురుస్వామి, రమణ జీవి, జగన్ రెడ్డి, ఇక్బాల్‌చంద్, నాయుడు కవిత్వం ఈ సంవత్సరం వచ్చిన కవిత్వంలో ప్రత్యేకతలున్నాయి. వస్తు నిర్మాణాలు మిగతా కవుల కన్న భిన్నమైన వాళ్ళు. ఈ అరడజన్ పుస్తకాల్ని విశ్లేషించడానికి మరో అరవై పేజీలన్నా కావాలి. రమణజీవి ఈ సంవత్సరం అచ్చయిన సంపుటుల్లో అందంగా అచ్చు వేసుకున్న కవి. నలుగురు పాండవులతో పోటీ పడేట్లు యెవ్వరూ వేసుకోలేదు. జగన్‌రెడ్డి - నేనొక్కన్నే సంపుటి లిటరరీ ఆర్ట్ బుక్‌గా వచ్చింది. రమణ జీవి, జగన్‌రెడ్డిల పుస్తక ప్రచురణల లాగా వచ్చే సంవత్సరం అందరివీ వస్తే కవిత్వంతో పాటు ప్రచురణలలో కూడా సంపన్నులం కాగలం. గురుస్వామి, రమణజీవి, జగన్ రెడ్డి, శ్రీకాంత్ కవులుగా మంచి నిర్మాణ రహస్యాలు ఉన్నవారు. నిజానికి వీళ్ళది యెవరి దారి వారిదే. సమూహపు అంతర్ముఖత్వంలో, తమను చూసుకోగలరు. స్వానుభవ తాత్వికత, సంఘర్షణ యెక్కువగా గలవారు. గురుస్వామి, రమణజీవి, శ్రీకాంత్, జగన్‌రెడ్డి భిన్న ధృవాల వాళ్ళు. యెక్కడో ఒక దగ్గర వీళ్ళకు కలుసుకునే గుణం ఉంది. ఒక ఉద్విగ్నత, ఒక ఆర్ద్రత, హృదయ స్పర్శ, ఊహ, ఒకే రకంగా ఉండదు. వీళ్ళలో సంక్లిష్టత ఉండదు. వీళ్ళు కవిత్వాన్ని సరళంగానే చెబుతారు. అయితే ప్రతీకాత్మకం చెప్పకునే నైపుణ్యం ఎవరిది వారిదే. ఈ ప్రతీకలు ఎవరి దొడ్లోనో పడి దొంగిలించి తమ కవిత్వంలో వీళ్ళు బలమైన ఇంప్రెషనలిస్టులు, ఇందువిద్యువలిస్టులూ, ఒకరిద్దరైతే అనార్కిస్టులు మరో ఇద్దరైతే తల్లో నాలుక లేనివాళ్ళు. వీళ్ళంత మౌనులో అంత సంఘర్షణకు లోనయ్యేవాళ్ళు. వీళ్ళు తమని తామే కాదు ప్రజల్ని యెక్కువగా ప్రేమిస్తారు. లోపల లోపల కొందరు తాగుతారు. మనచేత వాళ్ళ కవిత్వాన్ని తాగిస్తారు. ఈ అంతర్ముఖులకు వారసత్వం లేదు. వాళ్ళకు వారే వారసులు.

నివేదిక

ఐ. ఉదయలక్ష్మి

# వనితా సాహిత్య సమాలోచన

తెలుగు సాహితీక్షేత్రంలో స్త్రీలు సాగించిన రచనా సేద్యం తక్కువేం కాదు. అయితే ఫల నాణ్యతలో తేడా వుండొచ్చు. పండు బాగుండాలంటే చెట్టుకు మంచి ఎరువేయాలి. ఇంకా కొన్ని సస్యరక్షణ చర్యలు చేపట్టాలి. అలాగే ఓ రచన పండాలంటే రచయితకు మంచి అవగాహన, రచనా నైపుణ్యం వుండాలి. కానీ విద్యాభ్యాసంపై నిషేధం కొనసాగిన అలనాటికాలం నుండి గగనాంతర సీమల్ని అధిరోహిస్తున్న ఈనాటివరకు స్త్రీ ప్రతిదశలో ప్రతిబంధకాలను ఎదుర్కొనవలసి వస్తూనే వుంది. ఇలాంటి సామాజిక నేపథ్యమున్న చోట ఆమె ప్రతిభకు పదును పెట్టుకోవడం కష్టమే. అయినా అవాంతరాలను అధిగమించి గత కాలంలో స్త్రీలు సాగించిన సాహితీ సృజన గురించి అవలోకించినప్పుడు సంతోషం కలుగుతుంది. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం- కేంద్ర సాహిత్య అకాడమీ దక్షిణ ప్రాంతీయ శాఖ కలసి హైదరాబాద్‌లో మార్చి 8-10 తేదీలమధ్య అఖిల భారత రచయిత్రుల మహాసభలు ఏర్పాటు చేయడం ద్వారా రచయిత్రులకూ, సాహిత్యాభిమానులకూ అలాంటి సంతోషాన్నే పంచాయి. స్త్రీల సారస్వతాన్ని అవలోకించే మహద్భాగ్యాన్ని కల్పించాయి. ప్రపంచీకరణపై చర్చగోష్ఠి నిర్వహించడం ద్వారా రచయిత్రుల బాధ్యతనూ గుర్తింపచేశాయి. మూడుతరాలకు చెందిన రచయిత్రులు ఒక్కచోట చేరి అనుభవాలనూ- అనుభూతులనూ కలబోసుకోవడం, ప్రాచీనకాలంనుండి ఆధునికకాలం వరకు స్త్రీలు సృష్టించిన సమస్త రచనా ప్రక్రియలపై చర్చ జరపడం నిజంగా ఓ అరుదైన సందర్భమే. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా అలాంటి అరుదైన సమ్మేళనానికి అవకాశం కల్పించిన నిర్వాహకులు, ప్రత్యేకించి ఈ సభల ఏర్పాటుకు చొరవ చూపిన అప్పటి వైస్ ఛాన్సలర్ డా. ఎన్.గోపి అభినందనీయులు. సాహిత్య రంగంలో స్త్రీ సాధికారతకు, వారి కృషిని అంచనా వేయడానికి ఈ సభలు దోహదపడతాయని ఆయన ప్రారంభసభలో పేర్కొన్నారు. తెలుగు రచయిత్రులు తమ సమస్యలను బలంగా ప్రతిధ్వనింపచేస్తున్నారన్నారు సభలను ప్రారంభించిన ప్రముఖ అస్సామీ రచయిత్రి, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత ఇందిరా గోస్వామి. తెలుగు సాహిత్యంలో స్త్రీల కృషిని రేఖామాత్రంగా సమీక్షించారు కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి ఆచార్య కె. సచ్చిదానందన్.

తెలుగు యూనివర్సిటీలోని డాక్టర్ నందమూరి తారక రామారావు కళా మందిరంలో జరిగిన ఈ సభల్లో "స్త్రీల సాహిత్యం- నాడూ నేడూ"అనే అంశంపై ఆచార్య సి. ఆనందారామం అధ్యక్షతన తొలి సదస్సు జరిగింది. ఆచార్య పి. యశోధారెడ్డి అధ్యక్షతన జరిగిన మూడో సదస్సు "కవితా ప్రక్రియలో స్త్రీల కృషిపై చర్చించింది. తాళ్లపాక తిమ్మక్క, మొల్ల తదితర ప్రాచీన కవయిత్రులనుండి నేటి స్త్రీవాద-దళిత రచయిత్రుల వరకు సాగిన సాహితీ సృజనకు ఈ రెండు సదస్సులూ దర్పణం పట్టాయి. ఈతరం రచయత్రులకు అనేక కొత్త విషయాలు ఎరుకపరచాయి. సదస్సుల్లో ప్రసంగించిన వక్తలంతా ఆయా అంశాల బోధనలో ఉద్దండులు. ఎంతో అధ్యయనంచేసి ఉపన్యసించారు. జానపద సాహిత్యంలో స్త్రీల గురించి ప్రసంగించిన డాక్టర్ రావి ప్రేమలత లిఖిత సాహిత్యంతో పాటు మౌఖిక సాహిత్యాన్ని గూడ పరిగణనలోకి తీసుకోవాల్సిన అవసరాన్ని గుర్తు చేశారు.

నవలా ప్రక్రియలో స్త్రీల కృషిపై వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షతన జరిగిన సదస్సు రచయిత్రులు భావపరిణామాన్ని విశదపరిచింది. పురుష భావజాలంచేత ప్రభావితమైన పూర్వపు రోజుల్లో (నేటికీ కొద్దిమంది మాత్రమే ఆ ఊబినుండి బయటపడగలిగారు) సతీ-పతివ్రతా ధర్మాల గురించే రాశారు స్త్రీలు. ఆ తరువాత సర్దుకుపోతూ సంస్కృతిని సంరక్షించాలన్నారు. ఇంకొన్నాళ్ల తరువాత చదువులు, ప్రేమలు, పెళ్ళిళ్ళ గురించి రాశారు. దాంతోపాటు కుటుంబగతమైన అణచివేతపై మహిళల మూగవేదనను కూడా కాసింత అక్షరబద్ధం చేశారు. తదనంతర కాలపు రచయిత్రులు చదువుతోపాటు సంతరించుకున్న చైతన్యంతో తమకూ సామాజిక జీవితం కావాలని డిమాండ్ చేశారు. నానారకాల అణచివేతపై అక్షరాయుధాలు సంధించారు. అయితే ఇలా

చేయడం కంటే లాలించి చెప్పడం మంచిదంటారు యశోధారెడ్డి. ఒక సమన్వయం పాటించాలని, హృదయ ద్రవీకరణకు ప్రాధాన్యత నివ్వాలని చెబుతారామె. కానీ వర్తమాన సమాజంలో వర్ణించశక్యంకానంత అణచివేతకు గురవుతున్న స్త్రీ స్వరం ఆ మాత్రం కరుకుగా పలకడం సహజమే కదా... అంటున్నారు నేటితరం స్త్రీలు. స్త్రీల విమర్శలను స్వీకరించి సరిదిద్దుకోని పురుషాధిపత్యం వ్యంగ్యబాణాలతో వాళ్ళ నోళ్ళు మూయించేందుకు ప్రయత్నించిందన్న ప్రొఫెసర్ కాత్యాయనీ విద్మహే మాటలను ఈ సందర్భంలో గమనంలో వుంచుకోవలసివుంది. రంగనాయకమ్మగారి "జానకివిముక్తి"లో కరుడుగట్టిన పురుషాహంకారి వెంకట్రావ్‌ను ఇక్కడ గుర్తుకు తెచ్చుకోవలసివుంది. ఏది ఏమైనా కాలానికి అనుగుణంగా స్పందించి స్త్రీలు నవలా రచన సాగించారని ఈ సదస్సులోని ప్రసంగాలు ఆలకించాక అర్థమవుతుంది. స్త్రీలు రచించిన సామాజిక చైతన్య నవలలు, రాజకీయ ఉద్యమ నవలలు, గ్రామీణ నవలలపై కూడా ప్రసంగాలు సాగాయి. కథా రచన బాధ్యతగా సాగాలన్నారు కె.రామలక్ష్మి. ఆమె అధ్యక్షతన కథా సాహిత్యంపై జరిగిన సదస్సు కథా రచనలో స్త్రీల పరిధి ఎలా విస్తరిస్తూ వచ్చిందో విశదపరచింది. "భయపడే స్థితి నుండి నిర్భీతితో కళ్లల్లోకి చూసి మాట్లాడగలిగే స్థితికి స్త్రీల 'కథ' ఎదిగింది. ప్రత్యేకించి ఎనభైలనుండి వెలువడుతోన్న కథల్లో స్త్రీ చైతన్యం తొణికిసలాడుతోంది. స్త్రీల శరీరాంగాలను వైభవీకరించే పురుషస్వామ్య భావజాలంపై కథాస్త్రాలు సంధించారు ఓల్గా. ఇప్పటి కథా రచయిత్రులు ప్రపంచీకరణ పర్యవసానాలను కూడా చిత్రించగలుగుతున్నారు" అంటూ కుప్పిలి పద్మ 'సాలభంజిక'ను ఉదహరించారు కథా రచయిత్రి పి. సత్యవతి. స్త్రీలు రచించిన మానవసంబంధాల- స్త్రీ చైతన్య కథలతో పాటు మనోవైజ్ఞానిక- హాస్య, వ్యంగ్య కథలపై కూడా ఈ సదస్సులో ప్రసంగాలు సాగాయి.

స్త్రీలపై ప్రపంచీకరణ ప్రభావం గురించి జరిగిన చర్చాగోష్ఠి అద్యంతం ఆలోచనాత్మకం. మహాసభలకే హైలెట్. ఇప్పటివరకూ సాగిన సాహితీ సృజన ఒక ఎత్తయితే అంతకు మించి నెరవేర్చవలసిన కర్తవ్యాన్ని ఎత్తిచూపింది ఈ గోష్ఠి. స్త్రీలు దరిద్రాన్ని మేనేజ్ చేస్తారంటున్నాయి వరల్డ్ బ్యాంకు-ఐఎంఎఫ్. వీటి షరతులకు తలొగ్గి పాలకులు అమలు చేస్తున్న విధానాలు ఇప్పటికే సమాజపు అంచుకు నెట్టివేయబడిన వర్గాలను ఇంకాస్త దుర్భర స్థితికి చేర్చుతున్నాయి. ఈ విధానాలు మొదట స్త్రీలనే దెబ్బతీస్తున్నాయి... అన్న ఆచార్య రమా మెల్కోటే మాటలు రచయిత్రుల తక్షణ కర్తవ్యాన్ని గుర్తుచేస్తాయి. అధ్యక్షత వహించిన రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి ప్రపంచీకరణకున్న మరో పార్శ్వాన్ని అవిష్కరించారు. సెల్‌ఫోన్లు, ఫ్లైఓవర్లు, ఈమెయిళ్ళను గుర్తుకు తెచ్చే ప్రపంచీకరణ కుటుంబాలను ఏ స్థాయిలో ప్రభావితం చేస్తుందో ఉదాహరణలతో వివరించారామె. మన సున్నిపిండిని మార్కెట్‌లో పెడుతున్న, మన వేపాకుల్ని-పసుపును పేటెంట్ చేస్తున్న, మేధను మరుగుపరచి-శరీరంపై ధ్యాస పెంచుతున్న, మన సంస్కృతిని కబళిస్తున్న ప్రపంచీకరణ గురించి ఆమె చేసిన అధ్యక్షోపన్యాసం ఆలోచింపచేసింది. "మతతత్వశక్తులు చెబుతున్నట్టుగా సంస్కృతి అంటే పూజలూ పునస్కారాలూ కాదు, మనం తినే తిండి, కట్టుకునే బట్ట, మన జీవనశైలి... ఇదీ సంస్కృతి అంటే. ఈ సంస్కృతిని కూడా సరుకుగా మార్చేసింది ప్రపంచీకరణ... అన్నారు రమా మెల్కోటే. "ప్రపంచీకరణ వల్ల ఆర్థికంగా స్త్రీలు బలహీనులవుతారు. పేదదేశ స్త్రీలు మరింత దైన్యస్థితిలోకి నెట్టబడతారు" అన్నారు డాక్టర్ ఇనాక్. ఆలోచింపచేసే ప్రసంగాలను ఆలకించిన కొందరు శ్రోతలు అనేక ప్రశ్నలు వేశారు. ప్రశ్నలకు సమాధానాలు చెబుతూనే గ్లో'బలీ'కరణను అర్థం చేసుకుంటే కొన్ని ప్రశ్నలు రావని చెప్పారు రమామెల్కోటే. చుట్టూ ఏం జరుగుతుందో గుర్తించకపోతే మన విధ్వంసం ఖాయమన్నారు ఛాయాదేవి. రచయిత్రులు తమకు తాము పదును పెట్టుకునేందుకు ఈ వ్యాఖ్యలు దోహదపడతాయి. విమర్శ, పత్రికా రంగం, వ్యాసం, నాటకం, అనువాద సాహిత్యం, పరిశోధనల్లో స్త్రీలు సాగించిన కృషిపై కూడా సదస్సు జరిగింది. కళా సాహిత్య రంగాల్లో స్త్రీల పాత్రపై జరిగిన చర్చాగోష్ఠిలో ఓల్గా కీలకోపన్యాసం చేశారు.

రచయిత్రుల సృజనానుభవంపై సాగిన గోష్ఠి సభకు ఓ అదనపు ఆకర్షణ. రెండుసార్లుగా సాగిన కవయిత్రుల సమ్మేళనంలో మొత్తం 45మంది కవితలు వినిపించారు. డాక్టర్ గోపి పేర్కొన్నట్టు ఈ సభ ఇచ్చిన స్ఫూర్తి నూతన సాహిత్య సృష్టికి దోహదపడగలదు.



కావ్యం నుండి

కె. శివారెడ్డి

# అశ్వమేధం

## సర్గ - 1

మార్గాలు వెతుకుతున్నా
బయటపడే మార్గాలు వెతుకుతున్నా
అంచుల్లేని నిప్పుల బావిలో ఈదటం,
లోన ఎవ్వరో కవ్వంతో చిలుకుతున్నారు
చిలుకుడుపాట, మరుగుతున్న నీటిపాట కలిసి,
ఒక కొత్త స్వరంతో
నా చుట్టూ, నాలోపలా, బయటా
అంటుకుంటూ, అంటించుకుంటూ-
మంచో, పొగో, ఆవిరో, క్షారమో
ఏదో తెలియని ఒక కొత్త ద్రవం
ఒక కొత్త వాయువు,కంఠంలోంచి
లోనికి దిగుతుందో, లోన్నుంచి బయటికి
వస్తుందో తెలియదు,
నేనిక్కడ అరచేతి అగ్ని సరస్సున
నేనిక్కడ ఊపిరాడని గది గుండెలో, తలకిందులై
ఒక ప్రాణ వాయువుకోసం, ఆత్మీయ ఆర్తి కోసం
దీన్ని వాయువందామా, ద్రవ మందామా
అంతలోనే ముళ్ళ జముడు పొదలా తనువంతా వ్యాపించి-
ఈ స్థితిని
ఎలా దృశ్యీకరించాలో తెలియక,
మార్గాలు తెలియక, ఒక తూనీగలా దారులు వెతుకుతూ
దారంకోసం వెతుకుతున్న గాలి పటంలా,
అమ్మవారినెత్తుకుని, కొరడాతో వళ్ళంతా బాదుకుంటూ
చర్మం నెత్తురు చిమ్ముతుంటే
కాళ్ళ మువ్వలు గలగల మోగుతుంటే
చకచకా యింటినుంచి యింటికి
బజారునుంచి బజారుకు వెళ్తున్న
ఆగణాచారి భక్తుడిప్పుడు నాలో
గొంతులోంచి కత్తి ఆదరినుంచి
ఈ దరికి దించి, అడుక్కునేవాడు,



బ్లేడులా, సాసర్లూ గ్లాసులూ తినేవాడు,
ఈ చెవులోంచి రూపాయి
ఆ చెవులోకి తెప్పించే కాటిపాపలోడు
వీళ్ళందరూ నాలో ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు
లేదు, అందరూ కలిసి బృంద గానంగా
ఒక సామూహిక చర్యలో కలిసిపోయి;
నాకు చిన్న మార్గం కావాలి
ఈ ఆత్మ ఖైదు నుంచి
ఈ అవాంఛిత అఖండ గది దేహంనుంచి
గుప్పిట్లో యిరుక్కున్న
ఈగ దశ నుంచి బయటపడటానికి,
ఓ చిన్న బెజ్జం, చిన్న ఖాళీ
గాలిదూరేసందు, వెలుగుసోకే సందు
ఈ గాఢాంధకార గది చతురస్రంనుంచి
వెళ్ళాడుతున్న పోగులో యిరుక్కున్న ముత్యంనుంచి
ముక్కు బేసరనుంచి, కాలి కడియంనుంచి
బయటపడ్డానికి ఓ మార్గంకావాలి;
కాలికడ్డంగా వేసిన
మట్టి కట్టకు చిన్న బెజ్జంపడితే

అది క్రమంగా కోసుకుని, కొసుకుని పెద్దదై
కట్టను తెంచుకుని నీటి సుందరిలా బయటపడ్డట్లు
బయట పడటానికీ;
రాగి రేకులో యిరుక్కున్న
మంత్రం ఎలా బయటపడుతుంది,
ఏడు నిలువుల లోతున పాతేసిన
నవధాన్యాలకి విముక్తి ఎప్పుడు
ఇదో రూబెన్ ద్వీపం
ఇదో అండమాన్ ద్వీపం
దీపం రహస్య సంచారాలులేని
వేళ్ళ మిలమిలలులేని
ఆత్మ ఖైదులో చిక్కుకున్న దేహం ఘోష
యూనాది వాడెవడన్నా
కర్ర తాడించుకుంటూ యిటు పోనన్నాపోడు,
పై నుంచి ఒక్క ఆకన్నా రాల్చని ఒక ఆకాశం తరువు,
రెండు మోకాళ్ళ మీద తలకాయపెట్టి
ఏడేడులోకాల బరువును మోస్తున్న
ఆధునిక హెర్క్యులస్
లోన్నుంచి మార్గంలేదు, మార్గం కనపడదు
బయటి నుంచైనా, ఎవడయినా ఒక రాయి విసిరితే
భళ్ళున ఈ చీకటి అద్దం పగిలిపోతే
ఈ యిరకాటపు స్థితి వన్నెంతా
వర్షం తర్వాత మట్టి కారినట్టు కారిపోతే,
ఆకు చివరి నుంచి జారుతున్న
ఒక నీటి చుక్కని నాలుకతో అందుకుంటే,
యిక్కడ యిరుక్కుపోయా
ఒక కొయ్యలో యిరుక్కున్న మేకులా
గోడమీద వేళ్ళాడుతున్న పటంలా
గడియారంలోని కాలంలా
నే చూస్తున్న దగ్గరనుంచీ
ఒకే భంగిమలో నుంచున్న నటరాజులా
ఒకే స్థితి
కీట్స్ గ్రేషియన్ అర్న్‌లోని
ఆ అందమయిన ఉద్యానవనం అలానే
అంతా ఒక Still lifs
అక్కర లేదు అక్కర లేద
చెరిగిపోని సౌందర్యమూ అక్కరలేదు
విరిగి పడుతున్న వానలా నేనుండాలి
దాన్నదే వెంటాడుతున్న వానలా
అట్లా చెట్లనీ, మనుషుల్నీ
జంతువుల్నీ , యిళ్ళనీ, వాకిళ్ళనీ వెంటాడుతూ
నాట్లేసే కూలీల ముఖాలని మృదువుగా స్పృశిస్తూ



అలా ఎవరో వేగంగా లాకెళ్ళుతున్నట్లు
ఒక తెరలా, ఒక వలలా -
నేనొక వానని,
దాన్నదే ఛాలెంజి చేసుకుంటున్న వానని
గాలి గుర్రానెక్కి సర్వ ప్రకృతికీ
కాపలా కాస్తున్నట్లు తరలిపోతున్న వానని,
గదీ గదిలోని గూనా
మసిగడుతున్న గూట్లోని దీపమూ
స్రూలాగోడకి బొక్కేసిన చూపుతో
దూరిపోతా, దూకిపోతా
పార్కులో నిరీక్షణలో మునిగిన బెంచీ మీద నేనుంటా
మంచుని విదిలిస్తున్న పక్షి రెక్కల్లో నేనుంటా

సర్గ - 2

ఆ క్షణం తర్వాత అతను అతను కాదు
అక్కడ
ఆకాస్త స్థలాన్ని గుర్తుపెట్టాను
రక్తం చిందిన స్థలాన్ని
అతని రక్తం పీల్చి - ఎరుపెక్కిన
స్థలాన్ని గుర్తు పెట్టాను,
ఆకాస్త స్థలాన్ని
మడత పెట్టి గుండెలో పెట్టుకున్నాను
ఇలా ఎన్ని స్థలాలు ఎన్ని ప్రాంతాల్లో
ఎన్ని దేశాల్లో గుర్తుపెడతావు,
చరిత్రగతిలో
రక్తం చిందిన స్థలాలన్నీ
పొద్దు తిరుగుడు పూలై కాలాన్ని నిర్ణయిస్తాయి,
ఏదయినా ఎందుకు వృధా అవుతుంది
స్వేదం చిందిన చేలనుంచి
బయల్దేరిన ఓ చలనం
అలా కదలి, కదిలి, మార్గాలు చూయిస్తూ
మార్గాల వెంట పయనిస్తూ
మార్గంలోనే, మార్గానికింత రక్తం తినిపించి-
అక్కడ స్థూపం కనపడదు
కనపడే స్థూపాలు కొన్ని
కనపడని స్థూపాలు మరిన్ని,
స్థలాన్నే కాదు,
ఘటనల్నీ, ఘటనల పూర్వాపరాల్నీ
బాధ్యుల్నీ, నేరస్థుల్నీ గుర్తు పెడుతున్నా
మనుషులు వాళ్ళ స్వంత పేర్లు దాటి
చాలా దూరం పయనిస్తారట
ఏ వూరి మట్టిలో పుట్టి పెరిగిన పేరు,
ఆవూరి పరిధిదాటి, విస్తృతి చెంది

భూమి ప్రకంపనగా కదిలిపోతుంది,
దానిచుట్టూ తోటల్నీ, పిట్టల పాటల్నీ
పాటల నదుల్నీ నదుల సస్యశ్యామలాన్నీ
లోన యిముడ్చుకుంటూ ప్రయాణిస్తుంది;
అకస్మాత్తుగా ప్రయాణం తెగుతుంది
తెంచబడుతుంది.
దుఃఖం గడ్డకట్టుకున్న
ఒకింత విశ్రాంతి తర్వాత
మళ్ళీ యాత్ర మొదలవుతుంది
ఏరు దాటేటప్పుడు
ఏరు అకస్మాత్తుగా పొంగి
దేహం చినిగిన గుడ్డ పీలికల్లా
తుప్పల్లో చిక్కుకు పోతుంది,
రైలాగుతుంది,
ప్రయాణీకులుదిగి, తలా ఒక ముక్కతెచ్చుకుని
మంత్రించిన తాయెత్తులా
దండచేతికి కట్టుకుంటారు,
మళ్ళీ ప్రయాణం,
రైలే కానక్కరలేదు. ఎడ్ల బండీ కావచ్చు
కాదు, కాలినడకనే ఊళ్ళన్నీ దాటుకుంటూ ఒక గుంపు;
గుంపు క్రమక్రమంగా పెరుగుతూ ఉధృతమౌతుంది,
ఒక్కొక్క ఊరే దాటేసరికి
గుంపునీటి మట్టం పెరుగుతుంద
అలుపొచ్చినవాడు ఆగిపోతాడు
ఒకడాగిపోతే, యిద్దరొచ్చి చేరతారు
జారేవాళ్ళకంటే చేరేవాళ్ళే ఎక్కువ
చచ్చే వాళ్ళకంటే పుట్టేవాళ్ళే ఎక్కువ.

సుఖమయిన బానిసత్వం కంటే, తగలబడుతున్న
దేహంతో బతుకుతున్న స్వేచ్ఛ గొప్పది
దేవుడయినా సరే
ఆధిపత్యాన్ని ఒప్పుకోలేక
యిదుగో నా సహచరుల్తో
దేహాంతరంగ, నరకాంతరంగ యుద్ధభూమికొచ్చాను
వెంట ఏం తెచ్చాను
ఒక గుండె దిటవు, అనంత స్వేచ్ఛాజ్వాల
నిర్నిద్ర సమరోత్సాహ శాంతి కాంక్ష.
స్వేచ్ఛ కంటకావృతమనీ
అగ్ని పరివేష్టితమనీ
నాగరాజు శిరస్సుమీద మణి అనీ
మృత్యువును చేతికర్రగా పట్టుకు తిరగమనీ
నాకు తెల్సు, నా స్నేహితులకు తెల్సు
తెలిసి ఎంచుకున్న సమరక్షేత్రమే సుఖం
ఎడతెగని చర్యల్లో
వినూత్న పథాన్ని ఎన్నుకోవడమే
మేం పైపైకి ఎగబాకాలను కోవటం శిలిదు
స్వర్గం పైన వుందనుకునే మూర్ఖులంకాదు
స్వర్గం సామూహిక చేతల్లో, చర్యల్లో
చరిత్రని తిరగ రాసే కార్యక్రమంలో
వుందని మాకు తెలుసు
యయాతీ! నువ్వు సుఖం
యౌవనంలో వుందనుకున్నావ్
సౌందర్యంలో వుందనుకున్నావ్
దేవయానికి ఆనందం అధికారంలో వుంది
నువ్వొక సోపానం మాత్రమే

## సర్గ - 3

యయాతి అశ్వమేధం ఎటుకదిలింది
పొందాడా, పోగొట్టుకున్నాడా,
ప్రమాదం దేవయానికా, యయాతికా
దాసీత్వానికొప్పుకున్న
శర్మిష్ఠ జీవితం స్వర్గమా, నరకమా?

నిజానికి చైత్రయాత్ర తర్వాతే
సంకుల సమరం మొదలయ్యింది,
బయట జరిగిన అశ్వమేధంకంటే
యయాతి గుండెల్లో జరిగిన అశ్వమేధ
నరకారోహణే గొప్పది
నేను స్వేచ్ఛకోసం స్వర్గాన్ని వదలి
నరకానికొచ్చాను



పాపం! శర్మిష్టకి, ఉర్మిళకీ ఏం తేడా వుంది
ఆదర్శాన్ని నైరూప్యీకరించి
అలా జీవితాంతం ఎదరు చూపులైనిల్చారు
యయాతీ!
నువ్వు తండ్రి సంపాయించిన దానిమీద
నీ సమాధి నిర్మించుకున్నావు
కొడుకునుంచి నువు పునర్ యౌవనం పొందినా
నువ్వు వృద్ధుడివే
అజన్మాంత వృద్ధుడివే
అనుక్షణం మహారాజునని
గుర్తుపెట్టుకునే నువ్వు
మహారాజు భావనలోనే మృతి చెందావు
పొరపాటున దోవతప్పి
ఈ స్వేచ్ఛా రాజ్యానికి, నరకానికొచ్చావ్
మరుగుతున్న

ఈ లావాని స్వీకరించు
నిన్నటి దాకా
నువ్వూ దేవతనే
దేవుడికుర్చీ గురించి
కుర్చీ స్వభావాన్ని గురించీ
ప్రశ్నించావు కాబట్టే, నువ్వు తీవ్రవాదివయ్యావు
అధికారాన్ని ప్రశ్నించే వాళ్ళు
రాజ్యస్వభావాన్ని ప్రశ్నించే వాళ్ళు తీవ్రవాదులు
దుర్మార్గపు రాజ్యకాంక్ష గురించీ
నియంతృత్వాన్ని గురించీ ప్రశ్నించే
స్వభావానికి నువ్వు ప్రాణం పోశావు

ఒక రాజు జన్మించి
వాడి చుట్టూ సైన్యం చేరితే
సైన్యం బలోపేతమౌతుంది.
రాజుకంటే సైన్యమే
శాసనకర్త అవుతుంది
దండం సైన్యం చేతుల్లో పెట్టాక
ఆలోచనలన్నీ అణచివేతవైపే పరుగెడతాయి
ప్రజలందరూ తీవ్రవాదులుగానే కనపడతారు.
ధర్మ పరిరక్షణలూ, న్యాయసూత్రాలూ
చదువులూ, చరిత్రలూ అన్న
అధికార కేంద్రీకరణ గురించే
రాజు దేవుడయ్యాక
దేవుడు రాజయ్యాక



అణచివేత ఒక్కటే న్యాయం
ప్రభువులందరూ దేనికి బలయ్యారో
దేవయానీ దానికే బలయ్యింది.
నేనే పరాన్న భుక్కుగా
సుఖ వాదిగా, మిగిలి కుళ్ళిపోయా
స్నేహితుడా! సాటన్
యిపుడు యిక్కడ ఈ ఉడుకు తున్న
లావాని మంచినీళ్ళలా తాగుతున్నాను
ఆ క్షణం తర్వాత
అతను అతను కాదు

**(విష్ణసఖారాం ఖాండేకర్ నవల - యయాతికి కృతజ్ఞతలతో)**

విశ్లేషణ
ఆచార్య పి.కుసుమ కుమారి

# తెలుగు సాహిత్యం అకడమిక్ పరిశోధన



'అకడమిక్ పరిశోధన' అంటే విశ్వవిద్యాలయాల్లో ఎమ్‌ఫిల్; పి.హెచ్.డి. డిగ్రీల పేరుతో సాగుతున్న పరిశోధన అని చెప్పుకోవాలి. ఈ దృష్టితో పరిశీలిస్తే విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన ప్రస్తుతం బహుముఖంగా సాగుతున్నదనే చెప్పాల్సి వుంటుంది.

వెలువడుతున్న సిద్ధాంత వ్యాసాల్లో మౌలికత (ఒరిజినాలిటీ) ఎంతవరకు? అన్న ప్రశ్నను పక్కకు పెట్టి పరిశీలిస్తే సంఖ్యాపరంగా సంతృప్తి వ్యక్తం చేయవచ్చు. ఇలా పుస్తకం కవి కలంలోంచి బయటపడం. అలా వెంటనే ఆ పుస్తకాన్ని అంది పుచ్చుకుని సిద్ధాంత వ్యాసం విశ్వవిద్యాలయానికి సమర్పించి డిగ్రీ చేతబట్టుకోవడం జరుగుతున్నది.

ఇక్కడ ప్రధానంగా తెలుగు సాహిత్యంలో జరిగిన పరిశోధన గురించి చెప్పుకుంటున్నా, మొట్టమొదటి తెలుగు పరిశోధనాంశానికి సంబంధించి ఒక్కమాట చెప్పుకోవాలి. పరిశోధన సిద్ధాంత వ్యాస రూపంలో ఏదో విద్యా సంస్థకి సమర్పించడం, డిగ్రీలు పుచ్చుకోవడం తెలుగులో 1929లో ప్రారంభమయ్యింది. మద్రాసు విశ్వవిద్యాలయానికి 'పదకొండో శతాబ్ది తెలుగు భాష' అనే అంశం గూర్చి 1929లో చిలుకూరి నారాయణరావు పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసం సమర్పించి డాక్టరేటు పట్టా పొందారు. వారు రచించిన 'ఆంధ్రభాషా చరిత్రము' అనే రెండు సంపుటుల బృహత్ గ్రంథం ఆంధ్రవిశ్వకళా పరిషత్ గ్రంథమాల 18వ ప్రచురణగా 1937లో ప్రచురితమైంది. దీన్ని బట్టి తెలుగులో మొదటి పరిశోధన భాషకు సంబంధించినదిగా తేల్చి చెప్పవచ్చు. తర్వాత 1945లో కాకర్ల వెంకట రామనరసింహంగారు 'ఆంధ్ర ప్రబంధం-అవతరణ వికాసాలు' అనే అంశంమీద ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి 1945లో డాక్టరేట్ పుచ్చుకున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర, కాకతీయ, నాగార్జున, శ్రీకృష్ణదేవరాయ, హైదరాబాదు, తెలుగు విశ్వవిద్యాలయాలతోపాటు, ఆయా ప్రాంతాల్లోని కొన్ని స్నాతకోత్తర విద్యాలయాల్లో (పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్స్) కూడా తెలుగు పరిశోధన సాగుతోంది.

తెలుగులో తొలి డాక్టరేటు చిలుకూరి నారాయణరావుగారికి మద్రాసు విశ్వవిద్యాలయం ప్రదానం చేసి 1929వ సంవత్సరం నుండి నేటివరకు తెలుగులో వివిధాంశాల మీద విస్తృత ప్రాతిపదికన పరిశోధన జరుగుతున్నా, వాటిలో అచ్చులోకి 40% సిద్ధాంత వ్యాసాలు కూడా వచ్చిన దాఖలాలు లేవు. ఇందుకు అనేక కారణాలుండవచ్చు. పరిశోధనలో తగిన స్థాయి, మౌలికత లేకపోవడం, ఆర్థిక వనరులు అందుబాటులో లేకపోవడం వంటివి కొన్ని కారణాలయితే, పరిశోధనాంశం ప్రజలకు పట్టని అంశం, లేదా సామాజిక ఉపయుక్తత లేదా ప్రయోజనం (సోషల్ రిలవెన్స్) లేకపోవడం మరొక ముఖ్యకారణం.

పి.కుసుమ కుమారి • మహిళా యూనివర్సిటీ తెలుగు విభాగం



109

ఇతర రాష్ట్రాల్లో వున్న మద్రాసు, మధుర, అన్నామలై, మైసూరు, బెంగుళూరు, కర్ణాటక, బెనారస్ విశ్వవిద్యాలయాల్లోని తెలుగు శాఖల్లో కూడా పరిశోధన జరుగుతోంది. ఎం.ఫిల్, పి.హెచ్.డి. పట్టాలకోసం మాత్రమేకాకుండా, ఎం.ఎ. ఆనర్స్, ఎం.ఓ.యల్., ఎం.లిట్, డి.లిట్ డిగ్రీల కోసం కూడా కొన్ని విశ్వవిద్యాలయాల్లో పరిశోధనాత్మక కృషి జరిగింది. తెలుగులో తొలి డాక్టరేటు చిలుకూరి నారాయణరావుగారికి మద్రాసు విశ్వవిద్యాలయం ప్రదానం చేసి 1929వ సంవత్సరం నుండి నేటివరకు తెలుగులో వివిధాంశాల మీద విస్తృత ప్రాతిపదికన పరిశోధన జరుగుతున్నా, వాటిలో అచ్చులోకి 40% సిద్ధాంత వ్యాసాలు కూడా వచ్చిన దాఖలాలు లేవు. ఇందుకు అనేక కారణాలుండవచ్చు. పరిశోధనలో తగిన స్థాయి, మౌలికత లేకపోవడం, ఆర్థిక వనరులు అందుబాటులో లేకపోవడం వంటివి కొన్ని కారణాలయితే, పరిశోధనాంశం ప్రజలకు పట్టని అంశం, లేదా సామాజిక ఉపయుక్తత లేదా ప్రయోజనం (సోషల్ రిలవెన్స్) లేకపోవడం మరొక ముఖ్యకారణం.

సామాజిక ప్రయోజనం అన్న మాట ఇక్కడ ఎలాగూ ప్రస్తావించుకున్నాం కాబట్టి పరిశోధన-సామాజిక ప్రయోజనం అన్న విషయం గురించి ఆంధ్రప్రదేశ్ స్టేట్ కౌన్సిల్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్ (వైడ్ లెటర్ నెం.ఎఎస్‌సిహెచ్ఇ/70/91ఎ, డేటెడ్ 18.01.91) చేసిన సూచన స్మరించుకోదగ్గది. "టు ప్రిపేర్ ఎ బ్యాంక్ ఆఫ్ సోషల్లీ రిలవెంట్ టాపిక్స్ ఫ్రం విచ్ రీసెర్చ్ స్కాలర్స్ కుడ్ బి డైరెక్టడ్ టు చూస్ దెయిర్ టాపిక్స్. న్యూ టాపిక్స్ కెన్ బి యాడెడ్ బై ది స్కాలర్స్. దిస్ వుడ్ ఇంట్రడ్యూస్ గ్రేటర్ సెలెక్టివిటీ అండ్ గ్రేటెడ్ ప్రొడక్టవిటీ ఇన్ రీసెర్చ్" అన్నది వారు చేసిన సూచన. 'క్వశ్చిన్ బ్యాంక్' లాగా 'రీసెర్చ్ టాపిక్ బ్యాంక్''తయారు చేసుకోవడం వల్ల పరిశోధనలో పునరుక్తి (డుప్లికేషన్) లేకుండా చెయ్యడానికి అవకాశముంటుంది.

> తెలుగు సాహిత్యంలో కవిత్రయం, అంటే నన్నయ, తిక్కన, ఎర్రనలకు సంబంధించి విస్తృతంగా పరిశోధన జరిగింది. ఇప్పటికీ జరుగుతున్నది. కవిత్రయం రచనలపై దాదాపు 155 దాకా పరిశోధనా వ్యాసాలు వెలువడ్డాయి.

విశ్వవిద్యాలయాల్లో జరిగే పరిశోధన ఏ విషయానికి (సబ్జెక్ట్) సంబంధించినదైనా అది ఏక విభాగ పరిమితం కాకూడదనీ, కొంత 'ఇంటర్ డిసిప్లీనరీ', 'మల్టీ డిసిప్లీనరీ' స్వభావం కలిగి వుండాలనీ విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం కోరుతున్నా. 'ఇంటర్ డిసిప్లినరీ'ని తెలుగులో 'అంతఃశ్శాఖీయ'అనీ, మల్టీ డిసిప్లీనరీ'ని 'బహుశాఖీయ' అంటున్నారు. ఆంగ్ల నిఘంటువులో 'కంబింగ్ ఆర్ ఇన్‌వాల్వింగ్ టూ ఆర్ మోర్ డిసిప్లీనరీ' అని ఈ మాటలకు అర్థం వుంది. విశ్వ విద్యాలయాల్లోని వివిధ విభాగాల (డిపార్ట్‌మెంట్స్) మధ్య ఒక రకమైన భావ వినిమయాన్ని (ఎక్స్ఛేంజ్ ఆఫ్ థాట్) తీసుకురావడానికి ఈ విధమైన పరిశోధన తోడ్పడుతుందని యు.జి.సి. భావించింది. అందుకొక వేదికగా విశ్వవిద్యాలయాల్లో 'ఫోర్మ్ ఫర్ ఇంటర్ డిసిప్లీనరీ ఆక్టివిటీ' ఏర్పాటు చెయ్యమనీ, అటువంటి 'ఫోరమ్' వున్న విశ్వవిద్యాలయాలకు రూ.50,000/- వరకు నిధులు మంజూరు చెయ్యడం జరుగుతుందనీ, యు.జి.సి. స్పష్టం చేసింది. బహుభాషా సంస్కృతుల నేపథ్యమున్న భారతదేశంలో ఈ రకమైన అధ్యయనానికి కేవలం సామాజిక ప్రయోజనం మాత్రమే కాకుండా, జాతీయ ప్రయోజనం కొంత వుంది. అందుకే ఈ అధ్యయన ప్రాధాన్యాన్ని ఇలా గుర్తించడం జరిగింది.

1) Interdisciplinary approach has become an emerging trend the world order.

2) Inter-disciplinary contacts goes a long way in inculcating in humanity a quality of appreciating the view point of others.

3) Inter-disciplinary study enables to develop linkages between various departments within the university. It will breakdown the present narrow compartmentalisation of academic disciplines, and enables the educational Institution to more from narrow specialisations. సామాజిక దృష్టి, శాస్త్రీయ ప్రయోజనం, నిర్మాణాత్మకమైన సమన్వయ దృష్టి పునాదులుగా జరిగిన పరిశోధన సమాజానికి ఉపయోగపడగలదు. ఇక్కడ దృష్టి కోణం (పర్స్‌పెక్టివ్) ప్రధానం. నన్నయ గురించి ఆ దృష్టికోణం కలిగిన వ్యక్తి చెప్పే తీరు ఒక విధంగా వుంటే, అది లేని కేవలం అకడమిక్ దృష్టి మాత్రమే కలిగిన వ్యక్తి విశ్లేషించే తీరు మరొకరకంగా వుంటుంది.

సామాజిక ప్రయోజనం అన్న విషయం ప్రస్తావనకు వచ్చింది. కాబట్టి ఈ వివరాలన్నీ ఇవ్వాల్సి వచ్చింది. ఇక మనం మళ్ళీ తెలుగు సాహిత్య పరిశోధనలోకి వెళ్ళిపోవచ్చు. తెలుగు సాహిత్యంలో కవిత్రయం, అంటే నన్నయ, తిక్కన, ఎర్రనలకు సంబంధించి విస్తృతంగా పరిశోధన జరిగింది. ఇప్పటికీ జరుగుతున్నది. కవిత్రయం రచనలపై దాదాపు 155 దాకా పరిశోధనా వ్యాసాలు వెలువడ్డాయి. 1998 వరకు సేకరించిన వివరాలివి. తర్వాత మరికొన్ని సిద్ధాంత వ్యాసాలు చేరి వుండవచ్చు. మహాభారతంలో ప్రకృతి వర్ణనలు, శిల్పం, ధ్వని, అలంకారాలు, క్రియలు, ద్రౌపది, భీష్ముడు మొదలైన అంశాలపైనా, ఇతర భాషల్లోని మహాభారతాలతో సరిపోల్చి జరిగిన పరిశోధనలివి. పాజ్ఞన్నయ యుగము, నన్నయ భారతము (దివాకర్ల వెంకటావధాని)

తిక్కన కావ్య శిల్పం, తత్వదర్శనం (కె.వి.రామకోటి శాస్త్రి), మహాభారతం మానవ స్వభావ చిత్రణ (అప్పజోడు వెంకట సుబ్బయ్య) వంటివి కొన్ని పేర్కొనదగిన సిద్ధాంత వ్యాసాలు.

కవిత్రయం తర్వాత తెలుగు సాహిత్యంలో శివకవి యుగం సామాజిక దృష్ట్యాకూడా ప్రస్తావించుకోదగ్గది. భాష పరంగా, కార్యవస్తుపరంగా ప్రజలకు పట్టంకట్టినవాడు పాల్కురికి సోమన. పాల్కురికి సోమన, నన్నెచోలుడు మొదలైన ప్రాచీన కవులకు సంబంధించిన తెలుగు పరిశోధన తిక్కనయుగ కవులు, శ్రీనాథయుగ కవులు, తాళ్ళపాక కవులు, ప్రబంధ, దక్షిణాంధ్ర, సంస్థానయుగ కవుల వరకూ విస్తరించింది. వీరిలో వేమన, పోతులూరి వీరబ్రహ్మం, త్యాగరాజు, రామదాసు వంటి వాగ్గేయకారులను కూడా కలుపుకుంటే జరిగిన పరిశోధన సంఖ్య 483. వీటిలో కేవలం కవులే కాకుండా, 'బసవ పురాణంలో స్త్రీలు', 'శివకవులు' సామాజిక పరిశీలన, 'కాకతీయయుగ సాహిత్యంలో సంస్కృతి' అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనలు - సామాజిక చిత్రణ' వంటి అంశాలపైన కూడా పరిశోధన జరిగింది. వీటిలో తెలుగు రచనలను మూల సంస్కృత రచనలతో పోల్చి పరిశీలించిన తులనాత్మక పరిశోధనలు కూడా ప్రత్యేకంగా పేర్కొనాల్సి వుంది.

సాహిత్య పరిశోధనలో కవి జీవిత చరిత్రలూ, ప్రకృతి వర్ణనలూ, శిల్పం, వాఙ్మయ చరిత్రలూ, సాహిత్యానుశీలనం, కావ్య పరిశోధన, వంటివాటిని సాహిత్య సంబంధులుగా పేర్కొనవచ్చు. ఇది బహిరంగ పరిశీలన అని ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం అన్నారు. ఇవి కాక రసాలంకార రీతులూ, ధ్వని, అలంకారాలు, శైలీ, ప్రక్రియా స్వభావం వంటి అంశాలను ఆయన అంతరంగ పరిశీలన అన్నారు. మొత్తంమీద ఇవన్నీ సాహిత్యానికి సంబంధించిన అంశాలే అవుతాయి. సాహిత్య చరిత్ర, సాహిత్య పరిశోధన అన్న విషయాలను మనం ప్రస్తావించుకొనేటప్పుడు తెలుగు సాహిత్యానికి మరిచిపోలేని సాహిత్య సేవచేసిన వ్యక్తులు దాదాపు 50 మంది దాకా వున్నారని డా॥హెచ్.ఎస్.బ్రహ్మానంద పేర్కొన్నారు. వారు మానపల్లి రామకృష్ణకవి (భారతశాస్త్రాన్ని, కుమారసంభవాన్ని వెలికితీయడం), కుందూరి ఈశ్వరదత్తు (సీసపద్య మంజరి) మల్లంపల్లి సోమశేఖర శర్మ (ఆంధ్ర చరిత్రకు సంబంధించిన ఆధారాల్ని వెలికితీయడం) రాళ్ళబండి సుబ్బారావు (కళింగ దేశ చరిత్ర) నేలటూరి వెంకటరమణయ్య, చిలుకూరి నారాయణరావు (విజయనగర చరిత్ర) కొమర్రాజు లక్ష్మణరావు పంతులు (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలన యత్నం, భాషా సాహిత్య వ్యాసాలు), వేటూరి ప్రభాకరశాస్త్రి ('నాగబు' అన్న తెలుగు మాట వున్న అమరావతి స్తూప పాతాన్ని చదివినవారు, బసవపురాణ పరిష్కరణ, అన్నమాచార్య సంకీర్తనల పరిష్కరణ, చాటుపద్య మణిమంజరి సంకలనం)మొ॥వారు. వీరి కృషి అనంతర కాలంలో సాహిత్య పరిశోధన చేసిన వాళ్ళకు ఎంతో ఉపకరించింది. ఒక్క అన్నమయ్య సాహిత్యంపైనే 40 దాకా సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి.

తెలుగు సాహిత్యానికి కందుకూరి, గురజాడ వంటి వ్యక్తులు చేసిన దోహదం తక్కువేమీ కాదు. వ్యక్తులే సంస్థలుగా భాసించినవారు వారు. అటువంటి వ్యక్తుల సాహిత్య జీవితాన్ని, వారి రచనలను పరిశీలించడం తెలుగు సాహిత్య పరిశోధనలో మరొక కారణం. విశిష్ట వ్యక్తి పరంపరలో కందుకూరి, గురజాడ, తిరుపతి వెంకటకవులు, వసురాయకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, త్రిపురనేని రామస్వామి చౌదరి, ఉన్నవ లక్ష్మీనారాయణ, వెంకట పార్వతీశ్వర కవులు, మునిమాణిక్యం, పానుగంటి, చిలకమర్తి, విశ్వనాథ, జాషువా, చలం, అడవి బాపిరాజు, కృష్ణశాస్త్రి, గోపీచంద్, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి, శ్రీశ్రీ, తుమ్మల, కరుణశ్రీ, పుట్టపర్తి నారాయణా చార్యులు, బోయిభీమన్న, దాశరథి, సి.నారాయణరెడ్డి, వానమామలై సోదరులు, గుంటూరు శేషేంద్రశర్మ రచనలపై సుమారు 386 సిద్ధాంత వ్యాసాలు వెలువడినాయి. ఇటీవల రాజకీయార్థిక నేపథ్యంతో జరిగిన సాహిత్య పరిశోధనకు మార్గదర్శకంగా నిలిచిన సిద్ధాంత వ్యాసం రావిశాస్త్రి నవలలు - రాజకీయార్థిక దృక్పథం మార్క్యయాదయ్య), సాహిత్యాన్ని సామాజిక నేపథ్యంలో లేదా దృక్పథం ఇంటర్ డిసిప్లినరీ పద్ధతితో పరిశీలించే భావి పరిశోధకులకు ఈ సిద్ధాంత వ్యాస పరిశోధనా పద్ధతి (రీసెర్చ్ మెథడాలజీ) కొంత అవగాహనను కల్గిస్తుంది.

ఆధునిక కవిత్వం, కవుల మీద విశేషంగా కృషి జరుగుతున్నట్టు అన్ని విశ్వవిద్యాలయాల వివరాలు తెలుపుతున్నాయి. వీటిమధ్య సమన్వయం కొరవడినందువల్ల (లాక్ ఆఫ్ కో-ఆర్డినేషన్) ఒకే అంశం మీద ఏదో కొద్దిపాటి తేడాతో రెండు మూడు విశ్వవిద్యాలయాల్లో కృషి జరగడం కనిపిస్తోంది. భావకవులు, అభ్యుదయకవులు, దిగంబర విప్లవ కవుల ప్రత్యేక రచనలపై పరిశోధన జరిగినంత ఎక్కువగా ఉద్యమాలనేపథ్యంతో జరగలేదనే చెప్పాలి. ఆ రకమైన పరిశోధనలో చెప్పుకోదగ్గది ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు డా॥ సి. నారాయణరెడ్డి; ఆధునికాంధ్రకవిత్వంపై ఉద్యమాల ప్రభావం (డా॥ వెల్చేరు నారాయణ

ఆధునికకవిత్వం, కవుల మీదవిశేషంగా కృషి జరుగుతున్నట్టు అన్ని విశ్వవిద్యాలయాల వివరాలు తెలుపుతున్నాయి. వీటిమధ్య సమన్వయం కొరవడినందువల్ల (లాక్ ఆఫ్‌కో-ఆర్డినేషన్) ఒకే అంశం మీద ఏదో కొద్దిపాటి తేడాతో రెండు మూడు విశ్వవిద్యాలయాల్లో కృషి జరగడం కనిపిస్తోంది.

రావు); తెలంగాణా పోరాట పాటలు - గేయరచన (ఆర్. తిరుమలరావు) భావకవిత్వంలో స్త్రీ+) ఆధునిక తెలుగు సాహిత్యంపై జాతీయోద్యమ ప్రభావం (డా॥ మద్దూరి సుబ్బారెడ్డి) తెలుగులో అభ్యుదయ కవిత్వం (షేక్ జావేద్ హుస్సేన్) మొదలైనవి. ప్రక్రియాపరంగా భావకవిత్వాన్ని గూర్చి ప్రప్రథమంగా పరిశోధన చేసినవారు డా॥ పాటిబండ మాధవశర్మగారు. డాక్టర్ శర్మగారు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఎం.ఎ. ఆనర్సు పట్టా కోసం 1936లో సమర్పించిన సిద్ధాంత వ్యాసం "ఆధునికాంధ్ర భావకవిత్వము".

ప్రక్రియాపరంగా చూస్తే తెలుగులో పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు, శతకాలు, ఉదాహరణలు, యక్షగానాల వంటివి ప్రాచీన సాహిత్యానికి సంబంధించినవైతే, నవల, నాటకం, కథ వంటివి ఆధునిక యుగానికి చెందినవిగా చెప్పవచ్చు. ఆంధ్ర పురాణము సమగ్ర పరిశీలనలు; తెనాలి రామకృష్ణకవి కావ్యపరిశీలన, అభ్యుదయం ప్రబంధ లక్షణాలు, కాళహస్తీశ్వరశతకం పరిశీలన; రాచపాలెం కవుల యక్షగానాలు, సవిమర్శక పరిశీలన ఇలా ప్రక్రియాపరంగా కూడా విస్తృత స్థాయిలో పరిశోధన జరిగింది. ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో ఒక్క నవలకు మాత్రమే సంబంధించి సుమారు 125 సిద్ధాంతవ్యాసాలు వచ్చాయి. 1960 తర్వాత విశ్వవిద్యాలయాల్లో ఆధునిక సాహిత్యంపట్ల పరిశోధనా శక్తి పెరిగింది. ముఖ్యంగా నవల, కథా సాహిత్యాలపైన పరిశోధనలు ప్రారంబమైనాయి. తెలుగు నవలపై బొడ్డపాటి కుటుంబరాయశర్మ, మొదలి నాగభూషణశర్మ, కోడూరు శ్రీరామమూర్తి, డా॥ సి. ఆనందరామం, ఎలిజబెత్‌కుమారి, సి. మృణాలిని, పి. సంజీవమ్మ మొదలైన వారు ప్రామాణికమైన సిద్ధాంత వ్యాసాలనందించారు. మొత్తం తెలుగు నవలనంతటినీ పరిధిగా తీసుకుని కుటుంబ జీవనం, కథాకథన శిల్పం, చైతన్య ప్రవంతి, సామాజిక చైతన్యం, గాంధీ ప్రభావం, అస్పృశ్యత సమస్య, వరకట్న సమస్య మొదలైన అంశాలపై కేంద్రీకరించి వీరి పరిశోధనలు సాగాయి. సమస్య మొదలైన అంశాలపై కేంద్రీకరించి వీరి పరిశోధనలు సాగినాయి. అలా కాకుండా ఒక్క రచయిత(త్రి) అన్ని నవలలూ, లేదా ఒక్క నవల మాత్రం పరిశోధనాంశంగా తీసుకుని సమర్పించిన సిద్ధాంత వ్యాసాలు కూడా గణనీయంగా వున్నాయి. వాటిలో మానసిక సామాజిక జీవన ప్రవంతి చివరకి మిగిలేది (కాత్యాయనీ విద్మహే) దాశరథి రంగాచార్య నవలా సాహిత్యం (జనపదం ప్రత్యేక పరిశీలన డి.ఎం. ప్రేమావతి) మొదలైనవి పేర్కొనదగిన కొన్ని సిద్ధాంత వ్యాసాలు నవలానుశీలనంలో తప్పనిసరిగా పేర్కొనదగిన సిద్ధాంత వ్యాసం పి. వరవరరావు 1981లో సమర్పించిన తెలంగాణా విమోచనోద్యమం తెలుగు నవల. అనంతర కాలపు రాజకీయార్థిక పరమైన సాహిత్య విశ్లేషణకు మార్గదర్శకంగా నిలిచిన పరిశోధన ఇది. ఇక కథానిక ప్రక్రియ విషయానికి వస్తే దాదావు 70 దాకా; నాటకంపైన 73 దాకా సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి. ఎక్కువగా మధురాంతకం రాజారాం కథలు, కేతు విశ్వనాథరెడ్డికథలు, అబ్బూరి ఛాయాదేవి కథలు, అంటూ ఒక రచయిత కథలను పరిశీలించడం కనిపిస్తుంది. తెలుగు కథానికను పరిధిగా తీసుకుని అవతరణ వికాసాలు, స్వరూప స్వభావాలు, వర్ణనల తీరుతెన్నులు, సామాజిక జీవనం సంఘ సంస్కరణ వంటి అంశాలపై జరిగిన పరిశోధనలు కూడా కొన్ని వున్నాయి. అలా కాకుండా ఓల్గా ప్రయోగం కథలో వివాహ వ్యవస్థ, పులికంటి కృష్ణారెడ్డి కథలో రైతులు వంటి ఒకే ఒక్క అంశాన్ని ప్రధానంగా గ్రహించి జరిగిన పరిశోధనల సంఖ్య తక్కువే. 1937లోనే డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారు ఎం.ఎ. ఆనర్సు పట్టం కోసం ఆంధ్రనాటక పితామహుడు అన్న సిద్ధాంత వ్యాసాన్ని రచించారు. తరువాత అది ముద్రితమయ్యింది. ఇప్పటికీ తెలుగు నాటక పరిశోధనలకు ప్రామాణికంగా నిలిచిన సిద్ధాంత వ్యాసం డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావుగారి తెలుగు నాటక వికాసము!

తెలుగులో భాషా పరిశోధన కంటే సాహిత్య పరిశోధన విశేషంగా సాగింది. విశ్వవిద్యాలయ తెలుగు సాహిత్య పరిశోధనా వికాసాన్ని పరిశీలిస్తే దృక్పథాలు, పరిణామగతులు, ఉద్యమ వికాసాలు స్పష్టంగా కనపడతాయి.

ఆధునిక సాహిత్యంలో బాగా ప్రాచుర్యం పొందిన ప్రక్రియ వచన కవిత. వచన కవితా సంకలనాలు మరికొన్ని ఇతర కావ్యాలపై దాదావు ఓ నలభై దాకా పరిశోధనలు జరిగాయి. పోకూరి కాశీపతి సారంగధరీయం; తుమ్మపూడి కోటేశ్వరరావు, శ్రీ కుమారాభ్యుదయం; బేతవోలు రామబ్రహ్మం, కొత్తగోదావరి వంటివి ఇతర కావ్యాలైతే; అజంత, స్వప్నలిపి, ఎన్. గోపి, తంగేడుపూలు, వీర్రాజు మళ్ళీ వెలుగు మొదలగునవి వచన కవిత సంకలనాలు. ఇవి కాకుండా పత్రికారంగం, క్షేత్ర మహాత్మ్యాలు, సినిమా పాటలు, పేరడీలు, అవధానం, హరికథలు, క్రైస్తవ సాహిత్యం, హాస్యం, వంటి అంశాలపైన కూడా విశ్వవిద్యాలయాల్లో పరిశోధనాత్మక కృషి జరిగింది.

తెలుగులో భాషా పరిశోధన కంటే సాహిత్య పరిశోధన విశేషంగా సాగింది. విశ్వవిద్యాలయ తెలుగు సాహిత్య పరిశోధనా వికాసాన్ని పరిశీలిస్తే దృక్పథాలు, పరిణామగతులు, ఉద్యమ వికాసాలు స్పష్టంగా కనపడతాయి. ఇంత కృషి జరిగినా సాహిత్య పరిశీలనలో కొంత వెనకబడిన అంశం విమర్శ. ఇది ఇతర ప్రక్రియల కంటే ఎంతో బాధ్యయుతమైన అంశం కావడం ఒక కారణం

కావచ్చు. ఎందుకంటే విమర్శలో విమర్శకుడు అనుసరించే అనుశీలన పద్ధతికి ప్రాధాన్యముంది. తాను చేసే విమర్శ వలన తేలే ఫలితాంశాలకు సమాధానం చెప్పే బాధ్యత కూడా అతనిపైన వుంటుంది. విమర్శ ఇతర ప్రక్రియలతో పోలిస్తే ఒక సీరియస్ అంశంగా పరిగణించడంవల్లనేమో 1998 నాటికి సేకరించిన వివరాల ప్రకారం కేవలం 11 సిద్ధాంత వ్యాసాలు వెలువడినాయి. వాటిలో తెలుగు సాహిత్య విమర్శ అవతరణ వికాసాలు (ఎస్.వి. రామారావు), ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ - సాంప్రదాయక రీతి (కె.సంపత్కు మారాచార్య) తెలుగు సాహిత్య విమర్శలో మార్క్సిస్టు ధోరణులు (పి.రాములు) పేర్కొనదగిన కొన్ని సిద్ధాంతవ్యాసాలు.

ఒక భాషా సాహిత్యాన్ని మరొక భాషా సాహిత్యంతో సరిపోల్చి చెప్పడం తులనాత్మక అధ్యయనమవుతుంది. ఆది కవుల, కావ్యాల, ప్రక్రియల తులన కావచ్చు. ఒక సాహిత్యంపై మరొక సాహిత్య ప్రభావాన్ని కూడా సమీక్షించే అవకాశాలున్నాయి. దాదాపు ఈ కోవలోకి వచ్చేవే అనువాదాలు. లభించిన వివరాల ప్రకారం 390 దాకా తులనాత్మక అధ్యయనాలూ; ఒక పదిదాకా అనువాద వివేచనకు సంబంధించిన సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. అంటే విమర్శ అనువాదం అన్న అంశాలపైన తెలుగు సాహిత్యంలో ఇంకా కృషి జరగవలసి వుందని చెప్పవచ్చు. మొత్తం సాహిత్య పరిశోధనను అంచనా వేయడంవల్ల కృషి జరగాల్సిన రంగాలను గుర్తించడానికి సాధ్యమవుతుంది. సాహిత్య ప్రభావాల సమీక్షణలో ఇప్పటికీ ప్రామాణికంగా నిలిచిన సిద్ధాంత వ్యాసం డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారి తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం. విమర్శకంటే అతి తక్కువ పరిశోధన తెలుగు వ్యాసం మీద జరిగింది. డా॥ కొలకలూరి ఇనాక్‌గారి తెలుగువ్యాస పరిణామం మంచి పరిశోధనా వ్యాసం.

తెలుగు సాహిత్యాభివృద్ధికి ఆధునిక పండితులు చేసిన దోహదమేమీ తక్కువకాదు.

> తెలుగు సాహిత్య పరిశోధనలో విస్మరించరాని భాగం జానపద విజ్ఞానం జానపదకళలు, వీరగాధలు, పొడుపు కధలు, ప్రదర్శన కళలు, గ్రామ దేవతలు, కులాలు, జాతరలు మొదలైవి ఇందులోని ముఖ్య విషయాలు.

వారిలో ముఖ్యంగా స్మరించుకోదగిన వారు సి.పి. బ్రౌన్, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు, వేదం వెంకటరాయశాస్త్రి, మాడపాటి హనుమంతరావు, సి.ఆర్.రెడ్డి, తాపీధర్మారావు, నిడదవోలు వెంకటరావు మొదలైన వారు. ఈ రకంగా ఆధునిక కవి పండితుల జీవితం సాహిత్యాలపై జరిగిన పరిశోధనలు సుమారు 157 దాకా వున్నాయి.

తెలుగు సాహిత్య పరిశోధనలో విస్మరించరాని భాగం జానపద విజ్ఞానం జానపదకళలు, వీరగాధలు, పొడుపు కధలు, ప్రదర్శన కళలు, గ్రామదేవతలు, కులాలు, జాతరలు మొదలైవి ఇందులోని ముఖ్య విషయాలు. జానపద సాహిత్యమే నిజమైన ప్రజాసాహిత్యమనే వారున్నారు. సి.పి. బ్రౌన్ బొబ్బిలికథ, కామమ్మకథ, కుమార రాముడికథ, పల్నాటి వీరచరిత్ర వీరగాథలను సేకరించారు. జానపద సాహిత్యంలో స్త్రీల పాటలు ఒక అంతర్భాగం. జానపద విజ్ఞానం తెలుగు పరిశోధనారంగంలో అత్యంతాదరణ పొందిన రంగాల్లో ఒకటి. మొత్తం 241 పరిశోధనా వ్యాసాలు జానపద విజ్ఞానంలో వచ్చాయి. తెలుగు జానపద గేయ సాహిత్యం (డా॥ బి. రామరాజు); తెలుగు జానపద గేయ గాథలు (డా॥ నాయనికృష్ణకుమారి) తెలుగువీర గాథ కవిత్వం (డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు) ఈ నాటికీ జానపద విజ్ఞాన పరిశోధనలో ప్రామాణిక గ్రంధాలుగా వున్నాయి. జానపద గేయాలను ఇతర భాషలతో పోల్చడం, జానపదగేయాల్లో వివిధాంశాలు అంటే సంగీతం, అలంకారాలు, బాణీలు, సాంఘిక స్థితిగతులు మొదలైన విషయాలే కాకుండా జిల్లా పాటలు, స్త్రీల పాటలు, పిల్లల పాటలు, శ్రామిక గేయాలు కూడా ఇందులో వున్నాయి. ఒక్కగిరిజన విజ్ఞానానికి సంబంధించి 13 సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. ఈ రంగంలో మరింత కృషి జరగాల్సి వుంది.

డా॥ వెలిదండ నిత్యానందరావు సేకరించిన వివరాల ప్రకారం సాహిత్య పరిశోధనాత్మక సిద్ధాంత వ్యాసాల సంఖ్య తులనాత్మక అధ్యాయనంతో కలిపి 2711. అకడమిక్ పరిశోధన పరిధిలోకి రాకున్నా తప్పకుండా చెప్పాల్సిన విషయాలు ఒకటి రెండున్నాయి. సాహిత్య పరిశోధన గురించి మనం మాట్లాడుకునేప్పుడు తప్పనిసరిగా స్మరించుకోదగ్గవారు మెకంజీ; సి.పి. బ్రౌన్. భారతదేశంలో 1782 నుండి 1821 వరకు వుండి మెకంజి కావలి సోదరుల (బొర్రయ్య, లక్ష్మయ్య, రామస్వామి) సాయంతో సేకరించిన బండ్ల కొలది వ్రాత ప్రతులు సాహిత్యనిధి. ఆ విధంగానే గ్రంధసేకరణ, పరిష్కరణ, ముద్రణకు పునాది వేసిన వాడు బ్రౌనుదొర. అందుకే డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, తెలుగు దేశంలో పరిశోధనలకు పునాది వేసిన వాడు మెకంజీ తరువాత బ్రౌను దొరయే. వీరిరివురి కృషియే లేకున్న తెలుగు దేశమున పరిశోధనయే లేదన్నచో తరువాతి కృషిపై వీరి ప్రభావమెంత గాఢమో స్పష్టమగును అన్నారు (తెలుగు సాహిత్యంపై ఆంగ్ల భాషా ప్రభావము)

తెలుగు సాహిత్య పరిశోధన ఆరంభ దశలో మరిచిపోలేనివి ఒక వైపు పాశ్చాత్యుల కృషి. మరొకవైపు ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తెలుగు భాషా సమితి, ఆంధ్ర భాషాభివర్ధిని, అభ్యుదయ రచయిత సంఘం, విప్లవ రచయితల సంఘం, ఆంధ్ర సారస్వత పరిషత్తు, విజ్ఞాన వర్ధినీ పరిషత్తు, సారస్వత

వేదిక, ఆంధ్ర విశ్వసాహితి, సారస్వత వేదిక, నవ్యసాహితీ సమితి, సంగ్రహాంధ్రవిజ్ఞాన కోశసమితి వంటి సంస్థల కృషి భారతి, జయంతి, పరిశోధన వంటి పత్రికలు, దీపావళి, ఉగాది మొదలైన పండగల ప్రత్యేక సంచికలు కూడా ఒక విధంగా సంస్థలకు దీటైన కృషి చేశాయనాలి. సాహిత్య పరిశోధనకు తమ సర్వస్వాన్ని ధారపోసిన వారు కందుకూరి వీరేశలింగం, గిడుగురామమూర్తి, కొమర్రాజు, వేటూరి ప్రభాకరశాస్త్రి, కాశీనాథుని నాగేశ్వరరావు, వీరు ఒక్కొక్కరు మూర్తీభవించిన సాహిత్య సంస్థల వంటి వారు

చివరగా సాహిత్య పరిశోధనకు సంబంధించి చేపట్టవలసిన కర్తవ్యాలు ఒకటి రెండు చెప్పుకోవాలి అవి.

1. సిద్ధాంత వ్యాస విశ్లేషణాత్మక సంగ్రహాలు తయారు కావాలి. పరిశోధక విద్యార్థి ముందుగా విశ్వవిద్యాలయానికి సమర్పించే సంక్షిప్త వివరాలు అందుకు ఉపయోగపడతాయి.

2. ప్రస్తుతం తెలుగు పరిశోధనకు సంబంధించి తెలుగులో పరిశోధన (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1983), మరిన్ని వివరాలతో విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన (డా॥ వెలుదండ నిత్యానందరావు 1998) పుస్తకాలు లభ్యమవుతున్నాయి. వాటిని అప్‌డేట్ చేసుకుంటూ వుండాలి.

3. తెలుగులో సిద్ధాంత వ్యాసరచనా విధానం, పరిశోధనా పద్ధతి అన్న అంశాలకు ఎంతో ప్రాధాన్యముంది. ఒకటి రెండు పుస్తకాలు తప్పిస్తే తెలుగులో పుస్తకాలు లేవు. కొన్ని విశ్వవిద్యాలయాల్లో సిద్ధాంత వ్యాసరచనా విధానం అన్నది తప్పనిసరి అంశంగా విద్యార్థులకు బోధించడం జరుగుతున్నది.

4. పరిశోధకుడూ, పర్యవేక్షకుడూ జరిగిన కృషిని సమీక్షించి కృషి జరగని అంశాలపై దృష్టి సారిస్తే తెలుగు సాహిత్య పరిశోధన మరింత సమగ్రత సంతరించుకుంటుంది.

5. పరిశోధనకు సంబంధించి తగినన్ని జర్నల్సు లేకపోవడం గమనించాలి. కాకతీయ విశ్వవిద్యాలయం పరిశోధన పేరుతో కొంత కాలంపాటు ఒక జర్నల్ నడిపింది. ప్రస్తుతం ఆ విశ్వవిద్యాలయ ఆంగ్ల విభాగం సంవత్సరానికి ఒకటి చొప్పున ఒక జర్నల్ ఇంగ్లీషులో తీసుకువస్తున్నట్లుంది. చక్కని ప్రమాణాలు పాటిస్తున్నారు ఈ జర్నల్‌లో. తిరుమలరామచంద్రగారి సంపాదకత్వంలో పరిశోధన అనే ఒక సారస్వత ద్వైమాస పత్రిక వెలువడేది. భారతి, కిన్నెర కూడా సాహిత్య వ్యాస ప్రచురణకు అవకాశమిచ్చేవి. ఇప్పుడివి ఆగిపోవడంతో తెలుగు సాహిత్య వ్యాస ప్రచురణకు తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక (అకాడమీ); వాఙ్మయి (తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి) అందుబాటులో వున్నాయి. ప్రవాహవాణి అన్న పత్రిక కూడా ఒకటి హైదరాబాద్ నుండి పి.ఎ.వి. వల్లభాచార్యుల సంపాదకత్వంలో వెలువడుతోంది. సాహిత్య వ్యాసాలను ప్రచురిస్తున్నది. తెలుగు భాషకు సంబంధించి ఇంగ్లీషులో రాయడాన్ని కూడా ప్రోత్సహించవలసి వుంది. ఎందుకంటే విషయం ఆంగ్లంలో వుంటే ఇతర భాషా వ్యవహర్తలు కూడా చదివే వీలుకలుగుతుంది. ఒకప్పుడు ఆచార్య తూమాటి దోణప్పగారు పరిశోధనకు సంబంధించి తెలుగు విశ్వవిద్యాలయం తరపున తెలుగు ఇంగ్లీషు భాషల్లో ద్విభాషా పత్రిక పేరుతో నడిపేవారు. అది కొనసాగివుంటే తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించి కేవలం తెలుగులోనే కాకుండా ఇంగ్లీషులో కూడా రాసిన వ్యాసాలను ప్రచురించే అవకాశముండేది. గురించి తెలుగు విశ్వవిద్యాలయం పునరాలోచించాల్సిన అవసరముంది.

> తెలుగు సాహిత్యంలో జరిగిన పరిశోధన రాశిలో విస్తారంగా అనిపించినా వాసి విషయంలో కొంత విమర్శ వుంది. తెలుగు పరిశోధనలో ప్రమాణాలు పడిపోతున్నా యనడంలో అంతో ఇంతో నిజం లేదని మాత్రం అనలేం.

తెలుగు సాహిత్యంలో జరిగిన పరిశోధన రాశిలో విస్తారంగా అనిపించినా వాసి విషయంలో కొంత విమర్శ వుంది. తెలుగు పరిశోధనలో ప్రమాణాలు పడిపోతున్నా యనడంలో అంతో ఇంతో నిజం లేదని మాత్రం అనలేం. ఈ సందర్భంగా తెలుగు పరిశోధనల తీరు తెన్నులను గురించి డా॥ వెల్చేరు నారాయణరావు వెలిబుచ్చిన అభిప్రాయాలను మరొక్కసారి మననం చేసుకోవచ్చు. అందులోని ముఖ్యాంశాలు.

1. యూనివర్శిటీల పరిశోధన పత్రాలు నిర్దిష్ట ప్రమాణాలను నెలకొల్పలేకపోయాయి.

2. మన విద్వాంసుల పాండితీ చరిత్రను పరిశీలిస్తే మనం ఈ రెండు (సంస్కృతం, ఇంగ్లీషు) భాషా సంప్రదాయాల్ని జీర్ణం చేసుకోలేదనీ, కేవలం వాటి పైపై అంశాలను అనుసరించామని తోస్తుంది.

3. మనది ఉద్వేగ ప్రధాన ధోరణి, సంస్కృతముద్ర ఉన్నదంతా మన సొత్తేనని మనకో అస్పష్టవిశ్వాసం ఉండేది. కాల క్రమంలో పాశ్చాత్య సాహిత్యాల్లో ఉన్నదంతా కూడా మన సొత్తేనన్న భ్రమలో పడిపోయి మనల్ని మనం మోసగించుకున్నాం.

4. కొంత మంది గొప్ప పరిశోధకులతో సహా అనేక మంది పరిశోధకులకు రచనా పద్ధతిలో ప్రాథమిక శిక్షణ కూడా లేదు.

5. పదశక్తికి భంగపడడంలోనూ, భావాలను తప్పుగా అర్థం చేసుకోవడంలోనూ మనకున్న సామర్థ్యం ఆశ్చర్యకరమైనది.

6. ప్రమాణాలు చూపకపోవడం, నిరాధార సాధారణీకరణ అనే లోపాలు.

7. మన పరిశోధకులందరికీ ఒక సమాన లక్షణముంది. అది సమాచారం దండిగా సేకరించటం.

8. మనకు పరిశోధన అంటే విశ్లేషణ, వ్యాఖ్యానం సిద్ధాంతీకరణ.

9. మేధాశక్తినీ, భావనాబలాన్ని, మనసును హృదయాన్ని వేరు చేసి చూడడం మన సంస్కృతిలో ఎన్నడూలేదు.

10. ఇప్పటి వరకూ మనం చేసిన పనిని గురించి, సాహిత్యం అంటే మనకున్న దృక్పథాన్ని గురించి మన సాహిత్య విమర్శ సిద్ధాంతాలను గురించి ఒక్క మాటలో చెప్పాలంటే అవి అభిరుచి ప్రధానాలు.

11. సైద్ధాంతిక నైపుణ్యంగాని, బుద్ధి సారళ్యం గాని లేవు.

12. మన తక్షణావసరం పాఠవిమర్శ

13. తెలుగు సాహిత్యాన్ని విశ్లేషించ డానికి ఫ్రెంచి నిర్మాణ క్రమ వాదుల రష్యన్ రూపవాదుల పద్ధతులు ఉపయోగపడ తాయేమో పరిశీలించాలి.

14. సాహిత్యాన్ని చర్చించేటప్పుడు మనం చేసిన ఘోరమైన పొరపాటు ఏమిటంటే ఏకవ్యక్తి కృతికర్తగా సామాజిక వ్యక్తిగా వ్యవహరిస్తున్నందువల్ల వారిద్దరి వ్యక్తిత్వమూ ఒకటేనని భావించటం.

15. వివేకంతో అర్థం చేసుకుని, సృజానాత్మకంగా అనుసరిస్తే మార్క్సిస్టు పద్ధతులు సాహిత్యాన్ని విమర్శించటంలో సత్ఫలితాలిస్తాయి.

16. మార్క్సిజం, నిర్మాణ (క్రమ) వాదం లాంటి సిద్ధాంతాలను అంగీకరించని సాహిత్య చరిత్రకారుల దృష్టిలో సాహిత్య చరిత్రకు, చారిత్రక సాహిత్య సంఘటనలకు భేదం కనిపించదు.

> తెలుగు సాహిత్య పరిశోధనలో అభివృద్ధిస్పష్టంగానే కన పడుతుంది. ఆ అభివృద్ధికి సమగ్రత చేకూరాలంటే మరింత సైద్ధాంతిక నైపుణ్యాన్ని తీసుకు రావడానికి పరిశోధ కుడూ, పర్యవేక్షకుడూ చిత్త శుద్ధితో ప్రయత్నించాల్సి వుంది.

17. యూరోపియన్ సాహిత్యం కోసం రూపొందించిన పద్ధతులుగాని, సంస్కృత ఆలంకారికుల సూత్రాలుగాని తెలుగు సాహిత్యానికి యథాతథంగా వర్తింపచేయటానికి వీలులేదు. సంబంధి భావాలను పద్ధతులను అరువు తెచ్చుకున్నప్పటికీ, తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు దాని సంప్రదాయాలను, కొలబద్దలనే పాటించాల్సి ఉంటుంది.

లోపాల నెత్తి చూపటంతోపాటు డా॥ వెల్చేరు నారాయణరావుగారు ఇచ్చిన మంచి సలహాలు తెలుగు సాహిత్య పరిశోధకులు గుర్తుంచుకోదగ్గవి.

తెలుగులో జరిగిన భాషా సాహిత్య పరిశోధనకు సంబంధించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఒక రజతోత్సవ సంచికను 1983లో ప్రచురించింది. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు ఆ పుస్తకంలో ముందుగా చేర్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి రజతోత్సవాల నివేదికలో తెలుగు భాషా సాహిత్య పరిశోధనకు సంబంధించి వ్యక్తం చేసిన ఈ క్రింది అభిప్రాయం గమనించ దగింది.

తెలుగులో భాషా పరిశోధన కంటే సాహిత్య పరిశోధన విశేషంగా సాగింది... నూత్న సిద్ధాంత ప్రతిపాదనం ఉత్తమ సాహిత్య పరిశోధనకు పరమ ప్రమాణం. అయితే, ఏ సాహిత్యంలోనైనా వెలువడిన పరిశోధన సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం సాధ్యం. అయితే, వినూత్నమైన అనుశీలన విధానాన్నిగానీ, విశ్లేషణ పద్ధతిని గాని, వివేచనాత్మక ఫరిణితిని గానీ, సమన్వయవైఖరినిగానీ, కొత్త వాదాన్ని గానీ ప్రకటించి కొన్ని వినూత్నాంశాలను వెలికి తెచ్చి సాహిత్య తత్త్వ వివేకాన్ని, విలువలనంతా పరిశీలిస్తే తెలుగు పరిశోధకులు వినూత్న సిద్ధాంత ప్రతిపాదనం కంటే విశేష పరిశోధన విధానాలనే ఆవిష్కరించినట్లు స్పష్టమౌతున్నది కదా! అయితే, సాహిత్య పరిశోధనలో మాత్రం వినూత్న సిద్ధాంత ప్రతిపాదనం కూడా జరిగింది. అందువలన భాషా పరిశోధన కంటే సాహిత్య పరిశోధన ఎక్కువలసిన విజ్ఞాన శిఖరాలను అధిరోహించి చూపిందన్న విషయం స్పష్టమౌతుంది. (తెలుగులో పరిశోధన : 1983,15-16)

తెలుగు సాహిత్య పరిశోధనలో అభివృద్ధిస్పష్టంగానే కనపడుతుంది. ఆ అభివృద్ధికి సమగ్రత చేకూరాలంటే మరింత సైద్ధాంతిక నైపుణ్యాన్ని తీసుకురావడానికి పరిశోధకుడూ, పర్యవేక్షకుడూ చిత్తశుద్ధితో ప్రయత్నించాల్సి వుంది.

## సంప్రదించిన రచనలు

1. తెలుగు పరిశోధన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి రజతోత్సవ సంచిక 1983

2. విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన డాక్టర్ వెలుదండ నిత్యానందరావు 1998

3. తెలుగు పరిశోధన - కొన్ని సూచనలు - ఆచార్య పి. కుసుమ కుమారి, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక, మార్చి 1994.

కవిత
జ్వాలాముఖి

# బీటింగ్ అరౌండ్ ది బుష్

డాలర్ నిఘంటువుల్లో డైనమైట్లు
వీటో విజ్ఞాన సర్వసాల్లో విస్ఫోటనలు
నాటో కూటమి ఆటవిడుపులో అణువిధానం
ఒకేఒక పగసాధింపు పట్టుదల కోసం
ప్రపంచదృష్టి మళ్లించిన వికటాట్టహాసం

భాషా వేత్తల నిర్వచనాలు గల్లంతు
సాంఘిక శాస్త్రవేత్తల సిద్ధాంతాల మదింపు
రాజకీయ నిష్పత్తుల పునరాలోచన
అన్నిటినీ భరిస్తూన్న గాయాల ధరిత్రి

తైల నిక్షేపాల గుత్తాధిపత్యం కోసం
ధృవైక రాజ్యంకోసం ధూర్తదృక్కోణం
ఆర్థిక సంక్షోభంలో యుద్ధం కూడా ఒక వ్యాపారం
బుద్ధి పూర్వకంగానే "బీటింగ్ అరౌండ్ ది బుష్"

ఖంగుతిన్న కాలజ్ఞానం
మాటపడిపోయిన సందర్భం
దుస్తులేసుకున్న అనాగరికత
చెలామణి అయిన దౌర్జన్యం

కాలం ఎప్పుడూ
గతితర్కాన్ని తప్పించుకుంటుంది
జ్ఞానం ఎప్పుడూ
దుర్మార్గాన్ని వెతికిపట్టుకుంటుంది
చరిత్ర, తోడు రానంతవరకూ
చైతన్యం మౌనంగానే చూస్తుంది
సామాజిక దశ తిరగనంతవరకూ
మార్పు ఉన్న చోటే తిరుగుతుంది
ఏమి పట్టని నిఘంటవుల్లో మంటలు
పాటించి చూచే ప్రపంచానికంతా గగుర్పాటు

హడలిపోయిన భూతల స్వర్గం
కుప్పకూలిన వాణిజ్య దుర్గం

ప్రపంచ పోలీసు కొంపలో టైంబాంబు
పిచ్చివాడి రాయికూడా తడాఖా చూపిన తరుణం

నిద్రచెడిన భద్రలోకం
పగబట్టిన ప్రతీకారం
పొగలేని నిప్పు ప్రతాపం
కారణం దొరకని కార్యం వీరంగం

ఆకాశం నిండా అంతులేని ఆక్రోశం
భూమంతా తవ్వి పోసిన ప్రతీకారం
కొండల్ని పిండిచేసిన పగలు
గుహల్ని ఊదేసిన క్షుద్రవ్యూహాలు

శాంతిసేనల ఫెళఫెళార్భటులు
నెపంతో చెట్టుచాటుబాణాలు
అర్ధసత్యకోసం అబద్ధం కాండతాండవం
ఖడ్గ మృగాల వేటలో మనుగడ పాటవం

కసినిపెంచిన సమయం
కథను చెరచిన సందర్భం
ఇంగితం వదలిన ఆవేశం
నేలనాలుగు చెరుగులా ప్రతీకారం
తెలిసిన మాట తెలియనిబాట
నిఘంటువుల్ని నిలువునా కూల్చిన మాట
అందరినోళ్లలో ఆడిన మాట
అందరి నోళ్లనూ మూయించినమాట

కట్టుడుపళ్లు కొరకలేని క్షణాలు
అంకుల్ శ్యాం ఆత్మవిశ్వాసం దుర్మరణాలు
ఎదురులేని వాడి ఎదుట మృత్యుహేల
బతుకు జీవుడు గల్లంతైన గందరగోళం

రవి అస్తమించిన రాజ్యంలో జలదరింపు
పేగులు లెక్కబెట్టలేని ఐరోపా ఆవలింత

ఆసియా సద్యో గర్భంలో ఆఫ్ఘన్ వ్రణం
మిగిలిన జన చైనా మీద నిఘా అదనం

అయిదుగురు గుడ్డివాళ్లు కాదు
హఠాత్తుగా పీడకల కన్న వాళ్లు
ప్రపంచం కళ్లు పొడిచారు
కాలానికి కన్నం వేసి నిజాన్ని దోచారు

మనుగడ గుడారాల్ని తగులబెట్టారు
ఎడారి మమతల్ని జల్లెడ పట్టారు
భూమిని పొరలు పొరలుగా కోసిచూశారు
కొండల్ని బాంబులతో తవ్వి పోశారు
అయినా చచ్చిన ఎలుక కూడా దొరకలేదు
దుర్మార్గం గత్యంతరం లేని సన్మార్గం అయింది
దౌర్జన్యం చేతిలో ప్రపంచన్యాయం పలికింది

అసలే అగ్రరాజ్య దురహంకారం
ఆపై ఏకధృవ వీర విహారం
అదనంగా చెలరేగిన పెట్రోదాహం
కుబుసం విడిచిన ప్రపంచాధిపత్యం
ఐరోపా సాక్షిగా యుద్ధోన్మాద వ్యాపారం -

ఎంతకూ పట్టుబడని శత్రువు
నిరంతర యుద్ధం నిగూఢ పరమార్థం
రోగ్ దేశాల శాపనార్థాలతో
రోగ్ సామ్రాజ్య వాదంగా తేలిన అమెరికా

ఆర్యా వర్తకులకిదో కలిసొచ్చిన వ్యూహం
రామాయణంలో పిడకలవేట సందోహం
కొంపలు తగులబడి పోతుంటే
బొగ్గు లేరుకునే వక్రబుద్ధి
ఎండిన పెట్రో మరుగు మాటున
ఎందరో మహానుభావులు
అందరికీ సంభావనలు

ఆసియాకు గండిపడితే
ఉపఖండం ఊడ్చుకపోదా?
దాయాదుల పగలు దాటని ఫిర్యాదులు
మధ్యయుగాల మర్యాదపు పురుషోత్తములు

కైంకర్య స్వాముల కరకమలాల్లో
దరిద్ర నారాయణుల ప్రజాస్వామ్యం
వక్రబుద్ధి శుక్రనీతి ధన స్వామ్యం
సాగుతున్న నయవంచన సమారాధన

కసినిండిన మాటకోసం
పునరుక్తి దోషం లేని ప్రతీకారం కోసం
అంతరార్థం అంతుపట్టని సంఘటన కోసం
ప్రపంచాన్ని దిగ్బంధనం చేసిన పగ
కొలువుతీరిన కొండచిలువ నోటిసెగ

చిక్కని దొరకని సర్వాంతర్యామి
పత్రికల్లో వాంతులు చేసుకునే రక్త ఘోష
కసిదీరా బుసగొట్టే మృత్యు భాష
ప్రసారమాధ్యమాల్లో మహాప్రవక్త హితబోధ

అదిడైనోసార్ కన్నా భయంకరమైన మృగం
తనని తాను తింటూ తనివితీరా బతికే సరీసృపం
నాగరికతను పిడికిటపట్టే మధ్యయుగాల జ్వరం
మట్టిమనిషిని మత్తుమందులోకి తోసే వికృత స్వరం

ప్రపంచీకరణ ఇష్టా రాజ్యానికి సవాలు
సరళీకరణ పాతాళ హోమానికి ధిక్కారం
సొంతకరణ సాంగత్యానికి అడ్డుగోడ

రక్తపిపాసి ధనస్వామ్యం,
కొల్లగొట్టిన ప్రజాస్వామ్యంలో
చావు తెలిపి వికృత రూపం
డాలర్ డైనోసార్ నిజస్వరూపం
దాని నీడే టెర్రరిజం

అది నిఘంటువుల్లో తిరగబడ్డ మహాపాపి
సమయమూ సందర్భాల్ని పేల్చివేసే ముక్కోపి
దేశదేశాల మూలుగులు పీలుస్తున్న
డైనోసార్ డాలర్‌తో పవిత్ర యుద్ధం
డాలరు స్వరాన్నిమించిన టెర్రరిజం లేదు
సంఘటితశక్తులను చీల్చి
ఒంటరిని చేసి భయపెట్టే
నీడతో యుద్ధం ఇంకా ఎన్నాళ్లు
ఒడుగుదేశాల పీడితులంతా
డాలరుడైనోసార్‌తో తలపడక తప్పదు

కథ డా. శాంతి నారాయణ

# రతనాల సీమలో



**సా**యంకాలం కావొస్తూ వుంది. మల్లన్న గుట్ట కింద చేన్లో వేరుశెనగ పైరుమీద యూరియా చల్లి, ఎగవడొంపు గట్టు మీద కెక్కి కూర్చొని తలకు చుట్టుకున్న టువ్వాలు విప్పదీసి భుజమ్మీదేసుకున్నాడు. బనీను జేబులో నుంచి అగ్గిపెట్టె బీడీ బయటకు తీసి, బీడీ అంటించుకొని నోటినిండా పొగ పీల్చి మెల్లగా వొదులుతూ చేని పక్కన చుస్తున్నాడు మల్లన్న.

డొంపు చివర నిన్న సాయంకాలం కూలోళ్లు వొదిలేసిన 'మునం'లోని కలుపునంతా 'కుర్పికల'తో తీసి మల్లన్న భార్య సుబ్బమ్మా, చిన్న కూతురు ఆదెమ్మా కలుపు గడ్డినంతా వొదులేస్తున్నారు. ఆ వొదులన్నీ గంపలో నింపుకొని మల్లన్న పెద్ద కొడుకు రంగన్న 'బండిపనక'లో గుమ్మరిస్తున్నాడు.

బీడీ తాగుతూ తమ చేన్లో 'అనబకొనలు' సాగుతున్న వేరుశెనగ పైరునూ, పక్క సాలాల్లో పచ్చగా కనిపిస్తున్న పైర్లనూ చూస్తున్నాడు మల్లన్న. చాలా యేండ్ల తర్వాత కళ్లముందు కనిపిస్తున్న వేరుశెనగ పొలం మాదిరే అతని ముఖం సంతృప్తితో కలకలలాడుతూ వుంది.

గల్లు మీద 'నవురు'గా పెరిగిన నేరేడు గడ్డీ చిప్పరా పిల్లిబిసర తీగలూ ఎరగడ్డీ పసుకురాకు తీగలూ పొట్టలు పగిలేటట్లు తిని నట్టు మీద వేప చెట్టు కింది పండుకున్న గిత్తలు కళ్లు మూసుకొని, ముఖమ్మీద వాలుతున్న చిటీగలను చెవులతో తోలుతూ తృప్తిగా నెమరేస్తున్నాయి. గట్ల మీద పచ్చగా విరబూసిన తంగెడు చెట్ల మీదా నీలంగా పూసిన వెంపలిపూలమీదా బోదగడ్డి వెన్నుల మీదా వాలి, మత్తెక్కిన తూనీగలూ జీరంగులూ నల్లదుగ్గలూ సీతా కోక చిలకలూ ఆనందంతో రాగాలు తీస్తూ పొరాడుతున్నాయి.

చేన్లో మూరెడెత్తు పెరిగి పచ్చగా రెండోపూత పూసిన వేరుశెనగ మొక్కలు పిల్లగాలికి సంతోషంగా వూగుతున్నాయి. ఎక్కడో గాని బెత్తెడు నేలయినా కనిపించకుండా వేరుశెనగ పైరు పొలం నిండా పడకేసినట్లుంది.

చేనిపక్క చూస్తున్న మల్లన్న శరీరం నిండా తియ్యటి తృప్తి ప్రాకుతూ ఉంది. పిల్లి గుండ్ల చేను కూడా ఇదే మాదిరి అతని కళ్ల ముందు మెదలసాగింది. మొత్తం తన పదెకరాల వేరుశెనగ పొలం దాదాపు పదేండ్ల కాలంలో ఎప్పుడూ లేనంతగా ఆనందం కలిగిస్తూ ఆశల్ని రేకెత్తిస్తూ వుంది. అతని మనసు గాలిలో తేలిపోతూ వుంది.

-యెన్నాల్లయ్యిందో ఇట్లా పైరు సూడక? ఇప్పుడుండే తేమతో శెనిగబుడ్డలు సుమారగ వూరుతాయి. ఆ బగమంతుని పున్నాన రొండు

మూడు వారాలయినంక ఇంగొగ పదునయితే సాలు, ఫుల్‌పంట సేతికొచ్చినట్లే. పదెకరాల్లో యెట్లలేదన్నా నూరూ నూటిరవై మూట్లు బుడ్డలయితాయి. ఇత్తనానికి వొగ పదిమూట్లు తీసిపెట్టుకొని మిగతావి అమ్ముకుంటే, ఇప్పుడుండే రేట్ల ప్రకారం అరవై డెబ్భయి వేలు సేతికొస్తాది. ఈ పంట పెట్టుకుండేకి చేసిండే అప్పంతా తీర్చేసి, పెద్దపాప పెండ్లికి చేసిండే బాకీ బాపతు వొడ్డీ కట్టి, అసల్లేకి గూడా అంతోయింతో జమ జెయ్యొచ్చు. ఆ బగమంతుని దయవల్ల ఇట్ల రొండు మూడేండ్లు అనుకున్నెట్ల పంట పండితే సన్నపాపను కూడా ఒగయ్య చేతిలో పెట్టచ్చు, పెద్దపాపానికీ యాదో వొగసాట మంచి సమ్మొందం సూడవచ్చు-

'పొద్దు మునుగుతా వుంది, పదాం పా నాయినా' అంటూ వేపచెట్టు కిందున్న గిత్తల్ని లేపుతూ తనను పిలవడంతో మల్లన్న తీయటి కలల లోకంలో నుండి బయట పడినాడు. రంగన్న గిత్తల్ని తోలుకొని పోయి బండి కట్టుకొని వచ్చి వేపచెట్టు దగ్గర నిలబెట్టినాడు. మల్లన్న బండి చక్రం ఆకుల మీద కాళ్లు బెట్టి పైకెక్కి పనకలో వున్న పచ్చిగడ్డి మీద సుబ్బమ్మ పక్క కూర్చున్నాడు. నొగల మీద కూర్చున్న రంగన్న, గిత్తల బొడ్డు కింద కాలి బొటేల్లతో సైగ చేసినాడు. గిత్తలు పరుగందుకున్నాయి.



బండి పనకలో వున్న పచ్చిగడ్డిలో నుంచీ మధురమయిన వాసన, చుట్టూ ముసురుకుంటూ వుంది. బండి మీదున్న వాళ్ల శరీరాల్లో నుంచీ వేరుశెనగ పైరు వాసన గుప్పుమంటూ వుంది. కలుపు గడ్డిలో దాక్కున్న పిల్లసర తీగల్ని పైకి లాక్కొని బలిసిన పిల్లిబిసర కాయల్ని వొల్చుకొని తింటూ వుంది ఆదెమ్మ. మల్లన్నా సుబ్బమ్మా మాటల్లోకి దిగినారు.

నలువైపుల నుంచీ కలుపు గడ్డితో నిండిన బండ్లూ మెట్లు పాసిన గుంటకటా పచ్చిగడ్డి తిని పొగరెక్కి రంకెలు వేస్తూ వొకదాన్నొకటి ఎగబాకుతూ వస్తున్న పశువులూ కూలోళ్ల గుంపులూ అన్నీ వూర్లోకి చేరుకుంటున్నాయి. పడమటి దిక్కున కాకి రెక్కమాదిరి వాలిన మేఘం లోనుంచీ చూస్తుండగానే వాన సారకలు దిగబడినాయి. వానగాలి వీయసాగింది. మల్లన్న బండి ఊరి దగ్గరకి చేరుకుంది. ఉన్నట్టుండి గబగబా నాలుగు చినుకులు పడి మేఘం తేలిపోయింది. వొంటిమీద చినుకులు పడగానే పశువుల గుంపులో, పడ్డ దూడలూ తరుపుదూడలూ తోకలెత్తి గంతులేస్తూ పరుగెత్తసాగినాయి. కూలోళ్ల గుంపులో వయసు పిల్లలు తీసిన బట్టలతో మిలమిలలాడుతూ వయసు పొంగుల్ని చూసుకుంటూ సిగ్గు సిగ్గుగా పర్యాచకాలాడు కుంటున్నారు.

'ఇసారి కార్తెలన్నీ కనికరిస్తాండాయప్పా. బూమిలో తేమారకనే చినుకులు పడతాండాయి. ఈ పొద్దు పుబ్బకార్తె వొచ్చిందంట. వొస్తా వొస్తా సల్లని మనసుతో వచ్చిందప్పా, సేన్లల్లో యూరియాలు చల్లినంక పెద్ద వానొచ్చింటే నున్నగ కొట్టుకొని పొయ్యేండేది. బాగు 'వొనారుగా' చినుకులు పడెనప్పా. ఈ చినుకుల్తో యూరియా అట్లే కరిగి రేప్పద్దనకే పవురు సూపుతాది'

ఊర్లోకి చేరుకుంటున్న రైతులందరూ వొకరికొకరు చెప్పుకుంటూ తడి బట్టలతో ఇల్లు చేరుకుంటున్నారు. వొంటిమీద తడిసిన బట్టల్ని వొడేసి పిండుకుంటూ తమ బతుకులు ఆనందంతో తడిసినట్లు సంతోషపడుతూ ఆడామగా ఇంటి పనుల్లో మునిగిపోతున్నారు. చుట్టుపక్కలున్న పల్లెలతో పాటు మదిరేపల్లి, పచ్చని పొలాల కబుర్లతో మురిసిపోతూ వుంది.

పనులన్నీ అయిపోయినాయి. మనసుకు వూరటగా వుంది. తీరిక దొరికిందని మల్లన్న వొక పదిరోజులు బంధువుల దగ్గర గడిపొస్తామని బయలు దేరినాడు. చిన్న చెల్లెలూ చిన్న బావల ఇంట్లో వారం దినాలూ పెద్ద కూతురూ అల్లుళ్ల దగ్గర పది దినాలూ హాయిగా గడిపి రాయచూరు నుండీ వచ్చి అప్పుడే ఇల్లు చేరుకున్నాడు. ఇంట్లో అడుగు పెడుతూనే ఇల్లంతా దిగులుగా కనిపించింది మల్లన్నకు. టౌన్నుంచీ ఎప్పుడొచ్చినాడో యేమో, చిన్నకొడుకు రవీంద్ర కూడా వున్నాడు.

మల్లన్న జలాటి బండమీద కాళ్లూ మొగమూ కడుక్కొని వచ్చి పడసాల్లో జెగితి మీద కూర్చున్నాడు. తలకాయలొంచుకొని దిగులుగా తలాకొకపక్క కూర్చున్న భార్యాపిల్లల్ని చూస్తూ 'ఏమయిందర్రా అట్లుండారు'? అని అడిగినాడు. రంగన్న బరువుగా పెదవి విప్పి పొలాల కథలన్నీ తండ్రికి చెప్పినాడు. ఆ మాటలు వింటూనే మల్లన్నకు శరీరంలో వొణుకు పుట్టింది. పొద్దు పోయేదాకా ఇంట్లో అందరూ ఆలోచన చేస్తూ బలవంతంగా కడుపు లోకింత వేసుకొన్నారు. మళ్లీ తల్లులూ పిల్లలూ వొకచోట కూర్చొని చర్చించుకున్నారు. దిగులు పడినారు. మాట్లాడుతూ మాట్లాడుతూ వొక్కొక్కరు మెల్లగా నిద్రలోకి జారుకున్నారు. మల్లన్నకు మాత్రం రాత్రంతా నిద్ర పట్టలేదు.

తొలికోడి కూసింది. అంతవరకూ మనసునూ శరీరాన్నీ అదుపు చేసుకున్న మల్లన్న ఇక భరించలేక పోయినాడు. రంగన్నను నిద్ర లేపి చేన్ల దగ్గరికి బయలు దేరినాడు.

గుట్ట కింద చేనికాటికి చేరుకునే సరికి మసకిదిడిసింది.

పొలంలోని శెనక్కాయ చెట్లు దిగులుగా కనిపిస్తున్నాయి. పైరంతా బాగా వాడిపోయింది. మూడువారాల కిందట చూసిన కళ్లతో మల్లన్న పైరు పక్క చూడలేకపోయినాడు. కాలితో తొక్కి రెండు మూడుచోట్ల చెట్లు పీకి చూసినాడు. శెనక్కాయలింకా ముదర్లేదు. ఇంకొక వాన పడకుంటే శెనక్కాయలన్నీ లొట్టవడిపోతాయి. మల్లన్న మనసంతా వికలమయిపోయింది. అక్కన్నుంచీ గబగబా నడుస్తూ పిల్లిగుండ్ల చేను దగ్గరకి చేరుకున్నారిద్దరూ. చేనిపక్క చూస్తూనే మల్లన్నకు 'నెమ్ము' లిరిగిపోయినాయి.

పైరంతా నల్లగా మాడిపోయింది. ఆ చుట్టుపక్కల చేన్లన్నీ అట్లే వున్నాయి. నాలుగైదు చోట్ల చెట్లు పెరికి చూసినాడు - మల్లన్న. కాయలన్నీ నల్లగా కందిపోయి లొట్టలయినాయి.

పొద్దు బారెడెక్కింది. పొలాల నిండా దిగులు పడుతున్న మనుషులే. ఒకరినొకరు కలుసుకొని బాధంతా ఎల్ల బోసుకోసాగినారు.

'ఇదేందో ముప్వకుల్లు తెగులంటప్పా. యీనాడూ చూసెరగం. వానొస్తే రోగం తగ్గిపోతాదని, రోగం ముదరక ముందే అదేందో మోనాక్రోటో పాస్ మందంట, అది చల్లితే బాగుండేదని అంటూ వుండారు. జిల్లాలో వుండే రాజకీయనాయకులంతా పట్టుబట్టి ఆ మందును రైతులందరికీ ఫ్రీగా ఇప్పిచ్చే యేర్పాట్లు చేసినారంట! ఆపీసర్లేమో రోగం ముదిరినంక ఆ మందు చల్లితే లాబం లేదని, అందరూ వొగేసారి చల్లితే ప్రెమాదముంటాదని చెప్పతా వుండా రంట! ఈల్లు చేసే పనులూ చెప్పే మాటలూ యెట్లుండాయంటే, 'దొంగలు పడిన ఆర్నెల్లకు కుక్కలు మొరిగినట్లుంటాది!' చేతులు కాలినంక ఆకులు పట్టుకుంటే యేం లాబమప్పా?' జనమేమో యెట్లయితే అట్లయితాదని ఫ్రీగా వొచ్చే పురుగుల మందు యాల వొదులుకోవల్లని దానికోసరం యెగబడతా వుండారంట! ఇప్పుడేం జెయ్యాలప్పా, మందు తెచ్చుకోవడమా మానడమా?'



జనంతో కలిసి తర్జన భర్జన పడుతూ రంగన్నతో పాటు ఇల్లు చేరుకున్నాడు మల్లన్న

ముఖాలు కడుక్కొని కాఫీ తాగి తండ్రీకొడుకులు జెగితి మీద కూర్చొని పంట కొచ్చిన తెగులును గురించీ మోనోక్రోటోఫాస్ మందును గురించీ మాట్లాడుకోసాగినారు. మందు తొందరగా తెచ్చుకొని పైరుమీద చల్లడం మేలన్నాడు రంగన్న. ఇప్పుడు చల్లినా అది పని చేయదని ఆ రోజు దినపత్రికను చదివి వినిపించినాడు చిన్నకొడుకు రవీంద్ర. కళ్ల ముందు పంట నాశనమై పోతూ వుంటే చూసి భరించలేక ఫ్రీగా వచ్చిన మోనోక్రోటోఫాస్ తాగి ఆత్మహత్యలు చేసుకొంటున్న రైతులను గురించి పేపర్లల్లో వచ్చిన వార్తలనూ అంకెలనూ వినిపించినాడు రవీంద్ర. పురుగుల మందు పంపకాన్ని గోరంతలు కొండంతలు చేసి కష్టకాలంలో రైతులకు తామేదో కొంత సహాయం చేస్తున్నామన్న విషయాన్ని ప్రకటించుకోడానికి రాజకీయ నాయకులు పురుగుల మందుకోసం రైతుల్ని ఎగ దోస్తున్నారని కొన్ని ప్రజా సంఘాలు చేసిన వ్యాఖ్యలను కూడా చదివి వినిపించినాడు రవీంద్ర.

మందు తెచ్చుకొని పొలానికి చల్లకపోయినా, మందుల షాపు వాళ్లకు అమ్మితే కొంత సొమ్మయినా చేతికొస్తాదని చాలామంది రైతులు అట్లే చేస్తున్నారని లౌకికం కనబరిచినాడు రంగన్న. మల్లన్న కాసేపు ఆలోచన చేసి సరే నన్నాడు. రంగన్న అనంతపురం మండలం ఆఫీసుకు వెళ్లి సాయంకాలం వరకూ గట్టిగా పోరాడి మోనోక్రోటోఫాస్ మందు నాలుగు డబ్బాలు తెచ్చి పశువుల కొట్టంలో పెట్టినాడు.

వాడిపోయిన వేరుశెనగ పైరు పూర్తీ ఎండిపోకముందే రెండ్రోజులు వరుసగా వాన పడింది. రైతులు బతుకుల్లో ఎండిపోయిన ఆశలు మళ్లీ చిగురించినాయి.

దశరా వండగొచ్చి వెళ్లిపోయింది. రైతులందరూ శెనక్కాయ పెరికిస్తున్నారు. పొలాల్లోనే కళ్లాలు చేస్తున్నారు. జనంతో పొలాలన్నీ సందడిగా వున్నాయి.

మల్లన్న గుట్ట కింద చేన్లో శెనక్కాయ పెరికించినాడు. చేన్లోనే వొకమూల కళ్లం చేసి శెనక్కట్టి వోదులన్నీ ఎండిన తర్వాత కళ్లంలోకి తోలించినాడు. పిల్లిగుండ్ల చేన్లోని శెనక్కట్టని కూడా ఆ కళ్లంలోకే తోలించినాడు. కొంతమంది కూలోళ్లను పిలుచుకొని ఇంట్లో వున్న పిల్లాజల్లా అందరూ కలిసి శెనక్కాయలు 'తరిసినారు'. కళ్లం నిండా పరుచుకున్న పొట్టునంతా నూకి సుబ్బమ్మా ఆదెమ్మా కుప్ప కొసినారు. మల్లన్నా రంగన్నా రవీంద్రా ముగ్గురూ కలిసి పొట్టును తూరుపు పోసినారు. వారం దినాలు, వొంచిన నడుమెత్తకుండా ఇంటందరూ కలిసి నిన్న సాయంకాలానికి కళ్లం పని ముగించి శెనక్కాయలన్నీ మూటలకు నింపినారు. యాభై మూటలయినాయి. కళ్లమయి పోవడంతో సుబ్బమ్మా ఆదెమ్మా ఇల్లు చేరుకున్నారు.

చాలామంది నన్నకారు రైతులు ఎప్పటి మాదిరే శెనక్కాయలమ్ముతున్నారు. కొంతమంది అప్పులోళ్లకు పంచిపెట్టి మిగిలిన పంటను ఇళ్లకు తెచ్చుకుంటున్నారు. కళ్లమయి పోయినప్పట్నుంచీ మల్లన్న, అప్పులిచ్చిన వ్యాపారస్తుని కోసం ఎదురు చూస్తున్నాడు.

సాయంకాలం కావొచ్చింది. మల్లన్న కళ్లంలో మంచమ్మీద

కూర్చొని 'నెట్టేసిన' శెనక్కాయ మూటలవైపు చూస్తున్నాడు. భూమిలో విత్తనం వేసినప్పట్నుంచీ కళ్లంలోకి పంట చేరేదాకా పడిన శ్రమంతా కళ్లముందు కనిపించసాగింది. పంట కోసం చేసిన అప్పులన్నీ వెక్కిరిస్తున్నాయి.

-ఇత్తనాల కోసరం పెట్టిండే దరకూ ఇప్పుడు యాపారస్తులు అడుగుతా వుండే రేటుకూ కింటాలు మీద నన్నూర్రుపాయలు తేడా వుంది. ఈ పంటలో విత్తనాలకు తీసిపెట్టి మిగతా 'బుడ్డలు' అమ్మితే ఇరవైవేలు గుడకా చేతికొచ్చేతట్ల లేదు. కొనిండే ఇత్తనాలూ మందులూ ఎరువులూ కలుపుకూల్లూ అన్నీ కలిపితే పజ్జెనిమిది వేల దాటతా వుంది. ఇంట్లో నలుగురు మనుసులం అయిదారు నెలలు కష్టపడితే కూలిపాటన్నా మిగలద్దా? ఇట్లా పంట పండి ఇట్లా రేటు కొల్లబడితే రైతు బతికేదెట్ల? ఈ గడ్డమీద రైతు బతుకు ఎంతద్దుమానంగా మారిపాయనప్పా! బగమంతుడా, రైతును ఆదుకుండే నాతుడు లేనేలేడా?

ఇన్ని గవుర్మెంట్లు మారిపాయ. ఈ నేల్లో నుంచీ ఇంతమంది ముఖ్యేమంత్రులాయిరి. ఎవురే గానీ ఈ గడ్డను బాగజెయ్యల్లని అను కుండారా? సొతంత్రమొచ్చి నలభైయాభైయేండ్లు గడిసినా ఇంకా ఇక్కడుండే రైతు వాన పడకుంటే గంపెత్తుకొని పోవల్సిందేనా? ఆ పక్కదే సెమోల్లకు వున్నెట్ల ఇక్కడుండే రైతుకూ నీటి ఆదరువుంటే ఈ నేలమీద రైతు బతుకు ఇట్ల అయ్యిండేదా? నీటి సవుకర్యెం చెయికుండా పైన పైన పెదువులు తడిపే పనులు చేస్తే అవి ఎవున్ని వుద్దరిస్తాయని? గవుర్మెంటు సొమ్మంతా పట్నాలమీద ఇత్తగిలిస్తే ఇంగ యావల్లన పల్లెటూర్లు బాగుపడతాయి? జనమబూమని ఇంకుడు గుంతలని అవని ఇవని జనానికి సిట్కాలు చూపి వాల్ల చెవుల్లో యెన్నాల్లని పూలు పెడతారు?



పంట నాశనమైపోయి మేము అంగలారుస్తా వుంటే అదేందో పంట మార్చల్లంట! పంట మార్చనందుకే కొత్తకొత్త తెగుల్లు వొస్తావుండాయంట! నిజమే, బాగనే వుంది, పసుపూ మిరపా చెరుకూ అరిటీ ఇట్లాటి పైర్లు పెట్టకోవల్లని మాకు మాత్రం వుండదా? అయితే నీల్లెవురిస్తారు? ఈల్ల జేజి నాయన ఇస్తాడా? ముందెప్పుడో కొర్రా అరికలూ సాములూ అమిదాలూ ఎరజొన్నా యేసేవాల్లంట! ఇప్పుడు ఆ పంటలు పెట్టుకొని బతికేదానికి అయితాదా? ఎరజొన్నల్లూ కొర్రలూ తినే నా కొడుకు ఇప్పుడు యెవుడయినా వుండాడా? గతి లేక పోతే తింటామనుకో, రొండు మూడేండ్లకొగసారి ఆ వంటల పెట్టుకుంటామనుకో, ఈ అరకొర వాన్లకు ఆ పంటలు పండవనే గ్నానం ఈ ఆఫీసర్ నా కొడకలకుందా? యేందో, శెనిక్కాయ మొండిపైరు కాబట్టి ఎంత వొరుపొచ్చినా తట్టుకుంటా వుంది గానీ ఇంగ యా పైరు ఈ ఎర నేలలో పండుతాది? ఇతగాల్లు చెప్పినట్ల అమిదాల పంట పెట్టుకుంటామనుకో, ఇట్లా కాలంలో ఆ పంట రైతు బతుకును ఆదుకుంటాదా? అమిదాలు పండిచ్చుకుంటే పనుల్చి యా గాటికి కట్టెయ్యల్ల?

శాశ్వితంగా ఈ గడ్డకు నీటి సవుకర్యెం కలిగిచ్చేకి యోగ్గత లేని నా కొడుకులంతా అధికారం లేకి వొస్తావుండారు. వాల్లకు కొమ్మూదే దానికి ఈ ఆపీసర్లంతా తయారయితా వుండారు. ఈల్లంతా కలిసి పంట మార్చల్ల అది మార్చల్ల ఇది మార్చల్ల అని యేంటివేంటివో తప్పుడు కూతలు కూసి, ఈ గడ్డమీద రైతు నాశినమైపోడానికి రైతులు పొరపాట్లేనని పుండు మీద కారం చల్లుతాండారు. ఆ యెమ్మిగనూరూ సిరిగుప్పా కంప్లీ ఆ పక్కంతా తుంగబద్ర కాలవ కింద పతి సమ్మత్సరమూ రొండు పంటల పకారం ముప్పై నలబై యేండ్ల నుంచీ వరి పండిచ్చేది మేము కానమా? ఆడ పంట మార్చకపోయినా యేడుకేడుకు పంట దిగుబడి పెరుగుతానే వుంది గదా! ఇతగాదిల్లు చెప్పే దంతా యెట్లుందంటే, ఆడలేనమ్మ మద్దెల మింద పడినట్లుండాది. అయినా యెవర్నని యేం లాబం? ఈ గడ్డ మీద రైతుగా పుట్టడమే శానా పాపం-

సమాధానం లేని తన ప్రశ్నలన్నిటికీ తనకు తానే యేదో సమాధానం వెతుక్కొని కొంచెం సేపు గొణుక్కున్నాడు మల్లన్న. ఏమనిపనించిందో యేమో, 'థూ, దీనెమ్మ' అని పైకి లేచి కేకరించి ఎంగిలి మూసినాడు. మనసంతా బరువు కావడంతో పక్క చేన్లో కొంచెం ఎడంగా వున్న కొండన్న వాళ్ళ కళ్లం దగ్గరకి పోదామని చూసినాడు. అంతలోనే చిన్న కొడుకు రవీంద్ర ఫ్లాస్కు చంకకు తగిలేసుకొని వొచ్చినాడు. వొచ్చీ రాగానే జోలీలో వున్న బీడీకట్ట తండ్రి చేతికి ఇవ్వబోయినాడు. మల్లన్న కొడుకు పక్క చూస్తూ, 'యేమప్పా నువ్వొస్తివి? రంగడు యాటికి పోయినాడు?' అని అడుగుతూ బీడీ కట్ట తీసుకున్నాడు.

'కొరివి పల్లినుంచీ పెద్దమామ యేదో అర్జెంటు పనుంది, రావల్లని చెప్పంపితే రేప్పొద్దునే తిరిగొస్తానని అమ్మతో చెప్పి అన్నయ్య సాయంత్రం బస్సుకు కొరివి పల్లికి పోయినాడు నాయనా' అంటూ రవీంద్ర ఫ్లాస్కులో నుంచీ కాఫీ పోసిచ్చినాడు.

మల్లన్న కాఫీ తాగి బీడీ అంటించుకున్నాడు. రవీంద్ర అదీ ఇదీ మాట్లాడుతూ చియ్యేడులో గవర్నమెంటు ఫ్రీగా ఇచ్చిన మోనోక్రోటో

ఫాస్ మందు తాగి ఇద్దరు రైతులు చనిపోయినారని వాళ్లకు ప్రభుత్వం యాభైవేల ప్రకారం సహాయం ప్రకటించిందని మధ్యాహ్నం టీవీలో వార్తలు చెప్పినారని తండ్రి దృష్టికి తెచ్చినాడు. కడాకు రైతుల్ని చంపడానికే గవర్నమెంటు ఫ్రీగా ఇట్లా సమయంలో పురుగుల మందు రైతుల చేతికిచ్చిందని వెక్కిరించినాడు. ప్రభుత్వం యాభైవేల సహాయం ప్రకటించిందనే మాటలు మల్లన్న మనసును కొంచెంసేపు కట్టివేసినాయి.

సీమ రైతులకు జరిగిన అన్యాయాలను గురించి రవీంద్ర వివరించసాగినాడు. రైతుల కన్నీళ్లకు కారణాలయిన సమస్యల జోలికి పోకుండా ఆత్మహత్యలు చేసుకున్న రైతుల శవాల మీద నాలుగు డబ్బులు చల్లి ప్రభుత్వాలు తమ ఉదారత్వం ప్రకటించుకోవడం, ఆవును చంపి చెప్పులు దానం చేయడం వంటిదని వ్యాఖ్యానించినాడు. మల్లన్న ఆ మాటల్ని అన్యమనస్కరంగా వింటూ బీడీ ఆర్పేసినాడు.

తండ్రీ కొడుకులు మంచమ్మీద ఎదురెదురుగా కూర్చొని వ్యవసాయాన్ని వొదిలించుకోవడం గురించి మాట్లాడుతున్నారు. అంతలోనే పక్కచేని కొండన్న కొడుకు నాగలింగం వొచ్చినాడు. నాగలింగమూ రవీంద్రా పదవ తరగతి వరకూ కలిసి చదువుకున్నారు. ఇద్దరూ మంచి జతగాళ్లు. జతగాడు రావడంతో రవీంద్ర, తండ్రితో మాట్లాడటం వొదిలేసి అతగానితో మాటల్లోకి దిగినాడు. మల్లన్న యేదో గుర్తుకు తెచ్చుకొని, వూర్లో కొంచెం పనుందని, చూసుకొని అట్లే అన్నం తినొస్తానని అంతవరకూ కళ్లం దగ్గర వుండమని కొడుక్కు చెప్పి వూర్లోకి బయలు దేరినాడు.



ఈ పొద్దు రాత్రి నేను గూడా కళ్లం దగ్గరే పండుకుంటాను నాయనా. వచ్చేటప్పుడు నాకు క్యారియర్ తీసుకొని రా' అన్నాడు రవీంద్ర. ఆ మాటలకు మల్లన్న ఔనన లేదూ కాదన లేదూ.

చీకటి పడింది. మల్లన్న ముఖంలో దిగులూ ఆందోళనా కనిపిస్తున్నాయి. ఊర్లోకి పోయొస్తానని భార్యతో చెప్పి బయటికి నడిచినాడు మల్లన్న. ఏవేవో ఆలోచనలు అతన్ని వెంటాడుతున్నట్లున్నాయి. మాటిమాటికీ తనను తాను నిగ్రహించుకోసాగినాడు. ఎందుకులే అని అనుకుంటూనే చిన్నతనం నుండీ మంచి మిత్రులయిన కురవ నాగన్ననూ ఈదిగ సుబ్బన్ననూ బోయ తిమ్మప్పనూ దిగవగేరి సుబ్బిరెడ్డినీ అరవకూరి రంగయ్య నాయుడినీ రచ్చబండ దగ్గర కలుసుకున్నాడు.

పాతమిత్రులందరూ వూరి విషయాలు మాట్లాడుకుంటున్నారు. రైతుల బతుకుల్లోని వెతలను వెళ్ల బోసుకున్నారు. చియ్యేడులో చనిపోయిన రైతుల్ని గురించి చర్చించుకున్నారు. ఎంత కరువొచ్చినా ఎన్ని కష్టాలొచ్చినా రాయలసీమ రైతులు ఇంతవరకూ ఆత్మహత్యలకు పాల్పడే వాళ్లు కాదని సర్కారు జిల్లాల పత్తిరైతుల పుణ్యమా అని ఇక్కడి రైతులు కూడా నిండు ప్రాణాలు తీసుకోవడం విడ్డూరంగా వుందని పెదవులు విరిచినారు.

జతగాళ్ల మాటలు మల్లన్న గుండె బరువును మాత్రం తగ్గించలేదు. 'పోతానప్పా' అని అందరి పక్కా ఒకసారి చూసి మౌనంగా ఇంటికి బయలు దేరినాడు. అతని చూపులు వొకరిద్దరిని కాసేపు ఆలోచింపజేసినాయి.

'ఇంతసేపు యాటికి పొయ్యింటివి? సన్నపాపోడు కళ్లంకాడ వొకడే వుండాడని తెలీదా? బిరిగ్గ నీల్లు పోసుకుని బువ్వ తినిపోదురా" అంటూ సుబ్బమ్మ ఇంటికొచ్చిన మల్లన్నను దండిస్తూ లోపలికి పోయింది. కొంతలో కాగిన నీళ్లను బకెట్టు నిండా తోడి ఇంటి ముందరున్న జలాటి బండ దగ్గర పెట్టింది. తుండు గుడ్డ నడుముకు చుట్టుకొని వచ్చి బండమీద కూర్చున్న మల్లన్నకు నీళ్లు పోసి వొళ్లు తిక్కింది. ముప్పై సంవత్సరాల అనుబంధాన్ని గుర్తు చేస్తున్న ఆమె చేతి స్పర్శ అతని హృదయంలో ఏ అగాధాలను తొలిచిందో అతనికి ఏ తీయని జ్ఞాపకాలు గుర్తుకొచ్చినాయో తెలియడం లేదు గానీ అతని కంటి కొనల నుండీ జారిన నీటి బిందువులు మాత్రం వేన్నీళ్లలో కలిసిపోయినాయి.

స్నానం ముగించుకొని వొళ్లు తుడుచుకొని ఉతికిన పంచ కట్టుకొని లోపలికి వెళ్లి పీటమీద కూర్చున్నాడు మల్లన్న. సుబ్బమ్మ అన్నం వొడ్డించింది. ఆదెమ్మ నీళ్ల చెంబు తెచ్చిపెట్టింది. మల్లన్న అన్నం తింటూ ఎదురుగా గోడమీద తగిలేసిన పెద్దకూతురు పెళ్లినాటి ఫోటోలోని అల్లుణ్నీ కూతుర్నీ రంగన్ననూ అందర్నీ రెండు మూడుసార్లు తదేకంగా చూసినాడు. కాసేపయిన తర్వాత పక్కన కూర్చొని విసనకర్రతో విసురుతున్న సుబ్బమ్మనూ పళ్లెంలోకి మజ్జిగ పోస్తున్న ఆదెమ్మనూ పదే పదే చూడసాగినాడు. అతని వాలకం తల్లీ కూతుళ్లిద్దరికీ కొత్తగా కనిపించింది.

'యాల ఈ పొద్దు అట్లుండావు?'

'యాల నాయినా, అట్లు చూస్తాండావూ?' అని ఇద్దరూ అడిగినారు.

'యేమీ లా' అంటూ చేయి కడుక్కొని పైకి లేచినాడు మల్లన్న.

'పెద్దోన్ని ఈ పొద్దే కొరివి పల్లికి యాల పంపిచ్చినావు?' సుబ్బమ్మను అడిగినాడు. తన మొగుడు ఎందుకు ఆ విధంగా అడుగుతున్నాడో

అర్థం కాక సుబ్బమ్మ పరధ్యానంగా యేదో సమాధానం చెప్పింది.

మల్లన్న లోగిట్లో మంచమ్మీద కూర్చొని బీడీ తాగుతూ ఎక్కడో చూస్తున్నాడు. సుబ్బమ్మా ఆదెమ్మా భోజనం ముగించుకొని సామాన్లన్నీ సర్ది వచ్చి బయట అరుగు మీద కూర్చున్నారు. 'సన్న పిల్లోడు కళ్లం కాడ వొగడే వుంటే, ఈ మనిసి ఇంగా కూచ్చుండాడేమి? అని అనుకుంటూ సుబ్బమ్మ మల్లన్నతో ఏదో చెప్పాలనుకుంది. అంతలోనే రాత్రి బస్సు హార్న్ కొట్టుకుంటూ వచ్చి బజార్లో, దూరంగా కనిపిస్తున్న చావడి దగ్గర ఆగింది. బస్సు దిగిన వాళ్లు ఇళ్లకు చేరుకుంటున్నారు. పెద్ద కొడుకు రంగన్న ఏమయినా వస్తాడేమో చూసి పోదామనుకున్నాడు మల్లన్న. బజార్లో నుండి సందులోకి ఎవరో మనిషి వస్తున్నట్లు కనిపించడంతో అందరూ అటువైపు చూడ సాగినారు. ఎవరయినదీ గుడ్డి వెలుతుర్లో సరిగా కనిపించడం లేదు.

వొస్తున్న మనిషి ఎవరో ఆడమనిషి మాదిరి కనిపించింది. ఉన్నట్లుండి సందుకు ఎదురుగా వున్న డీ.పీలో నుంచి ఏదో శబ్దమొచ్చి కరెంటు లైట్లన్నీ ఆరిపోయినాయి. ఆదెమ్మ తారాడుతూ లోపలికి వెళ్లి 'బుడ్డీ' అంటించుకొని తెచ్చింది. సందులో చీకట్లో వొస్తున్న మనిషి గబగబా ముందుకొచ్చింది. ఆదెమ్మ బుడ్డీ వెలుతుర్లో ఆమెను గమనించి 'అయ్, అక్కయ్యొచ్చింది' అని కేకేసింది. 'ఎవరూ, యెంగటలచ్చిమా?' అంటూ ఆశ్చర్యపోయింది సుబ్బమ్మ.

వెంకటలక్ష్మి పారి పారి వచ్చి తల్లి వొడిలో తలపెట్టి బోరున ఏడవసాగింది. మల్లన్నతో పాటు అందరూ గాబరా పడుతూ 'ఏమయిందమ్మా' అని ఆదుర్దాగా అడిగినారు. వెంకటలక్ష్మి ఏడుస్తూ చెప్పలేక చెప్తూ తన మొగుని కడుపులో కేన్సర్ ఉన్నట్లు బయట పడిందని, వెంటనే ఆపరేషన్ చేయించక పోతే అతడు తనకు దక్కడని తన మాంగల్యం



కాపాడండని తల్లిని చుట్టుకుంది.

వెంకటలక్ష్మి చెప్పిన మాటలు వింటూనే సుబ్బమ్మా ఆదెమ్మా 'దొమ్మలు' బాదుకున్నారు. మల్లన్న గుండె చెదిరిపోయింది. అతని శరీరం నిండా చెమట్లు కమ్ముకున్నాయి. వాళ్ల అరుపులు విని చుట్టుపక్కల వాళ్లంతా చీకట్లో ఆదరాబాదరాగా వచ్చి చుట్టుకున్నారు. విషయమంతా తెలుసుకొని బాధపడినారు. సుబ్బమ్మనూ ఆదెమ్మనూ వోదార్చి ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయినారు. సుబ్బమ్మ వెంకటలక్ష్మిని లోనికి పిలుచుకొని పోయింది.

జరిగేది జరగక మానదనుకొని మల్లన్న వెంకటలక్ష్మికి ధైర్యం చెప్పి కాసేపు మాట్లాడి కళ్లం దగ్గరకి బయలు దేరినాడు. సుబ్బమ్మ, పొవద్దని పొమ్మనీ చెప్పలేక వూరకనే చూస్తూ వుండి పోయింది. బిరిగ్గ కళ్లం దగ్గరికి పోయి చిన్నోన్ని పంపుతానని దుప్పటి భుజాన వేసుకొని యెల్లవారినాడు మల్లన్న. ఆదెమ్మ టార్చి లైటు తెచ్చి ఇచ్చింది. మల్లన్న కొంతదూరం ముందుకు పోయినట్లు పోయి ఏది గుర్తుకొచ్చిందేమో, కొట్టం లోపలికి వెళ్ళి 'అట్టవ' మీదున్న మేతను పశువులకు వేస్తూ టార్చిలైటు వెలుతుర్లో గూటి వక్క చూసినాడు. డబ్బాలు కనిపించి నాయి. ఒక క్షణం తట పటాయించి ఒక డబ్బాను తీసుకొని దుప్పటి కింద సంకలో పెట్టుకొని బయటి కొచ్చినాడు. కొట్టం వాకిలి చెంపకు ఆనించిన డబ్బాచేట, చీకట్లో అతని కాలు తగలడంతో కిందపడి శబ్దమయింది. ఆ శబ్దం విని ఆదెమ్మ ఇంట్లో నుంచీ బయటికొచ్చి మల్లన్నను చూసి, 'యేమి నాయినా యెనిక్కొస్తివి' అని అడిగింది.

'పసులకు మేత యేయిడం మరిసి పోయినాము గదమ్మా. యేసి పోతాండాను. అక్కయ్యను బయపడొద్దని చెప్పు తల్లీ. బిరిగ్గపొయి సన్నోన్ని పంపుతాను' అంటూ ముందుకు నడిచినాడు.

తనకు క్యారియర్ తీసుకొని రాకుండా వొట్టి చేతుల్తో వచ్చిన తండ్రిని మందలించి నాడు రవీంద్ర. వెంకటలక్ష్మి వచ్చిన విషయం చెప్పి కొడుకును ఇంటికి పొమ్మన్నాడు మల్లన్న. ఇష్టం లేకపోయినా తప్పదనుకొని రవీంద్ర ఇంటికి బయలు దేరినాడు.

మల్లన్న చీగట్లో కళ్లంలో మంచమ్మీద కూర్చొని ఒకదాని తర్వాత వొకటి బీడీ కాలుస్తూ ఆలోచిస్తున్నాడు. ఎంత ఆలోచించినా అతనికి వెల్తురు కనిపించలేదు. చేసిన బాకీలూ చిన్న కూతురు పెళ్లి సమస్యా పెద్ద బిడ్డ కొచ్చిన ఆపదా అన్నీ దయ్యాల మాదిరి జడలు విరబోసుకొని కనిపించసాగినాయి. బాధతో వేదనతో పైకి లేచినాడు మల్లన్న. అతని కాళ్లు చీకట్లో పొలమంతా తిరిగినాయి.

తెల్లవారి పొద్దు బారెడెక్కింది. కళ్లం నిండా మనుషులు చుట్టుకున్నారు. గుప్పు మంటున్న పురుగుల మందు వాసన భరించలేక అందరూ ముక్కులకు గుడ్డలు అడ్డం పెట్టుకొని చూస్తున్నారు. మల్లన్న ఒక్కడు మాత్రమే ముక్కులకు ఏమీ అడ్డం పెట్టుకోకుండా కనుగుడ్లు తేలవేసి ఆకాశం వైపు రెప్ప వాల్చకుండా చూస్తూ కళ్లంలో పండుకున్నాడు. పొలంలో గాలి దిక్కులేనిదై రోదిస్తూ వుంది. మట్టి దిగులుగా బిక్కమొగం వేసుకొని తెగిపోయిన బంధం కొసం నిశ్శబ్దంగా ఏడుస్తూ వుంది.

●

కవిత

కల్పనా రెంటాల

# ఎవ్వరేవీవు?



నేనొక వరూధినిని!
భీతహరిణేక్షణను! తిరస్కృతను!
వలచిన నేరానికి
దగాపడ్డ వెలయాలిని!
హిమవత్పర్వతసాక్షిగా
దక్కింది నిర్నిద్రవేదనే!
వలచివచ్చిన వనితల్ని
మోసగించే మాయా ప్రవరుల వారసులే మనువులు!

నేనొక శకుంతలని! శాపగ్రస్థని!
ఓ మగవాడి అవ్యక్త స్మృతిని!
నేను మినహా అన్నీ గుర్తున్న అతను
అతను వినా మరేమీ గుర్తు లేని నేను!

ఇద్దరి నిరవధిక సుఖవారాశికి
మనఃప్రకృతే మౌనసాక్షి!

అభిజ్ఞానం తప్ప మగని ఆదరణ పొందలేని దాన్ని!

నేను పంచభర్తృక ద్రౌపదిని!
అర్జునుడ్ని వలచి అయిదు ముక్కలైన దాన్ని!
మగవాడి మాయాజూదంలో ఓ పణాన్ని!
నిండు కొలువులో నిలవెత్తు పరాభవం!
ఇల్లాలితనమే లేదన్న ధర్మసూనుడు!

పంతుల కాపురానికి మిగిలింది
జీవన నటనావిషాదం!

నేను యయాతి పుత్రికను! మాధవిని!
దురహంకార పురుషజాతి ఆస్తిని!
నియోగినిని! నిలువెత్తు సౌందర్యరాశిని!
నలుగురితో సంసారం
నాకు మాత్రం నగుబాటు కాదట!
నాది క్షాత్రధర్మమట!
నాలుగు పసిమొక్కల క్షేత్ర ధర్మమట!
నిత్య యౌవన కన్యనట!
అకటా!

మగువ మనసు తెలియని వీరా
మహరాజులు! మహర్షులు! మగవారు!

కనుదోయిపై కలల నీలినీడలు
కాలం చెప్పిన కథల్లో
అందరూ దుఃఖభాగినులే!
ఈ స్త్రీ పర్వమంతా దుఃఖస్మృతుల దొంతర!

ఇప్పుడు నేను మానవిని!
అవ్యక్తను పరిత్యక్తను కాను!
అయోనిజనో, అహల్యనో కాబోను!
వంచిత శకుంతల వారసురాలిని అసలే కాను!
స్త్రీత్వపు కొలమానంగానే మిగలనింక!
నేను అపరాజితను!
కనిపించని సంకెళ్ళను ఛేదించే కాళిని!
సస్యక్షేత్రాన్నే కాదు యుద్ధ క్షేత్రాన్ని!

సిగ్గుతో చీలిపోయిన భూమినీ నేనే.
నెర్రెలు విచ్చిన నేలని విశాలమైన బాహువుల్తో కప్పే
ఆకాశాన్నీ నేనే!

గద్దర్

# నీ కొచ్చిన భాషలో రాయి నీ విముక్తి కోసం రాయి



**సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మా, అంటూ మీ అమ్మ పేరు మీద రాసినదే మీ మొదటి పాట కదా.. దానికి ముందు నేపథ్యం ఏమిటి?మీరు పాటగాడు కావడం ఎలా జరిగింది?**

మాది ఇక్కడికి దగ్గరే మెదక్ డిస్ట్రిక్ట్ తూప్రాను. నేను చిన్నప్పటి నుంచే పాటలు పాడేది.కట్టేది. ముఖ్యంగా మా అమ్మ జానపద పాటలు సానా బాగా పాడేది. వాటిల్ల సానా అర్థముండేది. అమ్మ వ్యవసాయ కూలీ. ఫాదర్ కాంట్రాక్టలు చేసేది.తను ప్రొగ్రెసివ్. కాంట్రాక్టుల కోసం మహారాష్ట్రలో ఔరంగాబాదు అదంతా పోయేటోడు .అక్కడే అంబేద్కర్ వంటి వాళ్లను గురించి తెలుసుకుని వచ్చాడు. అంబేద్కర్ ఉద్యమం ఆయనను బాగా ఇన్ఫ్లూయెన్స్ చేసింది.మరాటీ, ఇంగ్లీషు, హిందీ నేర్చుకున్నాడు.మనం బాగాచదువుకోవాల్నేనేటోడు.అందుకే మమ్మల్ని చదివించాడు. మా ప్రాంతంలో హెచ్ఎస్సి పూర్తి చేసిన ఫస్టు ఎస్.సిని నేనే. సరే. మా నాయన మొబిలిటీ వల్ల,చైతన్యం పెంచుకున్నాడు. మా అక్కలను కూడ ఉద్యోగాలు చేసేటోళ్లకే ఇచ్చి పెళ్లి చేసినాడు. సబ్‌కాస్ట్ తేడాలు పాటించేటోడు కాదు.ఒకసారి ఎద్దును వండిపెట్టాడు. అలా చేసినందుకు తనను శిక్ష వేసి ఇల్లు గుంజుకున్నారు.అయినా భరించినాడు గాని తలవంచలేదు.నైట్ స్కూల్‌నడిపేది. రాత్రిపూట దీపం జ్యోతి పరంబ్రహ్మం అని పాడించేవాడు. నేను హెచ్ఎస్సికి వచ్చే సరికి మా నాన్న చనిపోయినాడు.అమ్మనే పెంచింది. అక్కడ జీవితమే నాకు అన్ని నేర్పించింది.

నేను ఎక్కువ మా అమ్మ దగ్గర్నే పెరిగిన. చదువు కుంటూనే కూలి పనికి పోయేటోన్ని. అప్పుడే ఈ పల్లెటూరి పాటలు పాడుతుంటి.అయితే చదువులో కూడా నేను బాగనే వుంటుంటి.నేను నాలుగు అయిదు తరగతులు చదువుతున్నప్పుడే పై క్లాసుల వాళ్లకు చెప్పేటోడ్ని. చదువులో మరీ ఫస్టు కాదు కాని వున్నంతలో టాప్‌లో వుండేటోణ్ని. అంతకంటే పాటలు, ఆటలలో మాత్రం బెస్ట్ అనిపించుకున్న. పంద్రా ఆగష్టు వంటివి వచ్చినపుడల్లా నేను జానపద పాటలు, దేశభక్తి గీతాలు పాడేది. స్కూల్లో వున్నప్పుడే బుర్రకథ చెప్పడం నేర్చుకున్నా. అప్పుడేమి తెల్సు- టీచర్లేమి చెప్తే అది చెప్పేటోళ్లం. హెచ్ఎస్సికి వచ్చే సరికి చాలా పేరు వచ్చేసింది. ఎస్టాబ్లిష్ అయిపోయాను.అల్లూరి సీతారామరాజు ఫాన్సీ డ్రస్ వేయడం,బుర్రకథ, వాలీబాల్, జానపద కళలు అన్ని చేసేటోణ్ని. నాకు అది చాలా రిచ్ లైఫ్ కళాత్మకంగా. హాస్టల్‌లో వుండేవాణ్ని. కూలీకి పోతుండేటోన్ని.

స్కూల్లో పాటలేమో వేరే వుండేది. నాకు అమ్మ పాడే పల్లె పాటలే బాగనిపించేది. స్కూలుకు పోతేనేమో జైజై భారత జాతీయాభ్యు యానందోత్సవ శుభ సమయం.. ఇలాటివి నేర్పించేవాళ్లు.

.............✧.............

నేను పాట రాయను. ఏ విషయమైన అనుకుంటే అల్లుకపోత, నీ మాటలో నీ గురించి నీ విముక్తి కోసం నువ్వు రానుకోవాలె. ఎవరి కోనం నిరీక్షించకు. వచ్చిన భాషలో రాయి. పాటలో జానపద బాణీలు తీసుకుని రాయడం. బుర్రకథ వుండేది అంతకు ముందు. నాజర్ దాన్ని జనానికి దగ్గరగా తెచ్చాడు. నేను వచ్చి ఇంకా మార్చాను. గ్రామాల్లోకి ప్రజల దగ్గరికి వెళ్లడం వల్లనే ఇదంతా జరిగింది. వారికి అర్థమయ్యే విధంగా పెద్ద పెద్ద విషయాలను మలచి రాశాను. ప్రతి దాన్ని పాట కట్టాను. ఇప్పటికి 35 క్యాసెట్లు తీశారు. 3000 పాటలు రాశాను. చాలా పావులర్ అయ్యాయి. నా పాటలు జనానికి ఎంత ఇష్టమో తెలియాలంటే నాతో రావాలె.

.............✧.............

• ప్రజాగాయకుడు

అవి కూడా పట్టి పాడేవాణ్ని

 రు ఏక సంథాగ్రాహి అన్న మాట...

క్రియేటివిటి ఎక్కువగానే వుండేది. నేను స్కూలు డేస్‌లోనే ఫేమసై పోయిన. చుట్టుపక్కల జిల్లాలలో కూడా మా దళం పాటలు, బుర్రకథలు బాగా తెలిసేవి. పౌరసంబంధాల శాఖ వంటి గవర్నమెంటు డిపార్టుమెంట్లు పెట్టే పోటీలన్నిటిలో మాకు బహుమానాలు వచ్చేటివి.తూప్రాన్‌లో వున్నప్పుడు శేషారెడ్డి అని మా టీచర్. ఆర్య సమాజీకుడు. నాకు బాగా ఎంకరేజ్‌మెంట్ ఇచ్చేటోడు. నేనే మా తాలూకాలో మెదటి ఎస్.సి హెచ్ఎస్‌సి అందుకే నాకు సన్మానం కూడా చేసిండ్రు.

నాకు మా అమ్మ నుంచి మానవత్వం వచ్చింది. ఫాదర్ నుంచి లిబరలిజం ఆలోచించే చైతన్యం పట్టుబడినాయి. అసలైన హ్యూమనిజం వుండేది కమ్యూనిజంలోనే కదా. కొంత మంది అనుకుంటారు - కమ్యూనిస్టులు తగలబెట్టుడు, చంపుడు ఇదే అని.కాని కాదు. మా ఇంట్లో పిల్లి పిల్లల బెట్టింది. రాత్రి అది వచ్చేసరికి వంటింటి తలుపు వేసుంది.

 లం కారణంగా ఏమైనా వివక్షత ఎదుర్కొన్నారా?

పెద్దగా లేదు. నేను కళల్లో డామినేట్ చేసేటోణ్ని గన్క ఏమనే టోళ్లు కాదు. అయినా అస్సలు లేదని కాదు. మా నాయన కావాలని మాకందరికి మంచి పేర్లు పెట్టిండు. విఠల్ రావు అని నాకు పేరు పెడితే మా సారు నీకు రావెందుకురా అంటూ గుండు సున్న చుట్టేది. మోహన్ రెడ్డి నాకు సానా మంచి దోస్తు. వాళ్లింట్ల పెళ్లయితే పెద్దవాళ్లు నాకు కొట్టంల కూచోబెట్టి అన్నం పెట్టిండ్రు. రాను రాను ఆ బెరియర్(అడ్డుగోడ) పోయింది.మానాన్న శేషయ్య మేస్త్రీ కాబట్టి కొంచెం సామాజిక హోదా వుండేది.నాకు పేరెంటల్ ఇన్సిపిరేషన్ ఎక్కువ. కాని కొన్ని విషయాల్లో ఏం చేయలేము.ఎబి సుంగర శాస్త్రి నా ఫ్రెండు.అన్నంపెడతానంటే ముసలిది వద్దంటుండె. కోమటి శంకర్ మరో దోస్తు. వాళ్ల కొట్లో పెప్పరమెంట్లు తెచ్చేటోడు.చిన్న చిన్న దొంగతనాలు(నవ్వు) నేను లెక్కల్లో చాలా బ్రిలియంట్. నేను చూపిచ్చక పోతే కొంతమందికి జరగదు.అట్లకూడా వూరుకుండేటోళ్లు.

సమాజం అవసరాలే వివక్షత పోగొట్టాయి. ఒక్క ఎగ్జాంపుల్.శివుడి గుడి దగ్గర ఫంక్షన్‌లో నేను బఫూన్‌గాడి వేషమేసేది.దేవుడి గద్దె మీద స్టేజి. నేను అక్కడికి రాగుడ్దని కొంత మంది లొల్లి చేసిండ్రు. అయితే వేషం ఏసే టోడు రాకుంటే ఎట్ల కుదురతదని ఇంకొందరు వాదించిండ్రు. ఎట్లయినా గాని నేను గద్దె మీదనే వేషం ఆడిన.

అదంతా అప్పట్లోనే. ఇప్పుడు నన్ను చూసి మా వూరంతా గర్వపడుతుంటుంది.ఆ మధ్యన దాడి తర్వాత వూరికి పోతే అందరూ వచ్చిండ్రు.మా పిల్లగాడు ఇంత పెద్దోడైనాడని ఒకటే మెచ్చుకున్నరు.భూస్వాములు కూడా. అదో అభిమానం అంతే. అయితే మా అమ్మ అట్లగాదు. నేను యుజిలో నుంచి వచ్చిన తర్వాత నిజాం కాలేజీల పెద్ద సభ జరిగింది. ఫోటోలు అన్ని పేపర్లల్ల వచ్చినయి.అవి తీస్కపోయి అమ్మకు చూపెడ్తె ఎమొస్తది ఇవి కడుడక్క తాగనీకనా అనిందంట.నేను చదువుకుని ఉద్యోగం చేయలేదని ఆమె బాధ. తర్వాత మళ్లీ గుర్తించిందనుకో. నాకు మా అమ్మ నుంచి మానవత్వం వచ్చింది. ఫాదర్ నుంచి లిబరలిజం ఆలోచించే చైతన్యం పట్టుబడినాయి. అసలైన హ్యూమనిజం వుండేది కమ్యూనిజంలోనే కదా. కొంత మంది అనుకుంటారు - కమ్యూనిస్టులు తగలబెట్టుడు, చంపుడు ఇదే అని.కాని కాదు. మా ఇంట్లో పిల్లి పిల్లల బెట్టింది. రాత్రి అది వచ్చేసరికి వంటింటి తలుపు వేసుంది. ఇక లోపలికి రాలేక గొల చేస్తుంటే నాకు మెళకువ వచ్చి వెళ్లి తలుపు తీస్తే దాని సంతోషం ఏం చెప్పాలె? అప్పుడే నా భార్యను లేపి చెప్పిన. మా ఇంట్ల కుక్క నామీద కాల్పులు జరిగిన తర్వాత నాలుగు రోజులు తిండి తినలా.మేము పెంచిన కోడిని తినడానికి కొయ్యం.ఎవరికైనా ఇచ్చేస్తాం. దాండ్లన్నిటి మీద పాటలు రాసిన.

అంతర్గతంగా వుండే శక్తి మనిషిని కళాకారుడిని చేస్తుంది. ప్రతి మనిషీ కళాకారుడే. ప్రతిది కళారూపమే. అయితే ఒకానొక సామాజిక పరిస్థితిలో కళ బయటపడుతుంది.అలాగే నాలోవున్న కళ ఒక సామాజిక లక్ష్యంతో బయటకొచ్చింది.

 దెలా జరిగింది?

మా వూర్లో వున్నంత వరకు నాకు కమ్యూనిస్టు పార్టీ గురించి ఏమీ తెలియదు. పాటలు మాత్రం వినేది. చెయ్యి గుర్తుకే మీ ఓటు అని పాత పాటలు పాడుతుంటే వినేటోడ్ని.మా ఏరియాలో పార్టీ ఎంపిగా చేసిన కిషనయ్య బాగా తెలుసు. ఆయన కేవల్ కిషన్. ఆరుట్ల రామచంద్రారెడ్డి పోటి చేసిండు.అప్పట్ల పార్టీ పిడిఎఫ్ పేరిట పోటీ చేసింది.దాని గుర్తు చెయ్యి. అందకనే ఎద్దును గట్టేది చెయ్యి, నాగలిపట్టేది చెయ్యి అని పాడితే విటుండే వాణ్ని. కాని మా ప్రాంతంలో పార్టీ అంతగా వుండేది కాదు.పైగా మా నాయన అంబేద్కర్ ఫాలోయర్ గనక కమ్యూనిస్టులంటే కొంచెం విముఖంగా వుండేది. హెచ్ఎస్‌సి వరకు చదువుకోవాలనే తప్ప పాటలు రాయలా.ఇమిటేషన్ చేసే పాటలు మాత్రం రాసేవాణ్ని. యాసిఫైల్ యాల్‌ఖుదా అని ముస్లిములు చేసే ప్రార్థన అచ్చం వాళ్లలాగే పాడేది.ఆ స్టైల్లో వేరే కూడా రాసేటోడ్ని.అంటే రాయడం అలవాటైంది కాని ప్రొగ్రెసివ్‌గా రాయడం లేదు.1960 నుంచి 66 వరకు బుర్రకథ టీమ్ నడిపినా చదివినా సాహిత్య దృష్టి లేదు. సోషల్ అవేర్‌నెస్ మాత్రం వుంది కాని సోషలిస్టు అవేర్‌నెస్ రాలేదు.మంచిగ వుండాలె అని మాత్రం అనుకునేది.

1967-69లో సైఫాబాదు కాలేజీలో చదివిన. మా అక్కను వెంకటాపురంలో ఇచ్చారు.పియుసిలో నాకు 77పర్సెంట్ వచ్చింది.మెరిట్ స్టూడెంట్‌గా ఉస్మానియా ఇంజనీరింగ్ కాలేజీలో సీటు తెచ్చుకున్న. మొజాంజాహి మార్కెట్ ఎస్‌సి హాస్టల్‌లో వుండేటోన్ని.రోజూ నడిచి పోయి నడిచి వచ్చేది.పాటలు పాడడం లేదు.రాయడం లేదు. క్రియేటివిటి చచ్చిపోయినట్టనిపించింది.లెక్కలు చేసే వాణ్ని.నికృష్టమైన బతుకు గడిపాను. సాయింత్రం ఒక హొటల్‌లో సర్వర్‌గా పని చేసేది. డిల్లీ దర్బార్ హోటల్. పావలా ఇచ్చేవాళ్లు రోజుకు.అది నా ఖర్చులకు.

ఇంజనీరింగ్‌లో చివరి బెంచిలో కుచునే వాణ్ని. రాగింగ్. ఇంగ్లీషు రాదనే ఫీలింగు. మొత్తంపైన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుకు బాగా గురైన కేశవరావు జాదవ్ అప్పుడు మా లెక్కరర్. ఆ నాటి నా జీవితం పాటలల్లో కనపడుతుంది. ఆ విధంగా క్రియేటివిటీ పూర్తిగా అదృశ్యమై పోయినట్టనిపించింది.

 ర్వాత..

వెంకటాపురంలో వున్నప్పుడే బి.నరసింగరావుతో పరిచయ మైంది.వాళ్లు ఇక్కడ పెద్ద దొరలు. మిద్దె పైకెక్కితే కనిపించే భూమంతా వాళ్లదే నన్నట్టు. ఆయన ఆర్ట్ లవర్స్ అసోసియేషన్ నడిపేది. దాంట్లో చేరినం.అప్పుడు బాపూజీ బుర్రకథ దళం పెట్టి కుటుంబ నియంత్రణ కథలు చెప్పి గవర్నమెంటు దగ్గర 75 రూపాయలు తీసుకునేవాళ్లం(నవ్వు) కుటుంబ నియంత్రణ కథలో కూడా పేదరికం గురించి చెప్పేవాణ్ని. బిచ్చగాని పాత్ర ఒకటి అందరికి నచ్చేది. తర్వాత అంబేద్కర్ కథ మొదలు పెట్టాం. ట్యూన్స్ పాపులర్‌గా వుండేవి తీసుకునే వాన్ని. "శాంభవి రావే..." ఇలాంటి పాటలకు కొత్త కంటెంట్‌తో రాసాను. అలా చెబుతూ వుండగా 1972లో ఆర్ట్ లవర్స్ వారు కథ చెప్పడానికి మమ్ములను పిలిచారు. కళలు దేనికోసం అంటూ నర్సింగరావు అక్కడ క్లాసు చెప్పిన తర్వాత కళలు ప్రజల కోసమని తెలుసుకుని కొత్త మార్గం పట్టాము. అంబేద్కర్ కుల నిర్మూలన పుస్తకం చదివాను. నెమ్మదిగా మార్క్స్ సోషలిజం వరకూ నడిచాము. నరసింగరావు ఆర్ట్ లవర్స్ సంస్థతో సంబంధం నా జీవితంలో టర్నింగ్ పాయింట్ అని చెప్పొచ్చు.

నా కెప్పుడూ ఒక లక్షణం వుంది. ఒకటి మంచిదనుకుంటే రెండోది వదిలిపెట్టేస్త. ఇప్పుడు కూడా అంతే అయింది. నా అభిప్రాయాలు మారగానే చదువుమీద ఇంట్రస్టు పోయింది. పాటలు కట్టడం మొదలు పెట్టిన. ఆపుర రిక్షడో రిక్షంట నేనొస్త అని రాసిన. అందరూ బాగుందన్నరు. దాంట్లో ఒక చోట కల్లు పోయిస్త అని వుంటుంది. అది చూసి కొంతమంది తప్పన్నారు. కాని నర్సింగరావు నన్నే సపోర్టు చేసిండు. జానపద బాణీలతో విప్లవ మెసేజ్ ఇయ్యాలన్నడు. ఆ పాయింటు తెలియగానే అంతా మారిపోయింది. నా పాట వాక్కు కాదు, శక్తి అయిపోయింది. నన్ను కొండపల్లి సీతారామయ్యకు పరిచయం చేశారు. ఆయన క్లాసు సాన సేపు చెప్పిండు. మాటి మాటికి మా కాంగ్రెస్ (మహాసభ)లో తీర్మానం చేసినం అంటుండు. నాకు కోపం వచ్చింది. అంతా చేసింది కాంగ్రెస్ అయితే ఈయన గిట్లంటడేంది అనుకునేది. (నవ్వు) అంతసేపు చెప్పేసరికి నాకు ఇంట్రస్ట్ లేకుండ పోయింది. ఇట్ల చెబితే ఎక్కదు, ప్రజల భాషలో చెప్పాలనుకున్న ఇంక ఇంజనీరింగు మానేసిన పాటల మీదనే పడ్డ. మా ఫాదర్ చెప్పిన కులం పరిధికి మించి చూడటం మొదలుపెట్టిన. వర్గం అవగాహన వచ్చింది. ప్రపంచంలో వుండేది రెండే వర్గాలని, మనిషి చైతన్యవంతుడై చరిత్ర మార్చాడని తెలుసుకున్నాను. అంబేద్కరిజం కొంతవరకు సరిపోతుంది. కాని అది మాత్రమే చాలదు. కె.ఎస్.మమ్ములను గ్రామాలకు పొమ్మన్నడు. పోయినం. అక్కడ ప్రత్యక్షంగా చూసినం. భూస్వామ్య విధానాలకు వ్యతిరేకంగా పోవడం వల్లనే అన్ని అర్థమైనాయి. జానపద కళారూపాలు తీసుకోవాల. వాళ్ల బాణీలు, వాళ్ల భాష కావాల. దున్నే వానికి భూమి వల్లనే విముక్తి కలుగుతుంది. పదిమందికి పని దొరుకుతుంది. రిజర్వేషన్ కొంత వరకే మేలు చేస్తుంద. అంతకంటే ఎక్కువగా క్లాస్ పోలరైజేషన్ జరగాల. నారాయణన్ ఎస్‌సి రాష్ట్రపతి అయ్యిండు. అయితే ఏం ఒరిగింది? కాబట్టి క్లాసు ముఖ్యం. ఇలాంటి అవగాహన నాకు రావడానికి ప్రధాన కారణం నర్సింగరావే. పెద్ద మార్క్సిస్టు బ్రిలియంట్. ఇప్పటి వరకు జననాట్యమండలి రూపశిల్పి ఆయనే. గొప్ప సినిమాలు కూడా తీసిండు.

ఆర్ట్ లవర్స్ అసోసియేషన్ల ఎడ్యుకేట్ అయినంక జననాట్యమండలి దాకా వచ్చాను. ప్రజానాట్యమండలి వారసత్వాన్ని కొనసాగిస్తామని డిక్లరేషన్ చేశాము. అప్పుడే సారస్వత పరిషత్ హాలులో టికెట్ నాటకం పెట్టినం. వీర కుంకుమ వేసినం. ఆర్గనైజర్ నయ్యాను.

> "సిరిమల్లెచెట్టుకింద లచ్చుమమ్మ పాటనే తీసుకోండి చివరలో కొడవల్లు పట్టాలె లచ్చుమమ్మా అంటాను. అది నా ఆకాంక్షే కాని ఆమె భావం కాదు కదా. ఆమె కంత చైతన్యం లేదు. వీడ ఎందుకు దీంట్ల చెయ్యిండ అని ఆ అమ్మ అంటుంటే నేను ఇలా రాస్తే అది వాస్తవికత ఎలా అవుతుంది? మనం పాట దశను ప్రజల చైతన్య స్థాయిని బట్టి పోవాలి. సాహిత్యం అనేది మాస్ ఆర్గనైజేషన్‌కు తోడుగా నిలిచేది కావాలి. మిలిటెన్సీని పెంచాలి.



**పాటల రాయడంలో మీరు పాటించే జాగ్రత్తలు ఏమిటి?**

నేను పాట రాయను. ఏ విషయమైన అనుకుంటే అల్లుకపోత, నీ మాటలో నీ గురించి నీ విముక్తి కోసం నువ్వు రాసుకోవాలె. ఎవరి కోసం నిరీక్షించకు. వచ్చిన భాషలో రాయి. పాటలో జానపద బాణీలు తీసుకుని రాయడం. బుర్రకథ వుండేది అంతకు ముందు. నాజర్ దాన్ని జనానికి దగ్గరగా తెచ్చాడు. నేను వచ్చి ఇంకా మార్చాను. గ్రామాల్లోకి ప్రజల దగ్గరికి వెళ్లడం వల్లనే ఇదంతా జరిగింది. వారికి అర్థమయ్యే విధంగా పెద్ద పెద్ద విషయాలను మలచి రాశాను. ప్రతి దాన్ని పాట కట్టాను. ఇప్పటికి 35 క్యాసెట్లు తీశారు. 3000 పాటలు రాశాను. చాలా పాపులర్ అయ్యాయి. నా పాటలు జనానికి ఎంత ఇష్టమో తెలియాలంటే నాతో రావాలె. బయటకు పోతే చాలు. రిక్షావాడు వస్తాడు, తాగుబోతు వస్తాడు తన మీద పాట పాడమని. అన్నిటి మీద పాడేస్త. మార్క్సిస్టు సూత్రాల్లో పాయింట్లను పాటకట్టిన. ఇంటలిజెంట్‌గా వుండాలి. ఎవరికి ఏం చేప్పే ఎలా చెప్తే ఎక్కుతుందో ఆలోచించాలి. రిక్షా తొక్కే రహిమన్న, ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలో నిరుద్యోగులు, ఏజిబారై పోయిందా అంటూ పాడితే ఎక్కుతుంది. కవాలి ట్రూపు రాగాన్ని వాడి రాసినం. ఒగ్గుకథ రాసినం. ఇలా ఏది అవసరమైతే ఏది అనుకూలమైతే దాన్ని ఉపయోగించుకోవాలి. క్వాలిటేటివ్‌గా చూడాలి. జనంలోకి వెళ్లాలి. ఎవరిని అస్పృశ్యులుగా చూడకూడదు.

భాష కూడా జాగ్రత్త తీసుకోవాలి. సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మా, అన్నాక సితో కలిసే పదాలు, రితో కలిసే పదాలు ఇలా ఎంచుకోవాలి. అప్పుడు వినడానికి ఇంపుగా వుంటుంది. సిరి, సిగ, సింగ, సిత్ర ఇలా అన్నమాట. రిల్లి, రింగ కూడా అంతే. అంటే సింప్లిపై చేయాల. భాష పదాలలో ఒక దాన్నించి మరో దానికి పోవడానికి కావలసినట్టు వుండాలి. ఒక భావాన్ని పాటగా చేయాలంటే ఏం చేయాలనే దానిపై క్లాసు పెట్టి చెప్పాలి. ఏదైనా తేలిగ్గా అర్థమయ్యేలా వుండాలి. నేను అక్షరాస్యతపైన కూడా పాటలు రాశాను.

123456789<br>
వీటినే అంకెలంటరండి,<br>
వీటితోనే సంఖ్యలవుతయండి అని పాడాము.

బ్రహ్మాండంగా అర్థమైంది. వేసి చూపిస్తాను. మరి అన్నమాచార్యులు అన్ని వేల సంకీర్తనలు రాశాడంటే ఎంత సాధన వుండాలి, ఎంత సింపుల్‌గా చెప్పాలి. మా క్లాసులు పెట్టి చెబుతున్న. పోతన గురించి, వేమన గురించి అన్ని చెబుతం.అయితే కొన్ని చెప్పడానికి కుదరనివి బొమ్మల ద్వారా చెప్తాం.

జా జీవితంలో కవి కళా కారుని పాత్ర ఎలా చూస్తారు?**

కవులు కళాకారులు కాగితాల్లాంటివాళ్లం. మా మీద చైతన్యం అనే అగ్గివడితే అంటుకుంటాం. ఆ నిప్పు పెద్ద మంట అవుతుంది. అందుకనే నేను అగ్గిపుల్ల మీద పాట కట్టిన.



**పాటలు కట్టడం మొదలు పెట్టిన. అపుర రికర్డో రిక్షంట నేనొస్త అని రాసిన. అందరూ బాగుందన్నరు. దాంట్లో ఒక చోట కల్లు పోయిస్త అని వుంటుంది. అది చూసి కొంతమంది తప్పన్నారు. కాని నర్సింగరావు నన్నే సపోర్టు చేసిండు. జానపద బాణీలతో విప్లవ మెసేజ్ ఇయనలన్నడు. ఆ పాయింటు తెలియగానే అంతా మారిపోయింది. నా పాట వాక్కు కాదు, శక్తి అయిపోయింది.**



కవులకు కళాకారులను సోషలిస్టు చైతన్యం వుండాలి గాని సెక్టేరియనిజం పనికిరాదు. చరిత్ర నుంచి నేర్చుకోవాలి. ప్రాపగాండా టీమ్‌గా మారినవుడు ప్రజలకు ఏదీ ఎంత వరకు అర్థమవుతుందనే ఆలోచన చేయాలి. అవసరమైనప్పుడు ఆత్మవిమర్శ చేసుకోవాలి. అలా చేసుకునేది నిజమైన కళ. సాహిత్యానికి సామాజిక ప్రయోజనం వుండాలి. అనేక ధోరణులను ఇముడ్చుకొని వైవిధ్యాన్ని చూపెట్టాలి. అనేక సమస్యలు తీసుకోవాలి. అందుకు తగిన రూపాన్ని ఎన్నుకోవాలి. సాహిత్యమే డిసైడింగ్ కాదు. అది సహాయపడుతుంది అంతే. నా పాటలను వెనక్కు తిరిగి చూసుకున్నప్పుడు ఈ లోపాలన్ని కనిపిస్తాయి.

సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మ పాటనే తీసుకోండి. చివరలో కొడవల్లు పట్టాలె లచ్చుమమ్మ అంటాను. అది నా ఆకాంక్షే కాని ఆమె భావం కాదు కదా. ఆమె కంత చైతన్యం లేదు. వీడు ఎందుకు దీంట్ల పోయిండు అని ఆ అమ్మ అంటుంటే నేను ఇలా రాస్తే అది వాస్తవికత ఎట్లా అవుతుంది? మనం పోరాట దశను ప్రజల చైతన్య స్థాయిని బట్టి పోవాలి. సాహిత్యం అనేది మాస్ ఆర్గనైజేషన్‌కు తోడుగా నిలిచేది కావాలి. మిలిటెన్సీని పెంచాలి. కత్తులు దూసుకుపోయినా నెత్తురు టేరులు పారినా పాట వుందనుకోండి. నేను దాన్ని సానా రకాలుగా పాడత. (విరిచి చూపించాడు) ఇదంతా ఎందుకంటే ప్రజలను ఆకర్షించడానికి చైతన్యం పెంచడానికి, బాంబుల వర్షం కురిసినా ఎత్తిన జండా దించకోయ్ అని పాడితే ఎట్లుంటుంది? ఇప్పుడు ఫ్యాక్టరీలు మూతపడుతుంటే ఆ కార్మికుల దగ్గరికి పోయి పాడితే చూడాలి రెస్పాన్సు. అయినా మనం ప్రజల్లో సానా పనిచేసినా చివరకు ఓట్లు రావడం లేదు. మొన్న సిపిఎం సభలో సీతారాం ఏచూరి చెప్పిన మాట నిజం. మనకు ఓట్లు పడ్తలేవు. కరీంనగర్ నక్సలైట్ ఏరియా అంటారు. అక్కడ విద్యాసాగర రావు గెలుస్తడు. ఇదేం విచిత్రం? మనం ఆలోచించాలి. అందుకే సానా దళాలు తయారు చేసి సాంస్కృతిక సైన్యంగా అడవులలోకి పంపాలనుకుంటున్నాం. వీళ్లు కేవలం కళాకారులు కాదు. సైనికులు, కల్చరల్ ఆర్మీ అన్నట్టు. సెకండరీ ఫోర్స్‌గ వుంటరు. యుద్ధంలో ఓడిపోయినపుడు ఉత్సాహమిస్తారు. సెంట్రీపని చేస్తారు. అవసరమైతే తుపాకి పట్టి పోట్లాడ్తరు. కళాకారులను సాంస్కృతిక సైన్యం అన్నారే గాని విద్యార్థులను యువకులను అనలేదు కదా. కళాకారుడు పార్టీకి తోడుంటాడు. కాని సృజనాత్మకతలో వాడికి స్వేచ్ఛ వుండాలి. విధానం పార్టీ విధానమే. కాని ఎలా వ్యక్తీకరించి చెప్పాలనే విషయంలో మాత్రం స్వేచ్ఛ ఇవ్వాలె. విధానం తప్పుగా రాస్తే సభ్యత్వం తీసెయ్. కాని కళాకారుని సృజనశీలతను మాత్రం అరికట్టకు.

గోర్కి, నాజర్, గద్దర్ ఎవరైనా చేసిందదే. ఎందుకు సస్పెండ్ చేస్తారు? సినిమాల పాట పాడిన్ననా? ఇంతకుముందు కూడా రాయలేదా? మా భూమిల పాడలేదా? కనుక ఇది రాజకీయమైన చర్య. కవులు కళాకారుల పరిస్థితి వేరుగా వుంటుంది. ఒక్కపాటలోనే మొత్తం పార్టీ ప్రోగ్రాం ఇవ్వాల్నా?

సాహిత్యం కళలు వాస్తవాలు చెప్పాలి. భిన్నంగా చెప్పాలి. ఇది ఎలా వుండాలి. ఇందుకు సంబంధించిన సిద్ధాంత విషయాలేమిటి, అనుభవాలేమిటి అనే దానిపై సాన చర్చ జరగాల. కమ్యూనిస్టు సిద్ధాంతం ఎలా చూడాలి? ఒక కవి సరిగ్గా అర్థం చేసుకున్నాడా లేదా చూడాలి. చేసుకోకపోతే చెప్పాలి. ఆయుధం పట్టుకో అంటే బాగానే వుంటుంది. కాని ప్రజల్లో ఆ పరిస్థితి వుందా లేదా దశ కరెక్టాకాదా పరిశీలించాలి.

**అయితే ఈ దశలో కళాకారుల సాహిత్యకారులు కర్తవ్యాన్ని గురించి మీరేమనుకుంటున్నారు?**

యుద్ధంలో వున్న వారిని చైతన్యవంతం చెయ్యాల. ప్రోత్సాహమియ్యాలి. ఇవాల సామ్రాజ్యవాద వ్యతిరేక విశాల వేదిక కావాలి.సామ్రాజ్య వాదాన్ని కూల్చడానికి కవి పనిచేయాల. దాన్ని సాయుధంగానే కూల్చేయాల. అంటే ప్రజలను మెంటల్‌గా ఆర్మ్ (మానసికంగా సాయుధం) చేయాలి. సెప్టెంబర్ 11 తర్వాత ప్రజలకు మరేమి మిగల్లేదు. సాయుధం అంటే తుపాకులు పట్టుకోవాలనే కాదు. పోరాటం చేయాలనే దృష్టి పెరగాలి. విద్యుదుద్యమం తీసుకోండి. అలాటివి రావాలి. నేను ఆగస్టు 28 ప్రదర్శన రోజున వెళ్లాను. ముందున్న రాఘవులు గారు నన్ను వెనక్కు పొమ్మన్నడు. మేం నీతో మరో ప్రయోగం చేయలేము అన్నాడు. నాకర్థమైంది. ఇప్పటికే హత్యాప్రయత్నం నుంచి బయటపడ్డారు. ఈ జనంలో శత్రువేమిచేస్తాడో తెలియదు అని ఆయన ఆందోళన పడుతున్నాడని తెలుసుకుని వెనక్కపోయిన. బ్యాటిల్ జరుగుతున్నప్పుడు నేనక్కన్నే వున్న. 18 రౌండ్లు కాల్చింండ్రు. రెండవ బ్యాచిలో నేనున్న. నేలపైన పండుకున్న. సిపిఎం పార్టీ ఈనాడు తీసుకున్న లైను ఎందుకని ప్రజలల్లో గుర్తింపు పొందుతుంది? ఆ పార్టీ ప్రజలను రోడ్డు మీదకు తీసుకొచ్చి పోరాడమంటుంది కనుకనే. అరెస్టు కాకుండా పోలీసులతో కుస్తీ పట్టమంటుంది. అందుకనే గుర్తింపు వచ్చింది. లక్షలాది మంది అలా వచ్చినపుడు రాజకీయ మార్పులు కలుగుతాయి. కవులు అందుకు సహాయపడాలి.

స్తుతం మీ కార్యక్రమం ఏమిటి?

ఈ పీరియడ్‌ల పాటను బాగా పాపులర్ చేసిన, ప్రజల దగ్గరకు తీసుకెళ్లడానికి ప్రతి వేదికను ఉపయోగించిన ఎర్రజండను ప్రజల దగ్గరకు తీసకపోవడం నా లక్ష్యం. దానికి ఏ మార్గాలు పనికి వచ్చినా వాడుకుంట. నా పాటలు ప్రజలకు నచ్చడానికి కారణం అవి వాళ్లకు దగ్గరగా వుండటమే. స్వామి అయ్యప్పలు కూడా మన బాణీలు తీసుకుంటున్నారంటే అంతేకద. మారిన పరిస్థితులలో దీన్ని ఎలా వాడుకోవాలి. ఎలా మలుచుకోవాలి అనే ప్రశ్న.

నాకు అన్నిటిలో పాట కనిపిస్తుంది. పాట కట్టాలనిపిస్తుంది. ఫ్యాను మీద రాసిన దాంట్లో ఫ్యానెట్ల తిరుగుతుందో దోమలను తరివేస్తుందో, పిల్లలను జోలపుచ్చుతుందో అన్ని రాసిన

తర్వాత..."గుడిసెలో తిరిగె రోజువరకు - నడుచుకుంట పోతుంది" అని ఫినిష్ చేసిన. ఈ థీమ్‌లో సోషల్‌గా చెప్పగలిగింది అది. కాని పీపుల్స్ వార్ ప్రోగ్రాం దాంట్లో లేదంటే నేనేం చేస్తాను? అన్ని ఒకటే విధంగా రాస్తామా? అది కరెక్టా?

**కొత్తగా రాసే వాళ్లకు మీరేం చెప్తారు?**

పాట ఎప్పుడూ రాజ్యాన్ని ప్రశ్నించాలి. సాహిత్యం రాజ్యాన్ని ప్రశ్నిస్తుందా లేదా అని చూస్తాను నేను. ప్రజలు మనం చెప్పేదే కాదు, చేసేదీ చూస్తారు. చెప్పేదాంట్ల కొంతైనా చేయాలి. నూరు చెబితే పదైనా చేయాలి. అందకే నేను యుజిలోకి పోయాను. అన్ని ఎదుర్కొన్న ఎన్నో పోగొట్టుకున్న ఈ మధ్య లండన్‌నుంచి ఏదో సంస్థ పరిశోధన జరిపి బతికున్న వాళ్లలో ఇంత ప్రజాదరణ గల కళాకారుడు లేదన్నట్లు చెప్పింది. నా మీద కాల్పులు జరిగిన తర్వాత ఆరోగ్య పరిస్థితిల మార్పు వచ్చింది. బుల్లెట్ లోపల వుండిపోయింది కదా ( ఆ తుటాల గాయాలు, ఆపరేషన్ గుర్తులు చూపారు) గొంతు కొంచెం కొంచెంగా తగ్గిపోతుంది.

**బాగానే పాడుతున్నారు కదా?**

లేదు. ఇది వరకట్ల అయితే ఒక రాగం పట్టుకుంటే అట్లనే సాన సేపు సాగతీస్తుంటి. ఇప్పుడు కొంచెం పోతుంది. అయినా ఏదో ఒక దాంట్లో పనిచేయాలని అనుకుంటున్న, చేస్తున్న. ఇప్పటికి చంపేస్తామని సాన బెదిరింపులు వస్తుంటాయి. అయినా నా పద్ధతి నాకుంది. ఇప్పుడు నేను అన్ని వేదికలకు పోత. నాలైను నేను చెప్పుకుంట. ఈ పరిస్థితిని అడ్వాంటేజ్‌గా తీసుకుంటున్నాను. ఇందులో కూడా కిరికిరి వస్తుంటుంది. నేను లక్ష్యపెట్టను. కవి కళాకారుని పరిధిని కుదించడం కాదు. లైను మీద చెక్‌పెట్టు. అంతే, బిబిసి వాడు నాతో ప్రోగ్రాం చేసి వరల్డంతా చూపుతనని సాన సార్లు ఫోన్ చేస్తున్నడు. ఒప్పుకోకుండా తర్జనభర్జనలు చేస్తున్నరు....

**రాజకీయం సరే. రచనా పరంగా కొత్తవాళ్లకు మీ సలహాలు? ఎందుకంటే ఉద్యమ గీతాలు ఒకే రకంగా వుంటాయనే ఫిర్యాదువుంది కదా?**

ఔను, మోనాటనీ కాకుండా జాగ్రత్త పడాలి. చేతులు కాళ్లు శరీరం వున్నాయి కదా ఇవి అద్దంలో చూస్తే ఒక విధంగా కనపడతాయి. అదే ఫొటో తీస్తే మరోవిధంగా వుంటుంది. ఆర్ట్‌వేస్తే ఇంకా మరో విభిన్నంగా వుంటుంది. అదే కళా ప్రక్రియల మధ్య తేడా. అన్నిటికి ఒకే పద్ధతి పనికిరాదు. భూమి సమస్య మనకు కీలకమైంది. అది పరిష్కారమయ్యే వరకు దానిపై పాటలు వస్తూనే వుంటాయి. అయితే చెప్పే టప్పుడు విషయాన్ని అర్థం చేసుకుని చెప్పాలి. సీనియర్లను స్టడీ చేసి నేర్చుకోవలసినవి నేర్చుకోవాలి. పాత దాంట్లో నుంచి తీసుకుని కొత్త సందేశం జోడించాలి. ఓలి ఓలిర ఓలి చెమ్మకేళీల వోలి వుందనుకోండి. పాత తరహా పాటను మనం వాడుకోవడమే కదా. అలా అని ప్రజల తోక పట్టుకుని పోవద్దు. ప్రజల నుంచి నేర్చుకుని వారు నీ వెనక వచ్చే విధంగా రాయి, పాడు, ఆడు అది జరగాల్సింది. ట్యూన్ దొరికింది నేను ఏదో ఒకటి రాసేస్తానని రాయొద్దు. పని గట్టుకుని సాహిత్యం కోసం రాయొద్దు. రూపంలో మార్పు రావాలి. వస్తువు ఒకటే అయినా వైవిధ్యం వుండాలి. మన ముక్కు ఒకటే అయినా ఎన్ని రకాలున్నాయి? అట్లనే కళలో వైవిధ్యముండాలి.

ప్రజల నుంచి నేర్చుకుని వారు నీ వెనక వచ్చే విధంగా రాయి, పాడు, ఆడు అది జరగాల్సింది. ట్యూన్ దొరికింది నేను ఏదో ఒకటి రాసేస్తానని రాయొద్దు. పని గట్టుకుని సాహిత్యం కోసం రాయొద్దు. రూపంలో మార్పు రావాలి. వస్తువు ఒకటే అయినా వైవిధ్యం వుండాలి. మన ముక్కు ఒకటే అయినా ఎన్ని రకాలున్నాయి? అట్లనే కళలో వైవిధ్యముండాలి.


**కేతికంగా వస్తున్న సరికొత్త పరికరాలను ప్రజాకళలో ఎంతవరకు ఇముడ్చుకోవచ్చు?**

మారుతున్న కాలంలో అనేక కొత్త కొత్త పరికరాలు వచ్చాయి. వీటన్నింటిని మనం వాడుకోవాల. ఆనాటి క్లాసికల్ సంగీతం నుంచి ఈనాటికీ బోర్డు వరకు ఏదైనా మనం తీసుకోవచ్చు. మనం చెప్పేది బాగా చెప్పడానికి ఉపయోగించవచ్చు. ఒక నాటకంలో అందరూ చనిపోయే సన్నివేశం వుంది. మా డైలాగుకు ఎంతకూ రెస్పాన్సు రాలేదు. క్లారినెట్ వాడుతూ డైలాగు పెట్టాం. నగనా సాగనా అంటూ విషాదరాగంలో డైలాగులు చెబితే చాలా స్పందన వచ్చింది. కాబట్టి ఎర్రజండా కోసం దేన్నయినా ఉపయోగించవచ్చు. రహమాన్, బాల మురళీకృష్ణ ఎవరైనా మన పాట పాడితే మనకు అంతకంటే కావలసిందేముంటుంది? బాలసుబ్రహ్మణ్యం వచ్చి మన పాటలు పాడతానంటే నేను ఆయన దగ్గర అసిస్టెంటుగా పనిచేయనా? కమ్యూనిస్టులం దేన్నయినా ఉపయోగించుకుంటాం. దేని మీదనైనా పాట కట్టగలను. ముక్కుమీద చెట్టమీద దేనిమీదనైనా మార్క్సిస్టు ప్రపంచ దృక్పధాన్ని చెప్పే పాట రాయొచ్చు. మీరు ఊహించలేరు.


**రు పాట గాదుగా బాగా జయప్రదమయ్యారు కదా, ఈనాడు సాగే పాట గొప్పదా కవిత్వం గొప్పదా వచనం గొప్పదా అని వాదోపవాదాలపై మీ అభిప్రాయం అనుభవం ఏమిటి?**

కమ్యూనిస్టులం, పాట గొప్పది, కవిత్వం తక్కువది అంటూ వైరుధ్యాలు పెట్టడం మంచిది కాదు. ఫిలసాఫికల్‌గా దేని గొప్పతనం దానిదే. దేని పాత్ర దానికి వుంది. ఏదైనా ఒక సామాజిక విషయంలో విశ్లేషణ జనానికి సూటిగా చేరాలంటే మాత్రం కవిత్వం కన్నా నవల కన్నా పాట బాగా పని చేస్తుంది. అయితే వాటికి విలువ లేదనా? కాదు శ్రీశ్రీ నన్ను ఉత్తేజ పరిస్తే నేను లక్ష మందిని ఉత్తేజ పరుస్తాను. నేను ఆయన కవితలకు డాన్సు తయారు చేశాను. శ్రీశ్రీ చెరబండరాజు, జాషువా, గోర్కి నవలలు కధలు కవితలు అన్ని ఎంతమందికో ప్రేరణ ఇచ్చి కదిలించాయి. ఆ రూపం ఎందుకు ఎన్నుకున్నారు. ఏది గొప్ప అనే చర్చల అర్థం లేదు. దేని గొప్ప దానిదే. ఇంట్లో వస్తువులలో ఏది గొప్ప? టేబులు, కుర్చీ, స్టవు, బీరువా, చీపురు కట్ట తక్కువదా? అది లేకుంటే జరుగుతుందా? దాని మీద కూడా పాట రాసిన కథ. కాబట్టి అన్ని సాహిత్య ప్రక్రియలకు వాటి వాటి స్థానం వాటికుంటుంది. అందులో భాష ఎలా వుండాలి. ప్రజల దగ్గరకు ఎలా తీసుకుపోవాలి, ఇందులో సిద్ధాంతం ఎట్ల చెప్పాలి వంటి విషయాలను లోతుగా చర్చించాలి. నేను దీనిపై చాలా నోట్సు తయారు చేయించిన. అయితే ఈ విషయాలను నేను ఇంత లోతుగా ఆలోచిస్తుంటనని చాలా మందికి తెలియదు. మీలాటి వాళ్లంతా విశ్లేషణ చేయాలి.

# చొరబాటు దారుల చిరునామా

కవిత

ఘంటసాల నిర్మల

మనుషుల్ని ముక్కలు చేద్దాం
మనుషుల్ని ముద్దలు చేద్దాం
ఆలోచించే మాంసం ముక్కలుగా ఆలోచించే మైనం ముద్దలుగా చేసి
గీతకి అటూ ఇటూ విసిరి పారేద్దాం
మానస సరోవరాలూ హజ్‌లూ యాత్ర సంరంభాలతో
సార్క్ సమావేశాలూ సౌభ్రాత్ర సంకేతాలూ ఎత్తుగడలు సంబరాలతో
వాటి మానాన అవి విరాజిల్లుతుంటాయి
ఒక ప్రధాని బస్సు వేసాను చూడండహో అంటాడు
ఒక నాయకుడు మీ ఖైదీల్ని గాయాలతోనైనా బట్వాడా చేసాను కానా
అంటాడు
మన కాపరుల్ని నిషేధించాక వాళ్ళ పశువులు బంగారు పంట
ఆరగిస్తుంటాయి
వాళ్ళ వ్యాపారుల్ని రానివ్వకపోయాక మన నల్లబజారు
పచ్చనవుతూంటుంది
అటూ ఇటూ మార్మోగుతున్న సాధికారిక శార్దూల క్రీడా గర్భలో
సామాన్యుల మూలుగుల సద్దే వినపడదు
రాజ్యాల సవాళ్ళూ ప్రతి సవాళ్ళ సందేహంలో రాలిపడే సాదా దేహాలు
అధికార బదిరాంధక నేతల కంటికి ఆనని కేవల క్రిమి సముదాయాలు!

బొట్టు పెట్టిన అమ్మా! పంచె కట్టిన అయ్యా!
మా అఫ్ రోజ్‌లు అఫ్సర్‌లు నమాజ్ వేళకు ఇంటికి చేరలేదు
పొరపాటున పాదం అటు వేసి
విభజన రేఖ విద్యుద్ఘాతానికి మాడి మసి కాలేదు కదా!
బురఖా అంగరఖా తొడిగిన అమ్మలారా అయ్యలారా
కడుపు చలవకి అమ్మకి పెట్టిన చలిమిడి సరిహద్దుల
చిక్కుముళ్ళలో చిడుముడి పాలయి
మా చిన్నారి తండ్రి ఆచూకీ అంతు పట్టనివ్వడం లేదు-
నాయకుల కణకణలాడే వైషమ్యాల సెగ సోకి ఏ ఇనపకంచె వార
సొమ్మ సిల్లాడో!
రెండు దేశాల మధ్య రాకపోకల్ని
రెండు హృదయాల రాగ తంత్రులతో కొన్ని కుటుంబాల ఉప్పనైన
బాంధవ్యంతో తూకం వేసిన
ఘనత వహించిన రాజ్యాధి నేతల్లారా-
ఇక ఇప్పుడు మేమూ చొరబాటు దారుల మవుతామా?
రవాణా సాధనాల్ని నిషేధించి మీరు
పొంగి వచ్చే ప్రేమోద్వేగాల్నీ దిగులు దు: ఖాన్నీ అధికార కరవాలంతో
ఆపబోతారా?

దేశాలు వేరు జాతులు వేరు మతాలు వేరంటూ
మనుషుల్ని చీల్చుతుంది రాజకీయం
హద్దులున్నాయి జాగ్రత్త అని నేతలు హుంకరిస్తారు
మనిషన్న వాడి రక్తపు దారులన్నిటా పరిగెత్తే సహమానవత్వం
అంతర్జాతీయ వేదికలకు పట్టదు
ఆంక్షల అదృశ్య సంకెలల మధ్య
చూపు వాసి దూరానకెదురు బొదురుగా చిక్కు పడిని హృదయాల ఘోష
రాజధానీ నగరాల నాడీ కేంద్రాల్ని తాకనే తాకదు
వాస్తవాధీన రేఖ దిగమింగలేని కఠోర సత్యాలు ఇరు దేశాల పైరుల
వెక్కిళ్ళవుతాయి
ఎటువంటి నిషేధాలూ లేని కన్నవాళ్ళ ఆర్తీ బిడ్డల కన్నీళ్ళూ
మూగబోయిన రైలు పట్టాలకు సమాంతరంగా ప్రవహించే
సింధూగం గలవుతాయి
అణచుకోలేని ఆత్మీయతతో అయినవాళ్ళను ఎలాగైనా సరే
చూడాలనుకున్నవాడు
చొరబాటుదారుడుగా రాజముద్ర పడి లెక్కకు మించి ఖైదీగా ఏళ్ళ
తరబడి ముగ్గుతాడు
సముద్రాల మీంచి మనకు ఆనవాలు చిక్కీ చిక్కని అసలు
చొరబాటుదారు తమాషా చూస్తుంటాడు
-జీ ఎమ్ విత్తనాల పేరుతో
-ప్రపంచీకరణ వంకతో
-పేటెంట్ హక్కుల పేరిట
-డబ్ల్యుటివో నెపం మీద
మన జీవితాల్లోకి క్షణ క్షణం చొరబడుతున్నవాడు
మూడో రాజ్యపు మూడో పాదంగా రెండు దేశాల్లోకీ బహు దిలాసాగా
విస్తరిస్తూంటాడు
కనుగొన్నావా అటు యిటు దేశాల వ్యూహాల్నీ మోహరింపుల్నీ
నిర్దేశిస్తుంటాడు
వాడికి ఆంక్షలు వర్తించవు
వాడి విషయంలో నేరాలూ శిక్షలూ ఏ చట్టాలూ వివరించవు
ప్రపంచ ప్రజానీకానికి విధేయత మప్పే ఆబలో
రెండు దేశాల మధ్య వాణిజ్య చక్రాన్ని నిర్దేశిస్తున్నదే
రవాణా చక్రాన్ని ఆదేశిస్తున్నదీ వాడే!
మన రహదారుల్లో మనల్నే చొరబాటు దారుల్ని చేస్తున్నదీ వాడే!!

కె. అంజన

# 'క్షు.ర' స్వప్నం



క్షుద్రిక కాంతారావు (కె.కె.రావ్) 'మాంచి' కథకుడు! ఒకప్పుడు ఆయనగారి కలానికి ఎదురుండేదికాదు. పేపరుమీద ఏం గోకినా కథయిపోయేది. 'మిట్ట మధ్యాహ్నం పన్నెండింటికి అర్థరాత్రయ్యిందనేవాడు. మనిషికి పిల్లిపిల్ల పుట్టిందనేవాడు. అర్థరాత్రి పూట ఎక్కడినుంచో ఆరేళ్ల పిల్లవాడొచ్చి ఆ పిల్లి కూనతో ఆడుకుంటాడనేవాడు. అయినా జనం ఆహా...ఓహో... అంటూ హారతులు పట్టేవారు....

కె.కె.రావ్ ఇలా క్షుద్ర కథలకే పరిమితం అయితే బాగుండేదేమో! కాని టీనేజీ పిల్లలకోసం టీనేజీ ప్రేమకథలు రాసేవాడు. వాటిని పత్రికాధిపతులు పోటీపడి కొనుగోలు చేసేవాళ్లు. ప్రముఖ క్షుద్ర రచయిత కె.కె.రావ్ కలం నుంచి జాలువారిన గొప్ప టీనేజీ ప్రేమ కథ త్వరలో... అతి త్వరలో తమ పత్రికలో అచ్చుకానుందని ప్రకటించేవారు. అది చదివిన పాఠకులు 'అబ్బో... కె.కె.రావు క్షుద్ర కథలు అదరహో గదా... మరి ఈ టీనేజీ ప్రేమకథలు ఇంకెంత అదరహోనో' అని షాపుల దగ్గర క్యూలు కట్టేవారు. కాపీలు దొరక్కపోతే వినడానికి చెవులు కోసుకునేవారు. అలా ఎన్ని చెవులు తెగిపడ్డాయో కోసుకున్న వారికే తెలియాలి.

మరి కె.కె.రావ్ కథలకోసం జనాలు ఇంత ఇదౌతున్నారంటే వాటిలో ఎంతోకొంత మసాలా వుంటేనేకదా... అప్పట్లో రాసిన ఓ కథ నిజంగా సెన్సేషన్ సృష్టించింది. ... 'ఆరోజు ఓ ఇరవై అయిదేళ్లమ్మాయి బస్సు ఎక్కుతోంది. మరో నలభైయేళ్లబ్బాయి అదే బస్సు దిగుతున్నాడు... అప్పుడు వాళ్ల కళ్లు కళ్లు కలుసుకుంటాయి.అంతే అప్పటికప్పుడు ఆ బస్సు మెట్లమీదే తమ హృదయాలు మార్చుకుంటారు. మాది ఏడేడు జన్మల బంధం... కాకపోతే ఐదు నిమిషాల్లో మాలో ప్రేమ కలగడమేమిటి? అనుకుంటూ... ఇరువురూ ఎకాఎకిన గుళ్లోకెళ్లి పారవశ్యంతో దండలు మార్చుకుంటారు... ఆ తర్వాత ఏదన్నా సినిమా చూసి సెలబ్రేట్ చేసుకోవాలనుకుంటారు... ఏ సినిమా చూడాలన్న దగ్గర ఇద్దరికీ కుదరదు.. అంతే ... ఇద్దరూ చిటికిన వేళ్లు చూయించుకుంటారు. అంటే వారి మధ్య ఐదు నిమిషాల ముందు ఏర్పడిన బంధం అంతటితో బందయిపోతుంది. తొలిచూపుల కలయిక... ప్రేమ...పెళ్లి... అంతా ఐదే ఐదు నిమిషాల్లో జరిగిపోతుంది. ఇది సెన్సేషన సృష్టించిన కె.కె.రావ్ తొలి టీనేజీ ప్రేమ కథ టూకీగా. ఇలా నలభైయేళ్ల హీరోతో టీనేజీ ప్రేమకథ రాయడం ఆంధ్రరాష్ట్రంలోనేకాదు... యావత్ ప్రపంచంలోనే ఒక్క కె.కె.రావ్‌కే చెల్లిందని సెన్సేషన్ పబ్లికేషన్స్ వాళ్లు కొత్త బాటా చెప్పులతో నిలువెత్తు దండ చేయించి సత్కరించారు ఆయనని.

ఖర్మగాలి ఆ క్రేజీ క్షుద్ర కథకుడు ఇప్పుడు మాజీ క్షుద్ర కథకుడయ్యాడు. ఈయనగారి కథలు వినే వాడే కరువయ్యాడు. మొన్నటికి మొన్న ఇంటి ముందు నుంచి వెళుతున్న స్నేహితుడు గణపతిని పిల్చి 'కూల్ డ్రింక్ తాగెళుదువుగాని రా' అన్నాడు. 'అమ్మో మీ ఇంట్లోకి వస్తే కథలు తెస్తావ్.... అదంతా వినే టైమ్ లేదు.... ఓపావుగంటలో టీవీలో మంచి క్షుద్ర, చేతబడి సీరియల్ వస్తుంది. ... ఆ తర్వాత సూపర్ ఏడుపు సీరియల్ వస్తుంది. దీన్ని నాలుగొందల వారాల నుంచి సాగదీస్తున్నారనుకో... అయినా బానే వుంది. చెట్టంత మగాణ్ని నన్నే ఏడిపిస్తోందా సీరియల్ హీరోయిన్.. ఆ తర్వాత అత్తాకోడళ్ల డిష్యుం డిష్యూం సీరియల్ వస్తుంది. రాత్రి పూట... అందరూ నిద్రపోయాక ఎంటీవీ వుండనే వుంది. నా కాల్షీట్లు ఎవ్వరికీ ఇవ్వను...' వస్తానంటూ వెళ్లిపోయాడు. దాంతో వళ్లు మండింది కె.కె.రావ్‌కి.

అసలే శన కథలు ఎవరూ వినడంలేదన్న మంటతో వున్న కె.కె.రావ్‌కి కోపం నషాళానికంటింది. వెంటనే కాయితం కలం తీసుకుని ఓ కథ రాశాడు. ఎలాగైనా దాన్ని ఒక్కరికైనా వినిపించాలని శపథం చేసుకున్నాడు... అంతే ఆ కథ పట్టుకుని బైల్దేరాడు. మొట్టమొదట చిన్న కూతురు చిట్టి ఎదురైంది.. కథ వినిపించడానికి వయస్సుతో నిమిత్తంలేదనుకుని... 'అరే చిట్టీ... నేనొక కథ చెప్తా... వింటావా...' అంటాడు. దానికది 'ఆశ... దోశ... అప్పలం... ఇప్పులు టీవీలో కార్టూన్ సీలియల్ వత్తుంది... నీ బోలి కథ విననుపో...' అంటూ చేతులు తిప్పుకుంటూ వెళ్లిపోతుంది.. తర్వాత టీవీ ముందు నుంచి లేచొస్తున్న పెద్దకొడుకు కనిపించాడు... ఆశగా వాడి దగ్గరకెళ్లి లేటెస్ట్ క్షుద్ర కథ చెప్తా వినమంటాడు. ఎఫ్ చానల్ చూడాలి అస్సలు వీల్లేదంటాడు...

ఇంక భార్యామణి మిగిలింది. కాని తన దగ్గరకొచ్చి కథలూ... కాకరకాయలంటూ అంటూ తలకమాసిన వేషాలేస్తే విడాకులిస్తానంటూ బొడ్లో కాయితాలు పెట్టుకుని తిరుగుతోంది.. సో... అనవసరం... అనుకుని మొన్నే వచ్చిన అమ్మా నాన్నల దగ్గరకెళ్లాడు... 'ఇది గొప్ప క్షుద్ర ప్రేమ కథ... ఇద్దరు ప్రేమికులు స్మశానంలో ప్రేమించుకుంటారు... రోజూ అక్కడే కలుసుకుంటుంటారు... ఓ రోజు అక్కడే అప్పుడే వచ్చిన శవం సాక్షిగా పెళ్లి చేసుకోవాలనుకుంటారు... అప్పుడే ఓ సంఘటన జరుగుతుంది... అదేంటంటారు...?' అంటాడు తండ్రి వైపు చూసి ... ఎట్టకేలకు తన కథ వినేందుకు ఒక శ్రోత దొరికాడన్న ఆనందంతో ... అంతే దానికి పళ్లులేని ఆ తండ్రి గట్టిగా దవడలు బిగించి మంచం కింద వున్న కర్ర తీసుకుని టీవీ చూస్తున్నానంటూ సైగచేస్తాడు... సరిగ్గా అప్పుడే టీవీలో ఓ క్షుద్ర సీరియల్ వస్తోంది. అంతే కె.కె.రావ్‌కి వళ్లుమండింది. కల్లుతాగిన కోతిలా ఇంతెత్తున ఎగురుతూ 'ఛ... ఈ టీవీలవల్లే జనాలంతా మారి పోయారు. నా కథలు వినేవారే లేకుండాపోయారు... అసలు దేశంలో వున్న టీవీలన్నీ ఢామ్మని పేలి పోతేగాని ...' అంటూ రెండు చేతులతో టీవీ ఎత్తి పడేస్తాడు... అదంతా చూసిన కె.కె.రావు భార్యామణి ... టపీమని బొడ్లోంచి విడాకుల కాయితాలు తీసి 'ఇంక ఈ క్షుద్ర కథా రచయితతో కాపురం నావల్ల కాదు... ఆ కథలు రాసీ రాసీ మనిషి ఇదిగో ఇలా తయారయ్యాడు... అసలా టీవీల మీద పడి ఈ ఏడుపేంటంట. అందులో వచ్చే సీరియల్స్ ఈయన రాసే కథలకంటే పరమ దరిద్రంగా ఏడుస్తాయికదా... మరి ఆ టీవీలకి సీరియల్స్ స్క్రిప్టు రాసుకోవచ్చు కదా...' అంది. అంతే కె.కె.రావు క్షుద్ర మెదడులో ఓ మెరుపు మెరిసింది....!!!

కథాకవిత

తెలిదేవర భానుమూర్తి

# ఎంత బాగుండు




**ఉదయం ఎనిమిది గంటలైనా డిఎస్పీ గారు నిద్ర పోతూనే ఉన్నారు. రాత్రంతా ఆయనగారు మందుపార్టీలో మునిగి తేలారు. ఆయన సతీమణి కూడా ఇంకా నిద్ర లేవలేదు. మందు పార్టీతో ఆమెకు ఎలాంటి సంబంధం లేదు. రోజూ రాత్రి ఒంటిగంట వరకూ టీవీ చూస్తూ కూచోవడం ఆమెకు అలవాటు.**

ఆ కారణంగా ఉదయం పదిగంటల దాకా ఆవిడగారు నిద్ర పోతుంటారు. ఆకలేసి కాబోలు ఉయ్యాల్లోని డిఎస్పీ గారి చంటి పిల్ల గుక్కపెట్టి ఏడ్పు మొదలెట్టింది. పిల్ల గుక్క పెట్టి ఏడుస్తున్నా డిఎస్పీ గారి భార్యామణి లేవలేదు. లేచినా తన అందం ఎక్కడ చెడిపోతుందోనని ఆమెగారు పిల్లకు పాలివ్వదు. కానిస్టేబుల్ వీరాస్వామే ఆ చంటిపిల్లకు డబ్బాపాలు పడుతుంటాడు. వీరాస్వామికి ప్రభుత్వం జీతమిస్తున్నా పని మాత్రం డిఎస్పీ గారింట్లోనే. అతను డిఎస్పీ గారికి కుక్కకు మించిన విశ్వాస పాత్రుడు.

చంటి పిల్ల ఏడ్పునకు డిఎస్పీ గారికి నిద్రా భంగమైంది. పక్క మీద నుంచి లేస్తూనే ఆయనగారు-

"అరే నువ్వు యాడ సచ్చినవురా" అంటూ పెద్దగా అరిచారు.

ఆ అరుపు చెవిన పడటంతో పెరట్లో మొక్కలకు నీళ్లు పోస్తున్న వీరాస్వామి పరుగెత్తుకుంటూ వచ్చాడు. డిఎస్పీ గారికి సెల్యూట్ చేశాడు.

"సంటి పిల్ల ఒక్క తీర్గ ఏడుస్తుంటే ఏం జేస్తునవ్?" కళ్లెర్రజేసి డిఎస్పీ గారు అడిగారు.

"చెట్లకు నీళ్లు బోస్తున్న సార్" అని వినయంగా వీరాస్వామి జవాబు చెప్పాడు.

"బాంచోత్! పొల్లకు పాలు దాపియ్యాలని ఎర్కలేదా?" అంటూ డిఎస్పీగారు గద్దించారు.

వీరాస్వామికి కిమ్మనకుండా పాలు కలిపి పిల్లకు పట్టాడు. పిల్ల పడుకునే దాకా ఉయ్యాల ఊపుతూ కూచున్నాడు. ఆ ఇంట్లో దాదాపు అన్ని పనులూ అతనే చేస్తుంటాడు. రోజూ డిఎస్పీగారి బూట్లకు పాలిష్ చేస్తుంటాడు. చంటిపిల్ల మలమూత్రాదులతో కరాబు చేసే బట్టలతో సహా ఆ ఇంట్లోని అందరి బట్టల్నీ అతనే ఉతుకుతుంటాడు. బజారు కెళ్ళి సరుకుల్ని కొని తెస్తాడు. పనిమనిషి రాకపోతే బాసండ్లను కూడా తోముతుంటాడు. పెళ్లాం పిల్లలతో డిఎస్పీగారు ఎక్కడికైనా వెలితే ఇంటి కాపలాగా ఉంటాడు.

ఈ మధ్యే వీరాస్వామికి పెళ్లయ్యింది. అతని భార్య అందాలరాశి. అభిమానవతి. వీరాస్వామి ఆమెను డిఎస్పీగారి ఇంటికి తీసుకెళ్లాడు. ఆమెను చూడగానే డిఎస్పీ గారి కన్ను చెదిరింది. ఆశీర్వచనం కోసం వీరాస్వామి దంపతులు డిఎస్పీ గారి కాళ్లకు దండం పెట్టారు.

ఆశీర్వదిస్తున్నట్లు నటిస్తూ డిఎస్పీగారు వీపు నిమిరాడు. ఆ రోజు నుంచీ డిఎస్పీ గారు వీరాస్వామిని 'తేరీ జోరూకూ....' అంటూ తిట్టడం మొదలెట్టారు. డిఎస్పీ గారు ఎన్ని రకాల బూతులతో తిట్టినా చీమూ నెత్తురూ లేనివాడిలా అతను ఉండిపోయే వాడే తప్ప ఎదురు మాట్లాడేవాడు కాదు. కొత్తగా పెళ్లయినవాడే అనే కనికరం లేకుండా తరచుగా రాత్రిపూట కూడా వీరాస్వామిని ఇంటికి కాపలా ఉంచి డిఎస్పీగారు రాక్షసానందాన్ని పొందేవారు. ఆ రోజు వీరాస్వామికి జ్వరం వచ్చింది. జ్వరంతో పాటు వొళ్లు నొప్పులు కూడా మొదలయ్యాయి. మంచం మీద నుంచి అతను లేవలేకపోయాడు. డిఎస్పీ గారికి ఎక్కడ ఇబ్బంది కలుగుతుందోనని ఆయన గారి ఇంటి పనులు చేయడానికి గాను వీరాస్వామి పొద్దుటే తన భార్యను పంపాడు.

ఇంట్లోకి అడుగు పెడుతున్న ఆమెను చూసి - "సాలెగానికి ఏమైంది. నిన్ను దోలిచ్చిండు" అని డిఎస్పీ గారు అడిగారు.

"జరమొచ్చింది" అని తల దించుకుని ఆమె సమాధానం చెప్పింది.

మూలనున్న చీపురు తీసుకొని ఆమె ఇల్లూడవసాగింది. ఇల్లూడుస్తున్న ఆమె కేసి డిఎస్పీ గారు తినేసేలా చూడసాగారు.

"నేను తానం జెయ్యాలె. బాత్రూంలకు బోయి బకీట్ల నీల్లు నింపు" అంటూ డిఎస్పీ గారు ఆమెకు బాత్రూంను చూపించారు.

వీరాస్వామి భార్య బాత్రూంలోకి వెళ్ళి నల్లా తిప్పి బకెట్లో నీళ్లు పట్టసాగింది. పిల్లిలా మెల్లగా వచ్చిన డిఎస్పీ గారు ఆమె నడుం మీద చేయి వేశారు. ఆమె వెనక్కి తిరిగి చూసింది. ఆయనగారు ఆమె చేయి పట్టుకుని తనవైపు లాక్కునే ప్రయత్నం చేశారు. ఆమె తన బలాన్నంతా ఉపయోగించి డిఎస్పీ గారి నుంచి తన చేతిని విడిపించుకొంది. ధూ అని ఉమ్మేసింది. పరిగెత్తి, పరిగెత్తి ఇల్లు చేరుకొంది. భర్త గుండెల్లో తల దాచుకొని భోరున ఏడ్చింది.



"ఎందుకేడుస్తున్నవ్? ఏమైంది?" అని వీరాస్వామి తన భార్య నడిగాడు.

పూస గుచ్చినట్లు జరిగిన సంగతినంతా ఆమె చెప్పింది. ఉరి పోసుకు చస్తానంది. ఆ మాటా ఈ మాటా చెప్పి వీరాస్వామి ఆమెను శాంతింప జేసాడు. కానీ ఆ తరువాత ఇలా ఎందుకు చేశారని పొరపాటున కూడా అతను డిఎస్పీ గారిని అడగలేదు. పైగా ఆయనగారు కనబడినప్పుడల్లా సెల్యూట్ చేస్తూనే ఉన్నాడు తన విధేయతను చాటుకుంటూనే ఉన్నాడు.

* * * * * * * * * * * * * * * * * * * * * * * * * *

ఆ నగరంలో భూషణం గారి పేరు తెలియని వారెవరూ లేరు. ఆయన పెద్ద పారిశ్రామిక వేత్త. ఆయనకు రెండు ఫ్యాక్టరీలున్నాయి. ఎరువుల ఫ్యాక్టరీని ఆయన పెద్దకొడుకు చూసుకుంటే సిమెంటు ఫ్యాక్టరీని చిన్నకొడుకు చూసుకుంటూ ఉంటాడు. ఇంట్లో కూచునే తన ఫ్యాక్టరీకి కావలసిన హంగుల్ని ఆయన సమకూరుస్తూ ఉంటారు. డబ్బు అయస్కాంతం వంటిది. అది అందరినీ తన వద్దకు లాక్కుంటుంది. అందుకు భూషణం గారే నిదర్శనం. మంత్రులూ, ఎమ్మెల్యేలూ, ప్రతిపక్ష నాయకులూ, అధికారులూ ఆయన వద్దకు వస్తుంటారు. ఆయన విరాళం ఇవ్వని రాజకీయ పార్టీ అంటూ లేదు. రోజూ ఇంట్లో ఆయన ఎవరికో ఒకరికి విందు ఇస్తూనే ఉంటారు. తన ఫ్యాక్టరీల పనులకు ఎవరి నుంచీ ఎలాంటి ఇబ్బంది రాకుండా చూసుకుంటారు.

భూషణం గారికి రెండంతస్తుల భవంతి ఉంది. ఆ భవంతి ముందు వరండా ఉంది. ఆ వరండాలో టామీ ఉంటుంది. టామీ భూషణం గారి పెంపుడు కుక్క. అది చూడ్డానికి భయంకరంగా ఉంటుంది. కొత్త వారినెవరినీ అది భవంతిలోకి అడుగు పెట్టనివ్వదు. అందుకే భూషణం గారిని కలుసుకోదలచుకొన్న వారు ముందుగా ఫోన్

## సహజం

వాకిట్లో కాపలా ఉంటూ
ఎంగిలి మెతుకుల్ని తింటూ
దొర కనబడగానే తోక ఊపే కుక్క
అవి కూడా కరువైనప్పుడు జీవితం
బరువైనప్పుడు దొర మీద దూకిందట
అందిన చోటల్లా కరిచిందట

దయాదాక్షిణ్యాలు లేక
మాడకు పాలివ్వనీక
స్వార్థపు పాలు పెంచుకునే వాణ్ని
పాడియావు తన్నిందట
దూడకు పాలిచ్చిందట

గడ్డీ గాదా మేస్తూ
ఎండల్లో పొలం దున్నుతూ
ములుగర్ర పోట్లను సైతం సహించిన
ఎద్దు
మోయలేని బరువు మీదేస్తే
రంకె వేసిందట

కొమ్ము విసిరిందట
జంతువు కున్న బుద్ధి మనిషికి మాత్రం
ఉండొద్దా?
చీకటి గుండెల్లో చిరుదీపం వెలగొద్దా?

చేసి వస్తారు. కావలసిన వారు వస్తారని తెలిసినపుడు టామీని భవంతి వెనకాలవతల ఉన్న ఔట్ హవుస్‌లో కట్టేస్తారు. భూషణంగారు కనబడితే చాలు తోక ఊపుతూ టామీ ఆయన కాళ్లకు అడ్డం పడుతూ ఉంటుంది. ఆయనే స్వయంగా టామీకి అన్నం పెడుతుంటారు.

పేరున్న పారిశ్రామికవేత్త కూతురితో భూషణం గారి పెద్ద కొడుకు పెళ్లి నిశ్చయమైంది. పెళ్లికి ఒకరోజు ముందు తమ ఇంటికే రమ్మనీ, అందరమూ కలిసి ఆడ పెళ్లివారింటికి వెళదామని భూషణం గారు బంధుమిత్రులకు వివాహపత్రికతో పాటు ఉత్తరాలు కూడా రాశారు. ఆయన ఆహ్వానం మేరకు బంధుమిత్రులంతా పెళ్ళికి ఒకరోజు ముందే ఇంటికి వచ్చారు. వారంతా రాక ముందే టామీని ఔట్ అవుస్‌లో కట్టేశారు. పెళ్లిపనుల వల్లా, బంధుమిత్రులను రిసీవ్ చేసుకుంటూ బిజీగా ఉండటం వల్లా భూషణం గారు టామీ విషయం మరిచిపోయారు. అథితిలకు ఆయన పెద్ద ఎత్తున విందు నేర్పాటు చేశారు.

ఔట్ అవున్‌లోని టామీకి ఆకలి వేయసాగింది. భౌభౌ మంటూ అది మొరిగింది. కానీ పాప్ సంగీతపు హోరులో దాని ఆకలి అరుపులు ఎవరికీ వినిపించలేదు. టామీ తిండి లేకుండా ఆ రాత్రంతా గడిపింది. తెల్లవారాక అందరూ పెళ్లికి వెళ్ళడానికి సిద్ధమవసాగారు. స్నానపానాదులూ, ఫలహారాలూ అయ్యాక అథితులంతా లగ్జరీ టూరిస్టు బస్సుల్లోకి ఎక్కి కూచున్నారు. భౌభౌ మన్న టామీ అరుపులు వినిపించడంతో భూషణంగారు ఔట్‌అవుస్ వైపు వెళ్ళారు. ఆయనను చూడగానే ఎప్పటిలాగే టామీ తోక ఊపలేదు. కానీ ఆయన కాలును కరిచేసింది.



* * * * * * * * * * * * * * * * * * * * *

వరుసగా రెండేళ్ళు నర్సిమ్మకు పంట చేతికి రాలేదు. ఒకసారి వానలు పడక పంట ఎండిపోయింది. మరోసారి కోత కొచ్చిన పంటపై వడగళ్ల వాన కురిసి గింజ రాలిపోయింది. పంటలో భారీగా నష్టం వొచ్చింది. దాంతో అతను పీకల లోతుదాకా అప్పుల్లో మునిగిపోయాడు. చాలాకాలం నుంచి నర్సిమ్మ భార్య అనారోగ్యంతో బాధ పడుతూ ఉంది. ఎంతమంది డాక్టర్లకు చూబెట్టినా ఆమె వ్యాధి నయం కాలేదు. పట్నంలోని స్పెషలిస్ట్ దగ్గరికి తీసుకెళ్ళి చికిత్స చేయిద్దామంటే అందుకు సరిపడా డబ్బులు లేవు.

వాతావరణం అనుకూలించడం వల్ల ఆ ఏడు నర్సిమ్మకు పంట చేతికి వచ్చింది. తనకూ మంచిరోజు లొస్తున్నందుకు అతను సంబరపడ్డాడు. ధాన్యపు బస్తాల్ని ఎడ్ల బళ్ళలో వేసుకొని మార్కెట్‌కు బయల్దేరాడు. పంట అమ్మగా వచ్చిన డబ్బుతో సగం అప్పుల్ని తీరుద్దామనుకున్నాడు. భార్యను పట్నంలోని స్పెషలిస్ట్ వద్దకు తీసుకెళ్దామనుకున్నాడు. కానీ అతనొకలా తలుస్తే అతనికి అప్పు ఇచ్చిన షావుకారు మరోలా తలిచాడు. ఎడ్ల బళ్లలో ధాన్యపు బస్తాల్ని వేసుకొని మార్కెట్‌కు వెళ్తున్న నర్సిమ్మకు అడ్డు తగిలాడు.

"ముందుగాల్ల నా బాకి చుక్త్ జేసిబో" అని అన్నాడు.

"బండ్లను మల్చి మా ఇంటికాడ్కి గొంచబో. బాకి కింద వొడ్ల బస్తాలను దించిపో" అని షావుకారు అన్నాడు.

తన ధాన్యానికి మార్కెట్ రేటు కన్నా షావుకారు తక్కువ రేటు నిర్ణయించి బాకీ కింద జమ కట్టుకుంటాడని తెలిసినా ఎదురు చెప్పకుండా నర్సిమ్మ ఎడ్ల బళ్ళను మల్లించాడు. ఎదుటివాడు తన శ్రమ ఫలాన్ని దోచుకుంటున్నాడ,ని తెలిసినా నోట్లో నాలుక లేని వాడిలాగ ఉండిపోయాడు.

* * * * * * * * * * * * * * * * * * *
* * * * * *

ఆ ఊళ్లో ప్రధాని గూర్చి తెలియని వారు కొందరుండవచ్చునేమో గాని పాల యాదయ్యా గూర్చి తెలియని వారెవరూ లేరు. అతనికి పది బర్రెలూ, ఒక ఆవూ, పాలు మరవని ఆవు దూడా ఉన్నాయి. స్కూటర్‌కు పాల కాన్లను కట్టుకొని పొద్దన్నే యాదయ్య ఇంటి నుంచి బయల్దేరుతాడు. ఊళ్లోని హోటల్లకు పాలు పోసి వస్తుంటాడు. హోటళ్ల వాళ్లకే కాకుండా ఆ ఊళ్లో ఎక్కువమంది యాదయ్య వద్దే పాలు పోయించుకొంటూ ఉంటారు. అతను పోసే పాలు చిక్కగా ఉంటాయని అందరూ చెబుతుంటారు. ఏమాత్రం నీళ్లు కలపకుండా అతను పాలు పోస్తాడనుకోవడం పొరపాటే. ఇతర పాల వ్యాపారుల కంటే పాలల్లో అతను తక్కువ నీళ్లు కలుపుతాడంతే.

యాదయ్యకు ఇద్దరు కొడుకులున్నారు. వారిద్దరూ కాలేజీలో చదువుకుంటున్నారు. ఇంట్లోని బర్రెల గూర్చి వారేమాత్రం పట్టించుకోరు. యాదయ్యే బర్రెలకూ, ఆవుకూ గడ్డీ, చొప్పా వేస్తుంటాడు. కుడితి పెడుతుంటాడు. రోజూ బర్రెలను నీళ్ళతో కడుగుతుంటాడు. పాలు పితుకుతూ ఉంటాడు. ఈ పనుల్లో సహాయపడటంతో పాటు బర్రెలను మేపుకొని రావడానికి అతనొక జీతగాణ్ని పెట్టుకొన్నాడు. తన బర్రెల్లో ఏ బర్రెకైనా కొద్దిపాటి సుస్తీ చేస్తే చాలు ఏమాత్రం అశ్రద్ధ చేయకుండా యాదయ్య వెటర్నరీ డాక్టర్ వద్దకు తీసుకెళుతుంటాడు. బర్రె పాలకున్న గిరాకీ ఆవు పాలకు లేకపోయినా కొంతమంది కోసం యాదయ్య ఆవును పెంచుతున్నాడు.

ఆ రోజు తెల్లవారుజామున తన జీతగాడితో పాటు బర్రెల పాలను యాదయ్య పిండాడు. ఆవు దూడను కట్టేశాడు. రాతెండి చెంబులో

నీళ్ళను తీసుకొని ఆవు వద్దకు వెళ్లి కూచున్నాడు. చెంబులోని నీళ్లను ఆవు పొదుగు మీద చల్లాడు. పాలు పిండడానికి గాను ఆవు పొదుగు మీద చేయి వేశాడు. ఆకలి వేసి కాబోలు ఆవుదూడ అంబా అంబా అని అరిచింది. అంతే పాలు పితకడానికి ప్రయత్నిస్తున్న యాదయ్యను ఆవు కాస్తా తన్నింది.

* * * * * * * * * * * * * * *

కూతురు చెప్పిన మాట వినగానే కుటుంబరావు గుండె గుభేలుమంది. మూన్నెళ్ల క్రితమే ఆయన అప్పు చేసి కట్నకానుకులతో కూతురి పెళ్లి చేశాడు. దసరా పండగొస్తే అల్లుడినీ, కూతురినీ రమ్మని ఉత్తరం రాశాడు. కానీ కూతురొక్కతే వచ్చింది.

"అల్లుడు రాలేదేం అమ్మా!" అని అడిగితే-

"ఆయనకేదో అర్జెంట్ పని ఉందట నాన్నా" అని ఆయన కూతురు చెప్పింది.

అనుమానం వేసి ఆయన గుచ్చిగుచ్చి అడగ్గా -

"సిటీ బస్సుల్లో ఆఫీసు కెల్లడం ఆయనకు ఇబ్బందిగా ఉందట. మిమ్మల్ని స్కూటర్ కొనివ్వమన్నారు" అని ఆమె చెప్పింది.

"ఇప్పుడేం పెట్టి స్కూటర్ కొనివ్వనమ్మా! నీ చిన్న తమ్ముడిని కాలేజీలో జాయిన్ చెయ్యాలి. పెద్ద తమ్ముడి ఫీజులు కట్టాలి" అని కుటుంబరావు అన్నారు.

"మీరు స్కూటర్ కొనివ్వకపోతే నేను ఇక్కడే ఉండిపోవాల్సి వస్తుంది నాన్నా" అంటూ ఆయన కూతురు కంటతడి పెట్టింది.

"ఏడవకమ్మా! ఎలాగోఅలా తంటాలు పడి స్కూటర్ కొనిస్తాను" అని కుటుంబరావు అన్నాడు.

ఆయన ఒక ప్రభుత్వ కార్యాలయంలో గుమస్తాగా పని చేస్తున్నారు. కష్టాలూ, కన్నీళ్లతో ఆయన కుటుంబ భారాన్ని మోస్తున్నారు. తండ్రి చిన్నతనంలోనే మరణించడంతో తల్లినీ, తమ్ముడినీ పోషించే బాధ్యత ఆయన మీదే పడింది. తమ్ముడికి చదువూ సంధ్యలూ చెప్పించి ఓ ఇంటివాణ్ని చేశారు. ఒడ్డున చేరిన తన తమ్ముడు మళ్లీ తన మొహం చూపెట్టకపోయినా ఆయన పరోక్షంగానైనా తమ్ముడిని పల్లెత్తు మాట అనలేదు. అందరిలా లంచాలు తీసుకోకుండా కోరి కష్టాల్ని తెచ్చుకోవడమే కాకుండా ఇంట్లో అందరినీ కష్టాల పాలు చేస్తున్నారంటూ భార్య ఆడిపోసుకున్నా ఆయన కోపగించుకోలేదు. అప్పుల వాళ్లు అవమానాలకు గురి చేస్తున్నా ఆయన విచారించలేదు. అల్లుడు గొంతెమ్మ కోర్కె కోరినా ఆయన అగ్గి మీద గుగ్గిలం కాలేదు. సౌఖ్యం లేకపోయినా శాంతాన్ని వీడలేదు. కాడిని కింద పడెయ్యలేదు.

* * * * * * * * * * * * * * * * * * * * * * * * *

ధర్మయ్యా మోతుబరి రైతు. జీతగాళ్లు ఉన్నప్పటికీ వ్యవసాయపు పనుల్లో కూడా పాల్గొంటూ ఉంటారు. తాను పని చేస్తూ జీతగాళ్లతో పని చేయిస్తూ ఉంటారు. ఆయన వద్ద ఒక ట్రాక్టర్‌తో పాటు మూడు జతల ఎడ్లున్నాయి. వాటిలో రెండెడ్లంటే అయనికిష్టం. రామ లక్ష్మణుల పేర్లతో ఆయన ఆ ఎద్దుల్ని పిలుచుకొంటారు. నూతన సాంకేతిక పద్ధతులతో ఆయన ఎక్కువ ఫలసాయాన్ని సాధిస్తుంటారు. వ్యవసాయపు బావి నుంచి మోటార్ల ద్వారా నీరు తోడి తన పొలంలో పారిస్తుంటారు. ట్రాక్టర్ వంటి సాధనాలున్నా ఆయన ఎడ్లను విస్మరించలేదు. యంత్రాలు అప్పుడప్పుడూ వని చేయకుండా మొరాయిస్తాయని ఆయనకు తెలుసు.



ధర్మయ్యకు పంట దిగుబడి ఎక్కువ కావడంతో ధాన్యపు నిలవలకు ఇంట్లో ఉన్న గాదెలు సరిపోవడం లేదు. ఆ కారణంగా చిన్న పాటి గోదాం కట్టిస్తే బాగుంటుందనే ఆలోచనొచ్చింది. ఆయన ఇంటి వెనకాల బోలెడు ఖాళీస్థలం ఉంది. ఆ స్థలంలో గోదాం కట్టాలని ఆయన నిర్ణయించుకొన్నారు. రంగంలోకి దిగి పునాది తీయించారు. గోదాం నిర్మాణానికి అవసరమైన సిమెంటు బస్తాల్ని కొనడానికి బజారు కెళ్లడానికి గాను-

"అరేయ్! ట్రాక్టర్‌ను చాలు జెయ్యిరా!" అని ఒక జీతగానికి చెప్పారు.

వాడు ట్రాక్టర్‌ను స్టార్ట్ చెయ్యడానికి ప్రయత్నించాడు. వాడెంత ప్రయత్నించినా ట్రాక్టర్ కదల్లేదు.

"ట్రాక్టర్ చెడిపోయినట్లు గొడ్తున్నదయ్యా!" అని జీతగాడు చెప్పాడు.

"గట్లయితే రామ్‌లచ్మన్‌లతోని బండి గట్టు" అని ధర్మయ్యా జీతగాడిని ఆదేశించారు.

ఆయన ఆదేశం మేరకు జీతగాడు ఎడ్లబండిని సిద్ధం చేశాడు. వాడిని వెంటబెట్టుకొని సిమెంటు బస్తాలు కొనడానికి ధర్మయ్యా బజారుకెళ్లారు. జీతగాడున్నప్పటికీ ఆయనే స్వయంగా బండి తోలారు.

సిమెంటు బస్తాల్ని బండిలో వేసుకొన్న తర్వాత 'హైహై' అంటూ ధర్మయ్యా ఎడ్ల నదిలించారు. ఎంత అదిలించినా ఎడ్లు కదల్లేదు. రెండెద్దుల్లో లక్ష్మణుడనే ఎద్దు మొరాయించడం మూలంగానే బండి కదలడం లేదనే విషయాన్ని ఆయన గ్రహించారు. చెర్నా కోల తీసుకొని ఆ ఎద్దును చితకబాదారు. ఆయనెంత కొట్టినా ఎద్దు ఒక్కడుగు కూడా ముందుకు వేయలేదు. ఇలా అయితే లాభం లేదనుకొని ఆయన ఎద్దు తోకను గట్టిగా మెలి తిప్పారు. ఎద్దు కదల్లేదు. కానీ కొమ్ము విసిరింది.

●

సాహిత్య ప్రపంచం

ముత్యాల ప్రసాద్

# స్వేచ్ఛకై సాగే సమరం సరమాగో సంధించిన అక్షరం


సరమాగో

ఒక కమ్యూనిస్టు కార్డు హోల్డర్‌కు 1997లో తొలిసారిగా నోబెల్ సాహిత్య పురస్కారం లభించింది. ప్రపంచంలో 14 కోట్ల మందికి పైగా ప్రజలు మాట్లాడే పోర్చుగీసు భాషా రచయితను ఈ అత్యున్నత అవార్డు ప్రప్రథమంగా వరించింది. ఇలా ఈ ఏడాది నోబెల్ సాహిత్య పురస్కారం ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది.

విభిన్న సాహిత్య ప్రక్రియల్లో నిష్ణాతుడైన 75 ఏళ్ళ జోసె సరమాగోకు పోర్చుగీసు సాహిత్యంలో విశిష్టస్థానం ఉంది. తన అరవయ్యోపడిలో కలాన్ని వడివడిగా నడిపించి శిఖరాగ్రాన్ని అందుకున్న ఘనత ఆయనది. సృజనాత్మకతను వయసు అడ్డురాదనడానికి సరమాగోనే తార్కాణం. బెంగాలీలోనూ, భారతీయ సాహిత్యంలోనూ సుప్రసిద్ధుడయిన శరత్‌కూడా తన నలభైఏళ్ళ జీవితం తరువాతనే రచనలు ప్రారంభించారు. జీవితానుభవాలు, సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న ఆటుపోట్లు, సవాళ్ళు సరమాగో రచనల్లో ప్రతిఫలిస్తాయి. కల్లోలానికి, గంభీరతకు ఆనవాలు సముద్రం మాత్రమే కాదు. నాలుగు దశాబ్దాలకు పైగా నియంతృత్వ పాలన క్రింద నలిగిపోయిన ఒకనాటి పోర్చుగీసు సమాజమూ. ఆ చేదు అనుభవాల అంతర్మథనం నుంచే సరమాగో అక్షర జ్వాల ఎగిసిపడింది. ఆయన రచనలనిండా ఆధిపత్యాన్ని అణచివేతను వ్యతిరేకిస్తూ స్వేచ్ఛకై సాగించిన సమరమే ప్రతిబింబిస్తుంది.

సరమాగో నవల్లో కథావస్తువు ఆయన దేశచరిత్రతతో ముడిపడి ఉంటుంది. ఆధునిక మానవుడి ఆర్తనాదం వినిపిస్తుంది. పీడనకు వ్యతిరేకంగా బిగించిన పిడికిళ్ళు కనిపిస్తాయి. స్వేచ్ఛకోసం పరితపించే హృదయాలు దర్శనమిస్తాయి. అన్నింటికీ మించి సమసమాజానికై ఆయనపడే తపన అగుపిస్తుంది. ఆయన కలంనుంచి జాలువారిన ప్రతి అక్షరం ఓ యధార్థ జీవన దృశ్యం. తాడితుల పీడితుల జీవితాలను పోరుబాటలో తీర్చిదిద్దుకునే సుదినం కోసం ఎదురుచూస్తున్నది ఆయన రచన. "ఈనాడు మానవాళి హేతు బద్ధంగా వ్యవహరించడం లేదు. ఆ దిశగా మార్చుకోసం జరుగు తున్న మహా ప్రయత్నంలో ఒక భాగమే నా సాహిత్య వ్యాసంగం" అంటారాయన.

ఆరడుగుల అజానుబాహుడయిన సరమాగో జీవితం సాదాసీదాగానే ప్రారంభమైంది. 1922 నవంబర్ 16న పోర్చుగల్ రాజధాని లిస్బన్ సమీపంలోని అజిన్‌హగా అనే చిన్న పట్టణంలో శ్రామికవర్గ కుటుంబంలో జన్మించారు. నిరుపేద తల్లిదండ్రులు సరమాగో చదువుకు ప్రాధాన్యత ఇచ్చారు. కానీ నిత్యదరిద్రం ఆయన చదువును మధ్యలోనే మ్రింగేసింది. లోహాల (మెటల్) కార్ఖానాకు విసిరేసింది. కడుపునింపుకోవడం కోసం చదువును వదులుకోవలసివచ్చింది. అయితే 'రచయిత కావాలన్న తన స్వప్నం" విడిచిపెట్టలేదు. పనిచేస్తూనే చదువుకున్నారు. ఆదశలోనే తన ఇరవై ఒకటవయేట 'కంట్రీ ఆఫ్ సిన్' (జురడో పెకాడో, పాపాలదేశం) అనే నవల రాశారు. ఈ నవలలో పోర్చుగల్ రైతులు అనుభవిస్తున్న కష్టాలను, వారి దుర్భర జీవితాలను వారు ఎలా పీడనకు గురి అవుతున్నారో చిత్రించారు. అమ్మకాలలో ఈ నవలకు అంతగా పేరు రాకపోయినా, రచయితగా సరమాగోకు ఒక గుర్తింపు లభించింది. దీనితో అప్పటివరకు వెల్డింగ్ షాపులో పనిచేసే ఆయనకు ఒక పత్రికలో ఉద్యోగం లభించింది. ఆయన తొలినవల సరమాగో వృత్తిని, ప్రవృత్తిని ఒకే బాటలోకి తెచ్చిపెట్టింది పాత్రికేయుడిగా తన రచనాశైలిని మెరుగుపరుచుకున్నాము భాషను భావాన్ని సముజ్జీలుగా నడిపించడంలో

మెళకువలు ఆకళించుకున్నారు.

ఆరోజుల్లో పచ్చి నియంత అంటోనియోడి ఒలివెరియా సాలాజార్ పాలనలో పోర్చుగీసు మ్రగ్గుతున్నది. 1930 దశకంలో ఫాసిజం విజృంభించి, ఇటలీ, జర్మనీ తదితర దేశాలలో తన రక్తసిక్త పంజాను విసిరింది. అదే సాలాజార్ రూపంలో పోర్చుగీస్‌పై తన పాశవికతను ప్రదర్శించింది. ఈ కర్కశపాలన నాలుగు దశాబ్దాలపాటు కొనసాగింది.

విద్యార్థి దశలోనే ఫాసిస్టు వ్యతిరేక భావజాలంతో దృఢమైన వైఖరిని పెంపొందిచుకున్న సరమాగో నియంతృత్వానికి వ్యతిరేకంగా సాగిన పోరాటంలో పాల్గొన్నారు. రైతుల పేదల కడగండ్లు చూసి ఆవేదన చెందారు. పోర్చుగల్ కమ్యూనిస్టుపార్టీ కార్యాచరణకు నిబద్ధతకు ఆకర్షితుడయ్యారు. ఆనాటికే నిషేధానికి గురై, పలు వేధింపులను ఎదుర్కొంటున్న పోర్చుగల్ కమ్యూనిస్టు పార్టీలో సభ్యునిగా చేరి నిరంకుశత్వాని వ్యతిరేకంగా పోరాడాడు. "చిన్న వయసులోనే కమ్యూనిస్టుగా మారినందుకు నేనెన్నడూ విచారించలేదు. కమ్యూనిజం పట్ల నా విశ్వాసంగానీ, నిబద్ధతగానీ ఏ మాత్రం ఈనాటికీ సడలలేదు" అని గర్వంగా చెప్పుకుంటారాయన.

పోర్చుగల్‌లో నియంతృత్వం కొనసాగిన కాలంలో నవలా రచనకు దూరంగా ఉండి, పాత్రికేయునిగా వివిధవర్గాల ప్రజలతో సన్నిహితంగా ఉన్నారు. ప్రజల మనస్తత్వాలను, వారి జీవితాలను, బాధలను ఆకళించుకున్నారు. సమస్యలకు మూలం ఏమిటో అర్థం చేసుకున్నారు. 1974 లో నిషేధిత పోర్చుగల్ కమ్యూనిస్టు పార్టీ నేతృత్వంలో ఆదేశ సైన్యంలోని వామపక్షవాదులు సాలజార్ నియంతృత్వ పాలనకు చరమగీతం పాడారు. ఆ తరువాత సరమాగో నవలా రచనకు ఉపక్రమించారు.

1969 నుండి కమ్యూనిస్టుపార్టీ సభ్యునిగా ఉంటున్న సరమాగో, నియంతృత్వ పాలనాకాలంలో పాత్రికేయునిగా పాలకులు దుశ్చర్యలను నిర్భీతిగా బయటపెట్టారు. లిస్బన్ నుండి వెలువడే డియారియో డి నోటిసియాస్ పత్రికకు సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. 1975 లో ఆబాధ్యతలనుంచి తప్పుకున్నారు. ఆ తరువాత బతుకుదెరువు కోసం ఫ్రెంచ్ భాషలో ఉన్న పాఠ్యపుస్తకాలను పోర్చుగీసు భాషలోకి అనువదించారు.

1977 లో సరమాగో తన రెండో నవల మాన్యువల్ ఆఫ్ పెయింటింగ్ అండ్ కాలిగ్రఫీ' (మన్యుయల్ డి పిన్టురా ఇ కాలిగ్రాఫియా) ను రచించారు. ఆ తరువాత వరుసగా 1978 లో క్వాసీ ఆబ్జెక్ట్స్' ( ఆబ్జెక్టో క్వాసె), 1980 లో రెయిజ్డ్ ఫ్రమ్ ది ఫ్లోర్' (లెవన్‌టాడో డో చెకో) నవలలను రచించారు. నవలా రచయితగా ఆయనకు అంతర్జాతీయ గుర్తింపు తెచ్చి పెట్టిన చారిత్రక గుర్తింపు తెచ్చిపెట్టిన చారిత్రకు కాల్పనిక నవల మెమోరియల్ డో కన్‌వెంటో (ఆల్టాసార్ అండ్ బ్లిముండా). ఇది 1988లో ఆంగ్లంలో అనువాదితమయ్యింది. దీనిలో చారిత్రక, సామాజిక, వైయుక్తిక లక్ష్యాలున్నాయి. ఇదొక బహుళార్థక రచన అని స్వీడన్ అకాడమీ పేర్కొన్నది. ఇతిహాస కథారూపంలో మానవ జీవన బాధామయ గాధలను ఈ నవల వివరిస్తుంది. నియంత సాలాజార్ పశుపాలనలో స్వేచ్ఛాస్వాతంత్రాల గొంతు నులిమివేసిన మతపరమైన వేధింపులు నిర్బంధకాండలు దానికి నిరసనగా నిర్భీతితో పోరాడిన ప్రగతిశీలుర త్యాగమయి జీవితాలు, ఆ కాలంలో దాదాపు ఐరోపా అంతటా కొనసాగిన క్రూరమైన విచారణ, నికృష్టమైన శిక్షలే ఈ నవలా కథావస్తువు. అయితే ఈ కథావస్తువును ఇతిహాస గాథగా మలచిన తీరే సరమాగో రచనా ప్రతిభకు అద్దంపడుతున్నది. 18వ శతాబ్దపు రాజ్యంలో నిర్బంధ, క్రూరహింసాకాండను ప్రతిఘటించిన యోధుడు బాల్సార్ ఒక దార్శనకపాత్ర బ్లిముండా, కొన్ని శక్తులను నింపుకున్న ఎగిరే యంత్రంలో రోదసీని దాటి స్వర్గంలాంటి మరో ప్రపంచానికి వెళ్ళే సాహసయాత్రే ఈ గాథ. ఈ నవలా రచనకు ప్రేరణ పోర్చుగల్ రాజధాని ల్బిన్ సమీపంలో అతిపెద్ద మాఫ్రా కాన్వెంట్ నిర్మాణ సందర్భంగా వేలాదిమంది ప్రజలు అనుభవించిన అతా దారుణమైన చిత్రహింసలే.

ఆ తరువాత సరమాగో రచించిన నవల 'ది ఇయర్ ఆఫ్ ది డెత్ ఆఫ్ రికార్డో రీస్' (ఓ అనోమోర్టీ డి రికార్డో రీస్) ఇది వ్యంగ్య రచన. నియంత సాలాజార్ పాలనను కథావస్తువుగా తీసుకొని 19వ శతాబ్దపు కవి ఫెర్నాండో పెస్సోకు అర్పించిన అక్షరాంజలీ నవల. దీని తరువాత 1986లో దిస్టోన్ ర్యాఫ్ట్ (ఎ జన్‌గడ డిపెడ్రా) నవలను వెలువరించారు. ఈ నవల సంప్రదాయ విరుద్ధ ఘటనలతో, సంప్రదాయంపై సంఘర్షణతో కొనసాగుతుంది. ఇది సాహితీ స్వాతంత్ర్యానికి ప్రతీకగా నిలుస్తుంది. సరమాగో కాల్పనికశక్తిని ప్రతిబింబిస్తుంది.

సరమాగో నాస్తిక వాదికూడా 1991లో దిగాస్పెల్ ఎకార్డింగ్ టు జీసెస్ క్రీస్ట్' నవలలో జీసెస్ మానవ మాత్రుడనీ. ఆయనకు సహజమైన మానవ వాంఛలన్నీ వున్నాయని పేర్కొంటారు. ఇది వ్యంగాత్మక నవల. ఈ నవల వివాదాస్పదమైంది. పోర్చుగల్‌లోని మతపరమైన కొందరు ఛాందసుల ఆగ్రహానికి గురైంది. ఆదేశ

విదేశాంగ ఉపమంత్రి సౌజావాలా దీనిపై బహిరంగంగానే అసంతృప్తి వ్యక్తంచేశారు. అంతేకాదు 1992లో ఐరోపా సాహితీ బహుమతి కోసం పోర్చుగల్ తరపున ఈ పుస్తకం ఎంపిక కాగా, ఆనాటి ప్రభుత్వం దానిని త్రోసిపుచ్చింది. అప్పుడే ఆయన లిస్బన్ నుండి ఏకాంతంగా ఉండే కెనరా ద్వీపాలకు వెళ్ళిపోయారు. ఎన్ని అడ్డంకులు వచ్చినా తాను నమ్మిన విషయాన్ని కుండబ్రద్దలు కొట్టినట్టు చెప్పే నిర్మోహమాటి ఆయన.

సరమాగోకు ప్రతిష్టాత్మకమైన నోబెల్ బహుమతి సాధించి పెట్టిన 1995లో రాసిన 'బ్లయిండ్‌నెస్' (ఎన్‌సయో సోబ్రె ఎ సెగుయిరా) మనిషి హేతుబద్ధంగా ఎలా జీవించాలో వివరిస్తుంది. ఇది ఒక కొత్త తరహా వనల. మనిషి తనకు తెలిసికూడా కొన్ని సందర్భాలలో అసందర్భంగా, అహేతుకుంగా ప్రవర్తించడాన్ని ఈ నవలలో విమర్శిస్తారు. మనిషి విజ్ఞతతో హేతుయుతంగా జీవించిన నాడు ఈ ప్రపంచాన్ని పట్టిపీడిస్తున్న ఆకలి, అశాంతి అంతరించిపోతాయని ఈ నవల ద్వారా ఆయన వివరిస్తారు. ఈ నవలలో ఒక పాత్ర తప్ప మిగిలిన అన్ని పాత్రలూ గుడ్డివై పోతాయి.

సరమాగో 1997 లో టోడోస్ ఒస్ నోమెస్ (ఆల్‌దినేమ్స్) రచించారు.

సరమాగో కు నోబెల్ బహుమతి ప్రకటించడం విస్మయం కలిగించే అంశంకాదు. ఎందుకంటే , ఆ పురస్కారం ఆయనకు ఏనాడో లభించాల్సింది. ఈ అవార్డు వచ్చిన తరువాత పత్రికా సమావేశంలో మాట్లాడుతూ దీనికోసం పోర్చుగీస్ భాష దశాబ్దకాలం నిరీక్షించింది. భాష ఒక పురావస్తు ప్రదర్శనశాల కాదు. దానిని సజీవంగా పరిరక్షించుకోవడానికి సహస్ర త్రోవలున్నాయి. భాషను కంటికి రెప్పలా కాపాడుకోవడం దానిలో కృషి చేయడం రచయిత నిర్వర్తించాల్సిన పాత్ర" అని సరమాగో స్పష్టంచేశారు.

సరమాగోకు లభించిన ఈ పురస్కారాన్ని పోర్చుగీసు సంస్కృతికి గుర్తింపు" గా పోర్చుగల్ అధ్యక్షుడు జోర్జ్ సాంపాయో అభివర్ణించారు.

"మా పార్టీ సభ్యునిగా మా ఆశయాలలోనూ, సామాజిక మార్పుకై సాగించే పోరాటాలలోనూ సరమాగో మహత్తర పాత్ర నిర్వరిస్తున్నారు. ఈ పురస్కారం లభించడం మా పార్టీకి గర్వకారణం" అని పోర్చుగల్ కమ్యూనిస్టు పార్టీ నాయకులు కార్లోస్ కార్వాలో అన్నారు.

సరమాగో రచనల్లో ఆయన దేశపు సామాజిక, ఆర్థిక రాజకీయ చారిత్రక పరిస్థితులు ప్రతిబింబిస్తాయి. పోర్చుగల్ ప్రజల జీవన శైలి, ఆచార వ్యవహారాలు కనిపిస్తాయి. చరిత్రను వర్తమానాన్ని అనుసంధానించడం ఆయన రచనా ప్రత్యేకత. వాస్తవితకను, సామాజిక సత్యాల్ని చారిత్రక కల్పితగాధల మాటున పాఠకుల్ని ఆకట్టుకునేలా వర్ణించడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. అయితే ఆయన ప్రాపంచిక దృక్పథం విశాలం. ఆయన రచనలు స్వేచ్ఛకోసం సమరం సాగించే ప్రపంచంలోని అన్ని ప్రాంతాల ప్రజలకు వర్తిస్తాయి. తమను ఉద్దేశించి చేసిన రచనలే అన్నంతగా యిమిడిపోతాయి. మానవుడు స్వేచ్ఛ, ఆకలి ఈ మూడింటి చుట్టూ ఆయన రచనలు పరిభ్రమించడమే అందుకు కారణం.

సాహిత్య విమర్శకులు ఆయనను కొలంబియా విప్లవ రచయిత గాబ్రియేల్ గార్సియా మార్క్వెజ్‌తో పోలుస్తారు. అయితే సరమాగో దాన్ని చిరునవ్వుతో త్రోసిపుచ్చుతారు. అంతర్జాతీయంగా ఆయనకు పలు పురస్కారాలు కూడా లభించాయి. నోబెల్ పురస్కారాలు పొందిన ఐరోపా సాహితీ మూర్తులలో సరమాగో నాల్గవ వ్యక్తి. 1995లో ఐర్లాండ్‌కు చెందిన సీమస్ హేనీకి, 1996లో పోలెండ్‌కు చెందిన విస్లావా జింబోర్స్కకు, 1997లో ఇటలీకి చెందిన డరియోఫోకు నోబెల్ సాహితీ బహుమతులు లభించాయి.

"ఎ గ్రేట్ మ్యాన్ మస్ట్‌బి మోటివేటెడ్ బై ది డైనమిక్ ఆఫ్‌లె సోసియల్ పర్పస్" అని అంబేద్కర్ అన్నట్టు సరమాగో తన రచనలను సామాజిక ప్రయోజనాలను సాధించే దిశగా ఎక్కుబెట్టి విశ్వసాహితీ పీఠాన్ని అధిష్టించిన మహోన్నతుడు.

నిజానికి కమ్యూనిస్టు వ్యతిరేకత నిండిన నోబుల్ బహుమతిని సాహిత్యంలో మాత్రం వామపక్ష భావాలు గలవారికే ఇవ్వాల్సి రావడం పెట్టుబడిదారీ సంస్కృతి సంక్షోభానికి ఒక సంకేతం. తొలిసారి సరమాగో సత్కారం అందుకున్న తర్వాత ఈ భావాలు గల వారు ఇంకొందరికి కూడా వచ్చింది.

ఇంటర్వ్యూ

వేగుంట మోహన ప్రసాద్

# నాది బాధపడిన కవి పక్షం



**నేనొక దుర్గం నాదొక స్వర్గం అనక పోయినా మీరో ప్రత్యేక బాణీతో వుండి పోయారు కదా, ఇప్పుడు వెనక్కు తిరిగి చూసుకుంటే కవిత్వకంగా తాత్వికంగా ఏమనిపిస్తుంది?**

'స్వర్గం', 'దుర్గం' అన్న పదాల్లోని అతీత లోకాన్ని అతిమానవ 'అహం'కారాన్నీ ఈనాడు మనం ఆనాటి శ్రీశ్రీకి కాక ఒకనాటి బైరాగికీ కాక మరొకప్పటి కృష్ణశాస్త్రికీ కాక వాళ్ళవాళ్ల మరో ప్రపంచాల మనో ప్రపంచాల భావనా ప్రపంచాల పరిధుల్లో కాక నానాటికీ విస్తృత మవుతూ పోతోన్న విరుద్ధభావాల విభిన్న శక్తుల విచ్ఛిన్న యుక్తుల చిన్నాభిన్న వేరువేరు, ఇతరేతర ప్రపంచాల నాటకీయ పరస్పర ఘర్షణా నేపథ్యాలకు అన్వయించుకొన్నప్పుడు ఏ ఒక్క మహాకవీ (శ్రీశ్రీ) మహారచయిత (చలం) కూ మాత్రమే పరిమితం కాలేని ఒకానొక అపరిమేయ సాహిత్య కర్తవ్యాల (కవిత్వమనే ఒకే ఒక్క సాహితీ రూపం మాత్రమే కాక) అనంత వైరుద్యాల వ్యక్తిత్వాలు కలిగిన సాహితీ కారులెందరెందరో ఈనాడున్నారు - వారందరూ కూడా వారంతట వారే ఒక్కొక్కరుగానే 'అనితరసాధ్యం నామార్గం' అనగలిగిన వారే. మహాప్రస్థాన కవిగా, చరమరాత్రి కథకుడిగా అనంత స్వీయ జీవన చిత్రకారుడిగా, అభ్యుదయాన్నుంచి విప్లవప్రగతి మార్గంలోని మరో ప్రస్థాన కవిగా, అతిమేలపు ప్రయోగశీలంతో అధివాస్తవిక నాటక ప్రయోక్తగా కలాన్ని ఖడ్గంగా సృజించిన అతను ఆ మాట అపుడెపుడో చెప్పుకొన్నందువల్ల ఇక అనితర మార్గాలు లేవనీ అనితర సాధ్యాలూ లేవని ఆగిపోనక్కరలేదని ఈనాటి (1967నుంచి) దిగంబర, విప్లవ, స్త్రీవాద, దళిత కవిత్వాలు నిరూపిస్తూనే అనుభవ, అనుభూతి, హైకూ, ఐంద్రియ, వాంఛా, కవిత్వాలకు కూడా సముచిత స్థానాన్నిస్తూ ఆయా ఛాయల్లోని కవులకు కనీసం ఒక్కొక్కరికైనా ఆ అనితరత్వాన్ని ఇచ్చుకోక తప్పిందికాదు. అసలీ అనితరత్వం అనే విశేషణాపదాన్ని, భుజకీర్తిని కవికే ఎందుకివ్వాలి? కవిత్వరచన ఒక్కటే సాహిత్యం కాదు. సారస్వతంలోని అంతఃశక్తి సాహిత్యం. సాహిత్యం బహుముఖి. ఈనాడు అనితర సాధ్యమైన అనంతాలు వస్తున్నాయి (గమనాగమనం, భ్రమణకాంక్ష, ఆఖరి బ్రాహ్మడు) ఈనాడు అనితర సాధ్యమైన కథలు వొస్తున్నాయి (91నుండి 2001 వరకు ఏటేటా కథలు) ఈనాడు అనితర సాధ్యమైన నవలలు వొస్తున్నాయి. (అంటరాని వసంతం, ఎల్లి, నీలి, ... అడవిని జయించాడు, నేనూ చీకటి, ఐదు హంసలు) ఈనాడు అనితరులు కారు - అనేక అనితేతరులున్నారు. చండీదాస్, నామిని, పతంజలి, శ్రీరమణ, పతంజలిశాస్త్రి, దీవి సుబ్బారావు, ఎండ్లూరి సుధాకర్, జొన్నవిత్తుల జగన్‌రెడ్డి, సిద్ధార్థ. అయిల సైదాచారి, సైదా, రమణ జీవి, దాము, రాణి శివశంకర్‌శర్మ, దెంచనాల, ఎం.ఎస్.నాయుడు, సీతారాం, యాకూబ్, గురుస్వామి, జయప్రభ, కొండేపూడి నిర్మల, ఓల్గా ఇంకా ఎవరెవరి సాహిత్యప్రక్రియలలో వాళ్లు 'అనితర

.............✧.............

**చితి-చింత' అనే సంకలనానికి ఏ తత్వమూ లేదు. అయినా భయపడి పోయారు. ఒక్క కె.వి.ఆర్. తప్ప. సంజీవదేవ్, నాగళ్ల గురుప్రసాదరావు, రోణంకి వాళ్లవాళ్ల అద్భుత జ్ఞాన సంపదని ఐలార్చుకొన్నారు తప్పించి - 'చింత-చింత' లోని అమాయకత్వాన్ని, నవయౌవ్వన సందేహ సందోహాల్ని వాళ్లా పట్టుకోలేక పోయారు. దిగంబర కవిత్వం కంటే ముందు వొచ్చిన డ్రాయరు లేని పిల్లాడి కవిత్వం అది. విప్లవకవిత్వం కంటే ముందువచ్చిన విద్రోహ చర్య అది.**

.............✧.............

• కవి, రచయిత

సాధ్యం నా మార్గం' అనదగినవాళ్లున్నారు. కాకపోతే కొందరు వాళ్లవాళ్ల స్వర్గాల్ని వాళ్లవాళ్ల నరకాల్నీ వాళ్లే సృజించుకొంటున్నారు. స్వర్గం ఎంత సృజనశీలమో నరకం అంతే సృజనశీల దుష్క్రియాత్మకం. మీ ప్రశ్న మొదటికి రావాలంటే - నా నరకాన్ని, నా చేజేతులా చేసుకొన్న నరకాన్ని కవిత్వ ప్రక్రియలో కాకుండా కథనాత్మకంగా వ్యధావృధాత్మకంగా 'బతికిన క్షణాలు'లోనూ, 'పునరపి'లోనూ సృజించుకొని తీరా సముద్రపుటొడ్డున కట్టుకున్న పిచికగూళ్లుగా నేనే ఒక్కక్కటిగా కూల్చేసుకొన్నాను - బుచ్చిబాబు అంతరంగకధనంలోలాగా, ఈ రెండు రచనలలోనూ నేను, అనితర సాధ్యం నా మార్గం' అని ప్రస్తుతం అనుకొంటూనే ఉంటాను. వాటిని మించిన చొక్కాలాగూ చించేసే ఆత్మస్థైర్యం వచ్చేదాకా - ముందుగా, నా కంటే ముందుగానే 'త్రిపుర' అలాంటి సాహితీ రచన చేయకుండా ఉంటే

> నిన్న గాక మొన్న మా వట్లూరు (మా స్వగ్రామం) వేణుగోపాల స్వామి ఆలయంలో 150 సంవత్సరాల దేవతా విగ్రహాలు నల్లబారిపోయాయన్నా, అటుమొన్న నా మహానగరం న్యూయార్క్ కుప్పకూలి పోయిందన్నా నాకు అనంతమైన ఏడుపు. దుఃఖమే దుఃఖం.

**విమర్శలు విసుర్ల మధ్య మిమ్ములను మీ మార్గానికే అంటిపెట్టుకుని వుండేలా చేసిందేమిటి?**

మరచిపోయాను. మీ పై ప్రశ్నలోని 'తాత్వికంగా', 'కవిత్వకంగా' అనే రెండు సూచనలు..

'తాత్వికంగా' అనేది ఒక పెద్ద బరువైన మాట. వాడి 'తత్వమే' అనేది చాలా సులువైన మాట. 'చితి-చింత' అనే సంకలనానికి ఏ తత్వమూ లేదు. అయినా భయపడి పోయారు. ఒక్క కె.వి.ఆర్. తప్ప. సంజీవదేవ్, నాగళ్ల గురుప్రసాదరావు, రోణంకి వాళ్లవాళ్ల అద్భుత జ్ఞాన సంపదని ఐలార్చుకొన్నారు తప్పించి - 'చింత-చింత' లోని అమాయకత్వాన్ని, నవయౌవ సందేహ సందోహాల్ని వాళ్లు పట్టుకోలేకపోయారు. దిగంబర కవిత్వం కంటే ముందు వొచ్చిన డ్రాయరు లేని పిల్లాడి కవిత్వం అది. విప్లవకవిత్వం కంటే ముందువచ్చిన విద్రోహ చర్య అది. ఈ రెండు ఉద్యమాల ఉద్ధృతి 'చితి-చింత'ని అవజ్ఞలోకి నెట్టేయటాని ప్రయత్నం అంటూ ఏమీ లేకుండానే కొత్తకొత్త పదబంధాల్తో పిచ్చిరెచ్చిపోయే సభల్తో నన్ను పాఠకులకి దూరం చేసినయ్. దిగంబరుల ముఠా. అప్పటి విప్లవుల గుంపు. ముఠాల్లోనైనా నిలిచిపోయే కవి - ఈనాటికిన్నూ ఒక మహాస్వప్న. గుంపులో చెర. అప్పటి "అరుణతార", ఈనాటి హెచ్చార్కె ఆనాటి సమీక్షా వ్యాసమూ, ఈ నాటి వ్యక్తిగత లేఖా అర్థం చేసుకోవటం లోని వైఫల్యానికి అనర్థాలకి ఉదాహరణలు.

ఇక రెండవ ప్రశ్న : విమర్శలూ విసుర్లు ! కదా! మీ తర్వాతి మాటకు అడ్డుపడినట్టున్నాను. పైన చెప్పిన సమాధానమే. కాకపోతే-లేకపోతే- ఒక రకంగా చెప్పుకుందామా! న్యూ బేరింగ్స్ అనేవి ఎపుడూ ఉండాలి. నా విషయంలోనూ ఉన్నాయనుకొంటున్నాను, ఎలాంటే - ఇస్మాయిల్ 'రెండో ప్రతిపాదన'లాగా! విమర్శపై పునర్విమర్శ ఎన్నిసార్లు రాలేదు! కన్యాశుల్కంపై కె.వి.ఆర్, కోవెల, కేతవరపు, పోస్ట్‌మాడర్నిజంపై అఫ్సర్, బి.టి.ఆర్., గూడ శ్రీరాములు, ఎన్.వేణుగోపాల్, నామిని పై రామకృష్ణారెడ్డి, ఎండ్లూరి సుధాకర్‌పై చేరా, చేరాపై బూరా, నారాపై చేరా, రారాపై ఎబికె, చేరాపై రామకృష్ణరెడ్డి, రంగనాయకమ్మల్లాగా.... ఇది అనంతం గురూ... 'అనుభవం' ఏమిటంటే - గుంపుకి ఒక మతం, ఒక విశ్వాసం, ఒక మూఢత్వం ఉంటుంది. వ్యక్తి ఐనవుడు గుంపుకి ప్రతినిధిగా ఒకానొక గణాచారి అవుతాడు. ఆ గణాచారిని నేను చూస్తూ ఆ పదధ్వనిని ఆ పదాల ప్రకంపనలనీ నేను ఆహ్లాదిస్తూ వస్తున్నాను. ఈనాటికిన్నూ. గుంపులోని మతాన్ని వ్యక్తి అభిమతంగా మార్చినపుడు అది సాహిత్యస్థాయినందుకొంటుంది.

**ంటే గ్రామంలో వుండాలి, పోతే సముద్ర తీరాల ఆవలికి పోవాలి అన్నారు కదా, అంత మట్టి వాసనల నేటివిటీని మామూలు ఊహకందని అంతర్జాతీయ ప్రతీకలను ఒక్క ఊపులో ఎలా ఇముడ్చగలిగారు?**

అవునండీ! గ్రామం... ఊరు... అమ్మ.... తల్లి... ఇవన్నీ, వీటి విలువలన్నీ ఎపుడు తెలిసొస్తాయంటే వాటిని పోగొట్టుకొన్నప్పుడే. పల్లెటూరు పోయిందనే కాదు నా ఏడుపు.... నిన్న గాక మొన్న మా వట్లూరు (మా స్వగ్రామం) వేణుగోపాలస్వామి ఆలయంలో 150సంవత్సరాల దేవతా విగ్రహాలు నల్లబారిపోయాయన్నా, అటుమొన్న నా మహానగరం న్యూయార్క్ కుప్పకూలిపోయిందన్నా నాకు అనంతమైన ఏడుపు. దుఃఖమే దుఃఖం. ప్రాచీ సముద్రాలలో పురాతన నగరాలెన్ని కూలిపోయినాయో, అప్పటి ఆ జనజీవనం ఎంత సజలనయనమైనదో కదాని నా అనంత దుఃఖదీనగానం! 'మట్టివాసన' అని మీరన్నారు గానీ నేనేడూ నాకు వారసత్వంగా వచ్చిన మూడు ఎకరాల పొలాన్ని కాచుకోలేకపోయినాను. పొలాన్ని, హలాన్ని అమ్ముకొంటే కవికి కలాన్ని అమ్ముకొన్నంత ఏడుపు రాదా! మొన్నీమధ్య సరదాగా మాట్లాడుకుంటూంటే - చలసాని ప్రసాద్ ఓ మాటన్నారు. "తాజ్‌మహల్‌క్కూడా సైట్ వాల్యూ తప్పితే ఏమీ లేదు" పదెకరాలమ్ముకొని సిద్ధార్థ కాలేజ్ చుట్టుపక్కల ఓ చిన్న ఇంటిచోటు కొనుక్కొన్నవాళ్లు, పొలాల్ని అరువుకో ఎరువుకో ఇచ్చేసి పిల్లల ఇంజనీరింగ్, డాక్టర్ చదువులకోసం వచ్చేసినవెన్ని కుటుంబాలు! అగ్గిపేటికల్లాంటి అపార్ట్‌మెంట్స్‌లో పక్కవాళ్ల పేర్లుకూడా తెలీని తనాల ఇతరత్వాలు...! పైగా వీళ్లే మళ్లీ ప్రైవేటైజేషన్, గ్లోబలైజేషన్, ఎం.ఎన్.సి.ల మీద కంప్యూటర్ కంపెనీలమీద వాజ్యమాడే వేషగాళ్లు, ముఖ్యంగా మన కవులూనూ, వాళ్ల పిల్లలకి ఈ చదువులే ఈ వీసాలే కావాలి. మైక్‌ముందు మాత్రం వాక్చాతుర్యంలో మనల్ని అవమానిస్తారు. ముఖ్యంగా వాళ్లల్లోనూ లెఫ్టిస్టులు! దళిత, స్త్రీవాద కవులూ కవయిత్రులునూ, కెరీరిస్టు సేవా సంఘాలు ఎవరికి వారే వేరు వేరు కుంపట్లు నెలకొల్పుకొని స్వీయసేవా కీర్తి, తృప్తీ పొందుతున్నవాళ్లు. నిజానికి మాట్లాడే పెదాల శబ్దాల లోపలికెళ్లి వింటే ఎంత అన్పృత వాసనో శబ్ద కాలుష్యమో కదా! మీరన్న 'నేటివిటీ' అంటే బాల్యభాషలో అందంగా నా తనాన్ని నేను శాశ్వతంగా చెప్పటమే. నేనిపుడు

పుస్తకాల్నించి కాక చిన్నపిల్లల్నించి 'భాష'ని నేర్చుకుంటున్నాను. 'నామిని' ఎంత ప్రాంతీయ సాహితీవేత్తో అంత విశ్వాంతరాళపు కవి. నా మనమడు - విరాట్ (విరి) నించి ఎంత గొప్ప కవిత్వం నేనిపుడు నేర్చుకుంటున్నానో! "తాతయ్యా! ఐ వాంటు టెల్యు ఎ సీక్రెట్" అంటే నేను చెవొగ్గాననుకోండి, "ఐ లవ్యూ" అనన్నా అంటాడు, లేదా "ఐ డోంట్ లైక్యూ" అన్నా అంటాడు. "నీ తోటి రహస్యమొకటున్నదోయీ" అన్న పాట వ్యక్తికీ సమాజానికీ ఇద్దరికీ చెప్పానే తన రహస్యాన్ని తనకు తాను చెప్పకొనే వాడే నాకు ఆత్మీయుడైన కవి. సాహిత్య, సాంఘిక, సాంస్కృతిక వైయుక్తిక రహస్యాల్ని ఓ వారం పదిరోజుల క్రితం నా కళ్లమ్మట ఊ అదే పనిగా నీళ్లొచ్చేట్లుగా చెప్పిన మహారచన చేసినవాడు రాణి శివశంకర 'శర్మ' తండ్రి ప్రథమ శత్రువు. తల్లి ప్రథమ ప్రేయసి. ఇతరులకు చెందని జ్ఞానం, విజ్ఞానం, సంస్కారం విషవృక్ష ఫలాలు. చదువు ప్రథమ ప్రభుత్వం, నాకు నేనే ప్రేమికుడ్ని, ద్వేషినీ, గమనాగమనం, లోలాగా 'పింజారీ'లాగా మన ఆంతర్యాలేమిటో కన్నీళ్ల హ్యాంకీలతో తుడుచుకొనే దాకా మనం మానవ విలువల మూల్యాలు తెలుసుకోలేం. తండ్రిలానో తల్లిలానో మానవహక్కుల కోసమో, మానవత్వం కోసమో ఔన్నత్యంకోసమో ఏడ్చే, దు:ఖించే మహామానవుడు - ఆయన మన మామూలు కవిత్వ పరిభాషలో కవి కాకపోవచ్చు కానీ ఒకపక్క వృద్ధుడ్ని, యువకుడినీ, స్వాప్నికుడినీ, బాలుడినీ కరుణాంతరంగుడ్నీ - ఒకే ఒక్క కాళోజీలో నేను చూచాను...

కొంచెం నిమ్మళించుకొంటానింక.

> మనిషంటే ఒకడుకాదు, వాడికి మూడు ముఖాలు అని మన ముఖంమీద కొట్టి చెప్పిన మహాద్భుత క్యూబిస్ట్ పికాసో. ఈ అన్నమయ, జీర్ణమయ కోశాల్నించి మనల్ని మనోమయ కోశాలకు ఉన్మత్తుల్ని చేసేవే సంగీత, చిత్ర శిల్ప కళా వైద్యాలు.

**మా** స్కి చర్మంలోకి ఇంకి పోతుంది, "పచ్చి బాలింతరాలు స్మితా పాటిల్ చచ్చి పోయింది" ఇంకా ఇలాటి కొన్ని చోట్ల తేలిగ్గా అర్థమయ్యే మీరు అంతలోనే అందకుండా పోవడానికి కారణం?

ఊరుకుందామన్నా ఊరుకోనివ్వని ప్రశ్న. ఏం చేస్తానిక. ఇందులో మా అమ్మ మరణరహస్యం ఇమిడిఉంది. స్మితాపాటిల్ పిచ్చిపిల్ల. అయోగ్యుడ్ని నమ్ముకొంది. తనకీ బిడ్డకీ నెమ్మొ చేసింది.... ఇలాంటి వేవో కొన్ని విన్న విషయాలు. నేను అంటే ఈ 'మో' అనే కవి గురించి మీరందరికీ లేదా ఏ కొందరికో చెందినవాడిగా అడుగుతున్నారు కదా. కాదలాకాదు. మా అమ్మ మస్తానమ్మకి నేను రెండో కుమారుడ్ని, నా తర్వాత ఇద్దరు కవలలు. ఆ తర్వాత నాకిద్దరు చెల్లెళ్లు. ఆ తర్వాత మళ్లీ మా అమ్మకి తమ్ముడో చెల్లెలో...! ఒద్దనుకొంది, 1954, మార్చి 30, గర్భస్రావం... అప్పట్నించీ నాకు మాతృప్రేమ, పితృద్వేషం. అన్ని బతికిన క్షణాలలోనూ కన్పించే స్త్రీమూర్తి మా అమ్మే. మస్తానమ్మే. ఇకనప్పట్నించీ "స్త్రీ"ని ప్రేమించటమూ, ద్వేషించటమూ పైత్యక స్థానంలో నన్ను అసహ్యించుకోవటమూ మొదలు పెట్టానన్నమాట. మునిగిపోయిన పక్షులంటేనూ ఎగిరిపోయిన చేపలంటేనూ నాకెంత ఇష్టమైన దృష్టి అన్నమాట. కీర్తిశేషులయిన సావిత్రి అన్నా. మీనాకుమారి అన్నా నాకు మా అమ్మ అంత ప్రేమ.

**ని** జాతీత తాత్వికత అంటూనే అతి నిజమైన నిత్య నైమిత్తకాలతో సదా సహజీవనం చేయించడం వల్ల సహజత్వం పాలు తగ్గదా?

సాల్వడార్ డాలీ స్వీయచరిత్ర చదివినపుడు ఈ ప్రశ్న నాకు నేనే వేసుకొన్నాను. నేటివిటీతో బాటు నిత్యనైమిత్తికాలని జత కలపటం వల్ల సాధించేదేమిటని? డాలీ నేటివిటీ వేరు; మన నేటివిటీ వేరు. ఆర్బెనిటీ మనిషిని డీ హ్యూమనైజ్ చేస్తుంది; డీ ఫెమీలియర్ చేస్తుంది. 'ది అనాటమీ ఆఫ్ ది నావెల్' పుస్తకంలోని ఒక చర్చలో - క్లాస్‌రూమ్‌లో ఒక విద్యార్థి అడిగిన ప్రశ్న ఏమిటంటే- "హౌజిట్ దట్ నో హీరో ఇన్ ఎనీ గ్రేట్ నావెల్ సీమ్స్ టుబి గోయింగ్ టుది లూ?" అని. దేవదాస్‌ని పెళ్లి చేసుకొని ఉంటే పార్వతి అంట్లు తోముతుంటుందా ప్రతి ఉదయమునని ఒక విమర్శకుడు ఆశ్చర్యపోబోయాడు. 'గెర్నికా' చిత్రాన్ని మెచ్చుకొన్న వాళ్లే అదే పికాసో వేసిన మరో చిత్రం - "ది ఉమెన్ యూరినేటింగ్"ని చూచేటప్పటికి ముఖం పక్కకి తిప్పుకుంటారు. మనిషంటే ఒకడుకాదు, వాడికి మూడు ముఖాలు అని మన ముఖంమీద కొట్టి చెప్పిన మహాద్భుత క్యూబిస్ట్ పికాసో. ఈ అన్నమయ, జీర్ణమయ కోశాల్నించి మనల్ని మనోమయ కోశాలకు ఉన్మత్తుల్ని చేసేదే సంగీత, చిత్ర శిల్ప కళా వైదగ్యాలు. పంచభూతాల స్వనాల్ని పట్టేసిన ఫ్లూట్, వయెలిన్, డ్రమ్స్, షహనాయ్, సితార్, క్లారినెట్ కసెట్స్‌ని వింటూ కూడా ఉభయసంధ్యలూ వార్చొచ్చు కాస్తంత విస్కీ సిప్ చేస్తొ. "మళ్లీ పరుండేవు మసలుతూ ఉండేవు మూరాము చాలింక లేరా" అని మళ్లీ మరో ప్రత్యూష ఊహ నిదర లేపుతుంది.

**క** విత్వంలో వ్యక్తివాదం, నిరాశా వాదం, కాల కృత్యాలు, కామ కృత్యాల ప్రతీకలు అనేకసార్లు తొంగి చూడడం వల్ల ప్రయోజనం?

కామకృత్యాలు తొంగి చూడటమనేది... సాహిత్యంలో సగభాగం. వాస్తవ ప్రపంచంలోని సమస్యలైన ఆర్థిక, సామాజిక, కౌటుంబికమైనవి. వీటికి రాజకీయాలను చేర్చి సోకాల్డ్ అభ్యుదయ, ప్రగతి వాద విప్లవ కార్యాచరణ సోకాల్డ్ సాహిత్యతత్వవేత్తలు మానవుడికి మరొక సగభాగమైన మానసిక ప్రపంచమంటూ ఏదీ లేకుండానే చేసారో నలభై యాభై ఏళ్లుగా, సాహిత్యానికి ఒక స్వయం ప్రతిపత్తి అంటూ ఏమీ మిగల్చనీకుండా తయారుచేసారు వాళ్లు. ఈ నాటి ప్రచార సాధనాలు అన్నీ కలగలిసి చేస్తున్న మూస ఆలోచనా ధోరణి కంటే సాహిత్యానికి ఎక్కువ హాని చేసింది. ఆ సోకాల్డ్ వామపక్ష మేధావులే. లిటరేచర్‌కీ సోషియాలజీ నడుమనున్న సూక్ష్మరేఖను చెరిపివేసారు. సాహిత్యానికీ మనస్తత్వజ్ఞానానికి ఉన్న సాన్నిహిత్యాన్ని ఛిద్రం చేశారు. వ్యక్తి(వ్యక్తివాదం!) అంటే వీళ్లకున్న అంచనా అల్లా స్వీయ ఆలోచన నశించిన మందబుద్ధి, మందలో కలిసి పోలేని వాడూనని, వాడొట్టి నిరాశావాది అని, నామిని, ఖదీర్‌బాబు, గోపిని కరుణాకర్ అంత గొప్ప రచయితలవటానికి మూలకారణం - వాళ్ల కారెక్టర్స్‌లోని వ్యక్తిత్వాల

మూలాన్ని సృజించటమే.

**మిమ్మల్ని ప్రభావితం చేసిన వారు?**

ప్రభావితం చెయ్యటమంటే నన్ను కూడా కథకుడిగా చెయ్యటం. అలా జరగలేదు కానీ కథలు రాయటమంటే కవిత్వం రాయటమంత తేలికకాదని తెలియజెప్పిన వాళ్లు మనప్రపంచానికి కొత్త ద్వారాలు తెరిచిన వాళ్లు - పద్మరాజు, బుచ్చిబాబు, చింతాదీక్షితులు, శ్రీపాద, చాసో, తిలక్, రావిశాస్త్రి... ఆర్డరిది కాదనుకోండి, ఈ నాటి వాళ్లలో మధురాంతకం మహేంద్ర, రాప్తాడు, అల్లం రాజయ్య, కేతు విశ్వనాథరెడ్డి, స్మైల్..... వీలు చిక్కినపుడల్లా మాండలికంలో రాసిన కథలు కూడా శ్రద్ధగా, బుద్ధిగా చదవటానికి ప్రయత్నం చేస్తున్నాను. మనిషిలోపలి మనిషిని చిత్రించే కథలంటే చాలా ఇష్టం(స్మైల్, త్రిపుర, అల్లంరాజయ్య, కాశీభొట్ల, డా.చంద్రశేఖర్, పతంజలిశాస్త్రి, తుమ్మేటి రఘోత్తమరెడ్డి) 'యజ్ఞం' మీద అంత యజ్ఞం చేసారు కానీ "నోరుమ్" ఎంత గొప్పకథ! అభిప్రాయ ప్రకటనలకి కవితలూ కథలు ఎందుకు? వ్యాసాలు రాసుకోవచ్చుకదా. ఓల్గా తన పాత్రల్లో ఎందుకు అంతనోరు పెట్టి మాట్లాడుతుంది! పెద్దిభొట్ల మోరలైజ్ చెయ్యటం మానుకోవాలిక. చలాన్ని ఎవరూ అనకరించలేరు, ఆ అవసరమూ లేదిక.


కవితా గుణ స్పృహ పెరగాలంటే మనకు పూర్వ (కనీసం ఓ వంద సంవత్సరాలయినా) నుండీ నిలబడిన మంచి కథనాలు మనకు తెలిసినన్ని భాషల్లో అధ్యయన శీలంతోనూ అనుభవసారం తోనూ పఠించాలి. పైకి (లోలోపల కాక) చదువుకుంటూ పోవాలి. అప్పుడు శబ్ద సౌందర్యం కొంచెం తెలుస్తుంది.


**ఆరుద్ర త్వమేవాహం అర్థం కాలేదనే మాట సాధారణంగా వినిపించేది. అలాగే మీ కవిత్వంపైనా విమర్శలున్నాయి.మరి ఈ రెండింటి మధ్యా తేడాను మీరెలా చూస్తారు?**

పియానోకీ హార్మోనియంకీ తేడా తెలుసుకోకపోతే ఎట్లా? గొప్పగా పియానో వాయించే వాడినొక్కసారి చూడండి! వీపు వెనక్కు వాల్చుకొని కీ బోర్డుమీద చూడకుండానే గొప్ప నొక్కులు నొక్కుతాడు. నొటేషన్ కాగితాన్ని పదేపదే చూడడుకదా. తల వెనక్కి వాల్చుకొని కళ్లుమూసుకొని అద్భుత సంగీత ప్రకంపనాల్ని అందిస్తోంటాడు. 'త్వమేవాహం' కావ్య రచనలో మనం మరచిపోయిన, తెలీని తెలుగు ఛందోరచనా విశేషాలున్నై. పైకి మాత్రం వచన కవిత్వంలా కన్పిస్తూనే ఆరుద్ర 'కవిహృదయం' అంటూ దాశరథికి ఓ లేఖ రాయటం..... ఇదంతా చరిత్రే. అందులో భాగమే ఈ ముప్పయ్ ఏళ్లుగా మోహన్‌ప్రసాద్ కవిత్వం అర్థం కాదనటమూనూ.

**శైలీక్లిష్టత, భావ క్లిష్టత, తాత్త్విక క్లిష్టత వీటి మధ్య కూడా కవిత్వం అందేలా చూడాలంటే ఏం చేయాలి?**

శైలి క్లిష్టత : 'శైలి' అనే పదం ఒక్క కవిత్వ రచనకే కాదు. అన్ని రకాల రచనలకీ ఉంటుంది. అన్ని వీలునామాలు ఒక శైలిలోనే రాయబడతాయే. కరణంగారి 'శైలి' దాని ప్రత్యేకత దానితే శాస్త్రీయ పరిశోధనలలో చేసే ప్రయోగఫలితాలు, ప్రేమలేఖలోని రచనాశైలి, ప్రేమని వ్యక్తం చేసేప్పటి మౌఖిక పదాలూ, తత్వాలలోని పాడుకొనే శైలీ, ప్రకృతి వర్ణన చేసేప్పుడూ, పండగ పబ్బాలపై రాసే చదివే పద్యాలలోని శైలీ, మన వచన కవులు అనవసరంగా ఒక పంక్తిని పునః పఠించే శైలీ ఇవన్నీ రకరకాలు. ద్రాక్షాపాకం, నారికేళపాకంలాంటి అరిగిపోయిన పదాలెటూ ఉన్నయ్. స్టైల్ ఈజ్ మాన్ అన్నారు కదా. శైలి-భాషని బట్టీ, ప్రాంతీయతని బట్టీ, యాసనిబట్టీ - మరీ ముఖ్యంగా మనసుని బట్టీ ఉంటుంది. స్టైల్ ఈజ్ మైండ్ అనడం మంచిదేమో. శైలి గురించి చెప్పాల్సింది భాషా శాస్త్రవేత్తలు. మార్క్సిస్టు, ఫెమినిస్ట్, స్ట్రక్చరిస్టులు వాళ్లవాళ్ల పరిభాషను వాడ్తారు శైలివిషయంలో కొండగుర్తులుగా కొన్ని పదాల్నిస్తాను. అవి - కోహెషన్, కాలొకేషన్, సెమాంటిక్ ట్రాన్సిషన్, ట్రాన్సిటివిటీ, అండర్ లెక్సికలైజేషన్ లాంటివి. 'గీతాంజలి'కి వచ్చిన అనువాదాల్ని పోల్చి చూస్తే శైలీ భేదాలు కన్పిస్తాయే. భాష/భావక్లిష్టత : - "ఏదియొ అర్థమ్ముకాని రక్తి స్ఫురియించు భావ గీతమ్ములని" అని కవి స్వయంగా చెప్పుకొన్నది తన భాష గురించి కాదు.రొమాంటిసిజం అనేది మనకు ఇప్పటికీ అవగాహనకీ అర్థానికీ అందని స్థితి గురించి ఇవుడయితే ఆధునికత్వం నుండి అత్యాధునికత్వానికి వెళ్తున్నపుడు కూడా అదే క్లిష్టత ఎదురవుతుంది.

తాత్విక క్లిష్టత : ఇదీ కవిత్వ విషయంలో తత్వశాస్త్రానికి సంబంధించిన విషయం కాదు. అలవాటయిన పదబంధాల్ని ఆలోచనలను తెంచటం, తుంచటం, "విశ్వనాధ సత్యనారాయణగారు ఓ మంచి శుక్రవారం ఎర్రశాలువా కప్పుకొని ...." అన్నప్పుడు గుడ్‌ఫ్రైడే, రెడ్ శెల్యూట్ వెంటనే తట్టవు. ఆడెన్ ఒక కవితలో - ప్రస్తుతం తల దాచుకొంటున్న కమ్యూనిస్టుల గురించి చెప్తూ, వాళ్లు వైటింగ్ పేషెంట్లీ అనే బదులు వైటింగ్ ఎక్స్‌పెన్స్‌వ్‌లీ ఎక్స్‌పెక్టింగ్ మిరకల్స్ టు హాపెన్ అంటాడు. ఓ నగరంలో కూచున్నారని రాస్తాడు. మామూలుగా అయితే 'వైటింగ్ పేషెంట్లీ అని రాయాలి కదా. 'సీతమ్మా చెప్పవే' అంటూ రామదాసు, "రాములవారు నాపై చలమూ చేసినారూ" అంటూ వాపోతాడు. సందర్భాన్ని బట్టి 'చలమూ' అనే మాటకి అర్థం నిదానంగా ఇంకుతుంది మనలో. తంత్ర కవితను అర్థం చేసుకోటం నిషిద్ధం. మంత్ర కవిత మనల్ని లీనాలీన స్థితిలో ఉంచుతుంది. తత్వాలు నిదానంగా మనలోకి ఇంకుతాయే. అర్థం చేసుకోవటం అంటే ఒక వస్తువుని వినియోగంలోకి తెచ్చుకోవటమన్నమాట. A poe communicates before it is underfood అని అన్నారు ఆధునిక కవితా 'గురువులు' ఎ a moon slowly released by the boughts" (మక్లీష్)

**కవితా గుణ స్పృహ పెరగడానికి ఏం చేయాలంటారు?**

గుణ స్పృహ పెరగాలంటే మనకు పూర్వం (కనీసం ఓ వంద సంవత్సరాలయినా) నుండీ ఎలబడిన మంచి కథనాలు మనకు తెలిసినన్ని భాషల్లో అధ్యయన శిలంతోనూ అనుభవసారంతోనూ పఠించాలి. పైకి (లోలోపల కాక) చదువుకుంటూ పోవాలి. అపుడు శబ్ద సౌందర్యం కొంచెం తెలుస్తుంది. సంగీతం వింటున్నప్పటిలా. ఏమీ చదవొద్దని చెప్పి ఆధునికులకు ద్రోహం చేసిన కవి కుందుర్తి. సామాజిక వాదాలతో ఆగిపోకుండా ఆ వాదాల వేదనలతో రాసిన కవితల్ని మననం

చేసుకోవాలి. నిజమైన ఆర్తి ఉన్న గీతమేదో కానిదేదో స్పష్టమవుతుంది. కవి "ఎంత గొప్పగా రాసాను" అనిపొంగిపోతే అది అతన్నించి తన్నుకొచ్చిన కవిత కాదనే. ఆర్ట్ లేని క్రాఫ్ట్: అది సామాజిక వాదులతో రాయబడే, రాయించబడే కవితల్లో ఇదే లోపం. ఇక నా తర్వాత కీర్తి! తృప్తినివ్వని కీర్తి!! ఆ కీర్తి కోసం ఇతర్ల వెంట బడటం!!!

**వైయక్తిక వ్యక్తీకరణల నిగూఢ శైలిని సామాజిక అంశాలకు ఆటోమాటిగ్గా అన్వయించడం వల్ల ప్రయోజనం?**

ఇది కూడా, ఆర్ట్-క్రాఫ్ట్‌ల మధ్య జరిగే గొడవే. అటూఇటూ రెండు వేపులా నుంచీ కీర్తి రావాలనే. అరువు తెచ్చుకున్న ఆవేశంతో, తనది కాని అనుభవంతో సామాజిక సమస్యలపైన తత్‌క్షణం ప్రతిస్పందిస్తేనే కానీ పేరు నిలవదేమోననే ఆరాటం. కవిత్వం భవిష్యత్తుకోసం వర్తమానంలో రాసే ప్రక్రియ. సమస్యకి పరిష్కారం దొరికిందా ఇక ఆ కవి చేతులు ఖాళీ అయిపోతాయి. ఇక వాడే కొత్త సమస్యల్ని లేనివాటిని తీరిగ్గా కూచుని సృష్టిస్తాడు. అలాంటి వాడి కవిత ఒక devils workshop. A wrong man in a paradise. రాజ్యాన్ని తిడ్తూనే, రాజ్యంలో భాగంగా ఉంటూనే, వాటి ఫలాల్ని అనుభవిస్తూనే తానుగా అందరికన్నా మించిన రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే ప్రయత్నమిది. వాళ్లే కెరీరిస్టు కవులు, రచయితలు. ఈ విషయంలోనే దళితవాద స్త్రీవాద కవులు, రచయిత్రులపై నా అసంతృప్తి.

**అభ్యుదయ కవిత్వం నుంచి నేటి వివిధ వాదాల వరకు మీరెలా చూస్తారు? వాటి నుంచి దూరంగా వున్నారనొచ్చా?**

అవును, నేను ఎడంగా ఉన్నాను, దూరంగా కాదు. వీధిలో ప్రొసెషన్ వెళ్తోంటే దారిపక్కన నొంచొని చూస్తుంటామే అలాగ. శతృత్వంతోకాదు. అందాకా ఎందుకు? walk for books అని రన్ ఫర్ బుక్స్ అని మనతో కొందరు పరుగులు తీయిస్తారే, రచయితల్నే పరుగులు తీయిస్తారు కొందరు పబ్లిషర్స్, కొన్ని బుక్‌షాపువాళ్లు - రచయితల్ని ఎక్కువగా అవమానించేది వాళ్లే. అలాగే కొన్ని ఉద్యమాలూ వాటి నాయకులూనూ, చివరికి మనని ఫూల్ చేస్తారు. అభ్యుదయ, విప్లవ, కవిత్వ రచనలకంటే వాటి వచన రచనలే (కథలూ, నవలలూ) ఇప్పటికీ విశ్వసనీయంగా నిలిచినయనుకొంటాను. వాటిల్లో నిజమైన జీవితచిత్రణ ఉంది. ఈ నాటికీ అవే క్లాసిక్స్‌గా నిలిచాయనుకొంటాను. ప్రజానాట్యమండలి వాళ్ల నాటకాలు కవిత్వంకంటే ప్రజల్ని ఎక్కువ ప్రభావితం చేసినాయేమో. ఆనాటి నాజర్, ఈనాటి గద్దర్ గొప్ప పర్ఫార్మింగ్ ఆర్ట్‌తో ప్రజల్ని ఉద్రూతలూగించారు. వచన రచనలే ఆలోచనని పెంచినయ్. కవిత్వపు ఆవేశం తాత్కాలికాలై పోయినవేమో.

**తాత్విక ప్రగాఢత" లేకుండా మీ శైలి క్లిష్టతను మాత్రం అనుకరించాలని ప్రయత్నించే వారిపై మీ కామెంట్?**

'తాత్విక ప్రగాఢత' అనే గొప్ప కితాబు నాకు నేనిచ్చుకోలేను. నన్నే కవీ అనుకరించినట్లు నేననుకోవటం లేదు. మహా అయితే వెక్కిరిస్తూ పారడీలు రాసారు. వాటిని చూచి ఎంజాయ్ చేసాను. 'తెలుగు కవిత్వంపై నా ప్రభావం' కూడా ప్రత్యక్షంగా ఉందనీ నేను చెప్పుకోలేను. కాకపోతే డిఫరెంట్‌గా రాయటం అనేది మాత్రం స్పష్టంగా కన్పిస్తోంది. Variety is the spice of poetry కదా. ఒకటి మాత్రం నిజం. నన్ను కూడా తమ కవితల్తో ఆశ్చర్యంలో ముంచగలిగిన కవులు సీతారాం, పసుపులేటి పూర్ణచంద్రరావు (ఈయన కవిత్వం ఇంకా పుస్తకంగా రాలేదు) జగన్‌రెడ్డి, జల్‌జలా లోని కవులూ, నామాడి శ్రీధర్, పసునూరి శ్రీధరబాబు, ఎం.ఎస్.నాయుడు, గోరటి ఎంకన్న, ఇంకా తెలంగానం చేస్తున్న కొందరు - ఎవరి గొంతులు వారివే అలా ఉండాలి. అలానే ఉండాలి. ముఖ్యంగా హైకూ కవులు, ఎక్కడ్నించి వస్తోన్నాయే వాళ్లకీ విచిత్రపుటూహలు (టివివి ప్రసాద్, గాలి) అని నా ఆశ్చర్యం!

నన్నే కవీ అనుకరించినట్లు నేననుకోవటం లేదు. మహా అయితే వెక్కిరిస్తూ పారడీలు రాసారు. వాటిని చూచి ఎంజాయ్ చేసాను. 'తెలుగు కవిత్వంపై నా ప్రభావం' కూడా ప్రత్యక్షంగా ఉందనీ నేను చెప్పుకోలేను. కాకపోతే డిఫరెంట్‌గా రాయటం అనేది మాత్రం స్పష్టంగా కన్పిస్తోంది.

**నేటివిటీ గురించి అంతగా రాసిన మీరు నేడు దేశీయ సంస్కృతులను ధ్వంసం చేస్తున్న గ్లోబలైజేషన్‌ను ఎలా చూస్తారు?**

గ్లోబలైజేషన్ అని గగ్గోలు పెడ్తూన్న మనమే ఆ దారిలో వచ్చే మొట్టమొదటి అవకాశాన్ని అందరికంటే ముందుగా చేజిక్కించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాం. కవులలో ఈ 'డబుల్‌టాక్' ఒక్క ప్రపంచీకరణ అనే అంశంలోనే గాక పితృస్వామిక, కొటుంబిక, వర్ణ, మహిళా వ్యవస్థలు విషయాల్లోనూ విన్పిస్తోంది. గ్రామాలు విడిచి పెట్టడం, మూలాల్ని మరచిపోయినట్లు నటించటం, తమ తమ కులాలకే దూరంగా జరిగిపోవటం, పిల్లల చదువుల విషయంలోనూ అమెరికాపై చూపునిగిడ్చటం, వీలయితే అక్కడికే చివరిదశల్లోనైనా చేరుకోవటం, వీలయినంత కట్నాల్ని ఎక్కువగా గుంజుకోవటం - ఇవన్నీ మైకుల్లో వీరావేశాల్ని వెలిగక్కే వాళ్ల oratorial ప్రతిభే.

దేశీయ సంస్కృతి అంటున్నారు మీరు! అది బ్రాహ్మణీయ, అగ్రకుల ఆధిపత్య సంస్కృతి అనే గదా మీరు దాన్ని ధ్వంసం చేయాలనేది! అలాంటి సంస్కృతి నిజంగానే ధ్వంసమౌతూంటే ప్రపంచీకరణ తప్పకుండా ఆహ్వానించాల్సిందే. ప్రపంచీకరణ అనే పదంలో నిగూఢంగా దాక్కొన్న మీ అభ్యంతరమల్లా రాజకీయ వ్యవస్థపైనేనని నా అనుమానం. ముందు మనమందరం ఈ టాల్‌టాక్‌ని కట్టిపెట్టి - మన వీధిలో మన కార్పొరేటర్ పరిధిలో, మనకు సంబంధించిన ప్రభుత్వ కార్యాలయాల్లో మన పనులు లంచాలిస్తేగానీ అవనితనం ఎందుకుందో, కరప్షన్‌లోని ట్రాన్సపరెన్సీని మనం ఎందుకు ఎదుర్కోవటం లేదో ఆత్మశోధన చేసుకోవాలి. ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియాని విమర్శించగలం పోలీస్ కానిస్టేబిల్‌ని పల్లెత్తు మాటనలేం. నిజజీవితంలో లంచాల్వికుండా ఏ ఒక్కపనినైనా చేయించుకోగలిగిన ఒక్క కవీ నాకింతవరకూ కనపడలేదు. అలాగే వివిధ వృత్తులకు సంబంధించిన వివిధ యూనియన్ల నాయకులు! మందిమీదపెట్టి వాళ్లసొంత పనులు చేయించుకొంటారు. వాళ్లందరూ

ప్రగతివాదులే. పోరాట శీలురే పైకి! ఎన్.జి.ఓ.లు నడుపుతున్నవాళ్లు... ఆహా ఏమి స్వీయసేవ! ఎంత స్వయంతృప్తి!!

నిజమే. ఎవడి మతం మీద వాడికిపుడు పిచ్చి ముదిరిపోయింది. కార్యకారణాలతో సంబంధంలేని సాముదాయక హత్య, ఆత్మహత్యల కల్చర్ పెరిగిపోతూంది. ఉదాహరణకి విజయవాడ బిసెంట్ రోడ్ సెంటర్‌లో ఆ బహిరంగ పూజలేమిటి? శ్రీ రామనవమి అయితే సరే, అదేదో ఇంట్లోనే ఎందుకు చేసుకోగూడదు.

**మీ కవిత్వంపై వచ్చిన విమర్శలలో మీకు నచ్చినవి, మిమ్మల్ని మార్చినవి ఏవైనా వున్నాయా?**

విమర్శలు, వ్యాఖ్యలకు నేనెపుడూ వ్యతిరేకంగా స్పందించలేదు. ఆ పని నేనూ చేస్తున్నాను కదా. అచ్చులో కూడా. పదవిలో ఉన్న కవి, రాజభవనంలో ఉన్న కవీ నన్ను భయపెట్టలేరు. నాదెపుడూ నిజంగా బాధపడిన కవిపక్షమే. ప్రసిద్ధి అనేది స్వయం సిద్ధంగా వస్తే బాగుంటుంది. సహజంగా ఉంటుంది. లేకపోతే చాటునైనా వీపు వెనుకనైనా నవ్వుకొంటారు. నా రచనా విధానం కొంతలో కొంతయినా మంచికైనా చెడుకైనా మారిందని నమ్మకం కలుగుతూంది. అది చెప్పాల్సింది అధ్యయన శీలురైన విమర్శకులే.

**సంక్లిష్టమవుతున్న సామాజిక పరిస్థితులలో కవిత్వం భవిష్యత్తు ఎలా వుంటుందనుకుంటున్నారు?**

వచన కవిత్వం ఇప్పటికే రాసిరాసి అరిగిపోయింది. శైలీబేధాలు లేకపోవటం ఒక కారణం. కవిత్వంరూపంగా కాదుగానీ, సారంగా మాత్రం మునుముందు గేయాలలోనూ గీతాలతోనూ కథలలోనూ నవలల్లోనూ దాక్కుంటుంది. ప్రస్తుతానికి ప్రచార సాధనాలే పైచేయి. ఈరోజైనా - వార్తపత్రిక చదవటంలో గడిపినంత కాలం, మతిలేని టి.వీ.సీరియల్‌నిచూడటంలో గడిపినంతకాలం మనం ఒక్క కవితను చదవటానికి వెచ్చించలేకపోతే కవులు రాసినా వాళ్లకు పాఠకులు ఉండరిక.

**మతం మీద విశ్వాసం మీద సాముదాయిక హత్యలు జరగాలి అన్నారు కదా, నేటి మతతత్వ ధోరణులను ఎలా చూస్తారు?**

నిజమే. ఎవడి మతం మీద వాడికిపుడు పిచ్చి ముదిరిపోయింది. కార్యకారణాలతో సంబంధంలేని సాముదాయక హత్య, ఆత్మహత్యల కల్చర్ పెరిగిపోతూంది. ఉదాహరణకి విజయవాడ బిసెంట్ రోడ్ సెంటర్‌లో ఆ బహిరంగపూజలేమిటి? శ్రీ రామనవమి అయితే సరే, అదేదో ఇంట్లోనే ఎందుకు చేసుకోగూడదు. మామూలు రోజుల్లో ట్రాఫిక్ పోలీసులు అందర్నీ తంతారు కదా. మరారోజు జిల్లా అధికారులు వారి సతీమణులు అక్కడ రోడ్డుమీద కుర్చీలేసుకు కూచోడమేమిటి? ప్రార్థనలకు - అదే మతమైనా పబ్లిక్ మైక్‌లెందుకు? ఎంత శబ్ధకాలుష్యం? ప్రార్థనామందిరాలన్నిటినీ బహిరంగ స్థలాల్నించి రాత్రికి రాత్రే తొలగించితే తప్పితే ఎవడి గుడిని ఎవడి మడిని ఎవడి దడని వారు ఇంట్లోనే పెట్టుకోమంటే తప్పించే మనకింకా "ట్రైన్ టు పాకిస్థాన్"లూ, "తమస్"లు రావల్సే ఉంటాయి. కార్పొరేట్ ప్రార్థనాలయాలు (ఎన్ఆర్ఐ మహానుభావుల పుణ్యం ఇవన్నీ) కార్పొరేట్ కాలేజ్‌లు, కార్పొరేట్ హాస్పిటల్స్ అన్నీ ఉన్నప్పుడు కార్పొరేట్ ప్రభుత్వాలు. సి.ఇ.ఓ.లూ అన్నీ ఉన్నపుడు కార్పొరేట్ ప్రభుత్వాలు, సి.ఇ.ఓ.లూ తప్పవు కదా తప్పవు.

**పోస్ట మాడ్రనిజం, డీకన్‌స్ట్రక్షన్, క్షణికం, శాశ్వతం ఇవన్నీ ఎలా ఇముడుతాయి?**

ఈ ప్రశ్న, దానికి జవాబులూ ఆఫ్సర్, తిరుపతిరావు, వేణుగోపాల్, గూడశ్రీరాములు, ఫణి - పత్రికలు మినిమి, అరుణతార, ప్రజాసాహితి తెలుగు అకాడమీ తెలుగు-ల్లో విన్పిస్తున్నాయి లేదా కన్పిస్తున్నాయి కదా అలా కొన్నాళ్లు సాగనివ్వండి. ఆ తర్వాత ఈ రెండింటినీ తెలుగు కవిత్వానికీ, కథకూ, నవలకీ అన్వయించే క్రమం కూడా సాధ్యమవుతుందని నేనాశిస్తున్నాను. మౌలికమైన ఈ అత్యాధునిక భావజాలాన్ని అప్పుడే రాజకీయం (లెఫ్టిస్టు) చేయకుండా అంతేచాలు. వెస్ట్‌లో పోస్ట మాడర్నిజం గతించినవాదంగా చెప్తున్నారు. మనమెంత లేదన్నా ఓ మూడు దశాబ్ధాలు ఆలస్యంగా మేల్కొంటాం కదా గతించిన వాదమన్న కమ్యూనిజం గురించి కూడా! అత్యాధునికత కేవలం సాహిత్యాంశం కాదు. వినిర్మాణ వాదం అవును. అత్యాధునికత సాహిత్యం-సాంఘికం, వ్యక్తి-సమూహ ప్రవర్తన వర్తనలకి సంబంధించిన అంశం. వినిర్మాణ వాదం భాషకీ, భావనకీ (అంటే మౌఖికమూ, లిఖిత రూపమూ రెండూ కూడా) రెండింటికీ సంబంధించిన అంశం. ఫాల్‌స్టాఫ్ మాటిమాటికీ వాడి బీరు పొట్టకి "మై ఊంబ్", మై ఊంబ్" అంటాడు 400 ఏళ్లక్రితం. ఇపుడు ఆ 'కడుపు'ని స్త్రీ పరంగా ఏ మాటతో వినిర్మాణం చెద్దాం?

**శ్రీ శ్రీ రసన మీ రస రాహిత్యం వీటిలో ఏది నిజం?**

శ్రీశ్రీ అన్న 'రసన'కి పొడిగింపు వ్యంగ్యంలోనూ కన్పిస్తుందని చలసాని ప్రసాదరావు రుజువు చేశారు. 'రససాహిత్యం' అస్తిత్వ వాదంలోని ఒక అంశం. 'రసరాహిత్యం'తోనే అద్భుతమైన రచనలు చేయొచ్చని నిరూపించిన వారు అల్బర్ట్ కమ్యూ,సాత్రే, మన శ్రీశ్రీయే మళ్లీ తెలుగులో దానిక్కూడా ఆద్యుడు. 'సంస్కార' సినిమాలో ఉన్న రసరాహిత్యం మానవ అవస్థకూ మూలాలు ఏ వేదాల్లోనూ, ఏ అపౌరుషేయాల్లోనూ దొరకవని మనకెపుడో తెలిసిపోయింది. మీరంటూన్న గ్లోబలైజేషన్‌వల్ల మళ్లీ అదే అవస్థ ఎదురవుతుంది. సైనికదళాలూ, పోలీసులూ, కోర్టులూ, విద్యాసంస్థలూ, ప్రార్థనాలయాలూ విధి నిషేధాల్ని చెప్పినపుడల్లా ప్రభుత్వం, దాని అంతః స్వరూపమైన రాజ్యం మనల్ని రహరాహిత్యం లోకీ ప్రేమరాహిత్యం లోకీ నెట్టేస్తాయి. సృజనశీలమయిన సాహిత్యం, కళలు, స్వేచ్ఛాభావాలూ తిరిగి రక్షించడానికి ప్రయత్నిస్తాయి.

**గ్లోబలైజేషన్ వల్ల దేశీయ సంస్కృతిలోని ఆరోగ్యకరమైన అంశాలు కూడా నాశన మవటం లేదా?**

అవును. ఖచ్చితంగా అవును. అయితే ఈ నాశనమవటం అనేది గత పదేళ్ళు గానే కాదు. అంతకుముందే మొదలయింది. సామ్యవాదం అనే ఒక వెల్లువ వచ్చి వ్యక్తికి స్వీయ వ్యక్తిత్వాన్ని కాల రాసినపుడే వచ్చింది.

## వాస్తవాన్ని ప్రతిబింబించాలి



జీవితాన్ని ధైర్యంగా యెదుర్కొని, వాస్తవాన్ని నిజాయితీతో బయటపెట్టగల రచనలు కావాలి.

ప్రతి విషయంలోనూ శ్రద్ధ తీసుకుని చూడగలిగినంత మేరకు చూడండి. చూసిన ఏ కొద్దిపాటి విషయాన్నైనా ఆధారంచేసుకుని, రచనలు చేయడానికి ఉపక్రమించవద్దు.

రాసే మూడ్ లేనప్పుడు బలవంతంగా రాయడానికి ప్రయత్నించకండి.

మూసలాంటి వ్యక్తుల్ని పాత్రలుగా తీసుకోకండి. నిత్యజీవితంలో మీకు తారసపడిన వ్యక్తుల్ని తీసుకుని పాత్రలుగా మలుచుకోండి.

కథ రాయడం పూర్తికాగానే, రాసిన దాన్ని కనీసం రెండు పర్యాయాలైనా ఓఉణ్ణంగా చదవండి. చదివి, అనవసరమయనిపించన మాటల్ని, పదబంధ్యాన్ని, పేరాల్ని నిర్ధాక్షిణ్యంగా తీసివేయండి. కథకు సరిపోయే ఇతివృత్తాని ముందు గల్పికగా కుదించి, ఆ తర్వాత కథగా పెంచుకుంటూ వెళ్ళడం మంచిపద్ధతి.

మీరు తప్ప మరొకరెవరూ అర్థంచేసుకోలేని విశేషణాలనూ, నుడికారాలనూ వాడకండి.

ఒక రచన వ్యంగాత్మకంగా (బయటికి) కనబడి, నిజమైన ఆశయం, అచ్చమైన మనోభావంలోపిస్తే, లోకంలో మంచి అంటూలేదని ప్రత్యేకంగా చేయాల్సిన పనేమీ లేదంటూ పాఠకుల్ని నమ్మించడానికి ప్రయత్నిస్తే, అది వ్యంగ్య రచనకాదు. మానవద్వేష రచన అనిపించుకుంటుంది.

సాహిత్యాన్ని - అదిఏకోవకు చెందినదైనా సరే ప్రచారం కోసం ఉద్దేశించినదేననడం సరియైదే కాని ప్రచారం కోసం ఉద్దేశించిన ప్రతిదీ, సాహిత్యం మాత్రం కాజాలదు.

నినాదాలు, పోస్టర్లు, అడ్వర్టైజ్‌మెంట్లు, టెలిగ్రాములు, టెక్ట్‌బుక్స్‌లాంటి వాటితోపాటు విప్లవం సృజనాత్మక సాహిత్యాన్ని కూడా విలువైనదిగానే వాడుకుంటుంది.

అయితే అది సృజనాత్మకత, ప్రతిభతో కూడుకున్నదూ వుండాలి., ప్రచారసాహిత్య సృష్టికర్తలమంటూ బయలుదేరే వారి రచనలవల్ల ప్రయోజనం పూజ్యం.

-లూసన్

దైవభక్తి మూఢత్వమే. కాని భక్తి సంగీతంలోని కళ, క్లాసికల్ మ్యూజిక్ అగ్రవర్ణ కళ అని తిరస్కరిస్తున్నాం. దేవాలయాల మీద శిల్పకళని కూల్చేసుకున్నాం. దేవాలయాల్ని కట్టినవాళ్ళు అగ్రవర్ణాల వారు కారే! హస్తకళలన్నీ నిజానికి శ్రామిక వర్గం వాళ్ళవే. ఇదొక పెద్ద కాంట్రడిక్షన్. గతంలో ఎన్నడూ లేనంతగా మళ్ళీ ఈనాడు స్వాముల వార్లు ఊరి కొకరు వెలుస్తున్నారు. గజ్జల మల్లారెడ్డి, అన్న 'భక్తిరసం' డ్రైనేజీ పొంగి పొరలి మనందర్నీ ముంచెత్తుతోంది.

ఓల్డేజ్ హోమ్స్ దేశీయమైన సంస్కృతికి చిహ్నమా? న్యూక్లియర్ కుటుంబాలు దేనికి చిహ్నం? పనికి రాని వినియోగ వస్తు క్రయ విక్రయ సంస్కృతి ఆరోగ్య కరమైన అంశమా? సామ్యవాదం మరి వీటిని ఎందుకు అడ్డుకోలేక పోయింది? దాని వైఫల్యమే గ్లోబలైజేషన్‌కి మూలం.

**విమర్శలన్నీ లెఫ్ట్ పైనే ఉన్నాయి మరి కన్జర్వేటివ్‌లు, సినిమాలు, చిత్రకళలపై చేస్తున్న దాడులు చేస్తున్నారు కదా?**

అవునండీ! 'ఫైర్' లాంటి సినిమాలు కదా! నిజంగా చూడాల్సిన సినిమాలని వీళ్ళు చూడనివ్వరు. 'సరస్వతి' చిత్రం కదా! వీళ్ళు ఎంత నీచమైన కాలెండర్ ఆర్టనయినా సహిస్తారు కాని కళాకారుడి సృజనత్వాన్ని బతకనివ్వరు. కన్జర్వేటివ్‌లు హిందూత్వ వాదులొక్కరే కాదు. కమ్యూనిస్టుల్లోనూ ఉన్నారా లేరా? వాళ్ళనించి తప్పుకోవటానికే ఆదూర్ గోపాలకృష్ణన్ 'ముఖామణం' తోడు 'గజగామిని'లో కాళిదాస మహాకవి సైకిల్ తొక్కుకుంటూ వస్తాడు. గొప్ప యానక్రానిస్టుగా మానస్ పేపర్ చదవుతాడో రోమన్ కాతిలిక్ సంస్కృతి ఒక ఇన్స్టిట్యూషన్‌గా అవసరం లేదు కాని సెర్ బేసిలికాలోని శిల్ప చిత్ర కళల ఔన్నత్యాన్ని నిర్మూలం చేసుకొందామా? కళల్ని ప్రజాస్వామికం చేయటం అంటే కళల్ని ఎప్పటికపుడు కొత్త రూపాలని మార్చటమే కాని మొత్తంగా భక్తి సంగీతాన్ని మొత్తంగా శృంగార చిత్రకళని మొత్తంగా హస్తకళని నాశనం చేయటం కాదు. సచ్చిదానంద్ అంటున్నాడు "Language carries the traces of its earlier uses.... associations, memories, aspirations, sufferings, archetypal encrustations and mythological fossils...."

●

కంభంపల్లి కృష్ణ



# నేలరాలిన నవ్వు

జెమినీలో డాన్స్ బేబీ డాన్స్ వచ్చే టైమయ్యింది. పిల్లలతో పాటు యువతీ యువకులు హుషారుగా డాన్స్ చేసే ఆ ప్రోగ్రామ్ అంటే సుధకు ఎంతో ఇష్టం. ఏ ప్రోగ్రామ్ మిస్సయినా దాన్ని మాత్రం మిస్సవకుండా ఉండటానికి ట్రై చేస్తుంది. తను చూడటమే కాదు కాలేజీలో ఎవరెవరు చూశారో ఆరా తీసి, చూడని వారిని ఖచ్చితంగా చూడమని చెబుతుంది. అడ్వర్టయిజ్‌మెంట్లు పూర్తయి కార్యక్రమం మొదలవుతుందనగా బెడ్ మీదికి చేరింది సుధ.

యాంకర్లు ఉత్సాహంగా కార్యక్రమాన్ని ప్రారంభించారు. ప్రతివారం ఓ గెస్ట్ వస్తారు కనుక ఈ వారం గెస్ట్ ఎవరా అని ఆత్రంగా ఎదురు చూస్తోంది సుధ.

ఈ వారం మన డాన్స్ బేబీ డాన్స్ ప్రోగ్రామ్‌కు అతిథిగా విచ్చేశారు 'వర్ధమాన సినీతార ఉషా....' అంటూ యాంకర్ గట్టిగా చెప్పాడు. వెంటనే కెమెరా యాంగిల్ మారింది. తెలుగుదనం ఉట్టిపడేలా, సంప్రదాయపు కట్టుబొట్టుతో ఓ యువతి చిరునవ్వులు చిందిస్తూ వేదిక మీదకు వస్తోంది.

సుధ రెప్పలు కొట్టడం కూడా మానివేసి అటువైపే చూస్తోంది. ఆ అమ్మాయి నవ్వుతుంటే మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తోంది. ఆ యువతితో పరిచయం కార్యక్రమం ముగిసాక ప్రోగ్రాం స్టార్ట్ అయ్యింది. పిల్లలు ఉత్సాహంగా డాన్స్ చేస్తున్నారు. ప్రేక్షకుల్లో కొందరు చిందులు వేస్తున్నారు. మధ్యమధ్యలో ఉషా నవ్వులు తళుక్కుమంటున్నాయి. సుధకు పట్టలేనంత ఆనందంగా ఉంది. కాలేజీలో ఎంతోమంది అమ్మాయిలను చూస్తున్నా ఎందుకో ఉషా ముఖంలో మరచిపోలేనిది ఏదో ఉందని తోచింది. వెంటనే...

'అమ్మా...అమ్మా...' అని పిలిచింది.

ఇంటి వెనకాల ఉన్న సుధ తల్లి మహాలక్ష్మి విసుక్కుంటూ వచ్చింది.

'ఏంటే నీ అరుపులు..నీకేదో అయిపోయినట్లు ఆ కేకలేమిటి' అంది కొంచెం కోపంగానే.

సుధకు ఆ కోపమేమీ పట్టలేదు.

'అమ్మా అటు చూడు. ఆ యాంకర్ల మధ్య కూర్చున్న అమ్మాయి ఎంత అందంగా ఉందో' అంది తల తిప్పకుండానే.

'బాగానే ఉంది. సిన్మా హీరోయిన్ ఆ మాత్రం ఉండదా' అంది మహాలక్ష్మి తేలిగ్గా.

సుధ ఆలోచనల నుండి తేరుకోకముందే మహాలక్ష్మి అక్కడినుండి వెళ్ళిపోయింది.

యాంకర్ ఉషతో మాట్లాడుతున్నాడు.

'మీరు ఇప్పటి వరకు ఎన్ని సినిమాల్లో నటించారు'

'తెలుగులో మూడు, తమిళంలో పదివరకు చేశాను. తెలుగులో రిలీజ్ కావాల్సింది ఒకటి ఉంది'

'మీరు మరచిపోలేని కాంప్లిమెంట్ చెబుతారా'

'నేను నవ్వినా, ఏడ్చినా అందంగా ఉంటానని భారతీరాజా గారు అన్నారు. అప్పుడు నాకు చాలా సంతోషం వేసింది'

మీరు ఎక్కువగా ప్రేమ సినిమాలలో నటిస్తుంటారు కదా, ప్రేమ గురించి మీ అభిప్రాయం? మీరెవరినైనా ప్రేమించారా?"

ప్రేమ అనేది చాలా గొప్ప విషయం.. ఇక నాసంగతంటారా,

సస్పెన్స్.."

ఈమె నవ్వే కాదు, భావాలూ బావున్నాయి అనుకుంది సుధ.

కార్యక్రమం చివరి దశకు చేరుకుంది. ఇక విజేతలను ప్రకటించడమే తరువాయి.

మైకు చేతిలోకి తీసుకున్న ఉష నవ్వుతూనే...

'రిజల్టు చెప్పాలంటే భయంగా ఉందండీ' అంది.

'మీరేం భయపడొద్దు. మా ప్రేక్షకులు మంచోళ్ళు. నిర్మొహమాటంగా చెప్పేయండి' అన్నాడు యాంకర్.

చిరునవ్వులు చిందిస్తూనే విజేతల పేర్లను చదివింది ఉష. చివరగా తన మనసులోని మాటను కూడా చెప్పి అందరికీ బై చెప్పింది.

సుధ మాత్రం ఇంకా తేరుకోలేదు. ఎంత మరిచిపోదామన్నా ఉష చిరునవ్వు ఆమె స్మృతిపథం నుండి మాయమవడం లేదు. చాలాసేపు అలాగే బెడ్‌పై పడుకొని ఉండిపోయింది. కళ్ళు మూసుకున్నా ఉష చిరునవ్వే కనపడుతోంది. ఆ జ్ఞాపకాలతో అలాగే నిద్దురపోయింది సుధ.

× × ×

మరుసటి రోజు కాలేజీ ఆవరణలోకి పరుగెత్తినట్లుగా అడుగుపెట్టింది సుధ. వేగంగా నడుచుకుంటూ వెళ్ళి స్నేహితులను కలుసుకుంది.

'హాయ్ సుధ' అంది భారతి.

'ఏంటే రాత్రి అందరూ డాన్స్ బేబీ డాన్స్ చూశారా' అంది ఆత్రంగా సుధ.

'అబ్బా మొదలయ్యిందే దీని డాన్సుల గొడవ' అంది భారతి విసుగ్గా.

'ఒక రోజు కవితల గురించి, ఇంకో రోజు డాన్సుల గురించి ఎందుకే మమ్మల చంపుతావ్' అంది మరికొంచెం విసుగ్గా మాధవి.

'అది కాదే పిచ్చిమొహం. రాత్రి డాన్స్ బేబీ డాన్స్‌లో గెస్టుగా వచ్చింది ఎవరో తెలుసా' అంది సుధ.

'ఎవరు'

ఉష. ఎంత అందంగా ఉందనుకున్నావ్. చాలాసేపు నేను తేరుకోలేదు తెలుసా. ఆ అమ్మాయి అందం, నవ్వు, మాటతీరు...అబ్బ ఒక్కటేమిటి అన్నింట్లోనూ నాకు బాగా నచ్చింది' అంది సుధ వేగంగా.

'ఆ...ఏ బొంబాయి నుండో వచ్చిన ఎర్రతోలు పిల్ల అయ్యింటుంది. ఆ మాత్రం అందంగా ఉండదా' అంది కమల.

'అది కాదే. ఆ అమ్మాయి తెలుగు ఎంత బాగా మాట్లాడుతుందో తెలుసా. ఖచ్చితంగా మన తెలుగు అమ్మాయే అయి ఉంటుంది' అంది సుధ.

'ఇంతకు రాత్రి ఆ ప్రోగ్రామ్ ఎవరెవరు చూశారు' అంది రాజి.

సుధ, జ్యోతి, బిందు మాత్రమే తలూపారు.

'మిగతా వాళ్ళంతా వేస్టే' అంది సుధ.

'ఏంటే సిన్మా హీరోయిన్‌ను చూసి మమ్మల్ని వేస్టంటున్నావ్. ఏంటి కథ' అంది రాజి బెదిరింపుగా.

సుధకు నవ్వాగలేదు. నవ్వుతూనే...

'నేనే మగాడ్నయితే.. ఆ అమ్మాయిని బలవంతంగానైనా పెళ్ళి చేసుకునేదాన్ని. అంత పవర్ ఉంది ఆ అమ్మాయి నవ్వులో' అంది సుధ.

'నీ మొహం. నిన్ను చేసుకునేవాడు వెనకాలే వస్తున్నాడు చూడు' అంది బిందు.

సుధ వేగంగా తల తిప్పింది.

ప్రకాష్ ఎటో చూస్తున్నా వస్తున్నది మాత్రం ఇటేనని తెలుస్తోంది.

'ప్రకాష్ వస్తున్నాడుగా...మేమిక పోతామే' అంది మాధవి.

'సరేనే..బై' అంది సుధ.

ప్రకాష్ దగ్గరికి వస్తున్నాడు. ప్రకాష్, సుధకి కాలేజీలోనే పరిచమయ్యాడు. ఒకే కాలేజీ అవడం వలన అప్పుడప్పుడు ఇంటికి కూడా వస్తుండేవాడు. పాడిపాడిగా మాట్లాడి సుధ వాళ్ళ ఇంట్లో కూడా మార్కులు కొట్టేశాడు. ప్రస్తుతానికి ఇద్దరి మధ్య ఉన్నది స్నేహమే అయినా దాన్ని వివాహబంధంగా మలచాలని ఇద్దరూ అనుకున్నారు. స్నేహితులకు తెలిసినా ఇంకా ఇంట్లో మాత్రం తెలియలేదు.



'హలో...'

'హలో...హలో సుధ...'

ప్రకాష్ గట్టిగా పిలుస్తున్నాడు.

'ఆ...' ఉలిక్కిపడింది సుధ.

'ఏమిటా పరధ్యానం. కొంచెం ఈ లోకంలోకి వస్తారా' అన్నాడు నవ్వుతూ.

'హేయ్ సారీ! ఏదో ఆలోచనలో ఉన్నాను'

'అంత దీర్ఘ ఆలోచనలో ఉన్నావంటే ఏదో స్పెషల్ విషయమే అయి ఉంటుంది' అంటూ సుధ చేయిపట్టుకు లాక్కెళ్ళాడు ప్రకాష్. ఇద్దరూ కొంచెం దూరంలో ఉన్న చెట్టు కింద కూర్చున్నారు.

'అది సరే...రాత్రి డాన్స్ బేబీ డాన్స్ చూశావా' అడిగింది సుధ.

'చూశా'

'గెస్టుగా వచ్చిన హీరోయిన్ ఎలా ఉంది'

'బాగుంది'

'అలా పాడిపాడిగా చెబుతావేంటి..సూపర్‌గా ఉంటేను'

'నిజం చెబితే నువ్వు ఫీలవుతావ్ కదా...అందుకే'

'ఏయ్..డొంకతిరుగుడుగా మాట్లాడకు. ఇంతకీ ఆ అమ్మాయిలో నీకు ఏం నచ్చింది'

'మొత్తంగా బావుంది'

'మొత్తంగా కాదు. ప్రత్యేకంగా ఆ అమ్మాయి నవ్వు బాగుంటుంది. నేను ఇప్పటికీ మరిచిపోలేకపోతున్నాను. ఆమెను చూసిన కొద్దీ ప్రేమ మీద కూడా గురి పెరుగుతుంది. తెలుసా'

ప్రకాష్‌కు నవ్వాగలేదు. గట్టిగా నవ్వుతున్నాడు. సుధకు ఏం చేయాలో తోచలేదు. ప్రకాష్ నెత్తిమీద రెండుసార్లు కొట్టింది. తలను పట్టుకొని అటూ ఇటూ తిప్పింది. ప్రకాష్ నవ్వు మాత్రం ఆపలేదు. ఆగి ఆగి నవ్వుతూ..

'ఒక అమ్మాయి నవ్వు ఇంకో అమ్మాయి మరిచిపోలేకపోవడం..ఓహ్! ఏం రోజులు వచ్చాయిరా బాబు' అన్నాడు.

'ఏయ్.ఏయ్..ఏం? ఒక అమ్మాయి నవ్వు ఇంకో అమ్మాయికి నచ్చకూడదా' అంటూ సుధ పోట్లాటకు దిగింది.

'అలా అని కాదు. నీకు నచ్చితే సరే. ఇంకా ఆ నవ్వును తలుచుకుంటూ నన్నుకూడా మరిచిపోతున్నవ్ చూడు అదీ డేంజర్' అన్నాడు నవ్వుతూనే.

'నిన్నెక్కడా మరిచిపోతానులే ప్రకాష్. రాత్రి టీవీలో ఉషను చూసి చాలా అభిమానం పెంచేసుకున్నాను' అంది సుధ నెమ్మదిగా.

సుధ ఫీలింగ్స్ అప్పుడప్పుడు అర్థంకావు అనుకున్నాడు ప్రకాష్. ఒకసారి అల్లరి పిల్లగా, మరోసారి ధైర్యవంతురాలిగా, అప్పుడప్పుడు పిరికిగా, మరోసారి సెంటిమెంట్‌గా ఇలా అన్ని రకాలుగా ఎలా ఉంటుందో అనుకున్నాడు. సుధ ఈ విషయాన్ని సీరియస్‌గా లేవనెత్తిందని అర్థమయ్యింది అతనికి.



'నువ్వు ఇందాకటి నుండి మాట్లాడుతుంటే ఏమిటో అనుకున్నాను. ఏంటి అంతగా మరిచిపోలేక పోతున్నావ్' అడిగాడు ప్రకాష్.

'గమ్మత్తుగా ఉంది కదూ. ఉష నవ్వులో నిండుదనం, ఆ అల్లరి, సంతోషం అన్నీ నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి ప్రకాష్' సుధ చెప్పుకుపోతూనే ఉంది.

'హు...నీకు పెద్ద జబ్బే చేసింది. దీన్ని పోగొట్టడం ఎలాగంటావ్'

'సింపుల్...నేనొకసారి ఉషాతో మాట్లాడితే సరిపోతుంది' అంది సుధ.

'ఏంటి ఉషతో మాట్లాడాలా'

'అవును'

'సినిమా వాళ్ళకు ఇన్నిన్ని అభిమాన సంఘాలు ఎక్కడినుండి పుట్టుకొస్తున్నాయబ్బా అనుకున్నాను. నీలాంటి వాళ్ళ వల్లనే అన్నమాట' అన్నాడు ప్రకాష్.

'ఇదిగో ఈ వేషాలే వద్దు. వీలైతే పరిచయం చేయి, లేకపోతేలేదు' మూతి ముడుచుకు కూర్చుంది సుధ.

'ఏయ్..దీనికే సీరియస్సా..సినిమా వాళ్ళు కదా..వాళ్ళకు బాగా పరిచయం ఉన్నవారు మనకు పరిచయం ఉండాలి, టైమ్ ఇవ్వాలి..ఇవన్నీ జరగాలి కదా. అయినా నీ కోసం ట్రై చేస్తాను' అన్నాడు.

'నాకు తెలుసు..నువ్వు ఎలాగైనా ఈ పరిచయ కార్యక్రమానికి ఒప్పుకుంటావని' అంది సుధ ప్రకాష్ చేయి నొక్కుతూ.

'సరే రా..క్లాస్ టైమ్ అవుతోంది' అన్నాడు ప్రకాష్.

ఇద్దరూ క్లాసరూమ్స్ వైపు నడిచారు.

× × ×

సాయంత్రం ట్యూషన్ నుండి లేటుగా వచ్చింది సుధ.

'ఏమిటే లేటు' మహాలక్ష్మి బట్టలూ సర్దుతూ అడిగింది.

'కొద్దిసేపు క్లాస్ ఎక్కువ తీసుకున్నారమ్మా' అంది సుధ అలిసిపోయినట్లుగా.

'ఇంతకుముందే ప్రకాష్ ఫోన్ చేశాడు'

'ప్రకాషా! ఏం చెప్పాడు?'

'ఆ సినిమా హీరోయిన్‌తో మాట్లాడతానన్నావట గదా. ఎల్లుండి పది గంటలకు రడీగా ఉండమన్నాడు'

'యాహూ...' అని గట్టిగా అరుస్తూ మహాలక్ష్మిని కౌగిలించుకుంది సుధ.

'ఏయ్! ఏమయింది నీకు. సినిమా హీరోయిన్‌ను కలుస్తున్నావా, నువ్వే హీరోయిన్ అయిపోతున్నావా' అంది మహాలక్ష్మి.

'అంతకంటే ఆనందంగా ఉంది. ఉష నవ్వును దగ్గరి నుండి చూడొచ్చు..చేతిలో చేయి వేసి మాట్లాడొచ్చు...ఆహా..ఓహో..'

డాన్స్ చేస్తోంది సుధ.

'ఆగవే. ఆ గంతులు ఏమిటి? ఎవరన్నా చూస్తే పిచ్చి పట్టిందనుకుంటారు'

'అనుకోని..నేను మాత్రం ఉషను కలుస్తున్నాను. అంతే..అహా..ఒహో..'

సుధ డాన్సు మాత్రం ఆపలేదు. ఇల్లంతా తిరిగింది. బెడ్ మీదికి ఎక్కి ఎగిరింది.

మహాలక్ష్మికి సుధ వ్యవహారం ఏం అంతుబట్టలేదు. పిచ్చిపిల్ల మాదిరిగా ఈ అరుపులు, గెంతులు ఏమిటి అనుకుంది. ఆ హీరోయిన్‌ను చూసి ఇంతగా అయిపోవడం ఏమిటో అనుకుంది. సుధ బెడ్ మీది నుండి దూకి కిందకు వచ్చింది.

'అమ్మ కొద్దిసేపు నువ్వే ఉష అనుకో..ఇప్పుడు నేను ఉషతో ఎలా మాట్లాడుతానో చూడు' అంటూ రకరకాలుగా ప్రారంభించింది. ఇలా కొద్దిసేపు రిహార్సల్స్ అయిపోయాక తల్లిని వదిలేసింది. బెడ్ మీదకు చేరి ఉష నవ్వులను, ఆమెతో మాట్లాడినట్లు కలలు కంటూ నిద్రపోయింది.

× × ×

ఆ రోజు కాలేజీకి రాగానే ప్రకాష్ కోసం వెతికింది సుధ. ఎక్కడా కనిపించలేదు. ప్రకాష్ స్నేహితులను కూడా అడిగింది. ఎవరూ కనిపించినట్లు చెప్పలేదు. ఈలోగా సుధ బ్యాచ్ అక్కడకు చేరుకుంది.

'ఏంటే డల్‌గా ఉన్నావ్' మాధవి అడిగింది.

'ప్రకాష్ కనిపించడం లేదు' ఎటో చూస్తూ జవాబు చెప్పింది సుధ.

'ఎప్పటి నుండి' అంది బిందు కంగారుగా.

'అదికాదే. ఈ రోజు ఇంకా కనిపించలేదు' అంది సుధ విసుక్కుంటూ.

'అదా. ఏదో పని ఉండి వచ్చి ఉండడులే. లంచ్ అవర్లో కలుస్తాడు. క్లాసుకు వెళ్దాం పదా' అంది బిందు.

'అది కాదే. రేపు సినిమా హీరోయిన్ ఉషను పరిచయం చేస్తానన్నాడు. ఆ విషయమే కన్ఫార్మ్ చేసుకుందామని వెయిట్ చేస్తున్నాను' దిగులుగా అంది సుధ.

'ఏంటి ప్రకాష్‌కు ఆ హీరోయిన్ తెలుసా. ఎప్పుడూ చెప్పలేదు' మాధవి ఉండలేక అడిగింది.

'ఎవరో ఫ్రెండ్ ద్వారా వెళ్తూ నన్ను కూడా తీసుకెళ్తానన్నాడు. మీరు క్లాసుకు వెళ్లండి. నేను కొద్దిసేపు చూసి వస్తాను' అంది సుధ.

అక్కడి నుండి బయలుదేరి గార్డెన్‌కు చేరుకుంది. అక్కడ కూడా ప్రకాష్ లేడు. 'సాధారణంగా కాలేజీకి రాకుండా ఉండడే. ఏమయి ఉంటుంది' అనుకుంది. 'రేపు పదింటికి రడీగా ఉండమన్నాడు. ఈ రోజు కనపడి ఇంకొన్ని వివరాలు చెప్పొచ్చు కదా' అని విసుక్కుంది కూడా. అటు నుండి లైబ్రరీకి వెళ్ళింది. అక్కడ వాకబు చేస్తే రాలేదని తెలిసింది. ఓ వైపు ఉషను రేపు కలుస్తానన్న ఆనందం, ఈ రోజు ప్రకాష్ కనపడనందుకు దిగులుతో సుధ అయోమయంలో పడింది. మరోసారి ఆవరణలో చూసి క్లాసుకు వెళ్ళింది.



లెక్చరర్ చెప్పేదేమీ బుర్రకు ఎక్కడం లేదు. ఉషతో ఏం మాట్లాడాలి, ప్రకాష్ ఎటు పోయాడు...ఇలా ఆలోచనల్లో పడింది. ఎలాగో అలాగా సాయంత్రం వరకు క్లాసురూమ్‌లో గడిపింది. సాయంత్రం మరోసారి కాలేజీ అంతా ప్రకాష్ కోసం వెతికి ఇంటికి చేరుకుంది. వెంటనే వెళ్ళి బెడ్‌మీద వాలిపోయింది.

'సుధ, ఏమయ్యిందే...' అంది మహాలక్ష్మి.

'ఏం లేదమ్మా. కొంచెం తలనొప్పిగా ఉంది' అంతే అంది.

'నీవు కాలేజీకి వెళ్లగానే ప్రకాష్ ఫోన్ చేశాడు. ఏదో పని ఉండి ఈ రోజు రావడం లేదని చెప్పాడు. రేపు పదిగంటలకు మాత్రం రడీగా ఉండమన్నాడు' అంటూ మహాలక్ష్మమ్మ ఇంటి వెనక్కు వెళ్లిపోయింది.

సుధకు ప్రాణం లేచివచ్చినట్లయ్యింది. 'ఇంత విషయాన్ని అమ్మ అంత సింపుల్‌గా చెప్పిందేమిటి' అని అనుకుంది. అయినా నా టెన్షన్ అమ్మకెందుకు ఉంటుందిలే అని కూడా అనుకుంది. గబగబా లేచి ముఖం కడుక్కొంది. భోజనానికి కూర్చుంది.

'అమ్మా, రేపు ఉషను ఏం ప్రశ్నలడగను' అంది.

'ఏం అడుగుతావ్. నీవేమన్నా ఇంటర్వ్యూ చేసేందుకు వెళ్తున్నవా. బుద్ధిగా మాట్లాడి రా' అంది మహాలక్ష్మి.

'అసలు అంత గొప్ప నవ్వు ఎలా వచ్చిదంటావ్' అంది సుధ.

'వెర్రిదానిలా మాట్లాడకు. పిచ్చి పిచ్చి ప్రశ్నలు వేసి అక్కడ టైమ్ వేస్ట్ చేయకు' అంది మహాలక్ష్మి కొంచెం చిరాగ్గా.

'సరే..సరే..' అంది సుధ నవ్వుతూ.

భోజనం ముగిసింది అన్నట్లు అనిపించి బెడ్ మీదికి చేరింది. ఈ సంతోషంలో ఏదన్నా కవిత రాస్తే బాగుండు అనుకుంది. సుధ హాబీల్లో కవితలు రాయడం ప్రధానమైనది. సంతోషం కలిగినా, బాధ కలిగినా తన భావాలకు అక్షరరూపం కల్పిస్తుంది సుధ. రాయడమే కాక ఖాళీ సమయాల్లో స్నేహితులకు కూడా వినిపిస్తుంటుంది. పేపర్, పెన్ను చేతిలో పట్టుకొని ప్రారంభించింది. పేజీలు పాడవుతున్నాయ్ గానీ ప్రారంభమే కుదరడం లేదు.

అసలు ఇన్ని రోజులు అన్ని కవితలు రాసింది నేనేనా అన్న అనుమానం కలిగింది. ఒకసారి పెన్ను మార్చింది. మరోసారి కూర్చునే ప్లేసు మార్చింది. కొద్దిసేపు పడుకొని ఆలోచించింది. ఏ విధంగా ప్రయత్నించినా కవిత మాత్రం ముందుకు సాగలేదు. అసలు ఈ సంతోషంలో కనీసం రెండు మూడు కవితలయినా రాయాలనుకున్నానే అనుకుంది. కవితలో రాస్తున్న పదాల్లో ఎక్కడో ఓ చోట అయినా ఉష నవ్వు గురించిన ప్రస్తావన తేవాలని చూస్తోంది. అప్పటి వరకు రాసిన ప్రారంభం ఏదీ నచ్చలేదు సుధకు. ఉషతో ఏం మాట్లాడాలి, ప్రకాష్ నన్ను ఎలా పరిచయం చేస్తాడు ఇలా ఆలోచిస్తూనే నిద్రలోకి జారింది.

× × ×

తెల్లవారింది.

'సుధా...సుధా...' మహాలక్ష్మి నిద్రలేపుతోంది.

'ఏంటే అమ్మా! కాసేపు ఉషతో మాట్లాడుతాను. డిస్టర్బ్ చేయమాకు' అంది కళ్ళు మూసుకునే.

'అది కాదు. త్వరగా లేవవే' అంది మహాలక్ష్మి ఇంకొంచెం గట్టిగా.

'అబ్బా ఏంటమ్మా! ఉష ఇక్కడే ఉంది. కాసేపు మాట్లాడి వస్తాను' అంది బద్ధకంగా.

'నేను చెప్పేది ఆ అమ్మాయి గురించేనే..ఉష చనిపోయింది' అంది మహాలక్ష్మి గట్టిగా.

సుధ దిగ్గున లేచి కూర్చుంది. నమ్మలేనట్లుగా చూసింది.

'ఏంటమ్మా, నీవు చెప్పేది నిజమా' అంది సుధ భయంగా.

'అవునే...ఈ పేపర్ చూడు' అంటూ పేపర్ సుధకి ఇచ్చి అక్కడి నుండి వెళ్ళిపోయింది.

'సినీనటి ఉష ఆత్మహత్య' అన్న పెద్ద అక్షరాలు పేపర్లో కనిపించాయి.

ఒక్కసారిగా సుధలో వణుకుడు ప్రారంభమైంది. ఒక్కొక్క అక్షరాన్ని కూడబలుక్కుంటూ చదివింది.

'...వర్ధమాన సినీ నటి ఉష నిన్న సాయంత్రం విషం తాగి ఆత్మహత్య చేసుకుంది. ఆమెతో పాటు ఆమె ప్రియుడు కూడా విషం తాగాడు. అతను ఆసుపత్రిలో చావుబతుకుల మధ్య పోరాడుతున్నాడు...'

# నవల విస్తృతి - కథ పరిమితి



నవల సంఘటనలతోను, పాత్రలతోను, వ్యక్తిత్వాలతోను నిండివుంటుంది. కథ మాత్రం ఒకే సంఘటన మిగిలిన విషయాలన్నీ ఆ సంఘటనలోనే ఇమిడివుంటాయి. నవలలో ఎన్ని ప్రదేశాలనైనా ఎన్నుకోవచ్చు. ఎన్ని పాత్రలనైనా చిత్రించవచ్చు. ఎన్ని దృశ్యాలనైనా వర్ణించవచ్చు, కానీ అన్ని సంఘటనలు ఒకే కేంద్రంలో కలసిపోవాలనే నియమం మాత్రం లేదు. నవలలో చాలా పాత్రలు మానసిక భావాలను వ్యక్తీకరించడానికి చిత్రించబడతాయి కానీ కథలో యీ బాహుళ్యం ఉండదు. ఒకే సంఘటన కథకు ఆధారంగా ఉంటుంది.

నవలలో కాన్ని మీ ఇష్టం వచ్చినట్లు దూకించవచ్చు. రాజనీతిని విమర్శించవచ్చు లేదా వర్ణనలు ఎక్కువగా చేయవచ్చు,. కాని భాష సరళంగా వున్నంత వరకు ఎటువంటి అపాయంలేదు. నవలలో ఒక నాట్యమందిరాన్ని గురించో ఒక సభ గురించో పది, పదిహేను పేజీలు వర్ణించవచ్చు. కానీ కథలో మాత్రం మీరు ఆసభ ముందుగానే, ఆనాట్య మందిరం ముందుగానే వెళ్లారు. ఎంత ఉత్సాహం, ఆసక్తి వున్నప్పటికీ మీరు వాటి వంక చూడకూడదు. కథా హద్దులను దాటి ఒక్క శబ్దాన్ని, ఒక్క వాక్యాన్ని కూడా మీరు అక్కడ వ్రాయకూడదు. అంతేకాకుండా కథారచనలో భాష సరళంగాను అర్థమయ్యేటట్లుగాను వుండాలి.

కథ ఎప్పుడూ సామాన్య పదజాలంతో వుండి, అనవావశ్యకమైన దానిని వదిలివేస్తూ వుండాలి. మొదటి వాక్యమే పాఠకులను ఆకర్షించి, అంతంవరకు ముగ్ధులను చేయాలి. కథ రుచిగాను, తాజాగాను వుండి వికాసం చెందుతూ ఆదర్శాన్ని చూపాలి. ఆదర్శహీనమైన కథ వలన ఆనందం లభించినప్పటికీ మానసిక తృప్తి లభించదు. కథలలో మనం ఉపదేశాలు ఎన్నడూ కోరం కాని మన ఆలోచనలను ఉత్తేజపరచడానికి మానసిక భావాలను జాగృతం చేయడానికి దానిలో ఏదో కొంత వుండాలి.

పాఠకులు కథలలోని పాత్రలలో లీనమై ఆ పాత్రలే తాము అని తలంచినపుడే కథ పూర్తిగా ఫలితం పొందుతుంది. ఆనందం కూడా అందిస్తుంది. రచయిత పాఠకులలో తాను సృష్టించిన పాత్రల పట్ల సానుభూతిని కల్పించలేకపోతే తన ఉద్దేశాలను పూర్తిచేయడంలో విఫలుడయ్యాడన్నమాట.

- ప్రేమ్ చంద్

ఇక చదవలేకపోయింది సుధ. కలా నిజమా అని కూడా అనుకుంది. గలగలలాడే ఆ చిరునవ్వు ఎలా మాయమయ్యింది అనుకుంది. పేపర్లో ఉష ఫొటో కనిపిస్తోంది. కొంచెం మొహం ఉబ్బినట్టుగా ఉంది. కళ్ళు అలసటతో మూసుకున్నట్లు అనిపిస్తోంది. చిరుజల్లులు పంచే ఆమె నవ్వు మాత్రం కనిపించడం లేదు. పేపర్ చూస్తూనే కూర్చుండి పోయింది సుధ.

ఎంత ఆపుకుందామనుకున్నా కన్నీళ్ళు ఆగడం లేదు. దిండులో తలదూర్చి వెక్కివెక్కి ఏడుస్తోంది.

ఇంతలో ఫోన్ మోగింది.

కళ్ళు తుడుచుకుంటూనే ఫోన్ ఎత్తి 'హలో' అంది నీరసంగా.

'హలో సుధా..నేను ప్రకాష్‌ని'

సుధ సమాధానం ఇవ్వలేదు.

'సుధ పేపర్ చూశావా'

'ఆ..' అంది బలవంతంగా.

'సుధా..ప్లీజ్ మాట్లాడు. నువ్వేం బాధపడొద్దు' కంగారుగా మాట్లాడుతున్నాడు ప్రకాష్.

'ప్రకాష్...ఎలా జరిగింది' ఏడుస్తూనే అడిగింది సుధ.

'పేపర్లో రాసిన విషయాలే ఇప్పటి వరకు తెలుసు. మా ఫ్రెండ్ ద్వారా మిగతా విషయాలు తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. నీవు అప్‌సెట్ కావొద్దు' ప్రకాష్ గొంతులో కంగారు తగ్గడం లేదు.

ఉష రూపాన్ని తలుచుకుంటేనే పొరలు పొరలుగా దు:ఖం వస్తోంది సుధకు. ఇంకోసారి పేపర్‌వైపు చూసే ధైర్యం కూడా చేయలేకపోయింది. ఇద్దరు విషం తాగితే ఒకరే ఎలా చనిపోయారు? అసలు ఇది నిజమైనా ప్రేమేనా? అతను ఏమన్నా మోసం చేశాడా? ఏమయి ఉంటుంది? సుధ ఆలోచనలకు అంతేలేకుండా పోయింది.

మళ్లీ మళ్లీ ఫోన్ చేస్తూనే వున్నాడు ప్రకాష్. కాని సుధ స్పందించలేదు. ఆమెను ఉత్సాహపరచడానికి ఏవేవో ప్రోగ్రామ్స్ ప్లాన్ చేశాడు. కాని ఆమె ఉత్సాహం చూపలేదు. సినీనటి ఉష మరణంపై ఆ తరువాత రకరకాల కథనాలు పత్రికల్లో వచ్చాయి. ఎక్కువ శాతం ఆమెను హత్య చేసి ఉంటారనే ఊహలను బలపరిచాయి. సుధ చాలా రోజుల వరకు కోలుకోలేదు.

"ఒక సినిమా యాక్టర్ పోయినందుకు నీవింత డిప్రెస్‌కు గురికావడం సరైందేనంటావా? అని అడిగాడొక రోజు కొంచెం చిరాగ్గా.

'నేను బాధపడుతున్నది ఆమె కోసమే కాదు. ప్రేమను గురించిన ఆమె నమ్మకాలు వమ్మయినందుకు. ఆమె ప్రేమ సినిమాలు నన్ను చాలా ఇన్‌స్పైయిర్ చేశాయి. అలాటి మనిషికే ఇలా అయింది కదా, ఇంక నాలాటి వాళ్ల సంగతి ఏం చెప్పగలం? అందుకే మనలాటి వాళ్లం ఆలోచించి అడుగేయాలి అనుకుంటున్నాను'...సుధ గొంతులో స్థిరత్వం ధ్వనిస్తోంది.

'అంటే నా మీద నమ్మకం లేదా?' ప్రకాష్‌కు అసహనంతో పాటు కోపం కూడా వస్తోంది.

"చూడు ప్రకాష్, ఇది మనిషి మీద నమ్మకం సమస్య కాదు. కాలానికి, విలువలకు సంబంధించిన సమస్య. ప్రేమ అనేది అంత తేలికైన ఒక మాట కాదని, చిరునవ్వులు చిరకాలం నిలిచేవి కాకపోవచ్చని నాకిప్పుడు అర్థమైంది. అందుకే....మనం తొందర పడకుండా వుండటం మంచిది." మాటలు ముగించి చకచకా నడిచిపోతున్న సుధను చూస్తుండిపోయాడు ప్రకాష్.

విశ్లేషణ

డాక్టర్ మేడిపల్లి రవికుమార్

# సాహిత్యం దార్శనికత



.............✧.............

పురుషాధిపత్యం, నవీనత్వాన్ని తిరస్కరించడం, ప్రాచీనతను కీర్తించడం, వర్తమాన భవిష్యత్తులకంటే గతమే గొప్పదనుకోవడం, జానపద చందస్సు హేయమైందని భావించడం, వ్యావహారిక భాష కవితా నిర్మాణానికి పనికిరాదని విశ్వసించడం వంటి అనేక అంధవిశ్వాసాలతో గురజాడ నాటి సమాజం ఉంది.

.............✧.............

ఆధునిక తెలుగు సాహితీ వేత్తల్లో వీరేశలింగం వంటి వైతాళికులేకాదు, కొందరు తాత్వికులూ ఉన్నారు. తాత్వికులైన వైతాళికులూ ఉన్నారు. సమస్యను పరిష్కరించటం వైతాళికుల లక్షణం. సమస్యకు మూలాలను వెదకటం తాత్వికుల పద్ధతి. మూలాలను వెదికి సమస్యకు .పరిష్కారాన్ని సూచించటం తాత్వికులైన వైతాళికుల లక్షణం. ఇటువంటి తాత్వికులైన వైతాళికులలో ప్రథమ తాంబూలం పుచ్చుకోదగిన వేత్త గురజాడ అప్పారావు.

ఆధునిక యుగంలో సాహితీమూర్తిగా గురజాడ పుట్టుక తెలుగు సాహిత్యానికి ఒక గొప్ప మలుపు. మహాకవి అయినవాడు మామూలు కవికంటే ముందుకు కదులుతాడు. వర్తమాన ప్రజా జీవితాన్ని వాస్తవిక దృక్పథంతో అధ్యయనం చేస్తాడు. ఈ అధ్యయనం ద్వారా ఒక మహాదార్శనికుడుగా మారతాడు. ఈ దార్శనికతమూలంగా తన కాలాన్ని దాటి పోతాడు. వర్తమాన సామాజిక పరిస్థితుల్ని అధిగమించి భవిష్యజ్జాతి వికాసం కోసం ఒక ఆదర్శ సమాజాన్ని కలగంటాడు. కేవలం ఆనంద ప్రధానంగా కాక చైతన్య ప్రయోజనంగా కలాన్ని కదం తొక్కిస్తాడు. పదం పాడిస్తాడు. తెలుగు సాహిత్య లోకంలో మొట్టమొదటి సారిగా గురజాడ అప్పారావు ఈ పనిచేశాడు.

కన్యాశుల్కం, బాల్యవివాహాలు, మూఢ విశ్వాసాలు, అంటరానితనం, రాళ్ళూ రప్పల్ని పూజించడం, భర్త భార్యపై ఒక వేల్పుగా తన అధికారాన్ని ప్రకటించడం, పురుషాధిపత్యం, నవీనత్వాన్ని తిరస్కరించడం, ప్రాచీనతను కీర్తించడం, వర్తమాన భవిష్యత్తులకంటే గతమే గొప్పదనుకోవడం, జానపద చందస్సు హేయమైందని భావించడం, వ్యావహారిక భాష కవితా నిర్మాణానికి పనికిరాదని విశ్వసించడం వంటి అనేక అంధవిశ్వాసాలతో గురజాడ నాటి సమాజం ఉంది. అందుకే గురజాడ తన సాహిత్యదార్శనికత ద్వారా సామాజిక వాస్తవాలను ప్రతిబింబిం

డా.ఎం.రవికుమార్
• అసిస్టెంట్ ప్రొఫెసర్
వెంకటేశ్వర యూనివర్శిటీ

చాడు. సామాజికంగా ఉన్న అనేకలోపాలను ఎత్తి చూపించాడు. వాటినన్నింటినీ సంస్కరించుకొనే అవకాశం కల్పించాడు. కవిగా గురజాడ దృష్టి చాలా తక్షణమైంది. విశాలమైంది. అందుకే అది ఎన్నో సామాజిక పార్శ్వాలను సమర్థవంతంగా స్పృశించగలిగింది.

గురజాడ నాటికి మనం సాంకేతికంగా ఆధునిక యుగంలోకి అడుగుపెట్టాం. అయినా వాస్తవంలో ఫ్యూడల్ భావజాలంలోనే ఉన్నాం. అప్పటికీ దేశమంటే మనిషికాదు. మట్టి మాత్రమే. మనుషులంటే పాలకులు వారి బంధు గణాలు, వారి సామంతులు, వైదిక మత ధర్మాలను పరిపోషిస్తూ ఉన్న పురోహిత వర్గాలు మాత్రమే. గురజాడ ఈ పరిస్థితిని ధిక్కరించాడు. "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అన్న వాస్తవాన్ని దర్శించాడు. సగటు మనిషికి పట్టం కట్టాడు. తాను కలగన్న ఆదర్శలోకంలో చిరకాలం మనగలిగే మూర్తీభవించిన మానవత్వానికి రూపం కల్పించాడు. వైదిక ధర్మాన్ని కాక లౌకిక ధర్మాన్ని సాహిత్యంలో ప్రతిష్టించాడు. గురజాడ రచనలన్నింటిలోనూ ఈ దార్శనికతే మనకు వెలుగునిస్తుంది.

ప్రతిరోజూ సూర్యోదయం జరుగుతూనే ఉంటుంది. అయినా ప్రతిరోజూ వినూత్నంగా దర్శనం ఇవ్వటం ఉదయ సూర్యుని లక్షణం. ఉత్తమ కవిత్వం కూడా సూర్యోదయం లాంటిదే. అది ఎప్పటికప్పుడు వినూత్నంగా మన అనుభవాలను స్పృశిస్తుంది. మన అనుభూతులను పలకరిస్తుంది. మన బాధ్యతలను గుర్తు చేస్తుంది. గురజాడ ఒక ఉదయ సూర్యుడు. గురజాడ కవిత్వం ఒక సూర్యోదయం. ఈ సూర్యోదయపు వెలుగు మూలంగా అగ్ని సరస్సులోంచి వేరువేరు ముఖాలతో వికసించిన వజ్రాలే చలం, త్రిపురనేని రామస్వామి చౌదరి, ఉన్నవ, శ్రీశ్రీ, జాషువా వంటి వారంతా.

ఆధునిక తెలుగు సాహిత్యంలో దేవుల పల్లి కృష్ణశాస్త్రి ది ఒక ప్రత్యేక స్థానం. ఫ్రెంచి విప్లవం సాధించిన ఫలితాలకూ, రూసోవంటి ప్రపంచప్రసిద్ధ తత్త్వవేత్తలు ప్రచారం చేసిన భావజాలానికీ కాల్పనిక వాదిగా ఫ్యూడల్ వ్యవస్థమీద కృష్ణశాస్త్రి గొప్ప తిరుగుబాటు ప్రకటించాడు. వ్యక్తిగా ఎవరికీ శిరస్సు వంచలేదు. స్వేచ్ఛ తన ప్రాణం అన్నాడు. ప్రకృతిలో సంలీనం అయ్యాడు. ఊహాలోకాల్లో విహరించాడు. నిస్సిగ్గుగా ప్రేయసులను సృష్టించుకొన్నాడు. ప్రవాసంలోకి వెళ్ళడం, విప్రలంభంలో ఏడ్వడం తన హక్కుగా కృష్ణశాస్త్రి భావించాడు. అదే తన సాహిత్య దార్శనికతగా సాహిత్య సృజన చేశాడు.

> తెలుగు సాహిత్యలోకంలో ఆధునిక యుగంలో ఒక ప్రభంజనంలా విరుచుకు పడిన రచయిత చలం, సామాజిక జీవితంలో తాను ఒంటరిగా ఉన్నట్టు అనిపించినా సమాజంలో సగభాగమైన స్త్రీ జాతి స్వేచ్ఛ కోసం కలం పట్టిన బలమైన రచయిత చలం. తన రచనల ద్వారా చలం ప్రకటించిన భావ జాలం ఎంత వివాదగ్రస్థమైనదో సాహితీ ప్రియులకు అయన అంత ప్రీతి పాత్రుడయ్యాడు.

కృష్ణశాస్త్రి వందలాది యువకుల్ని ప్రభావితం చేశాడు. వారిని యువకవులుగా మార్చాడు. తానేడ్వడమేకాక; ఎప్పుడు, ఎందుకు, ఎలా ఏడ్వాలో చెప్పి అందరిచేతా సామూహిక శోకగీతాలాపన చేయించాడు. వారందరినీ తన చుట్టూ ఉపగ్రహంలా తిప్పుకున్నాడు. మహాకవి శ్రీశ్రీ కూడా ఒకప్పుడు కృష్ణశాస్త్రి చుట్టూ పరిభ్రమించిన ఒకానొక ఉపగ్రహమే!

కృష్ణశాస్త్రి స్వరాన్నేకాదు, రూపాన్ని కూడా అనుకరించడానికి ఆనాటి యువ కవిలోకం వెర్రిగా ఎగబడింది. కృష్ణశాస్త్రి స్వరాన్ని వదిలిపెట్టిన్నా వేషాన్ని ఇంకా అంటిపెట్టుకొనే ఉన్న ఆవంత్స సోమసుందర్ వంటి ప్రసిద్ధ కవులను ఈనాటికీ మనం చూడవచ్చు. కృష్ణశాస్త్రి సాహిత్య క్షేత్రపరిధి ఎంత విశాలమైందో ఒకనాటి కవిలోకానికి కృష్ణశాస్త్రి గురుత్వాకర్షణ శక్తి అంత శక్తివంతమైంది.

తెలుగు సాహిత్యలోకంలో ఆధునిక యుగంలో ఒక ప్రభంజనంలా విరుచుకు పడిన రచయిత చలం, సామాజిక జీవితంలో తాను ఒంటరిగా ఉన్నట్టు అనిపించినా సమాజంలో సగభాగమైన స్త్రీ జాతి స్వేచ్ఛ కోసం కలం పట్టిన బలమైన రచయిత చలం. తన రచనల ద్వారా చలం ప్రకటించిన భావ జాలం ఎంత వివాదగ్రస్థమైనదో సాహితీ ప్రియులకు ఆయన అంత ప్రీతి పాత్రుడయ్యాడు. తనకాలం కంటే ముందు నిలిచి భవిష్యత్తుకు రూపకల్పన చేసిన దార్శనికుల్లో ముందు వరసలో నిలబడ గల రచయిత చలం.

చలం దృష్టిలో సాహిత్య ప్రయోజనం వేరు. సమాజంలో అసహాయులుగా ఉన్నవారిలో సాహిత్యం చైతన్యం కలిగించాలి. వ్యక్తిత్వాన్ని కల్పించాలి. ధైర్యాన్ని ఇవ్వాలి అని చలం భావించాడు. ఈ సమాజంలో స్త్రీ జాతి అసహాయంగా ఉన్న కఠిన వాస్తవాన్ని చలం గుర్తించాడు. అందుకే స్త్రీ జాతికి స్వేచ్ఛ ప్రసాదించడానికే చలం తన ప్రతిభనంతా కేంద్రీకృతం చేశాడు. బూర్జువా సంస్కృతి సాధించిన కాల్పనిక భావజాలంలోని మనోవైఖరిని వేరువేరు కోణాలలో చలం నిరసించాడు. ఎదురుతిరిగాడు, ఒక ప్రత్యేక సౌందర్యాన్ని చలం అన్వేషించాడు. ఆస్వాదించాడు. ఆ ఆస్వాదనలో మనస్సుకూ శరీరానికీ అభేదం పాటించాడు. ఇంగ్లీషు రచయితల్లో డి.హెచ్.లారెన్స్‌ను అనుకరించక పోయినా అటువంటి దార్శనికుడిగా స్థిరపడ్డాడు. స్త్రీ స్వేచ్ఛను ఆవిష్కరించడంలో చలం ఎంచుకున్న మార్గం రుచించని వారు కూడా ఇతరుల దృష్టిలో పడకుండా, ఆడా మగా తేడాలేకుండా చలాన్ని అధ్యయనం చేశారు. చదవడం రాని స్త్రీలుకూడా చాటుగానో మాటుగానో నక్కాలు, పిల్లల ద్వారా చదివించుకొని విన్నది ఆధునిక కాలంలో ఒక్క చలాన్నే. చలం దార్శనికతలోని ఆకర్షణకూ, శక్తికీ ఈ పరిణామం ఒక నిలువుటద్దం.

ఆధునిక తెలుగు సాహిత్యంలో చలం ఎంత సంచలనం రేపాడో మరో కోణంలో విశ్వనాథ సత్యనారాయణకూడా అదే పని చేశాడు. చలంలాగే విశ్వనాథ కూడా పర్వతం అంతధైర్యం కలవాడే. తాను విశ్వసించిన విషయాన్ని, తాను దర్శించిన ధర్మాన్ని కాలానికీ సమాజానికీ ఎదురీది సాహిత్యంలో వినేదించినవాడు విశ్వనాథ. బూర్జువా సాంస్కృతిక విప్లవ భావజాలం ద్వారా బీటలు వారిన వైదిక ధర్మాన్ని కొన్ని శతాబ్దాలు వెనక్కు వెళ్ళి పునరుద్ధరించడానికి ప్రయత్నించిన అపర భగీరథుడు విశ్వనాథ. రామాయణ కల్పవృక్షంలాంటి ఇతిహాసంలోనేకాదు, వేయి పడగలు వంటి ఆధునిక నవలలో కూడా సహస్రముఖమైన వైదిక ధర్మమే ప్రతిపాదించ బడిందని విశ్వనాథే స్వయంగా చెప్పుకొన్నాడు. (ఉపన్యాసాలు, ఇంటర్వ్యూలు - పు. 258)

కవి దార్శనికత వర్తమాన జీవిత వికాసానికి ఉద్దేశించింది కానపుడు సాహిత్యం కొన్ని అపశ్రుతుల్ని గానం చేస్తుంది. కొందరు భావవాదులకు విశ్వనాథ దార్శనికత మహోన్నతంగా కన్పించినా, త్రిపురనేని మధుసూదనరావు వంటి భౌతికవాదులకు ఒక అపశ్రుతిగా విన్పించింది. అందుకే త్రిపురనేని 'విశ్వనాథ తిరోగమన సాహిత్యం' అనే పేరుతో ఒక పెద్ద విమర్శనా గ్రంధాన్నే ప్రకటించారు.

"విశ్వనాథ సామాజిక దృక్పథం తిరోగామి దృక్పథం. వర్తమాన విషయాల్ని గతం నుంచి చూస్తాడు. రాచరిక, పురోహిత, భూస్వామ్య వ్యవస్థని సర్వకోణాల నుంచీ సమర్థించాడు. మత మూఢవిశ్వాసాల్ని కీర్తించాడు. వర్ణ ధర్మాన్ని సమర్థించాడు. స్త్రీ పురుష అసమానతల్ని సమర్థించాడు. సజీవ సమాజాన్ని కాదు, నిర్జీవ సమాజాన్ని సమర్థించాడు. కాలదోషం పట్టిన జీవన వైఖరిని పునరుద్ధరించడానికి ప్రయాసపడ్డాడు... ఆయన సమాజ పురోగమనాన్ని సామాజిక పతనంగా చిత్రించాడు. (పు.14,15). అని భౌతిక వాద దృష్టితో విశ్వనాథ సాహిత్య దార్శనికతను విశ్లేషించాడు.

గతంలో వేమన, గురజాడ, కృష్ణశాస్త్రి, చలం వంటి వారు సామాజిక పురోగమనమే తమ సాహిత్య దార్శనికతగా సామాన్యులను సైతం సాహితీపరులుగా మార్చారు. విశ్వనాథ సామాజిక తిరోగమనమే తన దార్శనికతగా సాహిత్య సృజన చేశాడు. సారస్వత లోకాన్ని ఒక శ్మశానంగా మార్చి, పాషాణ ప్రభువుగా పరిపాలించాడు.

గతంలో వేమన, గురజాడ, కృష్ణశాస్త్రి, చలం వంటి వారు సామాజిక పురోగమనమే తమ సాహిత్య దార్శనికతగా సామాన్యులను సైతం సాహితీపరులుగా మార్చారు. విశ్వనాథ సామాజిక తిరోగమనమే తన దార్శనికతగా సాహిత్య సృజన చేశాడు. సారస్వత లోకాన్ని ఒక శ్మశానంగా మార్చి, పాషాణ ప్రభువుగా పరిపాలించాడు. తన రచనల ద్వారా సామాన్యులను సాహితీ వరులుగా మార్చలేదు సరిగదా, సాహితీ వేత్తలను కూడా భయపెట్టాడు. దార్శనికత అపభ్రంశం చెందటం వల్ల ఆధునిక తెలుగు సాహిత్యంలో ఏర్పడిన పరిణామం ఇది. ఆదికవి నన్నయ్యకు ముందే మనకు అర్ధ్యసాహిత్యం ఉందను కుంటే అందులోంచి గ్రహపాటున తెగిపడిన ఒక శకలమే విశ్వనాథ సాహిత్యం. అది విదిల్చిన తమస్సే విశ్వనాథ దార్శనికత.

ఆధునిక జీవితం వేదాలలోనూ, పురాణేతిహాసాలలోనూ దర్శించింది కాదు. పూర్వ జన్మకర్మను బట్టి ఈ జన్మ ఉంటుందనీ, జన్మను బట్టి వర్ణం నిర్ణయించబడుతుందనీ కర్మవాదం చెపుతుంది. ఆధునిక కాలంలో ఈ వాదం అశాస్త్రీయం అయింది. కృత్రిమంగా పరిగణించబడింది. ఈ నేపథ్యంలో ఆధునికంగా ఆలోచించే ప్రతికవీ సాహిత్య సిద్ధాంతాన్ని మార్చుకున్నాడు. జీవితపు మారుమూలల్లోకి వెలుగును ప్రసరింపచేయలేనిది సాహిత్యం కాదన్న అభిప్రాయం భౌతికవాద కవికి అలవడింది. ఆ వెలుగును ఆవిష్కరించడానికి మహోన్నతమైన గతితార్కిక సిద్ధాంతం గొప్ప ఊతాన్ని ఇచ్చింది. అంతకు పూర్వం వరకూ పురాణేతిహాసాలలోని వైదిక ధర్మమే భారతీయ ధర్మంగా, జీవిత ధర్మంగా పరిగణించబడింది. మార్క్సిజాన్ని జీర్ణింపచేసుకున్న ఆధునిక కవి. ఇతిహాసపు చీకటి కోణాల్లో అట్టడుగున పడి కన్పించని కథలన్నింటినీ వెలుగులోకి తెచ్చాడు. ఆ వెలుగులో వర్తమాన జీవితంలో వివిధ పార్శ్వాల్లో ఉన్న హెచ్చు తగ్గుల్ని లోకానికి చూపించాడు. సమాజంలో అత్యల్ప భాగం అత్యధిక భాగాన్ని ఏ విధంగా దోచుకుంటుందో వివరించాడు. వారి పీడన శతాబ్దాలుగా ఎన్నికోణాలలో ఉందో విశదం చేశాడు. పీడనను నిర్వచించాడు. పీడిత జాతిశక్తి సామర్థ్యాలు ఎంత శక్తివంతమైనవో నిర్ణయించాడు. తెలుగు సాహిత్యంలోని ఈ ఆధునిక దార్శనికతకు శ్రీశ్రీ మూల పురుషుడు.

ఫ్యూడల్ వ్యవస్థపైన తిరుగుబాటుగా వచ్చిన బూర్జువా వ్యవస్థ సామ్యవాద విప్లవాన్ని సాధిస్తుందన్న కలలు పూర్తిగా చెదిరిపోయాయి. శ్రామిక వర్గమే సామ్యవాద విప్లవం తెస్తుందన్న వాస్తవాన్ని శ్రీశ్రీ దర్శించాడు. అందుకే పీడితుల పక్షంగా విప్లవ శంఖాన్ని పూరించాడు. శ్రీశ్రీ కవిత్వ తాత్వికత ప్రధానంగా రెండు పాయలుగా వికసించింది. పీడిత సమాజాన్ని సంఘటిత పరిచి వారిని చైతన్యవంతం చేయటం మొదటిది పీడిత సమాజం చేతనే తిరుగుబాటు చేయించటం రెండోది. తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వ మన్నాడు చలం. శ్రీశ్రీ దర్శించిన గతి తార్కిక భౌతికవాద దృక్పథం శ్రీశ్రీ చేత ఆ యుద్ధం చేయించింది. ఈ దార్శనికతే వికసించిన విద్యుత్తేజంగా తెలుగు సాహిత్యంలో నిలిచింది. ఈ దార్శనికతే ఎందరో యువకుల్ని ముందుతరం దూతలుగా మలిచింది.

'ఆకులందున అణగిమణగి కవిత

కోకిల పలకవలెనోయ్' అన్నాడు గురజాడ. ఆధునిక తెలుగు కవుల్లో అచ్చమైన కవికోకిల గుర్రం జాషువా. తాను అనుభవించిన ఆవేదనలనే ఆవేగంగా కవిత్వంలో మలచుకొన్న కవి జాషువా. ఇతర కవుల కంటే జాషువా అనుభవాలు ప్రత్యేక మైనవి. నిచ్చెన మెట్లుగా నిర్మించబడిన మన వర్ణవ్యవస్థ ఆవిర్భావంలోనే అసమానతలు కలిగి ఉంది. చతుర్వర్ణాలను వైదిక మత ధర్మం ప్రసాదిస్తే, లౌకిక మానవుడు మరో వర్ణాన్ని తయారు చేశాడు. వృత్తులను బట్టి కులాలు ఏర్పరచుకున్నాడు. అణగారిన ఎన్నో కులాల వారు పీడితులుగా మారారు. దయనీయమైన జీవితాన్ని అనుభవిస్తూ ఉన్నారు. అయితే ఇటువంటి వారిలో కూడా పంచమవర్ణానికి చెందిన దళితుని జీవితం అన్ని పార్శ్వాలలోనూ విషాదభరితమైంది. ఆర్థిక పీడనే తప్ప సాంఘిక పీడన అంతగాలేని ఇతర అడుగుబడుగు కులాల వారికంటే పంచముడు అంటరానితనమనే ప్రత్యేక వివక్షతను అదనంగా అనుభవిస్తున్నాడు. తెలుగుకవులలో ఈ అనుభవాన్ని చవి చూసిన కవి జాషువా. శ్రీశ్రీ వంటి కవులు సహానుభూతి ప్రదర్శించిన పీడిత వర్గంలో దళితులు కూడా ఉన్నారు. అయితే వీరిని ఆర్థికాంశం నుంచే పరిశీలించారు గాని వీరి సాంఘిక వివక్షతకు సంబంధించిన పార్శ్వాన్ని స్పృశించలేదు. ఆ అనుభవం వీరికి లేకపోవటం అందుకు కారణం కావచ్చు. ఆర్థిక పీడనను బుషివంటికవి దర్శించవచ్చు. అస్పృశ్యతవంటి సామాజిక పీడనను దార్శనికుడు కూడ దర్శించలేడు. సహానుభూతి కవికి కూడా సాధ్యం కాదు. అది అనుభవించిన వాడికి మాత్రమే అందేటంతటి భయంకరమైంది. ఈ అనుభవం జాషువాను కవిగా మలిచింది.

జాషువా సమకాలిక కవులలో విశ్వనాథ, రాయప్రోలు వంటి ఎందరో ప్రసిద్ధ కవులు తమతమ అనుభవాలనూ, అనుభూతులనూ, దృక్పథాలనూ తమ సాహిత్య దార్శనికతగా ప్రకటించారు. వీరిలో రాయప్రోలు అమలిన శృంగార సిద్ధాంతాన్ని ఆవిష్కరించి అభాసు పాలయ్యాడు. బూర్జువా సాంస్కృతిక విప్లవాన్ని సాధించడానికి కలం పట్టినా వైదిక ధర్మం మూర్తీభవించిన ఈ భరత భూమిని వేదభూమిగా దర్శించాడు. పూర్వజన్మలో చేసుకున్న పుణ్యయోగం మూలంగా ఈ భరత భూమిలో జన్మించామని భారతీయుణ్ణి కీర్తించాడు. జన్మజన్మలకూ ఈ వేదభూమిపైనే పునర్జన్మించమని అభిభాషించాడు. అయితే, అదే సమయంలో జాషువా "పుట్టంగూడదు వితర్క భ్రష్ట దేశంబునన్" అని తలపోశాడు. "హృదయము లేని లోకము సుమీ" అని ఈ వేదభూమిని వ్యాఖ్యానించాడు. 'బాకున క్రుమ్మినట్లున్నా తన స్వీయానుభవాల మూలంగానే జాషువా ఇలా భావించాడు. సమకాలికులు తమ అనుభూతుల మూలంగా తమ కవితల్లో, అత్తరూ, పన్నీరూ చల్లితే; జాషువా తన అనుభవాల మూలంగా తన కవితల్లో నెత్తురూ, కన్నీరూ కార్చాడు. కన్నీరు కాల్వలుగా పారుతున్నా, నెత్తురు చిందించి, తాను వన్నలుంటూ ఈ ప్రపంచానికి భోజనం పెడుతున్నవాడు పంచముడు. వైదిక సంస్కృతి వాడి తలమీది అస్పృశ్యత అనే పంకిలాన్ని పులిమింది. దాన్ని కడిగి కరుణించడమే జాషువా కవితా దృక్పథం. అదే జాషువా దార్శనికత.

> సామాజికుణ్ణి పురోగమి పథంలో చైతన్య పరచటయూడా ఏ లలిత కళకైనా ఒకానొక పరమ లక్ష్యం. ఆధునిక కాలంలోని సాహిత్య కళకు ఈ మూల సూత్రం మరికొంత చేరువైంది. దార్శనికుడైన రచయిత తన సృజనాత్మక సాహిత్యం ద్వారా ఎక్కువమంది పాఠకుల్ని తయారు చేస్తాడు. చదువరులంతా పాఠకులు కాదు.

స్త్రీవాద, దళితవాద, మైనారిటీవాద సాహిత్యాల సమగ్ర స్వరూపం ఈనాటి ప్రధాన వర్తమాన తెలుగు సాహిత్యం వెనుకటి తరాల్లోని వైతాళికుల, దార్శనికుల స్ఫూర్తి ఉద్యమ స్థాయికి ఎదగడం ఈ ధోరణుల్లో మనం గమనించగలం. పురుష స్వామ్య వ్యవస్థలో వందల సంవత్సరాలుగా కొనసాగుతూ ఉన్న పురుషాధిపత్య భావజాలాన్ని ప్రశ్నించడం స్త్రీవాద కవిత్వంలోని తాత్వికత. శతాబ్దాలుగా ఈ సమాజంలో పశువుకంటే హీనంగా పంచముడు పరిగణించబడుతున్నాడు. ఈ ఈ సాంఘిక నేరాన్ని తాత్వికంగా ఎదిరించడం దళిత కవిత్వ సిద్ధాంతం. మైనారిటీ మతస్థుల పట్ల మతపరమైన వివక్షతను ప్రదర్శించడాన్ని ఖండించడం; తమ తమ మతాలలోని మూఢ్యాలను తమకు తామే ప్రశ్నించుకోవడం మైనారిటీ కవిత్వంలోని తాత్వికత. ఈ మూడు ప్రధాన వివక్షతలను వేరు వేరు పార్శ్వాల నుంచి, విభిన్న స్థాయిల్లో ఒకేసారి ఎదుర్కొనే త్రిశూలం లాంటిది ఈ మూడు కవితా ధోరణుల దార్శనికత.

దార్శనికుడు సామాజిక పరిణామాలను గమనిస్తూ ఉండాలి. సామాజిక అవసరాలకు అనుగుణంగా జరుగుతున్న అభివృద్ధిని ఆహ్వానించాలి. జీవిత ధర్మాన్ని, విధానాన్ని ఆవిష్కరించే అంతస్సూత్రంగా తన సాహిత్యదార్శనికతను ప్రదర్శించాలి. కాలం ఎంత దూరం ప్రయాణించినా ఈ దార్శనికత ఒక తరాన్ని మరో తరానికి ముడిపెడుతుంది. తరాల అంతరాన్ని అంతంచేసి మనిషిని ముందుకు నడిపిస్తుంది.

వైదిక ధర్మాన్ని పరిపోషించడం ద్వారా ప్రాచీన సాహిత్యంలోని దార్శనికత తన ధర్మాన్ని నిర్వర్తించింది. ప్రాచీన సాహిత్య ప్రయోజనం ఆనంద ప్రధానం. వేమన వంటి ఒకరిద్దరు కవులకు ఈ విషయంలో కొంత మినహాయింపు ఉంది. మానవతా ధర్మాన్ని ఆవిష్కరించడం ఆధునిక సాహిత్యంలోని దార్శనికత. ఈ సాహిత్య ప్రయోజనం చైతన్య ప్రధానం. విశ్వనాథవంటి కొందరు కవులకు ఈ విషయంలో కొంత మినహాయింపు ఉంది.

ప్రాచీన సాహితీవేత్తలుగానీ, విశ్వనాథ వంటి రచయితలుగానీ తమ రచనల్లో సామాజిక అంశాలను బొత్తిగా స్పృశించలేదని కాదు. నిజానికి సామాజిక అంశాలను

సాహిత్యంలో ఆవిష్కరించడం ప్రధానంకాదు. ఆయా విషయాలపై రచయితలకుండే అవగాహన, దృక్పథం ఎటువంటిదనేది ముఖ్యం.

సామాజికుణ్ణి పురోగమి పథంలో చైతన్య పరచటంకూడా ఏ లలిత కళకైనా ఒకానొక పరమ లక్ష్యం. ఆధునిక కాలంలోని సాహిత్య కళకు ఈ మూల సూత్రం మరికొంత చేరువైంది. దార్శనికుడైన రచయిత తన సృజనాత్మక సాహిత్యం ద్వారా ఎక్కువమంది పాఠకుల్ని తయారు చేస్తాడు. చదువరులంతా పాఠకులు కాదు. కేవలం కాలక్షేపం కోసమే ఒక రచనను చదివేవాడు చదువరి. ఒక రచనను చదివి స్పందించిన వాడు పాఠకుడు. ఒక రచనను అధ్యయనం చేసిన తరువాత చదువరికి అంతకుముందున్న స్థితిలో మార్పు రావాలి. అతడు పురోగామిగా మారాలి. ఇది పాఠకుని లక్షణం.

యుద్ధనపూడి సులోచనారాణి, యండమూరి వీరేంద్రనాథ్ వంటి అసంఖ్యాక రచయితలు చదువరులను పెంచారు గాని పాఠకుల్ని తయారు చేయలేదు. వీరిది సాహిత్య దార్శనికత అనిపించుకోదు. మనిషిలోని బలహీనతలను బలహీనపరచాలిగాని,వాటిని మరికొంత పెంచకూడదు.

ఇటువంటిదే ఆధునిక సాహిత్యంలో మరో పార్శ్వం కూడా ఉంది. వర్తమాన జీవితాలకు అన్వయంకాని భూతకాలపు భావాలతో కొందరు రచయితలు పాఠకుల్ని ప్రలోభ పరచడం జరిగింది. సమాజగతిని సాహిత్యం ద్వారా తిరోగమింపచేసే ప్రయత్నం ఇది. మత మౌఢ్యాలను జాతి రక్తంలో ఎక్కించడం ద్వారా కొందరు; విజ్ఞాన శాస్త్ర ఫలాలను వక్రీకరించి వైజ్ఞానిక రంగానికి చేతబడులు చేయడం ద్వారా మరికొందరూ ఆధునిక కాలంలోనూ తమ క్షీణ తాత్వికతను ప్రదర్శించారు. ఇదికూడా సాహిత్య దార్శనికతకాదు. ఇది క్షుద్ర దార్శనికత.

ఏ సమాజంలో అయినా, ఏ కాలంలో అయినా దార్శనికుల సంఖ్య స్వల్పంగానే ఉంటుంది. వీరే పాఠకుల్ని స్పందింప

ఏ సమాజంలో అయినా, ఏ కాలంలో అయినా దార్శనికుల సంఖ్య స్వల్పంగానే ఉంటుంది. వీరే పాఠకుల్ని స్పందింప చేయగలరు. తమంతటి రచయితలనూ, తమ కంటే గొప్ప దార్శనికులనూ తమ దర్శనం ద్వారా భవిష్యత్తుకు అందించగలరు. అందుకే, తెలుగు సమాజంలో ఏ ఇంటి తలుపు తట్టినా ఒక కవి పలికితే పలకవచ్చుగాక; కానీ, ఆదికాలం నుంచి ఆధునికకాలందాకా దార్శనికుల కోసం అన్వేషిస్తే వేమన, గురజాడ, కృష్ణశాస్త్రి, చలం, శ్రీశ్రీ, జాషువా వంటి అతికొద్దిమంది మాత్రమే తమ ద్వారాలు తెరుస్తారు.

చేయగలరు. తమంతటి రచయితలనూ, తమ కంటే గొప్ప దార్శనికులనూ తమ దర్శనం ద్వారా భవిష్యత్తుకు అందించగలరు. అందుకే, తెలుగు సమాజంలో ఏ ఇంటి తలుపు తట్టినా ఒక కవి పలికితే పలకవచ్చుగాక; కానీ, ఆదికాలం నుంచి ఆధునిక కాలందాకా దార్శనికుల కోసం అన్వేషిస్తే వేమన, గురజాడ, కృష్ణశాస్త్రి, చలం, శ్రీశ్రీ, జాషువా వంటి అతికొద్దిమంది మాత్రమే తమ ద్వారాలు తెరుస్తారు. ఈ ద్వారాల గుండా సాహిత్య దార్శనికత కోసం ఒకసారి లోపలికి తొంగిచూస్తే ఎన్నో మలుపులు, మరెన్నో మైలురాళ్ళు కన్పిస్తాయి.

ప్రాచీన కాలంనుండీ ఆధునిక యుగం దాకా ప్రధానంగా వైదిక ధర్మాన్ని పరిపోషించడమే సాహిత్య దార్శనికతగా కొనసాగింది. యుగధర్మాలు మారినపుడు కవుల దార్శనికతలో మార్పురావటం సహజం. ఆ మార్పు ఆహ్వానించదగింది కూడా. ఆ విషయం బాగా తెలిసిన వాడు గురజాడ. అందుకే ప్రాచీన దార్శనికతను వైదిక ధర్మం నుండి లౌకిక ధర్మం వైపుకు మలుపుతిప్పాడు. పంథొమ్మిదో శతాబ్దంలో సంభవించిన ఫ్రెంచి విప్లవం ప్రపంచాన్ని ప్రభావితం చేసింది. గురజాడ మానవతావాద దృక్పథాన్ని సాహిత్యంలో ప్రతిష్ఠించడానికి వెనుక ఈ ఫ్రెంచి విప్లవ ఫలితాలు అందుబాటులోకి రావడం కూడా కొంత కారణం కావచ్చు.

ఫ్రెంచి విప్లవభావజాలంగా రూసో ప్రతిపాదించిన స్వేచ్ఛ - సమానత్వం - సౌభ్రాతృత్వం అనే వాటిని కృష్ణశాస్త్రి భావకవిత్వం ద్వారా బాగా ప్రచారం చేశాడు. మధ్య తరగతిని ఉత్తేజితుల్ని చేశాడు. చలం కూడా రూసోచే ప్రభావితుడయ్యాడు. ముఖ్యంగా స్వేచ్ఛను స్త్రీ జాతికి అందివ్వడం తన దార్శనికతగా కలం పట్టాడు. మార్క్సిజం ప్రభావంతో శ్రీశ్రీ పీడితుల పక్షం వహించాడు. ఫ్రెంచి విప్లవ భావజాలం శ్రామిక వర్గానికి అందాలని పట్టుపట్టాడు. దోపిడీ నుంచి వారు విముక్తమయ్యే వర్గ రహిత సమాజాన్ని దర్శించాడు. అదే సమయంలో జాషువా ప్రత్యేకమైన తన స్వీయ అనుభవానికి అంబేద్కర్ ఇచ్చిన స్ఫూర్తిని అంటుకట్టాడు. రూసో భావత్రయం దళిత జాతికి అవసరం అని భావించాడు. ఆ దార్శనికతతోనే కలంపట్టాడు.

గురజాడ, చలం, శ్రీశ్రీ, జాషువా వంటి దార్శనికులు చెప్పిన భావజాలమే ఇప్పుడు స్త్రీవాద-దళిత వాద - మైనారిటీ వాదాలుగా ఉద్యమ స్థాయిని అందుకుంది. పురుషాధిపత్యం లేని కుల రహిత, మత రహిత సమసమాజ మానవతావాదం ఈ సాహితీ ఉద్యమాల దార్శనికత. ప్రస్తుత తెలుగు సాహిత్య దార్శనికత ఈ దశలో ఆగి ఉంది.

ఎవరి అస్తిత్వాన్ని వారు కాపాడుకోవటంకోసం ఎవరి స్వరాన్ని వారు విడివిడిగా విన్పిస్తూ ఉన్నంతకాలం సాహితీ ఉద్యమాల లక్ష్యం నెరవేరదు. అన్ని ఉద్యమాల లక్ష్యమూ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాలను మానవ జాతికి అందించడమే! లక్ష్యసాధన ఒక్కటే అయినపుడు మారిన యుగధర్మాలకు అనుగుణంగా ఈ సాహితీ ఉద్యమాల దార్శనికతలు ఒక ఉమ్మడి దార్శనికతగా మారవలసిన భావి వేదాల జీవనాదాలు ధ్వనించే వైతాళిక గీతాలను జాతి జనులు పాడుకొనే మంత్రాలుగా ఆలపించవలసిన సామాజిక అవసరాన్ని వర్తమాన సాహితీ వేత్తలు గుర్తించవలసి ఉంది.

●

కవిత

వేముల ఎల్లయ్య

# మిగ్గు




పేగు సుడి తర్గిన నడ్మిట్ల బొండిగ
క్కొం కొండి మద్దల సరం యాలాడవడి నెత్తురు సీమి
వొల్లంత వొట్టు కండ్ల కుండై
గద్దెడు మట్టి ముద్ద గిన్ని ఉడ్కువీల్లు దోసిల్ల

నాల్కె మల్లిన లొల్లి పొల్మెర తిర్లిండె
ఊరిడు గాకు పీకె వుశ్కె పొరలు సొంతం పచి& పాట
కండ్ల రెప్పల కింద కన్నీళ్ళ వర్ద తుంగు వొచిన నాత్రి
తొవ్వ హొజర్ల పత్రిచ్చిన సోకం.

వొడకట్ని వెలురం ఉప్పుకల్లి ఎర్దడి సొల్లు
పంపుకం కత్వ కాల్వనిండ ముర్కితెప్ప
దండెఉడ వర్ద గిల్ల నల్లుగట్ల కులం అయి ఆ పూత పుదియ్య పున్కులాడ
తెట్టె కూల్ని బాయిల జీవులు యార్ది నింపలి సెట్లు వొక్కపొద్దు
వొంటి సీకటి కాపగ అచ్చుయకుండ కడ్వుల సొద తీర్తాది?

నిండార్లముంచి అలాయిబిలాయి మురిపెం గిచ్చుట్ల...
"సిల్లరరాల్లదెబ్బ సిగ్గెర్గక పోయె! బుల్లలో తెరకపాయె"
అలిసిని వొజరు జార్తుల కాలం సాయపల్గిన సిప్ప
సానల జాలెంట పాదం నెత్తురు ముద్దెర
వొల్సపచ్చి కొరికిన పుండు తన్కల చట్టె
పక్కు లోపల పుండు సియ్య సియ్య కండ ముర్గు డాసన.

యిర్దం బూమి పైకం తంతెక్కి
పుట్టా పెట్టా పుట్కు పుట్టుక యీ గర్ద బొందల తలం
మన్నిజల్మ జనంతెగిని మెడైపాయె కొడ్కా!
సెమ్ట కారిన తోలు కంకి కాటిక కండ్లై
కుష్కి బీమారై పొరల పెదువు యిసం సప్పర్చింది.
కోలలు కొల్సిన పాతాళెం గోస జాజచ్చురమై -
గిల్కోల్లె ఊర్లు వుర్కపట్టింది.

ఇంటర్వ్యూ

వి.ఆర్. బొమ్మారెడ్డి

# సాహిత్యకారుల సాన్నిహిత్యం



**కమ్యూనిస్టు పత్రికలలో యాభైఏళ్ళకు పైగా అవిచ్ఛిన్నంగా పనిచేశారు కదా, కవులు రచయితలతో, సాహిత్యరంగంతో మీ అనుభవాలేమిటి?**

నేను రచయితను కానీ, కవినిగానీ కాను. కాకుంటే చాలా మంది రచయితలతో నాకు సన్నిహిత సంబంధాలున్నాయి. రచనలు కూడా బాగా చదివేవాణ్ణి. 1942లో ప్రజాశక్తిలోనూ, ఆ తర్వాత విశాలాంధ్రలో అరసంలో ప్రముఖ కవులు రచయితలు చాలామందితో సన్నిహిత పరిచయాలు వుండేవి. వారి అభిప్రాయాలు తెలుసుకునేవాణ్ని. మద్రాసులో అరసం మహాసభలు జరిగినపుడు ప్రజాశక్తి తరుపున నేనే రిపోర్టర్‌గా వెళ్లాను. అయితే మధ్యలో వేరే పని పడడంతో పూర్తిగా ఫాలో కాలేకపోతే - అనిసెట్టి ఆ రిపోర్టు రాయడానికి సహాయపడ్డాడు. పార్టీ నాయకత్వం రచయితలకు చాలా గౌరవం ఇచ్చేంది. ప్రజాశక్తిని ప్రముఖ రచయిత ఉప్పల లక్ష్మణరావు ప్రారంభించారు. విశాలాంధ్రను తాపీధర్మారావు, జనశక్తిని కొడవటివంటి కుటుంబరావు ప్రారంభించారు.


............◇............

తాపీవారు పిఠాపురం రాజా పీపుల్సు పార్టీకి మద్దతుదారుడు. ఆ పార్టీ పత్రిక జనవాణి సంపాదకుడు. అయితే సంస్కరణాభిలాషి, ఉదారవాది. తెలుగు పత్రికా భాషకు వరవడి పెట్టిన తొలి సంపాదకులలో ఆయన ప్రముఖుడు. ఆయన కుమారుడు తాపీ మోహనరావు నాకు మంచి నేస్తం. కమ్యూనిస్టు. ఆయన కారణంగానే జనవాణిలో మనం ప్రవేశించాము. తాపీ వారు మాకు ఏం అభ్యంతరం చెప్పేవారు కాదు.

............◇............



బొమ్మారెడ్డి • సీనియర్ సంపాదకులు


**అన్నట్లు మీరు తాపీ ధర్మారావుగారితో జనవాణిలో పనిచేశారు కదా? తాతాజీ అనిపించుకున్న ఆయనతో మీ అనుభవాలేమిటి?**

తెలంగాణా పోరాటంపై నిర్బంధం తర్వాత ప్రజాశక్తి దాడికి గురైంది. పార్టీ నాయకత్వం సూచన మేరకు మేము కొంతకాలం జనత పత్రిక నడిపాము. గంగినేని వెంకటేశ్వరరావు దానికోసం డిక్లరేషన్ తీసుకున్నారు కానీ లా చదవడానికి వెళ్లిపోయాడు. నేను వాసిరెడ్డి భాస్కరరావు సంపాదకవర్గంగా పని చేశారు. వీరిద్దరూ తర్వాత ప్రసిద్ధ రచయితలయ్యారు. సరే, జనత కూడా పనిచేయలేని స్థితి వచ్చాక జనవాణిలో పనిచేయమని పార్టీ నాకు చెప్పింది. తాపీవారు పిఠాపురం రాజా పీపుల్సుపార్టీకి మద్దతుదారుడు. ఆ పార్టీ పత్రిక జనవాణి సంపాదకుడు. అయితే సంస్కరణాభిలాషి, ఉదారవాది. తెలుగు పత్రికా భాషకు వరవడి పెట్టిన తొలి సంపాదకులలో ఆయన ప్రముఖుడు. ఆయన కుమారుడు తాపీ మోహనరావు నాకు మంచి నేస్తం. కమ్యూనిస్టు. ఆయన కారణంగానే జనవాణిలో మనం ప్రవేశించాము. తాపీ వారు మాకు ఏం అభ్యంతరం చెప్పేవారు కాదు. 1952 ఎన్నికల్లో జస్టిస్ పార్టీ తరపున బెజవాడ రామచంద్రరావు లోక్‌సభకు పోటీచేశారు. ఆయనకు ఒక పేజీ ఇవ్వమని అడిగాడు. కానీ మేము ఇవ్వలేదు! అంతకు మినహా

ఆయన జోక్యం ఉండేది కాదు.

ఆ రోజులలో తిరుమల రామచంద్ర కూడా అజ్ఞాతంలోని కమ్యూనిస్టులకు అనేక విధాల తోడ్పడేవారు. తాపీ వారికి భాష విషయంలో చేసిన సేవకు తగిన గుర్తింపు రాలేదు. నార్ల కూడా మొదట జనవాణిలో పత్రికలో న్యూస్ ఎడిటర్‌గా ఆయన దగ్గరే పనిచేశారు.

**మీరు రథచక్రాలు చదివి, జానకి పాత్ర తెలిపోయిందోయ్ అన్నారని మహీధర రామమోహనరావు చెప్పారు.......**

నిజమే, మహీధర పెద్ద రచయితే అయినా జర్నలిస్టుగా అంత ఆసక్తి వుండేది కాదు. అంతెందుకు బలరామమూర్తి కూడా అంతే. స్టాలిన్ తీవ్ర అస్వస్థతకు ప్రపంచమే కదలిపోతుంటే సింగిల్ కాలం ఐటం రాశాడు. చివరి నిముషంలో చూసి పెద్దది చేయాల్సి వచ్చింది. రాంభట్ల కూడా అంతే. ఏవో వార్తలు రాయించేవాళ్లం. ఇది వాళ్ల అసమర్థత అనను. ఆ దృష్టి వేరు. జర్నలిస్టు కోణం వేరు. అందుకే శ్రీశ్రీ వంటి వారు కూడా జర్నలిజంలో కొనసాగలేక పోయారు. మహీధర నవల చదివి నా అభిప్రాయం చెప్పాక తిరగేసి రాశాడు. తర్వాత జానకి పాత్ర చాలాబాగా వచ్చింది. కమ్యూనిస్టు చీలిక తర్వాత పరిణామాలపై రాయాలోయ్ అని అడిగితే ఈ దారి ఎక్కడికి అని చాలాకాలం తర్వాత రాశాడు. కానీ అప్పటికే మితవాదం ముదిరిపోయింది. ఆ నవలను బయట వాళ్లెవరో ప్రచురించాల్సి వచ్చింది. జ్వాలా తోరణం ముద్రణకు కూడా జయంతి పెరుమాళ్లు గారిని ఒప్పించి వేయించాను. మహీధర చివరి రోజులలో కూడా తిరుపతిలో అవార్డు ఇస్తే వెంట వుండి తీసుకెళ్లాను. అంతకు ముందు కమ్యూనిస్టులపై కొన్ని విమర్శలు చేస్తున్న మహీధర ఆ సభలో మరోసారి తాను కమ్యూనిస్టు పార్టీపై పూర్తి విశ్వాసంతో వున్నానని ప్రకటించారు. నా స్నేహం అందుకు దోహదపడింది.

**కమ్యూనిస్టు పత్రికలు సాహిత్య వికాసానికి బాగా దోహదం చేశాయికదా?**

అందులో సందేహం ఏముంది? అభ్యుదయం అనీ కాదు. మొత్తంగానే సాహిత్య వికాసానికి తీవ్రంగా కృషి చేశాయి. ఒక్క సంగతి చెబుతాను. చాలా మందికి తెలియదు, లేదా గుర్తుండదు. దేవదాసు నవలకు చక్రపాణి అనువాదం మొదట వచ్చింది ప్రజాశక్తి లోనే. దాని ముగింపు చదివి ఆ రోజుల్లో చాలా ఏడుపు వచ్చింది.

**శ్రీశ్రీతో మీ పరిచయం**

వుంది. ముఖ్యంగా నేను పౌరహక్కుల సంఘం తరపున బాధ్యతలు చూస్తున్నపుడు ఆయన కూడా పాల్గొనేవారు. సమైక్యాంధ్ర సదస్సుకోసం తీసుకురావడానికి కూడా వెళ్లాను. ఆశ్చర్యం ఏమంటే శ్రీశ్రీగురించి అందరికీ తెలుసుకదా... అంత సవ్యంగా లేని స్థితిలో కూడా ఆయన విదేశీ కవిత్వాన్ని అనర్గళంగా వినిపించేవాడు. ఆయన నిజంగా జీనియస్ అనిపించింది.

**ఆశ్చర్యం ఏమంటే శ్రీశ్రీగురించి అందరికీ తెలుసుకదా... అంత సవ్యంగా లేని స్థితిలో కూడా ఆయన విదేశీ కవిత్వాన్ని అనర్గళంగా వినిపించేవాడు. ఆయన నిజంగా జీనియస్ అనిపించింది.**

**తర్వాత ఇంకా సన్నిహితులైనవారు.....**

తర్వాత దశలో ఆరుద్రతో దగ్గరగా మెలిగాను. సుందరయ్య గారి వీర తెలంగాణా విప్లవ పోరాట తెలుగు పుస్తకంలో హరీన్ చట్టోగేయాల అనువాదం ప్రచురించాలనుకున్నప్పుడు తొలిసారి ఆరుద్రను కాంటాక్టు చేశాను. ఆయన రచన సమగ్ర ఆంధ్రసాహిత్య గ్రంథం ప్రచురణ సందర్భంగా నేను ఆయనకు మరింత సన్నిహితమయ్యాను. అప్పటినుంచి ఆయన చనిపోయే వరకు కూడా చాలా స్నేహంగా వుండేవాళ్లం. నాకు వ్యక్తిగతంగా సెట్టి ఈశ్వరరావు మంచి మిత్రుడు. చాలా కష్టపడి పనిచేసేవాడు. ప్రామాణిక రచనలు చేశాడు. శ్రీశ్రీ గురించి రాయాలనేది ఆయన కోరికగా వుండేది.. కాని చేయలేకపోయాడు. విద్వాన్ విశ్వం కూడా ప్రజాశక్తిలో మాతో వుండేవాడు మేము ఇరువురం ప్రజాశక్తినగర్ పక్కపక్కనే పాకల్లో వుండేవారం. సాహితీ చర్చల్లో పాల్గొనేవాళ్ళం పామిదటోట్ ఇండియాటుడే పుస్తకాన్ని ఆయన అనువదించారు. నిర్బంధం తర్వాత వెళ్లిపోయాడు.

యాభైఏళ్ళు పత్రికలో అవిచ్ఛిన్నంగా వున్నాను కనుక నాకు చాలా మందితో ప్రత్యక్ష పరిచయం వుంది. వారందరి గురించి చెప్పడం కష్టం. జనశక్తి పెట్టాక కూడా శ్రీశ్రీ కవితలు, రావిశాస్త్రి రచనలు వచ్చేవి. కె.వి.రమణారెడ్డి కూడా చాలా సన్నిహితంగా వుండేవాడు విశాలాంధ్ర, జనశక్తి పత్రికల్లో ఆయన సాహిత్య శీర్షిక నిర్వహణలో పాల్గొనేవాణ్ణి అరుణతార టైటిల్ నేనే ఆయనకు ట్రాన్స్‌ఫర్ చేశాను. తర్వాత మా మధ్య అంత సాన్నిహిత్యం లేదు. గజ్జల మల్లారెడ్డి సంగతి తీసుకోండి. ఏ పత్రికలో చేరినా నాతో స్నేహంగా వుండేవాడు. కాని శ్రీశ్రీ తెనాలిలో సిపిఎం ప్రారంభ సదస్సు సందర్భంగా రావాలనుకుంటే దారి తప్పించి తీసుకుపోయాడు. సరే. అదంతా గతం. నాకు తెలిసిన అన్ని పేర్లు చెప్పాలంటే కష్టమే. జ్ఞాపకశక్తికూడా తగ్గిపోయింది. ఈనాడు సాహిత్య రంగంలో వస్తున్న కొత్త కదలిక నాకు చాలా సంతోషం కలిగిస్తోంది. అయితే కవిత్వం అర్థమయ్యేలా వుండాలని మాత్రం నేను కోరుకుంటాను. ఇటీవల కొందరి కథలు నవలలు కూడా నాకు బోధపడలేదని చెప్పడానికి వెనుకాడను. కనుక మేధావులైన రచయితలు కవులు మరింత సుబోధకంగా రాయాలని నా మనవి. జర్నలిజానికి సాహిత్యపరిజ్ఞానం అవసరమే. సాహిత్యశక్తి గల జర్నలిస్టులు ఇతరులు కన్నా బాగా రాణించగలుగుతారు. కాని వారికి సామాజిక దృష్టి ప్రధానం.

●

సాహిత్య ప్రపంచం

హసన్ సరూర్

లండన్ ఫెయిర్

# కొత్తవాళ్ళతో కోట్ల వ్యాపారం

లండన్ పుస్తక ప్రదర్శన( లండన్ బుక్ ఫెయిర్) ను ఒకప్పుడు స్థానిక పబ్లిషర్లు పనీపాట లేక వారాంతంలో జరిపే సంతగా పరిగణించేవారు. కాని అది ఇప్పుడు పెద్ద ఆకర్షణగా తయారైంది.ఐరోపాలోనే ఒక పెద్ద సంఘటనగా మారింది. ఫ్రాంక్‌ఫర్ట్ పారిశ్రామిక ప్రదర్శనలకు ఎలాగో ఎల్‌బిఎఫ్ పుస్తకాలకు అంతేనన్నట్టు చూస్తున్నారు. వర్తమాన ధోరణులకు దాన్ని కొలబద్దగా భావిస్తున్నారు. పుస్తకాభిమానులకు, భావి రచయితలకు, ప్రచురణ కర్తలకు ఆసక్తి కరమైన అనేక సూచనలకు అది అందజేస్తుంది.

మహమ్మద్ అజారుద్దిన్ ఇండియన్ క్రికెట్ టీమ్ కెప్టెన్ కాకముందు రాజ్ దుర్గాపూర్ ఆయనను అడిగిన ప్రశ్న చాలా ప్రసిద్దమైంది." క్యా మియా కెప్టెన్ బనోగి?" అనేది ఆ ప్రశ్న. ఇప్పుడు లండన్‌లో ప్రచురణ కర్తలు ఈ ప్రశ్నను మరో విధంగా అడుగుతున్నారు." క్యా, మియా రైటర్ బనోగి?" అని. నమ్మండి, నమ్మక పోండి. ఒకటి నిజం. మార్పు కోసం వారు కొత్త మొహాలను వెతుకుతున్నారు. ఇందులో పరోపకార దృష్టి ఏ మాత్రం లేదు సుమండి. కేవలం మార్కెట్ ఒత్తిళ్లే ఇందుకు కారణం. గతసారి దెబ్బతిన్న రచయిత పుస్తకమే మరోసారి ముద్రించి చేతులు కాల్చుకోవడం కంటే నూతన రచయితతో ప్రయత్నించడం సురక్షితమని వారు అనుకోవడమే ఇందుకు కారణం.

పుస్తకాలు ఆర్డర్ పెట్టేందుకు ఒక కొత్త తరహా పద్దతి అమలు లోకి వచ్చింది. ఇదే ఎలక్ట్రానిక్ పర్చేజ్ ఆర్డరింగ్ సిస్టమ్స్(ఇపిఒఎస్) ఇప్పటికే పుస్తకాలు వచ్చిన రచయితలకు ఇదో పెద్ద శాపమై కూచుంది. ఒక బటన్‌నొక్కితే చాలు, పెంగ్విన్‌లో మార్కెటింగ్ కుర్రాళ్లు మీ పుస్తకాల అమ్మకాల తీరుతెన్నులను చిటికెల మీద తెలుసుకోగలుగుతారు. దాంతో తల ఎలా ఊపాలో నిర్ణయించేస్తారు. అని టైమ్స్ కాలమిస్టు రాశారు. కొత్త రచయితలకు అలాటి రికార్డు ఏదీ వుండదు కనుక సమస్య లేదు." సరికొత్త పేర్లు, తెల్లటి కాగితాలు మాత్రమే ఈ ముప్పు తప్పించుకోగలవు" అని ఆయన రాశారు

మార్చి 17-19 మధ్య జరిగిన ఎల్‌బిఎఫ్‌లో వినూత్న ప్రతిభావంతుల కోసం అన్వేషించడమే ప్రధానాంశమైంది.30 ఏళ్లకు కొంచెం పై బడిన అమెరికన్ కాథలీన్ టెస్సారో తొలి నవల" ఎలిజెన్స్"కు హార్పర్ కాలిన్స్ సంస్థ నాలుగు లక్షల పౌండ్లు అడ్వాన్సుగా పొందినట్టు చెప్పుకొంటున్నారు.అయితే దాని అర్థం ముక్కు మొహం తెలియనివారెవరైనా వచ్చేసి పుస్తకాలకు లక్షల డాలర్లు పొందవచ్చని కాదు. తరుణ వయస్కులై వుండి, గ్లామరస్‌గా మీడియాలో చలామణి కాగలిగినవారై వుండటం ముఖ్యం. పబ్లిసిటీ పోస్టర్లపైన అందమైన దుస్తులలోచక్కగా కనిపించగలిగిన వారై వుండాలి. రాత్రి పూట కంప్యూటర్ కార్యక్రమాలలో ఇంటలిజెంట్‌గా వ్యవహరించగలిగిన వారైతే మరీ మంచిది.

ఈ లక్షణాలు లేని వారు చేయగలిగింది తాముగా ప్రచురించుకోవడం మాత్రమే. ఇటీవలి వరకు ఇదో చాటు మాటు వ్యవహారంగా వుండేది. రచయితలు తమకెంత డబ్బు ఎదురిచ్చారో చెప్పడానికి ప్రచురణ కర్తలు సిద్దపడేవారు కాదు.

ఏ ప్రముఖ ప్రచురణ కర్త అయినా రాతప్రతులను తీసుకోవడానికి సుముఖంగా వుండేవారు కాదు. సంయుక్త పథకం అని ఎగతాళిగా అనేవారు. అంటే ప్రచురణ కర్త రచయిత పెట్టుబడిపెట్టుకోవడమని అర్థం. ప్రచురణ కర్తల తిరస్కృతికి గురైన రచయితలు ఈ విధంగా తమ రచనలు ముద్రించుకునే ప్రయత్నం చేసేవారు.వారి పుస్తకాలను విమర్శకులు తేలిగ్గా చూసేవారు.వాటిని పెట్టుకోవడానికి మాకు స్థలంలేదు అని విక్రేతలు తేలిగ్గా మాట్లాడేవారు.పాఠకులలో అత్యధికులకు వారి గురించి తెలిసే అవకాశమే వుండేది కాదు.

అయితే లండన్ బుక్‌ఫెయిర్‌ను పరిశీలించినపుడు ఈ స్వంత ప్రచురణ పద్దతి ముసుగులోంచి బయటకు వస్తోందని అర్థమైంది. సిగ్గు పడకుండానే పుస్తకాన్ని మార్కెట్‌లో విడుదల చేసుకునే పద్దతులు వున్నాయని తెలిసింది.ఈ ఏడాది రకరకాల ఎగ్జిబిషన్లు జరిగాయి.వీటి నిర్వాహకులు రచయితలకు అనేక సదుపాయాలు కూడా కలిగించారు. కాపీ ఎడిటింగ్, ప్రూఫ్ రీడింగ్, డిజైనింగ్,ప్రింటింగ్, మార్కెటింగ్ వగైరా సదుపాయాలు కలిగిస్తామంటున్నారు. అయితే అమ్మకం పాయింటే చాలా ఉధృతంగా వుంటుంది. పబ్లిష్ ఆన్ డిమాండ్ లిమిటెడ్ సంస్థ చీఫ్ ఎగ్జిక్యూటివ్ నిగెల్ ఫెర్గూసన్ తనకు రచనలు ఇచ్చిన చాలా మంది రచయితలు మంచి అకడమీషియన్స్ అని అయితే తాను కొత్త వారివి కూడా ప్రచురించానని చెప్పారు. పిల్లల పుస్తకాలు మరిన్ని వస్తాయని ఆశిస్తున్నట్టు చెప్పారు. ఆన్‌లైన్ మార్కెటింగ్ వల్ల అడ్డు గోడలు తొలగిపోతున్నాయని అన్నారు.ఇప్పుడు కొనుగోలు దారులు విషయాన్ని బట్టి మాత్రమే కొంటున్నారని ఎవరుప్రచురించారనేది అంతగా పట్టించుకోవడం లేదని చెప్పారు. టైటిల్‌ను, కోడ్‌ను బట్టి మీరు ఆర్డరు పెడతారు అంతే గాని ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్(ఓపియు) ప్రచురించిందా లేదా అనేది మీకంత ముఖ్యం కాదు అని ఫెర్గూసన్ వివరించారు.

తమ పుస్తకాలు తామే ముద్రించుకున్న అనేక మంది రచయితలు బాగా అమ్ముకోవడం ద్వారా తర్వాత ప్రముఖ సంస్థల దృష్టిలో పడ్డారు.ఈ కారణంగా మిగిలిన వారికి మేలు కలిగింది. అందరూ కాదనడంతో రెండేళ్ల కిందట స్వయంగా పుస్తకం ప్రచురించుకున్న ప్రీతి నాయర్ అనుభవం ఇందుకు ఉదాహరణ. ఆమె పుస్తకం బాగా అమ్ముడవడంతో హార్పర్ కాలిన్స్ ఆమెకు అవకాశం ఇచ్చిందంటున్నారు. పుస్తక ప్రచురణ పట్ల పాత భావాలు తొలగిపోతున్నాయి. బ్లూమ్స్‌బర్రీ సంస్థ కాదని తిరస్కరించనంత మాత్రాన కొంప మునిగిపోదని అర్థమవుతున్నది." ప్రధాన స్రవంతి ప్రచురణలకు ప్రత్యామ్నాయం వుందని మేము గుర్తిస్తున్నాము.అదేమంత నాసిరకం కాదు. అని ఒక ఎగ్జిబిషన్ నిర్వాహకుడు చెప్పారు.

●

కథ

రహమతుల్లా




# కిరాయ్ మకాన్

అబ్దుల్లా, బస్సు దిగి, సూటుకేసు కిందిపెట్టి, ఒళ్లు విరుచుకుని చేతి వాచీలో సమయం చూశాడు.

93 డిసెంబర్ ఐదును పది నిమిషాల క్రితమే కాలం తనలో కలిపేసుకుంది. 'నల్లగొండ బస్సు ప్రయాణీకుల ప్రాంగణము' అన్న బోర్డు పెద్దపెద్ద అక్షరాలతో ట్యూబ్‌లైట్లు వెలుగు కింద కన్పిస్తున్నది.

చుట్టూ ఒకసారి చూశాడు. మనుషులే కన్పించలేదు. ఆ మూలిద్దరు, ఈ మూలిద్దరు బిక్షగాళ్లు మాత్రం చలికి గజగజ వణుకుతూ ముడుక్కుని పడుకుని ఉన్నారు. రెండు మూడు కుక్కలు వాళ్లమధ్య వెచ్చగా పడుకుని ఉన్నాయి. ఒక్క క్షణం మనసులో స్మశాన వాతావరణం మెదిలింది.

జిల్లా కేంద్రం ఇంత నిర్మానుష్యంగా కన్పించటం అబ్దుల్లాను ఆశ్చర్య చకితుడ్ని చేసింది. వాళ్లూరు మండల కేంద్రం కూడా కాదు, ఏ అర్థరాత్రి సెంటరుకు పోయినా టీలు తాగుతూనో, బీడీలు పీకుతూనో, కబుర్లాడుకుంటూనో ఎంతోమంది కన్పిస్తారు. దేదీప్యమానంగా వెలిగే లైట్ల కాంతిలో రాత్రనే స్పురణ కూడ కలగదు.

బస్టాండు ముందున్న రోడ్డు మీదకు వచ్చాడు. పెద్ద గుంపుగా పోలీసులు కన్పించేసరికి భయమేసి ఆగిపోయాడు. అందరి చేతుల్లో తుపాకులు, లారీలు ఉన్నాయి.

'రేయ్..ఇట్రా' గుంపులో నుంచి ఒక పోలీసు.

అమర్యాదగా సంబోధించేసరికి కోపం వచ్చింది అబ్దుల్లాకు కోపాన్ని ఎలా ప్రదర్శించాలో తెలియక నిర్లక్ష్యంగా వారి దగ్గరకు నడిచాడు.

'ఎవుడ్రా నువ్వు?'

'నా పేరు అబ్దుల్లా'

ఆ పేరు వినగానే అక్కడ నిశ్శబ్దం ఆవరించుకుంది.

అతన్ని, అతని చేతిలోని సూట్‌కేసును సందేహంగా చూశారు.

వారి ప్రవర్తన అబ్దుల్లాకు ఆశ్చర్యం కల్గించింది.

పోలీసు గుంపులో నుంచి ఒకతను అబ్దుల్లాను సమీపించి, సూట్‌కేస్ తెరిపించి అన్నీ చెక్ చేశాడు. బట్టలు కన్పించాయి.

'ఎందుకైనా మంచిది, ఈ రాత్రికి వీడ్ని 'లాకప్‌లో పడేయండి' అన్నాడు. అబ్దుల్లాకు అప్పుడు భయమేసింది. తనను అనుమానించటాన్ని పెద్ద అవమానంగా భావించి ఎంతో బాధకు లోనయ్యాడు. ధైర్యం చేసి నోరు మెదిపాడు.

'సార్! లాకప్ అంటున్నారు, నేనేం తప్పు చేశాను? ఇప్పుడే ఒంగోలు బస్సు దిగాను. ఈ నల్గొండలో ఉద్యోగం వచ్చింది. ఈరోజే జాయిన్ కావాలి. ఇదిగోండి... అపాయింట్‌మెంట్ ఆర్డర్ ఒప్పజెప్పినట్లు అని జేబులో నుంచి ఆర్డరు కాగితాన్ని తీసి చూపించాడు.

లాకప్‌లో తోసెయ్యమని ఆర్డరు వేసినతనే ఆ కాగితాన్ని అందుకుని చదివాడు. ఇంగ్లీషులో ఉన్నందున అతనికి సరిగా అర్థం అయినట్లు లేదు.

అంజీనా అంతా సమజ్ అయినట్లు గంభీరమైన ఫోజు పెట్టి, ముద్దాయిలా నిల్చున్న అబ్దుల్లాతో 'సీ...మిస్టర్! పన్నెండు తరువాత రోడ్డు మీద కన్పించరాదు. అందులోనూ మీ తురకోళ్లు ఈరోజు 'బ్లాక్‌డే' పాటిస్తున్నారు. బ్లాక్‌డే పదాన్ని మొదటిసారిగా అప్పుడే విన్నాడు.

ఒక కానిస్టేబుల్ అతన్ని తీసుకపోయి పోలీసుస్టేషన్‌లో వదిలాడు. ఉద్యోగం చేయటానికి వచ్చేసిన ఊర్లో మొదటి రోజే లాకప్‌లో గడపాల్సి

రావటాన్ని, అతని మనసు భరించలేక పోయింది. రాత్రంతా ఒక మూల బాధపడుతూ కూర్చున్నాడు. ఉదయం ఐదు గంటలకు వెళ్ళిపొమ్మన్నారు. స్టేషను నుండి బయటపడి కొంచెం దూరం నడిచేసరికి లాడ్జి కనిపించింది.

రిసెప్షన్ దగ్గరకుపోయి, కునుకు తీస్తున్నతన్ని లేపి సింగిల్ రూమ్ కావాలని అడిగాడు. నిద్రమత్తులోనే అతను రిజిస్టరు తెరిచి 'పేరుచెప్పు' అన్నాడు.

'అబ్దుల్లా' అనేసరికి రాయబోయే వాడల్లా ఒక్కసారిగా ఆగిపోయి అబ్దుల్లాను నఖశిఖ పర్యంతరం రాత్రిపోలీసులు చూసినట్లే చూడసాగాడు.

ప్రతోడు తనను దొంగోడ్ని చూసినట్లు చూస్తుండే సరికి అబ్దుల్లాకు కోపం, బాధ పెరిగిపోతున్నాయ్. కాని తనను అదోలా అనుమానంగా ఎందుకు చూస్తున్నారో, తన పట్ల వింత వైఖరి ఎందుకు ప్రదర్శిస్తున్నారో అర్థం కాకుండా ఉంది.

ఆ రిసెప్షనిస్టును బతిమిలాడి ఒక పది చేతిలో పెట్టాక గది దొరికింది. బాగా అలసటగా అనిపించి ఒక కునుకు తీసి లేచేసరికి ఎనిమిదైంది. గడ్డం గీకించుకుందామని లాడ్జి నుంచి బయటపడ్డాడు. కొద్ది దూరంలో ఒక మూలంగా ఒక మంగలిషాపు. ఒకతనికి క్షవరం నడుస్తున్నది. దినపత్రిక చూస్తూ కూర్చున్నాడు.

'గతంలో ఇదే రోజు అనగా డిసెంబరు ఆరున జరిగిన బాబ్రీ మసీదు విధ్వంసాన్ని గర్హిస్తు, పలు ఇస్లాం మత సంస్థలు ఈ రోజుని బ్లాక్ డేగా పాటించమని దేశప్రజల్ని కోరుతున్నాయి.

అది చదివాక, రాత్రి పోలీసులు ఉపయోగించిన బ్లాక్‌డే పదం గుర్తొచ్చింది. దానర్థం అప్పుడు తెలిసింది.



ఇంతలో నల్గురు కుర్రోళ్లు గుసగుసగా మాట్లాడుకుంటూ షాపులో జొరబడ్డారు. అందరు తలలకు కాషాయ రిబ్బన్లు కట్టుకుని ఉన్నారు. వారి ముఖాల్లో భయంగొల్పే తెగింపు కన్పిస్తున్నది. వారి మాట తీరు అబ్దుల్లాకు అనుమానాస్పదంగా అనిపించి, ఓ కంట వారిపై చూస్తూ పేపర్ తిరగేయసాగాడు.

వారిలో నాయకుడిలా కన్పిస్తున్నతను తన చొక్కా పైకెత్తి పట్టి ప్యాంటులో దోపి ఉంచుకున్న కత్తుల్ని తీసి తలోకటి ఇచ్చాడు. ఒక్కోటి మూరెడు పొడవుంది.

అబ్దుల్లా విపరీతమైన భయానికి, ఆశ్చర్యానికి లోనయ్యాడు. ఆ షాక్ నుంచి తేరుకునేసరికి, కుర్రోళ్లు పక్కసందులో అదృశ్యమయ్యారు.

తనకు సగం షేవింగ్ అవుతూనే పక్క సందులో నుంచి హృదయ విదారకమైన కేక విన్పించింది. కొద్దిసేపటికి 'పీ...పీ...' అని పోలీసు విజిల్స్ విన్పించాయి.

మంగలి గబగబ షేవింగ్ అయిందనిపించి, అబ్దుల్లాను బయటకు నెట్టినంత పనిచేసి, షట్టరు లాగి, తాళం వేసి, షేవింగ్ డబ్బులు కూడా తీసుకోకుండా క్షణంలో మాయమయ్యాడు. బజార్లో జనం కూడా ఎవరిండ్లకూ వాళ్లు అదరాబాదరాగా పారిపోతున్నారు.

అబ్దుల్లా పరిస్థితి అయోమయమై పోయింది.

రయ్‌రయ్ మని అటిటు ఉరుకుతున్న పోలీసు జీపుల్లో నుంచి కలెక్టరు ఉత్తర్వు పదేపదే విన్పిస్తున్నది.

'నల్గొండ పట్టణ ప్రజలారా! పట్టణంలో నిరవధిక కర్ఫ్యూ విధించబడింది. ఒక గంటలో బజార్లు ఖాళీ చేసి, అందరూ ఇళ్లకు చేరుకోండి. కన్పిస్తే కాల్చివేత ఉత్తర్వు అమలులో ఉన్నది.'

అది విన్న అబ్దుల్లా బెంబేలెత్తిపోయాడు. ఏమి జరుగుతున్నదో, ఏం చేయాలో అతనికి అర్థం కాలేదు.

లాడ్జివైపు పరిగెత్తసాగాడు. చెప్పులు జారిపోయాయి. మార్గమధ్యంలో ఇంకో కుర్రగుంపు తటస్థించింది. వీరి తలలకు ఆకుపచ్చ రిబ్బన్లు ఉన్నాయి. వీరి ముఖాల్లో కూడా మొండి తెగింపు, ప్రతీకార వాంఛలున్నాయి. పూనకం అవరించిన మనుషుల్లా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వదులుతూ వేగంగా నడుస్తున్నారు. అబ్దుల్లాకు వణుకు మొదలైంది. భయంతో గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఒక్క ఉదుటన రోడ్డు పక్కనున్న సర్కారు తుమ్మ వెనక్కి గెంతాడు. కసుక్కున అరిపాదాల్లో ముళ్లు దిగాయి. గజగజ వణికిపోతూ కూర్చున్నాడు. వాళ్లు కనుమరుగైన మరుక్షణం పులులు తరుముకొస్తున్న జింక పిల్లమాదిరి లాడ్జి వైపు ఒకటే పరుగు. పాదాల నుంచి స్రవించే నెత్తుటి స్పృహలేదు.

కర్ఫ్యూ నాలుగు దినాలు అమలులో ఉంది. అబ్దుల్లా గదినుంచి అడుగు బయటకు వేయలేదు. గతంలో అతనికి పత్రికలు చదివే అలవాటు లేదు. ఇప్పుడు ఉదయాన్నే అతృతగా పేపర్లన్నీ చదువుతున్నాడు. హైదరాబాద్, నిజామాబాద్, ముంబాయి, ఢిల్లీ ఒకటేంది దేశంలోని చాలా పట్టణాల్లో గొడవలు విస్తరించాయి. ఎంతమంది దేహాల్లో తేజాబుల్లో ముంచిన కత్తులు దిగబడి నల్లబడ్డాయో! ఎన్ని పసికూనల తలలు వీధుల్లో కొబ్బరికాయల్లా దొర్లాయో! ఆస్తుల విధ్వంసానికి అంతే లేదు.

క్రమేపి సాధారణ పరిస్థితులు నెలకొన్నాయి. ప్రజల గాయాలు, భయాందోళనలు మాత్రం పూర్తిగా సమసిపోలేదు.

అబ్దుల్లా ఆఫీసులో జాయిన్ అయ్యాడు. సాయంత్రం అద్దింటి అన్వేషణ ప్రారంభించాడు. రెండురోజుల అవిశ్రాంత వేట పిదప, ఒక ఇల్లు కుదిరింది. అద్దె మాట్లాడుకున్నారు. షరతులన్నీ అంగీకరించాడు. అడ్వాన్సుగా కిరాయి డబ్బులు కూడా ముట్టజెప్పాడు. ఇంటి యజమాని నుంచి వీడ్కోలు తీసుకోబుతున్న సమయంలో అతను క్యాజువల్‌గా అబ్దుల్లాను పేరడిగేడు. చెప్పటానికి ఒక్కక్షణం తటపటాయించాడు. తప్పదు కనుక పేరుచెప్పి అతని ముఖాన్నే చూడసాగాడు. తుస్సుమని ఒక్కసారిగా గాడ్పు దిగిపోయిన ట్యూబ్‌లా అయిపోయింది ఇంటి యజమాని ముఖం. గొంతులో వెలక్కాయ అడ్డుపడ్డట్టుగా ముఖం పెట్టాడు. తత్తరబిత్తరగా లోనికిపోయి, తిరిగి బయటకు వచ్చాడు. 'సారీ తురకోళ్లకు ఇల్లివ్వటాన్ని మా ఆడోళ్లు ఒప్పుకోవటం లేదు' అని తీసుకున్న అడ్వాన్సు అబ్దుల్లా చేతిలోపెట్టి ముఖాన్నే తలుపులు మూసేసుకున్నాడు. మళ్లీ ఇల్లవేట అనుకునేసరికి అబ్దుల్లాను బాధ, అసహనం ఆవరించాయి. అందరూ తనను పరాయిగా అనుమానంగా చూస్తున్నట్లనిపించింది.

'మీరేవిట్లు? మీరేవిట్లు?' అనే పంజాదెబ్బలాంటి ప్రశ్నకు పదేపదే సమాధానం చెప్పాల్సి వచ్చినపుడల్లా విపరీతమైన కోపంతోపాటు అవమానంగా అనిపించేది.

అయినా ఇల్లు తప్పనిసరి కనుక తిరిగి మళ్లీమళ్లీ

సందుగొందులన్నీ తిరిగాడు.

'సారీ! మా వాళ్లకు తప్ప వేరే వాళ్లకు ఇవ్వం'

'మీకా! మీరు ఇంటిని శుభ్రంగా ఉంచుకోరుకదా'

'అమ్మోవ్! మీరుంటే గొడవలవుతాయి'

'ఇల్లు ఖాళీగానే ఉంది. కానీ మాకు నీసు వాసన పడదు. మీకేమో అది లేకుంటే దిగదు'

'అద్దె లేకపోయినా పరవాలేదు. ఉదయాన్నే వాకిలి నూకాలి. నా ఇంటిముందు ముగ్గుండాలి. గడపకు పసుపు కన్పించాలి. ద్వారానికి మామిడాకులు వేలాడాలి'

ఎక్కడికి వెళ్లినా పై మాటలే. ఎంత బతిమాలుకున్నా ప్రయోజనం కన్పించల. ఇల్లు దొరకదనుకుని లాడ్జివైపు నడకసాగించాడు అబ్దుల్లా.

క్రమేపీ చీకటి అలుముకుంటున్నది. మనుషులు వలుచబడుతున్నారు. తలొంచుకుని, ఆలోచించుకుంటూ నడుస్తున్నప్పటికీ, అప్పుడప్పుడు ఉలిక్కిపడి భుజం మీద గుండా వెనక్కు చూస్తున్నాడు. వెనకొస్తున్న తను హఠాత్తుగా వీపులోకత్తిని దించుతాడేమో అనే భయంతో వాళ్లను గమనించుకుంటూ దూరదూరంగా నడుస్తున్నాడు. వాళ్లు దాటిపోగానే ఒకలాంటి రిలీఫ్‌తో అడుగులు పడుతున్నాయి. కొద్దిదూరం పోయిన తరువాత, అనూహ్యంగా 'తుత్' అనే పెద్ద అరుపు అతి సమీపంగా విన్పించేసరికి ఉలిక్కిపడ్డాడు. గుండె ఆగినంత పనయింది. వెనక్కు తిరిగి చూసేసరికి, తనను భయపెట్టగలిగానన్న సంతోషంతో కేరింతలు కొడ్తున్న ఓ తుంటరి పిల్లోడు. భయంతో కూడిన కోపాన్ని అణచుకోలేక లాగిపెట్టి ఒక లెంపకాయ ఇచ్చాడు. వాడు కుయ్యో మనేసరికి, పెద్దమనుషులు గుమికూడారు. వాళ్లందర్ని హిందువులుగా గుర్తించి, ఎందుకైనా మంచిదని, అబ్దుల్లాను అరవింద్‌లా మార్చుకుని అచ్చం హిందువులానే ప్రవర్తించి, చచ్చీ చెడీ అక్కడ్నించి బయటపడ్డాడు. కానీ తన పేరును రహస్యంగా ఉంచాల్సి వచ్చినందుకు చాలా అవమానం అనిపించింది. బాధాతప్త మనసుతో లాడ్జి గది చేరుకుని నిండుగా దుప్పటి కప్పుకుని కుమిలిపోసాగాడు. ఇక్కడి సమాజం పరాయిగా చూస్తున్నది. ఏకాకిననే భావం కలుగుతున్నది. తనలో తన అనుకుంటూ నిద్రపోయాడు. కత్తుల్తో కసకస పొడుస్తున్నట్లు కల వచ్చేసరికి ఉలిక్కిపడి లేచాడు. తెల్లారిందాక ఇంక నిద్రపట్టలేదు

చేదు అనుభవాలతో బెంబేలెత్తిపోయిన అబ్దుల్లా వారం దినాలకే ఉద్యోగానికి రాజీనామా చేశాడు. తిరిగి ఒంగోలు పోవటానికి సామాను సర్దుకుంటున్నాడు.

'హలో' లోనికొచ్చాడు వాళ్లాఫీసు యూనియన్ నాయకుడు.

'నమస్తన్న' అన్నాడు అబ్దుల్లా. అలా అన్నా అని పిలుస్తుంటే ఆత్మీయంగా దగ్గిరగా అనిపించింది. ఇక్కడ అందరూ అలా అన్నా అని ఆప్యాయంగా మందలించుకుంటారు. ఇక్కడోరి మాటల్లో తనకి హిపోక్రసీ కన్పించలేదు.

'ఏం తమ్మి! మాతో చెప్పాపెట్టకుండానే పయనం అవుతున్నావ్. మాతో ఒక్కమాట అనింటే మేమే సాదరంగా తోల్తుంగద' నిష్ఠూరంగా అనేసరికి అబ్దుల్లాకు ఏం చెప్పాలో తెలియక మౌనంగా ఉండిపోయాడు. తిరిగి అతనే అన్నాడు.

'అసలు నీ రాజీనామాకు కారణం కిరాయి యిల్లు దొరుక్కపోవటమా? లేదా ఇక్కడ నీకు రక్షణ లేదనా?

'కిరాయి ఇల్లు కూడా దొరకలేదు. వెతికివెతికి అలసిపోయాను'



'ఇల్లే సమస్యయితే, పరేశాన్ కావాల్సిన పనే లేదు. మన యాదగిరి ఇంట్లో ఖాళీ ఉంది. ఎల్లమ్మ ఇంట్లో ఖాళీ ఉంది. ఇబ్రహీం ఇంట్లో 'ఇల్లే సమస్యయితే, పరేశాన్ కావాల్సిన పనే లేదు. మన యాదగిరి ఇంట్లో ఖాళీ ఉంది. ఎల్లమ్మ ఇంట్లో ఖాళీ ఉంది. ఇబ్రహీం ఇంట్లో ఖాళీ ఉంది. ఎవరింట్లో ఉండాలనుకుంటే, వారింట్లో ఉండొచ్చు. ఆప్షన్ నీదే'

'వీళ్లందరి ఇండ్లలో ఖాళీలు ఉన్నాయా? అరె! నాకెవరూ చెప్పలేదే? ఎంతో ఆశ్చర్యానికి లోనై అన్నాడు.

'నీకెవ్వరూ చెప్పరు, నీ వాళ్లెవరో నువ్వే తెలుసుకోవాలి. అయినా నువ్వెళ్లి అగ్రకులస్తుల వాడల్లో తిరిగితే ఇల్లు దొరుకుతుందనుకున్నావా? నువ్వెవరివి? తురకోనివి. అటువంటి కాలనీల్లో ఇంటి కోసం తిరగావంటేనే నీ అమాయకత్వం తెలిసిపోతున్నది. కనుక ముందు అమాయకత్వం ఉంచి బయటపడు. తరువాత నీ వాళ్లెవరో, నిన్ను పరయిగా చూస్తున్న వాళ్లెవరో తెలుసుకో, నువ్వు కావాలనుకునేవాళ్లు, నీకు నచ్చేవాళ్లు లోకంలో చాలామంది ఉన్నారు. నీ దేశంలో నువ్వు కిరాయివాలా మాదిరి బతకాల్సి వస్తున్న పరిస్థితుల్ని అర్థం చేసుకో'

ఆ మాటల్లో ఏదో శక్తి ఉన్నట్లనిపించింది అబ్దుల్లాకు. నూతనోత్సాహం, ధైర్యమూ కలిగాయి. భయపడిపోయి రాజీనామా ఇవ్వటం అవివేకపు చర్య అని పించింది.

'అది కాదన్న! నన్నెవరూ నమ్ముతున్నట్లు లేదు. పైగా నేనీ ఊర్లో దిగినప్పటినుంచి ఓ పదిమంది ముస్లిమ్స్ అన్నా చచ్చుంటారు' అన్నాడు.

'చూడు తమ్మీ! ఇక్కడ మీ తురకోళ్లు ఏ సమస్యా లేకుండా, ఎటువంటి వివక్షా లేకుండా, పూర్తి రక్షణతో ఉన్నారని నేను అనటం లేదు. నేననేది పారిపోవటం సమస్యకు ఎప్పుడూ పరిష్కారం కాదు. మనిషిలో పౌరుషం లేకుంటే ఎలా? పిరికి జీవితం చప్పిడికూడులా ఉండదూ? మతం, యూనియన్‌లు అబ్దుల్లాకు కొత్త ప్రపంచాలు.

'మరేం చేయాలి?' అడిగాడు.

అతని మాటలు అర్థమైకానట్లే ఉన్నాయి.

అతను కాసేపు కళ్లు మూసుకుని, నిదానంగా కళ్లు తెరచి 'చూడు అబ్దుల్లా! ఇద్దరు బలవంతులు కొట్టుకోరు. హింసించుకోరు. వారిలో ఒకవేళ కసి, పగ ఉన్నా, లోనే అదిమిపెట్టుకుని, గౌరవంగా మెసలుతుంటారు. ఎందుకో తెలుసా? వాళ్లు పోట్లాడుకుంటే ఇద్దరూ నష్టపోతారు. ఎవరికీ గెలుపు తమదేనన్న ధీమా ఉండదు. అందుకే వాళ్లు బలహీనుల్ని టార్గెట్‌గా పెట్టుకుంటారు. ఆ బలహీనులు పేద ముస్లిమ్‌లు కావచ్చు. దళితులు కావచ్చు, శ్రామికులు కావచ్చు. ఎవరైనా వాళ్లకు అనవసరం. కాకుంటే పేదవాళ్లు, బలహీనులు అంతా అట్టడుగు కులాల వాళ్లే. కనుక నష్టపోయే మనం ఎలా బలా పుంచుకోవాలో ఆలోచించాలి కానీ ఇలా పారిపోతే ఎలా....' చెప్పుకుపోతున్నాడు. అప్పుడు కొంత రిలీఫ్ అనిపించింది అబ్దుల్లాకు.

●

సాహిత్య ప్రపంచం
గౌతమ్

# కలం వీరుల కయ్యాలు

మనది కీచులాడుకునే కాకుల దేశం. దారిన పోయే వాళ్లందరినీ పోగేయాలనుకుంటే ఎవరైనా సైకిల్ కింద పడేస్తే చాలు. అందరూ రెండుగా విడిపోయి కేకలేసేవారు, ఉదాసీనంగా చూసేవారు తయారవుతారు.

చాలాకాలం తర్వాత ఫిబ్రవరి 18 22 మధ్య ,
డిల్లీలో ఒక అసాధారణ సాహిత్య సంఘటన జరిగింది. పాఠకులమైన మనం పక్కనుంచి చూస్తుండగా ప్రఖ్యాత రచయితలు రంగంలోకి దిగి ఘర్షణపడ్డారు. దాని ప్రత్యక్ష కథనం ఇది;

టెలిఫోన్ శాఖ వారు పది నిముషాల ముందు పిడబ్ల్యుడి వారు వేసిన రోడ్డును తవ్వడం ప్రారంభించినట్టుగా రెండు ప్రభుత్వ శాఖలు ఏ మాత్రం సమన్వయం లేకుండా ఒకే నగరంలో ఒకే వారంలో రెండు సాహితీ ఉత్సవాలు నిర్వహించాయి. అన్నట్టు ఆహ్వానితులు కూడా చాలా మంది రెండిటికీ ఒకరే. ఈ రెండు ఉత్సవాలలో ఒకటి సాహిత్య అకాడమీ నిర్వహించింది. రెండోది అట్ హోం ఇన్ ద వరల్డ్(ఎహెచ్‌టిడబ్ల్యు) పేరిట భారత సాంస్కృతిక మండలి (ఐసిసిఆర్) జరిపింది.

అకాడమీ ఉత్సవం నీరసంగా వుండే హాలులో జరిగితే ఐసిసిఆర్ చాలా అట్టహాసంగా వుండే సౌధాలలో నిర్వహించింది. అక్కడ సంపన్న వాతావరణానికి బయట పేదరికానికి మధ్య వ్యత్యాసం గమనించిన రచయిత్రి మహాశ్వేతాదేవి ఇలాటి విలాసాలవంతమైన వ్యవహారాలలో తాను పాలుపంచుకోదలచలేదని అన్నారు.

కవి, సాహిత్య అకాడమీ కార్యదర్శి కె.సచ్చిదానందన్ రెండవ ఉత్సవం గురించి తమకు బాగా ఆలస్యంగా తెలిసిందన్నారు. రెండు వేడుకలలోనూ పాల్గొన్న విజయ్ టెండూల్కర్, కృష్ణ సోబ్తిలు అకాడమీనే ఎంచుకున్నారు.ఇంతకూ ఈ రెండు శాఖలు ఇలా పరస్పరం సమన్వయం లేకుండా ఒకే తేదీలనే ఎందుకు ఎంచుకున్నాయి? ఇందుకు సమాధానం మన అధికారుల పద్దతులలో లభిస్తుంది.

మాతృభాష, మరో భాష వివాదం

ఇది చాలా తీవ్రమైనది. ఎంత అంటే సంక్షోభం స్థాయి అనవచ్చునేమో. బాలచంద్ర నెరూడా చాలా కాలం నుంచి కొన్ని విషయాలు చెప్పాలనుకుంటున్నాడు. వాటిని చెప్పేశాడు. " అమితవ ఘోష్,వి.ఎస్ నైపుల్ వంటి వారికి వేళ్లు లేవని,వారెవరికి చెందరని చెప్పదలచాడు. అతనికి ఇక్కడ ఆ అవకాశం వచ్చింది." వారంతా అజ్ఞానులు" అని అతను కోపంగా అన్నాడు. నైపుల్ కు కూడా. లేకపోతే కేవలం తన ప్రచురణకర్త కోరినంత మాత్రాన నైపుల్ ఇండియాపై పుస్తకం ఎలా రాస్తాడు? రచనకు అది ఒక కారణం అవుతుందా? క్రిష్ణ సొబ్టే మామూలుగా చాలా సంయమనంతో ఆవేశరహితంగా మాట్లాడే వారే. కాని దేశీయ భాషలలో రాసే నిజమైన ప్రతిభావంతులైన రచయితలను ఎందుకు వదిలేశారని ఆమె ప్రశ్నించారు.

ఇంగ్లీషు రచయితలకు భారతీయ వాస్తవాలను వర్ణించడంలో గల పరిమితులను మాతృభాషా వాదులు చెప్పారు. ఉభయుల మధ్య వాదోపవాదాలలో రకరకాల సామెతలు పోలికలతో వేడి పుట్టింది. సర్ నైపుల్ రష్దీ తరహా అజ్ఞానంతో వ్యవహరించారు.బెంగాలీ భాషను మినహాయిస్తే మిగిలిన భారతీయ భాషలలో ఆధునిక సాహిత్యం నలభై ఏళ్ల నుంచి మాత్రమే వుంటుందని ఆయన ఎహెచ్‌టిడబ్ల్యు సదస్సు ప్రారంభిస్తూ చెప్పారు.ఎప్పుడూ తగాదాకు సిద్దంగా వుండే కుష్వంత్ సింగ్ ఇంగ్లీషులో రాసే రచయితలు అసమాన పోరాటం చేస్తున్నారని అన్నారు." వాళ్లు మేం రాసింది చదవుతారు. మనం వాళ్లు రాసింది చదవలేం" అన్నారు.ఇంగ్లీషులో రాసే వాళ్లు మరింత అధికంగా రాయల్టీ తెచ్చుకోవచ్చు. మరింత ఎక్కువ మంది చదివేలా చూసుకోవచ్చు అని ఒక విధమైన వికృతానందంతో ఆయన వ్యాఖ్యానించారు." అనంత మూర్తి అందుకు సమాధానంగా హాయిగా నవ్వారు" నేను ఆయనను సీరియస్‌గా పట్టించుకుంటే మూర్ఖత్వమవుతుంది" అన్నారు. ●

సంస్థల మధ్య, భాషల మధ్య జరిగిన ఈ రెండు యుద్ధాలు చివరకు రచయితలలో ఒక భాగం మౌన నిరసనగా బయటకు వెళ్లి పోవడానికి దారి తీశాయి. అరుంధతి రాయ్, కృష్ణ సోబ్తి, చంద్రశేఖర కంబార్, ఉపమన్యు చటర్జీ లు అలా వెళ్లి పోయిన వారిలో వున్నారు.ఇది అవసరమైన నిరసనే అనిపించింది.అయితే నిరసన తెల్పిన వారు మరింత బాగా తెలిసేలా ఆ పని చేసివుంటే బావుండేది.



చంపా ప్రాంగ్‌పానీ

ఇది మరో వివాదం. నిర్మల్ వర్మ నుంచి సీతాంగషు వరకు, అనంత మూర్తి నుంచి రాబర్టో కాలసో వరకు భారతీయులు మన సాంస్కృతిక వారసత్వం కాపాడుకోవాలని ఉద్భోధించారు. ప్రాచీన భారతీయ గ్రంధాలు మహాభారతం, రామాయణం,కధా సరిత్సాగరం వంటి వాటి నుంచి ఉదాహరణలు ఇచ్చారు. ఇది అందరూ ఆమోదించలేకపోయారు."నేను గోవా క్రైస్తవున్ని. అది నా వారసత్వం." అని ఎవరో అన్నారు.ముకుల్ కేశవ్ లేచి గతం గురించిన భావనను హర్షించవచ్చు గాని ప్రాచీన భారత జానపద గాధలకు వలస కాలానికి మధ్య గుర్తుంచుకోదగిందేదీ లేదా అని అడిగారు.

భారతీయ ఇతిహాసాలపై ప్రసిద్ధ గ్రంధం రచించిన రాబర్టో కాలసో అలాటి ప్రశ్నలను సహించేది లేదన్నట్టు మాట్లాడారు. చరిత్ర జ్ఞానం లేని భారతీయులు తమ సుసంపన్న వారసత్వం గురించి తెలుసుకోవాలని కోరారు. మౌనంగా నిరసిస్తున్న అమితవ ఘోష్ చివరకు ఇలా భగ్గుమన్నారు" భారతీయ రచయితలను రాబర్టో తరచూ అనేక విధాలైన పాపాలకు బాధ్యులను చేస్తున్నాడు. వారికి గతం గురించిన దృష్టి లేదని .. నేను ఈ వాదనలోని అసంబద్ధత నాకు ఆశ్చర్యం కలిగించుతుంది.గతం గురించిన అవమానం సిగ్గు ఇవే నేటి రచనలకు ఇతివృత్తాలవుతున్నాయి అని ఆయన అన్నారు. దీనికి రాబర్టో ఏ సమాధానం చెప్పలేదు.సరే సరే అని పాత తరహాలో దాటేశారు.

ఇది భావాల గురించిన సమరం.ఇక దీనికి సంబంధించినదే మూడోది

సారాంశం,సందర్శనం

విదేశాలలో ఇలాటి ఉత్సవాలు జరిగినప్పుడు రచయితలు తమ రచనలనుంచి చదివి వినిపిస్తారు.ఇది చాల కాలం నుంచి వున్న నిగ్గు తేలిన పద్ధతి.వారి రచనల గురించి ప్రేక్షకులకు ఒక అభిప్రాయం కలగడానికికూడా సహాయపడుతుంది.డిల్లీ కాలేజీలలో రెండు సార్లు , ఎహెచ్ టిడబ్ల్యులో రెండు సార్లు జరిగిన పఠనాలు కూడా ప్రేక్షకులతో నిమిత్తం లేకుండా దూరంగా జరిగినట్టు కనిపిస్తుంది.

డిల్లీలో ఉత్సవం ప్యానల్ చర్చ పద్ధతిలో జరిగింది. గంభీరంగా ధ్వనించే సాహితీ చర్చలలో అస్తిత్వం దాని పర్యాయ పదాలు సమనార్థకాలు - వలస, బహుళ సంస్కృతి, గృహం, జాతి - వంటివే పదే పదే ధ్వనించాయి.రచయితలు వీటిని ఇతర అంశాలను మూకుమ్మడిగా చర్చించారు.అది కొన్ని సార్లు చాలా బాగుంటే కొన్ని సార్లు చప్పగా వుంది.వారు అందుకు సిద్ధమై రాలేదేమోననిపించింది.గ్రాంటా ఎడిటర్ ఇయాన్‌జాక్ మాట్లాడుతూ ఉద్భోదల పద్ధతి రచయితలకు అంతగా నప్పకపోవచ్చని అన్నారు.కొంత మందికి ఈ చర్చనీయాంశాలు అంత ప్రాధాన్యత గలవనిపించలేదు.తాము ఎంతో చేసినా అభినందనలు రాక పోవడంతో నిర్వాహకులు నిరుత్సాహపడ్డారు.వారూ అడ్డం తిరిగి మాట్లాడ్డం మొదలెట్టారు. అన్ని సమావేశాలలో ఇచ్చిన అంశాలపై చదవడం చేస్తే పోయేది కదా అని ఎదురు వడ్డించారు. అయితే నేను వెళ్లిన ప్రతి చోటికి పుస్తకాలు మోసుకుపోతానా? అని శశి దేశ్ పాండే అన్నారు.

సాహిత్య అకాడమీ సెమినార్‌లో నేను ప్రముఖ విమర్శకుడు నమ్వర్ సింగ్ హిందీలో ఇచ్చిన చక్కటి ప్రసంగంవిన్నాను. తనకు తెలిసిన నేరస్తుల గురించి విజయ్ టెండూల్కర్ ఆసక్తికరమైన ప్రసంగంచేశారు. రెండో సెమినార్‌లో కూడా ఆయా అంశాలపై పత్రాలు తీసుకురమ్మని చెపితే చాలా ప్రయోజనకరంగా వుండేదేమో. ఎప్పుడూ మెత్తగా మాట్లాడే అలన్ సీలే ఈ మనోభావాన్ని చక్కగా ప్రతిబింబించారు. ఇక్కడ ప్రతీదీ అతి గానే వుంది. నేను తన తోటలో మొక్కలు చిగురించడం చూడాలనుకుంటున్నాను అన్నారు.నేను ఇంటికి తిరిగి వెళ్లాలి. ఇటుకలతో కట్టిన నిజమైన ఇంటికి. నైరూప్య గృహానికి కాదు అని ఆయన చెప్పారు.

# కార్టూన్.కామ్

**శేఖర్**













నాన్నా! నీ సహస్ర గ్రంథ రచన
విరమిస్తావా లేదా .....ఆ....



పోస్ట్ మాడ్రన్ అంటే ఘోస్ట్ మాడ్రన్
బొమ్మ వేస్తే ఎలాగయ్యా



రేటు వెయ్యడం మర్చిపోయానంటారా?
ఎలాగూ ఊరికే ఇవ్వడమేగా?

ఇంటర్వ్యూ

సి. రఘుచారి

# ఇప్పుడు నిర్వేదానికి తావు లేదు






**హిత్యం గురించి మాట్లాడుకోవడమంటే ముందు పత్రికలు తర్వాత పుస్తకాలు చర్చకు వస్తాయి. మీ ఉద్దేశంలో ఈ రంగాల మధ్య అంతస్సంబంధం ఎలా వుంటుంది?**

సాహిత్యం, భాష, సంస్కృతి అరిస్టోక్రసీ నుంచి ఒక విధమైన డెమోక్రసీకి మారడంలో పత్రికలు పెద్ద పాత్ర నిర్వహించాయి. కందుకూరి వీరేశలింగం నుంచి ఇప్పటి వరకు ఈ పాత్ర కొనసాగుతూనే వుంది. ఆంధ్రపత్రిక ,భారతి వంటివి ఒకప్పుడుసాహిత్యానికి ఆటపట్టుగా వుండేవి. ఇటీవల కాలంలో కొన్ని పత్రికలలో సాహిత్యం కొంత ప్రాధాన్యత కోల్పోయిన పరిస్థితివున్నా మొత్తం మీద ఈ పాత్ర పురోగమనశీలమైందే.పత్రికలలో ఒక విధమైన చర్నింగ్ జరుగుతోంది. పత్రికలకు సంబంధించిన సాంసృతిక పార్శ్వాన్ని విశ్లేషించే ఒక ప్రయత్నం పెద్ద ఎత్తున జరగాల్సివుంది. ముఖ్యంగా వామపక్ష పత్రికలు సంఘాలు ఈ విషయంలో పెద్ద పాత్ర నిర్వహించాయి. పరిణామాలకు స్పందించే లక్షణం సాహిత్యంలో ఎక్కువగా వుంటుంది పత్రికలకూ అదే ప్రాణం. మాది వరంగల్ జిల్లాలో సనాతన సంపన్న కుటుంబం.మా ఇంటికి ఆ రోజుల్లో శ్రీ వైష్ణవ పత్రిక వచ్చేది. అలాగే గోలకొండ. అది 1946.ఇప్పటి ప్రమాణాలతో చూస్తే ఆ పత్రికలు ఎలా వుంటాయో కాని అప్పట్లో నిద్రాణమై వున్న జనాన్ని జాగృతపరచడానికి ఎంతగానో దోహదపడ్డాయి. మూగజీవుల హృదయ స్పందనను ప్రతిబింబించాయి. వట్టికోట ఆళ్వారు స్వామి సంచి భుజాన వేసుకుని మీజాన్‌కు విలేకరిగా వూరూరు తిరిగేవారు. సురవరం ప్రతాపరెడ్డి రాజకీయంగా మితవాది.సాంస్కృతికంగా అతివాది. భాషాసంసృతుల విషయంలో ఆయన సేవ చాలా వుంది. ఎవరో వ్యాఖ్యానం చేస్తే ఆగ్రహించి తురుష్క ఆంధ్రలో తెలుగుకవులుఅంటూ గోలకొండ కవుల సంచిక ప్రకటించారు. ఆ విధమైన ఉద్యమ స్ఫూర్తి, అభినివేశం వుండేవి. తెలంగాణా విషయములో భాష విషయమున న్యూనత పనికిరాదని, సర్కారు ఆంధ్రముకంటే అదేమి తక్కువ కాదని ఆయన రాశారు. భాష విషయంలో ఇలాటి పోటీ తత్వం పాజిటివ్‌గా పని చేసింది. ప్రాంతీయపరమైన అస్తిత్వ వాదనలు ఇప్పుడు ఆ రోల్ ప్లే చేయడం లేదు.గాయాలను పుళ్లను మాన్పించేదిగా వుండాలి గాని కెలికేదిగా గాదు.

యాసలు, మాండలికాల వల్ల తెలుగు భాష సుసంపన్నమైంది. అది అసెట్ కాని లయబిలిటీ కాదు. యూనిఫామిటీ ఆకాంక్ష తప్ప సంపూర్ణంగా సాధ్యమయ్యేది కాదు.

............ ✧ ............

తెలుగుసాహిత్యంలో ఉద్యమ స్ఫూర్తి గల కవిత్వమే ప్రజలలో నిలబడింది. శివకవిత్వమైనా, ప్రగతిశీలకవిత్వమైనా. కుల వ్యవస్థను ప్రశ్నించిన నాటి భక్తి కవితా సంప్రదాయిం చూడండి. త్యాగరాజు, పోతన వాళ్ల పరిధిలో ఉన్నత బావాలనే ప్రదర్శించారు. సూఫీ కవిత్వమైనా అంతే. భక్తని ఆదర్శంగా చేనుకుని మంచి భావాలు చెప్పారు. ప్రాచీనమైన వాటిని యధాతథంగా స్వీకరించడం కాదు.నేటికి అన్వయించుకోవాలి.

............ ✧ ............

• సాహిత్య వేత్త, సంపాదకులు

**లాటి వారి ఉపన్యాసాలలో పాత కావ్యాలలోని శ్లోకాలు అలవోకగా కోట్ చేస్తుంటారు. అలాటి అవగాహన రానురాను తగ్గిపోతున్నది.అయితే పాతను అదే పనిగా పట్టుకోవడం -ప్రత్యేకించి నేటి నేపథ్యంలో అంత వాంఛనీయం కాదనే అభిప్రాయం వుంది...**

ప్రాచీన అర్వాచీన అనే విషయంలో కాళిదాసే ప్రమాణం. పురాణమిత్యేవ నసాధు సర్వాం అని ఆయనే అన్నాడు.గతాన్ని పరీక్ష చేసి కాలానుగుణమైన దాన్ని స్వీకరించాలి.అలాటిదే నిలబడుతుంది. తెలుగుసాహిత్యంలో ఉద్యమ స్ఫూర్తి గల కవిత్వమే ప్రజలలో నిలబడింది. శివకవిత్వమైనా, ప్రగతిశీలకవిత్వమైనా. కులవ్యవస్థను ప్రశ్నించిన నాటి భక్తికవితా సంప్రదాయం చూడండి.త్యాగరాజు, పోతన వాళ్ల పరిధిలో ఉన్నత భావాలనే ప్రదర్శించారు. సూఫీ కవిత్వమైనా అంతే. భక్తిని ఆదర్శంగా చేసుకుని మంచి భావాలు చెప్పారు.ప్రాచీనమైన వాటిని యధాతధంగా స్వీకరించడం కాదు.నేటికి అన్వయించుకోవాలి.కొటేషన్స్ ఏవైనా అంతే. ఆ సందర్భాన్నిపాటించకపోతే రాసిన సందర్భం నేటి సందర్భం చూడకపోతే కువ్యాఖ్యానాలు తప్పవు.

భాష సార్వత్రీకరణకు మీడియా కీలకపాత్ర వహించింది.శ్రేష్ఠులైన వారికే పరిమితమైన భాష మీడియా వల్ల సార్వజనీనమైంది.మరీ ముఖ్యంగా గత యాభై ఏళ్లుగా ప్రత్యామ్నాయ మీడియా విస్తరించింది.జాతీయోద్యమం,వామపక్ష ఉద్యమం .సంస్కరణోద్యమం, మూడు స్రవంతులుగా ఇందుకు దోహదపడ్డాయి.అందుకే గిడుగు,గురజాడ,కందుకూరి ఆధునిక ముని త్రయం అయ్యారు.1930-40 ల నుంచి సాగిన సాహిత్యంలో ఆ ప్రభావం కనిపిస్తుంది. కన్యాశుల్కం ఈ ధోరణులకు ప్రతీక అనవచ్చు.

**ని గురజాడపైనా అభ్యుదయ సాహిత్యంపైనా వచ్చే విమర్శలు..**

జీవితం విశాలవంతమైనపుడు ఆ ప్రభావం సాహిత్యంపైనా కనిపించుతుంది. అదింకా విశాలం కావాలని కోరుకోవచ్చు. కాని కొంత మంది దానిలోపాలనే ప్రధానకంగా చూపడం సరైందికాదు.వాళ్లు వైతాళికులు.ట్రయల్ బ్లేజర్స్.వాళ్ల స్ఫూర్తిని ఇంకా ముందుకు తీసుకుపోవచ్చు.ఆ పని కమ్యూనిస్టు ఉద్యమం చేసింది.జన జీవితం కేంద్రబిందువుగా సాహిత్యం సృష్టించింది.అందులో సామాజిక సమస్యలనూ తీసుకున్నారు. కమ్యూనిస్టులు కాని వారుకూడా తెలంగాణా పోరాట స్ఫూర్తిని పలికించారు.కాళోజి,దాశరధి వంటివారు.సుద్దాల హనుమంతు,యాదగిరి, ఇప్పుడు గద్దర్ వీరంతా ప్రజలలోంచి వచ్చినవారే. అటు జన జీవన అనుభవం నుంచి ఇటు అవగాహననుంచి తీసుకున్నారు. కమ్యూనిస్టు ఉద్యమం మనిషిలో ఆత్మాభిమానాన్ని రగిలించింది. ప్రజల మనిషిలో కంఠీరవం ఆ వర్గాల్లోంచి వచ్చినవాడే. మహీధరరామ్మోహనరావు రధచక్రాలు తదితర రచనలలో ఎస్‌సిఎస్‌టి సమస్యలను ప్రస్తావించారు. జాస్ పాత్ర ఈ విషయాలు మాట్లాడుతుంది.పరిస్థితి క్లిష్టంగా మారుతున్న కొద్దీ ఆ వేదనలోంచి ఘర్షణలోంచి రకరకాల వాదనలు వస్తాయి.పురోగమనం ఎవరి గుత్తసొమ్ముకాదు. గతంనుంచి కూడా తీసుకోవాలి. చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా అంటే కేవలం గతాన్ని కీర్తించడానికేనా? భవిష్యత్తు కూడా దాంట్లో వుంది.విశ్వనాథ సంగతి వేరు.ఆయన గతాన్ని పునరుద్ధరించాలను కుంటాడు.కాని వేయిపడగలులో నీవు మిగిలితివి నేను మిగిలితిని అని చెప్పినట్టు చివరకు ఆయనే మిగిలాడు. ముందుకు పోవాలంటే జనాన్ని మనతో తీసుకుపోనాలి.మగ్దూం అంటాడు- చలేతో సారేజమానేకో సాత్ లేకోచలో అని. అలా వుండాలి కాని కవి రాబిన్‌సన్ క్రూసో కాకూడదు. పోరాడాలంటే అన్ని వర్గాల వారిని వెంటబెట్టుకుని పోవాలి. ఇప్పుడు సామ్రాజ్య వాద ప్రమాదం ప్రపంచీకరణ అలాటి సమైక్య పోరాటానికి అనువైన వాతావరణం కలిగిస్తున్నది.ఈ పోరాటానిక ఎన్నో పార్శ్వాలున్నాయి. పర్యావరణ పరిరక్షణ బృందాల నుంచి విప్లవ గ్రూపుల వరకు దీంట్లో కలసిరావచ్చు. గ్రీన్స్ పార్టీల వంటివి కూడా పాల్గొంటున్నాయి. ప్రతికూలమైన సాంప్రదాయిక విలువలకు మతతత్వానికి వ్యతిరేకంగా భాషలు ప్రాంతీయ అస్తిత్వాలను నొక్కి చెప్పేవిధంగా జరిగే పోరాటాలూ వున్నాయి. అయితే ఇవి ఉమ్మడి పోరాటంలో భాగం పంచుకోవాలి. ఆఫ్రికా వంటి చోట్ల సమాంతర సమీకరణలు జరుగు తున్నాయి.ప్రపంచ బ్యాంకుకు వ్యతిరేకంగా సాగే ఇలాటి పోరాటాలు రానున్న కాలానికి సంకేతాలని భావించవచ్చు. శ్రీశ్రీ చీనాలో రిక్షావాలా చెక్‌దేశపు గనిపనిమనిషి కలసి నడుస్తారంటే కవిత్వంలా అనిపించింది. 50 60 ఏళ్ల తర్వాత ఇప్పుడు అది అక్షరాలా నిజమవుతున్నది. మనదేశంలో కూడా వసుధైక కుటుంబం అనేభావన వుంది..

జీవితం విశాలవంతమైనపుడు ఆ ప్రభావం సాహిత్యంపైనా కనిపించుతుంది. అదింకా విశాలం కావాలని కోరుకోవచ్చు. కాని కొంత మంది దానిలోపాలనే ప్రధానకంగా చూపడం సరైందికాదు.వాళ్లు వైతాళికులు.ట్రయల్ బ్లేజర్స్.వాళ్ల స్ఫూర్తిని ఇంకా ముందుకు తీసుకుపోవచ్చు.

ప్రపంచం ఇప్పుడు మారిపోయింది ఇదివరకటి అధ్యయనం, అనుభవం మార్పులకు గురి అయ్యాయి. డబ్ల్యు.టి.వో అంటే ఒకప్పుడు మేధావులు, నిపుణులు మాత్రమే చర్చించేవారు. ఇవాళ అందరూ మాట్లాడుతున్నారు. పత్తిరైతు ఆత్మహత్యలకు దానికీ సంబంధం చూస్తున్నారు. ఈ విషయంలో కూడా మీడియా చాలా పాత్ర నిర్వహిస్తున్నది దాని వెగరీస్, పర్వర్సన్స్, డిస్టార్షన్స్ ఎన్ని ఉన్నా మొత్తం మీద జనాన్ని కదిలించడానికి కారణమవుతున్నాయి. మీడియాకు యాజమాన్యం ఉన్నప్పుడు తటస్థంగా ఉంటారని భావించలేము. అవి ప్రజానుకూల పాత్ర నిర్వహించే అవకాశమే లేదు. ప్రత్యామ్నాయం రావాలి. అన్ని రంగాలలో రావాలి. అవతలి పక్షమా ఇవతలి పక్షమా అనే మీమాంసకు గురి అయి అస్త్ర సన్యాసం చేయడానికి అవకాశం లేదు. రిస్కు తీసుకుని అయినా ఒక పక్షాన్న నిలబడాలి. బ్రతుకును బాగు చేసేదే పిలాసఫీ సిద్ధాంత రాహిత్యం సినిసిజం, నిహిలిజం, నిస్సహాయత, వొంటిగొట్టుతత్వం పనికి రావు కొత్త రచయితలు ఈ

విషయాలను అర్థం చేసుకోవాలి. ఇప్పుడు నిర్వేదానికి తావు లేదు. మేధాపాట్కర్ వంటి వారే రంగంలోకి దిగి పోరాడుతున్నారు ఆమె చెప్పేదంతా సరైంది అవునా కాదా అనే చర్చ కాదు. ప్రజలలో ఉన్న కొన్ని ప్రగాఢ ఆకాంక్షలను ఆమె అందుకున్నది. అలాగే వివిధ తరగతులకు సంబంధించిన వారి అంశాల పై ప్రజాశీలత కావాలి. కదలకుండా ఉండే తత్వం పోవాలి. ఈ క్లిష్ట దశలో సామూహిక కష్టనష్టాల నుండి అనుభూతి పొంది అక్షరాయుధాలు అందించాలి. జయించేందుకు ప్రపంచం ఉంది అనే స్ఫూర్తి కలిగించడం సాహిత్య ధర్మం. ప్రపంచంలో ఏ గొప్ప ఉద్యమం కూడా సాహిత్య ఉద్యమంతో సంబంధం లేకుండా రాలేదు. ఫ్రెంచి విప్లవం మన జాతీయోద్యమం ఏదైనా సరే మేధావుల కాల్పనిక భావనలు నిర్దిష్ట రూపం తీసుకొనేది ఉద్యమాల సందర్భంలోనే.

> సంస్కృతం బ్రాహ్మణ భాష అనుకోవటం, ఇంగ్లీష్ క్రైస్తవ భాష అనుకోవటం ఎంతపొరపాటో ఉర్దూ ముస్లిమ్ భాషఅనుకోవటం కూడా అంతే పొరపాటు. పాలనా భాష పెరిగింది గొప్ప ఉర్దూ కవులలో హిందువులే ఎక్కువ. కాయస్తులు 'వారిలో చాలా ఎక్కువ.

**వసుధైక కుటుంబం అనే పాతకాలపు భావనకు నేడు అన్వయించుతున్నారు అది, అంతర్జాతీయత ఒకటే అన్నట్లు భావించవచ్చా?**

రెండూ ఒకటి కాదు. ఆ భావనను మార్చుకోవాలి. ఆ నాటి వారి భావనలో ప్రపంచం చాలా పరిమితమైంది. ఒక పిర్కాను ప్రపంచం అని ఉండవచ్చు. విశ్వ శ్రేయం కావ్యం అన్నారు భౌతిక సామాజిక కట్టుబాట్లు అన్నీ కూడా అల్ప సంఖ్యాకులను ఆధిక్యతలో అట్టి పెట్టడానికి దారి తీసాయి. కులవ్యవస్థ చాలా హాని చేసింది. గుణకర్మ విభాగశ: అంటూనే విద్యను అధిక సంఖ్యాకులకు అందుబాటులో లేకుండా చేయటం కులవ్యవస్థలో అతి పెద్ద అన్యాయం. నాస్తికులు వేదాలు చదవరాదంటూ ఇతరుల కంటే ఎక్కువగా వారే వేదాలకు హాని చేసారు. వస్తు ఉత్పత్తి చేసేవారికి వినియోగించుకునేవారికి మధ్య అంతరం విపరీతంగా పెరిగిపోయింది. ఆ వైవిధ్యం మన సమాజంలో బాగా కనబడుతుంది. కులాలు సంకుచిత భావాలకు దారి తీసాయి. కులం ప్రధానమై పోయింది. ప్రజాస్వామ్యంలో కులం ఒక్కటే ఆధారంగా గెలవడం సాధ్యం కాదు. అయినా దాన్ని పట్టుకొని ప్రయోజనం పొందాలని చూస్తున్నారు. అ విధమైన తీవ్ర తప్పిదాలు గతంలో ఉన్నప్పటికీ దాన్ని అర్థం చేసుకోవాలి. గతం అర్థం చేసుకోవడం వేరు దాంట్లోనే బ్రతకడం వేరు. చాలాకాలం కిందటే పెండ్యాల సుబ్రహ్మణ్యశర్మ లాంటివారు మహాభారతాన్ని ఆధునిక దృక్పథంతో విశ్లేషించారు. ఎంగెల్స్ ప్రాచీన క్రైస్తవం పట్ల తీసుకున్న వైఖరి కూడా అదే. క్రైస్తవ మతాన్ని సంస్కరించే పోరాటం చేసిన మార్టిన్ లూథర్ నిజానికి రైతుల సమస్యలకు మత పరమైన ఆచ్ఛాదన ఇచ్చారు. ఆదునిక కాలంలో మార్టిన్ లూథర్ కింగ్ కూడా అలాంటి పనే చేశారు. నేనొక కల గంటున్నాను అని కింగ్ అన్న మాటలు సుప్రసిద్ధాలు. ప్రజలెప్పుడూ కలలు కంటూనే ఉన్నారు. వాటిని నిజం చేసే మార్గమేదో చూడడం ఆలోచనా పరుల కర్తవ్యం. లోకాయుతులు చార్వాకుల నుంచి ఈనాటి వరకూ మూఢనమ్మకాలపై విమర్శలు సాగుతూనే ఉన్నాయి. కాని ప్రజల స్థాయిని చూడాలి. ఈరోజు కులతత్వం చాలా వికృతరూపం తీసుకుంటున్నది.

**మీకు ఉర్దూ సాహిత్యంతో మంచి పరిచయం ఉంది కదా?**

చిన్నప్పుడు నేను ఉర్దూ నేర్చుకున్నాను. చాలామంది అనుకునేట్లు కొంతమంది ప్రచారం చేసేట్లు ఉర్దూ ఒక మతానికి సంబంధించిన బాష కాదు. పర్షియన్, అరబిక్ భాషల మేళవింపుతో సివిల్ సర్వీస్ అవసరాల కోసం పుట్టింది. సంస్కృతం బ్రాహ్మణ భాష అనుకోవటం, ఇంగ్లీష్ క్రైస్తవ భాష అనుకోవటం ఎంత పొరపాటో ఉర్దూ ముస్లిమ్ భాష అనుకోవటం కూడా అంతే పొరపాటు. పాలనా భాష పెరిగింది గొప్ప ఉర్దూ కవులలో హిందువులే ఎక్కువ. కాయస్తులు 'వారిలో చాలా ఎక్కువ. హైద్రాబాద్ సంస్థానంలో ఉర్దూ పాలనా భాష మేము ఉర్దూ నేర్చుకున్నాము. ఉర్దూకు ప్రజాస్వామ్య సంస్కృతి చాలా ఎక్కువ. డక్కన్ ఉర్దూ బెంగాలీ, లక్నో, ముంబాయ్ వగైరా ఉర్దూలు వేర్వేరుగా ఉంటాయి. స్థానిక బాషల సంపర్కం అందుకు కారణం. బెంగాలీ ఉర్దూ హైద్రాబాద్‌లో అర్థం కాదు ఒకప్పుడు హైద్రాబాద్‌లో ఉర్దూను శుద్ధి చేయాలని విఫల యత్నం చేశారు. ఉర్దూ అత్యంత అధునాతన భాష. శక్తివంతమైన భాష. గజల్స్ రుబాయెట్‌లు అందరికీ తెలుసు కదా! శ్రామిక ప్రజల భావాలను ఉర్దూ సాహిత్యం గొప్పగా వ్యక్తీకరిస్తుంది. న హింద్ బనేగా, బనేగా న ముసల్మాన్ ఇన్‌సాన్‌కీ అవులాద్ హై అని సాహిర్ లుధియాన్వీ అంటారు.

వైదిక మత సాహిత్యంలోనూ 'లౌకిక వ్యవహారాలు ఉంటాయి. జనజీవనాంశాలు తెలుస్తాయి. అవి చాలా

పరిమితంగానే ఉండొచ్చు. వాటిని తెలుసుకోవడానికి అయినా అవి అధ్యయనం చేయాలి. అంతేకాని రత్నాలు రాశులు పోసి అమ్మారని భ్రమలు పెంచుకోవడం కాదు.

సంస్కృతం చాలా గొప్ప భాష. ఎకామినీ ఆఫ్ ఎక్స్‌ప్రెషన్ - పొదుపుగా వ్యక్తీకరించడం దాన్లో చాలా సులభం. జ్ఞాపకం ఉంచుకోవడానికి వీలైన పద్ధతులు సంస్కృతంలో ఉన్నాయి అందుకే శ్లోకాలు ఇంతకాలంగా గుర్తుంటున్నాయి. మోడ్రన్ మేధావులు కూడా నాలుగు శ్లోకాలు చెప్పడం ఒక అర్హతగా భావిస్తున్నారు. సందర్భానికి సరిపోతాయా లేదో చూడాలి కాని ఆ భాషనే ద్వేషించకూడదు. పతంజలి శాస్త్రి సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పని చేశారు. గొప్ప తీర్పులు ఇచ్చాడు. సంస్కృత పండితుడు కె.ఆర్. మున్షీ సంస్కృతాన్ని పునరుద్ధరించే కార్యక్రమాన్ని పెట్టుకొని ఆయనను ఉపన్యాసానికి ఆహ్వానించారు. సంస్కృతం ప్రజల నుంచి దూరంగా ఉంది దగ్గరకు తీసుకుపోతే బ్రతుకుతుంది అని ఆయన చెప్పారు. కనుక మనం ఏ దృష్టితో చూస్తున్నామనేది ముఖ్యం. కాళిదాసు శాకుంతలంలో కణ్వుడి ద్వారా చెప్పించిన మాటలు సర్వకాలాలకు వర్తించేవే. షెల్లి కీట్స్ వర్డ్స్‌వర్త్ ఇలాంటి మహా కవులలో సార్వజనీనత ఉంటుంది. ప్రపంచమంతట నుంచీ వారు ఉత్తమ భావాలను స్వీకరిస్తారు. తమ భావాలను ప్రసరిస్తారు. 1920 శతాబ్దాలలో ప్రపంచ సాహిత్యంలో అత్యుత్తమ రచయితలెందరో ఉద్భవించారు. సర్వాంటెస్, బైరాన్, చార్లెస్ డికెన్స్, టాల్‌స్టాయ్, బాల్జాక్ ఇలాంటి వారి గ్రంథాలు చదివి తీరాలి. అవి ఆధునిక యుగపు ప్రవేశద్వారాలు లాంటివి. మార్క్స్ షేక్‌స్పియర్‌ను ఎంతగానో మెచ్చుకుంటాడు. వారు ఒక భాషకు దేశానికి పరిమితమయిన వారు కాదు. ఆ అత్యుత్తమ సాహిత్యం ఎంత ఎక్కువగా చదివితే అంత మేలు జరుగుతుంది. టాల్‌స్టాయ్ వార్ అండ్ పీస్ ఒక ఎపిక్ నిన్న జరిగిన ఆఫ్ఘనిస్తాన్ యుద్ధం సందర్భానికి కూడా అది వర్తిస్తుంది. నిన్నటి సాహిత్యాన్ని ఎలా అనువదించుకోవాలన్నదే కీలకం.

> సంస్కృతం చాలా గొప్ప భాష ఎకామినీ ఆఫ్ ఎక్స్‌ప్రెషన్ - పొదుపుగా వ్యక్తీకరించడం దాన్లో చాలా సులభం. జ్ఞాపకం ఉంచుకోవడానికి వీలైన పద్ధతులు సంస్కృతంలో ఉన్నాయి అందుకే శ్లోకాలు ఇంతకాలంగా గుర్తుంటున్నాయి.

**మరి ఇటీవలి ఇంగ్లీషు పుస్తకాల గురించి మీ అభిప్రాయం?**

సాల్మన్ రెష్డీ, అరుంధతీరాయ్, విక్రమ్‌సేఠ్ వంటి వారి పుస్తకాలు చదివాను. నిజానికి ఇప్పటికీ నేను ప్రముఖుల గ్రంథాలను చదువుతూనే ఉంటాను. వీరందరూ చక్కగానే రాస్తు న్నప్పటికీ పైన చెప్పిన జాబితాలోకి రారు. రష్దీ పై ఇరాన్ నేత కొమైనీ మరణశిక్ష విధించడాన్ని వ్యతిరేకించవచ్చు. కాని ఆ ఒక్క కారణంతో అది గొప్ప గ్రంథమైపోదు. శాటానిక్ వర్సెస్ నవలకు వచ్చిన ప్రచారంతో పోలిస్తే అంత ప్రతిభ దాంట్లో లేదు. దానికి సంచలన శీలత ఉన్నంతగా లక్ష్య శుద్ధి లేదు. మార్కెట్ అనేది ఈ రోజుల్లో పుస్తక ప్రచురణను కూడా శాసిస్తున్నది. ఇంగ్లీషులో ఇది మరింత ఎక్కువ. మా చిన్నతనంలో కొవ్వలి నవలలు ఎగబడి చదివేవారు. అంతమాత్రాన అవి గొప్పవైపోవు. అరుంధతీరాయ్ రచనలో రీడబులిటీ చాలా ఎక్కువ. ఆమె తన మొదటి పుస్తకంలో ఇ.ఎం.ఎస్ నంబూద్రిపాద్ గురించి తప్పుగా రాసినప్పటికీ రాసినప్పటికీ తర్వాత ఆమె నిర్వహిస్తున్న పాత్ర బాగానే ఉంది.

**మీరు బహు భాషలలో ప్రావీణ్యం పొందడానికి దారి తీసిన పరిస్థితులేంటి?**

అదృష్టమో దురదృష్టమో గాని నేను తొమ్మిది పదేళ్ళ వయసుల్లోనే సంస్కృతం ఉర్దూ ఇంగ్లీష్ మూడూ నేర్చుకోగలిగాను. ఒక కాజీ, ఒక శాస్త్రి, ఒక బట్రాజు నాకు ఇవి నేర్పించారు. తెలుగుతో పాటు మా అమ్మగారి ద్వారా తమిళం కూడా తెలుసుకున్నాను. ఆంధ్రనామ సంగ్రహం, రుక్మిణీ కళ్యాణం ఇలాంటివి సంస్కృతంలో బాల్యంలోనే చదివాను. నా చదువు ఇంట్లోనే జరిగేది. అది నాన్ ఫార్మల్ విద్య అనవచ్చు. ఆ రోజుల్లో వర్షం రాకపోతే విరాటపర్వం చదివించేవారు అలా ప్రాచీన కావ్యాల గురించి తెలుసుకున్నాను. 1948లో తెలంగాణాలో రజాకారుల దేశముఖ్‌ల దాడి జరిగినపుడు మా కుటుంబం ఈ కమ్యూనిస్టులకు ఆశ్రయం ఇచ్చింది. మా తాతగారు పెద్ద ఆయుర్వేద వైద్యులు. అప్పట్లోనే పాకలు వేసి సర్జరీ చేసేవారు. పేరు మోసిన విస్సూరు రామచంద్రారెడ్డికి ఆయన వైద్యులు. మూడు నెలల పాటు ఆయన ఆ పాకల్లోనే చికిత్స పొందుతూ ఉన్నారు. మా తాతయ్యకు నజరానాలు పంపారు. రెండుగ్రామాలు మా ఆధ్వర్యంలో ఉండేవి. అయితే మా ఇంట్లో వాళ్ళు ఉదారవాదులు. మాకు తెలిసీ తెలియని వయస్సు అప్పట్లో కమ్యూనిస్టు నాయకులు నల్లా నిర్సింహులు, యాదగిరి రావు

## పుస్తకాలు - పాఠకులు

1998లో నేషనల్ రీడర్‌షిప్ స్టడీ కౌన్సిల్ ఆధ్వర్యాన జరిగిన సర్వే ప్రకారం భారతీయులు మీడియాకు వెచ్చిస్తున్న సమయంలో 68.8 శాతం టి.వి.కి. సరిపోతున్నది. పుస్తక పఠనానికి 16.2 శాతం సమయం కేటాయిస్తుండగా, రేడియోకు 15 శాతం సమయం వెచ్చిస్తున్నారు. టి.వి. వీక్షణంలో 1995లో వారానికి 11 గంటలు గడుపుతుంటే, 1996 నాటికి ఇది 13 గంటలకు పెరిగింది. పత్రికా పఠనానికి రోజుకు 23.7 నిముషాలు మాత్రమే కేటాయిస్తున్నట్లు, అది కూడా వయసు మళ్ళినవారు ఎక్కువగా చదువుతున్నట్లు పరిశీలనలో తేలుతున్నది. పట్టణ జనాభాలో 20 శాతం మంది చదవడం లేదని సర్వే వెల్లడించింది.

భారతీయ ప్రచురణ రంగం కూడా ఈ సమస్యలు, సవాళ్ళను ఎదుర్కొంటూనే వుంది. అక్షరాస్యత, ఆదాయాలు రెండూ పతక్కువగా వున్న మన దేశంలో పుస్తక ప్రచురణ, విక్రయం ఎదురీత వంటిదే. బాగా అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాల్లోనే ప్రచురణ కర్తలు ప్రధానమైన అమ్మకాలకు గ్రంధాలయాల పై ఆధారపడతారు. తాను 2,000 ప్రతులు ప్రచురిస్తే 1,200 గ్రంధాలయాలు కొంటాయని, 500 ప్రతులు ఆస్ట్రేలియాకు ఎగుమతి అవుతాయని, 300 మాత్రమే పాఠకులు కొనుగోలు చేస్తారని ప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత గ్రాహంగ్రీన్ స్వయంగా చెప్పారు.

అమెరికాలో గ్రంధాలయాలపై మనిషికి రు.12 చొప్పున, బ్రిటన్‌లో రు.6 చొప్పున ప్రభుత్వాలు ఖర్చు చేస్తాయి. మన దేశంలో ఇందుకు కేటాయింపు మనిషికి అయిదు పైసలు మాత్రమే! బ్రిటన్‌లో ఒక్కొక్కరు 12 పుస్తకాల చొప్పున గ్రంథాలయాల నుండి తీసుకుంటారట. కాని మన దేశంలో ఇది చాలా తక్కువ. ఒకప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ దేశంలో 10,000 గొప్ప గ్రంధాలయాలని స్థాపించాలని ఆకాంక్షించారు. కాని ఈనాటి పాలకులు ఉన్న గ్రంధాలయాలనే మూసివేసి, చేతులు దులుపుకుంటున్నారు.

వంటివారు వస్తే మా అమ్మ వండిపెడుతుండేది. వాళ్ళు ఎవరూ చుట్టాలయితే మాకు ఎందుకు చెప్పవని పోట్లాడేవాన్ని. గుంటమయ్య అని ఒక పూజారి ఉండేవాడు. ఆయన కూడా పోరాటంలో పాల్గొని నిర్బంధానికి గురయ్యాడు. చోడవరపు విశ్వనాథం అని ఆయన్ను కాల్చి చంపేశారు. అలాంటి వాతావరణంలో కూడా మా కుటుంబం సంఘానికి అండగా నిలబడేది. నేను తర్వాత క్రిష్ణా జిల్లా మానుకొండలో చేరాను. మా మేనమామ కాంగ్రెస్‌లో పని చేసేవారు. తర్వాత 1949లో సికింద్రాబాద్ వచ్చాం. మగ్దుం శ్రీశ్రీ రచనలు, ఎర్రజెండాలు వంటి పుస్తకాలు అప్పుడే చదివాను. విశాలాంధ్ర చదువుతుండేవాడిని. ప్రత్యేకించి మోటూరి హనుమంతరావు గారి రచనలు నాకు ఎంతో నచ్చేవి. అందుకే ప్రజాశక్తి ప్రారంభ సభలో పాల్గొన్నప్పుడు ఆ విషయం ప్రత్యేకంగా చెప్పాను. అన్నయ్య ఆర్‌టిసిలో పని చేసేవాడు. విద్యార్థి ఉద్యమంలో పని చేస్తూ క్రమంగా కమ్యూనిస్టునయ్యాను. ఉస్మానియా యూనివర్శిటీలో పి.యు.సిలో మెరిట్ లిస్టులో ఆరోవాడిగా వచ్చాను. బిఎస్‌సి, ఎల్‌ఎల్‌బి చేసాను. జీవనవిధానంలో మాత్రం సంప్రదాయ ఛాయలు ఉండేవి. ఉదాహరణకు చాలాకాలం పిలక ఉండేది. అందుకే పార్టీ సభ్యత్వం తీసు కోలేదు. 1959-60 లలో చివరిసారి తద్దినం పెట్టి ఇకమీదట పెట్టనని ప్రకటించి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడినయ్యాను.

వివిధ పత్రికలలోనూ, తర్వాత పేట్రియాట్ విలేఖరిగానూ పని చేసాక విశాలాంధ్ర సంపాదకత్వం స్వీకరించాను.



**అధ్యయనం రచనా పద్ధతి గురించి చెప్పండి?**

రాజకీయాలు, సాహిత్యం చదవడానికి చాలా ప్రాధాన్యతనిస్తాను. ఇప్పటికీ రోజుకు రెండు గంటలయినా చదవాల్సిందే. ప్రాచీన సాహిత్యం చదివిన ఉటంకించినా దాన్ని ప్రస్తుతానికి ఎలా అన్వయించాలని తప్ప గతం పై వ్యామోహంతో కాదు. నాకు రాయడం పైన, రాజకీయాలపైన ఉన్న ఆసక్తితోనే లాలో మంచి స్టూడెంట్‌ని అయినప్పటికీ ప్రాక్టీసు చేపట్టలేదు. అందులోనూ హిందూ ధర్మ శాస్త్రాన్ని ఆప్షనల్ సబ్జెక్టుని చాలా లోతుగా చదివాను. అయినా పార్టీలో పని చేసేప్పుడు ఇవన్నీ ఎందుకనే భావం....



**లామందితో పోలిస్తే మీరు రాసిన పరిమాణం తక్కువ ఉపన్యాసాలకు కేటాయించే సమయం ఎక్కువ అనిపించదా?**

నిజమే! మనం రాయకపోతే నష్టమేమిటి? అనే ధోరణి దీనికి చాలవరకూ కారణం. అది పొరపాటే అయి ఉండవచ్చు. పైగా రోజువారీ రొటీన్ పనులు వీటి మధ్య రాయాల్సినంతగా రాయలేదేమో! రాసినవి కూడా భద్ర పర్చుకోలేదు. ఇక ఉపన్యాసాలు అంటే ప్రజాజీవితంలో భాగంగా అవి తప్పని సరి కదా! ●

పీపీ

# రివ్యూ!



వర్ధమాన రచయిత వామనరావు మహా ఊపుగా పత్రికా కార్యాలయంలోకి ప్రవేశించాడు.

సరాసరి సంపాదకుడి చేంబర్‌లో ప్రవేశం సంపాదించాడు.

నేను ఫలానా వామనరావు అనే ప్రతిభావంతుడైన యువకవిని అని నిర్మొహమాటంగా పరిచయం చేసుకున్నాడు.

అయితే అతని ప్రతిభావంతమైన పరిచయం ఆ సంపాదకున్ని అంతగా కదిలించలేదు.

అలాగా, మంచిది. అంటూ లిటరరీ ఇన్‌చార్జిని కేకేయబోయాడు.

"నేను మీతోనే మాట్లాడాలని వచ్చాను" అన్నాడు వామన్.

చెప్పండి అన్నట్టు ఫేస్‌పెట్టాడు ఎడిటర్.

మీ పత్రికలో పుస్తకాలకు చాలా అన్యాయం జరుగుతుంది అన్నాడు వామన్.

"అదేమిటి, ప్రతి వారం అరడజను బుక్స్ రివ్యూ చేస్తుంది మేమే"గా

"కాని అవి సక్రమంగా వుంటున్నాయో లేదో మీరు పట్టించుకోవడం లేదు"

"అదేం మాట, ఇందాకే ఆనందరావు ఫోన్ చేసి మా రివ్యూలు బాగుంటున్నాయన్నారే!"

"ఆయన పోయిన వారం ఆయన బుక్‌ను బాగా పొగుడుతూ రాశారు కదా, ఆయన ఎందుకు మెచ్చుకోడు..."

"అంటే మీ బుక్‌ను కూడా మెచ్చుకుంటే మీరూ మాట్లాడరన్నమాట"

"అదేం కాదు, మా లోపాలు ఎత్తి చూపండి. కాని కొంత మందిని పైకి లేపడం, కొంత మందిని తొక్కి పట్టడం సరైంది కాదని చెప్పడానికే వచ్చాను."

"మంచిది. మేమైతే అలాచేయం .మీరు నిశ్చింతగా వెళ్లవచ్చు. అయినా రివ్యూలు రాసేది మేము కాదు,సాహిత్య అనుభవం వున్నవాళ్లురాస్తారు ఎక్కువగా. వాళ్ల అభిప్రాయాలతో మీరు ఏకీభవించకపోతే వారికే రాయవచ్చు."

ఎడిటర్ చర్చ అయిపోయిందన్నట్టు మొహం పెట్టడంతో వామన్ సర్దుకున్నాడు.

"ఇది నా లేటెస్టు కవితా సంపుటం సార్.మీరే చూసి రాయాలి."

"అంత తీరిక నాకెక్కడేడ్చింది కాని మా శ్రీరాంకు చెబుతాను మీరు వెళ్లిరండి."

"కాదుసార్, క్రితం రెండుసార్లు ఇస్తే దిక్కూముక్కు లేదు..."

"సరే ఈ సారి నేను చెబుతాన్లెండి. నాకో అర్జెంటు మీటింగుంది." మీరెళ్లే మంచిదని తెగేసి చెప్పాడా ఎడిటర్.

"అలాకాదు సార్, మాలాటి వర్ధమాన రచయితలను మీరు కాకపోతే మరెవరు ప్రోత్సహించాలి? మీరు తిట్టండి. చివాట్లు పెట్టండి. తప్పులేదు.కాని లోతుగా సమీక్ష చేయాలి" ఆవేశం ఏ మాత్రం తగ్గకుండా అన్నాడు వామనరావు.

"ఓకే" ఎట్టకేలకు మెత్తబడ్డట్టు కనిపించాడు ఎడిటర్జీ

వామనరావు ఆనందంగా వెళ్లిపోయాడు.

ఆ వెంటనే ఎడిటర్ లిటరరీ ఇన్‌చార్జిని పిలిచాడు.

"కుర్రాడేదో తెగ ఇదై పోతున్నాడు గాని కాస్త శ్రద్ధగా చేసే సమీక్షకుడికివ్వండి" అని పురమాయించాడు.

"అలాగే నండీ" అంటూ తలూపాడతను.

.................

వామనరావు మళ్లీ విసురుగా గదిలోకివచ్చేశాడు.

''ఏయ్ ఎడిటర్ బిజీగా వున్నా''డని చెబుతున్నా వినిపించుకోకుండా ఊగిపోతున్నాడు.

అతని సంగతి తెలిసిన ఎడిటర్ గారు వాళ్లను వెనక్కుపొమ్మని చెప్పాడు.

"అదికాదండీ" అని ఏదో చెప్పబోతున్న వామనరావును ముందు కూచో అని స్తిమితపరచాడు.

అప్పుడు విషయం అడిగాడు

" సమీక్ష మరీ అంత ఇదిగా రాస్తే ఎలా సార్? అన్నీ తప్పులంటే ఎలా? అని లబోదిబో మన్నాడు.

అలాగా అని సింపతిటిక్ ఫేసు పెట్టిన ఎడిటర్‌ను చూసే సరికి అతనికి విచారం మరీ పెల్లుబికింది.

ఎడిటర్ కూల్‌డ్రింకు తెప్పించాడు. దాంతో వామనరావు రెచ్చిపోయి సమీక్షపై తన సమీక్షవడగళ్ల వానలా కురిపించాడు.

అంతా విని, కూల్‌డ్రింకు పూర్తయ్యాక ఎడిటర్ ఇలా అన్నాడు-

"చూడు, లోతుగా చేయాలన్నావు. విమర్శలను ఆహ్వానిస్తానన్నావు. తీరా సమీక్ష వచ్చాక ఇలా ఇదైపోవడం ఏమన్నా బావుందా?" అని క్లాసు మొదలెట్టాడు.

వామన రావు ఏదో చెప్పబోయినా అవకాశం ఇవ్వకుండా-

రాయడానికి నీకెంతస్వేచ్ఛ వుందో సమీక్షరాయడానికి అతనికీ అంత స్వేచ్ఛ వుంది. నీ పుస్తకం నేనూ చదివాను. నీ దగ్గర కొంచెం టాలెంటువున్నా ఎక్స్‌ట్రా అంతకంటే ఎక్కువుంది. ఇంకెప్పుడూ మా సమీక్షల గురించి గొడవ చేయకు. నిజంగా నీ దగ్గర పాయింటు వుంటే రాసి పంపు. చూస్తాను.ఇంక వెళ్లొచ్చు.."

"సార్, మంచి నీళ్లు దొరుకుతాయా?" దీనంగా అడిగాడు వామనరావు.

సరిగ్గా అప్పుడే గదిలో ప్రవేశించాడు ఇన్‌చార్జి

"సార్. భలే చెప్పారు . అందరికీ మనమే లోకువ. వీళ్ల పుస్తకాలనుపొగడ్డం కోసమే మనం పత్రికలు పెట్టినట్లు.ఫీలైపోతారు" అంటున్న అతన్ని;

"ఒక నిముషంకూచోండి" అన్నాడు ఎడిటర్

"వచ్చేవారం సప్లిమెంటు" అనబోతుండగా-

"నేను చెప్పేది దానిగురించి కాదు. ఆ సమీక్షల్లో విమర్శలు చేయవచ్చు. మన రివ్యూయర్ పుస్తకం ఆసాంతం చదవాలి కదా.. ఆ బుక్కులో లేవని చెప్పినవి చాలా భాగం చివరిలో వున్నాయి. మధ్యలోఅసలు చదవ లేదు.విషయసూచిక చూసి, పైపైన తిరగేసి రివ్యూలు రాస్తే సరిపోతుందా?"

"మరి ఇందాక ఆ అబ్బాయితో అలా అన్నారు .."

"అతనిదీ తప్పే. నేను ఆ బుక్కు చదివాను.తన లోపాలు చూసుకోకుండా అతను ఆవేశపడుతున్నాడు. అలాగని మన రివ్యూ గొప్పదైపోతుందా? ఎవరు నేర్చుకోవలసింది వారు నేర్చుకోవాలి కదా... ఇంకెప్పుడూ బద్ధకస్తులకు,బాధ్యతలేనివారికి రివ్యూలు ఇవ్వకండి...నేనేదో కాస్త సాహిత్య పరిచయం వున్నవాన్ని.ఇలాటి అనౌచిత్యాలు భరించలేను' ' అంటూ ముగించాడు ఎడిటర్.

## రచయితకు నిగ్రహముండాలి

కథలో వ్యక్తులు ఎంతైనా ఉద్రేకం చూపొచ్చు. వస్తు వ్యాప్తంగా ఎంతైనా రసం వుబకొచ్చు. కాని రచయిత నిబ్బరంగా వుండి పై నుండి వాటి మార్గం చిక్కదనం సంచలనం శాసించే అధికారం పోగొట్టుకోకూడదు.

నిజంగా జరిగిన విషయం ఎంత అపూర్వమైనదైనా కొంత వడబోత, చిత్రిక జరిగితే గాని కళాజగత్తులో దానికి ప్రాముఖ్యం లేదు.

ఇతివృత్తం ఊహలో కొంతకాలం తిప్పుకుంటేగాని, కథకి స్వరూపం ఏర్పడదు. ఆ స్వరూపమే స్థిరమైందని వ్రాసేసి వూరుకోకూడదు. వస్తువు స్వీకరించడం ఊహలో వ్యక్తుల రూపకల్పన చెయ్యడం వొకెత్తు! కళానుగుణమైన ఆవేశానికి లొంగిపోయి కళానుగుణమైన సత్యాన్ని ప్రదర్శించడం వొకెత్తు.

అనుభవాల సంఖ్య ముఖ్యం కాదు. అనుభవం తీవ్రత, వొత్తిడి, పదును ఇవి ముఖ్యం. తాను ఎన్నెన్నో కొత్తరకం కథలు వ్రాస్తున్నానని అనుకున్నా ప్రతికథకుడి ధోరణిలోను ఏవో రెండు మూడు రీతులే కనబడుతూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు ఒక రకం కథలు పాఠకులకు ఎక్కువగా రుచిస్తున్నవనుకొని ఆరకం కథలు వ్రాయడానికే పూనుకుంటే ఆ కథకునిలో నిజాయితీ లోపించిందన్నమాటే.

చెప్పదల్చుకున్న విషయం వున్నవాడు శైలిని గురించి పట్టించుకోడు అన్న ఒక అభిప్రాయం వుంది. నేను అంగీకరించను. కేవలం ఒక యజ్ఞంగా శైలిని గురించి పట్టించుకోనక్కరలేదు నిజమే. కాని శైలంటూ ఒకటుంది. రచయిత వ్యక్తిత్వమంటూ ఒకటుంది. విషయం చెప్పటంలో కూడా మెళకువులు, చమత్కృతి వయ్యారం, నాజూకుశక్తి వున్నాయి. పాఠకుణ్ణి తనవైపుకు లాక్కుని లొంగదీసుకుని రచయిత అంతరంగ జగత్తులోకి ప్రవేశింపచెయ్యడం శైలి లక్ష్యం. ఆ నడక, ఆ ధోరణి ఆ పోకడ పాఠకుడికి నచ్చితే అసలు ఆ అంతరంగ జగత్తు నుండి పొమ్మన్నాపోడు.

కథలో ఇతివృత్తానికి అనువైన శైలిని అలవరచుకోవాలి కథకుడు. కృషి చేసి దాన్ని సాధించాలి. అది వస్తువులో కలసిపోయి, విడదీయడానికి వీల్లేకుండా అల్లికజరగాలి.

సత్యవ్యవహారంలో ప్రయోగించే ఉత్తమాటలు పోగుచేసి వ్రాసెయ్యడం సులభమే. కాని అందులో సరియైన పదాలని వెదికి కూర్చడం, పొదగడం చెప్పదలచుకున్నదాన్ని తీక్షణంగా చెప్పడం ఇదే శిల్పం. దీని వెనుక ఊహాబలం ఆలోచన పరిశీలన అంతరం జగత్తులో తపస్సు ఇన్ని జరిగితే గాని ఆ విల్పానికి ప్రాణంరాదు.

ఒక ఆదర్శాన్ని నైతిక విలువనీ పాఠకుని నెత్తిన రుద్దుతున్నట్టు కనిపించకుండా రచనసాగాలి.

-బుచ్చిబాబు

నివాళి

ఎస్. వినయకుమార్



# కవితా కాంతిపుంజం కైఫీఅజ్మి

"కర్ చలే హమ్ ఫిదా జాన్ వతన్ సాథియో.... అబ్ తుమ్హారే హవాలె వతన్ సాథియో" అంటూ కైఫీ ఆజ్మీ మనల్ని వదలి వెళ్లారు. హకీకత్ సినిమా కోసం ఆయన ఈ పాట రాశారు. వీరసైనికుల మీద చిత్రించిన ఈ పాట కర్తవ్యబోధన చేస్తుంది. ఆవేశం తెప్పిస్తుంది. ఉత్తేజంతో ఉరకలెత్తిస్తుంది. దేశంకోసం ఎంతటి త్యాగమైనా చేయాల్సిందే అన్న స్ఫూర్తిని కల్గిస్తుంది. భారతదేశంపై వెలుపలి దాడిని దృష్టిలో ఉంచుకొని ఆయన ఈ పాట రాశారు. "ఓ నేస్తాల్లారా నేను దేశం కోసం ఆత్మార్పణ చేసి వెళ్లిపోతున్నాను. మాతృభూమిని మీ ఆధీనం చేసి వెళ్తున్నాను. మీరే దీన్ని కాపాడుకోవాలి" అన్న ప్రబోధంతో సాగే ఈ పాట దేశాన్ని ఉర్రూతలూగించింది. దేశభక్తి, లౌకిక విలువల పట్ల అపార అనురాగం, సోషలిస్టు ఆలోచన కల్గిన కవి కైఫీ ఆజ్మీ. సినిమాలకు పాటలు కట్టి డబ్బు ఆర్జించిన వ్యక్తి కాదు ఆయన. కార్యరంగంలోకి దూకి కవులు, కళాకారులను తనతోపాటు ఉన్నత విలువల వైపు నడిపించిన మహా పథికుడాయన. స్వాతంత్రోద్యమం, సోషలిస్టు చైతన్యం నుండి ప్రభవించిన కాంతిపుంజం ఆయన.

ఆయన పూర్తిపేరు అక్తర్ హుస్సేన్ కైఫీ ఆజ్మీ. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఆజంఘర్ జిల్లా మిజ్వాన్ గ్రామంలో 1919 జనవరి 19న పుట్టారు. 11 ఏళ్ల వయస్సులో మొదటి రచన చేశారు. 18 ఏళ్ల ప్రాయంలోనే పదుగురు మెచ్చే గజల్లు రాశారు. సోషలిస్టు సిద్ధాంతం, అది సాధించిన విజయాలు ఆయనను చిన్న వయస్సులోనే ఉత్తేజితున్ని చేశాయి. పేదలకోసం, ఉన్నత మానవ విలువల కోసం ఆయన చిన్న వయస్సులోనే రచనలు చేశారు. రచనలకే పరిమితం కాకుండా ప్రగతిశీల రచయితల సంఘం నిర్మాణంలో పాలుపంచుకొన్నారు. ఇండియన్ పీపుల్స్ థియేటర్స్ అసోసియేషన్ 'ఇప్టా' స్థాపనలోనూ ఆయన కీలక పాత్ర పోషించారు. 1942లో 19 ఏళ్ళ వయస్సులో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1943లో బొంబాయిలో కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు ప్రారంభించినప్పుడు ఆయన తన స్వగ్రామం నుండి బొంబాయికి వచ్చేశారు. బొంబాయి వచ్చాక సినిమాలకు పాటలు, మాటలు రాసినప్పటికీ ఆయన కిరాయి రచయిత కాలేదు. సినిమా రంగాన్ని కూడా ఆయన అభ్యుదయ భావాల వ్యాప్తికి ఉపయోగించుకొన్నారు. ఆయన కలం నుండి వెలువడిన పాటలు అనేకం ఇప్పటికీ సజీవంగా ప్రజల నోళ్లలో నానుతూనే ఉన్నాయి. ధనికుల కోసం ఇంద్రభవనాలు నిర్మించి ఫుట్‌పాత్‌లపై బతికే శ్రమజీవుల జీవితాలను ఇతి వృత్తంగా రాసిన కవితల సంకలనం 'మకాన్' (ఇల్లు) ఆయన ఉత్తమ రచనల్లో ఒకటి. "ఆఖిర్-ఎ-సాబ్" "ఆవారా సాజ్దే" పేర్లపై కూడా ఆయన సంకలనాలు వెలువడ్డాయి. ఉర్దూ బ్లిట్జ్ కోసం ఆయన రాసిన వ్యాసాలు "నయీగులిస్తాన్"గా ఆయన రాసిన సినిమా పాటలు "మేరీ ఆవాజ్‌సునోగా" సంకలనాలుగా వెలువడ్డాయి. ఆయన కవితల్లో కొన్నింటిని ఎంపిక చేసి పవన్‌శర్మ ఇంగ్లీష్‌లోకి అనువదించారు. ఆయన కవితలపై 'సాగుఫ్తగీ' పేరుతో ఇటీవల ఒక ఆల్బం కూడా వెలువడింది. అన్యాయం, అవివేచిత, మతచాంధసాలపై కలం ఝుళిపించిన కైఫీ రచనల్లో "మకాన్", "ఔరత్", "బహురూపిణీ" "దూస్రా" "బన్‌వాస్" ఎన్నదగ్గవి ఆయన 'నసీమ్' చిత్రంలో ముఖ్యపాత్ర పోషించారు. 'బుజ్దిల్' సినిమాకోసం 1948లో "రోతే రోతే గుజర్ గయీ రాత్ రే" అన్న పాటతో ఆయన సినిమా రంగంలో ప్రవేశించారు. బహుళ ప్రాచుర్యం పొందిన ఆయన సినిమా పాటల్లో "వఖ్ నెహీకియా క్యా హసీన్ సితం" "దేఖీ జమానె కీ యారీ (కాగజ్‌కే

ఫూల్)" "ఎహ్ దునియా ఎహ్ మహఫిల్" (హీరా రాంఝూ) "తుమ్ ఇత్నా జో ముస్కురా రహేహో" (అర్థ్) వంటివి ఉన్నాయి. 'హీర్ రాంఝూ' 'గరమ్ హవా", 'మంథన్" వంటి సినిమాలు మాటల రచయితగా ఆయన ప్రతిభను చాటుతాయి. విశ్వభారతి విశ్వ విద్యాలయం ఆయనకు గౌరవ డాక్టరేట్‌ను ప్రదానం చేసింది. మహారాష్ట్ర, ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వాల నుండి ఆయన పలు అవార్డులను అందుకున్నారు. భారతీయ సాహిత్యంలో ఆయన కృషికి సాహిత్య కేంద్ర అకాడమీ ఫెల్లోషిప్‌ను ఇచ్చి సత్కరించింది. ఆఫ్రో-ఆసియన్ అవార్డు, సోవియెట్ లాండ్ నెహ్రూ అవార్డు కూడా ఆయనకు లభించాయి. దేశ విభజనపై నిర్మించిన, గరమ్‌హవా, చిత్రానికి ఉత్తమస్క్రీన్‌ప్లే, ఉత్తమ మాటల రచయిత అవార్డును అందుకున్నారు.

భూస్వాముల కుటుంబంలో పుట్టినా ఆయన శ్రమ జీవుల కోసం నిలిచి పోరాడారు. పదేళ్ల క్రితం సోషలిజానికి ఎదురు దెబ్బలు తగిలినప్పటికీ ఆయన విచలితుడు కాలేదు. విశ్వాసం కోల్పోలేదు. మరణించే వరకు కమ్యూనిస్టు పార్టీలో కొనసాగారు. భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదు ప్రకటించినా తీసుకోవడానికి ఆయన నిరాకరించారు. ఉర్దూ భాష పట్ల కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న వివక్షకు నిరసనగా ఆయన పద్మశ్రీ బిరుదును తిరస్కరించారు. ఆయన సతీమణి షౌకత్‌ది హైదరాబాదు. కూతురు షబానా అజ్మీ ప్రసిద్ధనటి. సామాజిక కార్యకర్త. రాజ్యసభ సభ్యురాలు. ఆమెను ఆ విధంగా తీర్చిదిద్దిన కీర్తి కూడా కైఫీకి దక్కుతుంది.

చాలా కాలం నుండి ఆయన అస్వస్థతతో ఉన్నప్పటికీ, గుజరాత్ పరిణామాలు ఆయనను త్వరగా మననుండి లాక్కెళ్ళాయేమో ! లౌకిక విలువల కోసం జీవితాంతం నిలబడిన కైఫీ గుజరాత్ మారణహోమాన్ని ఎలా తట్టుకోగలరు. దేశం కోసం ఆత్మార్పణ 'ఫిదా' చేయండి అంటూ ఆయన గొంతెత్తి చాటగా 'ఫిదా' అర్థాన్నే మరికొందరు మార్చేశారు. అర్థంలేని మారణహోమం సృష్టించి అందులో శలభాల్లా మాడిపోవడమే "ఫిదా" అంటే ఆయన ఎలా అంగీకరించగలరు. బహుశా అందుకే ఆయన మన నుండి మొహం తిప్పేసుకున్నట్లున్నారు. "కర్ చలే హమ్ ఫిదా జాన్ వతన్ థియో" అన్న ఆయన మన చెవుల్లో ఎప్పుడూ మారుమోగుతుంది. అబ్ తుమ్హారే హవాలె వతన్ సాథియో అంటూ ఆయన దేశాన్ని మనకు వదిలేసి వెళ్లారు. వెలుపలి శత్రువుల నుండేకాదు, దేశంలోని మతోన్మాదుల నుండి, విచ్ఛిన్నశక్తుల నుండి మాతృభూమిని కాపాడే బాధ్యతను ఈ తరానికి అప్పగించి పోయారు. ఆ కర్తవ్య నిర్వహణ దిశలో వడివడిగా అడుగువేయడమే ఆయనకు నిజమైన నివాళి.

---

## జీవితమే ముడిపదార్థం!



కథా రచనకు ముడిపదార్థం జీవితం

రచయితలకు జీవితానుభవం వుండాలి. జీవితసత్యాన్ని గ్రహించే నిశితమైన దృష్టి వుండాలి. ఏ కళకైనా అపారమైన సాధన వుండాలి. వాస్తవిక కళకు మరీనూ.

యదార్థ జీవితాన్ని గురించి రాయడమే పరమాదర్శం కాదు. దాన్ని గురించి నిర్లప్తమైన సాంస్కారికమైన దృష్టి ప్రజాసామాన్యంలో వ్యాప్తంచేయాలి. పాములను చంపడం అవసరం కావచ్చుగాక, కాని పాము విషానికి విరుగుడు కనిపెట్టడం సంస్కార దృష్టిలో ఇంకా ముఖ్యమైనది జీవితాన్ని గురించిన నిర్లిప్తమైన సాంస్కారిక దృష్టి పెరిగే కొద్దీ, జనసామాన్యం జీవిత సమస్యలతో సరిగా పోరాడగల్గుతుంది.

రచయిత తన అనుభవాన్ని దాటిపోరాదు. తనకు సమగ్రంగా తెలిసిన జీవితభాగం అవగాహన చేసుకొని అందులోని సత్యాన్ని ప్రకటించినంతసేపు రచయిత మధ్యతరగతి వాడైనా జమీందారైనా కూడా అభ్యుదయ సాహిత్యం రాయగలడు.

అన్నిటికన్నా కష్టసాధ్యమైనది జీవిత వాస్తవికత. వాస్తవజీవితం అందరికీ అనుభవలోదే. కానీ జీవిత వాస్తవికతను గ్రహించడం చాలా కష్టమైనది. అందుచేతనే జీవితాన్ని గురించి అనేక అసత్యవాదాలు ప్రచారంలో ఉన్నాయి. వాటిని నమ్మేవారుకూడా ఉన్నారు. విజ్ఞానమూ, ప్రజలతో సన్నిహిత్వత్వమూ చాలావరకు రచయితకు ఉపకరిస్తాయి. రచయితకు తనకు సన్నిహితంగా వుండే జీవితరంగంలో గల సత్యం బాగా అవగాహన అవుతుంది.

కథ సంఘటనను అరటిపండు ఒలిచినట్టు ఒలిచిపెట్టాలా లేక చదివేవాడికి ఆలోచన రేపి వదలాలా అంటే నా అభిప్రాయం ఆలోచన రేపి వదలాలనే. సరైన సాహిత్యం చదివేవారి భావాలను ఒక మార్గంగా నడపాలిగాని ఒక గమ్యస్థానం చేర్చి వదలరాదు. అలా ఒక సందేశం ఇచ్చి వదిలినట్లయితే సాహిత్యం పరమార్థమైపోయి అది మరో చైతన్యానికి దారితీయదు. కథలోవుండే సంఘటన అసమగ్రంగా వుండాలని కాదు. కానీ దాని మీద కథకుడు తీర్పుచెప్పరాదు. కథ చదివిన వాడి తలలో భావాలు నలుముఖాలు పోయినాకూడా శిల్పంలో లోపం వున్నట్లే.

\- కొడవటిగంటి కుటుంబరావు

ఇంటర్వ్యూ

దేవీప్రియ

# అర్థం కాని కవిత్వం వ్యర్థం



**జర్నలిజం, సినిమా, అడ్వర్టయిజమెంట్ ఇలా వివిధ వ్యాపకాల మధ్య కవితా రచన కొనసాగించడంలో సమస్యలు సదుపాయాలు ఎలా వున్నాయి?**

నాకు సాహిత్యమంటే ఏమిటో చూచాయగా తెలిసింది 1966-67 ప్రాంతాల్లోనే. తెనాలి విఎస్ఆర్ కాలేజీలో చదువుతున్నప్పుడు మా కాలేజీ మ్యాగజైన్‌లో కొన్ని రచనలు చేశాను. గుంటూరు ఎసి కాలేజీలో బిఎలో చేరిన తర్వాత కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి, స్ఫూర్తిశ్రీ వంటి అధ్యాపకుల ప్రభావం వల్ల ప్రాచీనకవ్విం గురించి అలంకారాల గురించి కొంత వరకు తెలుసుకోగలిగాను. అలా కవిత్వం మీద ఆసక్తి అభిమానం పెరుగుతూ వచ్చాయి. అయితే జీవితం ఒక్కొక్క దశలో ఒకో పని చేస్తూ వచ్చాను. అలా వెళ్లవలసిన అవసరం నాకు ఏర్పడింది. నా లోపల కవితా దాహం మాత్రం అలాగే వుండిపోయింది. . నాకు కిటికీలు ఎక్కువ. అన్నిట్లోంచి చూడటం నా నైజం. సినిమాలు,రంగస్థలం చదువుకునే రోజుల్లోనే చాలా సమయం తినేసేవి.అయితే మార్కులు కూడా బాగానే వచ్చేవి కనక టీచర్లు ఏమనేవారు కాదు. సినిమాలు చాలా ఎక్కువగాచూసేవాణ్ని.15 20 సార్లు చూసినవి కూడా వున్నాయి. మెట్రికులేషన్ నాటికే ఈ సినిమా నాపై ఒక మ్యాజికల్ ఎఫెక్టు వేసింది. అప్పుడే నాకు సినిమాల గురించి కొన్ని ఒరిజినల్ ఐడియాలు వచ్చేవి.ఉదాహరణకు పాటలు వినేప్పుడు సంగీతపరికరాలు లేకుండా అవన్ని వినిపించడం అసహజమనిపించేది. సినిమా అంటే ఒక టెక్నికల్‌ప్రాసెస్ అని తెలుసుకున్నాను. అడ్వర్టయిజింగ్ లక్షణాలు కూడా స్కూలు రోజుల్లోనే వుండేవి. సినిమాల శతదినోత్సవాలకు స్వంత ఖర్చుతోగోడలపై రాసేవాణ్ని. పాటలురాసేవాణ్ని. గుంటూరులో మెహర్‌బాబా గుడి వుండేది.అక్కడ విన్న పాటలకు అనుకరణలు తయారు చేసేవాణ్ని. ఏమైనా కవిత్వం నా మొదటి ప్రేమగా వుండేది.కవిత్వం నాదారి అని నిర్ణయించుకున్నాను. ఏ విషయమూ దాన్ని డామినేట్ చేయడానికి అనుమతించలేదు. అందుకోసం ఉద్యోగానికి కవిత్వానికి సంఘర్షణ వస్తే రెండో దానికే ప్రాధాన్యత నిచ్చాను. ఆంధ్రజ్యోతిలో జీవకవిత్వం జిందాబాద్ స్పెషల్ వేసినప్పుడు ఎండి జగదీష్ ప్రసాద్ గారు సందేహం వెలిబుచ్చినా వినకుండా వేయించాను.తర్వాత ఆయనే మెచ్చుకున్నారనుకోండి.. ఉదయంలో కూడా నారాయణరెడ్డిగారికి జ్ఞానపీఠ అవార్డు వచ్చినపుడు కవర్ స్టోరీ రాస్తే గజ్జెల మల్లారెడ్డి గారు అభ్యంతరపెట్టాలని చూశారు.నేను నా నిర్ణయానికే కట్టుబడ్డాను. ఇలా కవిత్వం జీవితం మధ్య ఎంపిక వచ్చినపుడు నేను ఖచ్చితంగా వ్యవహరించాను. అయితే ఏ దేశంలో నైనా మన దేశంలో మరీ కవిత్వాన్ని నమ్మిజీవితం గడపగలమని అనుకోను. జీవిక కోసం ఏదో ఒకటి చేయాలి. అవి

............. ✧ .............

ప్రతికవికీ వ్యక్తిగా ఒక అస్తిత్వం వుంటుంది. అనుభవాలు సంఘర్షణల జీవితం వుంటుంది. సాంఘిక చైతన్యం,నిబద్ధత వున్న కవి వాటిని సమాజానికి అన్వయిస్తాడు. ఆ పనిలోఎంత క్లారిటీ వుంటే అంతగా జయప్రదమవుతాడు. వ్యక్తిగత అంశాలు సోషల్ రిలవెన్స్ వున్నంత వరకు రాయవచ్చు. లేకపోతే నిరర్థకం. నేను వ్యక్తిగత అనుభవాలు అనుభూతులు రాయడానికి వ్యతిరేకం కాదు. కాని అవి అందరి సమస్యలుగా కనిపించాలి.

............. ✧ .............

దేవీప్రియ | .కవి, పాత్రికేయుడు

చేస్తూనే నా కళాభిరుచిని తృప్తి పరుచుకోడానికి చేయాల్సిందిచేశాను. డబ్బు ప్రధాన కన్సిడరేషన్ అనుకోలేదు. గద్దర్ మీద డాక్యుమెంటరీ తీయడానికి చాలా ఖర్చయింది.అది నా అభిరుచికి కన్విక్షన్‌కు సంబంధించిన విషయం కనకే వెనుకాడలేదు. ఇప్పటికి దాన్ని ప్రమోట్‌చేయలేకపోతున్నాను.

అయితే ఇన్ని జీవన మార్గాలు నా అనుభవం సృజన ఎన్‌రిచ్ కావడానికి దోహదపడ్డాయనడంలో సందేహం లేదు.

**ఇక్కడే ఒక చిన్న ప్రశ్న. చాలా మంది మీ మిత్రులు రాసిన వ్యాసాలలో నెత్తిమీద దారిద్ర్యముంది అనే మీ కవితను ప్రస్తావించారు.కాని మీరు చాలా ఉన్నత స్థాయి ఎగ్జిక్యూటివ్ పదవులు నిర్వహించారు కదా..**

నిజమే. నా జీవన శైలి వల్లనే నాకు డబ్బుసమస్య వచ్చింది. ఈ శైలిని నేను కోరుకోలేదు. కాని వచ్చింది. నా యువకదశలో అశాంతిని గుర్తుచేసుకుంటే ఈ మాత్రం సెటిల్డ్ లైఫ్ గడుపుతానని ఏనాడూ అనుకోలేదు. ఇంటి బాధ్యతలు అనారోగ్యం వగైరాల వల్ల కలిగిన సమస్యలు. నిజానికి నేను చాలా పేదరికం నుంచి వచ్చాను. కోరుకోక పోయినా పై తరగతి జీవితానికి అలవాటు పడ్డాను. మధ్య తరగతి కాంక్షలను అందుకోవడానికి జరిగే పోరాటంలో ఆర్థిక సమస్యలు..దానికి తోడు అనారోగ్యం. ఈ సంగతులన్ని సన్నిహిత మిత్రులకు బాగా తెలుసు గనక వారు ఆ చరణాలను ఉటంకిస్తూ ఉంటారు.

**జర్నలిజంలో , అడ్వర్టయిజింగ్‌లో చాలా ప్రయోగాలు చేశారు కాని కవిత్వంలో మాత్రం మీరు సరళత్వాన్నే ఎంచుకున్నట్టు కనిపిస్తుంది.కారణమేమైనా వుందా?**

ఉంది. నా ఉద్దేశంలో కవిత్వం ఒక కమ్యూనికేషన్. అది చేరవలసిన వారికి చేరకపోతే రాయడమెందుకు? అర్థం కాని కవిత్వానికి అర్థమే లేదు.అన్ని సృజనాత్మక ప్రక్రియలు కూడా ముందుగా జనానికి అర్థం కావాలని నేను కోరుకుంటాను. అందుకే నైరూప్య చిత్రాలు కూడా నాకంతగా నచ్చవు.

**మరి మీరు చేసే సినిమాలలో , నర్సింగరావు గారు కొంత ఆ శైలిని అనుసరిస్తారు కదా?**

నిజమే. అది కూడా నేను పూర్తిగా ఏకీభవించేది కాదు.దాసి సినిమా వుందనుకోండి. అక్కడ నుంచి ఇక్కడకు రావడాన్ని అంతసేపు చూపించాలా అని నేను చాలాసార్లు అనేవాణ్ని. అయినా ఆ సినిమా స్క్రీన్‌ప్లే నాకు మంచి పేరు తెచ్చిపెట్టింది. నాకు సంబంధించినంతవరకు కమ్యూనికేషన్ కీలకం. మిగిలినవన్నీ తర్వాతే. నీ వెంత గొప్పవాడవైతే అంత తేలిగ్గా చెప్పగలగాలి. ప్రతిభ కమ్యూనికేషన్‌కు అవరోధం కాకూడదు. నేను కవిత్వం మెరుగుపరుచుకోవడానికి చాలా చదువుతాను, ఆలోచిస్తాను. అలంకారాలు ఉపమానాలు వగైరాలను పట్టించుకుంటాను.కాని అవన్ని మరింత తేలిగ్గా అర్థంకావడానికే. కమ్యూనికేషన్ కోసం కళనైనా సాక్రిఫైజ్ చేస్తానేమో గాని దీనికోసం దాన్ని బలిపెట్టను.

**కవి వ్యక్తిగత అంశాలు అదేపనిగా రాయడంపై మీ అభిప్రాయం?**

ప్రతికవికీ వ్యక్తిగా ఒక అస్తిత్వం వుంటుంది. అనుభవాలు సంఘర్షణల జీవితం వుంటుంది. సాంఘిక చైతన్యం,నిబద్ధత వున్న కవి వాటిని సమాజానికి అన్వయిస్తాడు. ఆ పనిలోఎంత క్లారిటీ వుంటే అంతగా జయప్రదమవుతాడు. వ్యక్తిగత అంశాలు సోషల్ రిలవెన్స్ వున్నంత వరకు రాయవచ్చు. లేకపోతే నిరర్థకం. నేను వ్యక్తిగత అనుభవాలు అనుభూతులు రాయడానికి వ్యతిరేకం కాదు. కాని అవి అందరి సమస్యలుగా కనిపించాలి.చదివిన వాన్ని కదిలించాలి. నాకు సంక్లిష్ట కవిత్వం పట్ల నమ్మకం లేదు. వ్యక్తివాదం చేసేవారిలోనూ గొప్పకవులున్నారు స్మైల్ గొప్ప కవి.వేగుంట మోహన ప్రసాద్ మేము విద్యార్థులుగా వున్నప్పుడు ఆయన వస్తే అంత దూరం నుంచి చూసి ఆశ్చర్యపోతుండేవాళ్లం.గుంటూరులోనేను చదువుతున్నప్పుడే భారతిలో ఆయన కవిత్వం వచ్చేది. తెలుగే కాని బోధపడేది కాదు. కాని ఆ కవిత్వం నాకేం బోధపడేది కాదు. అప్పుడే నేను ఇలా రాయకూడదని నిర్ణయించుకున్నాను. నేను ఇవాళ ఎంతో కొంతైనా జయప్రదం కాగలిగానంటే అలా అనుకోవడమే కారణం.

**ఈ తేలికైన కవిత్వం వల్ల మిమ్మల్ని ఇతరులు ఎవరైనా తేలిగ్గా చూసేవారా?**

తేలిగ్గా చూడ్డం కాదు కాని ఒక విధమైన హోస్టిలిటీ వుండేది. అది నా కవిత్వం వల్ల కాదు, నా సామాజిక నేపథ్యం వల్ల అనుకునే వాణ్ని. అది సంకుచిత మనస్తత్వ ఫలితం. మన సమాజంలో అనేక దురభిప్రాయాలున్నాయి. విద్యార్థి దశలోనే కాదు. తర్వాత కూడా అలాటి ప్రతికూలతలను ఎదుర్కొన్నాను. కేవలం నా ప్రతిభ వల్లనే పైకి రాగలిగానని చెప్పగలను. బ్రాహ్మలు తప్ప అప్పట్లో పత్రికా రంగంలో పై స్థానాలలో ఎవరూ వుండేవారుకాదు. ఉదయం అడ్వయిజరీ ఎడిటర్‌గా నేను అపాయింట్ కావడంపెద్ద సంచలనం. అందుకు నేను చాలా గర్వపడుతుంటాను.

**మీరు మద్రాసులో చాలా కాలం సినిమా పరిశ్రమలో పనిచేశారు. తిరిగి నర్సింగరావు ప్రభృతులతో కలసి 80లలో జరిగిన ప్రయత్నాలలోనూ భాగస్వామిగా వున్నారు. మరి 50 లలో అభ్యుదయ రచయితలు సినిమా రంగంలో సాధించిన పట్టును విజయాలను తర్వాత సాధించలేకపోవడానికి కారణాలేమిటంటారు?**

1972 తర్వాత పదేళ్లు నేను అనిసెట్టి గారితో పాటు మద్రాసులో వుండి సినిమా రంగంలోపనిచేశాను. అప్పట్లో ఆయన డబ్బింగ్ కింగ్. సాహిత్యానికి సంబంధించిన విషయాలు అనేకం తెలియడానికి

ఒక విధమైన హోస్టిలిటీ వుండేది. అది నా కవిత్వం వల్ల కాదు, నా సామాజిక నేపథ్యం వల్ల అనుకునే వాణ్ని. అది సంకుచిత మనస్తత్వ ఫలితం. మన సమాజంలో అనేక దురభిప్రాయాలున్నాయి. విద్యార్థి దశలోనే కాదు. తర్వాత కూడా అలాటి ప్రతికూలతలను ఎదుర్కొన్నాను. కేవలం నా ప్రతిభ వల్లనే పైకి రాగలిగానని చెప్పగలను.

ముఖ్యంగా ఆంగ్ల సాహిత్య పరిచయం పెరగడానికి ఆయన చాలా దోహదం చేశారు. కొన్ని సినిమాటైటిల్స్‌లో ఆయనపేరుతో పాటు నా పేరు కూడా వుంటుంది. అయితే నేను సినిమా రంగంనుంచి వచ్చేశాను. తిరిగి 1980లలో మరో విధంగా సినిమా రంగంలో పనిచేశాను. మీ రడిగిన ప్రశ్నకు వస్తే 1950 లలో తెలంగాణా పోరాటం అనంతర నిర్బంధ పరిస్థితులలో నాటి అభ్యుదయ రచయితలు పెద్ద ఎత్తున వలస పోయారు. మైగ్రేటెడ్ ఎన్‌మాస్ అన్నమాట. అప్పుడు తెలుగు సినిమా పరిశ్రమ బాగా అభివృద్ధిచెందే దశలో వుంది. న్యూటాలెంట్ కోసం చూస్తూ వుంది.ఈ వెళ్లిన వారు కేవలం బ్రతుకు తెరువు కోసం, రక్షణ కోసం వెళ్లారు. అలాటి తరుణంలో వారిని పరిశ్రమ వుపయోగించుకుంది.ఒక రకంగా వారి ప్రతిభను కొల్లగొట్టింది.వారంతా ప్రజలపక్షాన నిలవవలసిన రచయితలు. కాని సినిమా రచయితలుగా మారిపోయారు. కాని 80లలో మేము వెళ్లినప్పటి పరిస్థితి వేరు. సన్నివేశం పూర్తిగా మారిపోయింది. వ్యాపారసినిమా బాగా వేళ్లూనుకుంది. సినిమా రచయితను కావాలని నేను సీరియస్‌గా ప్రయత్నించలేదు. కమర్షియల్ సినిమాకు ప్రత్యామ్నాయంగా ఆర్ట్ సినిమా వుందని చెప్పడం,దాని ఉనికినిచూపడం నా ఉద్దేశం. అంతే. నేను ప్రత్యామ్నాయ భావాలతో సినిమా పరిశ్రమకు వెళ్లాను. ముందే చెప్పాను కదా, చిన్నప్పటి నుంచే నాకు సినిమా అంటే చాలా ఆసక్తి అని.నేను ప్రజాతంత్ర ఎడిటర్‌గా వున్నప్పుడే ఆర్ట్ సినిమా గురించి రాసేవాణ్ని.నిస్సంకోచంగా విమర్శలు చేసేవాణ్ని.

అసలు అంతర్జాతీయంగా అనేక తీవ్ర పరిణామాలు కలిగాయి.సోవియట్ విచ్చినం అప్పుడు నేను హిట్లర్ నవ్వు రాశాను. కాని అక్కడ జరిగిందేమిటి, ఎందుకు జరిగింది ఇలాటి విషయాలపై ఇప్పటికి రచయితలుగా మాకు పూర్తి స్పష్టత లేదు.వామపక్షాలు ఆ పని చేయాలి. అవగాహన పెంచి ఆచరణలో ఐక్యంగా ముందుకు తీసుకుపోవాలి.

**దిగంబర కవిత్వానికి వ్యతిరేకంగా పైగంబర కవిత్వం రాశారు కదా, మరి అలాటి విమర్శలే చేస్తున్నవారితో మీ సంబంధాలెలావుండేవి?**

సి.పి.ఐ, సి.పి.ఎమ్ రెండూ దిగంబర కవిత్వాన్ని గట్టిగా వ్యతిరేకించాయి. పైగంబర కవులుగా మేము రావడం వెనక సిపిఐ హస్తం లేదా ఆ పార్టీకి సంబంధించిన మేధావుల ప్రోద్బలం వున్నాయిని చాలామందిఅనుకున్నారు. మేము గుంటూరులో పరుచూరి రాజారాం గారి సలహాలుతీసుకోవడం పైగంబర కవుల తొలిసంపుటి విశాలాంధ్ర బుక్‌హౌస్ మేడపైన ఆవిష్కరించడం ఇందుకు కారణమై వుండొచ్చు. కాని మాకు అలాటి అభిప్రాయలు లేవు.నిజానికి నాకు దిగంబర కవుల విషయంతో పెద్ద విభేదం వుండేది కాదు. కాని చెప్పే తీరుపైనే అభ్యంతరముండేది. అంతే శక్తివంతంగా రాసి దాన్ని ఎదుర్కోవాలనుకునేవాళ్ళం. మమ్మల్ని వురి కొల్పినవాడు సుగమ్‌బాబు.

నాకు రాజకీయంగా అంత స్పష్టత వుండేది కాదు. విశాఖలో శ్రీశ్రీ షష్టిపూర్తి,విశాఖ విద్యార్థుల కరపత్రం వగైరాల తర్వాత విరసం ఆకర్షించింది. ఖమ్మంలో దాని మహాసభలకు వెళ్లాను. ప్రదర్శనలో ముందుభాగాన పాల్గొన్నాను.కాని అప్పటి నుంచే నాలో సందేహాలుండేవి. ఏం జరుగుతుందో తెలియకుండా ఎలా చేరడం అనిపించింది. రాజకీయాలే ప్రధానంగా అనిపించాయి. తెలియకుండానే ఆగిపోయాను. మేము ముగ్గురం ఖమ్మం వెళ్లాము. ఓల్గా,సుగమ్ బాబు విరసంలో చేరిపోయారు. నేను చేరకుండానే తిరిగొచ్చాను. వాస్తవానికి నేనెప్పుడూ ఒకల్ కాదు.రిస్ట్రయిన్డ్‌గానే వున్నా.

**అంటే బ్రాడ్ లెఫ్ట్ ఐడియాలజీని మీరు బలపరుస్తారు కదా?**

ఔను.లెఫ్ట్ లీనింగ్స్ ఎప్పుడూ వున్నాయి. ఇంకా ఇంకా పెరుగుతున్నాయి కూడా. విరసం తో సహా అన్ని ఇంకా రిలవెన్స్ కలిగివున్నాయనే నా భావం. అయితే ఈనాటి పరిస్థితులలో విరసం,అరసం అంటూ గీతలు గీచుకోవడం ఇర్రిలవెంట్ అని, ప్రజాతంత్ర భావాలు కలవారందరిని కలుపుకొని పోవాలని నేననుకుంటున్నాను.

**మీరు చాలా సార్లు చెప్పినట్టు ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం ద్వారా చేరాతలు, ప్రారంభం కావడానికి దళిత స్త్రీ మైనార్టీవాదాలపై చర్చలు తీవ్రం కావడానికి కారకులయ్యారు కదా, ఆయన రాతలపై అనేక అభిప్రాయాలున్నాయి.వాటిని ఆయనకే వదిలేసినా ఈ వాదాలపై మీ అభిప్రాయాలేమిటి?**

స్త్రీ వాదం నిజానికి ఎప్పటినుంచో వున్నదే. మిగిలిన రెండు వాదాలలో సామాజిక పరిస్థితుల నుంచి ఉత్పన్నం అయ్యాయి. ఆయా తరగతుల వారు అభివృద్ధి కావడం వల్ల చైతన్యం పెరగడం వల్ల వారిపై ఇతర వర్గాల ఒత్తిడిపీడన పెరగడం వల్ల వచ్చిన వాదాలని నేననుకుంటాను. ఆ రియాక్షన్‌కు సాహిత్య ప్రతిస్పందనగా వచ్చాయి. ఇదివరకటి ఐడెంటిటీస్‌ను ప్రశ్నించడం జరిగింది. కొత్త ప్లాట్‌ఫాం కోసం అర్జ్ పెరిగింది.దాన్ని వామపక్షాలు తీసుకుంటాయని నేను ఆ రోజులలో ఆశించాను .అలా జరగనందుకు నిరుత్సాహపడ్డాను. ఏ భావమైనా మార్గదర్శకత్వం వహించే రాజకీయ సంధానకర్త లేకుండా జరగదు. నాయకత్వం కావాలి. దేశ రాజకీయాలకు అతీతంగా వీరు మాత్రమే సాధించగలిగింది వుండదు. అందుకే అవి టేకాఫ్ కాలేదు. మైనార్టీలలో ఈ రోజున కనపడే కొన్ని ధోరణులకు మతదృష్టి కారణమని నేననుకోను.రాజకీయ వ్యవస్థ ప్రపంచ పరిణామాల వల్ల పెరిగే నిరసన ఆ రూపంలో వ్యక్తమవుతోంది.వారు లెఫ్ట్ పార్టీలతో ఇంకా ఐడెంటిఫై కాలేకపోతున్నారు.అందుకే వారిని ఎడ్యుకేట్ చేయాలి. అది నా ఉద్దేశం.

అసలు అంతర్జాతీయంగా అనేక తీవ్ర పరిణామాలు కలిగాయి.సోవియట్ విచ్చినం అప్పుడు నేను హిట్లర్ నవ్వు రాశాను. కాని అక్కడ జరిగిందేమిటి, ఎందుకు జరిగింది ఇలాటి విషయాలపై ఇప్పటికి రచయితలుగా మాకు పూర్తి స్పష్టత లేదు.వామపక్షాలు ఆ పని చేయాలి. అవగాహన పెంచి ఆచరణలో ఐక్యంగా ముందుకు తీసుకుపోవాలి.

●

# మొండికత్తి

## అను

## చెవులకు చెప్పలడిగే రకాలు










మీకవులు రచయితలతో ఒక చిక్కుంది. మీకు తెలివితక్కువ ఆకలెక్కువ. చదువు తక్కువ రాతలెక్కువ. మీరు చెవులకు చెప్పులడిగే రకం కాని ఈనాటి తక్షణ ప్రాపంచిక సామాజికావసరం చేతులకు చెప్పులు తొడగడం. మొండికత్తి అనే పేరు దేనిని ప్రతిబింబిస్తుంది? అంటే సందేహమే అని నిస్సందేహంగా చెప్పొచ్చు కళ అన్నాక కొంచెం డొంక తిరుగుడుండాలి. చిన్న ముసుగు చూపాలి. అదే మీరు " కోయిలీ గ్లోబలీ" అని పేరు పెట్టారనుకోండి. ఇందులో కత్తి సజెషన్‌గా వుంది. సూత్రబద్ధంగా వుంది. మాత్రా బద్ధంగానూ వుంది. అంత్యప్రాస అదిరింది.
మరి నా కవిత సంగతి?


ఆ చాపల్యమే వద్దన్నది. ఇది సాహితీ విమర్శ జ్ఞానం ప్రధానం కవిత కాదు. నాపరిజ్ఞానం ముఖ్యం. నీ కవిత గురించి నెక్స్ట్ ఇయర్ మాట్లాడొచ్చు. పో


పోతున్నాను

రాత, గీత మోహన్

# ఏమి మారె ఏమి మారెరా

పాట
గోరేటి వెంకన్న

ఏమి మారె ఏమి మారెరా
ఈ పేద బ్రతుకులు ఎందుకింత హీనం గున్నయిర...
అంగారకగ్రహం మీదికి అడుగు పెడ్తుండంట మనిషి
చంద్రమండల మీదొక్కడు విందుదు హోటలు కడ్తుండంట
ఇంటర్నెట్‌లో ప్రపంచమే ఇంటిలో కన్పిస్తదంట
పెంట దెబ్బల అంచున పెరిసిని పెలివాడ పేదల కంటి నిండ కొక మున్నదిరా ||ఏమి||

తిండి పుష్టి లేక పెదవులు ఎండి పగిలి తెల్లగున్నాయి
నూనె రాయని నై వెంట్రుకలు నార పోసుల తీరుగున్నవి
పక్కటెముకలు తేలి రెండు బొక్కలొక్క తానికొచ్చి
నంజరోగ మొచ్చిన తీరుగ ఈనాటికి గూడ నవుసకుంట గోస దీస్తరురో- ||ఏమి||

ముప్పై ఏండ్ల నిండనే లేదు ముఖం మీద ముడతయున్నవి
నలుబై ఏండ్ల నిండనే లేదు నొసటి మీద గీతయున్నవి
అదృష్ట రేఖలంటరా బుద్ధి జీవులార వీళ్ళ కాకలికొచ్చిన గీతలురో- ||ఏమి||

సిన్న అర్రల్లవాళ్లు గొర్రెలోలె ముడుసుకు పంతరా
తల్లీ పాత సీరయ దీసుక కాళ్ళనిండ కప్పుకుంటరా
మాట గట్టిన పాత బట్టలే ఈ పేదవాళ్ళ నెత్తికింద మెత్తలయితవిరో ||ఏమి||

మన్నుపుయ్యని మట్టి మిద్దెల సన్న సీమల పుట్టయున్నవి
సున్న మాడిన గోడలకు బల్లి గుడ్లే తెల్లగున్నవి
పాతె పురుగుల్లిన పరదాలే ఈ పేదవాళ్ళకు దేవుడిచ్చిన దోమ తెరలాయె ||ఏమి||

మన్నుపుయ్యని మట్టి మిద్దెల సన్న సీమల పుట్టయున్నవి
సున్న మూడిన గోడలకు బల్లి గుడ్లే తెల్లగున్నవి
పాతెపురుగు ల్లిన పరదాలే ఈ పేదవాళ్ళకు దేవుడిచ్చిన దోమ తెరలాయె ||ఏమి||

పాడిబర్లు పెంచినకె భీడుపాలుమ వాళ్ళకుండదూ
ఉన్నొక్క గుడ్డంల జొన్నలో సజ్జలేసుకుంటరూ
పాలుమీటి మనసు గుతితే పసిపిల్లలా పేడి గంజినీళ్ళు తాపుతరో ||ఏమి||
వారమంత కూలి కష్టం నూరు నూటయాభై మించవు
నెల మొత్తం కలిపి నేటికి పావు కిలో నూనె తింటరూ
ఎండు మిర్చి, కొర్ది చేపలు ఎప్పుడు కొన్ని అవి మేసరుకుల
ఒక్క సీసా 'మందు కల్లుతో ఈ పేద వాళ్ళ దుఃఖమంత తీరిపోతదిరో ||ఏమి||

అమెరికా వీసా లేకపాయెనే అవస్థయే వాళ్ళకు లేదు
పాలీష్ బండలు పరువలేదని పాన్పు ఖుభ్రత బెంగలేదు
పెచ్చులూడిన రేకు పలకన అక్షరాలు దిద్దితే పడక
పెన్సిల్ ముక్క భలపం కోసం పేజీ పడుతరు తల్లితో రోజు
కంప్యూటర్ సదువుల కాలంలో ఈ పేదల కర్ర రేకు పలకలు పడుతారురో ||ఏమి||

మొరం బావి ధరుల పొంటి దోండ్రకప్పలు పాకినట్టు
బొక్కలుల్ల నీరు కట్టెలు నికినిక్కి సూసినాట్టు
మొరంవేలిన వాకిండ్లల్లా ఈ పేదల పిల్లల సరములో లేక కదులుత రెందుకురో! ||ఏమి||

పల్లెములు మెతుకులుంటే ఎల్.ఐ.సి. వీళ్ళ కవసరముండదు
జాతీయ బ్యాంకుల్ల ఖాతాలేవి వీళ్ళకుండవా
ప్రాణ మెళ్ళిపోతావుంటెర పసి పిల్లలకు పాత
అప్పుల మర్మం సెప్పుతరో- ||ఏమి||



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA101M259** |
| పుస్తకం పేరు | ప్రస్థానం సాహిత్య ప్రత్యేక సంచిక |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 193 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | BC |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | saranya |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |